లంగ. వై. వి.=లంఘన. 1: చూ, లంఘ; 2.=లంక: చూ, లంక. 8.

లంగగొను. ద్వ. స. క్రి: చూ, లంఘించు.

లంగము. సం. వి. అ. పుం. సంగము: చూ, సంయోగము.

లంగరు. వై. వి.=లాంగలమ్. జేను, ఓడనిలుపు ఇనుపసాధనము: చూ, లాంగలము. 8.

లంగరుకా(ఖా)నా. వా.వి. పనిచేయలేని బీదల అన్నసత్త్రము: చూ, సదనము. 1.

లంగా. వా. వి. అంగవట్టము: చూ, వస్త్రము.

లంగుడు. సం. వి. అ. పుం: చూ, విటుడు

లంగోటి. వా. వి: బలమునిచ్చెడియొక కౌపీనము. తద్వి.—౧: అల్లకము, కచ్చె, కచ్చెడము, గోచి, గోణము-గోణాము-గోవణము, తడుపు, పొట్టము-బొట్ట ము.(సం. ప.)—కక్ష-కచ్ఛటిక-కచ్ఛాటిక, కచ్ఛ-కచ్ఛము, కోణము, కౌపీనము, ఖండకము, చీరము, ఛటి; 2: పుట్టుగోచి, పెద్ద గోచి, పోటుముంజి; 3: ఓరగచ్చె, ప్రక్క గోచి, వారగోచి. ("చూ, వారగోచి")

లంఘ. సం. వి. ఆ. స్త్రీ.=లంఘ: అవతరణము, ఉత్తరణము, చంక్రమణము, తరణము, తరణి, తరము, నిస్తరణము, నిస్తారము, ప్లవము, లంఘనము. (అవ్య).—అతి. (తె).—ఉంకింపు, కుప్పింపు, గంతు, చేవుకళింత-వాకళింత, చెంగనలు-చెంగనాలు, జెంగ, దాటు, దుముకు, పరిసెనము, పింపిళ్లు, లంగ, లగువు, లాగు. తద్వి.—(తె).—ఇట్టలు; దాటులు; పేరెములు. తన్వి.—౧ (తె)—చేవుపుటము-చౌపుటము; 2. విణ. దాటబడినది.—అవతీర్ణము, ఉత్తీర్ణము, తీర్ణము; 3. విణ. దాటదగినది.—ఉత్క్రమ్యము.

లంఘనము. సం. వి. అ. న. 1.=దాటు: చూ, లంఘ; 2: ఎగుడుదిగుడు, దూకుడు, లాకు. (చూ, అపంగతము. 2.); 3. గుఱ్ఱపు దూకుడు: చూ, హయము; 4.=లంకణము. రోగమందుపవాసము: చూ, లంకణము

లంఘించు. సం. అ. క్రి. 1. ఉత్పతనముగు, ఉద్ఘమించు, నిస్తరించు. (తె. ప)—ఉంకు, ఉఱుకు, ఎగయు-ఎఱయు-ఎగయు-నెవయు, ఎగసిపడు, ఎగసిల్లు, ఎగుడు, ఎగురులాడు, కుప్పిగంతుకొను, క్రొళ్లుదాటు, క్రొళ్లుఱుకు, క్రొళ్లువాఱు, గంతుకొను, గోరించు, జెంగగొను, జీగు-జీరుగు, తుప్రిళ్లగించు, తుప్రిళ్లిపారు, తుప్రిళ్లు, దాటు, దాటుకొను, దుముకు, దుముకులాడు, దూకు, దూటుకొను, పల్లటీల్గొను, పల్లటీల్దాటు, పల్లటీలేర్చు, పుటమెగయు, మిట్టించు, మిట్టిపడు, మిట్టు, మిడియు, మిడిసిపడు, మిడుకు, మిడుకుమాలు, లంగగొను, లాగించు. తద్వి.—(తె). చేవుకళించు-వాకళించు. ("చూ, విలంఘించు"); స. క్రి. 2. దాటు (చూ, లంఘించు. 1.); తరించు, ఉత్తరించు. (తె. ప)—ఈదు, ఒడ్డు, కడచేను, కడచు, కడనెళ్లు, జెంగగొను, తఱియు, దాటు. (ఇట్లు పరిలంఘించు, పరివిలంఘించు, విలంఘించు) ("చూ, విలంఘించు.")

లంచము. సం. వి. అ. పుం.=లంచము: కార్యార్థమిచ్చుసొమ్ము: చూ, లంచము.

లంచగొండి. ద్వ. వి. (లంచము + గొండి) లంచము తీయువాడు: చూ, సుంకరి.

లంచము. వై. వి.=లంచః: చూ, సూడిద.

లంజ. సం. వి. ఆ. స్త్రీ.=లంజియ-లంజె-లంజెత. 1: చూ, వేశ్య; 2: చూ, జారులాడి.

లంజి. వై. వి.=లంజికా.—పై.—

లంజిక. సం. వి. ఆ. స్త్రీ.=లంజి.—పై.—

లంజియ. వై. వి.=లంజికా—పై.—(వేశ్య

ష.—ఉ, హరి. 1, ఆ. 72.)

లంజె. వై. వి.=లంజికా, —పై.— (రూ-లంజియ.)

లంజెకాఁడు. ద్వ. వి: చూ, విటుఁడు.

లంజెకొడుకు. వా. వి. పలువిత్తు: చూ, సూనుఁడు. 1.

లంజెత. ద్వ. వి: చూ, లంజ. (వై. అని కొందఱు) (స్వార్థమున తప్రత్యయము.)

లంజె బేడిస. ద్వ. వి. ఒక చేఁప: చూ, మత్స్యము. 1.

లంజెఱికము. ద్వ. వి. వేశ్యాసంభోగము: చూ, సంయోగము.

లంజెసవరము. వై. వి. గొంతెమగోరు*: చూ, సారణ.

లంటఁడు. వా. వి. గుండువలెనుండువాఁడు.

లండి. దే. విశే. (రూ-లండీ-లండు-లండుఁబోతు) 1. కుత్సితుఁడు: చూ, వ్యాఘుఁడు. 2: 2. కుత్సితురాలు, చెడుగు: చూ, స్త్రీ.

లండీ. దే. విశే.—పై.—

లండు. దే. విశే.—పై.—

లండుఁబోతు. దే. విశే. —పై.—(స్వార్థమున పోతు)

లంద. దే. విశే: తొంద-తొందు, దొడ్డు, పెద్దకడుపువాఁడు, పొట్టవాఁడు, పొసఁగ, బొంద, బొజ్జవాఁడు, బొఱ్ఱవాఁడు, బొనుక, వ్రేఁకటివాఁడు. (సం. వ).—ఉరూదరుఁడు, తుంది, తుందిభుఁడు, తుండిలుఁడు, తుందికుఁడు, పిచండిలుఁడు, బృహత్కుక్షి. ("చూ, వ్రేఁకటివాఁడు.")

లంపట. దే. వి. రూ-లంపటము. 1. అలసట: చూ, శ్రమము. 1; 2. ఆపద: చూ, విపత్తు; వా. 3. కలియఁబడుట, కొట్టుకొనుటకు సిద్ధపడుట.

లంపటము. దే. వి. —పై.—

లంపటపడు. ద్వ. అ. క్రి: చూ, వేసరు. 2.

లంపటుఁడు. సం. విశే. అత్యాసక్తుఁడు: చూ, లుబ్ధుఁడు. 2.

లంపతా. వై. వి.=లంపట. (దేశ్యమని శ. ర) దాసీపుత్రుఁడు: చూ, సూనుఁడు. 1.

లంపతావాఁడు. ద్వ. వి. —పై.—

లంపాకము. సం. వి. అ. పుం. .చూ, దేశములు. ౨3.

లంపు. దే. వి. 1: చూ, సమూహము; 2. దొంగమేఁత: చూ, సాదము. (1).

లంపులమారి. దే. విశే. దొంగమేఁత మేయునది.

లంబ. సం. వి. ఆ. స్త్రీ. చూ, పార్వతి.

లంబకర్ణము. సం. వి. అ. న. మేఁకపోతు: చూ, మేషము. 1.

లంబనము. సం. వి. అ. న. 1: చూ, వ్రేలుడు; 2.=లంబెస, లలంతిక, రూ-లంబమానము, మెడను వ్రేలెడు హారము: చూ, భూషణము. 2.

లంబమానము. సం. వి. అ. న. 1: చూ, లంబనము. 2; విశే. 2. వ్రేలాడునది: అవలగ్నము, లంబము.

లంబము. సం. వి. అ.పుం.1:చూ, లంబనము. 1. విశే. 2. వ్రేలాడునది: లంబమానము. 2.

లంబాడి. వా. వి. ఒకానొక జాతి.

లంబాడీతండా. దే వి: చేసువ, బిడారు.

లంబి. దే. వి. రూ-లంబీ-లెంబి, కుటుంబము: చూ, సంసారము. 1.

లంబిడి. వా. వి. రూ-లంబి: చూ, రూ-లమిడి.

లంబిక. సం. వి. ఆ. స్త్రీ. కొండనాలుక: చూ, రసన. 1.

లంబితము. సం. విశే: చూ, వ్రేలుడు.

లంబీ. దే. వి: చూ, రూ-లంబి.

లంబు. వై. వి. 1.=లంబ. స్థౌల్యము: చూ, స్థూలము. 2; 2. గొప్పతనము: చూ, సన్మానము.

లంబుషము. సం. వి. అ. పుం. ఏడుపేటల ముత్యాలహారము: చూ, హాపణిక. 2. (భూషణము. 2.)

లంబెస. దే. వి. గొంతుకయందు వ్రేలుచున్న హారము. రూ-లాంబ్బెస: చూ, భూషణము 2-౫౬. [యుకుఁడు. 1.

లంబోదరుఁడు. సం. వి. అ. పుం: చూ, వినా

లంబ్డి. వా. విశే. :చూ, రూ-లంబడి.

లంఘనము. సం. వి. అ న. 1. తిట్టుట: చూ, శాపము. 1; 2. దూషించుట: చూ, సెగ్గింపు.

లంఘించు. సం. స. క్రి. 1. తిట్టు: చూ, శపించు; 2. దూషించు: చూ, సెగ్గించు.

లంపాలబ్రాహ్మణులు. అం: చూ, నేపాళదేశపు బ్రాహ్మణులు. [పుత్త్రాకులు.

లకలుకలు. వా. వి: చిక్కులు, మారాముళ్లు,

లకుచము. సం. వి. అ. పుం: చూ, రూ-లికుచము.

లకుముకి. దే. వి. 1: (సం).—అండుకము, ఉత్క్రోశము, ఉత్పాదశయనము, కటుక్వణము-కటుక్వాణము, కురరము-కురలము, ఖరశబ్దము, టిట్టిభము. తద్వి.—ఆఁడులకుముకికి.—(సం) కురరి. ("చూ, శకుంతి."); అం. 2: చూ, కూజితములు (లేక) పలుకులు.

లకోటా. వా.వి.1. ఉత్తరమునుఉంచు కాకితపు సంచి; 2. ఉత్తరమును అతికించుట.

లకోరి. దే. వి. 1. క్రూరబాణము: చూ, హేతి. 4 (బాణము. 1.); 2. శరము: చూ, బాణము. 1. [పావురము: చూ, సురఁటీ.

లకోకి. దే. వి. 1: చూ, రూ-లకోరి. 1; 2.

లక్క. వై. వి.= లాక్షా: (సం. వ):— అనంగమాత, అలక్తకము- అలక్తము, కర్బురసుహృత్తు, కలమము, కార్పటము, కీటజ, కుసుంభము, కృమి, కృమిజ, క్రమిజ, క్రిమి, క్రిమిజ, క్షతఘ్నము, క్షతఘ్ని, ఖదిరిక, గంధమాదని, గరాధిక, గవాషిక, గుడద్రవము, జతుకము-జతూకము, జతువు, ద్రిప్యము, ద్రుమామయము, నిర్భర్త్సనము, యావము, రక్ష - రాక్ష - లాక్ష, రజని, పరపక్షిణి. తద్వి.—లాక్షారసమునకు:—లత్తుక. (సం).- క్షతఘ్నము. (తేనెతోకలిపి యిచ్చిన రక్తవాంతి తగ్గును.) (లక్కపూసిన కొయ్యసామానులు (లక్కబొమ్మలు) లెక్కలేనన్ని కలవు.) [గోగము. 1.

లక్క తెవులు. ద్వ. వి. ఒకానొక చీడ: చూ,

లక్కనము. వై. వి.=లక్షణ. 1. చిహ్నము: చూ, లక్షణము. 1; 2.=లక్షణమ్, వ్యాకరణాదిశాస్త్రము: చూ, శాస్త్రములు.

లక్కపిడత. వా.వి. లక్కపూసిన కొయ్యపిడత.

లక్కపెట్టియ. వై. వి.=లాక్షాపేటీ. రూ-లక్కపెట్టె: చూ, సందుకా.

లక్కపెట్టె. వై. వి.= —పై.— [బొ్రిలు.

లక్కపొడి. ద్వ. వి. లక్కబియ్యము: చూ, సేసఁ

లక్కబియ్యము. ద్వ. వి. —పై.—

లక్కబొమ్మ. వా. వి. బ: చూ, లక్కసామాను.

లక్కమనుఁడు. వై. వి.=లక్ష్మణ. (రూ-లక్కుమనుఁడు- లక్కుముఁడు, లచ్చనుఁడు- లచ్చుముఁడు) లక్ష్మణుఁడు, రామానుజుఁడు: చూ, సౌమిత్రి.

లక్కసామాను. వా. వి: లక్కబొమ్మ.

లక్కాకు. ద్వ. వి. లక్కపూసిన చెవినగ: చూ, భూషణము. 2_౩౧.

లక్కి. వా. వి. పేచి:లిక్కి."లక్కియనినలిక్కిలిక్కియనిన లక్కియని పెట్టుచేస్న పేచీలకంతులేదు." (అవునని కాదనియు కాదని అవుననియు.)

లక్కిమి. వై. వి.=లక్ష్మీ: చూ, లక్ష్మి. 1.

లక్కుమనుఁడు. వై. వి.= లక్ష్మణ: చూ, రూ-లక్కమనుఁడు.

లక్కుముఁడు. వై. వి.=—పై.—

లక్ష. సం. వి. ఆ. స్త్రీ, అ. పుం. నూఱువేలు, నియుతము:చూ, సంఖ్య. 1. [పెడి యర్థము.

లక్షకము. సం. వి. అ. పుం. లక్ష్యార్థమును తెలి

లక్షణ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఒక శబ్దవృత్తి:

చూ, అభిధ. (చూ, వృత్తి); 2. హూ-లక్షణ, ఆఁడుబెగ్గురు: చూ, సారసము. 2.

**లక్షణజ్ఞుఁడు.** సం. విణ: లాక్షణికుఁడు.

**లక్షణము.** సం. వి. అ. న.=లక్కణము-లచ్చెనము. 1. (పదార్థము దీనిచేతఁజూడఁబడును.): అంకము, అనీకస్థము, అభిజ్ఞానము, ఆకారము, ఈతి, కలంకము-కళంకము, కలనము, కాయము, కేతనము, కేతువు, గండకము, గండము, చిహ్నము, ధ్వజము, నిమిత్తము, పదము, పాళి, ప్రజ్ఞానము, లక్ష్మణము, లక్ష్మము, లలామము, లాంఛనము, లింగము. వ్యంజనము, శృంగము (అన్య.).—అను, అభి. (తె. ప.):—అంకనము, అంగమచ్చెము, అడియాలము-అడియాళము, అపదేశము, ఆవి, ఆనవాలు-ఆనాలు, ఇంపవ, ఎఱుక, ఐమచ్చె, కతము, కలంక-కలంకు-కళంకు, గురుతు-గుర్తు-గుఱుతు-గుఱి, చేలివాలు, చిన్న, చిన్నియ-చిన్నె, డాగు, నెరసు, పులుగు, పొక్కు, మచ్చె-మచ్చెము-మచ్చెము, మేపచ్చెన, లక్కణము-లచ్చెనము. తద్విశేషములు.- (ప్రతి విశేషము తుదను లక్షణము అను అక్షరములు చేర్చి చేదువవలయును):— ౧. అత్తమామలఁజంపుదానికి.- ఉదరావర్తము, ఉదానము; ౨. అదృష్టస్త్రీకి.- అశ్వత్థ పత్రాభభగము; ౩. అదృష్టశాలికి.- ఉన్నత బాహుమూలము; ౪. అపుత్ర విధవా.-ఖరపుంస్వరము; ౫. అవమాన.-(తె). బొమ్మ; ౬. అష్టపుత్రవతీ.— కలకంఠీ వీణా హంసస్వరము; ౭. ఉత్తమనారీ.-అల్పభోజనము; కపోలావర్తము; కుటిలకేశము; చుబుకావర్తము; ౮. ఉత్తమ స్త్రీపురుష.— అల్పనిద్ర; ౯. గండసంజ్ఞ.— అంగుష్ఠ తర్జనీ రేఖ; ౧౦. గర్భిణీస్త్రీ.-కందూరేఖలు. (తె).—చిట్టుములు; ౧౧. గోడ్రి.— ఊష్ట్రజిహ్వా, చుబుకమచ్చము; ౧౨. చంచలకళంక.— (తె) మచ్చె-మచ్చెము: ౧౩. చేవు.— అశుభము, అరిష్టము. (తె) —కీడు, కీడుపాటు-కీడ్పాటు, చేవ్రగుఱుతు;౧౪. జారిణీ.—కటివామావర్తము; ౧౫. దారిద్ర్యవతీ.—కృష్ణతాలువు; చక్రవక్త్రము; జంఘావర్తము; ౧౬. దాసీ.—ఊర్ధ్వనఖము, ఊర్ధ్వనాసిక; ౧౭ దాస్య.-కృష్ణరేఖ; ౧౮ దీర్ఘశరీరముబలముగలవాని.-ఆజానుబాహువు.౧౯ దీర్ఘాయువుగలవాని -అవిచ్ఛిన్నరేఖ; ఆయురేఖ; ఆయుర్లక్షణము; ౨౦. ధార్మిక.—కర్ణమచ్చము; ౨౧. నపుంసక.— కంఠమచ్చము; ౨౨. నాశ —అతికృష్ణమచ్చము; అపలక్షణము; ఓష్ఠమచ్చము; ఘుటోదరము; జంఘామచ్చము; (తె).—కొఱగామి; ౨౩. పతిహంత్రి — భ్రామధ్యరోమాణి; ౨౪. పశుసంఖ్యా.—అంగుష్ఠపార్శ్వరేఖ; ౨౫. పాతివ్రత్య.— కటిపరిదక్షిణావర్తము; ౨౬. పాదచిహ్నము.—పదము. (తె).—జోడ; ౨౭ పుట్టుమచ్చె.—కాలకము, తిలకము, తిలకాలకము, జటులము-జడులము,పిప్పవు. (తె).—పుట్టుమచ్చె, మచ్చె- మఱువు. తద్వి.—విష్ణువుయొక్క ఱొమ్మునందలి మచ్చెకు.—శ్రీవత్సము,లాంఛనము; ౨౮. పుత్రనాశ.—ఊరోమచ్చము; భ్రూమచ్చము, ౨౯.బిడ్డలుగలుగనిపడఁతి.-చిత్రపాదము; ౩౦. బిరుదు:—(తె)బొమ్మ; ౩౧. భయ.—ధ; ౩౨. భర్తృహంత్రి (ఎనిమిది మనువులుపోవు మనువ).— ఘూకమార్జాలలోచనము; ౩౩. భాగ్యవతీ.—కోమలపాణితలే (ద్వి.); ౩౪. భాగ్యసూచకదేహ.-సాముద్రికము;౩౫.భ్రాతృసంఖ్యా.-అంగుష్ఠాదిరేఖ; ౩౬. మహాపురుష.—ఊర్ణ; ౩౭. యతిసంప్రదాయజ్ఞానార్థ.- ఆనందము; గిరి; ౩౮. యతిసంప్రదాయ భేదజ్ఞానార్థ.-

అరణ్యము; ఆశ్రమము: ౩౯. రాజచిహ్న.—కకుత్తు-కకుదము; ౪౦. రాజపత్ని.—అష్టమీచంద్రనిటలము; గజహంసగతి; చక్రరేఖ; రక్తపాదతలము; ౪౧. రాజమాతృ.—అంకుశరేఖలు; ౪౨. రాజుభార్యయయ్యెడుమగువ.—త్రిరేఖాన్వితగ్రీవ; ౪౩. రాజ్య — అకర్మకఠినకరము; ౪౪. విద్యా.—అనామికాదిరేఖ; ౪౫. విధవా.—అతిదీర్ఘాతిహ్రస్వాంగము; అతి స్థూలమహాకృశాంగము; ఊర్ధ్వకేశము; ఓష్ఠరోమాణి; జంఘపరికృష్టరోమాణి; ౪౬. వృద్ధిప్రద.— కటిమచ్ఛము; ౪౭. శుభ.—కక్షమచ్ఛము; ౪౮. సంతానవృద్ధి స్త్రీ.— అంసదక్షిణావర్తము; ౪౯. సంపత్తు దీర్ఘాయుస్సు గలవాని.—ఆజానుబాహువు; ౫౦. సామాన్య.—(తె) కొండగుబుతు; ౫౧. స్త్రీపూజ్య.—గంభీరనాభి; ౫౨. స్త్రీ సౌభాగ్యలక్షణము.—ఉన్నతబాహుమూలము; కంఠావర్తము; కపిలమచ్ఛము; కర్ణమూలావర్తము; ౫౩. ముండమోయుగుబుతుకు:-పరోక్షమాణి. ఇత్యాది వివరంబు లపారంబుగ గలవు. ("చూ, సాముద్రికము. 1."); 2. గురి:చూ, లక్ష్యము. 1; 3. చూపు: చూ, సూచన. 4; 4. వ్యాకరణాది శాస్త్రము: చూ, శాస్త్రములు; 5. పేరు: చూ, సంకేతము. 1; పుం. 6. బెగ్గురు: చూ, సారసము. 2; అం. 7. పురాణమునకుఁగల పంచలక్షములు:చూ, పురాణము. 6.

లక్షణములకుఁ గలిగెడు త్రిదోషములు. అం: అతివ్యాప్తి, అవ్యాప్తి, అసంభవము (3): చూ, త్రిదోషములు.

లక్షణామూలాధ్వని. అం: అవివక్షితవాచ్యము, అర్థాంతరసంక్రమితవాచ్యము. (2).

లక్షణాంగములు. అం. (ఇవి పురుషలక్షణాంగములు ౫౮:—౧ పాదతలరేఖలు, ౨ పాదతలములు, ౩ పాదనఖములు, ౪ పాదాంగుళ్యములు, ౫ ప్రపదములు, ౬ పార్ష్ణులు, ౭ గుల్ఫములు, ౮ గతి, ౯ జంఘలు, ౧౦ దేహరోమము (రోమము), ౧౧ జానువులు, ౧౨ ఊరులు, ౧౩ అండములు, ౧౪ లింగము, ౧౫ మూత్రము, ౧౬ శుక్లము, ౧౭ శోణితము, ౧౮ కటి, ౧౯ నాభి, ౨౦ కుక్షి, ౨౧ మధ్యము, ౨౨ వళులు, ౨౩ స్తనములు, ౨౪ చూచుకములు, ౨౫ వక్షము, ౨౬ జత్రులు, ౨౭ స్కంధములు, ౨౮ భుజములు, ౨౯ కక్షములు, ౩౦ మణిబంధములు, ౩౧ హస్తపృష్ఠములు, ౩౨ హస్తతలములు, ౩౩ హస్తాంగుళములు, ౩౪ హస్తనఖములు, ౩౫ హస్తరేఖలు, ౩౬ పృష్ఠము, ౩౭ కంఠము, ౩౮ ముఖము, ౩౯ చిబుకము, ౪౦ అధరోష్ఠము, ౪౧ దంతములు, ౪౨ తాలువులు, ౪౩ జిహ్వ, ౪౪ స్వరము, ౪౫ హసితము, ౪౬ ఉత్తరోష్ఠము, ౪౭ శ్మశ్రువులు, ౪౮ నాసికము, ౪౯ శ్వాస, ౫౦ కపోలములు, ౫౧ నేత్రములు, ౫౨ తారలు, ౫౩ భ్రువులు, ౫౪ కర్ణములు, ౫౫ లలాటము, ౫౬ శిరము, ౫౭ శిరోరుహములు, ౫౮ దేహము (శరీరము): చూ, లక్షణము. 1; సాముద్రికము. 1. (పూర్వము నారద, ప్రహ్లాద, సముద్ర, కాత్యాయన, వరాహమిహిర, వరరుచి, మున్నగువారిచేఁ జేయఁబడిన గ్రంథములను, బ్రహ్మాండపురాణ, బ్రహ్మపురాణ, స్కాంధపురాణాదులయందుఁ గొన్నిచోట్ల నీవిషయములును జెప్పఁబడియున్నవి. ఈశాస్త్రమందు స్త్రీపురుషులకుఁ గలుగు సుఖదుఃఖాద్యనుభవములఁ దెలియఁదగు చిహ్నములుఁ దెలుపఁబడియె. పురుషునకు దక్షిణభాగ, స్త్రీకి వామభాగ లక్షణములు ప్రశస్తములు.): చూ, స్త్రీ లక్షణాంగములు.

లక్షణాతీతంబులు. పా. నామబిరుదంబులు లక్షణా తీతంబులు. [చూ, రూ-లక్ష్మణుఁడు.

లక్షణుఁడు. సం. వి. అ. పుం.=లచ్చేనుఁడు:

లక్షము. సం. వి. అ. న. 1. గుఱి: చూ, రూ-లక్ష్యము. 1; 2. నెపము: చూ, వ్యాజము. 1.

లక్షవర్తివర్తిత్తము. సం. వి. అ. పుం. వ్రతముల యందుత్తమవ్రతము: చూ, వ్రతము. 1.

లక్షాక్షవిషమము. అం: చూ, శస్త్రములు.

లక్షించు. సం. స. క్రి 1. గుఱిచేయు: చూ, లెక్కసేయు; 2. చూచు: చూ, వీక్షించు. (అలక్షించు అనియు.)

లక్ష్మణ. సం. వి. ఆ స్త్రీ: చూ, రూ-లక్షణ. 2.

లక్ష్మణము. సం. వి. అ. న. 1: చూ, రూ-లక్షణము. 1; 2: చూ, రూ-లక్షణము. 5.

లక్ష్మణుఁడు. సం. వి. అ. పుం 1.=లక్కుమనుఁడు-లచ్చేనుఁడు, రామునితమ్ముఁడు: చూ, సౌమిత్రి; విశే. 2. శ్రీమంతుఁడు: చూ, సంపన్నుఁడు.

లక్ష్మము. సం. వి. న్. న. 1. చిహ్నము: చూ, లక్షణము. 1; 2. ముఖ్యము: చూ, శ్రేష్ఠము.

లక్ష్మి. సం. వి. ఈ. స్త్రీ. 1.=లక్కుమి-లచ్చి. (ఈమెచేత సర్వము చూడఁబడును.): అబ్జ, అబ్ధిజ, అరవిందాలయ, ఇందిర, ఇందిర, ఈ, కభార్య, కమ, కమల, కలశాబ్ధిజ, క్షీరాబ్ధిజ, క్షీరాబ్ధితనయ, క్షీరసాగరకన్యక, క్షీరసాగరసుత, చంచల, చపల, చల, జలజ, జలధిజ, నారాయణి, పద్మ, పద్మాలయ, పద్మిని, భార్గవి, మంగళదేవత, మహాలక్ష్మి, మా, మాత, మాధవి, రమ, లోకజనని, లోకమాత, లోల, విష్వక్సేన ప్రియ, వృషాకపాయి, శ్రీ, శ్రీదేవి, హరిప్రియ, హీర. (తె. ప).-కడలి కూఁతురు, కలిమిచెలి-కలుముల చెలి, కలువలచేదని జేదని, తోఁడు, జగముతల్లి, జిడ్డుకడలిబిడ్డ, తమ్మి బిడారంపు గరితమిన్న, తమ్మియింటిగరిత, తల్లితల్లి, తాతతల్లి, నెలచెలియలు, పంటవలంతి తోఁడికోడలు, పయిఁడినెలఁత-పైఁడి నెలఁత, పల్కులచెలియత్త, పాలమున్నీటి కూఁతురు, మగని పేరెవమన్నచగలాఁడి, మున్నీటిమేలి, లక్కుమి-లచ్చి, లిబ్బపడఁతి, వలరాజుతల్లి, వెన్నునెవకొమ్మ, సత్తినెచ్చెలి, సిరి. తద్వి శేషములు.—విష్ణుభార్య లలో నొకతె:—సీత. ("చూ,హీః. 2."): 2. సంపద: చూ, సంపత్తి. 1; 3. శస్త్రభూషణాదుల శోభ, భాగ్యము: చూ, సంపత్తి. 1; 4. మెట్టదామర *: చూ, సహస్రపత్రము; 5. బుద్ధియను గంధద్రవ్యము, వృద్ధి, సిద్ధి: చూ, రాజార్హము; 6. గొల్లజిడ్డు *: చూ, శాలిని; 7. పేంకణము *: చూ, సన్నకదుర్వు. [చూ,సహస్రపత్రము.

లక్ష్మీగృహము. సం. వి. అ. న. ఎఱ్ఱగలువ *:

లక్ష్మీనారాయణ. సం. వి. అ. పుం. 1. విష మంగలము*: చూ, సుఖదర్శనము; అం. 2: చూ, శైలములు; బ. 3. లక్ష్మీవిష్ణువులు; వి. అ. పుం. 4: చూ, విష్ణువు. 1.

లక్ష్మీనారాయణీయము. పా. ఇదియొక పద్యాంధ్ర పత్రిప్రదార్థ పర్యాయపద నిఘంటువు. (ఇది ఆంధ్రవాచస్పత్య కర్తకు జనకతండ్రి కీ.శే.బ్ర.కొట్ర లక్ష్మీనారాయణశాస్త్రిగారి విరచితము. దీనికి ఆంధ్రవాచస్పత్య కర్త లేఖకుఁడును, ముద్రాలయమున నక్షరసంధానోద్యోగియునై పూర్తిఁగావించెను.) [పతి.1.

లక్ష్మీనారాయణుఁడు. సం వి.అ.పుం: చూ, లక్ష్మీ

లక్ష్మీపతి. సం. వి. అ. పుం. 1. లచ్చిమగఁడు: చూ, విష్ణువు. 1; 2. ప్రభువు: చూ, స్వామి. 1.

లక్ష్మీవంతుఁడు. సం. విశే. (తా. ఈ. తా) 1. శ్రీమంతుఁడు: చూ, సంపన్నుఁడు; 2. ఒప్పిదము గలవాఁడు: చూ, సౌందర్యవంతుఁడు.

లక్ష్మీశము. అం: చూ, జన్యతాళములు.

లక్ష్మీశాంశము. అం: చూ, షష్ట్యంశములు.

లక్ష్యపెట్టు. మి. స. క్రి.: చూ, లెక్కసేయు.

లక్ష్యము. సం. వి. అ. న. 1.=లెక్క. (బాణముచేఁత గప్పఁబడునది.) రూ-లక్షము-లక్ష్మము-లక్షణము-లక్ష్మణము, గోవు, నికాయము, నిమిత్తము, శరవ్యము. (తె).—గణుతి, గుఱి, తిన్న, దెప్పము, నిగా (నిగహ్), లెక్క, లెప్ప-లెప్పము, సూటి. ("చూ, సూటి. 1."): పుం. 2. రూ-లక్షము. లక్షణచేఁ దెలియఁదగినయర్థము: చూ, వ్యాజము. 1.

లగడ. దే. వి. రూ-లగుడు. 1. చిమిడిక: చూ, సాదము (1); 2. డేగ: చూ, శ్యేనము. 1.

లగడపిండము. మి. వి: చూ, పిండిపోక.

లగడు. దే. వి: చూ, రూ-లగడ. 1-2.

లగనము. వై. వి.=లగ్న. రూ-లగ్గము, శుభముహూర్తము: చూ, లగ్నము. 1.

లగము. అం. లఘువు గురువు. "హరి" (ఇదే వగణము): చూ, ఉపగణములు.

లగాము. వా. వి. కళ్లెము: చూ, వాగె.

లగాయతు. వా. వి. మొదలు: చూ, లోను. 2.

లగాలగా. వా. వి. డోలులోనగునవి వడిగావాయించుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ. [వ్రేయు. 1.

లగాయించే. వా. స. క్రి. కొట్టు: చూ,

లగుడము. సం. వి. అ. పుం.=లాటీ-లోడీ-లవుడి-లౌడి, దుడ్డుకఱ్ఱ: చూ, వేత్రము. 1.

లగుడు. దే. వి: చూ, రూ-లగడ.1-2.

లగువు. వై. వి. 1.=లఘు. గంతు: చూ, లంఘు; 2.=లాఘవ: చేలుకవ: లాఘవము. 1; 3. తేలిక: చూ, సులభము; విశ. 4. చేలుక: చూ, సులభము. [కుట: సురతాణిలగ్గ.

లగ్గ. వై. వి.=లంఘ. (ముట్టడించి) కోటను బ్రాఁ

లగ్గడింపు. ద్వ. వి. కోటమీఁదనుండిశత్రులపయి దొర్లించెడు ఱాతిబండలోనగునది.

లగ్గపట్టు. ద్వ. స. క్రి. (ముట్టడివేసి) కోటనెక్కు.

లగ్గము. వై. వి.=లగ్న, రూ-లగనము: చూ, లగ్నము. 1.

లగ్గు. దే. వి. 1. మేలు: చూ, శుభము. 1; 2. అపరక్రియ, ఉత్తరక్రియ, అంత్యకర్మము.

లగ్నకారకత్వములు. అం: జన్మ(తను), ద్వితీయ (ధనము), తృతీయ (భ్రాతృ), చతుర్థ (వాహనము), పంచమ(సంతాన), షష్ఠ(శత్రు), సప్తమ (కళత్ర), అష్టమ (ఆయువు), నవమ (భాగ్య), దశమ (రాజ్య), ఏకాదశ(లాభ), ద్వాదశ (వ్యయ) స్థానములు. (12)

లగ్నకుఁడు. సం. వి. అ. పుం. 1. ఒకఁడు చేయవలసినపనిని నేను చేసెదనని పూనుకొనినవాఁడు: ఋణమక్కుణుఁడు, గోరంకువు, ప్రతిభువు. (తె. స.).-అడ్డము, జామీదారుఁడు, పూఁట, పూఁటకాఁపు, పూచీదారు, హామీదారు. ("చూ, హామీదారు"); 2. జూదములో జమానతు ఇచ్చువాని పేరు: త్ర్యణమత్కుణుఁడు.

లగ్ననిఘంటు. వా. వి: చూ, రాశి. 2.

లగ్నపత్రిక. వా. సం. వి. ఆ. స్త్రీ: శుభలేఖ.

లగ్నము. సం. వి. అ. న. 1.=లగనము-లగ్గము. రూ-వలగ్నము- అవలగ్నము, కేంద్రము, హోర, మేషాదిరాసులయొక్క యుదయము. (గ్రహములకు సంబంధించినది-దీనికే రాశి, హోరయనిఁగూడఁ బిలుతురు): చూ, రాశ్యుదయము; పుం. 2. మదపుటేనుఁగు: చూ, హస్తి; విశ. 3. తగులుకొన్నది: చూ, సహితము; 4. సిగ్గుఁ బొందినది: చూ, హ్రీణము; అం. 5: చూ, వర్గములు.

లగ్నసంధి. అం. ప్రతిలగ్నమందును, లగ్నాదియందరగడియయును, లగ్నాంతమందరగడియయు గలిసినకాలమునకులగ్నసంధియని పేరు.

## లగ్న సంబంధ విషయ వివరణముల పట్టిక.

| లగ్నములు | అధిపతులు | స్వభావములు | జాతులు | లింగములు | వర్ణములు | దిక్కులు | శీర్షోదయ పృష్ఠోదయ రాసులు | రూపములు | పరిమాణములు | జలభేదములు | బలాబలములు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మే | కు | చర | క్ష | పు | ఎఱు | తూ | పృ | మేక | 4-0=4-20 | పాదజల | రాత్రి |
| వృ | శు | స్థిర | శూ | స్త్రీ | తెలు | తూ | పృ | ఎద్దు | 4-30=4-56 | అర్ధజల | రా |
| మి | బు | ద్విస్వభావ | వై | పు | నలు | తూ | శీ | స్త్రీ-పు | 5-15=5-26 | నిర్జల | రా |
| కర్కా | చం | చర | బ్రా | స్త్రీ | తెలు | ద | పృ | ఎండ్రి | 5-30=5-31 | పూర్ణ | రా |
| సిం | ర | స్థిర | క్ష | పు | ఎఱు | ద | శీ | సింహ | 5-20=5-20 | నిర్జల | పగలు |
| కన్య | బు | ద్విస్వ | శూ | స్త్రీ | నలు | ద | శీ | కన్యక | 5-15=5-15 | నిర్జల | ప |
| తు | శు | చర | వై | పు | తెలు | ప | శీ | త్రాసు | 5-15=5-24 | పాద | ప |
| వృశ్చి | కు | స్థిర | బ్రా | స్త్రీ | పసు | ప | శీ | తేలు | 5-30=5-33 | పాద | ప |
| ధ | గు | ద్విస్వ | క్ష | పు | ఎఱు | ప | పృ | విల్లు | 5-30=5-19 | అర్ధ | రా |
| మ | శ | చర | శూ | స్త్రీ | నలు | ఉ | పృ | మొసలి | 5-15=4-43 | పూర్ణ | రా |
| కుం | శ | స్థిర | వై | పు | పసు | ఉ | శీ | కడవ | 4-30=4-11 | అర్ధ | ప |
| మీ | గు | ద్విస్వ | బ్రా | స్త్రీ | పసు | ఉ | ఉభయో | మత్స్యద్వ | 4-0=4-2 | పూర్ణ | ప |

లగ్నారూఢము. అం.(దీనికే పదమని పేరు): చూ, ఆరూఢము.

లఘిమ. సం. వి. న్. పుం. రూ-లఘిమము. 1.లఘుత్వము: చూ, లాఘవము. 1; 2. ఒక విభూతి: చూ,సిద్ధులు.

లఘిమము. సం. వి. న్. పుం.—పై.—

లఘిష్ఠము. సం. విశ. 1. మిక్కిలి చులుకనైనది: చూ,లాఘవము. 1; 2. మిక్కిలితక్కువైనది: పరిక్షీణము.

లఘుకము. సం. వి. అ. పుం. తోఁటపోఁక*: చూ,క్రంసి. 1 (పోఁక. 3.) [మేషము. 1.

లఘుకాయము. సం. వి.అ.న. మేఁకపోతు: చూ,

లఘుకోణము. వా. వి. క్లుప్తకోణము: చూ,కోణము. 1(చూ,ఏంగిలు). [చూ, వేత్రము.1.

లఘుడము. సం. వి. అ.న.=లగుడము.ఇనుపదుడ్డు:

లఘుపంచమూలము. అం: చిన్నములక, పెద్దములక,కోలపొన్న,నేలపొన్న,పల్లేరు వేళ్లు (5).

లఘుబ్రాహ్మి. సం. వి.ఈ. స్త్రీ:జలోద్భవ*.

లఘుమేరునష్టము. అం: చూ, ప్రస్తారప్రత్యయ ప్రాణములు.

లఘుమేరువు. అం. —పై.—

లఘుమేరూద్దిష్టము. అం. —పై.—

లఘులయము. సం.వి.అ.న.1.వట్టివేరు*: చూ,సేవ్యము. 1; 2. నీరు వట్టివేరు*: చూ,సేవ్యము. 2.

లఘువల్లభి. సం.వి.ఆ.స్త్రీ. అతివిష*: చూ,విష.

లఘువు. సం. వి. ఉ.స్త్రీ.1. పిక్క,స్పృక్క*: చూ,రాజార్హము. 1-౩౭; న. 2.నల్లఅగలు: చూ,రాజార్హము. 1-౧౫; క్రి. విశ. 3. శీఘ్రము: చూ,స్యదము; విశ. 4. వడిగలది: చూ,స్యదము; 5.=లఘువు. చులుకనిది: చూ, లఘ్వీ. 2.; 6. చేవలేనిది; 7. ఒప్పిదమైనది: చూ, హృద్యము; అం. 8. చూ,తాళాంగములు; 9: చూ,మాత్ర. 1. (బాణాకృతిగలది సిరుఖ్ఖు- లఘువేమాత్ర.మాత్రయనవళ్ళ చిటి కాలము పలుకఁబడునది.); 10: చూ,కాలప్రాణములు; 11: చూ,అంగప్రాణము; బ. 12. పొట్టి అచ్చులు పూర్వాక్షరమును గురువుగాఁజేసిన ద్విత్వ సంయుక్తములును,పదాది సంయుక్తములును లఘువులు. "ఉదా:—అ, అన్న, శక్తి, ధ్వని." (చూ,గణము.); 13. అంతిస్థ (యరలవ)లు లఘువులు అలఘువులు అని ద్వివిధము. అందు:—(య) ౧. మాటల లోని యకారము అలఘువు. "ఉ.పాయము, సాయము."; ౨ సాధ్య (ఆగమ) యకారములఘువు. "ఉ.మాయూరు.";(ర)౩.సాధు రేఫములఘువు. "ఉ.వరి, చీర, నీరు,కోరు." మొ; ౪. శకటరేఫము (బండిరా)అలఘువు. "ఉ.కఱి, కాఱు." మొ;(ల)౫. ల కారము లఘువు. "ఉ.కాలు, ఆలము, లచ్చి." మొ; ౬. సాధ్య (ఆదేశ) లకారములఘువు. "ఉ. వీళ్లు, కోళ్లు, పాళ్లు." మొ; (వ) ౭. సాధ్య వకారము లఘువు. "ఉ. అకేఁడువల్క,నీరు వోసె." మొ; ౮. మాటలలోని వకారము లఘువు. "ఉ.పవ్వె, కవ." మొ. (చూ,అలఘువు, అంతస్థములు.)

లఘుశంక. వా. సం. వి. ఆ. స్త్రీ. 1. మూత్రము; 2. కొద్దిఅనుమానము.

లఘుశేఖరము. అం: చూ, జవ్యతాళములు.

లఘ్వీ. సం. వి. ఈ. స్త్రీ. 1. తేలికగాఁబోవు రథము, బండి: చూ, శకటము. 1; విశ. 2.చులుకనైనది: లఘిష్ఠము, లఘువు.(తె).-పలుచే,రేను: చూ, లాఘవము. 1; 3. కుఱుచే యైనది: చూ, హ్రస్వము. 1.

లఘ్వీ. అం: చూ, ధారలలో భేదములు.

లచ్చి. వై. వి=లక్ష్మి. 1: చూ, లక్ష్మి. 1; 2: చూ, సంపత్తి. 1; వా. 3. నిందార్థమందు లచ్చమ్మ-లక్ష్మమ్మయను పేర్లఁబరగువారిని లచ్చియనిఁ బిలుతురు. [(యూపము)

లచ్చించోరు. వా. వి: చూ, కడుగుచోరు.

లచ్చికమ్మి. వా. వి: అడ్డకమ్మి, దోరణపుఁగమ్మి, లచ్చిపట్టె, సిరికమ్మి. (సం).—ఉత్తరంగము, సక్రియు, నాన. (చూ, వాకిలి)

లచ్చికోడలు. ద్వ. వి: చూ, సరస్వతి.

లచ్చితండ్రి. ద్వ. వి: చూ, సముద్రము. [సంకు. 1.

లచ్చిదోర బూరఁగొమ్ము. ద్వ. వి శంఖము: చూ,

లచ్చినెచ్చెలి. ద్వ. వి: చూ, పార్వతి.

లచ్చిపట్టె. వా. వి: చూ, లచ్చికమ్మి.

లచ్చిమగఁడు. ద్వ. వి: చూ, విష్ణువు. 1.

లచ్చియన్న. ద్వ. వి. చేంద్రుఁడు. సాంబ. దే. 10: చూ, హిమాంశువు.

లచ్చితోఁబెడమకన్ను. ద్వ. వి.—పై.—అం, భా. పరి. 177. [వారము. 2

లచ్చివారము. మి. వి. గురువారము: చూ,

లచ్చిసవతి నై. వి: చూ, భూమి 1. అం, వ. 6-3.

లచ్చెనము. వై. వి.=లక్షణమ్. రూ—లక్కనము. : చూ, లక్షణము. 1; అం. 2. వ్యాకరణశాస్త్రము: చూ, శాస్త్రములు. [మనుఁడు.

లచ్చెనుఁడు. వై. వి.=లక్ష్మణ: చూ, రూ-లక్కు—

లచ్చ్మెముఁడు. వై. వి.=—పై.—

లజ్జ. సం. వి. ఆ. స్త్రీ.=లజ్జే. 1: చూ, సిగ్గు; అం. 2: చూ, సంచారిభావమునఁ బుట్టిన దృష్టులు.

లజ్జాత్యాగము. అం: చూ, ద్వాదశావస్థలు.

లజ్జాభాసము. సం. వి. అ. పుం: చూ, బెళగువ్వ.

లజ్జామోహము. అం: చూ, మోహచతుష్టయము.

లజ్జాశీలుఁడు. సం. విణ: చూ, సిగ్గరి.

లజ్జాలువు. సం. వి. ఉ. పుం. స్త్రీ. క్షుప. పొట్టికొమ్మ లూడలుగలచెట్టు, శిఫ: చూ, హ్రిస్వశాఖాశిఫము.

లజ్జించే. సం. అ. క్రి: చూ, సిగ్గుపడు.

లజ్జితము. సం. విణ. సిగ్గుపడినది: చూ, హ్రీతము.

లజ్జే. వై. వి.=లజ్జా: చూ, సిగ్గు.

లటక్కు—. దే. వి. రూ-లటుక్కు—. (మింగుటలో నగు వానియందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

లటపటము. వా. వి. (కొట్టుకొనుటకు) కలియఁబడడము: చూ, తొడపటము.

లటుక్కు—. దే. వి: చూ, రూ-లటక్కు—.

లట్టము. సం. వి. అ. పుం.=లడ్డిగ. కప్పెర, చిన్న మూతిగల పాత్రి: చూ, హరివాణము (పాత్రిము. 6-౧౫.)

లట్టాభట్టీయము. జా. (లొట్టాభట్టీయమనియు) అసంబద్ధ ప్రలాపము "నీలట్టాభట్టీయము లేల యేకరువెట్టెదవు." (ధర్మజరాజవిజయము.)

లట్టు. దే. వి. 1. తొట్టి, నీళ్లగాఁడి, నీళ్లతొట్టి, గాఁడి. (సం).-ఆహావము- ఆహావము, గోష్ఠము, గోపద్ధము, ఘురి, జలద్రోణి, త్రీగము, నిపానము; 2. పడియ చూ, సరస్సు. 1; అం. 3. వర్తమానార్థకము. ఉద్వి —లిట్టు (భూతకాల), లృట్టు (భవిష్య), లొట్టు (తర్కార్మాద్యర్థ), లూట్టు (ఆశీరాద్యర్థకము).

లట్టువ. నై. వి.=లట్వ. చిటితాళము: చూ. లట్వ.

లట్వ సం. వి. ఆ. స్త్రీ.=: చూ, వీణ. 1.

లట్వము. సం. వి. అ. పుం.=లడ్డు-లడ్డువు: చూ, భక్ష్యము.

లడాయి. వా. వి: కచ్చెపోతు, కజ్జాకోరు, కలవసగంటు, కయ్యాలకచ్చే, చిల్లగొండి, జగడగొండి, జగడాలమారి, తంటలమారి, తంటాలమారి, పెనకరి, పేచీకోరు, రచ్చెల. (సం) —కలహశీలుఁడు; 2. దెబ్బలాటలో కలియఁబడుట, దూఁకుట.

లడి. దే. వి. నిడుపుగాఁనిట్టిన సరిగలోనగువాని చుట్టు: చూ, సరిగ. 2. [లట్టము.

లడ్డిగ. వై. వి.=లట్టు. రూ-లడ్డిగము: చూ,

లడ్డిగము. వై. వి.=—పై —

లడ్డు. వై. వి.=లట్వ: చూ, లట్వము.

లడ్డుకము. సం. వి. అ. పుం, న.=లడ్డు-లడ్డువము-లడ్వము.—పై.—

లడ్డువము. వై. వి.=లడ్డుక. —పై.—

లడ్వము. వై. వి.= —పై.—

లత. సం. వి. ఆ. స్త్రీ. 1. రూ-లతిక. తీఁగె: చూ, వృక్షము; 2. రూ-లతిక. ఎక్కుడుఁదీఁగె: చూ, వృక్షము; 3. రూ-లతిక. చెట్టు చెట్టుకొని ఎదిగెడు తీఁగె: చూ, వృక్షము; 4. గతిక*: చూ, తృణము. 1; 5. పూలగురి వెంది*: చూ, శ్వేతపాకి; 6. ముత్యాలహారపు పేట: చూ, హావణిక. 2 (భూషణము 2); 7. కొమ్మ: చూ, శాఖ. 1; 8. పిక్క*: చూ, రాజాగ్నము; 9. పేరింకణము*: చూ, సన్నకదురివు; 10. చీమ: చూ, హీర. 1 (పిపీలిక.); 11: చూ, సాలెపురుగు; 12. కస్తూరి: చూ, శ్వేతమృగాండజము (మృగమదము); 13. మానేరు*: చూ, స్వర్ణవల్లి; అం. 14: చూ, నృత్యహస్తములు.

లతకూన. మి. వి. లేఁతతీఁగవంటి ఆఁడుది: చూ, స్త్రీ.

లతాంతము. సం. వి. అ. న. పూవు: చూ, సుమము.

లతాకరంజము. సం. వి. అ. పుం. తీఁగెకానుఁగు*: చూ, శాదఘ్నము. [చూ, సుబ్బలి.

లతాడు. వా. వి. (వానవల్లకలిగెడు) బుగద:

లతాప్రతానని. సం.వి.ఈ.స్త్రీ.ఒకటితోనొకటి పెనఁగొన్న తీఁగ: చూ, వృక్షము.

లతార్కము. సం. వి. అ. పుం. దుర్ద్రుమము, పచ్చేనీరుల్లి*: చూ, సుకందకము. 1.

లతావృశ్చికము. అం: చూ, కరణములు.

లతావేష్టితము. అం: చూ, జాతస్మరాలింగనములు (ఆలింగనములు)

లతిక. సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, రూ-లత. 1-2-3; 4. నూఱుపేటలహారము: చూ, హావణిక. 2 (భూషణము. 2.) [చూ, విపత్తు.

లత్త. దే. వి. 1. దెబ్బ: చూ, హతి; 2. ఆపద:

లత్తిక. దే. వి. బలుపును చేప్పడునుగల యొకానొక గచ్చకాయ: చూ, సోమరాజి.

లత్తిచేఁప. దే. వి. ఒకచేఁప: చూ, మత్స్యము. 1.

లత్తుక. వై. వి.=అలక్తక. లాక్షారసము: చూ, లక్క.

లత్తుకబొత్తులు. ద్వి. వి. బ: చూ, ధాన్యము.

లద్ది. దే. వి. గుఱ్ఱములోనగువాని మలము: చూ, శమలము. 1. [సంహారి.

లద్దిపిప్పి. దే. వి. ఒక చీడపురుగు: చూ, సస్య

లద్దిపురుగు. ద్వి. వి. తెల్లని క్రిమి విశేషము: చూ, సస్యసంహారి.

లద్దియ. దే. వి. (నేయువాఁడు వస్త్రముచిపగ నిడిచెడి) కచ్చె: రూ-లద్దె.

లద్దె. దే. వి. —పై.—

లపక. దే. వి. ధనము: చూ, హిరణ్యము. 3.

లపనము. సం. వి. అ. న. 1. ముఖము: చూ, వదనము. 2; 2. నోరు: చూ, వదనము. 1; 3. మాట: చూ, శబ్దము. 2.

లపితము. సం. వి.అ. న. 1. మాట: చూ, శబ్దము. 2; విణ. 2. మాటలాడఁబడినది: చూ, శబ్దము. 2.

లప్ప. దే. విణ. 1; చూ, రాశి. 1; 2. ఎడముగా వంపఁబడినవెల్లిగల చేర. అం, భా. ద్వి. 141: కమి, కమికిలి, కుప్ప, పట్టిలి: (చూ, హస్తము. 1.)

లప్పము. వై. వి.=లేప్య. రూ-లెప్పము. ప్రాని పెట్టెలోనగువాని సందుగొందులను మెత్తెడు సున్నపుముద్దలోనగునది: సమాలంభము.

లబ్బీలు. వా. వి.బ. ఒకానొక తురకజాతివారు.

లబ్ధము. సం. వి.అ.న. 1. భాగహారము చేయఁగా నేర్పడు సంఖ్య: చూ, సంఖ్యాభేదములు; విణ. 2. పొందఁబడినది: చూ, వ్యాప్తము. 3.

లబ్ధవర్ణుఁడు. సం.వి.అ.పుం: చూ, విద్వాంసుఁడు.

లబ్ధి. సం. వి. ఇ. స్త్రీ: చూ, లాభము.

లభించు. సం. అ. క్రి. కలుగు: చూ, సంభవించు.

లభ్యము. సం. విణ. 1. లభింపఁదగినది; అభిగమ్యము, గంతవ్యము, ప్రాపణీయము, ప్రాప్యము: చూ, సమాసాద్యము; 2. యుక్తము: చూ, యోగ్యము. 2.

లమ. దే. వి. ఒకానొక తీఁగ: చూ, వృక్షము.

లమిడి. వా. వి. రూ—లమ్డి-లంబిడి-లంబ్డి. 1: చూ, స్వైరిణి; 2. తిట్టు: చూ, శాపము.

లమ్డి. వా. వి: చూ, రూ-లమిడి.

లయ. సం. వి. అ. పుం. 1 తౌర్యత్రికసామ్యము, నృత్తగీత వాద్యములు సమముగా నుండుట: చూ,స్వరము.2; అం. 2: చూ, యోగచతుష్టయము; 3: చూ,లయప్రాణలక్షణము; దే. వి. (1): చూ,వంచన.

లయకాఁడు వా. విణ: చూ,సీకారి.

లయకారి. దే. విణ: చూ,వంచకుఁడు.

లయగ్రాహి. అం: చూ,వృత్తము. 1. (మాలికా వృత్తములలో నొకటి."భ-జ-స.న-భ-య. 2. 10. 18. 26 అక్షరములు ప్రాసయతులు నలువూఱు. "నెన్నె మదినమ్మికొని నన్ను దయఁజూడుమని, విన్నపము సేయుదు విపన్న జనపాలా.")

లయతాళకళాజ్ఞానములు.అం: చూ,సుగుణములు.

లయప్రాణము. అం: చూ,లయప్రాణలక్షణము.

లయప్రాణలక్షణము. అం: ౧ ద్రుతలయ(పాటకు నెంత త్వరగా తాళము వేసికొని పాడఁదగునో అట్లు తాళము వేసికొని పాడుట); ౨ మధ్యలయ(అంతకు రెట్టివిలంబము చేయుట); 3 విలంబితము (ఆమధ్యలయకంటె రెట్టింపు విలంబము చేయుట)(మఱియు "గీతతాళాదీన మేకత్రవిరామోలయః" అనియు "ప్రతిర్థా తాపితాలయః" అనియు జెప్పియుండుటచేత లయముఖ్యము. తాళాక్షర కాలములలో వ్యత్యస్తమైనను గ్రహాప్రాణము వ్యత్యస్తమైనను అనుద్రుతలయ మాత్రము తప్పకుండవలయును. అవియుండియు లయచెడితే ప్రాణము చెడును గావున అవలయయనంబడును.)

లయము. సం. వి. అ. న. 1. నీరు వట్టివేరు: చూ, సేవ్యము. 2; 2. వట్టివేరు*: చూ,సేవ్యము.1; పుం. 3.నాశము: చూ,వ్యత్త. 4 ఆలింగనము: చూ,సంశ్లేషము; అం. 5. సృష్టిస్థితిలయకారణములలో నిదియొకటి.

లయవిభాతి. అం: చూ,వృత్తము. 1. (మాలికా వృత్తములైనింటిలో నొకటి. "న-స-న-న-స-న-స-గ; 4. 7. 10 గణముల రెండవ యక్షరములు ప్రాసయతులు" "కరుణఁ, గనుమా,యనుచే,-శరణు,వినుమా, యనుచే, నిరత,మనువే,డెదను-బరమ, కరుణా.ళూ.")

లయవిహారి. అం: చూ, వృత్తము. 1. (మాలికా వృత్తములైదింటిలో నొకటి. పదునొకండు నగణములు, స, గ; 2-12-22-32 అక్షరములు ప్రాసయతులు."జలద తనువలరఁబయిఁ, బొలుపలరు మెఱుపువలె, నెలసెడి పసిఁడి వలువ, గలుగు దొరఁగొల్తున్.")

లయహారి. అం: చూ, వృత్తము. 1. (మాలికా వృత్తములలో నొకటి. ఒక్కొక్కపాదము నందు పదునొకండు నగణములును, సగణ, గురువులును గలిగి 11-21-31 ప్రాసయతులు గలవృత్తము.)

లయించు. సం.అ.క్రి.1. నశించు: చూ,నమియు. 3; 2: చూ,సక్తమగు. [మృగ్యము)

లయ్యా.వై. వి.=లంజా: చూ, వేశ్య.(ప్రయోగము

లలంతిక. సం వి. అ. స్త్రీ మెడహారము:చూ, భూషణము. 2-౫౩.

లలన. సం. వి. ఆ. స్త్రీ. 1. విరసనశీలయైన యాఁడుది: చూ,స్త్రీ; 2. ఆఁడుది; చూ, స్త్రీ;3. నాలుక:చూ,సుధాద్రవము(రసన.1.)

లలము. అం. రెండులఘువులు. "లల"; చూ, ఉపగణములు.

లలాటతిలకము. అం: చూ, కరణములు.

లలాటము. సం. వి.అ. న. 1: రూ-లలాటి. అలికము-ఆలికము-ఆలీకము-అళికము-అళీకము, కశేరువు, గండశైలము, గోధి, నిటలము-నిటాలము-నిటిలము-నిటీలము-నీటిలము, పట్టి-పట్టిక, ఫలకము, ఫాలము, మహాశంఖము. (తె. ప).— నుదురు, నెన్నుదురు, నొసలు, నెన్నొసలు, నెన్నొసలు, పట్టియ-

పట్టె, పలక, (వా).—కొట్టు-నొష్ట. తద్వి.- స్త్రీ లలాటము.— కస్తూరి; అం. 2: చూ, చుంబన స్థానములు; 3. (నుదురు): చూ, లక్షణాంగములు. (అర్ధచంద్ర సమమైన రాజగు, విపులమై ననంతమైన ధనికుఁడగు, అల్పమైన నల్పాయువగు, అయిదు రేఖలున్న వైభవముగలిగి నూరేండ్లు మనును, శుభావహుఁడగును, నాలుగు రేఖలున్న కీర్తిభాగ్యములుగలిగి యెనుబదేండ్లు బ్రదుకును. మూఁడు రేఖలున్న నఱువదేండ్లు బ్రదుకును. రెండు రేఖలున్న నలుబదేండ్లగు. ఒక రేఖయున్నను లేకున్నను నిరువదేండ్లు మనును. సుళ్లుగలిగిన దరిద్రుఁడగు. త్రిశూలరేఖ కులిశరేఖలున్న నీశ్వరుండగు. మండలేశ్వరుండునగున, మచ్చ గలిగిన స్థానభ్రష్టుండగు) ; 4. (నుదురు): చూ, స్త్రీలక్షణాంగములు. (అష్టమచంద్రు నిఁబోలిన రాజపత్నియగు, తిలకసమమగు మచ్చయున్న మొదటఁ గుమారునిఁగనును. నడుమనుడియున్న విధవయగు, వెడల్పైన మగనిని మామను మఱఁదినిఁజంపును. చినగనుడియున్న విధయు, అంకులాఁడియునగు, వెంట్రుకలుఁగనిపించేచే నడుమ నుడియున్న జారిణియగు.); 5: చూ, హస్తక్షేత్రములు.

లలాటి.సం.వి.ఈ.స్త్రీ: చూ, రూ-లలాటము.1.

లలాటిక. సం. వి. అ. స్త్రీ. నొసటఁగట్టెడు ముత్యపు బాసికము: చూ, బొట్టు. 1.

లలామకము. సం. వి. అ. న. బాసికము: చూ, పావణిక. 2 (భూషణము 2-౧౦-(౧౪).) తద్వి.—రాజ్యాభిషేకమున నొసటఁగట్టెడు పట్టకు.— (సం).—పట్టము, పట్టి: చూ,పావణిక. 2 (భూషణము. 2-౧౦-(౧౪).)

లలామము. సం. వి. న్. న. 1. గుఱుతు: చూ, లక్షణము. 1; 2. టెక్కెము: చూ,సిడము. 1; 3. తొడవు: చూ, భూషణము. 2; 4. నొసటనుంచేకొనెడు బొట్టు: చూ,విశేషకము. 1 (బొట్టు. 1.); 5. గుఱ్ఱము నొసటి చెక్క: చూ, విశేషకము. 1; 6. తోఁక: చూ, వాలము. 1; 7. కొమ్ము: చూ, శృంగము. 1; 8. ప్రభావము, బలిమి:చూ,శక్తి. 1; 9. గుఱ్ఱము: చూ,హయము; 10. (ఉత్తరపదమైనచో) శ్రేష్ఠము: చూ, శ్రైష్ఠ్యము.

లలి. దే. వి. 1. ప్రేమము: చూ, స్నేహము. 1; 2. ఉత్సాహము: చూ, సన్నాహము. 2; 3 ఒయారము: చూ, విలాసము. 2; 4. క్రమము:చూ,విధము. 1; 5. ఉపాయి: చూ, వికాసము.

లలిత.అం. 1:చూ, పంచమషాడవజాంతర భాషలు; 2. సుకుమారత్వముచేతనగు అంగవిన్యాస రూపమైన స్త్రీలయొక్క శృంగారచేష్టా విశేషము: చూ, సంచారీ భావమునఁబుట్టిన దృష్టులు; 3: చూ, జన్యతాళములు; 6: చూ, ఆగమములు (ఉపవిద్యలు 416 పొరట); 7: చూ,శృంగారచేష్టలు; 8: చూ,అలంకారము. 3. (ప్రస్తుతార్థద్యోతకమగు ప్రతిబింబ వర్ణనము. "ఉదా. గతజలసేతుబంధనము.")

లలితప్రియము. అం: చూ, జన్యతాళములు

లలితము. అం. 1: చూ,లలిత; సం.విశ.2. ఈప్సితము: చూ, వాంఛితము; 3. మనోజ్ఞము: చూ, హృద్యము. 2. [కారములు.

లలితస్వరము. అం: చూ, సంచారివర్ణగతాలం

లవంగపత్రి. వా. వి. లవంగచెట్టుయొక్క ఆకు: చూ, రోమశము (ఆకుపత్రి అని కొందఱు)

లవంగపుట్ట. వా. మి. వి: చూ, వరాంగకము.

లవంగము. సం. వి అ. న: ఉత్కటము, కపిశృంగము, గీర్వాణకుసుమము, దివ్యము, దేవకుసుమము, శ్రీసంజ్ఞము.(తె).—కరావువు. (కడుపులోని క్రిమినిఁజంపును. అజీర్తినిపోఁగొట్టును. లవంగపు నూనెలో 'యూజెనిక్ ఆసిడ్'అను ద్రావకముండును. ఇది క్రిమిసంహారకశక్తిలో 'కార్బాలిక్ ఆసిడ్' కంటె కొన్నిరెట్లు గొప్పది.) ("చూ,శ్రీసంజ్ఞము").

౹లవణము, సం. వి. అ. న. 1. (వాయువును గాని జాడ్యమును గాని పోఁగొట్టునది.): అబ్ధము, అబ్ధిజము, క్షారము, జలరసము. (తె).— ఉప్పు, ఉప్పన, నీళ్లవరుగు. తద్విశేషములు.- ౧. సముద్రపు ఉప్పునకు.—అక్షీబము-అక్షీబము, కలకము, క్షారాచ్ఛము, క్షీరాబ్ధిజము; (తె).-రాతియుప్పు- తాతియుప్పు, ౨. ఆసురము, ఉపాక్షారము, ఊపక్షారము, ఊపరము, ఔపరము. (తె) — చేవుటుప్పు-చౌటుప్పు; ౩. ఊషంజరము, క్షైత్రము. (తె).- పట్టుఉప్పు; ౪. అక్షము-అక్ష్యము, ఐరిణము, ఔద్భిజ్యము, ఔర్వము, ఔషరము, కాద్రిలికము, కృష్ణలవణము, జరణము, జీర్ణము, తిలకము, రుచకము, పాంశవలవణము, సౌవర్చలము - సౌవర్చలవణము; ౫: కనకక్షారము, క్షారము, టంకణక్షారము, టంకణము, టంకము, టగరము, సౌభాగ్యము. (తె).— గవ్వచౌకము, పటిక, పటికారము, వెలిగారము; ౬: కాచజము, కాచము, కాచమలము, కాచలవణము, కాచసంభవము, కురువిందము, కృష్ణలవణము, క్షారము, తీక్ష్ణము. (తె).— గాజు-గాజుప్పు; ౭: రుచకము, సజ్జిక, సుఖవర్చకము, సువర్చలము, స్తోత్రఘ్న. (తె).—సజ్జాకారము; ౮: కృతకము, కృష్ణ నామకము, క్షితిసంభూతము, ఖండలవణము, పాక్యము, బస్తకము-బాస్తకము, బిడము, బిడలవణము, సుగంధము, సుపాక్యము. (తె).— అంటుప్పు - అట్టుప్పు; ౯: క్షారత్రయము, ౧౦. క్షారదశకము; ౧౧: క్షారము, పాక్యము, యవక్షారము, యవశూకము, యవాగ్రజము; ౧౨: క్షారమేలకము, సర్వక్షారము; ౧౩: క్షారశ్రేష్ఠము, వజ్రక్షారము; ౧౪: క్షారషట్కము; ౧౫. క్షారాష్టకము; ౧౬: (చూ, క్షారములు.); ౧౭: గడదేశజము, గడలవణము, గడోత్థము, రోమకము, సాంబరము. (తె).—దొనయుప్పు; ౧౮: ఉప్పుకుప్పకు. — (తె). గెల్లి; ౧౯: తీపుతోఁగలిసిన యించుక ఉప్పునకు. —(తె). చేవురు- చౌరు; ౨౦: త్రికూటము, తీక్ష్ణము, పటువు, మాణిబంధము-మాణిమంథము- వశిగము-వసిరము, శ్యామము, సైంధవము, సైంధవలవణము. (తె).—ఇందుప్పు, చెందుప్పు; ౨౧ :నవక్షారము. (తె).—నవాసాగరము_నవాసారము; ౨౨ కటువు, లవణము, లావణ్యము. (తె).— ఉప్పుఁదనము, ఉప్పన; ౨౩: సురక్షారము. (తె).— పెట్లుప్పు, సురుప్పు; ౨౪: సురేకారము- సూరేకారము; ౨౫. లవణభేదములు:-అన్నభేది; కడకము; కృత్రిమము; ధూర్తము; (తె).—ఆకుప్పు; (మిగతవానికి "చూ, సౌవర్చలము."); పుం. 2. ఉప్పన: చూ, లవణము. 1-౨౨; 3: చూ, లవణాకరము. 1; విణ. 4 ఉప్పునిది; 5. లావణ్యముగలది; అం. బ. 6: చూ, లవణములు. [సముద్ర, కాచలవణములు. (5)

లవణములు. అం: సైంధవ, సౌవర్చ, బిడా,

లవణాకరము. సం. వి అ. పుం. 1. ఉప్పు సముద్రము: చూ, లవణోదము. 2. ఉప్పు శము: చూ, భూమి. 1.

లవణామలకీన్యాయము. అం. సముద్రపు ఉప్పు అడవి ఉసిరికె కాయ కలసెననురీతి. [దము.

లవణార్ణము. సం. వి. అ. పుం: చూ, లవణో

లవణి. దే. వి. 1: కచ్చింపు, గుత్తము, బింకము, బిగి, బిగువు, బిఱ్ఱు, మోడి, సున్నితము. (విణ.) కచ్చితము ("చూ, సున్నితము"); 2: ఉప్పి. (సం. వ.).-రూ-లావణి, కంటకిని, కుండలి, గృధ్రనఖు, గృధ్రఫల, గృధ్రవక్త్ర, గృధ్రనఖి, గృధ్రపాల, చతుష్కంటకిని, తీక్ష్ణపత్రి, శీతపిత్తహార. తద్వి.—

తెల్లయుప్పి. (సం).—మా_క్తికఫల, నల్లయుప్పికి.—జోలారి, నల్లయుప్పి. (సం).—కాకాదని, కాచహారిణి, కుండలి, క్షుద్రి, గుల్మి, ఖరళ, హింస్రి, హీరలి*. ("చూ, హీరలి.")

లవణుఁడు. సం. వి. అ. పుం. ఒకరక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1.

లవణోదము. సం. వి. అ. పుం. ఉప్పుసముద్రము: చూ, సముద్రము.

లవనము. సం. వి. అ.న. పైరులోనగువానికోఁత: రూ-లావనము—లవము, అభిలావము, లుపు_. (తె).—కోఁత.

లవనసు. వా. వి. జీవనార్థముయి ఇచ్చేసొమ్ము.

లవబ్రాహ్మణులు. అం: చూ, కపూరియోబ్రాహ్మణులు. (బ్రాహ్మణులు.)

లవము. సం. వి. అ. పుం. 1.= రవ-రవ్వ. లేశము: చూ, స్వల్పము; 2. చేటు: చూ, రుత్త; 3: చూ, రూ_లవనము; అం 4: చూ, కాలప్రమాణము; విణ. 5.భిన్నాంకములోని పైఅంకె: చూ, హారము. 3.

లవలవ. దే. విణ. భేదిల్లినది: చూ, విచ్ఛిన్నము. 3.

లవలి. సం. వి. ఈ. స్త్రీ. ఒకానొకతీఁగ*: చూ, వృక్షము. [కొద్దిపన్ను: చూ, సిస్తు. 1.

లవాజేమా. దే. వి. గ్రామసేవకుల జీతములపై

లవించు. సం. స. క్రి: (తె).—కోయు.

లవిటి. దే. వి. పక్షుతి, రెక్క_మొదలు: చూ, రెక్క_. 2; 2. చెవిటి: చూ, బధిరుఁడు; 3. తోఁక: చూ, వాలము.1; 4: గుఱ్ఱపుతోఁక. (సం).— అశ్వవాలము: చూ, హయము. (చూ, వాలము. 1.)

లవిత్రము. సం. వి. అ. న: దాత్రము. (తె).— కొడవలి, గిద్ద, లిక్కి_: చూ, కత్తి. 2—౧౫.

లవుఁడు. సం. వి. అ. పుం: రాముని రెండవకొడుకు: చూ, సూనుఁడు. (కుశుని సోదరుడు.)

లవుటి. దే.వి.లావు, పక్షితోఁక: చూ, వాలము. 1.

లవుడి. వై. వి.=లగుడ. (దేశ్యమని శ. ర.) (చూ, ముద్గరము.1-ర.); రూ-లవుణి-లౌడి-లౌణి-లాటీ, బడిత_బడితి, బరిస. (సం).— పరిఘాతనము. ("చూ, స్వధితి ")

లవుణి. వై. వి.=—పై.— (దే అని శ. ర)

లశునభక్షున్యాయము. అం. ఒకానొకన్యాయము.

లశునము. సం. వి అ. న. 1 : చూ, వెల్లుల్లి *; 2. కెంపునందలి దోషము. (అనఁగా పాలుపైఁబూసినట్లుండెడు తెల్లని డాలు): చూ, స్థూలోచ్చయము. 1 (రత్నములు)

లష్కరు. వా. వి. దండు: చూ, సేన. 1.

లసితము. అం: చూ, జన్యతాళములు. [ట్టు. 1.

లసుకు. దే. స క్రి. నాశనముచేయు: చూ, సరి

లసుక్కు_. వా. పి: చూ, పుసుక్కు_.

లస్తకము. సం. వి. అ. పుం: (తె):—పిడికట్టు-పిడికిటి కట్టు, వింటినడుము. (చూ, బాణము. 1.)

లహరి. సం.వి.ఇ,ఈ. స్త్రీ. పెద్దఅల: చూ, వీచి. 1.

లహొరి బ్రాహ్మణులు. అం: చూ, నేపాళదేశపు బ్రాహ్మణులు.

## లా

లా. వా. వి. అక్షు, చేట్టము, శాసనము: చూ, శాస్త్రము. 1. [చూ, లాంగలము.

లాంగలదండము. వా.సం. వి. అ. న. ఏఁడికోల:

లాంగలపద్ధతి. సం. వి. ఈ. స్త్రీ. నాఁగేటిచాలు, సీత: చూ, లాంగలము. 1—౧ర.

లాంగలము. సం. వి. అ. న. 1=నాఁగలి: కృంతత్రము, గోకిలము—గోకీలము, గోదారణము, సీరము, హాలము, హాలి. (తె. వ).— అరక, ఏరు, కొండ్రికైదువు, దుక్కి_వాలు, నాఁగలి—నాఁగేరు_నాఁగేలు, మడక. తద్విశేషములు.—౧. అడుసుదున్ను నాఁగలికి.— (తె). దంపకఱ్ఱు, దంపనాఁగలి; 3. అటిసిన

నాఁగలికి.—(తె). గొనప, గొనము; ౩.ఏఁడికోలకు.— ఈశ-ఈష. లాంగల దండము (తె).-ఏఁడికోల, మేఁడికోల; ౪. ఏఁడికోలలేని నాఁగలిదుంపకు.—అధోహలము, అఫలము, కూటకము, నిరీశము—నిరీషము, శీరాంగము (తె). ఊరు, కలప, గొడగ-గొణగ, దుంప; ౫. జేడిగమునకు-యంత్రికి. (తె).-జేడిగము, జోత్తిగె; ౬. దుంపమీఁదుగా కాఁడికి తగిలించిన నాఁగలికి.—(తె). కోటేరు; ౭. నాఁగటిదుంపమొనకు - పోత్రము; ౮. నాఁగటిదుంప వెనుక నిలిపిన కొయ్యకు.-(తె). మేఁడి, మేఁడికఱ్ఱ, మేఁడికొయ్య; ౯. నాఁగళ్ల సమూహమునకు.-(సం). హాల్య; ౧౦: (తె).- మేఁడిచీల; ౧౧: (తె) —మేఁడితోఁక, మేఁడిసోగ; ౧౨. మేఁడిపొలికిదున్నెడు మడకకు -(తె)—పొలేరు; ౧౩. మొదటికొండ్రకు.-(తె). తల్లికొండ్ర; ౧౪: లాంగల పద్ధతి. (తె). నాఁగేటిచాలు, సీత; ౧౫. లాంగలప్పష్టమునకు.-(తె).- నాఁగటిచిప్ప, నాఁగటిదుంప, నాఁగటిపడత, నాఁగటియూరు, పడత_పణత; ౧౬. సీతానివృత్తికి.- కొండ్ర, గుంట, గొంట్ర; ౧౭. కొన్నిరకముల నాఁగళ్లు.—ఆవిరినాఁగలి, ఇనుపనాఁగలి, కోయఁబుత్తూరునాఁగలి, క్లైమాక్సునాఁగలి, దంపనాఁగలి, దక్షిణకన్నడపు నాఁగలి, మెట్టనాఁగలి మొదలగునవి (మిగత వానికి "చూ, హలము."); 2. తాడు*: చూ, శ్రీతాళము; 3. ఒక పువ్వు: చూ, సుమము; 4. గృహదారు విశేషము; 5. మగగుఱి: చూ, శిశ్నము; 6.=లంగరు: చూ, లంగరు, జీను.

లాంగలి. సం. వి. ఈ. స్త్రీ. 1. తఱిగొఱ్ఱు, రూ-లాంగలికి*: చూ, హాలిని; 2. నీరుపిప్పలి*: చూ, శకులాదని. 2; న్. పుం. 3. నాఁగటిజోదు: చూ, హలాయుధుఁడు; 4.నారికడము*: చూ, స్కంధఫలము; 5.పాము: చూ, సర్పము.

లాంగలికి. సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-లాం[గలి. 1.*.

లాంగూలతరణన్యాయము. అం. కుక్కతోఁక పట్టుకొని గోదావరి యీఁదెననురీతి.

లాంగూలము. సం. వి. అ. న. 1. తోఁక; చూ, వాలము. 1; 2: చూ, లాంగలము. 5; పుం. 3. అభినయహస్తవిశేషము (ఉంగరపువ్రేలిని వంచి చిటికెనవ్రేలిని పైకెత్తి కడమ మూఁడు వ్రేళ్లు నూర్ధ్వాకారముగా త్రేతాగ్నులవలె పట్టినది.): చూ, వ్యంజకము. 1; అం. 4: చూ, అసంయుతహస్తములు.

లాంఛనము. సం. వి. అ. న. గుఱుతు: చూ, లక్షణము. 1; 2. నామము: చూ, పేరు. 1; 3.శ్రీవత్సము: చూ, లక్షణము. 1—౨౭.

లాంతరు. వా. వి. అద్దములనడుమ వెలుఁగుదీపపు గూఁడు. (లాంట్రిన్.) (ఇందుఁ జేరునవి.- లాంపు, బెడ్ లైటు, లైటు, హరికేన్ లాంతరు; మఱియు డూంలైటు, గ్యాస్ లైటు, ఎలెక్ట్రిక్ లైటు మొదలగునవి.)

లాంపట్యము. సం. వి. అ. న. లంపటభావము.

లాంపు. వా. వి. లోపల వెలుఁగుదీపపు గూఁడు. (చూ, లాంతరు )

లాశ. దే వి. పక్షియీఁక: చూ, ఱెక్క. 1.

లాఁకకట్టు. దే. వి. విఱిచికట్టిన పెడచేతులకట్టు.

లాఁగ. దే. వి. 1. గర్తము: చూ, రంధ్రము. 1-౧; 2. బొఱియ: చూ, రంధ్రము. 1.

లాఁగడాఁగుడు. దే. వి. పాము: చూ, సర్పము.

లాఁగరి. దే. వి. (లాగ+అరి) చెవి: చూ, శ్రోత్రము. [విచార్యము.)

లాఁగించే. వై. ఆ. క్రి: చూ, లంఘించే (ఇది

లాఁగు. వై. వి. 1. చల్లడము: చూ, వస్త్రము; 2.=లంఘన: చూ, లంఘనము. 2; అం. 3. చూ, విన్నాణములు; బ. 4: చూ, మల్లబంధములు.

లాఁచు. దే. అ. క్రి. 1: చూ, వ్యాపించు; 2: ఇఱుముకొను, ఓలమాసగొను, చోటుపడు, జోడుఁగు-జోఁడుఁగు, డాఁకొను-దాఁకొను-దాఁగుకొను, డాఁగు-దాఁగు, డుక్కు, డొంగు-దొంగు, తాఁచు, దండసిలు - దండసిల్లు, పొంచు, పొంచువేయు, పొగయు, బ్రుంగు, బ్రుంగుడువడు, మఱుఁగు, మఱుఁగుపడు, మఱుపడు, మాటుపడు, మునుఁగు - మున్గు, మొఱఁగు, వస్మృవోవు. ("చూ, నుఱుఁగు.1.")

లాఁత. దే. వి. లాయుట.

లాఁతసేయు. ద్వ. అ. క్రి. (లాఁత + చేయు). చూ, విజృంభించు.

లాఁతి. దే. స. ఇతరము: చూ, వేఱు. 3.

లాఁతు. దే. విశ. అధికము: చూ, హేరాళము.

లాఁపరా. దే. వి. (లాఁపు + రాయి) జలదారి మొగినుండుగండ్లఱాయి: రూ-లాఁపఱాయి.

లాఁపఱాయి. దే. వి. —పై.—

లాఁపు. దే. వి. లాఁచుట. [మగ్గము. ౧౦.

లాక. వా. వి. లాకచెయి, లాకబద్ద: చూ,

లాక కట్టు. దే. వి. లాకలతోఁడ మెట్టిరుంచిన పని మగ్గియని పడుగు (చూ, మగ్గము).

లాకచేయి. వా. వి: చూ, లాక.

లాకబద్ద. వా. వి. —పై.—

లాకలూకాయ. వా. వి. అనామకుఁడు, నీతినియమములు లేనివాఁడు: చూ, వ్యాధుఁడు. 2.

లాకు. వా. వి. కాలువ యందిటు అటు వచ్చెడి ప్రవాహమును ఆపుచు వెలువరించుచు నుండెడి అడ్డుతలుపుల కట్ట. "ధవళేశ్వరపు లాకు": చూ, సేతువు. 1.

లాక్ష. సం. వి. ఆ. స్త్రీ.=లక్క, రూ-రాక్ష: చూ, లక్క.

లాక్షణీవృత్తము. అం: చూ, వృత్తము. 1. ("భ, స, న, వ, న, భ, న, స, సగణములు. 18 యతి.")

లాక్షణికుఁడు. సం. విశ: లక్షణజ్ఞుఁడు.

లాక్షాపేటి. సం. వి. ఈ. స్త్రీ.=లక్కపెట్టె: చూ, సందుకా.

లాక్షాది. అం: చూ, తైలములు.

లాక్షాప్రసాదనము. సం. వి. అ. పుం. ఎఱ్ఱ లొద్దుగు*: చూ, లొద్దుగు.

లాగము. వై. వి.=లాఘవ. 1: చూ, లాఘవము. 1; 2: చూ, లాఘవము. 2.

లాగి ద్వ. విశ. (లాగము + ఇ) —పై.—

లాగించు దే. స. క్రి: కొంపోవు- కొనిపోవు, తీసికొనిపోవు.

లాగు. దే. వి. 1: ఈడుపు-ఈడ్పు, తెగ. (సం. వ) -అనుకర్షణము, అనుకర్షము, అపకృష్టి, ఆకర్షకము, ఆకర్షము, ఆకృష్టి, ఆక్షేపము, ఆవర్జనము, ("చూ, స్వీకారము.2."); 2: చూ, విధము. 1; 3: చూ, సమ్మతి. 1; స. క్రి. 4. ఆకర్షించు: చూ, రెమ్ము. 2.

లాగుకొను దే. అ. క్రి. అపహరించుకొను: చూ, సడపు.

లాగులాడు. దే. అ. క్రి: చూ, పెంటిగొను.

లాఘవము. సం. వి. అ,న. 1.=లగువు-లాగము. లఘుత్వము: అపాతము-అపాతము, అవలీల, లఘిమ-లఘిమము, లఘువు. (తె. వ).— అలఁతి, ఈసడింపు, ఉలక, ఉలకన, చులకన-చుల్కన, చులకపాటు-చుల్కపాటు, చౌచాయ, తేలిక, నుసులు, పలుచన, పైపొక, రేను, లగువు, లాగము, లాగి, లివ, లేఁత, లేను, తద్విశేషములు.—౧ చులకనైనది: (చూ, లఘ్వి. 2.); ౨ (విశ) మిక్కిలి చులకనైనది:—లఘిష్ఠము; 3. లాఘవముగా:— (తె.) చేవుక-చాక-చులక; 2. ఆరోగ్యము: చూ, సద్యము. 1; 3.=లాగము: చూ, సులభము.

లాచోరిమాట. వా. వి. నిజముతప్పినమాట: చూ, శబ్దము. 2.

లాచౌరు. వా. విణ. నిరాధారముగాఁజేసినది; 2. సిగ్గును పొందఁజేసినది. "లాచౌరుమాట"

లాచి. దే. వి. రూ—లాచీ. 1. గుఱ్ఱముమీఁదను గాడిదమీఁదను వేసెడు గోనె. 2. తట్టుపై వేసెడు గోనె. 3. చిన్న బండిమీఁద తెచ్చే భారము (బరువు.)

లాచీ. దే. వి. —పై.—

లాజ. సం. వి. ఆ.స్త్రీ,అ. పుం. బ:ఉత్తుషము, భ్రాజికము. (తె). పేలలు—పేలాలు—పేఁబాలు—పేలలు, బొరుగులు—బొరువులు. (చూ, సాదము. (1).)

లాజము. సం. వి. అ. న. 1. వట్టివేరు: చూ, సేవ్యము. 1; పుం. 2. నానబియ్యము: చూ, బియ్యము. [జేయు హోమము.

లాజహోమము. పా. వివాహమందు పేలాలతోఁ

లాటదేశస్త్రీ. అం. ఒకానొకస్త్రీ:చూ, స్త్రీ.

లాటము. సం. వి. అ. పుం. 1. చిలుక; చూ, శుకము; 2: చూ, సామర్థ్యము; అం. 3: చూ, దేశములు.

లాటరీ. వా. వి. చీట్లుకలిపి వస్తువులనమ్ముట.

లాటానుప్రాసము అం: చూ, శబ్దాలంకారములు. (తాత్పర్యభేదముగల శబ్దపునరావృత్తి. "ఉదా.—విష్ణు కథల్విను వీనులు వీనులు" "పత్క్రథలచే నడచిన దినము దినము." "భగవంతుని గుణముఁజెందిన కథ కథ." దయ దాక్షిణ్యాది గుణములు గుణములు." "దీనులపైఁజూపిన దయ దయ." (చూ, అనుప్రాసము.)

లాటి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఇంద్రినిశంఖము: చూ, సంకు. 1; అం. 2: చూ, రీతులు; జే. వి. (1). ఒకపక్షి:చూ, పక్షి. 1.

లాటీ. వా. పై. వి.=లగుడ. రూ—లౌడి. దుడ్డుకఱ్ఱ. "లాటీదెబ్బలు.":చూ, లవుడి.

లాటీలిటము. అం: చూ, వృత్తము. 1. ("స-స-స-స-మ-త-యగణములు. 13 యతి. 21 ఛందస్సు.")

లాటు. వా. వి. 1. పంచకమునఁనొక భాగము; 2. పేఁములోని యొకభాగము; 3. గుట్ట, గుంపు: చూ, సమూహము.

లాట్టు. అం. తద్ధర్మాద్యర్థకము: (చూ, లట్టు.3)

లాడము. దే. వి. రూ—లాళము—నాళము. గుఱ్ఱపుగొరిజెలకు కొట్టెడు ఇనుప తగటిబిల్ల: నాలము—నాళము, కోని. (లాడమని మద్రాసుప్రాంతమున వాడెదరు.)

లాడి. దే. వి. 1. పెద్దపుంజు: చూ, వర్ణము.2; 2: ఎర, గావు, పొరి, పొలి. (సం).—బలి. (పాండు. 5, ఆ. 240.)

లాడియ. దే. వి. బరువుమోసెడి యెద్దువీఁపున బరువెక్కించుట: రూ—లాడె.

లాడీబేడీ. వా. వి: మూట ముల్లె.

లాడువాఁడు. దే. వి:చూ, సౌందర్యవంతుఁడు.

లాడె. దే. వి: చూ, రూ—లాడియ.

లాడ్డుకికము. సం. వి. అ.న. లడ్డుముద్దలపోవు.

లాతము. జే. వి. రూ—లాతాము. 1. చేతిబెత్తము: చూ, వేత్రము. 1; 2. సన్యాసుల చేతిదండము. విక్ర.2,ఆ.7: చూ, వేత్రము.1.

లాదు. వా. వి. కట్టడములలో వంపులు కట్టునపుడు వానికాధారముగా కట్టుకట్టడము.

లాపము. సం. వి. అ. పుం. 1: చూ, శోకము; 2: చూ, సల్లాపము.

లాబము.పై.వి=లాభ:చూ, లాభము.

లాబించే. పై. అ. క్రి.=లాభ: చూ,లాభించే.

లాభము. సం. వి. అ. పుం.=లాబము. 1. అధికముగా పొందఁ బడునది, క్రయవిక్రయముల వలన వచ్చిన విశేషధనము: అధికము, అధిగమము, అవాప్తి, ఆదాయము, ఆమిషము, ఆరాధనము, ఆసత్తి, ఆసాదనము, ఉపగతి, కలాంతరము, ప్రతిపత్తి, ప్రాపణము, ప్రాప్తి, ఫలము, లబ్ధి. (తె. ప). —ఒడుపు, కసరు — కసురు,

కూడుదల, దాపురము—దాపరము—దాపురము, వయము, పొందు, పాలి, పొసగుడు, వాయము, ఫలము, మిగత- మిగితి-మిగులు- మిపులు, మేలు, లాభము, వాసి; 2. (తె).—కిట్టుబడి, కిట్టింపు-గిట్టింపు; 3. సాందృష్టికము; 4. పరప్రాప్తికి.—ప్రతిపత్తి. ("చూ, సాందృష్టికము."); 2. ఆదాయము: చూ, వచ్చేబడి; 3. ఆడనము: చూ, హెచ్చు. 3; 4. వడ్డి: చూ, వృద్ధి. 4.

లాభించే. వా. సం. అ. క్రి. 1. కలుగు: చూ, సంభవించే; 2.= లాబించే, క్రయవిక్రయాదులవలన హెచ్చుగావొరకు· చూ, సిద్ధించే.

లామజ్జకము. సం. వి. అ. న. 1. నీరువట్టివేరు: చూ, సేవ్యము. 1; 2. వట్టివేరు: చూ, సేవ్యము. 1.

లాయకు. వా. విశే. తగినది: రూ—లాయఖు.

లాయఖు. వా. విశే.—పై.—

లాయము. వై. వి.=ఆలాయ: చూ, వాజిశాల.

లాయరు. వా .వి. ప్లీడరు, వకీలు, న్యాయవాది, అడ్వొకేటు.

లాయిడి. వా. వి: చూ, రెంటపంజోలు.

లాయిలాసా. వా. వి: చూ, శ్రమము. 1.

లాయు. దే. అ. క్రి: చూ, విజృంభించే. హరి. ఉ. 7, ఆ. 262.

లాల. సం. వి. ఆ. స్త్రీ. చొంగ: చూ, స్యందిని.

లాలనము. సం. వి. అ. న. బుజ్జగము: చూ, సమరసము. 2 (చూ, శబ్దము. 2)

లాలవి. సం. వి. ఈ. స్త్రీ. ఎఱ్ఱగిసె*: చూ, శుకనాసము. 1. [జెంపు ) 1.

లాలము. దే. వి. ఉల్లారుక్రిందిజోలరు (చూ,

లాలస. సం. వి. ఆ. స్త్రీ, అ. పుం. రూ—లాలసము. 1. అధికేచ్ఛ (మనస్సుయొక్క కూడుటరైనను క్రీడరైనను లాలసము): చూ, వాంఛ; 2: ఉత్సుకత్వము, ఔత్సుక్యము, వాణిని. (తె. ప).——అ;3: చూ, యాచన; విశే. 4. విషయాసక్తురాలు: చూ, స్త్రీ.

లాలసము. సం. వి. అ. పుం.—పై.—

లాలసరి. ద్వ. వి. (లాలము + సరి) గుజ్జుపుపల్లము మీఁది యుల్లారు క్రిందవ్రేలెడు జిల్లుల దండ. స్వా. 4, ఆ. 115. [శుకనాసము. 1.

లాలసి. సం. వి. ఈ. స్త్రీ. ఎఱ్ఱగిసె*: చూ,

లాలాటకము. అం: చూ, జాతస్మరాలింగనములు (ఆలింగనములు.)

లాలాటికుఁడు. సం. విశే. 1. ప్రభుహృదయమును కనిపెట్టువాఁడు; 2. కార్యమందు నేర్పు చాలనివాఁడు.

లాలాభక్ష్యము. అం: చూ, నరకములు.

లాలి. దే. వి. 1. ఉయ్యేల. సా. 1, ఆ. 46. చూ, సవారి; 2. లాలిపాట: చూ, స్వరము. 2.

లాలించే సం. స. క్రి: చూ, బుజ్జగించే.

లాలికము. సం. వి. అ. పుం. దున్నపోతు. చూ, సైరిభము (మహిషము.)

లాలిత్యము. సం. వి. అ. న. లలితభావము.

లాలిపాట. వా. వి: చూ, లాలి. 2.

లాలు. దే. విశే. ఎఱుపు: చూ, వర్ణము. 6.

లాలుకుంచెలు. దే. వి. 1. ఎఱ్ఱనికుచ్చెలు; 2. గంగిరెడ్లవాండ్రుకట్టుకొనుసవరపుకుచ్చెలు.

లాలూచి. వా. వి. 1. అత్యాశ: చూ, వాంఛ; 2. నైచ్యము: చూ, హీనము. 1; 3: చూ, లాలోచీ.

లాలోచీ. వా. వి. లోపాయకారి, నామకహా: చూ, రూ—లాలూచి. 3. [లావుక.

లావకము. సం. వి. అ. పుం.=లావుక: చూ,

లావణము. దే. వి. సేవకుఁడు కొలువునందు చేరినకాలమును వ్రాసికొనుట. (సేవకునిపని నుండి తొలఁగియుట పీలితము, సలితము.)

లావణి. దే.వి.1: చూ, పుల్లరి; 2: చూ, రూ-లవణి*

లావణ్యము. సం. వి. అ. న. 1. ముఖకాంతి

విశేషము: చూ, పగటు. 2; 2. ఉప్పన: చూ, లవణము. 1.

లావనము. సం. వి. అ. న: చూ, రూ-లవనము.

లావరి. దే. విణ. (లావు+అరి) 1. బలవంతుఁడు: చూ, శక్తుఁడు; 2. లావుగనున్నవాఁడు, బలహీనుఁడు.

లావాదేవీలు. వా. వి. బ. 1. వ్యాపారపు చిక్కులు; 2. ఇచ్చిపుచ్చుకొనుసంబంధము; 3: మారామత్లు, పుట్టాకులు, చిక్కులు.

లావిల. దే. వి. ఒకపక్షి: చూ, పక్షి.

లావు. దే వి. 1. బలము: చూ, శక్తి. 1; 2: చూ, సామర్థ్యము. 1; 3. ఆధిక్యము. ఉ, హరి. 3, ఆ. 131: చూ, హెచ్చు. 2; 4. పక్షతి: చూ, రెక్క. 2; 5. పక్షితోఁక, లవుటి: చూ, వాలము. 1; విణ. 6: చూ, స్థూలము. 2; 7. శక్యముకానిది:అక్కజేము, అరిది, కడఁది, డెప్పరము-దెప్పర-దెప్పరము, తొక్కు. (సం).—అశక్యము; 8. ముదుగు:చూ, స్థూలము. 4.

లావుక. వై. వి.=లావక. (ఇదిచతుర్విధము.—గౌరికము, పాంసులము, పౌండ్రము, కర్బురము.): క్షుద్రము, చిత్రయోని, లావకము: చూ, పక్షి. [శిఖి. 2.

లాసకము. సం. వి. అ. పుం. నెమలి: చూ,

లాసకి. సం. వి. ఈ. స్త్రీ. ఆటకత్తె: చూ, లాసిక.

లాసకుఁడు. సం. వి. అ. పుం. ఆటకాఁడు: చూ, శైలూషుఁడు.

లాసము. సం. వి. అ. పుం: చూ, రూ-లాస్యము.

లాసిక. సం. వి. ఆ. స్త్రీ: చూ, శైలూషి (చూ, స్త్రీ.) [టని: చూ, వైధనిక.

లాస్ఫోటని. సం. వి. ఈ. స్త్రీ. రూ-ఆస్ఫో

లాస్యము. సం. వి. అ. న. 1. నృత్యము: చూ, వ్యంజకము. 1; 2: చూ, తౌర్యత్రికము (చూ, వ్యంజకము. 1.) [హామిక.

లాహిరి. దే. వి. రూ-లాహిరీ. మత్తు: చూ,

లాహిరీ. దే. వి: చూ, రూ-లాహిరి.

లాహిరీమోదము. దే వి. గంజాయిపీల్చుపాత్రము: చూ, హరివాణము (పాత్రము. 6.) (ఇదివిచార్యము.) [దేశమున వాడుక.)

లాళము. దే. వి: చూ, రూ-లాడము. (దక్షిణ

## లి

లింగఁడు. వై. వి.=లింగడు. జంగమయ్య, శివభక్తుఁడు: చూ, జంగముఁడు.

లింగకాయ. మి. వి. (లింగము + కాయ) లింగము గల లింగధారులసజ్జికాయ: చూ, సజ్జికాయ.

లింగదొండ. మి వి. (లింగము + దొండ) లింగాకారపు దొండ*: అయస్తంభిని, ఈశ్వరవల్లరి, కటుఫల, క్షేమ, చండ, లింగిని, శివవల్లి, శ్రీవల్లి: (చూ, దొండ, రక్తఫల.)

లింగనాడి. సం. వి. ఈ. స్త్రీ. ఉపస్థలోనిలింగనాడి: చూ, స్మరాంగారము (భగము. 12.)

లింగపీఠము సం. వి. అ. పుం: పానవట్టము.

లింగపొట్ల. మి. వి. (లింగము+పొట్ల) సిధ్రికి, లింగబీజ: చూ, పొట్ల. 1-క.

లింగబలిజెలు. మి. వి. (లింగము+బలిజెలు) లింగధారులయిన బలిజెలు.

లింగబీజ. సం. వి. ఆ. స్త్రీ: చూ, లింగపొట్ల.*.

లింగమణులు. అం: చూ, శుభావర్తములు. (చూ, ఆగంతుకములు. 853 పారట.)

లింగము. సం. వి. అ. న. 1. పానవట్టుమీఁది శివమూర్తి: చూ, శివుఁడు; 2. గురుతు: చూ, లక్షణము. 1; 3. మగగుఱి: చూ, శిశ్నము; 4. అనుమానము: చూ, సందేహము; 5. పంచవింశతి తత్త్వములయందు ఆదియగు ప్రకృతి (శివస్వరూపము); అం. 6. (మగగుఱి): చూ, లక్షణాంగములు. (వలపల్లవాలిన లక్ష్మీవంతుఁడును పుత్రవంతుఁడును నగు, డాపలవ్రాలిన పుత్రీవంతుఁడును నిర్ధ

సుఁడునగు, నీలవర్ణముఁగలిగి స్థూలమైన ముఖి, దీర్ఘమైన దరిద్రుఁడు, కృశమైన భాగ్యవంతుఁడు, సూక్ష్మమైనను రక్తవర్ణమైనను రాజగు.); 7: చూ, రసవదలంకారములు; బ. 8: చూ, లింగములు.

లింగములు. అం. 1: పుంలింగ, స్త్రీలింగ, నపుంసక లింగములు; (3) 2: శ్రీశైల, భీమశాశేశ, మహేంద్రగిరులు; 3: చూ, జ్యోతిర్లింగములు మఱియు సౌరాష్ట్రే- సోమనాథంచ, శ్రీశైలే- మల్లికార్జునమ్, ఉజ్జయిన్యాం- మహాకాళం, ఓంకారమమలేశ్వరమ్, ప్రజ్వల్యాం- వైద్యనాథంచ, ఢాకిన్యాం- భీమశంకరమ్, సేతుబంధేతు- రామేశమ్, త్ర్యంబకం- గౌతమీతటే, హిమాలయేతు- కేదారమ్, నాగేశం- దారుకావనే, వారణస్యాంతు- విశ్వేశమ్, ఘృష్ణేశంతు- శివాలయే. ఇత్యాది.

లింగరాజు. మి.వి. (లింగము+రాజు) గూకఁటి మూఁగ: చూ, భృంగరాజము.

లింగవృత్తి. సం. వి. ఇ. పుం. ధర్మధ్వజి, లింగి, (తె).—కాఁటదమ్ముఁడు: చూ, సన్న్యాసి.

లింగస్కంధము. అం: చూ, ఔషధస్కంధము (స్కంధములు.)

లింగి. సం. వి. న్. పుం: చూ, లింగవృత్తి.

లింగిని. సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, లింగదొండ*: అం. 2. లింగిని సన్న్యాసిది: చూ, దూతీచతుష్టయము (నాయికలు.)

లింపాకము. సం. వి. అ. పుం. పండు: చూ, ఫలము. 1. [చూ, స్తబ్ధుఁడు.

లింపాకుఁడు. సం. వి. అ. పుం. మూర్ఖుఁడు:

లికుచము. సం. వి. అ. పుం. రూ- లకుచము. 1. కమ్మరేఁగు*: చూ, రేఁగు; 2: కర్కంధువు, కోలి, వహువు. (తె).—గంగరేఁగు- గంగరేను, గజనిమ్మ, పెద్దరేఁగు, బదరి. ("చూ, స్వాదుఫల"); 3. కాకి నేరేడు*: చూ, సురభిపత్ర. [చూ, లక్క.

లిక్క. దే. వి. 1: చూ, లవిత్రము; వా. వి. 2:

లిక్ష. సం. వి. ఆ. స్త్రీ. రూ- లేక్ష. ఈరుఁ చూ, యూకము. [వ్రాయు.

లిఖించే. సం. స. క్రి. రూ- లిఖియించే: చూ,

లిఖితపత్రసంపుటము. సం. వి. అ. పుం. వ్రాఁతప్రతి: చూ, సంపుటము. 3.

లిఖితము. సం. వి. అ. న. 1. లిపి: చూ, వ్రాఁత; 2. అక్షరము: చూ, వర్ణము. 1; విణ. 3. వ్రాయఁబడినది: లేఖితము.

లిఖితవ్యము. సం. విణ. వ్రాయఁదగినది: లేఖనీయము, లేఖ్యము, లౌఖ్యము.

లిఖితుఁడు. సం. వి. అ. పుం. 1. పత్రము వ్రాసికొనువానిచే రప్పింపఁబడి పత్రమునందు సంతకము చేసిన సాక్షి, వ్రాఁతసాకిరి: చూ, సాక్షి; 2. ఒకముని: చూ, సన్న్యాసి.

లిఖియించే. సం. స. క్రి: చూ, రూ- లిఖించే:

లిగాడు. వా. వి. 1. తక్కువ: చూ, స్వల్పము; 2. బీద: చూ, సీదరము. 1; 3. అగౌరవము: చూ, సడి. 3.

లిగువు. సం. వి. ఉ. పుం. 1. జింక: చూ, హరిణము. 1; 2. నేల: చూ, హరిప్రియ. 2 (భూమి. 1.): దే. వి. (1) మృగి, లేటి, లేడి: చూ, హరిణము. 1.

లిట్టు. అం. భూతార్థకము (చూ, లట్టు. 3)

లిద్ది. దే.వి.1. పడిసెముచేత ఊపిరిరాక ముక్కు డఁచేకొనుట; 2. లోఁతుపడిన ఓటిలోఁ గొట్టెడు గూటము. [లేఁనము. 1.

లిపము. సం. వి. అ. పుం. ఇల్లలుకుట: చూ,

లిపి. సం. వి. ఈ. స్త్రీ. రూ- లిపీ- లిభి: చూ, వ్రాఁత. [సకాఁడు.

లిపింకరుఁడు. సం. వి. అ. పుం: చూ, వ్రాయ

లిపికరుఁడు. సం. వి. అ. పుం. —పై.—

లిపికారుఁడు. సం. వి. అ. పుం. —పై.—

లిపీకరుఁడు. సం. వి. అ. పుం. —పై.—

లిప్తకము. సం. వి. అ. పుం. 1. విషము పూసిన బాణము: చూ, బాణము. 1; విణ.

2. పూయఁబడినది. దిగ్ధము, లి ప్తము: చూ, బాణము. 2.

లి ప్తగాతు్రఁడు. వా.సం.వి.అ.పుం: చూ, గ్రా. 7.

లి ప్తము. సం. విణ. 1: చూ, లి ప్తకము. 2; 2. భుజింపఁబడినది: చూ, లీఢము.

లిప్స. సం.వి.ఆ. స్త్రీ. ఇచ్ఛ: చూ, వాంఛ

లిబ్బి. దే. వి. 1: పాఁతఱ, పాతు, పూడుపు. (సం.).—ఆతంచనము, ఆళయము, మండము; ఘనాభి, గుప్తి, నికరము, నిక్షేపము, నిధానము, నిధి, పింగళము, శేవధి–సేవధి. (చూ, నిధులు). తద్వి.—౧ కుబేరునినిధికి.–(సం). ఖర్వము.("చూ, సేవధి.");2.(ధాన్యాదుల) పాఁతఱ: చూ, పంటసాల; (చూ, లిబ్బి. 1); 3. పోగు: చూ, రాశి. 1; 4. ధనము: చూ, హిరణ్యము. 3.

లిబ్బిదొర. దే.వి. కుబేరుఁడు: చూ, శ్రీదుఁడు.

లిబ్బిదొరచెలి. దే. వి: చూ, శివుఁడు.

లిబ్బిపడఁతి. దే. వి: చూ, లక్ష్మి. 1.

లిబ్బులమేటి. దే. వి: చూ, లిబ్బిదొర. వేం. ఆం.15.

లిభి. సం. వి. ఇ, ఈ. స్త్రీ: చూ, రూ–లిపి.

లిమ్మ. దే. వి. ఈఁగలను దోలెడు రెమ్మ.

లియ్యము. వై. వి.=లీవ. ఒద్దిక: చూ, స్నేహము; విణ. 2. లయించినది: (సం). లీనము.

లివ. దే.వి: చూ, లాఘవము. 1. కళా. 3,ఆ.79.

లివలివ. దే. వి. దంతములు కదలుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

లిస్టు. వా. వి: చూ, రూ–లీస్టు.

## లీ

లీక్ష. సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ–లిక్ష.

లీఢము. సం. విణ. తినఁబడినది: అన్నము, అభ్యవహృతము, ఆశితము–ఆశితము, ఖాదితము, గళితము–గ్రస్తము, గ్లస్తము, చర్వితము, జక్షితము, జగ్ధము, ప్రత్యవసితము, ప్రాశితము, ప్సాతము, భక్షితము, భుక్తము, లి ప్తము. తద్వి.–౧. అనుభవింపఁబడినది:— అనుభుక్తము, అనుభూతము, ఆస్వాదితము, ఉపభుక్తము; ౨. మ్రింగఁబడినది.–గిలితము—గిలికము, గ్రస్తము; 3. నమలఁబడినది: చర్వితము; ర. తినఁదగినది: ఖాద్యము, ప్సాతము. భక్షణీయము, భక్ష్యము. ౫. త్రాగఁబడినది: ఆపీతము, పీతము, ప్రాశితము, స్వాదితము. ("చూ, స్వాదితము.") (చూ, సాపాటు.)

లీనము. సం. విణ. 1. లయించినది: (తె).—లియ్యము; 2. కరఁగినది: ద్రుతము. తద్వి.–౧. కరఁగఁబడినది: విద్రుతము; ౨. కరగింపఁ బడినది: అవదీర్ణము; అం. 3: చూ, కరణములు; 4: చూ, గమకములు.

లీపువత్సరము. అం. ఫిబ్రవరినెలకు 29 తేదులు వచ్చెడి వత్సరము. అనఁగా నాలుగుచే శేషములేకుండఁగ భాగింపఁబడు వత్సరము: చూ, సంవత్సరములు.

లీయె. దే. వి. పూగఖండము, వక్క. ఆం. పదా. 6–68: చూ, పీయె.

లీల. సం. వి. ఆ. స్త్రీ. 1. క్రీడ: చూ, వోళి. 5; 2. శృంగారచేష్ట: చూ, విలాసము. 2; 3. క్రియ: చూ, వ్యాపారము. 1; 4: చూ, సయాట; అం. 5. ప్రేమాధిక్యమున వేషభాషణాదులచేత ప్రియుని అనుకరించెడి స్త్రీ శృంగారచేష్టావిశేషము (సంశ్లేషము లీల అనఁబడును): చూ, శృంగారచేష్టలు; దే. వి. (1). రీతి: చూ, విధము. 1.

లీలావిలోకితము. అం: చూ, జన్యతాళములు.

లీస్టు. వా.వి.రూ–లిస్టు. జాబితా, పట్టిక–పట్టీ.

## లు

లు. అవ. 1. ప్రథమా బహువచనప్రత్యయము; 2: చూ, రు.2. "ఆడేలు–ఆడెలు, కుందేలు–కుందెలు, తోఁడేలు–తోఁడెలు." మొ.

లుంగ. వా.వి. 1.బట్టల చేట్టు,2. వస్త్రభారము.
లుంగము. సం. వి. అ. పుం. పుల్లమాదిఫలము*. రామా. 5, ఆ. 239: చూ, సుపూరము.
లుంగి. సం. వి. ఈ. స్త్రీ. 1. మాదిఫలము చూ, సుపూరము; దే. వి. (1) కుల్లాయు కుప్పసములు చేర్చికుట్టిన పావడ, రూ-లుంగీ: చూ, వస్త్రము.
లుంగీ. దే. వి: చూ, రూ- లుంగి. (1).
లుంటాకుఁడు. సం. వి. అ. పుం. 1. దొంగ: చూ, చోరకుఁడు. 1; విశే. 2. దోఁచుకొను వాఁడు: చూ, చోరకుఁడు. 1.
లుంఠనమగు. మి. అ. క్రి: రూ-లుఠనమగు. (తె.ప): ఉరలఁబడు-ఉర్లఁబడు, ఉరలు-ఉర్లు, దుల్లు-డొల్లు, దొరలు-దొర్లు, పొరలఁబడు_పొరలాడు_పొరలియాడు- పొర్లాడు-పొరలు_పొర్లు-పొరలువెట్టు.
లుంఠనము. సం. వి. అ. న. 1. భూమిమీఁది పొర్లిక: రూ-లుఠనము, అవలుంఠనము. (అవ్య).-తు. (తె).—పొరటు, పొరలాట, పొరలిక-పొర్లిక; 2. గుఱ్ఱపుపొర్లిక: రూ-లుఠనము.
లుక. దే. వి. అక్కసీచగతి: చూ, హాయము.
లుకలుక.దే.వి.పరుగెత్తుట, పురుగులు తొలుచుట లోనగు వాని యందగు ధ్వన్యనుకరణము: చూ, హాహాహూ. [చూ, సంభ్రమించు.
లుకలుకలాడు. దే.అ.క్రి. (లుకలుకలు+ఆడు):
లుక్కు. సం. వి. చ్. పుం. 1. వెలితి: చూ, లోపము. 2; 2. కోఁత: చూ, లవనము.
లుక్సమాసము. అం. (చూ, అలుక్సమాసము.) విభక్తిలోపముగలది లుక్సమాసము. అది ద్వితీయాది విభక్తులతో సమసించును. (ఉదా:౧. ద్వి-త.-గజారూఢుఁడు, దుఃఖాతీతుఁడు; ౨. తృ-త.- మానపూర్వుఁడు, పితృసదృశుఁడు; 3. చ-త.- జనసుఖము, గోహితము; ౪. పం-త.- చోరభీతి, రాజభయము; ౫. ష-త.-తరుశాఖ, జనపదవ ౬. స-త.-దైవాధీనము.): చూ, సమాసము
లుగచెడు. దే. అ. క్రి. బాగుతప్పు, బీసయు
లుగసాను. వా. వి. రూ-లుగ్సాను, నష్టవ చూ, నేగి. 4.
లుగ్సాను. వా. వి. — పై.—
లుచ్ఛా.వా.వి. తుచ్ఛుఁడు: చూ, వ్యాఘుఁడు
లుఠనమగు. మి అ. క్రి: చూ, రూ-లుంఠనము
లుఠనము. సం. వి. అ. న: చూ,రూ—లుంఠనవ
లుఠితము సం. విశే. భూమిమీఁద పొర్లాడి (గుఱ్ఱము): అవలుంఠితము, ఉపావృత్తవ (చూ, హయము).
లుఠితుఁడు. సం. వి. అ. పుం. కణి: చూ,వస్తా
లుడుగు. దే. వి. ఎద్దుమెడనుగట్టు నొకగక గంట: చూ, వీణ. 1.
లుప్తము. సం. వి. అ. న. 1. దొంగసొమ్ము చూ, హిరణ్యము. 3; విశే.2. లోపించిన చూ, హీనము. 1; 3. కోయఁబడినది: చు వృక్ణము. 2.
లుప్తోపమాలంకారము. అం: చూ, అలంకారమ 3. ("ఉదా:—నీమోము సోమునింబోలు. (చూ, పూర్ణోపమాలంకారము.)
లుబ్ధకము. సం. వి. అ. పుం. ఆర్ద్రానక్షత్రము చూ, సత్తు. 1 (రిక్కా. ౬.)
లుబ్ధకుఁడు. సం.వి. అ. పుం. 1. బోయవాఁడు చూ, వ్యాధుఁడు. 1; 2: చూ, లోభి.
లుబ్ధుఁడు. సం. వి. అ. పుం. 1. బోయవాఁడు చూ, వ్యాధుఁడు. 1; విశే. 2. (ఏవిషయమందైనను తెంపులేని) ఆసగలవాఁడు: ముక్తుఁడు, అభియుక్తుఁడు, అభిలాషకుఁడు అభిలాషి,అభ్యాగారికుఁడు,ఆసక్తుఁడు,ఉ ద్ధి, గర్ధనుఁడు (గర్ధనము),గృధువు-గృధ్ను చికీర్షువు,తత్పరుఁడు,తృషితుఁడు, తృష్ణకు పరాయణుఁడు, ప్రవణుఁడు, ప్రసితుఁడు

లంపటుఁడు. (తె. ప).—ఆసగలాఁడు; 3. పిసినిగొట్టు: చూ, లోభి.

లుబ్బ. వా. వి. 1. కండ(చూ, కండరములు); 2. ముద్ద.

లుబ్బలుబ్బలు. వా. వి. బ. 1. కండకండలు; 2. ముద్దముద్దలు. [మహిషము, 1.

లులాయము. సం. వి. అ. పుం. మన్న: చూ,

లులి. దే. వి. తక్కువ: చూ, సొడ్డు. 1.

లులితము. సం. విణ. చలించినది: చూ, పలితము. 3.

లులిపడు ద్వ. అ. క్రి: (మి).-హీనమగు (తె).- అలుగుడువడు. సా. 4, ఆ 16.

లుల్లిగాఁడు. దే. విణ: చూ, హీనుఁడు.

## లూ

లూటి. దే. వి. రూ-లూటీ. 1. ఉపద్రవము. రామా. 7, ఆ. 9: చూ, విపత్తు; 2. దొడ యందలి వ్రణము: చూ, వ్రణము. 2; 3: వ్రణ రంధ్రము: చూ, వ్రణము. 2; వా. 4. కొల్లఁగొనుట: చూ, యుద్ధము. ౬.

లూటీ. దే. వి. —పై.—

లూట్టు. అం. ఆశీరాద్యర్థకము. (చూ, లట్టు. 3.)

లూడుపులు. దే. వి. బ. పాదరక్షలు: చూ, సమ్మాళిగలు.

లూత. సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, సాలెపురుగు; 2. చీమ: చూ, పీర (పిపీలిక); 3. ఒకానొకరోగము: చూ, పానువు. 4.

లూనము. సం. విణ. కోయఁబడినది: చూ, వృక్ణము. 2.

లూమము. సం. వి. అ. న్. న. (గుజ్జములోనగు వాని) తోఁక: చూ, వాలము. 1.

లూలామాలము. దే. వి: చూ, వంచన.

లూలి. వా. వి. కుట్టని: చూ, కంథళి.

లూషిక. సం. వి. అ. స్త్రీ: చూ, సాలెపురుగు.

## లృ

లృట్టు. అం. భవిష్యదర్థకము. (చూ, లట్టు. 3.)

## లె

లెంక. దే. వి. రూ-లేఁక: చూ, సేవకుఁడు. రామా. 2, ఆ. 9.

లెంటు. దే. వి. పటికము. (అప్రి): చూ, స్థూలోచ్చయము. 1. (రత్నములు12-(3).)

లెంప. దే. వి. 1. ప్రక్క: చూ, పార్శ్వము. 2; 2. రూ-చెంప, గదవు, గదద-గవుద-గౌద, చెంక-చెక్క-చెక్కిలి-చెక్కు, చెరవ, చెలిపి, పుక్క-బుగ్గ. (సం).—కపోలము. తద్వి.—పాలబుగ్గలు.

లెంపకాయ. దే. వి: చూ, రూ-చెంపకాయ.

లెంబి. దే. వి: చూ, రూ-లంబి.

లెక్క. వై. వి. 1.=లక్ష్యమ్: చూ, లక్ష్యము. 1; 2.=లక్ష్య: చూ, సంఖ్య.

లెక్కగొను. ద్వ. స. క్రి. లెక్కించు: చూ, లెక్కసేయు.

లెక్కపెట్టు. ద్వ. స. క్రి. 1.—వై.—; 2. ఎన్నికచేయు: చూ, లెక్కించు. 2.

లెక్కలగుఱుతులు. వా. వి. బ: ౧. + ప్లస్=కూడిక; ౨. — మైనస్=తీసివేత; 3. × ఇంటు=గుణకారము; ౪. ÷ డివైడెడ్బై=భాగహారము; ౫. ∴ దేర్‌ఫోర్=కాఁబట్టి; ౬. ∵ బికాజ్=ఎందుచేతననఁగా; ౭. % పెరసెంటు=నూటికియింతఅని; ౮.= ఈక్వెల్‌టు=సమానము; ౯. ( ) స్మాల్‌బ్రాకెట్టు=చిన్నబ్రాకెట్టు; ౧౦. { } లార్జిబ్రాకెట్టు=మధ్యబ్రాకెట్టు; ౧౧. [ ] స్క్వేర్ బ్రాకెట్టు=చేదరపు బ్రాకెట్టు. మొదలగునవి.

లెక్కవాఁడు. వా. వి. కరణము: చూ, సంప్రతి.

లెక్కసేయు. వై. స. క్రి. 1. (కాశీ. 6, ఆ. 293): ఉఱు, కయికొను-కైకొను, కొను,

గణుతించు, గుర్తించు, గుఱించు, గుఱికొను, లెక్కగొను, లెక్కపెట్టు, లెక్కించు, సడ్డ చేయు, సరకుగొను, సరకుసేయు. (సం.ప.)- లక్ష్యపెట్టు,లక్షించు ("చూ,సరకుసేయు"); 2: ఎంచు. ఎన్నికచేయు, ఎన్నికపెట్టు, ఎన్నికయిడు, ఎన్ను, గణుతించు, గణుతి చేయు, లెక్కపెట్టు, లెక్కించు. (సం.ప.)- గణించు, పరిగణించు.("చూ,సరకుసేయు.")

లెక్కించు వై. స. క్రి.—పై.—

లెటరు. వా. వి. జాబు: చూ, లేఖ. 3.

లెప్ప. దే. వి. రూ—లెప్పము-రెప్పము. గుణి. (భో. 3, ఆ. 240): చూ, లక్ష్యము. 1.

లెప్పము. దే.వి.1.—పై.—;వై.వి. 2.=లేప్య. సున్నపుగచ్చులోనగునది, లేపము: చూ,సోద.

లెమ్మ. వా. అవ్య: చూ, రూ-లే. 4.

లెస్స దే. వి. 1. క్షేమము: చూ, శుభము. 1; విశే. 2 క్షేమయుక్తము. స్వా. 5, ఆ. 4: ఆరఁగూరుట; 3: చూ, యోగ్యము. 1; 4. శ్రేష్ఠము. నిర్వ. 8, ఆ. 81: చూ, శ్రేష్ఠ్యము; 5. మంజులము: చూ, హృద్య ము; అవ్య. 6. సాధూక్తి. [సజ్జనుఁడు.

లెస్సవాఁడు. దే. విశే. యోగ్యుఁడు; చూ,

## లే

లే. దే. విశే. రూ-లేఁత. 1. అల్పము: చూ, స్వల్పము; 2. వృత్తియందు లేఁతశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూప ము. (దీనికి పరుషములు పరమగుచో నుగా గమంబగు. ఉదా.—లేఁగప్పు, లేఁగరువలి, లేఁగొడుకు, లేఁగొన, లేఁగొమ్మ, లేఁగొను, లేఁజెందురుఁడు, లేఁజివ్వాడు, లేఁజోను, లేఁజిగురు, లేఁజీఁకటి, లేఁజొంపు, లేఁజూ లు, లేఁదెక్కు, లేఁదెమట, లేఁడగిరిస, లేఁదడి, లేఁదరఁగ, లేఁదాఁకు, లేఁదూఁడు, లేఁదెర, లేఁదేఁటి, లేఁబట్టి, లేఁబాపఁడు, లేఁబాయము, లేఁబొవ,లేఁబొన్న, లేఁబొర, లేగాడ్పు, లేజేవరాలు, లేజోటి, లేవగవు, లేనడుము, లేనెల, లేబిత్తరి, లేబుడుత, లేమావి, లేమోక, లేయనఁటి మొదలగునవి; అవ్య. 3. నిశ్చయార్థకము. "ఔలే, దాని కంటె ఇదివిశేషములే."); వా. 4 లెమ్మ. "శీఘ్రముగాలే. రైలుకుఁబొమ్మ." "నిద్ర నుండిలే. బడికిపొమ్మ." (అప్ర.)

లేఁక. దే. వి: చూ, రూ—లెంక. అచ్చ. యు, కాం. 227.

లేఁగ. దే. వి. (లేఁత+కానుపు) 1.క్రొత్తగా పుట్టినదూడ, తర్ణకము: చూ, సౌరభేయి (ధేనువు. 3ఒ.), 2. దూడ, వత్సము: చూ, ధేనువు. [మా, ధేనువు.

లేఁగటియావు. దే. వి. లేఁతదూడగలఆవు:

లేఁగసవు. ద్వ. వి. బాలతృణము, ఘాసము: చూ, హరిత. 1 (తృణము. 1.)

లేఁగొను. దే. వి. కవును. సాంబ. మాన. ౧౫: చూ, వీఁగు. 1.

లేఁత. దే. విశే. 1. బాలకుఁడు. అం, భా. ద్వి. 118: చూ, శిశువు; 2. అల్పము: చూ, స్వల్పము, 3. లేఁతది: (తఱపి అనుపదము కడ "లేఁత. 1" అనుదానిని "లేఁత. 3." అని దిద్దుకొనవలయును):తఱపి, లేమ. (సం. ప).—అపక్వము. (చూ, అపక్వము. 1-2); 4. చులుకన. స్వా. 3, ఆ.33: చూ, లాఘ వము. 1; 5. గోము: చూ,సుకుమారము. 2; (మఱియు దీనికి వృత్తియందు కొంచెము, చిన్న, తిన్న, తేలిక, పలుచ, మెత్త, సన్న మొదలగు అనేకార్థములుగలవు. చూ, లే.)

లేఁతకాయ. దే. వి. పచ్చికాయ: చూ, శలా టువు. 2.

లేఁతమొగ్గ. వా. వి.పసరుమొగ్గ:చూ,మొగ్గ. 1.

లేఁతయొఱపు. దే. వి. పర్యా:చూ,వర్ణము. 6.

లేఁతసారకాయనఅనుట. జా. (సారకాయకోఁతలు) దంభములుపలుకుట, కార్యనిర్వహణశక్తిలేనిమాటలు చెప్పుట. "మీరు లేఁతసారకాయలుననుకుహారు" (ధర్మజరాజసూయము.)

లేఁబగలు. దే.వి.(లేఁత+పగలు) 1. పూర్వాహ్ణము. పాండు. 5, ఆ. 283: చూ, వాసరము; వా. 2. అపరాహ్ణము: చూ, వాసరము. (చూ, మధ్యాహ్నము.)

లేఁబరువు. వా. విశ. లేఁతపరువుగలది(కాయ)

లేఁబోక. దే. వి. (లేఁత+పోక) మందగమనము: చూ, సంచారము.

లేఁబొద్దు. ద్వ. వి. (లేఁత + పొద్దు) అపరాహ్ణము: చూ, వాసరము. (సందెజాము.)

లేక. వై. వి. 1 =లేఖ.జాబు. ప్రభా. 4, ఆ. 43: చూ, లేఖ. 3; 2.=రేఖా. ఎడము లేక మిక్కిలి చేరికయగు వృక్షాదుల వరుస: చూ, శ్రేణి. 1; 3: చూ, సమూహము.

లేకరి. ద్వ. వి. (లేక +అరి): చూ, లేఖకుఁడు. (వైకృతిలేఖిక అని పురుషోత్తమకవీయము.)

లేకి. దే. వి. 1. రాలిన ధాన్యపుగింజలు; విశ. 2. లేకివాఁడు: చూ, వ్రిజె.

లేకిబ్రదుకు. దే. వి. లేకిగింజలేఱికొని బ్రతికెడు బ్రదుకు: పరిగెబ్రదుకు_పఱిగబ్రదుకు. (సం.ప.)—ఉంఛము, ఋతము.(చూ,స్థితి.4)

లేకివాఁడు. దే. విశ. 1. లేకిగింజలేఱికొని బ్రదికెడువాఁడు; 2: చూ, లేకి. 2.

లేఖ. సం. వి. ఆ. స్త్రీ. 1.=రేక. రేఖ, రాజి: చూ, శ్రేణి. 1; 2. లిపి: చూ, వ్రాఁత; ఆ. స్త్రీ, అ. పుం. 3.=లేక. కర్మ, రేఖ, పత్రి, స్వస్తిముఖము. (తె. ప).— ఆకు, కమ్మ, చీటి, జాబు, రేక, లెటరు, లేక. వ్రాయసము (రాయసము). తద్వి.— ౧. చిన్న యుత్తరమునకు.— ఖండపత్రిక. (తె).—ఆకు, పుకోణి; ౨ ఉల్లాసనకు.— (తె).—ఉల్లాకు- ఉళ్ళాకు, కిల్లాకు-కిళ్ళాకుచీటి-కిళ్ళాకుచీటి; 3 రాజలేఖకు.— (తె).— రాయసము ("చూ, స్వస్తిముఖము"); అ. పుం. 4. ఇచ్చిపుచ్చే కోలుపత్రము. (తె).—ఉత్తరము. తద్వి.— అధికారపత్రమునకు.—చీరకము.

లేఖకుఁడు. సం. వి. అ. పుం.=లేకరి. 1: చూ, వ్రాఁతకాఁడు; 2: చూ, సంపత్రి.

లేఖగము. సం. వి. అ. న. ఆకసము: చూ, సురవర్త్మము.

లేఖనము. సం.వి.అ న. 1. లిపి: చూ, లేఖ. 2; (లేఖనభేదములు — రేఖాలేఖనము, రేఖాచిత్రము; చిత్రఫలకము: యంత్రగత రేఖాలేఖనము; ప్రతిమాలేఖన-నమూనా చిత్రలేఖనము; ప్రమాణరేఖలేఖనము మొ). 2: చూ, వాంతి; 3: కవచపత్రము,కుచందనము, కృత్తి, చర్మ, పత్రాంగము, భుజపత్రము, భూర్జపత్రము, భూర్జము, మృదుత్వక్కు, రక్తచందనము. (తె.ప).-బుజేపత్రి-బుజేపత్రి; అం. 4: చూ, ఉపవిద్యలు. 2.

లేఖని. సం వి. ఈ. స్త్రీ చూ, రూ_లేఖిని.

లేఖనికుఁడు. సం. వి. అ. పుం. 1. జాబుకొనిపోవువాఁడు; 2. తనకుఱుతిడ నొకరిచే వ్రాయించువాఁడు. [తవ్యము, లేఖ్యము.

లేఖనీయము. సం. విశ. వ్రాయఁదగినది: లిఖి

లేఖర్షభుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రుఁడు: చూ,సహస్రాక్షుఁడు.

లేఖశాటము. సం. వి. అ. పుం:చూ,విరిగి. 2. *:

లేఖహారకుఁడు. సం. వి. అ. పుం. జాబుకొనిపోయియిచ్చేవాఁడు.(చూ, లేఖనికుఁడు.1.)

లేఖితము. సం. విశ: చూ, లిఖితము. 3.

లేఖిని. సం. వి. ఈ. స్త్రీ. 1. చిత్తరువువ్రాసెడు తూలిక: రూ-లేఖని, ఆలేఖని, ఇషీక-ఈషిక, కంఖటి, కలని, వర్ణరేఖ. (తె).—కుంచియ-కుంచె; 2. పలకమీఁద

వ్రాయు సాధనము: రూ-లేఖని, ఖటిక-ఖటిని, ఘటిక, (తె).—కడ్డీ-కడ్డీ, కోపు, పలకపుల్ల, బలపము: 3. వ్రాయు సీసపుపోఁతపుల్ల: రూ-లేఖని, ఇషీక-ఈషిక, కలమము, కూచిక-కూర్చిక, తూలిక. (తె) —ఇముకలము, కలపకట్టియ-కలపకట్టె, కలము, పెనసలు-పెన్సలు-పెనిసిలు-పెన్సిలు, కలము, పేనా; 4. అయోలేఖిని, తాటాకుమీఁదవ్రాయు సాధనము: రూ-లేఖని, ఇషీక-ఈషిక, గంటము; 5. వ్రాసెడియినుపకలముయొక్క మొన: రూ-లేఖని. (తె):—పాళి-పాళీ; 6. గొట్టములో సిరాపోసి పాళీమీఁద జాఱునట్లు వ్రాయుపుల్ల. (ఊటకలమని కొందఱు. ఇది ఫౌంటెన్ పెన్.) ఇత్యాది.

లేఖుఁడు. సం. వి. అ. పుం: చూ, వేలుపు.

లేఖ్యపత్రికము. సం. వి. అ. పుం. తాటిచెట్టు: చూ, శ్రీతాళము.

లేఖ్యము. సం. వి. అ. న. 1. వ్యవహారవిషయమైన వ్రాఁత: చూ, వ్రాఁత; విణ. 2: లిఖితవ్యము, లేఖనీయము.

లేచినవాఁడు. దే. విణ: (సం.)—ఊర్ధ్వజ్ఞుఁడు.

లేచే. దే. అ. క్రి. 1. ఉత్థితమగు: చూ, లేఁగు 1; 2. నిద్రతెలియు: తెలియు, మేలుకాంచే, మేలుకను-మేలుకొను—మేల్కను—మేల్కొను; 3: ఉబ్బు, పొటమరించే, పొటమరిలు—పొటమరిల్లు.

లేచేట. వా. వి: బింకము—బింకేము, లేవడము. (సం.వి.)—ఆక్రంతకము. తద్వి:—ఉత్థానము.

లేట. దే. వి. కొమ్మ. అచ్చ. బాల, కాం. 138: చూ, శాఖ. 1. [1. నిర్వ. 4, ఆ. 48.

లేటమొగమువడు. ద్వ. అ. క్రి: చూ, మడవు.

లేటి. దే. వి. రూ. లేడి. 1. జింక. య. 1, అ 110: చూ, హరిణము. 1; 2. ఆఁడుజింక, మృగి. య. 2, అ. 17: చూ హరిణము. 1; 3. మగజింక: చూ,హరిణము. 1.

లేటిమొగ్గలమేటి. దే. వి. చేండమామ. వేం, అం. 11: చూ, హిమాంశువు. [గతించిన.

లేటు. వా. విణ 1. ఆలస్యము.; 2. వెనుకటి,

లేడి. దే. వి: చూ, రూ—లేటి.

లేడికంటి. దే. వి. లేడి కన్నులవంటి కన్నులుఁగలఆఁడువి, మృగాక్షి: చూ, స్త్రీ.

లేదు. దే. వి. 1: చూ, వెలుఁగుబంటి. భో. 4, ఆ. 242. (ఇది అపూర్వపదము); అవ్య. 2. నఞర్థకము: చూ, ఞానప్యము.

లేదుబంతి. ద్వ. వి: రూ—లేదుబంతీ. బొంక; పా. 3, ఆ. 219: చూ, వితథము.

లేదుబంతీ. ద్వ. వి.—పై—

లేనగవు. దే. వి. స్మితము: చూ, హాస్యము. 1.

లేనిమాట. దే. వి. 1. కల్ల జగడము: చూ, పోరము. 2 (యుద్ధము. ర.); 2. పట్టిమాట: చూ, నింద. 1. [చూ, నూనరి. 3.

లేపకుఁడు. సం. వి. అ. పుం. ఉప్పరవాఁడు:

లేపనము. సం. వి. అ. న. 1. అలుకుట, మెత్తు, (సం.)-ఉపలేపనము, గోముఖము, లిపము, (చూ, సమాలంభము. 1); 2.=లేపు. పూఁత: చూ, సమాలంభము. 1; 3: చూ, సాపాటు; అం. 4: చూ, తారాక్రియలు.

లేపనముచేయు. మి. స క్రి: (తె).—అలఁదు, అలుకు—అల్కు, కలుకు, గునియు, గునిసాదు, చేమురు, పంకించే, పట్టించే, పులుపు, పూయు, ప్రాము, మెత్తు, మేఁగు-మ్రేఁగు-మ్రేవు, తద్వి.—౧. అ. క్రి: ఓరవీయు; ౨. స. క్రి: అప్పళించే, పూయు.

లేపము. సం. వి. అ. పుం. 1. పూఁత: చూ, సమాలంభము. 1; 2. రూ-లేపము: చూ, సాపాటు; 3. సున్నములోనగునది: చూ, సోద.

లేపు. దే. వి. 1: చూ, లేబ; 2 జాలు: చూ, వెండ్రుక. 1; పే. 3 లేవఁజేయు; పై. వి. 4.=లేపన. పూఁత: చూ, సమాలంభము. 1.

లేప్యము. సం. వి. అ. న. 1 పూఁత: చూ, సమాలంభము. 1. విణ. 2. =లప్యము-లెప్యము. పూయఁదగినది.

లేబరము. దే. విణ. 1: చూ, శూన్యము. 1. కాశీ. 1. అ. 137; 2. వమ్ము: చూ, వ్యర్థము.

లేబరు. వా వి. 1. శరీరకష్టము. 2. వ్యర్థము.

లేమ. వై. స్త్రీ. 1. ఆఁడుది: చూ, స్త్రీ; విణ. 2: చూ, లేఁత. 3.

లేమరి. దే. వి. ఉన్మాదుఁడు. ఆం, భా. త్ర. 7: చూ, వెఱ్ఱివాఁడు.

లేమావి లాయపు రేజి రౌతు. ద్వ. వి: చూ, మన్మథుఁడు. వేం, ఆం. 8.

లేమి. దే. వి. రూ—లేమిడి-లేవడి. 1. కలుగమి. రాహిత్యము: చూ, శూన్యము. 1; 2. ఉండమి; 3. దారిద్ర్యము. విక్ర. 2, అ. 138: చూ, సీదరము. 1.

లేమిడి. దే వి (లేమి + ఇడి): చూ, రూ-లేమి. 3

లేలిహానము సం. వి. అ. పుం. 1. రూ— లేలీహానము: చూ, సర్పము; విణ. 2. మాటిమాటికి లేహనము చేయునది.

లేలీహానము. సం. వి. అ. పుం.—పై.—

లేలేదు. దే. అవ్య. నఞర్థకము, కాకాదు: చూ, శూన్యము. 1.

లేవ. దే. వి. 1. గుఱ్ఱపుఁకలాటము: చూ, భూషణము. 2, 2. ఏనుఁగు మీఁదఁబఱచెడి యెఱ్ఱని కంబళి: చూ, సాశూకము (రల్లకము. ౨.); వా. 3. బలిమి, చేవ. "నీ లేవ నే నెఱుఁగుదును.": చూ, శక్తి. 1. [వికలాంగుఁడు.

లేవజోలని వాఁడు. దే. వి. ఖంజోఁడు: చూ,

లేవడము. దే. వి. 1: చూ, లేచేట; వా. వి. 2. నిద్రనుండి లేచేట:

లేవడి. దే. వి: చూ, రూ-లేమి. 1—2—3; విణ. 4. దరిద్రము. నై. 2, అ. 11; పాండు. 4, అ. 77: చూ, సీదరము. 1. [లియు. 2.

లేవలేకపడు. వా. అ. క్రి. ఎత్తువడు: చూ, వ

లేవిడి. వా. వి. రూ-లేవుడి. 1. అవమానపఱచేట. "వాఁడు నన్ను మోచి లేవిడీలు కొట్టుచేస్నాఁడు"; చూ, హేళనము; 2. సంకెళ్లువైచి దొంగను వీధివీధికి త్రిప్పుట.

లేవుడి. వా. వి.—పై.—

లేశము. సం. వి. అ. పుం.=లేసు. 1. కొంచెపుఁదనము: చూ, స్వల్పము; విణ. 2. కొంచెము: చూ, స్వల్పము; అం. 3: చూ, అలంకారము. 3. (దోషగుణములు గుణదోషములు గాఁ జెప్పుట. "ఉదా.—చిలుక నీకుఁబంజరబంధము నీమధురవాక్కుల ఫలమేకదా!")

లేష్ట (ష్టు) వు. సం. వి. ఉ. పుం: చూ, లోష్టము.

లేసు. వై. విణ.=లేశ. 1. చులుకన: చూ, లాఘవము. 1; 2: చూ, సులభము; వా. 3. ఒకరకము అల్లికపని.

లేహనము. సం. వి. అ. న. అవలేహనము. (తె).—నాకుట.

లేహము. సం. వి. అ. పుం. 1; చూ, సాపాటు; వా. 2: చూ, లేహ్యము. 1.

లేహ్యము. సం. వి. అ. న. 1. నాకిభుజింపఁదగినమందు: రూ-లేహము; 2. నాకిభుజింపఁదగిన వ్యంజనవిశేషము: చూ, వ్యంజనము. 1; 3. అమృతము: చూ, సుధ. 1; విణ. 4. నాకఁబడినది; అం. 5: చూ, భక్ష్యములు; బ. 6: చూ, లేహ్యములు.

లేహ్యములు. అం: కుండల్యాది, కుసుమార్ద్రాది, క్షుద్రభయాది, ఖండార్జిత, చతుష్షష్టి మరీచ్యాది, పిరంగ్యాది, పిప్పల్యాది, బింబార్ద్రిక, బిల్వాది, భల్లాతకి, మహేశ్వర లేహ్య ప్రభృతులు.

## లై

లైంగము. ఆం. (ఇది ౧౧౦౦౦ శ్లోకములు) నందికేశ్వరప్రణీతము): చూ, పురాణములు.

లైటు. వా. వి. చిమ్నీఁబెట్టి వెలిఁగించెడి దీపపుగూఁడు (చూ, లాంతరు.)

లైను. వా. వి. వరుస, క్రమము, మార్గము.

లైసెను. వా. వి. సెలవుచీటి. (లైసెన్సు.)

లొ

లొంక. దే. వి. కోన, అడవి: చూ, విపినము.

లొంగు. దే. అ. క్రి. రూ—లోఁగు—లోవు. 1. లోఁకువగు: చూ, లోఁబడు; 2. వెనుదీయు: చూ, సుక్కు. 7.

లొండు. దే. వి. లోటు, నీరుటెంకి: చూ, సరస్సు. 1. [చూ, సదనము 1.

లొంప. దే. వి. చిన్నఇల్లు, టొంప, కొంప:

లొంపు. దే. వి. ఒకతెగ: చూ, సమూహము.

లొక్కు. వా. వి. లోఁకువ. "భర్తకు భార్య లొక్కు." :చూ, వశము. 1.

లొగ్గడి. దే. వి. 1. క్షోభము: చూ, సంతాపము; వా. 2. కలగలపువని. [క్షోభించే

లొగ్గడిల్లు. దే. అ. క్రి. క్షోభించే: చూ, సం

లొచ్చ. దే. వి. రూ—లొజ్జె. 1. తక్కువ: చూ, సొడ్డు. 1; విశే. 2. నీచము: చూ, హీనము. 1.

లొజ్జె. దే. వి. విశే.—శై.— (తక్కువకు.- అచ్చ. బాల, కాం. 177.)

లొట. దే. విశే: చూ, రూ-లొట్ట. 5.

లొటకజిట్ట. దే. వి: చూ, లొట్టకన్నుజిట్ట.

లొటలొట. దే. వి. కాఱుట, పోవుట, అంగిటఁ జేర్చిపుట్టించెడు ధ్వనిలోనగు వానియందగు ధ్వన్యనుకరణము: చూ, హలాహలా.

లొటలొటమను. దే. అ. క్రి. లొటలొటయని ధ్వనించే: చూ, శబ్దించే.

లొటారము. దే. వి. 1. తొఱ్ఱ: చూ, రంధ్రము. 1; 2. బెజ్జము: చూ, రంధ్రము. 1; 3. లొట్టి, లొత్త, సుషిరము: చూ, రంధ్రము. 1; 4. రిక్తత: చూ, శూన్యము. 1.

లొటిపిట. ద్వ. వి: చూ, రూ—లొట్టిపిట్ట.

లొటిపిట శూలరోఁకండ్లఁగానిపోదు. లో.—"ఉదా.—కఠినతరవాక్యములచేతఁగాని చక్కఁగాదు లొటిపిటశూలరోఁకండ్లఁగాని." (నిరంకుశో పాఖ్యానము.)

లొటిపిట్ట. ద్వ. వి: చూ, రూ-లొట్టిపిట్ట.

లొట్ట. దే. వి. మగగుఱి: చూ, శిశ్నము; 2. రుచిగల పదార్థములఁ దినునపుడు నాలుకను అంగిటఁజేర్చి పుట్టించెడు చప్పుడు. "లొట్టలు వేయుచు తినుచున్నాఁడు."; 3. రూ-లొత్త-లొటారము, పల్లము: చూ, రంధ్రము. 1. (ఆముదపులొట్ట=ఎండిన యాముదపుకాయ); 4: చూ, లొటారము. 3; విశే. 5. అణఁగినది. "లొట్టకన్ను.": రూ-లొట.

లొట్టకంటివాఁడు. దే. వి. క్లిన్నాక్షుఁడు, దించుకొనిపోయిన కన్నులు గలవాఁడు.

లొట్టకన్ను. దే. వి. దించుకొనిపోయినకన్ను: చూ, లోచనము. [పక్షి: చూ, పక్షి.

లొట్టకన్నుజిట్ట. దే. వి. లొటకజిట్ట, ఒకానొక

లొట్టకాయ. దే వి: చూ, లొట్ట. 1.

లొట్టపోవు. దే. అ. క్రి. అణఁగు: చూ, లోపించే.

లొట్టవేయు. దే. అ. క్రి. నాలుకను అంగిటఁ జేర్చి ధ్వనిపుట్టించే: చూ, శబ్దించే.

లొట్టాభట్టీయము. జా: చూ, రూ-లట్టాభట్టీయము. [ము. 3—౧౬.

లొట్టి. దే. వి. కల్లుదిసెడిముంత: చూ, భాండ-

లొట్టిపిట. ద్వ. వి: చూ, రూ—లొట్టిపిట్ట.

లొట్టిపిట్ట. ద్వ. వి. (లొట్టియ+పిట్ట): రూ—లొటిపిట—లొటిపిట్ట-లొట్టిపిట, లొట్టియ-లొట్టె, లొట్టెనుఁగు, ఒంటియ - ఒంటె. (సం. వ).—అధ్వగ, ఉరఃకిణము, ఉష్ట్రము, కంటకేచ్ఛువు, కంఠకాశనము, కులనాశము, కువాహలము, కేలికీర్ణము, క్రమేలకము-క్రమేలము, గ్రంథిపాత్రు, ధూమ్ర-

ఘూకము, బహుకరము, భోలి, మయము, మరుద్విపము, మహాంగము, లంబొష్టము, వక్రగ్రీవము, వగణము, వాసంతము, శృంఖలకము. తద్విశేషములు.—౧ ఒంటెపిల్లకు—ఒంటెపిల్ల, కడంతి-కడఁతి-కణఁతి, కటకరము.(సం).-కరభము; ౨. కాళ్లకు బొండకొయ్యవేసిన ఒంటెపిల్లకు.—(సం).—శృంఖలకము; 3: ఆఁడుఒంటె. (సం).—ఉష్ట్రి, ఉష్ట్రిక, కరభి; ౪. మహోష్ట్రమునకు.-(తె).-లొట్టెనుఁగు. ("చూ, శృంఖలకము.")

లొట్టిముచ్చే. దే. విణ. తాగుఁబోతు: చూ, శౌండుఁడు.

లొట్టియ. వై. వి.=ఉష్ట్ర రూ-లొట్టె (దే. అని శ. ర.): చూ, లొట్టిపిట్ట.

లొట్టె. వై. వి =—పై.—

లొట్టెనుఁగు. దే. వి. 1.—పై.—; 2. మహోష్ట్రము: చూ, లొట్టిపిట్ట.(ఆం,భా.ద్వి.265).

లొడపెట్టు. దే. స. క్రి. ద్రవద్రవ్యమును చేత కలపెట్టు.

లొడలొడ. దే. వి. 1. కాఱుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ; విణ. 3. బిగుతుకానిది: వదులు.

లొడారివాఁడు. వా. విణ. అంబేద: చూ, వ్యాధుఁడు. 2.

లొడితి. దే. వి: చూ, రూ-లొడితిలి.

లొడితిలి. దే. వి. రూ-లొడిత. ప్రదేశము, పాదేశము: చూ, హస్తము. 1.

లొడుగు. దే. వి. ఆవుమెడగంట: చూ, వీణ.

లొడ్డ. దే. విణ: చూ, రూ-బొడ్డ.

లొడ్డు. దే. విణ: చూ, రూ-బొడ్డు.

లొడ్డులొసుగు. జా. యావదాస్తి. మూటముల్లె.

లొత్త. దే. వి: చూ, లొట్ట. 3—4.

లొద్ద. దే. వి: చూ, రాశి. 1.

లొద్ది. దే. వి: చూ, లోయ. 1—2.

లొద్దిగ. వై. వి.=లోధ్ర*: చూ, రూ-లొద్దుగు.

లొద్దుగ. వై. వి.=: చూ, రూ-లొద్దుగు.

లొద్దుగు. వై. వి.=లోధ్ర*: రూ-లొద్దిగ-లొద్దుగ-లొద్దువు. (సం. వ) —అక్షివి, అమరమంజరి, ఉచ్ఛాదనము, ఉత్తాలకము, ఉత్సాదనము, కాండకీలకము, కాండనీలము, కాలహీనము, కేందుకము, క్షారదళి, ఘనత్వక్కు,—ఘనము, చిల్లి, చోరాపధము, తిరీటకము, తిరీటము, పట్టికాహ్వయము, మార్జనము, లోధ్రకము-లోధ్రము, వల్కలము, శళము, హేమపుష్పకము. తద్విశేషములు—౧ ఎఱ్ఱలొద్దుగు. (సం).-కషాయకృత్తు, క్రముకము, తిల్వకము-తిల్వము-తిల్వము, పట్టి, పట్టికాఖ్యము, పట్టికాలోధ్రము, రక్తలోధ్రము, లాక్షాప్రసాదనము; ౨: తెల్లలొద్దుగ. (సం).-అక్షిభేషజము, గాలవము, జీర్ణవృంతము, శాబరము-సాబరము, శ్వేతము: ("చూ, హేమపుష్పకము. 2".)

లొబ్బెస. దే. వి. లంబెస. లలంతికా విశేషము: చూ, భూషణము. 2-౫౬.

లొల్ల. దే. వి. దున్నిననేల సరుదునట్టిబల్ల.

లొల్లాపొత్తు. వా. వి. మిక్కిలి మైత్రి: చూ, స్నేహము. 1.

లొల్లి. దే. విణ. తఱచే: చూ, హేరాళము.

లొల్లెగాఁడు. వా. విణ: చూ, బీదవాఁడు. (సం).—ముష్టింపచుఁడు.

లొసుకు. వా. వి. వెలితి: చూ, సొడ్డు. 1.

## లో

లో. దే. అవ. 1. నిర్ధారణ షష్ఠియందు వచ్చెడు లోపలవర్ణమునకు మాఱుగా వచ్చునది. "దేవతలలో నిందుఁడుముఖ్యుఁడు"; వి. 2. లోనుశబ్దమునొక్క సప్తమీవిభక్తియందు నాక్షరములోపింపఁగా మిగిలిన రూపము, "నాలో నేమియుఁ గపటములేదు." (ఇది చోటుశబ్దమువంటిది.); 3. వృత్తి

యందు లోను లోపలశబ్దములకు మీఁదివర్ణములు లోపింపఁగా మిగిలిన రూపము. "లోఁబడు-లోఁచూపు" మొ; 4. దే. ద్రి: లో-లోను-లోపల.

లోఁకువ. దే. విణ. 1. లొంగి..., అధీనము: చూ, వశము. 1; 2 తక్కువ: చూ, సొడ్డు. 1.

లోఁగడ. దే వి. (లోను+కడ) 1. అంతరాళము: చూ, వఱదగుడి; 2. గతకాలము, ఇదివఱకు.

లోఁగిలి. ద్వ. వి. రూ-లోఁగిలి. (లోను + కలను) 1. గృహాంతర్భాగము; 2. ఇల్లు. చూ, సదనము. 1. (సంధిని వర్ణలోప వర్ణ వికారములు.)

లోఁగా. వా. అవ్య. ఈలోపల, క్రిందట.

లోఁగిలి. ద్వ. వి: చూ, రూ-లోఁగిలి. 1-2; 3. వాస్తువు, ఇల్లు మొదలైనవి యేర్పఱుపఁదగినభూమి: చూ, హరిప్రియ.2 (భూమి. 1.)

లోఁగు. దే. అ. క్రి. 1: చూ, రూ-లొంగు. 1; 2: చూ, రూ-లొంగు. 2; 3. అడఁగారు. రూ-లోవు: చూ, సుక్కు... 4; 4. చొచ్చు. పంచ. నా. 1, ఆ. 331: చూ, సోఁకు. 4.

లోఁగొను. దే. స. క్రి. (లోను + కొను) లోపల నడఁచుకొను.

లోఁచే. దే. ప్రే. లోఁగఁజేయు. [కల్లగించే.

లోఁడు. దే. స. క్రి. వేఁటులోనగువానితో

లోఁతిడి. దే. విణ. లోఁతులేనిది: (సం).—ఉత్తానము.

లోఁతు. దే. వి. 1. మిక్కిలిపల్లము: చూ, రంధ్రము. 1; విణ. 2. మిక్కిలిపల్లమైనది: కుక్కి... (సం).—గంభీరము-గభీరము.

లోఁదప్పు. వా. వి: చూ, వ్యభిచారము.

లోఁబడు. ద్వ. అ. క్రి. అధీనమగు: అగపడు-అబ్బు, అలవడు, చిక్కు, చేపడు, డొక్కారమునచొచ్చు, తగులు-తవులు-తొలు, తగులఁబడు-తగులుపడు-తవులుపడు - తొలుపడు, పట్టుపడు, పాలుపడు-పొల్పడు, లొంగు-లోఁగు-లోవు, లోనగు. (సం).—అధీనమగు, స్వవశమగు. ("చూ, స్వవశమగు.") (చూ, సంయుక్తమగు.)

లోకజనని. సం. వి. ఈ. స్త్రీ. 1. జగముతల్లి: చూ, లక్ష్మి.1; 2. గంగ: చూ, నది. [బుద్ధుఁడు. 1.

లోకజిత్తు. సం. వి. త్. పుం. జినుఁడు: చూ,

లోకనము. సం. వి. అ. న. అవలోకనము: చూ, వీక్షణము. [చూ, బుద్ధుఁడు.

లోకనాథుఁడు సం. వి అ. పుం. ఒకబుద్ధుఁడు:

లోకపావనము. సం. వి. అ. న. సుదర్శనచక్రము, విష్ణుచక్రము: చూ, హేతి. 4 (బాణము. 1.) [చుట్టము: చూ, సూర్యుఁడు.

లోకబాంధవుఁడు. సం. వి. అ. పుం. జగము

లోకమాత. సం. వి. ఋ. స్త్రీ. 1. జగముతల్లి: చూ, లక్ష్మి. 1; 2. గంగ: చూ, నది; ఋ. పుం. 2: చూ, వరుణుఁడు.

లోకము. సం. వి. అ. పుం. 1: చరాచరము, జగత్తు-జగతి-జగము, భువనము, విష్టపము-(తె. వ.)—జేగము, జాగా; 2. జనము, ప్రజ: చూ, సంతతి. 1; 3. కుటుంబము: చూ, సంసారము. 1; అం. బ. 4: చూ, లోకములు.

లోకములు. అం: స్వర్గ, మర్త్య, పాతాళములు; తద్వి —౧. ఊర్ధ్వలోకములు.— భూలోక, భువర్లోక, సువర్లోక, మహర్లోక, జనలోక (జన-జనర్లోక), తపోలోక (తపస్సు-తమము), సత్యలోకములు; ౨. అధోలోకములు.- అతల, వితల, సుతల, రసాతల (రస-కుండిక), మహాతల, తలాతల, పాతాళములు; 3: ఇహలోక పరలోకములు అని రెండు; ౪: (చూ, నరకములు); ౫. అగ్నిలోకమునకు.—జ్వాలామాలము; ౬. అసురీయమను లోకమునకు —అసురీయము; ౭. పాతాళలోకమునకు.—తలము, పాతాళము. (తె.-

వ).—నేలయడుగు. తద్వి. (౧) అంధకారము, అంధకము, (౨) అధోభువనము, (3) ఉత్పలము, (ర) చైత్యాలయము, (౫) జలలోకము, (౬) నాగలోకము, నాగవాసము, (౭) పాతాళము, (౮) బలిసద్మము, (౯) భోగవతి, (౧౦) రసాతలము; ౭. భూలోకమునకు.—ప్రపంచము, భూలోకము మధ్యలోకము; ౯. వాయులోకమునకు.—కుండహితము, కుముదాధారము; ౧౦. సూర్యలోకమునకు — ఛాయాపతి, ౧౧. పితృదేవతల లోకమునకు.— పరమాధిపి, ౧౨. (చూ, దేశములు). మొ. ("చూ, స్వర్గము.")

**లోకసమ్మతము.** సం. వి. అ. న చంద్రుని గొడుగు: చూ, వారిత. [విశేషాంశములు.

**లోకాభిరామాయణము.** వా. వి. లోకములోని

**లోకాయతనము.** సం. వి. అ. న. స్వభావమునకుఁ గర్తృత్వము చెప్పునట్టి మతము (చార్వాకమత శాస్త్రము.)

**లోకాయతికుఁడు.** సం. వి. అ. పుం. లోకాయతమతస్థుఁడు (చార్వాక శాస్త్రమును జదివినవాఁడు.)

**లోకాలోకము.** సం. వి. అ. పుం. చక్రవాళము, భూమిని చుట్టుకొనియుండు కొండ: చూ, పర్వతము. [మెడ. 1—౧.

**లోకుత్తుక.** వా. వి. అంతర్గళము, అంగిలి: చూ,

**లోకేశుఁడు.** సం. వి. అ. పుం. 1. నలువ: చూ. బ్రహ్మ. 1; 2. ఒకబుద్ధుఁడు: చూ, బుద్ధుఁడు;

**లోకేశ్వరాత్మజ.** సం. వి. ఆ. స్త్రీ. బౌద్ధదేవి: చూ, భార్య. 1—ర౧. [లోకేశుఁడు. 2.

**లోకేశ్వరుఁడు.** సం. వి. అ. పుం: చూ,

**లోకోక్తి.** సం. వి. ఈ. స్త్రీ. 1. వాడుకమాట, పుకారు: చూ, శబ్దము. 2; అం. 2: చూ, లోకోక్త్యలంకారము.

**లోకోక్త్యలంకారము.** అం: చూ, అలంకారము. 3. (వాడుకమాట లెట్లో యట్లె చెప్పుట. "ఉదా.— చెలియకొన్నాళ్లు కన్నులు మూసికొనియుండు.") [సహనము. 1.

**లోగది.** వా. వి. కాఁపురగుంకుగది: చూ,

**లోచకము.** సం. వి. అ. న. 1. దీపపుఁగొనపురుగు; 2: చూ, లోచనము; 3 మాంసపిండము; 4. బొట్టు: చూ, విశేషకము. 1; (బొట్టు. 1.); 5 అరఁటిచెట్టు: చూ, సువర్ణకదళి (రంభ 2.); 6. ఎఱ్ఱగుడ్డ: చూ, వస్త్రము; 7. వింటియల్లెత్రాడు: చూ, స్థాపనము. 1; 8. చెవిపగ: చూ, పాపణిక. 2 (భూషణము. 2.)

**లోచకుఁడు.** సం. వి. అ. పుం. 1. క్షీరావార ప్రతుఁడు: చూ, వ్రతి. 2, అం. 2: చూ, వ్రతిభేదములు. [రాత్మజ.

**లోచన.** సం. వి. ఆ. స్త్రీ: చూ, లోకేశ్వ

**లోచనము.** సం. వి. అ. న. (దీనిచేత చూడఁబడును): అంజకము-అంజికము, అంబకము, అక్షి, ఈక్షణము, ఉ, ఝా, కోశకారము, గోవు, చక్షువు, జ్యోతి, ణ, తారకము, దర్శనము, దృక్కు, దృష్టి, నయనము, నేత్రము, ప్రేక్షణము, లోచకము, వప్నము. (తె. ప).—కను-కన్ను-కల్లు (గుడ్డు. తద్విశేషములు.—౧. కడకన్నునకు.— అపాంగము, కటాక్షము, కర్కరాటువు, కాక్షము, కేకరము. (తె. ప):—కంటితుద, కడకన్ను, కడగన్ను; కేరఁగన్ను, గిల్లకన్ను, మెల్లకన్ను; (ఇదె మెల్లకన్ను అని కొందఱు); ౨. (తె).—కాయకన్ను; ౩. (తె).—అరఁగన్ను; ర. శివుని ఫాలనేత్రమునకు.— మిక్కిలికను-మిక్కిలికన్ను. (సం).—కికి; ౫. అగ్నిపుట్టిన శివుని ఫాలనేత్రమునకు.— (తె).— పొంగకన్ను; ౬: (తె). మ్రాఁగన్ను; ౭: (తె). లొట్టకన్ను; ౮. తడికన్నునకు.— చిల్లము, చుల్లము, పిల్లము; ౯. ముక్కువైపు కంటిమూలకు —గోనర్దము; ౧౦. కంటిగుడ్డుచుట్టునుండెడి తెల్లని భాగమునకు.—

కుముదము; ౧౧. కంటినల్లగుడ్డునకు.— కనీనిక, కామనిక, గోలము—గోళము, తారకము, తారము, బిడాలము. (తె. వ).— అబ్బ, కంటిపాప, కనుపాప, నల్లగుడ్డు, పాప, పూప, సింగనాదము; ౧౨. నేత్రభేదమునకు.— క్రోధము.("చూ,సింగనాదము.")

లోచమస్తకము. సం. వి. అ. పుం. ఓమము: చూ, వాము. 2 (యవాని.)

లోచెయి. ద్వ.వి.రూ—లోచెయ్యి. (లోపల+చెయి.) 1. అఱచేయి: చూ, హస్తము; 2: చూ, మర్మము; విణ. 3. మర్మము తెలిసినవాఁడు. ("వాఁడువీనికి లోచెయిగానుండి యీ కార్యమును చేసెను.")

లోచెయ్యి. ద్వ. వి.—పై.—

లోచూపు. ద్వ. వి. (లోపల+చూపు) జ్ఞానదృష్టి: చూ, వీక్షణము.

లోట. దే. వి. 1. లొందు, నీరుటెంకి: చూ, సరస్సు. 1; 2. చిన్నపాత్రము: చూ, పారివాణము (పాత్రము. 6.) [చూ, సొడ్డు. 1.

లోటు. దే. వి. 1.నష్టి: చూ, నేగి;2.లోపము:

లోటుపోవు. దే. అ. క్రి. 1. లోపమగు; 2. నష్టియగు: చూ, సురుగు. 1.

లోడి. వై. వి.=లగుడ. రూ-లోడీ-లోడు, మల్లులు సాదనకు త్రిప్పెడు సాధనము:చూ, మల్లబంధములు.

లోడింగు. వా. వి. క్రిక్కిఱిసియుట.

లోడీ. వై. వి.=చూ, రూ-లోడి.

లోడు. దే. వి. 1. —పై.—; 2; ఆనుడుబిల్ల, ఒగగు-ఒఱగు-ఒఱుగు – ఒరగుబిల్ల-ఒఱగుబిళ్ల, తలగడ, తలయంపి, తలాటి-తలాడ-తలాఁడు-తల్లడ,తలాఁపి-తలాఁపు-తల్లఁపి, దురాడము, బాలీసు, బిల్ల, బిల్లతలగడ. (సం).—అపాశ్రియము, ఉపధి, ఉపధానము, ఉపబర్హము, కల్యాణబీటము, ఖురాలికము, గండువు, గభోళి, ప్రగ్రీవము, బాలిశము, మత్తవారణము, మసూరము. తద్విశేషములు.—౧. అర్ధచంద్రాకారపు తలగడకు.-(సం). అపతల్పకము, గండకము, గర్భోణి-గగ్భోని, గల్లచాతురి; ౨. కీఁచు తలగడ, కీఁచుబిళ్ల, కీఁచుబుఱ్ఱ; 3. విడుపాటి గుండ్రపుతలగడకు.— దిండు-ద్రిండు, బటువు, బటువుబిల్ల, సురమాలి; ౪. రాజోలచేతిక్రింది తలగడకు: (సం).-మూతము. ("చూ, సురమాలి.")

లోతక్కువ. దే. విణ. (లోపల+తక్కువ) మిగులు: చూ, శేషము. 1.

లోతబిసీలు. వా. విణ. మిక్కిలి లోపలివిషయము: చూ, లోపయినము. 1-2.

లోధ్రపుష్పము. సం. వి. అ. పుం. ఇప్ప*: చూ, వానప్రస్థము. 2. [: చూ, లొద్దుగు.

లోధ్రకము. సం. వి. అ. పుం.=లొద్దుగు*

లోన. దే. ద్రి: చూ, లో. 4.

లోనగు. దే. అ. క్రి: చూ, లోఁబడు.

లోనవ్వు. దే. వి. అంతర్హాసము, ఉద్వర్ధనము: చూ, హాస్యము. 1.

లొను. దే. వి. 1: లో—లోన—లోపల; 2: అమొగు, ఆను, ఆరంబము - ఆరబము, ఎత్తనగోలు, ఎలగోలు, తల, తొంటి-తొంటె, తొలి-తొలు-తొలుత-తొలుతొలుత-తొల్త-తొల్లి, బుడము, మొంగడ-మొంగల, ముంగోలు, ముందర-ముందఱ, ముందు, మును-మున్ను, మునుపు-మున్ను, మొదటిది, మొదలు, మొన, లగాయతు, లోవిడి, వెనుక-వెనక. (సం. వ).-అగ్రము, ఆది, ఆదిమము, ఆద్యము, ఆరంభము, పూర్వము, పౌరస్త్యము, ప్రథమము. (అవ్య).—ఇతి; ౧. మొదటపుట్టినది. (సం).—పూర్వజ; ౨. ముందటి కాలముది. (సం).-పూర్వము; 3.

మొనటిచోటుది. (సం).-పూర్వము; వా. 3.అప్పు, ఋణము:చూ, వాచకము(1); విణ. లోఁకువ: చూ, వశము. 1.

లోపడు. దే. అ. క్రి: చూ, లోపించే.

లోపము. సం. వి. అ.పుం. 1. మఱుఁగుపాటు: చూ, స్థగనము; 2. తక్కువ: చూ, సొద్దు. 1.

లోపల. దే. అవ. 1. నిర్ధారణ షష్ఠియందు వచ్చెడు ప్రత్యయము; వి. 2. లో-లోన-లోను. ఉ, హరి. 4, అ. 147.

లోపాయికారి. దే. విణ. రహస్యముగా నొకరి పక్షముననున్నవాఁడు. [చూ, భార్య.

లోపాముద్ర. సం.వి.అ.స్త్రీ.అగస్త్యముని భార్య:

లోపించే. సం. అ. క్రి 1. (తె. ప) —అడఁగు—అణఁగు, తక్కువపడు, మఱుఁగుపడు, లొట్టపోవు, లోపడు. (చూ, సుక్కు. 9); 2. తగ్గు: చూ, సుక్కు. 9.

లోప్తము. సం. వి. అ. న. దొంగిలించినసొత్తు, రూ-లోప్త్రము: చూ, హిరణ్యము. 3.

లోప్త్రము. సం. వి. అ. న. —పై.—

లోబంటరి. ద్వ. వి: చూ, రూ-రోబంటరి. పాంబ. తిర్య. 5.

లోబిత్తరి. అం: చూ, కాయమానములు.

లోభము. సం. వి. అ. పుం. 1: (తె.ప).—కక్కురితి-కక్కుర్తి-కక్కుతితి-కక్కుత్తి-కక్కూరితి-కక్కూర్తి-కక్కూతితి-కక్కూత్తి, పిచ్చెపట్టు, పితలాటకము-పితలాటము, పిసినితనము. తద్వి.—మిక్కిలి లోభమునకు.—ప్రలోభము; అం. 2: చూ, అరిషడ్వర్గములు.

లోభి. సం. విణ. (న్.ఈ.న్): అకించనుఁడు, కదర్యుఁడు, కార్యకూటుఁడు, కింపచుఁడు-కింపచానుఁడు-కింపచాన్నుఁడు, కుమాత్రు, కృపణుఁడు,గర్ధనము(గర్ధనుఁడు),గాఢముష్టి, గృధువు-గృధ్నువు, గృధ్రిసు, మితంపచుఁడు, లుబ్ధకుఁడు-లుబ్ధుఁడు. (తె. ప).-అడియరి, ఈలగద్ద, ఎంగిలివాఁడు, కక్కుతితికాఁడు, కొటిక, పినుఁగు, పిసిడి, పిసినారి, పిసిని, పిసినిగొట్టు, బంకముచ్చు, వలిపిరిగొట్టు, వాపిరిగొట్టు. తద్వి.—మిగుల లుబ్ధునకు.— అతిలుబ్ధుఁడు, అల్పంపచుఁడు, అలుబ్ధుఁడు,కదర్యుఁడు, కింపచుఁడు-కింపచానుఁడు-కింపచాన్నుఁడు, కీకటము, కీనాశుఁడు,కృపణుఁడు, క్షుద్రుఁడు,

లోమము. సం. వి. న్. న. తనూరుహము: చూ, రూ-రోమము.

లోమశ. సం వి. అ. స్త్రీ. 1 జటామాంసి*: చూ, మాంసి. 1; 2. దూలగొండి*: చూ, శూకశింబి; 3. వస*: చూ, విష; 4. కాకజంఘ*: చూ, వెలమపంది.

లోమశము. సం వి. అ. పుం. 1. గొఱ్ఱె: చూ, మేషము. 1; 2. పూతిమార్జాలము: చూ, సూచకము.5. (మార్జాలము.) (లోమశమను మృగమదము=పుట్టుపునుఁగు) [రోమశుఁడు.

లోమశుఁడు. సం. వి అ పుం: చూ, రూ-

లోమెడ. వా వి: చూ, వసుటము. 1.

లోమొన. అం: చూ, మొనలు.

లోయ. దే. వి. 1. (స్వా. 2, ఆ. 21): కొండపగులు, లొద్ది, లోవ. (సం).-అఘాతము; 2. పర్వతశిలల మధ్యభాగము: లొద్ది, లోవ. (సం).—చొండాదికము.

లోరతి. అం: చూ, సమరతులు (రతి. 4.)

లోల. సం. వి. అ. స్త్రీ. నాలిక-నాలుక, జిహ్వ, రసజ్ఞ, రసన: చూ, సుధాద్రవము (రసన. 1.); 2: చూ, లక్ష్మి. 1; విణ. 3.మిక్కిలియిచ్ఛగలది,ముప్పదియాఱెండ్లది: నిరతము (చూ, యౌవనభేదములు.); 4. కదలునది, చరము, కంప్రము:చూ, వలితము.3; అం. 5: చూ, వృత్తము. 1. (ఒక్కొక్క పాదమునకు రెండుయగణములు ఒక గురువునుగలది. 7వ ఛందస్సు.)

లోలంబము. సం. వి. అ. పుం. తుమ్మెద: చూ, షట్పదము.

లోలము. సం. వి. అ. న. 1. కదలుట: రూ-ఆలోలము, ఉత్సారణము, ఉన్మంథనము, ఉల్లలము, కంపనము, కాపీనము, చలనము, చలము, తరళము, ధట, భ్రింళము, భ్రేషము, రేకము, స్ఫారము. (అవ్య).—అప. (తె.ప):—అదరు-అదురు, ఇసితింతలు, ఉలివు, కదలిక, కదలు, గెంటు, తడబాటు, తలకు-తొలకు, తల్లడపాటు, తల్లడము, తల్లడింపు, తుంపెసలు, నుక్కాట, పటికిరింత, పదిరు, పల్లట, బెడకు-బెణకు-బెళకు-బెళుకు, వెగడు, సలనము. ఈద్వి.-ం. కంపమునకు-భీతి. (తె.ప).— కులుకు, జేలదరము, దడ, నడుకు, నణకు, వలి, వలిపిరి, రాలుపాటు-రాల్పాటు, వడకు-వణకు: చూ, వేపథువు; ౨. మిక్కిలి చలనమునకు-నిస్పందము; (తె.ప). వడవడకు; 3. విణ. చలించునది అనుటకు.—(చూ,చలితము 3.) ("చూ, స్ఫారము. 1."); అం. 2: చూ, చిబుకక్రియలు.

లోలాయపడు. దే. అ. క్రి: చూ, శ్రమపడు.

లోలితము. సం. విణ. 1. ఊచబడినది; అం. 2: చూ, శిరఃక్రియలు; 3: చూ, కరణములు.

లోలుపుడు. సం. విణ. రూ-లోలుభుడు, మిక్కిలి ఆశగలవాడు: చూ, వాంఛితుడు.

లోలుభుడు. సం. విణ. —పై.—

లోలోంక. దే. వి: చూ, విజ్ఞాణములు.

లోవ. దే. వి. 1: చూ, లోయ. 1; 2: చూ, లోయ.2; 3.ఇంటిచూరు: చూ, సదనము.1; 4. రథపీఠముమీది చేట్టపు అంచు. వసు. 1, ఆ. 144; 5. కొణిగయందలి గువ్వగూడు: వలబిటూకు. (సం):-విటంకము.

లోవయినము. ద్వ. విణ. 1. కడచినది: రూ-లోవైనము, లోతలిసీలు; 2: రూ-లోవైనము, తలిసీలు-తలీస్లు, లోతలిసీలు, వివరము.

లోవరి. దే. వి. (లోవ+అరి) తొట్టికట్టు: చూ, ముంగిలి. 2 (చూ, సదనము. 1.)

లోవాకిలి. ద్వ. వి. అంతర్ద్వారము: చూ, వాకిలి.

లోవాడికాడు. ద్వ. వి. చోరుడు: చూ, పాగకుడు. 1.

లోవి. దే. వి. 1. వంటకుండ, స్థాలి. భాగ. 1, స్కం. 364: చూ, భాండము. 3-3; 2. పచనపాత్రము, వసల: చూ, పాత్రము. 6-ంా; 3. నీళ్లుతెచ్చుకొనెడుపాత్రము, లోహండి: చూ, హరివాణము (పాత్రము. 6.)

లోవిడి. వా. వి. పూర్వము: చూ, లోను. 2.

లోవెలినఱుకు. అం: చూ, నఱుకులు.

లోవు. దే. అ. క్రి. లొంగు: చూ, రూ-లోగు.

లోవైనము. ద్వ. విణ: చూ, రూ-లోవయినము.

లోష్టము. సం. వి. అ. న. (రూ-లోష్టువు-లేష్టువు-లోష్ఠము.) మంటిగడ్డ: చూ, భూమి. 1.

లోష్టువు. సం. వి. ఉ. పుం.—పై.—

లోసబురు. వా. వి. ఒడ్డునకుమూరమున సముద్రయానము చేయుట (వెలిసబురు కానిది.)

లోహండి. దే. వి: చూ, లోవి. 1-2-3.

లోహకటాహము సం. వి. అ. న. అండీ: చూ, పాత్రము. 6. [యము.

లోహకపాలన్యాయము. అం. ఒకానొక న్యా

లోహకారకుడు. సం. వి. అ. పుం. కమ్మరి: చూ, స్వర్ణకారుడు. [జాతితెద్దుఅను రీతి.

లోహఘటన్యాయము. అం. ఇనుప కుండకు

లోహజిత్తు. సం. వి. త్. పుం. వజ్రము: చూ, స్థూలోచ్చయము (రత్నములు 1. 3.)

లోహనాళము. సం. వి.అ. పుం. ఇనుపఊచలబాణము: చూ, బాణము. 1.

లోహపాత్రము. సం. వి. అ. న. లోహిక: చూ, పాత్రము. 6-ఌ.

లోహపృష్ఠము. సం వి. అ. పుం: అరిష్టము, కంకము, కమనచ్ఛదము, కమలచ్ఛదము, కర్కటము, కాలపృష్ఠము, కింశారువు, కూరి రము, కోలపుచ్ఛము, ఘంటారవము, ఘన రవము, జలాటనము. (తె. వ).—మల్లెకే గులు, రాపులుఁగు, రాబందు. (చూ, పక్షి).

లోహభస్మము. అం: చూ, భస్మములు.

లోహమారకము. సం. వి. అ. పుం. పొన్న గంటి *: చూ, శీతసారము.

లోహము. సం. వి అ. పుం, న. 1. బంగారు లోనగునది: గిరిజము, గిరిసారము, రుక్మము. తద్విశేషములు.- ౧. ఇనుమునకు.— అయస్సారము, అయస్సు, అశ్మసారము, ఆయసము, కాంతము, కాలకాహము, కాలాయసము, కృష్ణము, కృష్ణలోహము, కృష్ణామిషము, కృష్ణాయసము, గిరిజము, గిరిసారము, తీక్ష్ణము, పిండము, బాష్పము, మలీమసము, రుక్మము, లోహము, శస్త్రకము, శస్త్రము, శిలోద్భవము. (తె. వ).—ఇనుము-ఇన్ము, ఉక్కు, ఉళి. తద్వి.-మట్టమైన యినుమునకు.-(తె) బీడు; ౨. ఇత్తడికి:- ఆరకూటము, కపిలోహము, దర్విష్యము, పిత్తలము, రీతి. (తె).—ఇత్తడి-ఇత్తళి-పిత్తడి-పిత్తళి. తద్వి.— కపిల, కాకతుండి. (తె).-హొన్నిత్తడి; ౩. కంచునకు.— అసురాహ్వయము, కంసము, కంసాస్థి, కాంసీయము, కాంస్యము, తామ్రార్థము. (తె).-కంచు; ౪. వెండికి.- ఇందుకాంతము, కలధౌతము, ఖనిజ, ఖర్జూరము, చంద్రబీజము, చంద్రహాసకము, తప్తరూపకము, తప్తరూపము, తారము, త్రిపుభి, దుర్వర్ణము, నిష్కము, మణిచకము, రజతము, రుధిరము, రుధిరాహ్వయము, రూప్యకము,-రూప్యము,- రౌప్యము, శుక్లము, శ్వేతము. (తె).— మడికాసు, వెండి. తద్వి.- (౧). రెండు ధరణముల యెత్తు వెండినాణెమునకు.-గద్యాణము. టంకము, నిష్కము; (౨): (తె).- ఊఁదువెండి, చోటివెండి; (౩). రసనాదపు వెండికి.— కృత్రిమ; (౪). మూఁడుయవల యెత్తువెండికి — కృష్ణలము, గుడపము. నేతిక; (౫). వెండిబంగారముల ముద్దకు:—కలధౌతము, కోశము, హరువు (తె) — నాడెము - నాణెము; (౬). గనియందుఁబుట్టిన వెండికి.- ఖనిజ; (౭). ఫలపరిమితమైన వెండికి.-శతమానము; (౮). వెండిబంగారముల కమ్ములకు.— (తె).-మచ్చులు; (౯). వెండినాణెములకు.- (తె) రూపాయ మొ; (౧౦). వెండి బంగారముల మచ్చుముక్కకు.— మచ్చు, మచ్చుముక్క; (౧౧) చిన్నమెత్తు వెండి బంగారముల నాణెమునకు... (తె). రూక; (౧౨). నాణెమునకు.-ఆహతము, నాణకము. (తె).— నాఁడెము- నాణియము- నాణెము; ౫. బంగారమునకు —అగ్నిబీజము, అభ్రము, అర్జునము, అవష్టంభము, అష్టాపదము, ఋక్థము, ఋూ, ఔజసము, కంచళము, కతము, కనకము, కర్బూరము, కర్బురము-కర్బూరము-కార్బురము, కలధౌతము, కశేరువు, కాంచనము, కాచిఘము, కార్తస్వరము, కుసుంభము, ఖ, ఖనిజము, గంధశాకము, గరుత్తు, గారుడము, గైరికము, చందిరము, చామీకరము, చాంపేయము, జాంబవము, జాంబూనదము, జాతరూపము, తపనీయకము, తామగసము, దక్షిణము, నిష్కము, పింజరము, పరిగ్రహము, భదరము, భర్మకర్బురము, భర్మము, భూరి, భృంగారము, మనోహరము, మహాధనము, మహారజతము, మహారజనము, రుక్మము, వర్ణము, వసువు, శాతకుంభము, సర్వయోతము, సురభి, సువర్ణము, స్వర్ణము, హాటకము, హిరణ్యము,

హేమము. (తె. ప).—చిన్నిదము, చీనము, పయిఁడి-పైఁడి, పసిఁడి, పుత్తడి, పొన్ను, బంగరము - బంగారము-బంగారు-బంగరు-బంగరువు, సంచేము, సొన్న-సొన్నా-సొన్నము, హొన్ను. తద్విశేషములు.—(౧). మేలిమి బంగారునకు.— అహార్యకృతము, కుమాగము, తప్తకాంచనము. (తె).—అచ్చబంగారు, అపరంజి, ఊదిరి, కడాని, కుందనము, చొక్కపు బంగారు, జాలువా-జాళువ-జాళువా-జాళ్వా, పుత్తడి-పుత్తళి-పుత్తళిక, మేలిమి; (౨). పైఁడినాణెమునకు:- గద్యాణము, దీనారము, వరాహము (తె). ఎఁబెట్టు-ఎడఁబెట్టు, ఎరుసు, గద్దియ-గద్దె, దినారి, నాఁడెము-నాణియము-నాణెము, బారిమడ్రి, వరహా — వరా; (౩). పలమెత్తు బంగారునకు.— కురుబిస్తము- కురువిస్తము; (౪). బంగారు నందలి దోషమునకు.— కాలిక-కాళిక; (౫). కోరాబంగారు, మట్టపు బంగారు; (౬). వరహాల బంగారునాణెమునకు. (తె).— రామమాడ; (౭). ముప్పది రెండుగురిగింజెలయెత్తుబంగారు నాణెమునకు: చక్రాటము; (౮). చిన్న నాణెమునకు: చక్రము; (౯). నాలుగు గురిగింజెలయెత్తు బంగారు నాణెమునకు. (తె).—చిన్నము; (౧౦). కొంచెపాటి నాణెమునకు. (తె).— చిల్లర, చిలుకు; (౧౧). బంగారుమయమునకు.- హిరణ్మయము; (౧౨). పదియాఱు డబ్బుల యెత్తు బంగారునాణెము.- టంకము, దీనారము; (౧౩). బంగారు పట్టుకు.-(తె) హొంబట్టు; (౧౪). చిన్నబంగారునాణెమునకు.-(తె). మినుకు; (౧౫). ఒకరకము బంగారు నాణెమునకు.—(తె).—టంకవాటు, టంకపాలవాటు; (౧౬). బంగారులోని ధాతు విశేషమునకు.- తైజసము; (౧౭). కర్షమెత్తు బంగారునకు.- బిస్తము-విస్తము, సువర్ణము. (తె).- మాడ; (౧౮). పుట్టబంగారు-మొలకబంగారు; (౧౯). లోహవికారమైనది అనుటకు.—లౌహము; ౬. సీసమునకు.- కువంగము, కుష్ఠకము, చీరము, చీరపట్టము, త్రిపులము, త్రిపుపు, నాగము, పిచ్చటము, పిష్టము, బీజము, మహాబలము, యోగేష్టము, వంగము, వప్రము, శ్వేతము, సీసకము, సీసపత్రకము, సీసము. (తె).—సత్తు; ౭. తగరమునకు.- ఉపధీగము, కాలానుశారిబ, కురూప్యము, గురుపత్రము, చక్రిసంజ్ఞము, తగరపాదికము, తమరకము-తమరము. తీరము, త్రిపులము. త్రిపుపు, నాగము, పిచ్చటము, ప్రలంబము, గంగము, రౌప్యకము, వంగము. (తె). - తగరము-తవరము. తద్వి.—౧. తెల్లతగరమునకు.— ఖురకము; ౨. గ్రంథితగరమునకు.-కుంచితము; ౮. రాగికి.-అర్కము, ఉదుంబరము-ఔడుంబరము-ఔదుంబరము, కనీయసము, కసులము, తామరసము, తామ్రికము, తామ్రము, ద్వ్యష్టము, పవిత్రము, పింజరము, మ్లేచ్ఛముఖము, మ్లేచ్ఛాశ్వము, రక్తము, వరిష్టము, శుల్వము-శుల్బము. (తె).—రాగి. తద్వి.-కర్షమెత్తు రాగిటంకమునకు.-పణము; ౯. తుత్తమునకు.—తైజసము. (తె).— తుతినాగము—తుత్తనాగము, తుత్తము; ౧౦. వెండి బంగారుఁదక్కుతక్కిన లోహమునకు. (తె).-కుప్పము; ౧౧. తేగడకు.—(తె). తేగడు; ౧౨. ఖడ్గలోహమునకు.- ఖడ్గము; ౧౩. లోహదళమునకు.-(తె) దడము; ౧౪. తప్తలోహమునకు.— (తె). - జేసి; ౧౫. లోహమలమునకు.-కలంకము, కళంకము, కిట్టాలము, కృష్ణచూర్ణకము, కృష్ణలోహమయము, గిరిజము, మండూరము, శింఘాణము,

సింహాణము. (తె).-చిట్టము-చిట్టియము-చిట్టె ము,చిలుము,తుప్పు-తుప్పు,రీతి.తద్వి.-ఇను ప చిట్టెముతోఁజేసిన సిందూరమునకు.-మం డూరము; ౧౬. వర్తకమనులోహామునకు.-
వర్తకము, (మిగతదానికి "చూ,హరాన్న"); 2. అగలు: చూ, రాజార్హము.
లోహరసాయనము. అం: చూ, రసాయనములు.
లోహలుఁడు. సం. విణ: అస్ఫుటవాచ్యుఁడు, ఆక్షేపకుఁడు. (తె).—నత్తివాఁడు.
లోహళంకువు. అం: చూ, నరకములు.
లోహశర్కటి. సం. వి. ఇ. పుం: చూ,సమ్మెట. 1.
లోహాభిసారము. సం. వి. అ. పుం. రూ-లోహాభీసాగము. యుద్ధసన్నద్ధుఁడైన ప్రభునకిచ్చే హారతి: చూ, హారతి.
లోహాభీసారము. సం. వి. అ. పుం.—పై.—
లోహిక. సం. వి. ఆ. స్త్రీ. లోహపాత్రము: చూ, పాత్రము. 6—౨౧.
లోహితకము. సం. వి. అ. పుం. రూ-లోహితకము. కెంపు: చూ, స్థా లో చ్చ య ము (రత్నములు.) [చూ, వహ్నిశిఖము. 1.
లోహితచందనము. సం. వి. అ. న.కుంకుమపువ్వు:
లోహితము. సం. వి. అ. న. 1. రక్తచందనము: చూ, వాసన. 1; 2. పరిమళచందనము. చూ, వాసన. 1; 3. చెందిరము: చూ, సిందూరము. 1; 4.నెత్తురు: చూ, రక్తము. 1;పుం. 5. కుంకుమపువ్వు: చూ, వహ్నిశిఖము. 1; పుం. 6. ఎఱుపు: చూ, వర్ణము. 6; 7. నద విశేషము:చూ,లౌహిత్యము 2;విణ.8.ఎఱ్ఱనిది: చూ, వర్ణము. 6.
లోహితసగోత్రము. అం: చూ, గోత్రము. 13.
లోహితాంగుఁడు. అం. అంగారకుఁడు: చూ, రాహువు. 2.
లోహితుఁడు. అం. — పై.—
లోహితాశ్వుఁడు. సం. వి. అ. పుం: చూ, రోహితాశ్వుఁడు (లోహితాశ్వుఁడు-రోహితాశ్వుఁడు అనికొందఱు)
లోహితోదయము. అం: చూ, నరకములు.

## లౌ

లౌకికము.సం. విణ.1.లోకవ్యవహార సిద్ధమైనది: లౌక్యము; వా. వి. 2· చూ, పంచన
లౌకికుఁడు. సం. విణ. 1. లోకవ్యవహారములయందనుభవము గలవాఁడు; 2 లోకవ్యవహారముల యందనుభవము గలిగిన యుద్యోగి.
లౌక్యము. వా. సం. విణ, వి: చూ, లౌకికము.
లౌడి. వై. వి.=లగుడ. రూ-లవుడి, దుడ్డుకఱ్ఱ. జై. 6, ఆ. 173: చూ, వేత్రము. 2.
లౌణి. వై. వి.=-పై.-(రూ-లవుణి.)
లౌనను. వా. వి: రూ-లవనను (లౌనను.)
లౌల్యము. సం. వి. అ. న. లోలత్వము.
లౌహము. సం. విణ. లోహవికారమైనది: చూ, లోహము. 1—(౧౯.)
లౌహితము. సం. వి. అ. పుం. శివుని ముమ్మొనవాలు: చూ, హేతి. 4 (బాణము.1-౩౪.)
లౌహిత్యము. సం. వి. అ. న. 1. ఎఱ్ఱన: చూ, వర్ణము. 6; పుం. 2: చూ, లోహితము. 7.

## వ

వ. ఒకయక్షరము. సం. వి. అ. పుం. 1: చూ, సాత్వికుఁడు; 2. గాలి: చూ, వాయువు; 3.చోలించుట: చూ, సమాప్తి; 4: చూ,వరుణుఁడు. 1; 5: చూ, స్వాదుధన్వుఁడు(మన్మథుఁడు); 6 భయనిస్సారుఁడు; 7.పూజింపఁదగినవాఁడు; 8. ఇచ్ఛ: చూ, వాంఛ; విణ. 9 దాఁటించువాఁడు; అవ్య. 10. చింతించుట; 11. వచ్చేని ద్రవ్యము మొదలగువాని నెఱుఁగుట; స్. అవ్య. 12: చూ, వివాదము; అం. 13: చూ, అంతస్థములు; 14. దంతోష్ఠములఁ బుట్టినది.

వంక. వై. వి. 1.=వక్రి. వంకర. నీలా. 3, ఆ. 21: చూ, వేల్లితము. 3; 2.=వక్రి. వంపు: చూ, వేల్లితము. 3; 3. రూ-వాఁక. వాఁగు: చూ, నది; 4: చూ, నేరము; దే. వి. 5.దిక్కు. హరి,పూ.8, ఆ. 44: చూ, హరిత్తు; 6. పక్షము: చూ, ప్రక్క. 2.

వంకదారి. వై. వి.=వక్రిద్వార. కోటవాకిటి ముందటి వంకరదారి. రా, వి. 5, ఆ. 17; రామా. 8, ఆ. 69: చూ, మార్గము. 1.

వంకము. సం. వి. అ. పుం. 1. ఏటిరెండుదరుల నడుము: చూ, పాత్రము. 1; 2. గుఱ్ఱమునకు పల్లముపెట్టుచోటు (గుఱ్ఱము ముందటివైపు అని కొందఱు); 3. వంకర: చూ, వేల్లితము 3; వై. వి. (1).=వక్రి, వంక్యా.నుఱుచేనపుడు కనపును క్రిందుమీఁదుగాత్రిప్పి వేసెడు వంకరకొయ్య. రూ-వంకాము, బొబ్బము-బొబ్బాము; (2)=వంక్య: చూ, వంక్యము.

వంకర. వై. వి. 1.=వక్రి. వక్రత్వము: చూ, వేల్లితము.3;విశే.2.వక్రము: చూ, వేల్లితము.3.

వంకరచేతులవాఁడు. వా.వి.ఈచచేతులవాఁడు, ఊఁచే చేతుల వాఁడు. (సం).-కుకరుఁడు, కుణి-కూణి-కోణి. [చూ, వేల్లితము. 3.

వంకరటింకర. ద్వ. విశే. నానావిధవక్రము:

వంకరతొండంబువాఁడు. ద్వ. వి: చూ, వినాయకుఁడు. 1. [చూ, వల. 1.

వంకరబోను. ద్వ. వి. మృగాదులఁబట్టు వల:

వంకర వోవు. ద్వ. అ. క్రి: ఈచేవడు, ఈచఁ బోవు, కొంకరలు వోవు, కొంకు వోవు, కోర వోవు, గోడివడు, చొక్కుళ్లువోవు, ముల్గగు, కోటువోవు. (మి).—వక్రిమగు. తద్వి.-వంకరచేయుఅనుటకు.— కేరడించే.

వంకసన్నములు. అం. శాలిధాన్యము: చూ, ధాన్యము.

వంకాము. వై. వి.=వార్తాక (వంగ + కాయ): చూ, వంగకాయ.

వంకి. వై. వి.=వక్ర. రూ-వంకిణి, హంస. ఉ, రా. 7, ఆ. 335; య. 5, ఆ. 74: చూ, బాణము. 1. [రామా. 6, ఆ 149.

వంకిణి. వై. వి =—వై.—శశాం. 2, ఆ 17;

వంకియ. దే. వి: రూ-వంకె: చూ, సస్యము. 1.

వంకిలము. సం. వి. అ. పుం ముల్లు: చూ, సితాగ్రము. 1. [చూ, భూషణము 2.

వంకీ. వై. వి. స్త్రీలు సందిట ధరించేనగ:

వంకె. దే. వి: చూ, రూ-వంకియ.

వంక్యము. సం. వి. అ. న.=వంకము (తె) — ఒంకియ-ఒంకె, కొంకికఱ్ఱ. చిలుకగొయ్య, పడియ-పడె, వంకము.

వంక్షణము. సం. వి. అ. పుం. పొత్తికడుపునకును తొడకును మధ్యసందు: (తె).-గజ్జ.

వంగ. వై. వి. 1.=వంగమ్: చూ, వార్తాకము* (కుండ వనస శబ్దములవలె స్త్రీ సమమూఢ మాత్రము చేతనే వైకృతత్వసిద్ధి.);2. రూ-వంగము, బంగాళాదేశము: చూ, దేశములు.

వంగఁడీయు. దే. స. క్రి: చూ, వంచు. 2.

వంగకాయ. ద్వి. వి: చూ, రూ-వంకాయ.

వంగడము. వై. వి.=వంశ. 1. రూ-వంగసము. వై. 5, ఆ. 171: చూ, సంతతి, 1; 2. బ్రాహ్మణ వర్ణము: (సం).— కపిలము.

వంగపండు.ద్వ.వి.1.ఒకరకము పక్షి.య.2,ఆ.24: చూ,పక్షి; వా.2.ముదిగిపచ్చఁబడినవంగకాయ.

వంగభస్మము. అం: చూ, భస్మములు.

వంగము. సం. వి. అ. న. 1. తగరము: చూ, లోహము. 1; 2=వంగ*: చూ, వార్తాకము; 3. సత్తు: చూ, లోహము. 1;4. నూలు-చీర: చూ, వస్త్రము; 5. కోయిల: చూ, సొఁకుడు పులుఁగు; పుం. 6. వాయఁడు: చూ, స్పృశి; అం. పుం. 7: చూ, రూ-వంగ. 2; అం. 8: చూ, వంగభస్మము.

వంగవరుగు. వా. వి.ఎండినవంగపండుముక్కలు.

వంగసము. వై. వి.=వంశ:; చూ,రూ-వంగడము.

వంగసేనకము. సం. వి. అ. పుం. తెల్లయగసి*: చూ, శుకనాసము. 1.
వంగస్త్రీ. అం. వంగదేశస్త్రీ: చూ, స్త్రీ.
వంగాకుబుడమలు. అం' చూ, ధాన్యము.
వంగించే నై. స. క్రి: చూ, వంచు. 2.
వంగు. నై. అ. క్రి.=వక్. ముంపటికి వాలు: వాలు. తద్వి—గా అడంగు-అణంగు, మడంగు—మడుంగు—మడువు-మడ్గు-మణంగు-మణుంగు—మణువు, మెత్తంబడు. (ని).—నమ్రిమగు: చూ, నమ్రిక్కు. (4) (9): 2. మొగ్గవాలు; 3: చూ, మోంకరించే.
వంగుట వా. వి. నమ్రిత: చూ, మేపడి.
వంగుడు. దే. వి. బీంట, బీటిక: చూ, స్ఫోటము.
వంగుళ్లు. దే. వి. బ. (వంగుడు+లు): అట్టొట్లు—నట్టొట్లు, బొట్టులు.
వంచకము. సం. వి. అ. పుం. 1. నక్క: చూ, సృగాలము; 2. ఊరముంగిస: చూ, ముంగిస; విణ 3. మోసము చేయునది.
వంచకుండు. సం. విణ. 1: ఏడమాకుండు, కితవుండు, కూహకుండు, కైతవుండు, క్షారుండు, చక్రిటుండు, జగలుండు, జాలికుండు, ద్రావకము, ద్రావకుండు, ధూర్తకుండు, ధూర్తు—ధూర్తుండు, నికృతుండు, ప్రతారకుండు, మాయావి, మాయి—మాయికుండు. (తె.వ): —అటమటకాండు-అటమటీండు, కఱటి, కల్లరి—కల్లరీడు, జేజ్జెరకాండు—జోజెరకాండు, జిత్తులమారి, జిత్తులవాండు, జోటా, జోటాకోరు, టక్కరి, టక్కరికాండు, టాటోటుకాండు, తక్కుండు, తపళికాండు, లెక్కరి, తక్కిడికాండు, తాటోటు, తెక్కలికాండు, దబ్బఱ-దబ్బఱ-దబ్బతి, దబ్బఱకాండు, దగాకోరు, ఫుండాకోరు, బూటకీండు—బూటకుండు, బెల్లి, బేలరి, మాయకాండు, మాయదారి, మాయపోతు, మాయలమారి, మాయలాండు, మొఱంగు, మోసగాండు, లయకారి, వెడ్డరి. ("చూ, వెడ్డరి"); 2. చెడ్డవాండు: చూ, వ్యాధుండు. 2;3. బొంకరి: చూ, ముఖరుండు.

వంచన. సం.వి.ఆ.స్త్రీ,అ.న.=వంచేన: పూ—వంచనము, అభిసంధానము, కుహకము, కూర్చము, ఛద్మము, తప్పరము, దండకము, నికారము, నికృతి, పరితారణము, ప్రలంభము, మాయ, లౌకికము—లౌక్యము, వ్యళీకము. (అవ్య).—అతి, అక్. (తె. వ).—అటమట, అటమటింపు, అఱ, ఉక్కిడము, ఉక్కినము, ఎకసకియము—ఎకసకెము—ఎకసక్కియము—ఎకసక్కెము—ఎకసెకియము—ఎకసెకెము-ఎకసెక్కియము-ఎకసెక్కెము—ఎక్కసకియము—ఎక్కసకెము- ఎక్కసక్కియము- ఎక్కసక్కెము- ఎక్కసెకియము—ఎక్కసెకెము—ఎక్కసెక్కియము- ఎక్కసెక్కెము, కఱము, కల్ల, కల్లతనము, కవుడు—కాడు, కిసుకింత—కిసుకింపు, కిసుసు—కిసుకించే-కిసుకురు-కిఱుకు, కుట్ర, కుదుకనగోలు, కుదువ, క్రిక్కు—పక్కి, గారడము, గిసుము, జేజ్జెర-జోజెర, జోమంగు, జోముంగు—జోణుంగుడు, జోజెము, జోటు, జోటుదనము, టక్కు, టాటోటు, డబ్బఱ-దబ్బఱ, టోపె, తంట—తంటా, తక్కిడి, తక్కు, తటమట—తటపట, తనుంకు, తాంట, తాటోటు, తెక్కలి, త్రిక్కు, దగా, దొంగ, నాలి, పిక్కు, బూటకము, బూమియ—బూమె, బెల్లి, బెల్లింపు, మాయము, మిల్లి, మిల్లింతలు, మొఱంగు-మొఱంగుడు, మోసు—మోసము, లయ, లూలామూలము, వంచేన, వాలకము, వెడ్డు, వేడబము. ("చూ, వేడబము.")
వంచనాతంత్రము. అం: చూ, పంచతంత్రములు.
వంచి. దే. స: ఎక్కటి, ఎక్కము, ఒండు, ఒకటి—ఒక్కటి-ఒకొటి-ఒకొట్టి, ఒకండు—ఒకొండు, ఒక్కము, పగడ-పగడము, పంచే-పంచేము. (సం).—ఏకము, కేవలము. ("చూ, సంఖ్య.")

వంచించు. సం. స. క్రి: వరితారించు.(తె.వ).— అటమటించు, అడకించు, ఆలిగొను, ఊటించు, కనుఁద్రావు, కనుమాయు, కనుమొఱఁగు-కన్నుమొఱఁగు, కన్మొఱఁగు, కిసరించు, కిక్కురించు, కిసురువెట్టు—కిక్కురువెట్టు, కిసురువోడుచు—కిక్కురువోడుచు, గినుమాడు, చేవుకనేయు—చౌకనేయు, చిక్కుఁజేయు, చొక్కిడు, చొక్కుపెట్టు, జోటాడు, తక్కు, తటమటించు, తటపటచేయు, దాఁగురించు, దండించు, పిక్కు, బెల్లించు, బేలువెట్టు, బొంకించు, మొఱఁగు, మోసపుచ్చు, మ్రిచ్చిలు, వెడ్డువెట్టు. తద్వ — దొంగటక్కరివేయు అనుటకు.—(తె). పిసాళించు. ("చూ, వెడ్డువెట్టు.")

వంచింపఁబడు. మి. అ. క్రి. అలుగు—అల్గు—అలవు: చూ, మోసపోవు. 2.

వంచితుఁడు. సం. విణ. వంచింపఁబడినవాఁడు: చూ, విప్రలబ్ధుఁడు.

వంచియ. దే, వై. వి: చూ, రూ—వంచె.

వంచె. దే. వి.1. కసవులోనగునవి కోయువారు వానినుంచుకొనుటకై వెనుక పిఱుఁదుల మీఁద జోఱఁగట్టుకొనెడి రొండి: చూ, సంచి; 2. తూ మెడుగింజేలుపట్టెడుగోనె: చూ, సంచి; వై. వి.3=వర్ణన. రూ—వన్నియ-వన్నె. కాంతి: చూ, వెలుతురు. 1.

వంచే. దే. విణ. రూ—వంచేము. 1. ముఖ్యము: చూ, శ్రేష్ఠ్యము; స. 2. ఒకటి. రూ—వంచేము: చూ, వంచి; వి. 3. చీట్లలోని ఆసు. రూ—వంచేము. [వంచన.

వంచేన. వై. వి.=వంచన. పా. 4, అ. 16: చూ,

వంచేము. దే. స, వి, విణ: చూ, రూ—వంచే.

వంచేదివియ. ద్వ. వి. ఒకగడ్డి: చూ, తృణము.1.

వంచోడించు. దే. అ. క్రి. రూ— వంచోళించు. చెదరు. పా. 3, అ. 208: చూ, స్రుక్కు. 8.

వంచోళించు. దే. అ. క్రి. —పై.—

వంచు. వై, స. క్రి. 1. నమ్రముగాఁజేయు: గోడివెట్టు, వంగించు, వంగదీయు; ప్రే. 2. వంగఁజేయు: వంగఁదీయు, వాంచు.

వంజులము. సం. వి. అ. పుం. 1. అశోకము*: చూ, హేమపుష్పము; 2. తినిశము*: చూ, స్యందనము; 3. ప్రిబ్బ*: చూ, సహస్రవేధి. 2.

వంజెఱఁగు. దే.వి. (వంక+చెఱఁగు) స్త్రీపార్శ్వచేలాంచలము: చూ, వస్త్రము.

వంజె. వై. వి. 1.=వంధ్యా. గొడ్రాలు: చూ, స్త్రీ; 2=వంధ్యా. గొడ్డుటావు: చూ, ధేనువు; దే. వి. 3. గొడుగులోపలి శలాకలకాసరాగా నేర్పఱచినకమ్ములు: చూ, వారిత్ర.

వంజెరము. దే.వి. ఒకచేఁప: చూ, మత్స్యము. 1.

వంజో. దే. వి. —పై —

వంట. దే. వి. 1. పాకము: చూ, సూపకారము; వా. వి. బ. 2: చూ, పిడక. [వంటచెఱకు.

వంటకట్టియ. ద్వ. వి. రూ—వంటకట్టె: చూ,

వంటకట్టె. ద్వ. వి. —పై.— [వంటకత్తె.)

వంటకత్తియ. ద్వ. వి: చూ, వంటలక్క. (రూ—

వంటకత్తె. ద్వ. వి. —పై.—

వంటకము. సం. వి. అ. పుం. 1. ఏకాంశము, ఒకయంశము: చూ, భాగము. 1; దే. వి. (1) అన్నము: చూ, సాదము. (1).

వంటకొట్టము. ద్వ. వి: చూ, వంటయిల్లు.

వంటచెఱకు. దే. వి. 1: కట్టియ—కట్టె, కఱ్ఱ, కొయ్య, కోల, పుల్ల, మడకఱ్ఱ, ముటారి, వంటకట్టియ—వంటకట్టె, సరుగుడుకఱ్ఱ.(సం.వ)—అట్టము, అలాత్యము, ఇంధనము, ఇధ్మము, ఏధము—ఏధస్సు, కాష్ఠము, దారువు, సమిధ. ("చూ, సమిధ. 2.") (తద్వ.—చిదుగునకు: చూ, సమిధ. 2.); 2. ఇంధనసమూహము: చూ, వంటసరకు; 3. సుడిపాక యోగ్యమైన యిక్షువు: చూ, సుకుమారము. 1.

వంటచేముగు. దే. వి. పిండివంటలు తేర్చి మిగిలిన నూనె: చూ, స్నేహము. 2.

వంటపుట్టి. దే. వి. వంటచేసిపెట్టి జీవించేనది: చూ, వంటలక్క.

వంటపూఁటివాఁడు. దే. వి. 1: చూ, సూపకారుఁడు. అం, భా. ద్వి. కాం. 285; వా. 2: చూ, పూఁటకూళ్లవాఁడు.

వంటపూఁటియిల్లు. వా. వి. పూఁటకూళ్ల యిల్లు: చూ, సదనము. 1. (పూటి అని కొండఱు)

వంట యింటి కుందేలు. జా. స్వాధీనమైనది "వంటయింటి కుందేలిది యెందుఁ బోఁగలదు" (విజయవిలాసము.)

వంటయిల్లు. దే. వి. రూ-వంటిల్లు: చూ, సదనము. 1.

వంటయుప్పు. దే. వి. వండినయుప్పు, విడంగము: చూ, లవణము. 1.

వంటరాయి. దే. వి. మన్ను వండి చేసిన మణివిశేషము: చూ, స్థూలోచ్చయము (రత్నములు)

వంటరి. దే. వి. (వంట+అరి) 1. వంటవాఁడు: చూ, సూపకారుఁడు; 2. పాచకురాలు: చూ, వంటలక్క; వా. బ. 3: చూ, వంటరులు.

వంటరులు. వా. వి: చూ, రూ-ఒంటరులు. 2.

వంటలక్క. ద్వ. వి. (వంటలు + అక్క) 1. అన్నము వండెడుఆఁడుది: అక-అక్క, అడబాల, బోనకత్తియ-బోనకత్తె-బోనముకత్తె, వంటకత్తియ-వంటకత్తె, వంటపుట్టి, వంటరి. (సం).—పాచకి; వా. 2. గృహస్థుల యిండ్లలో జీతముతీసికొని వేళవేళకు అన్నము వండిపెట్టెడు ఆఁడుది: చూ, స్త్రీ; 3. పూఁటకూళ్లమ్మ: చూ, స్త్రీ.

వంటలవాఁడు. దే. వి: చూ, వంటరి. 1.

వంటవాఁడు. దే. వి. —పై.—

వంటసరకు. దే. వి: ఇంధనసమూహము: చూ, సమిధ. 2. [5, ఆ. 46.

వంటసాల. ద్వ. వి: చూ, వంటయిల్లు. పర.

వంటి. దే. విశే. 1: చూ, బోటి. 1. స్వా. 1, ఆ. 65; 2: బోటు, బోటి, సాటి: చూ, సమానము 2; అవ్య. 3: చూ, పోని. 2. ఆం, భా. తృ. 72.

వంటియము. దే. వి. రూ-వంటెము-వణితము, తాలూకా, పరగణా. ఒకని క్రిందిరాజ్యమునందు కొంతభాగము: చూ, సీమ. (1) (దేశములు).

వంటిల్లు. దే. వి: చూ, రూ-వంటయిల్లు.

వంటివాఁడు. వా. విశే: చూ, వంటి. 2.

వంటు. దే. వి. అనుకూల్యము: చూ, స్నేహము.

వంటెత్తు. వా. వి. ఏకాకిలక్షణము.

వంటెద్దు. వా. వి. ఒక్కటేఎద్దు (ఒంటెద్దు

వంటెద్దుబండి. వా. వి. ఒక్కయెద్దు లాగెడు బండి, ఒంటెద్దుబండి: చూ, బండి.

వంటెము. దే. వి: చూ, రూ-వంటియము.

వంట్రము. దే. వి. మందులసంచి: చూ, సంచి.

వంఠుఁడు. సం. వి. అ. పుం. 1. బ్రహ్మచారి: చూ, వటువు; 2: చూ, సేవకుఁడు; విశే. 3. పొట్టివాఁడు: చూ, వామనుఁడు.

వండ. సం. వి. ఆ. స్త్రీ. 1. అంకుటాలు: చూ, స్వైరిణి; విశే. 2. మొండి: చూ, స్తబ్ధుఁడు; దే. వి. (1) అపద: చూ, విపత్తు; (2) రూ-వండలి-వండు, చెఱువు లోనగు వానియడుగున నిలిచెడు ఎండుబురద, కుళ్ళు పంకము: చూ, సుబ్బలి.

వండఁడు. దే. వి. పంకము: చూ, సుబ్బలి.

వండఁబాటు. దే. వి. వండుటకువీలు.

వండలి. దే. వి: చూ, రూ-వండ. (2)

వండు. దే. వి. 1. —పై.—; 2: చూ, వండ. (2). హరి. ఉ. 2, ఆ. 123; స. క్రి. 3. వంటచేయు: చూ, సంస్కరించు. 2.

వంత. దే. వి. 1: చూ, సంతాపము; 2. వ్యథ: చూ, శోకము; 3. ఏడ్పు. హరిశ్చం. 5, ఆ. 114: చూ, శోకము; 4. ఏఱు. అచ్చం. బాల,

శాం. 40: చూ, నది; 5. మనోవ్యథ: చూ, శోకము. [86: చూ, శంభళి.

వంతకత్తియ. దే. వి. కట్టరి అం, పదా. నర.

వంతు. దే. వి. 1. వాటా: చూ, భాగము. 1; 2. వరుస, పంక్తి: చూ, శ్రేణి. 1; 3. సామ్యము. పా. 1, ఆ. 94: చూ, సమానము.2; 4. పోటి. ఉ, రా. 3, ఆ. 201: చూ, స్పర్ధ. 4; 5: పాలు, వరుస. (సం).—అంశము-అంసము, భాగము, విభాగము.

వంతెన. దే. వి. ఏటిపైకట్టు: అట్టెడ. (సం).-పిండిలము, వరణము, వారధి: చూ, సేతువు.1.

వంద. సం. వి. ఆ. స్త్రీ. 1. బదనిక*: చూ, వదనిక; 2. కొండజెండ*: చూ, పద్గ్రంథ; దే. వి. (1) తృణ తతి విశేషము: రూ-వందియ-వండె, వన్నియ-వన్నె, రేవంద: చూ, హరిత (తృణము.1.); స. (2)నూఱు, శతము: చూ, సంఖ్య. 1. [హంజిక.

వందకము. సం. వి. అ. పుం. చిఱుతేఁకు*: చూ,

వందకుఁడు. సం. వి. ఆ. పుం.వందకమతస్థుఁడు.

వందనము. సం. వి. అ. న. 1. నమస్కారము: చూ, హణిగలు; 2: చూ, స్తుతి; అం. 3: చూ, వింశతివిగ్రహములు; 4: చూ, భక్తిలక్షణములు. [శబ్దముతో చేరినప్రయోగమేకలదు.)

వందఱ. దే. వి: చూ, శకలము. 4. (చిందఱ

వందఱలాడు. దే.స.క్రి. ఖండించు: చూ, సెలగు.

వందారువు. సం. విశే. (ఉ). గోత్రనామములు చెప్పి పాదములుసోఁక మొక్కువాఁడు: అభివాదకుఁడు. (తె).—మ్రొక్కువాఁడు.

వంది. సం. వి. న్. పుం. స్తుతిచేసి జీవించువాఁడు: కేళపాళి, నగ్నుఁడు, పాఠకుఁడు, భట్టుఁడు, వర్ణకుఁడు, వైదేహకుఁడు, సూతుఁడు. (తె).—కిన్నెర్క, బట్టు, బట్టువాఁడు, బటాచ్రజో. ("చూ, సూతుఁడు. 2.") తద్వి.-వంశావళి చేదివెడువానికి:— మగధుఁడు—మాగధుఁడు, మధుకుఁడు.

వందించు. సం. స. క్రి: చూ, స్తుతించు.

వందితుఁడు. సం. విశే. 1. నమస్కరింపఁ బడినవాఁడు; 2. స్తుతింపఁబడినవాఁడు.

వందియ. దే. వి: చూ, రూ—వంద (1).

వందిలీకము. వా. వి: చూ, వినయము.

వందు. దే. అ క్రి: చూ, సంతాపించు.

వందుర. దే. వి. 1: చూ, శోకము; అ. క్రి... 2. క్లేశపడు; 3: చూ, శోకించు.

వండె. దే. వి: చూ, రూ-వందియ.

వందొందు. దే. వి ఒకచేఁప: చూ, మత్స్యము. 1.

వంద్యుఁడు. సం విశే. 1. నమస్కరింపఁ దగిన వాఁడు; 2. స్తుతింపఁ దగినవాఁడు.

వంధ్య. సం. వి. ఆ. స్త్రీ. 1.—పంజె గొడ్రాలు: చూ, స్త్రీ; 2. గొడ్డుటావు, వశ: చూ, ధేనువు; విశే 3. ఫలింపనిది (చెట్టు లోనగునది): అఫలము, అవకేశి. (తె).—గొడ్డుమ్రాను.

వంధ్యలు. అం: కదలీ, కాక, అంగ్య, స్త్రీ ప్రజా, స్రవద్గర్భ, రజోవంధ్యలు. (6)

వంధ్యాకర్కోటకి. సం. వి. ఈ. స్త్రీ. చేఁదబీఱ*: చూ, హ్రస్వగవేధుక. [అనురీతి.

వంధ్యాపుత్రన్యాయము. అం. ఏమియులేనిది

వంపు. వై. వి. 1. వంగుట, చూ, వేల్లితము. 3; 2. వక్రము: చూ, వేల్లితము. 3; విశే. 3. వంగినది: చూ, వేల్లితము. 3; 4. వంకరైనది: చూ, వేల్లితము. 3.

వంశకము. సం. వి. అ. న. రూ-వంశిక. అగరుగంధము: చూ, రాజార్హము(అగరుచెక్క అని కొందఱు)

వంశక్షయాంశము. అం: చూ, షష్ట్యంశములు.

వంశజ. సం. వి. ఆ. స్త్రీ. తవాక్షీరి*: చూ, వంశరోచన; 2. వెదురువంటి చెఱకు*: చూ, సుకుమారము. 1.

వంశనర్తి. సం. వి. ఇ. పుం: అఖుభుక్కు, కోహాటకుఁడు, కోహాటికుఁడు. (తె. వ).—

దొమ్మరవాఁడు, దొమ్మరి. తద్వి.— దొమ్మ
రిది.— (సం. వ.) —క్షుద్రి.
-వంశపత్రపతితము. అం: చూ, వృత్తము. 1.
("భ-ర-న-భ-న-వ గణములు. 11 యతి
17 ఛందస్సు.")
వంశము. సం వి. అ. న. 1. ఒక పురాణలక్ష
ణము: చూ, పురాణము. 6; పుం. 2.=వంగ
డము, కులము: చూ, సంతతి. 1; 3.=వాస
ము. వెదురు*: చూ, వేణువు. 1; 4. పిల్లం
గ్రోవి, మురళి (ఇది అల్లోజా): చూ, వీణె;
5: చూ, వెన్నెముక; 6. వెన్నుగాఁడి;
7: చూ, సమూహము; 8: చూ, గోత్రము.
13; అం. 9: చూ, పేత్రము: 10: చూ,
సుషిరవాద్యములు.
-వంశరోచన. సం. వి. ఆ. స్త్రీ: త్వక్షీర-త్వ
క్షీరము-త్వక్షీరి-తుకాక్షీరి-తుగాక్షీరి-తవా
క్షీరి-తవక్షీరి, వంశజ*
వంశస్థము. అం: చూ, వృత్తము. 1. ("జ-త-
జ-ర. 8 యతి. 12 ఛందస్సు.")
-వంశాకువు. సం. వి. ఉ. పుం. పులుఁగు: చూ,
శకుంతి (పక్షి.)
వంశానుచరితము. అం: చూ, పురాణము. 6.
వంశశేము. అం: చూ, అసంయుతహస్తములు.
వంశి. సం. వి. ఈ స్త్రీ: చూ, వంశము. 4.
వంశిక. సం వి. ఆ. స్త్రీ: చూ, వంశకము.
వంశికము. సం. వి. అ. న.—పై.—
వకము. సం. వి. అ. పుం: చూ, రూ-బకము
వకవకలు. దే. వి. బ. 1. రూ-వకావకలు:
చూ, వికావికలు; 2 బ్రద్దలు: చూ, శక
లము. 4.
వకావకలు. దే. వి. బ.—పై.—
వకీలు. వా. వి: ప్లీడరు, న్యాయవాది, అడ్వొ
కేటు, బారిష్టరు, పరార్థవాది, పక్షవాది.
-వకుళము. సం. వి. అ. పుం.=పొగడ*: రూ-
వకులము, అమరము, కాలస్కంధము, కేశ
రము-కేసరము, గూఢపుష్పము, చిరపుష్ప
ము, మకురము-ముకురము. (తె).—పొగ
డ-పొవడ. (దీనికి దోహదక్రియ ముఖ
సీధువు)
వక్క. వై. వి.=వల్క: చూ, వీరె. (తద్వి.—
నూదిగొంటు వక్కకు:— యోజనము.):
చూ, స్రంసి. 1.
వక్కణ. వై. వి.=వ్యాఖ్యానమ్. (రూ-ఒక్క
ణ-వక్కణము-వక్కన-వక్కాణ-వక్కా
ణము.) 1. వివరము, నైనము: చూ, వ్యా
ఖ్యానము; 2 జాబునందు మొదట వ్రాయు
గౌరవబిరుదముల పద్ధతి.
వక్కణము. వై. వి =—పై.—
వక్కణించు. వై. స. క్రి. వచించు. రూ-
వక్కాణించు. పాండు. 4, ఆ. 92: చూ,
శబ్దించు.
వక్కన. వై. వి.=: చూ, రూ-వక్కణ.
వక్కరము. వై. వి. ? =వక్రమ్. రూ-వంకర-
వంక-వాఁకి: చూ, వేల్లితము. 3; విణ.
2. వంకరైనది: చూ, వేల్లితము. 3.
వక్కరాలు వై. విణ. (వక్కరము + ఆలు)
కుటిలస్త్రీ. జై 2, ఆ. 115: చూ, స్త్రీ.
వక్కరించు. వై. అ. క్రి. రూ-వక్కళించు.
విక్రి. 8, ఆ 44: చూ, రూ-వక్కళించు.
వక్కళించు. వై. అ క్రి. (ఉ, హరి. 6, ఆ.
60): వక్కరించు, ఈడాడు, ఎది
రించు, ఎదురు, ఎదురుకొను, ఎదురుచు-ఎ
దుర్పు-ఎదుర్చు. ఎదురుపడు-ఎదుర్పడు,
ఒడ్డారించు చెనకు, చెనయు, డీకొను-దీకొ
ను, తలపడు, తాఁకు, తిరుగఁబడు, తొడరు,
దాడియాడు, దొరలు, పదురుచు-పదుర్చు,
పెనఁగు, మార్కొను-మాఱుకొను, మార్పె
ట్టు-మాఱుపెట్టు, మాఱొడ్డు, మొదలకించు-
మొదలించు, మెండొడ్డు, మొహరించు-మో
హరించు, రాయు. (సం. వ).—ప్రతిఘటించు

చే. తద్వి.—౧. ఎదుర్కొనిపోవు అనుటకు.— (సం. ప).— ప్రత్యుద్గమించే; ౨. వచించేటకు: (చూ, శబ్దించే.)

వక్కలాకులు. ద్వ. వి. బ. పోఁకచెక్కలు లోనగువానితోఁగూడిన తాంబూలము: చూ, విడెము.

వక్కాకు. ద్వ. వి. (వక్క + ఆకు.)—పై.—

వక్కాణ. వై. వి.=: చూ, రూ—వక్కణ.1-2.

వక్కాణము. వై. వి.=వృత్తాంతము. జై. 8, ఆ. 83: చూ, సమాచారము. 2.

వక్కాణించే. వై. స. క్రి. 1. వ్యాఖ్యానము చేయు; 2. వాకుృచ్చే: చూ, శబ్దించే.

వక్కి. వై. వి. 1.=బక. రూ—వక్కు, వక్కుపులుఁగు, కొంగ: చూ, బకము; దే. విణ. 2. బక్క: చూ, సారవు.

వక్కికట్టియ. ద్వ.విణ. రూ-వక్కికట్టె. బక్కవాఁడు: చూ, కాతుఁడు.

వక్కికట్టె. ద్వ. విణ.—పై—

వక్కు. వై. వి. 1.=బక: చూ, రూ—వక్కి. 1; దే. అ. క్రి. 2. బక్కటిల్లు, కృశించే; చూ, సొటసొటవోవు; 3. అడుగంటు: చూ, శోషించే.

వక్కుపులుఁగు. ద్వ. వి: చూ, వక్కు. 1.

వక్త. సం. విణ. (ఋ. ఈ. ఋ) 1. విశేషముగా మాటలాడువాఁడు: వాచాటుఁడు, వాచాలుఁడు, వావదూకుఁడు. (తె. ప).— గట్టివ, చెప్పువాఁడు, నుడువరి, నోడికాఁడు—నోడికారి, బాతాఖాని, మాటకాఁడు-మాటకారి, మాటలమారి, ప్రేలరి, ప్రేలువాఁడు, రజ్జోలాఁడు, వదర, వదరుఁబోతు, వాతరట్టు. తద్వి.—౧. అసహ్యముగా మాటలాడువానికి.—(సం).—గదయిత్నుత్న, గాయముఁడు, జల్పాకుఁడు, బహుగర్హ్యవాక్కు; ౨. ఇంటిలోనుండిప్రగల్భోక్తులుపలికెడివానికి:—గేహేనర్ది, గేహేశూరుఁడు; ౩. చక్కఁగా మాటలాడువానికి:—ప్రవక్త, వచక్నువు, వదావదుఁడు—వదుఁడు, వాగ్మి: (చూ, సుధి.); ౪ ఆత్మస్తుతిపరునకు.—(తె). రజ్జోలాఁడు; ౫. మనోజ్ఞముగా మాటలాడువానికి.— వదన్యుఁడు—వదాన్యుఁడు; 2. పండితుఁడు: చూ, సుధి.

వక్తవ్యము. సం. వి. అ. న. 1. మాట: చూ, శబ్దము. 2; విణ. 2. మాటలాడఁదగినది, భాష్యము: చూ, సంభాష్యము. తద్వి.— చక్కఁగా మాటలాడఁదగినది: ప్రవచనీయము; 3. నిందింపఁదగినది: చూ, హీనము. 1.

వక్త్రి. సం. వి. ఈ. స్త్రీ. పాత్రా*: చూ, విద్ధకర్ణి.

వక్రగ్రీవము. సం. వి. అ. న: చూ, లొట్టిపిట్ట.

వక్రతములు. అం: "ఐ ఔ" లు.

వక్రద్వారము. సం. వి. అ. న.=వంకదారి-వంకరదారి.

వక్రపుచ్ఛము. సం. వి. అ. పుం. కుక్క: చూ, శునకము.

వక్రమగు. మి. అ. క్రి: చూ, వంకరవోవు.

వక్రము. సం. వి. అ. న. 1.=వంక. ఏటివంకర: చూ, వేల్లితము. 3; 2.=వంకి. కొంకికత్తి: చూ, హేతి. 4 (రిష్టి. 2.); వా. 3.=వాఁక. చక్రము; విణ. 4.=వక్కరము, వంకరైనది: చూ, వేల్లితము. 3; 5. క్రూరమైనది: చూ, సాధ్వసము; అం. 6: చూ, చిబుకక్రియలు.

వక్రములు. అం: "ఎ ఏ ఒ ఓ" లు. (వంకరగానుండునవి.)

వక్రశృంగి. సం. వి. ఈ. స్త్రీ. వంకర కొమ్ములుగల యావు: చూ, సౌరభేయి (ధేనువు.)

వక్రాంగము. సం. వి. అ. పుం: చూ, శకుంతి (బటువుగువ్వ.)

వక్రాంగి. సం. వి. ఈ. స్త్రీ. 1. కటుకరోహిణి*: చూ, శకులాదని; విణ. 2. వంకరైన దేహముగలది.

**వక్రించే.** సం. అ క్రి. మగలు, మరలఁబడు: చూ, వటిగ్రిలు. 1.

**వక్రిమ.** సం. వి. న్. పుం. 1. రూ-వక్రిమము: వంకర: చూ, వేల్లితము. 3; వి॰. 2. వంగి నది: చూ, రూ_వక్రిమము.

**వక్రిమము.** సం. వి. న్. పుం. 1: చూ, రూ-వక్రిమ. 1; విశ. 2. వంగినది: రూ-వక్రిమ, అననతము-ఆనతము-నతము, ఉన్నతానతము, అవాగ్రము, నమితము, నమ్రము, ప్రహ్వము. బంధురము-బంధూరము, భుగ్నము, వినత. (తె).—ఓర, దిగుడు-దిగ్గుడు, దిగువాయి, వాటము.తద్వి.-మిక్కిలి వంగినది:వినమితము, వినమ్రము.(వంకటకు: చూ,వినయము. 1.)

**వక్రుఁడు.** సం. వి. అ. పుం. 1. కుజుఁడు: చూ, రాహువు. 2; 2. శని: చూ, రాహువు. 2.

**వక్రోక్తి.** అం: చూ, అలంకారము. 3. (శ్లేష కాకువులచే నన్యార్థ కల్పన మొనర్చుట. "ఉదా.— నాతివకన్నె నరింపు మానంది గాంగ-నంది గానొనర నాతర మే.")

**వక్త్రము.** సం. వి. అ. న. 1. నోరు: చూ, వదనము. 1; 2. మొగము: చూ, వదనము. 2; 3. ఒకబట్ట: చూ, వస్త్రము.

**వక్త్రశోధనము.** సం. వి అ. పుం: చూ,నిమ్మ*.

**వక్షఃక్రియలు.** అం: సమము, ఉద్వాహితము, నిభుగ్నము, అభుగ్నము, ప్రకంపితము.(5).

**వక్షము.** సం. వి. స్. న: రూ-వక్షస్సు. 1. అంకము, ఉరము, ఉరస్సు, కవచము, క్రోడ, భుజాంతరము, వత్సము, హృదయము, హృది. (తె).—అక్కు, ఉరవు, ఎడఁద-ఎడ్డ_ఎడ్డ-ఎద, చేనుమట్టి, బోర, రొమ్ము-ఱొమ్ము. తద్వి.—౧. ఱొమ్మునడిమిభాగమునకు.—(తె) ఎదురుఱొమ్ము; ౨. మాంసముగల ఱొమ్మునకు.—(తె) నానుబోర; అం. 2: చూ, గురుమతమున వ్యూహాంగములు; 3: చూ, శుక్రమతమున వ్యూహాంగములు; 4. (పురుషుని ఱొమ్ము): చూ, లక్షణాంగములు. (వృషభమై విశాలమైన ధనధాన్య సంపన్నుఁడగు. సమమైన సేనాధిపతియగు. నరములు గనిపించుచో గుంతలైన దుఃఖకరము.); 5.(స్త్రీ ఱొమ్ము): చూ, స్త్రీలక్షణాంగములు. (రోమమువున్న విధవయగు. మిట్టయున్నఁబుత్రనాశనమగు. రోమంహీనమైన యోగ్యరాలగు); 6: చూ, నాట్యోపయోగాంగములు (అంగము 3); 7: చూ, హస్తక్షేత్రములు.(రూ—వక్షస్సు.)

**వక్షశ్చిత్రి** అం: చూ, చిత్రవర్ణములు.

**వక్షస్థలము.** పా. దీనికి ఉపమానములు:-కవాటము, మన్మథుని పుట్టినిల్లు మొ.

**వక్షస్సు:** చూ, రూ-వక్షము.

**వక్షస్స్వస్తికము.** అం: చూ, కరణములు.

**వక్షోరుహము.** సం. వి. అ. పుం. బ. పాలిండ్లు, గుబ్బలు: చూ, స్తనము.

**వగ.** దే వి. 1: చూ, సంతాపము; 2. చింత: చూ, విప్రతీసారము; 3. వ్యాస. అని. 2, అ. 78 చూ, శోకము; 4. సొమ్పు: చూ, విలాసము. 2; 5. రీతి: చూ, విధము. 1; 6. ఏడుపు: చూ, శోకము; 7.ఊహ: రామా. 5, అ. 43: చూ, యోచన; 8. గతి, వర్తనము: చూ,సమయము. 2; 9. రూ-వగపు_వనట. తిహతిహ: చూ, సంభ్రమము. 1.

**వగకత్తె.** ద్వ. విణ. విలాసవతి: చూ, స్త్రీ.

**వగకాఁడు.** దే. విణ. విలాసవంతుఁడు: చూ, సౌందర్యవంతుఁడు.

**వగచే.** దే. అ. క్రి. 1. అడలు:చూ, శోకించే; 2. నొచ్చుకొను; చూ, నుర్కు. 11: 3. ఏడ్చు: చూ, శోకించే; 4. దుఃఖించే: చూ, శోకించే; స. క్రి. 5. విచారించే: చూ, విమర్శించే; 6. ఆలోచించే, యోచించే: చూ, సంకల్పించే; 7. తలఁచే, అనుమానించే: చూ, సంకల్పించే.

వగడెంచే. దే. పే్రి. వగడగఁజేయు. ఉ, రా. 6, ఆ. 211: చూ, సవరించే 2

వగడెగు. దే. అ. క్రి. పరిష్కృతమగు: చూ, సవరించే. 2. (వగఁడెగు అని కొందఱు)

వగపు. దే. వి. 1. ఏడ్పు: చూ, శోకము; 2. చింత: చూ, సత్రీసారము (సందర్భా నుసారముగ వగచే ధాతువునకుఁ గల యిత రార్థములు దీనికిఁ జెప్పవచ్చును.)

వగయిరా. వా. వి: చూ, రూ-వగైరా.

వగరము. దే. వి: చూ, రూ-వగరుపు. విక్రి. 2, ఆ. 155.

వగరు. దే. వి: చూ, రూ-వగరుపు.

వగరుచే. దే. అ. క్రి. రూ-వగర్చు, నిట్టూరు చే-నిట్టూర్చు, బుసకొట్టు, రోఁజే.(సం).—నిశ్వసించే-నిశ్వాసించే.

వగరుపు. దే. వి. రూ-వగరము-వగరు-వగర్పు, నిట్టూరుపు-నిట్టూర్పు,రొండు-రొడ్డు-రొప్పు, రోఁజే. (సం).—నిశ్వసనము-నిశ్వాసము (చూ, రోగము 1—౧౦.)(చూ,వాయువు.)

వగర్చు. దే. అ. క్రి: చూ, రూ-వగరుచే.

వగర్పు. దే. వి: చూ, రూ-వగరుపు.

వగలాఁడి. దే. విశ. (వగలు + ఆఁడి): చూ, వగకత్తె. శకాం. 3, ఆ. 75.

వగలాఁడు. దే. విశ (వగలు + ఆఁడు): చూ, వగకాఁడు.

వగైరా. వా. వి మొదలగునవి: రూ-వగయిరా. (సం).—ఆదులు;తద్వి.-(సం) —ఇత్యాది.

వగ్గటము. దే. వి: చూ, వక్కి. 1.

వగ్గు. వై. వి. 1: చూ, రూ-వక్కి. 1; దే. అ. క్రి. 2: చూ, వక్కు. 1. "ముసలివగ్గు, వగ్గు తపసి" [వఱపు.

వగ్రిహము. సం. వి. అ. పుం. కఱవు: చూ,

వచ. సం. వి. ఆ. స్త్రీ. 1.—వస, ఉగ్ర, ఉగ్ర గంధ, లోమశ. (తె).—వల్లవస, వజే, వస: చూ, విష; 2. గోరువంక: చూ, శారిక. 1; 3. చిలుక: చూ, శుకము.

వచక్నువు. సం. వి. ఈ. పుం. 1. నిర్భయముగా సభలో మాటలాడువాఁడు: చూ, వక్త; 2. బ్రాహ్మణుఁడు:చూ, స్వస్తిముఖుఁడు. 1.

వచనప్రికారకర్తరి. సం.విశ:చూ, విధేయుఁడు.

వచనము సం. వి. అ. న. రూ-వచస్సు-వాచ-వాక్కు. మాట: చూ, శబ్దము. 2. (వాక్యము అని కొందఱు.)

వచనములు. అం. 1: ఏకవచనము, ద్వివచనము, బహువచనము (3); 2: ఏకవచనము, బహువచనము (2). [కర్త 8.

వచస్థితుఁడు. సం. విశ: చూ, వచనప్రికార

వచము. సం. వి. అ. పుం. చిలుక: చూ, శుకము. 2

వచసాంపతి. సం. వి. ఇ. పుం. బృహస్పతి గ్రహము: చూ, రాహువు. 2.

వచస్సు. సం. వి. స్. న: చూ, రూ-వచనము.

వచించే సం స. క్రి. రూ-వాచించే. మాటాడు, భాషించే: చూ, శబ్దించే.

వచ్చే. వై వి. 1 —వాంఛ: చూ,వాంఛ; దే వి. 2. చెట్టుకుఁబట్టి నాశనముచేయు నొకచీడ: చూ, సస్యసంహారి (పురుగు.)

వచ్చే. దే. అ. క్రి. 1. దూరమునుండి దగ్గఱకు నడచే 2: అరుగుదెంచే-అరుదెంచే, ఏగుదెంచే-ఏతెంచే, చేనుదెంచే, విచ్చేయు, విజయంచేయు-విజయము చేయు, వేంచేయు. (మి).—ఆగతమగు; 3. కూడు: చూ, సరిపడు. 2

వచ్చేబడి. దే. వి: రూ-ఒచ్చేబడి, రస్మి, రాబడి, లాభము, వరుమానము. (సం).—ఆదాయము, ఆయతి, ఆయము, లాభము.

వచ్చేరాములు. దే. వి. బ. (వచ్చేట+రాము.) శాకయు రామియు. పాండు, 4, ఆ.88.

వజీరు. వా. వి. (రూ—వజీరుఁడు—వజ్జీరు—వజ్జీరుఁడు—వజీ్రఁడు.) 1. మంత్రి: చూ, సచివుఁడు; 2. జోదు. శూరుఁడు. పా. 1. ఆ. 62: చూ, వాంవీరుఁడు.

వజీరుఁడు. వా. వి. —పై.—

వజ్జిరము. దే. వి. 1. సముద్రపుఁజేఁప: చూ, మత్స్యము. 1; వై. వి. 2.=వజ్రము. రవ: చూ, రత్నములు. 3.

వజ్జీరు. వా. వి: చూ, రూ-వజీరు.

వజ్జీరుఁడు. దే. వి: చూ, రూ—వజీరుఁడు. య. 1, ఆ 3.

వజ్రంపుఁదళుకులు. అం: చూ, ధాన్యము.

వజ్రకంటక. సం. వి. ఆ. స్త్రీ. 1. గొలిమిడి*: చూ, స్థూలకంటకము (మొంగబీర); పుం. 2. బొమ్మజెముడు*: చూ, స్నుహి.

వజ్రకము. సం. వి. అ. న. 1. తామరకాయ: చూ, సహస్రపత్రము.

వజ్రకీటము. సం. వి. అ. పుం. సాలగ్రామములోనుండి తొలిచెడుపురుగు: చూ, సస్యసంహారి (పురుగు.)

వజ్రగార. మి. వి. కాంతికొఱకు వజ్రములునూఱివేసినగార: చూ, సమాలంభము. 1.

వజ్రతుండుఁడు. సం. వి. అ. పుం. గరుడుఁడు: చూ, హరివాహనుఁడు.

వజ్రదంతుఁడు. సం. వి. అ. పుం: చూ, వినాయకుఁడు. [చూ, సువిరేచని.

వజ్రద్రువు. సం. వి. ఉ. పుం. ఆకుజెముడు*:

వజ్రధరుఁడు. సం. వి. అ. పుం: చూ, బుద్ధుఁడు.

వజ్రనిర్ఘోషము. సం. వి. అ. పుం. వజ్రముట్టినవలనఁ గలిగిన ధ్వని. రూ—వజ్రనిష్పేషము: చూ, స్వరము. 2. [చూ, శ్రీమాన్.

వజ్రపుష్పము. సం. వి. అ. న. నువ్వుపువ్వు:

వజ్రభిదువు. సం. వి. ఉ. పుం. నల్లి: చూ, రక్తాంగము. 1. [చూ, శాదఘ్నము.

వజ్రబీజకము. సం. వి. అ. పుం. తీఁగకానుఁగు*:

వజ్రము. సం. వి. అ. పుం.న.1=వజ్జిరము. రవ: చూ, రత్నములు. 3; 2. రాముని విల్లు, కులిశము, వజ్రాశని, వజ్రాయుధము: చూ, బాణము. 1; 3. కట్టులులోనగువాని నతికించుబంక: చూ, సరేసు; అం. 4: చూ, యోగములు; 5: చూ, ముక్కుడిరెంటాయుధములు (ఇదె వజ్రాయుధము); 6: చూ, ప్రస్థానవ్యూహములు; 7: చూ, తావను (ముహీనతానములు); 8: చూ, దిక్పాలాయుధములు.

వజ్రలేపనన్యాయము. అం. ఒకచోట నొకవస్తువయందుంచి దానిపైన గచ్చుచేసినయెడల నెన్నటికి నది కదలదనురీతి.

వజ్రవల్లి. సం వి. ఈ. స్త్రీ. నల్లేరు*: చూ, హాస్తి. [చూ, స్కంధజము.

వజ్రవృక్షము. సం. వి. అ. పుం. నల్లమట్టి*:

వజ్రసూర్యుఁడు. సం. వి. అ. పుం: చూ, బుద్ధుఁడు.

వజ్రహోపము. సం. వి. అ. పుం. శివునిక త్తి: చూ, హేతి. + (రిష్టి. 2; బాణము. 1. రా3.)

వజ్రహేతువు. సం. వి. ఉ. పుం. కొండచీమ: చూ, పిపీలిక. [చూ, వారవారణము.

వజ్రాంగి. సం. వి. న్. పుం. వజ్రమయకవచము:

వజ్రాక్షి. సం. వి. ఈ. స్త్రీ. 1. తుమ్మ*: చూ, విట్టదిరము; 2. నల్లేరు*: చూ, హాస్తికుండి.

వజ్రాగ్ని. సం. వి. ఇ. పుం. ఇరమ్మదము, మేఘజ్యోతి: చూ, వహ్ని. 1.

వజ్రాభ్రకము. సం. వి. అ. న. అభ్రకభేదము.

వజ్రాయుధము. అం. రాముని విల్లు: చూ, వజ్రము. 2.

వజ్రాలయము. సం. వి. అ. పుం. వెండికొండ: చూ, హిమాలయము (పర్వతము)

వజ్రాశని. అం: చూ, వజ్రాయుధము.

వజ్రాసనము. అం: చూ, ఆసనములు.

వజ్రాస్త్రము. అం: చూ, అస్త్రములు: (చూ, వజ్రము. 2.)

వజ్రి. సం. వి. న్. పుం. 1. ఇంద్రుఁడు: చూ, సహస్రాక్షుఁడు; 2. జినుఁడు: చూ, బుద్ధుఁడు; 3. ఆకుజెముడు*: చూ, సువిరేచని.

వజ్రిక. సం. వి. ఆ. స్త్రీ. 1: అలంబుషము, త్రికంటకము. (తె). — ములు జెముడు*: (చూ, స్నుహి); అం 2: చూ, క్రతులు.

వజ్రికంఫలము. సం. వి. అ. న. కర్కోటకి*: చూ, సహస్రపత్రము.

వజీరుఁడు. దే. వి: చూ, రూ-వజీరు.

వజే. వై. వి.=వచ. రూ-వస*: చూ, వచ. 1.

వజ్జ. దే. వి. ఉపాయము: చూ, వెరవు. 1.

వట. సం. వి. ఆ. స్త్రీ. కొండనాలుక, లంబిక, సూన: చూ, సుధాస్రవము: (చూ, రసన. 1; చూ, రోగము. 1-ర.)

వటకము. సం. వి. అ. పుం. 1.=వడియము-వడుకము-వడెము: చూ, వడియము; 2. అంకుశము: చూ, సృణి; 3. నల్లమద్ది*: చూ, వటము. 3.

వటగ. వై. విశే.=పటు. రూ-వటారి-వతర-వతారి. నేర్పరి: చూ, సమర్థుఁడు.

వటపత్రిక. సం. వి. ఆ. స్త్రీ. కుక్కపాల*: చూ, విశల్య. [పెద్దచెట్టిమిడియున్న రీతి.

వటబీజన్యాయము. అం. చిన్న మఱ్ఱిగింజయందు

వటము. సం. వి. అ. పుం, న. 1.=వడము. త్రాడు: చూ, సూత్రము. 1; 2. దండ: చూ, హావణిక. 2(భూషణము. 2.); పుం. 3. మఱ్ఱి*: చూ, స్కంధజము; 4: వరాటకము, వరాటిక. (తె). — గవ్వ: చూ, సంకు. 1.

వటమూలగుఁడు. సం. వి. అ. పుం. దక్షిణామూర్తి రూపుఁడగు శివుఁడు: చూ, శివుఁడు.

వటవట. వా. వి. వాఁగుట యందగు ధ్వన్యనుకరణము: చూ, హాహాహా. [సదనము. 1.

వటారము. దే. వి. నగరు. రూ-వటారు: చూ,

వటారి. వై. వి. రూ-వతారి. 1. బిరుదము, బిరుదు. ఉ, హరి. 6, అ. 129: చూ, సమర్థము. 3; 2: చూ, సమర్థుఁడు; 3. శూరుఁడు: చూ, హంవీరుఁడు (దే. అని శ. ర.) [ఆ. 112

వటారు. దే. వి: చూ, రూ-వటారము. హరిశ్చ. 5,

వటి. సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, వటము. 1. (నల్లమద్ది అని కొందఱు), 2. వర్తి: చూ, వత్తి. 2.

వటించు. దే. అ. క్రి: ఎడపడు, పస్తుండు, లంకనముండు. (సం) ఉపవసించు (ఇది ద్వివిధము.- రోగమందుపవాసము, వ్రతమందుపవాసము అని.) [వట్టివేరు.

వటివేరు. దే. వి. అవురుగంటవేరు*: చూ, రూ-

వటుకుఁడు. సం. వి. అ. పుం. 1=వడుగుఁడు. బ్రహ్మచారి: చూ, వటువు; 2. భైరవుఁడు: చూ, శివుఁడు; 3. బాలకుఁడు: చూ, శిశువు.

వటులులను బ్రాహ్మణులు. అం: చూ, ఘూర్జర బ్రాహ్మణులు. 2118 పుట. (వీరు ఋగ్వేదులు. క్షత్రియవాడ అంప్రేలియందుఁగాననగు.)

వటువు. సం. వి. ఉ. పుం. 1=వడుగు (ఎనిమిదేండ్ల బాలుఁడు): ఉపవీతుఁడు, బ్రహ్మచారి, భిక్షువు, వంతుఁడు, వర్ణి, వేదాంతి. (తె. ప). — ఒంటిజెందెపు వాఁడు, గోఁచికట్టు, గోఁచికాఁడు, గోఁచి బాఁపఁడు, తడవుదాల్పు, తడుపుదాలుపు, బమ్మచారి-బమ్మాచారి-బమ్మసారి-బొమ్మచారి-బొమ్మసారి-బొమ్మాసారి-బొమ్మసారె (అని కొందఱు), ముంజికాఁడు, మెణకరి, వడుగఁడు, వడుగు-వడువు తద్వి.—ం. పుట్టుక మొదలు బ్రహ్మచారికి. (తె) - పుట్టువడుగు; ఇ: (చూ, బ్రహ్మచారులు. గాయత్రిబ్రహ్మచారి=ఉపకుర్వాణుఁడు.); 2.=బటువు. వడుగుంగరము: చూ, హావణిక. 2 (భూషణము. 2.); 3: చూ, విష్ణువు. 1.

వట్ట. దే. వి. 1. చెఱకుగానుగకు వేసెడి అడ్డమ్రాను; బ. 2: చూ, వృషణము.

వట్టకాయ. వా. వి. బ: చూ, వృషణము.

వట్టము. వై. వి.=వృద్ధ. (దే. అని శ. ర) చూ.

మారకము. 1 (తఱుగు 1.); వా. వి. 2.దండుగ. "చేతివట్టము."

వట్టవాఁపు. వా. వి: ఒఱిబీజము - ఒఱుబీజము, బుడ్డ, వరిబీజము. (సం).— అండవాయువు, కురండము, బృహాత్తు, బృహద్బీజము.

వట్టి. దే. విశ. 1. రిక్తము: చూ, శూన్యము. 1; 2. ఉపయోగములేనిది; 3. అసత్యము: చూ, వితథము. [హాజ్జే.

వట్టికాలు. దే. వి. పిక్కవెలుపటికాలు: చూ,

వట్టిగడ్డి. వా.వి: ఎందుకసవు, నల.

వట్టిగొడ్డుతాఁకట్టు. జా. వ్యర్థమైనచేష్ట. "వట్టిగొడ్డుతాఁకట్టితేఁ జెంతయున్న. కళా. ౪, ఆ 74.

వట్టిచేఁప. దే. వి. శుష్కమత్స్యము: చూ, మత్స్యము. 1. [సెగ్గింపు.

వట్టిమాట. దే. వి. లేనిమాట, నిరాపనింద: చూ,

వట్టియావు. దే.వి.పాలులేనియావు: చూ, ధేనువు.

వట్టిపడియము. ద్వ. వి. మినుములోనగు పిండి పడియము: చూ, పడియము.

వట్టివరి. దే. వి. ఒక సస్యము: చూ, సస్యము.

వట్టివేరు. దే. వి. రూ - వటివేరు. *. రామా. 1, ఆ. 148 (ఇది తెల్ల వట్టివేరు, నీరు వట్టివేరు అని ద్వివిధము): చూ, నేవ్యము. 1-2-3.

వట్టిసరులు. దే. కా. బ: చూ, ధాన్యము.

వట్టు. దే. వి. 1. ఎండవేసిన కాయదినుసు; వత్తి, వరుగు; 2. ఎండినపక్షి; 3. దూలములోనగువానికి బలముకయి వేసెడుకట్టు; వా. 4. ఒట్టు: చూ, శపథము; అ. క్రి 5. ఇంకు: చూ, శోషించు. 1; 6. ఎండు: చూ, శోషించు. 2; 7. కృశించు. మార్క. 8, ఆ. 139: చూ, సొటసొటవోవు.

వట్నము. దే. వి. బస్తా, జెడక: చూ, సంచి. (దీన్నిని మోసికొనిపోయెడుకట్టవట్నాలకట్టి.)

వటు్రి. వై. విశ.=వృత్త. రూ - వటు్రిన-వట్రువ. గుండ్రము: చూ, వృత్తము. 5.

వటు్రిన. వై. వి.=వర్తుల: చూ, వటు్రి.

వటు్రిపడు. వై. అ. క్రి. తగ్గు. హరి. ఉ. 10, ఆ. 182: చూ, సుడిక్కు. 9.

వటు్రిపెట్టు. ద్వ. స. క్రి. 1. తక్కువపఱుచు; తగ్గించు, అతకరించు, తీసివేయు; 2. లక్క్యపెట్టు.

వటు్రిము. వై. విశ. 1.=వర్తన. కుఱుచు: చూ, హ్రస్వము; శే. వి. 2. వకార్కృతి: చూ, హడపము; వా. 3: బనితెమ.

వటి్రించు. వై. అ. క్రి. 1. పెడమోముపడు, మాఱుమొగముపడు, వటి్రిలు-వ ట్రిల్లు: చూ, వెనుదీయు. 1; 2. గుండ్రముగా చెక్కు; 3. వంపుగాచేయు.

వటి్రిలు. వై. అ. క్రి.=వృత్. రూ - వటి్రిల్లు: చూ, వటి్రించు. 1—2; 3. పరివర్తిల్లు. విజ. 2, ఆ. 45: చూ, వర్తించు; 4. కలుగు: చూ, సంభవించు. [6, ఆ. 55.)

వటి్రిల్లు. వై. అ. క్రి.—వై.— (హరి. ఉ.

వటు్రివ. వై. వి.=వర్తులమ్. 1. గుండ్రము, వర్తులము: చూ, వృత్తము. 5; 2. బుడకారము, వటు్రివసుడి: చూ, సుడి.

వటు్రివపుస్త. వై. వి. చక్రిలః: చూ, పుస్తకము. [సుడిపుసి వాడుక.)

వటు్రివసుడి. ద్వ. వి: చూ, వటు్రివ. 2. (వట్రి

వఠర. దే. విశ.=వటారి: చూ, సమర్థుఁడు. (శూరుఁడు అని కొందఱు.)

వఠారి. దే. విశ: చూ, రూ—వటారి. 1_2_3. (ఉ, హరి. 2, ఆ. 194.)

వడ. దే వి. 1. తాపము. హరి. పూ. 8, ఆ. 33: చూ, సంతాపము; 2. వెచ్చన. రామా. 1, ఆ. 151: చూ, వేఁడిమి. 2; 3. గారె. అని. 1, ఆ. 41: చూ, భక్ష్యము. 1. (కారపువడ, పెరుఁగులోవడ లోనగునవికలవు.); 4. అలసట: చూ, శ్రమము. 1.

వడఁకాడు. దే. అ. క్రి. (వడఁకి + ఆడు) వడఁకు: చూ, వణఁకు. 2.

వడఁకు. దే. వి. 1. రూ-వణఁకు. కంపము. పా. 5, ఆ. 46: చూ, లోలము; అ. క్రి. 2. (వై. 6, ఆ. 102): రూ-వదుఁకు-వణఁకు, గడగడలాడు, గిటగిటమను, జలదరించు-జలపరించు, దడియఁబడు, దడియు, వడఁకాడు, వడుకొను, వలికొను, రాలుపడు-రాల్పడు. (సం).—ఆకంపించు, ఉత్కంపించు, కంపించు. తద్వి.— ఆకస్మికముగా కంపించు.—అదిరిపడు, ఉదరిపడు, ఉలికిపడు; ("చూ, సలించు."); 3. చలించు: చూ, సలించు. [పర్వతము.

వడఁకుగుబ్బలి. ద్వ. వి. హిమాలయము: చూ,

వడఁకుఁగొండ. ద్వి. వి.—వై.—(రామా. 1, ఆ. 26.) [అయనము.2.

వడఁకుత్రోవ. ద్వ. వి. ఉత్తరాయణము: చూ,

వడఁగొట్టు. వా. అ. క్రి: చూ, వడగొను.

వడఁబోఁత. వా. వి. వడఁబోయుట. తద్వి.— విశ. వడకట్టఁబడినది. (సం):-పూతము.

వడఁబోయు. దే. స. క్రి. పాత్రిమునోటికి గుడ్డకట్టి నీళ్లు లోనగువాని వడియఁగట్టు. రసి. 1, ఆ. 16: వడగట్టు, వడిఁబెట్టు,వడియఁబెట్టు, వడియఁబోయు. తద్వి.- జలాదులంబట్టికదేలించు.—వలచు,వానించు.

వడగట్టు. వా. వి.—వై.—

వడగరులు. వా. వి. బ: చూ, బడగులు.

వడగల్లు. దే. వి.(వడఁకు + కల్లు): వానరాయి. (సం).—ఇరాచరము, కరక-కరకము-కరము, గోఘృతము, ఘనకఫము, ఘనోపలము, ట్ట, తోయడింభము, వరామృతము, బీజోదకము, మేఘాస్థి, వర్షణము, వర్షోపలము.

వడగవ్వ. దే. వి. ఒకచేఁప: చూ, మత్స్యము.1.

వడగాలి. దే. వి. వేసఁగిలోని నిప్పుగాలి. చారవాయువు: చూ, వాయువు. (ఇట్లు వడగాడుపు-వడగాడ్పు.)

వడగొను. దే. అ. క్రి. ఎండచే తపించు: చూ, సంతాపించు.(వడఁగొనుఅనికొందరు.);

వడచు. దే. స. క్రి. గ్రా-వడుచు. 1: కాచుచు-కార్చు-కాచుచు, ఒలుకు; 2. విడుచు: చూ, విసర్జించు; 3. నూనె లోనగువాని దించు.

వడజక్కులిక. ద్వ. వి. కుబేరుఁడు: చూ, శ్రీదుఁడు. [హారిత్తు. 1.

వడదెస. దే. వి. ఉత్తరపుదిక్కు, దాకడ: చూ,

వడదోలు. దే. వి. (వడము + తోలు) 1. వేఁటకాఁడు కప్పుకొనెడు నిడుపుతోలు: చూ, శకలము. 1 (బెరడు. 1.); 2. గవుండ్లవాని మొల నిడుపుతోలు: చూ, శకలము. 1. (బెరడు. 1.)

వడపప్పు. దే. వి. నానఁబెట్టిన పెసరపప్పు: చూ, సూపము. [కాశీ. 4, ఆ. 114.

వడపిందె. దే. వి. బ. ఊరవేసిన మామిడిపిందె.

వడమబ్రాహ్మణులు. అం: చూ, ద్రావిడులు. (బ్రాహ్మణులు.) (కృష్ణయజుర్వేదీయులును కౌండిన్యసూత్రముగలవారు.కౌషీతక సూత్రజ్ఞులను ఋగ్వేద సామవేదములు గలవారును గూడఁ గలరు.)

వడము. వై. వి. 1. దండ: చూ, భూషణము. 2—(32);2.=వట. మోకు:చూ,సూత్రము.1.

వడముడి. దే. వి: చూ, వృకోదరుఁడు.

వడలు. దే. అ. క్రి. వాడు: చూ, స్రుక్కు.14.

వడవ. సం. వి. అ. స్త్రీ.=బడబా. కుంటెనకత్తె: చూ, శంభళి.

వడవడ. దే. వి. వడఁకుటయందగు ధ్వన్యనుకరణము: చూ, హూహూ.

వడవడఁకు. దే. వి. అధిక కంపము: చూ, లోలము. 1. [చూ, బొత్తిగా.

వడారము. దే. ద్రి. క్రి. విశ. మొదలంటు:

వడి. వై. వి. 1.=వలి.పద్యయతి: చూ, యతి. 1; దే. వి. 2. వేగము: చూ, స్యదము; 3: చూ, కార్యము.1; 4. కాలము: చూ, సమయము.2;

-వా. 5. మెలి. "వెంటి వడి(త్రిప్పు.": చూ, లంకియ. 3; 6. దారముపిరి: చూ, లంకెయ. 8; 7. పురిబిగువు; 8. పురిబిగువునఁబడు చిక్కు.

వడిఁగట్టు. దే. వి. 1: చూ, శోధనము. 1; స. క్రి. 2: చూ, వడఁబోయు. (సంధినివర్ణలోపము.)

వడిఁబెట్టు. దే. స. క్రి. 1: చూ, వడఁబోయు భో. 3, ఆ. 185; 2: చూ, శోధించు. 1. ఆము. 2, ఆ; వా. 3. పిరిత్రిప్పు; 4. నడకయందు వేగముకలిగించు.

వడికాఁడు. దే. విణ. 1: చూ, వేగిరకాఁడు; 2. శూరుఁడు: చూ, హంవీరుఁడు.

వడిగలతనము. ద్వ. వి. వడితనము. కవిక. 1,ఆ: చూ, శౌర్యము. 1.

వడిగలవాఁడు. దే. విణ: చూ, వడికాఁడు.1-2.

వడిగొను. దే. అ. క్రి. 1. మెలిపడు. "వడిగొన్న సరులతో" క్షేత్రియ: చూ, వెంటిగొను; 2. వేగముగలుగు. భార. ఆది. 6, ఆ; ప్రే. 3. వడిగొల్పు. శశాం. 2, ఆ. 65.

వడిమేట్టు. వా. వి. 1. అకాత్తుగవచ్చెడి ఆపద: చూ, విపత్తు; అ. క్రి. 2. గొప్పచిక్కు. "వడిమేట్టులోఁబడితి."; 3. వేగముగామెట్టుకొను." "అగ్నిజ్వాల నుడిగాలివలన వడిమెట్టెను."; 4. మెలిమెట్టు. "అన్నమఱుగక పేగులఁవడిమేట్టెను.";5.పిరియెక్కు."దారము పేనినకొలఁది వడియెక్కును."; 6. పిరియెక్కునట్లు పేను.

వడితనము. వా. వి: చూ, వడిగలతనము.

వడిపెట్టు. దే. స. క్రి 1. మెలిపెట్టు. విక్రి. 8, ఆ: చూ,వడివేయు; 2. నులుము. హంస. 3, ఆ: చూ, సంహారించు.

వడియ: చూ, వంక్యము. [గట్టు. 2.

వడియఁగట్టు. దే. స. క్రి: చూ, రూ-వడిఁ

వడియఁబోఁత. దే.వి. వడియఁబోయుట.

వడియఁబోయు. దే. స. క్రి. బియ్యము కడిగినీళ్లు వడియనుంచు: చూ,వడఁబోయు.

వడియము. వై. వి.=వటకః. రూ-వడుకము-వడెము. (సం).—వటకము. తద్వి.—౧.ఉట్ట వడియము; ౨. వట్టివడియము. (గుమ్మడి, బూడిదగుమ్మడి, నల్లేరు, పిండి, పేలాలు లోనగువానితో వడియములు పెట్టెదరు. నల్లేరువడియము ఆరోగ్యము. విరేచనకారి.)

వడియు. దే. అ. క్రి. 1. కాఱు: చూ, స్రవించు; 2. ఇంకు: చూ, శోషించు; 3. బక్కటిల్లు: చూ, సాటసాటవోవు. [2-31.

వడివాఁడు. దే. విణ: చూ, పసికాఁడు. సాం.

వడివేయు. దే. స. క్రి. 1: నులుము, పిరిగొను, పెనవెట్టు- పెనవేయు, మెలిపెట్టు- మెలివెట్టు, మెలివేయు, లంకించు, లంకెవెట్టు, వడిపెట్టు. "మీసములు వడివేయుచున్నాఁడు."; 2: నులుము: చూ, సంహరించు.

వడిసీసము. అం: చూ, వృత్తము. 1. (సీసపద్యభేదము. అంతటను యతియే గాని ప్రాస ము లేనిది.) [4-87.

వడుకము. వై. వి: చూ,వడియము. అం, వహా.

వడుకు. దే. స. క్రి.1. కదురులోనగువానిత్రిప్పి దూదిని నూలుగానీడ్చు. "యజ్ఞోపవీతములు వడుకుచున్నాఁడు."; వా. 2. మోసముచేసి సొమ్ము సంగ్రహించు.

వడుకుడు. దే. వి. వడుకుట.

వడుగఁడు. వై. వి.=వటుక. రూ-వడుగు: చూ, వటువు.

వడుగు. వై. వి. 1.—పై.— విజ్ఞా, అచా. కాం; 2: రూ-వడువు. (సం).—ఉపనయనము-ఉపనయము-ఉపనాయము; దే.వి. 3. రూ-వడువు. చంద్రా. 1, ఆ: చూ, విధము. 1. [దానార్హులు.

వడుగుచేయించినవాఁడు. అం: చూ,గయాపిండ

వడుగుచేసినవాఁడు. అం: చూ, పితలు.

వడుచే. దే. క్రి: చూ, రూ-వడచే. 1-2-3.
వడుపు. దే. వి. 1. వడియుట. పాండు. 3, ఆ; వా. 2. నిగిడించిచేయుమేట. "పిల్లివడుపు".
వడువు. వై. వి.=వటుక: చూ, రూ-వడుగు. (బ్రహ్మచారికి.-పాండు. 4, ఆ. 174; విధమునకు.-భార. స్త్రీ. 1, ఆ.)
వడుసు. దే. వి. బట్టచేలువచేయుటలో వడుగు పేకలు సందిచ్చి వంకరగా తొలఁగుట.
వడుసుడి. దే. వి. (వడుసు+సుడి.) 1. రాజు ధనవంతుని బలాత్కారము చేసి పుచ్చుకొనెడు ధనము: దండుగ-దండుగు-దండువ-దండువు; 2. అధికారి యపరాధివలన పుచ్చుకొనెడు ధనము: జేరిమానా-జోలుమానా-జోల్మానా, దండుగ-దండుగు-దండువ-దండువు; 3. నష్టము: చూ, నేగి. 4. [కలదియగు.
వడుసుపోవు. దే. అ. క్రి. వస్త్రము వడుసు
వడెః. దే. వి. రూ-వడియ: చూ, వంక్యము.
వడెము. వై. వి.=: చూ, రూ-వడియము.
వడ్డన. దే. వి. వడ్డించుట: రూ-వడ్డెన.
వడ్డి. వై. వి.=వృద్ధి: చూ, వృద్ధి. 4.
వడ్డించే. దే.స. క్రి: చూ, మార్చు.1. [స్వామి.
వడ్డికాసులవాఁడు. వా. వి.తిరుపతి వెంకటేశ్వర
వడ్డికివడ్డి. వా. వై. వి.=వృద్ధివృద్ధి. వడ్డికిఁగలిగిన వడ్డి, చక్రవృద్ధి: చూ, వృద్ధి. 4.
వడ్డిబ్రతుకు. ద్వ. వి: చూ, వృద్ధజీవిక.
వడ్డిమేపరి. ద్వ. వి. వడ్డిచే జీవించువాఁడు.
వడ్డీ. వై. వి.=వృద్ధి: చూ, రూ-వడ్డి.
వడ్డెన. దే. వి: చూ, రూ-వడ్డన. [ము.
వడ్రంగము. వై. వి. వడ్రంగికర్మ: చూ, వడ్ర
వడ్రంగి. వై. వి.=వర్ధకి. రూ-వడ్ల-వడ్లంగి, వడ్రవాఁడు-వడ్లవాఁడు, రథకారుఁడు: చూ, స్వర్ణకారుఁడు. [శతపత్రము. 1.
వడ్రంగిపిట్ట. వై. వి. రూ-వడ్లంగిపిట్ట: చూ,
వడ్రము. వై. వి: చూ, రూ-వడ్రంగము.
వడ్రవాఁడు. వై. వి: చూ, రూ-వడ్రంగి.

వడ్ల. వై. వి: చూ, వడ్లంగి. (వడ్లవాఁడు, వడ్లది.)
వడ్లంగి. వై. వి.=వర్ధకి. 1: చూ, రూ-వడ్రంగి; అం. 2: చూ, శిల్పులు.
వడ్లంగిపిట్ట. వై. వి: చూ, రూ-వడ్రంగిపిట్ట.
వడ్లకంకణము. వై. వి. ఒకకొంగ: చూ, రకుంతి (బకము)
వడ్లచిలుక. వై. వి. చిలుకపిట్ట: చూ, పురుగు
వడ్లత. ద్వ. వి: చూ, వడ్లది.
వడ్లది. ద్వ. వి.—వై.—
వడ్లబత్తుఁడు. వా. వి: చూ, వడ్రంగి.
వడ్లు. వై. వి. బ. (ఏ. వరి): చూ, ధాన్యము.
వణఁకు. దే. వి, అ. క్రి: చూ, రూ-వడఁకు. (కంపమునకు.- వీర. 4, ఆ.)
వణజి. అం. వణజియను కరణము; చూ, రూ-వణిక్కు. 2.
వణము. సం. వి. అ. న. 1. గన్వ: చూ. వరాటకము. 1; 2. తోఁట: చూ, వనము. 2; 3. అడవి: చూ, విపినము; 4. బయలు వెడలుట, నిర్గమనము: చూ, వెడలఁబాటు.
వణిక్కు. సం. వి. జ్. స్త్రీ. 1: చూ, వర్తకము. 1; పుం. 2: చూ, కరణము. 14; 3. వర్తకుఁడు. రూ-వణిజుఁడు-వాణిజుఁడు: చూ, సార్థవాహుఁడు; 4.=వాణె. కోమటి: చూ, వైశ్యుఁడు. [వణిక్కు. 3.
వణిజుఁడు. సం. వి. జ్. పుం; చూ, రూ-
వణిజ్య. సం. వి. అ. స్త్రీ: చూ, వణిక్కు. 1.
వణితము. దే. వి: చూ, వంటియము.
వతంసము. సం. వి. అ. పుం. 1:చూ, సిగదండ; 2. పూఁగమ్మ: చూ, హావణిక. 2 (భూషణము. 2.) [పరిపాటి, వాళీ.
వతను. వా. వి: వాడుక, మామూలు, రివాజ్,
వత్త. దే. వి: చూ, వట్టు. 1. స్వా. 2, ఆ. 57; రసి. 4, ఆ. 115; విష్ణు. ఉ. 5, ఆ.
వత్తి. వై. వి. 1: చూ, వత్తె. అం, భా. ద్వి. 158; 2.=వర్తి. దీపమువర్తి: దశ, దీపవల్లి,

వటి, వ_ర్తి. (తె).—వ_త్తియ-వ_త్తె. తద్వి.—౧. కొవ్వొ_త్తి-క్రొవ్వొ_త్తి; ౨. తిటి.

వ_త్తియ. నై. వి. 1: చూ, రూ-వ_త్తి. 1; 2: చూ, రూ-వ_త్తె. 1-2.

వ_త్తె. నై. వి. 1.—పై.—; 2: చూ, రూ-వ_త్తియ—చేరకము, బద్దియ—బద్దె. (సం).—దశ, వ_ర్తి.

వత్సఁడు. సం. విశే. బాలుఁడు: చూ, శిశువు.

వత్సకము. సం. వి. అ. పుం: అతిసారనుత్తు, కలింగము—కళింగము, కాహి, కుటచము—కుటజము-కూటజము, కైటజము, కోట్టారము, కౌటజము, క్రిముకము, క్షుపకము, గిరిజము, గిరిమల్లిక, ప్రావృషేణ్యము, యవఫలము,వనతి_క్తకము,శక్రివృక్షము.(తె.వ).—కొండమల్లె, కొడస——కొడిస—కొడిసె*. తద్వి.—౧: శ్వేతకుటజము (తె) —పాలకొడిస*; ౨. కొడిసెకాయకు.— ఇంద్రయవము, కలింగకము-కళింగకము-కలింగము-కళింగము, కలింగి, భద్రియము. (తె. వ).—కొడిసెకాయ, కొడిసెపాల, కొడిసెప్రాలు; 3.కొడిసెపండునకు.—కొడిసెపండు. ("చూ, శక్రివృక్షము.")

వత్సతరము. సం. వి. అ. పుం. మోయుటకును దున్నుటకును పని పట్టఁదగిన వయసుగల కోడె, దమ్యము: చూ, వృషభము. 1.

వత్సదంతము. సం. వి. అ. పుం. అమ్ము: చూ, పేరి. 4 (బాణము. 1.)

వత్సదూతము. అం: చూ, బాణాగ్రములు.

వత్సనాభము.సం.వి.అ.పుం.విష భేదము:చూ,విష.

వత్సనాభి. సం. వి. ఈ. స్త్రీ. 1.= వసనాభి. ఒక విషవస్తువు. పాండు. 5, అ. 240: చూ, విషము. 1; 2. మృగములకు వత్సనాభి వంటి దగుటచేత కుక్కఁకియ్యఁబడిన పేరు. ప్రా. 4, ఆ: చూ, సివఁగి.

వత్సము. సం. వి. అ. న. 1. రొమ్ము: చూ, వక్షము. 1; పుం. 2. ఏఁడాది: చూ. సంవత్సరము; 3. ఏఁడాదిలోపుదూడ: చూ, ధేనువు. 32. [శివుడు.

వత్సముఁడు. సం. వి. అ. పుం. బాలకుఁడు:చూ,

వత్సరము. సం. వి. అ పుం. ఏఁడాది: చూ, సంవత్సరము. [రాజు:చూ, రాజు. 1.

వత్సరాజు. సం. వి. న్. పుం. ఉదయనుఁడను

వత్సలము. సం. వి. అ. పుం. తృణాగ్ని: చూ, వహ్ని. 1.

వత్సలుఁడు. సం. విశే. వాత్సల్యముఁగలవాఁడు.

వత్సాదని. సం. వి. ఈ. స్త్రీ. 1. తిప్పతీఁగ*: చూ, సోమవల్లి; 2: ఉదబంధని, కూర్చపర్ణిక, నాగుడి, వకాంగి, పాతాళగరుడ. (తె. వ).—దుస్సరి—దుస్సిర-దూయుతీఁగ-దూసర.*

వత్సుఁడు. సం. వి. అ.పుం.చూ,రూ-వత్సఁడు.

వదంతి. వా. సం. వి. ఇ. న. గాలిమాట, సమాను, పుకారు, రూమరు: చూ, శబ్దము. 2.

వదడు దే.వి.మాళి.ఆం.వ.౨-౬1:చూ,రేణువు.1.

వదనఖుర్జువు. సం. వి. ఉ. న: చూ, మొటిమ.1.

వదనము. సం. వి. అ. న. 1. నోరు: ఆననము. ఆస్యము, చర్వణము, తుండము, ముఖము, లపనము, వక్త్రము. (తె. వ).— నోరు, మూతి, వా-వాయి. తద్వి.—౧. ముందటి పండ్లులేని నోరునకు.- (తె).— బొొ_ఱ్ఱి; ౨. వంకరనోరునకు.- (తె).—సొలునోరు; 3. నోటి పైభాగమునకు. (తె).— మూతి; 2. మొగము: ఆననము, ఆస్యము, కుహరము, తుండము, తుండి, చుక్రము, చ్యావము, ముఖము, లపనము, వక్త్రము. (తె).—ముగము-మొగ-మొగము-మోము, మూతి, మొకము, వా-వాయి.తద్వి.—౧.కళాహీనపు మొగమునకు.- (తె).-చిప్పమూతి; ౨. గడ్డము మీసము లేని మొగమునకు.—

(తె) —పేడెమూతి; 3. కోపముగల మొగము నకు.— (తె).—ముసురుమూతి; 4. నింద యందు మనుష్య ముఖమునకు.— (తె).— మొర—మొరను—మోర; 5. పశ్వాదులదీర్ఘ ముఖమునకు.— (తె).— మొర— మొరను— మోర; 6. పెడమొగమునకు.— పరాఙ్ముఖ ము—పరాఙ్ముఖత్వము, పరాచీనము, పరి వర్తనము—పరివర్తము— పరీవర్తము, విముఖ త్వము, వైముఖ్యము. (తె. వ).—అరగలి, అలకువ, కొదుకు—కొదుగు, జోడుఁగు—జోణుఁ గు, పెడము — పెడమొగము— పెడమోము, మోరతోఁపు, మాఱుమొగము; 7. ముక్కు— నకు.— (చూ, ముక్కు. 1.)

వదనిక. వై. వి.=వృక్షాదని. రూ—బదనిక—బద నిక*: చూ, వృక్షాదని.

వదన్యుఁడు. సం. విణ: చూ, రూ—వదాన్యుఁడు.

వదర. వై. విణ.=వద. పేలరి. లక్ష్మీ. 4, ఆ. 37; ఉ, హరి. 2, ఆ: చూ, వక్త. 1.

వదరు. దే. వి, 1. చేఁతిసొర*: చూ, సొర; 2. ఇంద్రావ్యాయము; 3. ఆనపకాయ: చూ, సొరకాయ; 4: చూ, వదర; వై. అ. క్రి. 5. ఊరకమాటాడు: పేలు—ప్రేలు, కజ్జో, వాఁగు; దే. అ. క్రి. 6: చూ, వదరు. 5. ఉ, హరి. 5, ఆ. 276. [హరి. 12.

వదరుఁగప్ప. ద్వ. వి. ఒకానొక కప్ప: చూ,

వదరుఁబోతు. ద్వ. విణ: చూ, వదర.

వదలు. దే. వి. 1. రూ—వదులు. విసర్జనము: చూ, విమోచనము; అ. క్రి. 2. రూ—వదు లు. వీడు: చూ, సడలు; స. క్రి. 3. విడు చే: చూ, విసర్జించే.

వదలుట. దే. వి: చూ, వదలు. 1.

వదాన్యుఁడు. సం. విణ. రూ— వదన్యుఁడు. 1. మిక్కిలి యిచ్చే వాఁడు: ఘనాఘనుఁ డు, దానశౌండుఁడు, బహుప్రదుఁడు, స్థూల లక్షుఁడు. తద్వి.—దాతకు.—ఉదాత్తుఁడు, ఉదారుఁడు, త్యాగి, దాత, దాయి, ధన దుఁడు. (తె. వ).—ఇచ్చువాఁడు, ఇడు వాఁడు, ఈగికాఁడు—ఈవికాఁడు, ఈవరి, చేఁగకాఁడు, చేఁగి, చేగలవాఁడు, తెగుదారి, విడువరి. ("చూ, స్థూలలక్షుఁడు."); 2. మ నోజ్ఞముగా మాటలాడువాఁడు: చూ, వక్త. 1—5. [సుడి. 4.

వదాలము. సం. వి. అ. పుం. నీటిసుడి: చూ,

వదావదుఁడు. సం. విణ. రూ—వదుఁడు. మాట నేర్పరి: చూ, వక్త. 1.

వదావళి. ద్వ. వి. (వదర+అవళి) 1. ప్రేలాప ము: చూ, శోకము; 2. వదరుఁబోతుతనము.

వది. దే. వి. ఏనుఁగు లోనగువానిఁబట్టుటకై త్రవ్వఁబడియుండ్లులోనగువానిచే కప్పఁబడిన పల్లము. రా, వి. 3, ఆ. 46.

వదిన. వై. వి.=వధూనీ. రూ—వదినియ—వదినె— వన్నె. (సం).—వధూని—వధూనిక. 1. అన్న భార్య: చూ, భార్య; 2. భార్యకు అక్క; 3. తనకంటె పెద్దదియగు మేనత్త మేన మామల కూఁతురు; వా. 4. మగని తోఁబు ట్టువు: చూ, ఆఁడుబిడ్డ. 2.

వదినియ. వై. వి.=—పై.—

వదినె. వై. వి.=—పై.—

వదియ. దే. వి: రూ—వడె. బదనిక*: చూ, వృక్షాదని. (తృణతతివిశేషముఅనికొందఱు.)

వదుఁడు. సం. విణ: చూ, రూ—వదావదుఁడు.

వదులు. దే. విణ. 1. బిగుతుకానిది: లొడలొడ; వి. 2: చూ, రూ—వదలు. 1; అ. క్రి. 3. బిగువు తప్పు: చూ, సడలు. భార. ఆది. 3, ఆ.

వదులుడి. దే. వి. (వదలు+లూటి) బీటిక: చూ, స్ఫోటము. 1. (సంధినివర్ణ వికారము.)

వదె. దే. వి: చూ, రూ—వదియ. *

వద్ద. దే. వి: చూ, రూ—ఒద్ద. [బస్తాం(ధ్రి), వర్తిక.*—

వద్ది. వా: వి. రూ—ఒద్ది. (సం.)—అజశృంగి,

వద్దు. వా. అవ్య: చూ, రూ—వలదు.

*వధదండము. అం: చూ, వధము. 2.
వధము. సం. వి. అ. పుం. 1. చంపుట: చూ, హింస. 1; అం. 2: చూ, దండత్రయము. (దండార్థ్యాని కొట్టుట:చూ,త్రయము.= అర్థహరణము, పరిక్లేశము, వధదండముఅనునవి.)
వధస్థానము. సం. వి. అ. పుం. చంపుడుగట్టు, అఘాతకిము, అఘాతము: చూ, స్థానము.1.
వధించే. సం. స. క్రి. చంపు: చూ, సంహరించే.
వధుక. సం. వి. ఆ. స్త్రీ. ఆఁడుది: చూ, స్త్రీ.
వధువు. సం. వి. ఊ. స్త్రీ. 1.—పై.—; 2, పెండ్లాము: చూ, భార్య; 3:(తె). పెండ్లికూఁతురు—పెళ్ళికూఁతురు; 4. కోడలు: చూ, స్నుష; 5. గంట్లకచోరము*: చూ, షడ్గ్రంధ; 6. పిక్క*: చూ, స్పృక్క; 7. ప్రేంకణము*: చూ, సన్నదుంపు; 8. మామెన*: చూ, శారిబ.
వధూటి. సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, వధుక; 2: చూ, వధువు. 4; 3. కన్యక, పెండ్లికాని పడుచే: చూ, స్త్రీ. [వదిన. 1.
వధూని. సం. వి. ఈ. స్త్రీ.=వదినె: చూ,
వధూనిక. సం. వి. ఆ. స్త్రీ.—పై.— [పతులు.)
*వధూవరులు. అం. పెండ్లిదంపతులు. (చూ, దం
వధ్యుఁడు. సం. విణ. చంపఁదగినవాఁడు.
వధ్రి. సం. వి. ఈ. స్త్రీ; చూ, రూ—వర్ధ్రి.
వనకాగవేల్లము. సం. వి. అ. పుం. అడవికాఁకర*: చూ, సుషవి. 1.
వనకుక్కుటము. సం. వి. అ. పుం. అడవికోడి: చూ, పుంజో. ౧. [చూ, రేఁగు. 1—౧.
వనకోలి. సం. వి. ఈ. స్త్రీ. అడవిరేఁగు*:
వనక్షుద్రశింబి. సం. వి. ఇ. పుం: అడవిచిక్కుడు*. తద్వి.—(చూ, చిక్కుడు; మొక్కచిక్కుడు. ఇందు తీఁగ—మొక్క లోనగు జాతులుకలవు.)(చూ, చిక్కుడుకుటుంబము.)
వనగుప్తము. సం. వి. అ. పుం. చోఱ*: చూ, స్రవ. [వెన్నెల యనురీతి.
*వనచంద్రికా న్యాయము. అం. అడవిఁగాచిన
వనచరము. సం. వి. అ. పుం. రూ—వనేచరము. అడవితిరుగుడు, కోఁతి: చూ, వానరము.
వనచూలిని. సం. వి. ఈ. స్త్రీ. దాసన*: చూ, వాయజీవనమారకము. [చూ, మేషము.1—౭.
వనచ్ఛాగము. సం. వి. అ. పుం. అడవిమేఁక;
వనజ. సం. వి. ఆ. స్త్రీ. పిల్లపెసర*: చూ, స్తంబకరి (పెసర.) [చూ, నిమ్మ.
వనజంబీరము. సం. వి. అ. పుం. అడవినిమ్మ*:
వనజబదరి. సం. వి. ఈ. స్త్రీ: చూ, వనకోలి*.
వనజము. సం. వి. అ. న. 1. తామర: చూ, సహస్రపత్రము; పుం. 2. మృగముపెడి దేనుఁగు: చూ, హస్తి; 3. తుంగముస్తె*: చూ, హరిత. (ముస్తకము. 1—2.)
వనట. దే. వి. 1: చూ, శోకము. భార. శాం. 3, ఆ; 2. పరిదేవనము. అం, భా. 1, ఆ. 16: చూ, వాచేగడము.
వనతిక్తక. సం. వి. ఆ. స్త్రీ: చూ, విద్ధకర్ణి*.
వనతిక్తకము. సం.వి.అ. పుం: చూ, పత్సకము*.
వనతువరి. సం. వి. ఈ. స్త్రీ. అడవికంద, సర్పనాళము*: చూ, సూరణము.
వనదీపము. సం. వి. అ. పుం: చూ, సంపఁగి*.
వనదేశస్త్రీ. సం. వి. ఈ. స్త్రీ. దేశస్త్రీలలోని నొకతె: చూ, స్త్రీ.
వనధి. సం. వి. ఇ. పుం. కడలి: చూ, సముద్రము.
వనపాలుఁడు. సం. విణ: కబ్బావేక్షుఁడు. (తె. ప).—తోఁటకాఁపు, తోఁటవాఁడు, తోఁటీఁడు, మాలి. [పిప్పలి. 1.
వనపిప్పలి. సం. ఈ. స్త్రీ. అడవిపిప్పలి*: చూ,
వనవు. దే. వి: చూ, వనట. 2.
వనప్రియము. సం. వి. అ. పుం. 1. కోయిల: చూ, సాఁకుడుపులుఁగు; 2. చోఱ*: చూ, స్రవ. [సరస్సు. 1.
వనబంధము. సం. వి. అ. పుం. కోనేరు: చూ,
వనమంజరి. అం: చూ, వృత్తము. 1. ("న-జ-

జ-జ-జ-భ-రగగణములు. 14 యతి. 21 ఛందస్సు.") [మక్షిక. ౧.

వనమక్షిక. సం. వి.ఆ. స్త్రీ. అడవియీఁగ: చూ, వనమయూరము. అం: చూ,వృత్తము. 1. ("భ-జ-స-న-గగములు. 9 యతి. 14 ఛందస్సు.")

వనమహిషము. సం. వి. అ. పుం. అడవిదున్న: చూ, సైరిభము (మహిషము.)

వనమాల. సం. వి. ఆ. స్త్రీ. ఆకులు పువ్వులు చేర్చి కట్టిన తోమాలె: (తె):-తోఁటమాలియ-తోఁటమాలె- తోమాలియ-తోమాలె: చూ, హావణిక. 2 (భూషణము. 2.)

వనమాలి. సం. వి. న్. పుం.1: చూ, విష్ణువు.1; అం. 2: చూ, జన్యతాళములు.

వనమాలిని.అం. (వారాహి): చూ, మాతృకలు.

వనము. సం. వి. అ. న. రూ-వణము. 1. అడవి: చూ, విపినము; 2. తోఁపు: ఉపవనము, ఆక్రీడము, ఆరామము, ఉద్యానము, ఉపవనము, కచ్ఛము, కాననము, కుటపము, గృహారామము, గోత్రము, తేపనము, నందనవనము, నందనము, నిష్కుటము, ప్రమదవనము-ప్రమదావనము, మలయము, వణము, వనిక, వాటము. (తె).—ఆటతోఁట, ఆరాము-ఆరియము-ఆరెము, ఎలదోఁట, తోఁట, తోఁపు, హాసుతోఁట. తద్వి.—౧. అంతఃపుర స్త్రీలతోఁటకు-ఉద్యానము, ప్రమదవనము-ప్రమదావనము. (తె).-ఆటతోఁట, హాసుతోఁట; ౨. కుబేరుని వనమునకు.— చైత్రరథము; ౩. తమలపాకుల తోఁటకు - (తె) ఆకుతోఁట; ౪. దేవోద్యానమునకు.— మిశ్రకము, వైభ్రాజము, సిధ్రకారణము; ౫. పశ్చిమసముద్రవరుణోద్యానమునకు.—అరవిందము; ౬. పూఁదోఁటకు.—కచ్ఛము. (తె).— పూఁదోట-పూలతోఁట్ట్య,మంత్రులతోఁటకు.-ఉపవాటిక, వృక్షవాటిక; ౮. మనోజ్ఞవనమునకు.- కామూరణ్యము;౯. వేశ్యాగృహారామమునకు.- ఉపవాటిక, వృక్షవాటిక; ౧౦. ఇంద్రోద్యానవనమునకు.-కందసారము, నందనవనము,నందనము; ౧౧. కూరలోనగువాని తోఁటకు.— (తె).- వాటము-వాటి;౧౨ అడవికి: (చూ, విపినము);("చూ,హాసుతోఁట."); 3 నీరు: చూ, సలిలము;4: చూ,సెలయూట;5. పరదేశమునందలియునికి: చూ, స్థానము 1;6.ఇల్లు: చూ, సదనము.1;7: చూ,సమూహము. భార. ఆది. 1, ఆ; 8. పువ్వు: చూ, సుమము; 9. ఎఱుపు: చూ, వర్ణము. 6; 10. ప్రవాహము: చూ, వెల్లువ; స. 11 ఏడు: చూ, సప్తకము; అం. 12: చూ, సంతానములు; 13: చూ, తంత్రములు; 14: చూ, చేతనరత్నములు. [చూ, పెసర.

వనముద్గము. సం. వి. అ. పుం. అడవిపెసర*:

వనములు. అం: చూ, దివ్యవనములు.

వనమూతము. సం. వి. అ. పుం. మబ్బు: చూ, స్తనయిత్నువు (మేఘము. 1.)

వనయగస్తి. సం. వి. ఇ. పుం. అడవియగిసె*: చూ, శుకనాసము. 1.

వనయూథిక. సం. వి. ఆ. స్త్రీ. అడవిమొల్ల*: చూ, హారిణి. 5.

వనరేరండము. సం. వి. అ. పుం. అడవియాముదపుఁజెట్టు: చూ, వ్యాడంబకము.

వనరు. దే. వి. 1: చూ, రూ—వనట. 2; 2. జలాధారము;అ.క్రి. 3: చూ, శోకించు. భార. స్త్రీ. 1, ఆ; 4. దీనాలాపము. భార. సభా. 2, ఆ; పాండు. 4, ఆ. 159; 5: చూ, విలపించు. వసు. 3, ఆ. 76.

వనవాసము. సం. వి. అ. పుం. 1. అడవికాఁపురము; అం. 2: చూ, దేశములు. [శిగ్రువు.

వనశిగ్రువు. సం. వి. అ. న.అడవిమునగ*:చూ, వనశృంగాటము. సం. వి. అ. పుం. పల్లేరు* చూ, స్వాదుకంటకము.

వనసూకరము. సం. వి. అ. పుం. అడవిపంది: చూ, సూకరము.

వనస్థ. సం. వి. ఆ. స్త్రీ. 1. కరక*: చూ, హరీతకి; 2. పుల్లబచ్చలి*: చూ, హీలమోచి (బచ్చలి ౨); 3. రావి*: చూ. శ్యామలము. 2.

వనస్పతి. సం. వి. ఇ. పుం. 1. పూయక కాచెడుచెట్టు. (పూచి కాచెడుచెట్టు వానస్పత్యము.); 2. చెట్టు: చూ, వృక్షము; 3. మఱ్ఱి*: చూ, స్కంధజము; 4. పూయక కాచెడు పనస*: చూ, వేరుపనస (అని కొందఱు.)

వనస్పత్యాదిసర్గము అం: చూ, సృష్టిసర్గములు.

వనాగ్నిమంథము. సం. వి. అ. పుం. అడవినెల్లి*: చూ, శ్రీపర్ణము. 1.

వనాటము. సం. వి. అ. పుం. వనమునందుతిరుగు జంతువు. భాగ. 8, స్కం.

వనావాసము. అం: చూ, అష్టవర్గము.

వనాయుజము. సం వి. అ. పుం. రూ-వానాయుజము. వనాయుదేశపుగుఱ్ఱము: చూ, హయము.

వనార్చకుఁడు సం వి. అ. పుం. పూలచెండ లమ్మెడు వాఁడు: చూ, మాలకరి. [కుండి

వనాలిక. సం. వి. ఆ. స్త్రీ. నల్లేరు*: చూ, హస్తి

వని. సం. వి. ఈ. స్త్రీ 1: చూ, వనము. 1, న్. పుం. 2: చూ, వానప్రస్థుఁడు.

వనిక. సం. వి. ఆ. స్త్రీ: చూ, వనము. 1—2.

వనిత. సం. వి. ఆ. స్త్రీ.=వెలఁది — వెలఁదుక. 1. ఆఁడుది: చూ, స్త్రీ; 2. మిక్కిలియనురాగముగల యాఁడుది: చూ, స్త్రీ; 3. నల్లదింటెన*: చూ, విష్ణుకాంత; విశే. 4. యాచింపఁబడినది; 5. సేవింపఁబడినది: చూ, సేవితము.

వనిష్ఠువు. సం. వి. ఉ. పుం. యజ్ఞపశువు యొక్క పెద్ద ప్రేగు.

వనీపకుఁడు. సం. విశే. రూ-వనీయకుఁడు. తనకు లేక యడిగెడువాఁడు: చూ, యాచకుఁడు.

వనీయకుఁడు. సం. విశే. —పై.—

వనీరము. సం. వి. అ. పుం: చూ, వన పిప్పలి*.

వనుకము. సం. వి. అ. పుం. జిల్లేడు*: చూ. వికీరణము.

వనేచరము. సం. వి. అ. పుం: చూ, వనచరము.

వనోత్సాహము. సం. వి. అ. పుం. ఖడ్గమృగము: చూ, శరభము. 1. [చూ, బచ్చలి. ౧.

వనోపోదకి. సం. వి. ఆ. స్త్రీ. అడవి బచ్చలి*:

వనౌకసము. సం. వి. స్. పుం. అడవిపట్టు: చూ, వానరము. [చూ, శిపశారము.

వనౌషధి. సం. వి. ఇ. స్త్రీ. ముండపాకపర్ణి*:

వన్నియ. వై. వి. రూ-వన్నె=వర్ణక 1. కాంతి. భాను. 2, ఆ: చూ, వెలుగు. 1; 2 రంగు: చూ, వర్ణము 6; 3. =వర్ణన వంచె కవిక. 1, ఆ: చూ, వన్నియ. 1; 4 తెలుపులోనగు రంగు, యు. 1, ఆ: చూ, వన్నియ. 1; 5 బంగారు యొక్క మేలిమి. గీటురాయిమీఁది గీఱు; 6. వర్ణప్రపూంత: చూ, సమాలంభము. 1; 7. వర్ణ్యము 8. వైసేఁత: చూ, సింగారము. 2; 9: చూ, సౌందర్యము. ...కి. 2, ఆ; 10. రంగుచీర: చూ, వస్త్రము; 11. ప్రసిద్ధి: చూ, సంభావన. 3; 12 రీతి: చూ, విధము. 1; 13: చూ, అంకవన్నియ; 14 వర్ణపుష్పము*: చూ, మొగలి.*

వన్నెయులకిట్ట. ద్వ. వి: చూ, వెన్నెలపులుఁగు.

వన్నె వై వి.=వర్ణక: చూ, రూ-వన్నియ. (కైసేఁతను.-వై. 3, ఆ. 34; బంగారు యొక్క మేలిమికి.-ఉ, హరి. 5, ఆ. 11; రంగుచీరకు -విజ. 3, ఆ. 13; ప్రసిద్ధికి.-పాండు. 4, ఆ; రీతికి.-సీలా. 1, ఆ. 106; అంకవన్నియకు.-సా. 1, ఆ. 82.)

వన్నెకత్తియ. వై. విశే. రూ- వన్నెకత్తె. 1. సౌందర్యవతి: చూ, స్త్రీ; 2. విలాసవతి: చూ, స్త్రీ.

వన్నెకత్తె. వై. విశే.—పై.—

వన్నెకాఁడు. ద్వ. విశే. 1: చూ, సౌందర్యవం

తుఁడు; 2. విలాసవంతుఁడు. ఉ, గ్రా. 4, ఆ: చూ, విలాసి. 6.

వన్నెచీర. వై. వి: చూ, వన్నియ. 10.

వన్నెపులుఁగు. ద్వ. వి. జీవంజీవము: చూ, వన్నెలపులుఁగు.

వన్నెవూలు. వై. వి. బ. శాలిధాన్యము: చూ, [ధాన్యము.

వన్నెలాఁడి. ద్వ. విణ: చూ, వన్నెకత్తియ. 1-2.

వన్నెలాఁడు. ద్వ. విణ: చూ, వన్నెకాఁడు. 1-2. (విలాసవంతుఁడు -పరీక్షి. 5, ఆ. 35)

వన్నెవెదురు. వై. వి: చూ, వృత్తపత్రము *.

వన్య. సం. వి. ఆ స్త్రీ. 1. వనసమూహము. (వనము=అడవి, నీళ్లు); విణ. 2. అడవియందుఁ బుట్టినది. [దాప*: చూ, సదాప.

వన్యశతపత్రసూన. సం. వి ఆ. స్త్రీ. పిన్నస

వన్యశింబి. సం. వి. ఈ. స్త్రీ. బ. అమ్మమల్లికయను వడ్లు: చూ, ధాన్యము.

వప. సం. వి. ఆ. స్త్రీ. 1. కడుపులో బొడ్డు క్రిందనుండెడి యుల్లిపొరవంటి క్రొవ్వు, మెదడు (అని కొందఱు.), వస; 2. బెజ్జము: చూ, రంధ్రము. 1.

వపనము. సం. వి. అ. న. 1: ఆయుష్కర్మము, ఆవాపము, క్షురము-క్షౌరము, క్షురకర్మ, పరివాపనము, భద్రాకరణము, ముండనము, వాపము. (తె). -కోఁగట-కోఁగుట-గోఁగుట, గొఱుగుట, మంగలిపని; 2. విత్తుట: చూ, వెద. 2.

వపువు. సం. వి. స్. న. 1: చూ, శరీరము; 2. చక్కని రూపము. పర్ష్త్రము: చూ, సౌందర్యము; 3.=వంపు. మారణకర్మము: చూ, హింస. 1.

వప్త. సం. వి. ఋ. పుం. 1. తండ్రి: చూ, సవిత. 2; 2. మగఁడు: చూ, సామి. 2; విణ. 2. విత్తెడువాఁడు: చూ, సేద్యకాఁడు.

వప్రక్రీడ. సం. వి. ఆ. స్త్రీ. ఏనుఁగులోనగు నవి దంతములు లోనగువానితో భూమిని క్రోరాడెడియాట: చూ, విలాసము. 1.

వప్రము. సం. వి. అ. న 1 సీసము: చూ, లోహము. 1-ఒ; పుం, న. 2: చయము. (తె).- అలంగము- అలఁగము, అలవరి, ఆడువరి-ఆకువరి, కోటకొగడు- కోటకొఱడు; 3. కోట: చూ, ప్రాకారము; 4. వరిమడి: చూ, భూమి. 1; 5. తీరము: చూ, రోధస్సు; 6. కొండచెఱ్ఱము: చూ, హిమాలయము (పర్వతము. ౧3 )

వమథువు. సం వి. ఉ. పుం. 1. ఏనుఁగు తొండపు తుంపురు: చూ, హస్తి (శీకరము. 1.); 2. వమనము: చూ, వాంతి. 1.

వమనము. సం. వి. అ. న. 1: చూ, వాంతి. 1; 2. పీడనము: చూ, సమ్మర్దము. 1.

వమని. సం. వి. ఈ. స్త్రీ. ప్రత్తి*: చూ, సముద్రాంత. 3.

వమి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1: చూ, వాంతి. 1; ఇ. పుం. 2. నిప్పు: చూ, వహ్ని. 1.

వమ్మ. వై. వి. 1. నాశము. భార. ఉద్యో. 2, ఆ; భార. విరా. 3, ఆ: చూ, సంస్థ. 3; విణ. 2.=వ్యర్థము: చూ, వ్యర్థము.

వమ్మవోవు. ద్వ. అ. క్రి. 1: చూ, వ్యర్థమగు; 2. కనఁబడకపోవు: చూ, సురుగు. 1; 3. నష్టమగు, ఉ, హరి. 5, ఆ. 92: చూ, సురుగు. 1; 4. దాఁగుకొను: చూ, లాఁచు. 2.

వమ్రము. సం. వి. అ. పుం. వమ్రి-వమ్రిక. తెల్లచెదలు నల్లచీమ: చూ, పిపీలిక.

వమ్రి. సం. వి. ఈ. స్త్రీ. —పై.—

వమ్రిక. సం. వి. ఆ. స్త్రీ. —పై.—

వయనము. సం. వి. అ. న. నేఁత: చూ, వ్యూతి.

వయసు. సం. వి. స్. న: చూ, రూ-వయస్సు. 1. 2.

వయసువాఁడు. మి. వి. పదియారేండ్లు మొదలు ముప్పది యేండ్లవఱకుఁగల వయసువాఁడు. (ఆం, భా. ద్వి. 118.): తరుణుఁడు-తలసుఁడు,

యవీయసుఁడు, యువ, యౌవనుఁడు, వయస్థుఁడు, వసీయుఁడు. (తె).-పడుచువాఁడు.

వయస్తంభనము. అం: చూ, కళలు.

వయస్థ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఉసిరిక*: చూ, శ్రీఫలి. 1; 2. కరక*: చూ, హరీతకి; 3: చూ, వాయసోలి*; 4. చిట్టేలకి*: చూ, సూక్ష్మైల (సతిల); 5. తిప్పతీఁగ*: చూ, సోమవల్లి; 6. బూరుగు* చూ, శాల్మలి; 7 మత్స్యాక్షి. (తె)-సోమిదకూర*; 8. పొన్నగంటి* చూ, శీతసారము; విణ.9 జవరాలు: చూ, స్త్రీ.

వయస్థుఁడు. సం. విణ: చూ, వయసువాఁడు.

వయస్యా. సం. వి. ఆ. స్త్రీ. 1. చెలికత్తె: చూ, స్త్రీ; 2. కోలపాల*: చూ, శృంగబేరి.

వయస్యుఁడు. సం. వి. అ. పుం. 1. చెలికాఁడు: చూ, స్నేహితుఁడు; 2. క్రొత్తచెలికాఁడు: చూ, స్నేహితుఁడు.

వయస్సు. సం. వి. స్. న: రూ-వయసు. ఆయువు-ఆయుస్సు, ఆయుష్యము, జీవితకాలము. (తె).-ఉగము, ఉసురు, మనన. లవ్వి.— ౧. బాల్యదశకు.-గతి; ౨. పల్లుమొలవడము మొదలు మూఁడేండ్లవఱకు.-కైశోరము; 3. మూఁడుమొదలు ఎనిమిది యేండ్లవఱకు - కౌమారము, టకము; ౪. యౌవనమునకు.- తరుణిమ, తారుణ్యము, ప్రాయము, యౌవనము. (తె).-ఈడు, ఈడుప్రాయము, కొమరుఁదనము, కొమరుఁబ్రాయము, గోవ, జీవ్వనము, తలిపి, నీరుప్రాయము, పడుచుతనము, పరువము, పర్వు, ప్రాయము; ౫. పూర్ణయౌవనమునకు.— (తె).నిండుజవ్వనము, నెలజవ్వనము (స్త్రీలకు చూ, యౌవనభేదములు.)

వయాళి. వై. వి.=వాహ్యాళి. రూ-వయ్యాళి: చూ, విహారము. 1. వసు. 3, ఆ. 112.

వయిచు. దే. స. క్రి. రూ-వైచు. 1. గిరాటువేయు: చూ, రూ-వైచు. 1; 2. విక్షేపించు: చూ, రూ-వైచు. 2; 3. పడవేయు: చూ, వైచు. 3. [కోమటిజాతి: చూ, వైశ్యుఁడు.

వయిజాతి. వై. వి. రూ-వైజాతి. ఒకానొక

వయిజాతితొండ. ద్వ. వి రూ-వైజాతితొండ. ఊసరవెల్లి. పంచ. వేం. 1, ఆ: చూ, సరటము.

వయినము. వై. వి. 1.=వ్యాఖ్యాన. రూ-వైనము. వివరణము: చూ, వ్యాఖ్యానము; 2. ఉపాయము: చూ, వెరవు. 1; 3. కారణము: చూ, హేతువు. 1; 4. క్రమము: చూ, విధము. 1.

వయిపు. వై. వి. రూ-వైపు. 1. ప్రక్క: చూ, పార్శ్వము. 2; 2. ఒడుపు: చూ, లక్ష్యము. 1; 3: చూ, వయినము. 2.

వయిపుకాఁడు. దే. విణ. రూ-వైపుకాఁడు. నేర్పరి: చూ, సమర్థుఁడు.

వయిమూలము. దే. విణ. రూ-వైమూలము. అధికము: చూ, హెరాళము.

వయిరవులు. దే. వి. రూ-వైరవులు-వైరాలు-వయిరాలు. కట్టెవిప్పు: చూ, వహ్ని. 1.

వయిరాలు. దే. వి 1.-పై.—; వా. బ. 2: చూ, వైరము, "వయిరాలు పెరుఁగు చున్నవి." [శ్యేనము. 1.

వయిల. దే. వి. రూ-వైల. ఒకజాతిడేగ: చూ,

వయిసిక. వై. వి. రూ-వైసిక. కపటము: చూ, వ్యాజము. 1.

వయిళము. దే. క్రి. విణ. రూ-వైళము-వైడము, వేగగ: చూ, స్వదము.

వయోవస్థ. అం.1: చూ, అవస్థలు; అం.2: చూ, వృద్ధులు, వయోవృద్ధులు.

వయ్యంది. దే. వి. కుంపటి: చూ, హసంతి.

వయ్యము. వై. విణ. నిష్ఫలము. భో. 4, ఆ. 272. (దే. అని శ. ర.): చూ, వ్యర్థము.

వయ్యాళి. వై. వి.=: చూ, రూ-వయాళి, ఉ. రా. 7, ఆ. 332. [3, ఆ: చూ, సస్యము

వర. దే. వి. 1. ఒకరకముసస్యము. విష్ణు. పూ

వరండకము. సం. వి. అ. పుం: చూ, వరండము. 1.

వరండము. సం. వి. అ. పుం. 1. నోరడికెడు తెవులు, (ముఖమువందలి) బొబ్బలు: చూ, స్థూలోచ్చయము. 2; 2. లోపలితిన్నె: చూ, వేదిక; 3. గడ్డికుప్ప: చూ, వామి (1); 4: చూ, సమూహము; 5. చేపలనుబట్టు గాలపుత్రాడు: చూ, సూత్రము. 1; 6. బట్ట: చూ, వస్త్రము; 7. యజ్ఞమున వేదికమధ్యము: చూ, వేదిక; 8. కట్టెవస్తువు.

వరంధకము. సం. వి. అ. పుం. 1. గాలి: చూ, వాయువు; 2. కుంచె: చూ, హనుము.

వరంధముడు. సం. వి. అ. పుం. యముడు: చూ, హరి. 5. [సుగ్రీవ్కు. 3

వరంకు. దే. వి. చిక్కు. రా. బాల, కాం: చూ, వరంగలించే. దే. అ. క్రి. భ్రికాశించే: చూ, పాపటిల్లు. [2. పల్లము: చూ, రంధ్రము. 1.

వరంత. దే. వి. రూ-వ్రంత. 1. ఏటు: చూ, నగి; 2. పల్లము: చూ, రంధ్రము. 1.

వరకము. సం. వి. అ. పుం. 1.=వరగ-వరిగ. వరగ లను సస్యము: చూ, వరగలు; 2. వరక యను పక్షి: చూ, శకుంతి (పక్షి); 3. తాం బేటిచిప్ప, చిప్ప, బొరుసు: చూ, సంకు. 1; 4. కంకణపుచీల, తిఱుగాణి; వా. వి. (1) కఠినశిక్ష: చూ, శిక్ష. 2; 2. నీటియందచ్చే టచ్చేట పడెడు గోతులభాగము: చూ, సుడి; 3. శాటలనడుమ అరాత్తు గాగలిగెడి గోతుల భాగము: చూ, సుడి.

వరకు. దే. వి. 1. రూ-వరను. బంగారులోనగు వాని రేకు: చూ, సరిగ. 2; అవ్య. 2. పర్యంతార్థము: చూ, రూ-వఱకు.

వరగ. శై. వి.=వరక. పెద్దారుగపైరు. విష్ణు. పూ. 3, అ: చూ, రూ-వరకము.

వరగలు. శై. వి. బ. పెద్దారుగధాన్యము, రూ-వరిగలు: చూ, ధాన్యము.

వరగోగు. వా. వి: పెద్దవరగోగు. (సం).—బృహత్పీలువు; తద్విశేషములు.— ౧. పిన్న వరగోగునకు.- గొనుగు-గొరుగు-గొలుగు.. పిన్నవరగోగు, పుండిపూర, వరగోగు. (సం).—ఉష్ట్రారోము, కమలపల్లవ, కలభవల్లభము, కలము, గుడఫలము, గుల్మకినాళనము, దాసి, పీలువు; ౨. కొండగోగునకు.- కొండగొనుగు- కొండగోగు- కొండగోను. (సం).- అవిఘటము, ఉమావృతము, కంపరాలము. కర్ణికము, కర్ణేరువు, కనకపుష్పకము, కరేణువు, కరేష్టము, కర్ణికారము, కర్పరాలము, కాకము, కింకిరాతము, కిరష్టువు, కుశేశయము, కోకము, కోపఫల, క్షీరి, క్షీరేక్షువు, గణేయవు, గుహాశ్రయము, గుహాశయము, పరివ్యాధము, పార్వతీయము, ఫలాభ్రిము, రాజాదనము. (ఉద్దాలకము=కొండగోగు పువ్వు.); ౩. గోగునకు.— ఊరగోగు, గోగు-గోను. (సం.— కందరాలము, కరేష్టము, కర్ణికారము, కర్పరాలము, కింకిరాతము, కోకము, తీక్ష్ణ, పీతఘోషము, పీతపుష్పము, పీతభద్రము, మృదుద్రుమము, స్వాదుమజ్జాఫలము; ౪: ఎఱ్ఱగోగు. (సం).— రక్తపీలువు. ("చూ, స్వాదుమజ్జాఫలము.")

వరచందనము. సం. వి. అ. పుం. 1. అగరు: చూ, రాజార్హము; 2. మ్రానిపసుపు: చూ, హరిద్రువు; 3. దేవదారి*: చూ, సూక్ష్మదారువు.

వరజో. వా. వి. చోలు: చూ, సీత. 2.

వరట. సం. వి. అ. స్త్రీ. 1. రూ-వారట. ఆడుహంస: చూ, హంస. 1; పుం, స్త్రీ. 2. రూ-వరటము. కడుదురీగ: చూ, మ

28: చూ, లోహము. 1- 2(_(౨). తద్వి.- పూలవరహాకు.- పూలవరహా- పూలవరా, పూలి. (కఱుకువరహా=4 రూ; పూలవరహా= 3½ రూ.)

వరహావతారము. అం: చూ, అవతారములు. (పూర్వము హిరణ్యాక్షుఁడను రాజు గోవులను స్త్రీలను బ్రాహ్మణులను మునులను హింసించుచుండఁగా దేవతలందఱు నాక్రూరుని బాధకోర్వలేక దేవదేవునిఁ బ్రార్థింప శ్రీవిష్ణుమూర్తి పెద్దపందిరూపమును దాల్చి సముయముకని పెట్టి హిరణ్యాక్షుని చంపెను. ఇదియే వరహావతారము.)

వరా. వై. వి.=వరాహః: చూ, రూ-వరహా.

వరాంగకము. సం. వి. అ. న. 1: ఉత్కటము గంధవల్కలము, గుడత్వక్కు-గుడత్వచము, చోచము-చోచము, త్వక్పత్రము, త్వచము, త్వక్కు, పత్రము, భృంగము, రుచకము, వరాంగము,వల్కలము.(తె).-లవంగపుపట్ట *: (చూ, బెరడు); విణ. 2. శ్రేష్ఠమైన అంగములు గలది.

వరాంగన. సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, శ్రీతాశము*; 2. ఉత్తమస్త్రీ: చూ, స్త్రీ.

వరాంగము. సం.వి. అ.న. 1.తల: చూ శిరము; 2. ఆలుమగలగుఱి: చూ, భగము. 12; 3. గుద్ద: చూ, ముడ్డి; 4. మగగుఱి: చూ, శిశ్నము; 5: చూ, వరాంగకము. 1.*; 6: చూ, హస్తి.

వరాంగి. సం. వి. ఈ. స్త్రీ. పసుపు: చూ, వర్ణము. 6.

వరాకము. సం. వి. అ. న. పెద్దకత్తి: చూ, హేతి. 4 (రిష్టి. 2.)

వరాకుఁడు. సం. విణ. పేరులేనివాఁడు.

వరాటకము. సం. వి. అ. పుం. 1: రూ-వరాటిక-వరాటము, పణము, శ్వేత, కపర్దము. (తె) గవ్వ:(చూ, సంఖ. 1.); 2. రూ-వరాటిక. తామరదుద్దు: చూ, సహస్రపత్రము; 3. మోకు: చూ, సూత్రము. 1.

వరాటము. సం. వి. అ. పుం: చూ, వరాటకము. 1, అం. 2: చూ, దేశములు.

వరాటి. సం. వి. ఇ. పుం. 1. ముతకబట్ట: చూ, వస్త్రము; అం. 2: చూ, రాగాంగములు. (ఉపాంగము), (అంగము. 9.), (చూ, స్వరము. 2.) [1—2—3.

వరాటిక. సం. వి. అ. పుం: చూ, వరాటకము,

వరాట్యుపాంగములు. అం: చూ, అంగము. 9.

వరాడి. అం: చూ, భిన్నపంచమజభాషలు.

వరాడె బ్రాహ్మణులు. అం: చూ, కపూరిరెయి బ్రాహ్మణులు.

వరాననుఁడు. సం విణ. శ్రేష్ఠమైన ముఖము గలవాఁడు: చూ, ఉత్తమాంగుఁడు.

వరాపర. సం. వి. ఆ. స్త్రీ. తీఁగెచిత్తికూర *: చూ, వృక్షము (భండీరము. 2.)

వరారోహ. సం. వి. ఆ. స్త్రీ. 1.ఉత్తమస్త్రీ. చూ, స్త్రీ; 2. పెద్దపిఱుఁదులుగల ఆఁడుది: చూ, స్త్రీ; 3. ఉపరతియందాసక్తిగల యాఁడుది: చూ, స్త్రీ; 4. ఆఁడుది: చూ, స్త్రీ,

వరారోహి. సం. వి. ఈ. స్త్రీ. కొబ్బరి*: చూ, స్కంధఫలము.

వరారోహుఁడు. సం. వి. అ. పుం. 1. మావటీవాఁడు: చూ, హస్త్యారోహుఁడు; 2. గుఱ్ఱపురౌతు: చూ, సాది. 1.

వరాశి. సం. వి. ఇ. పుం.1. రూ-వరాసి: చూ, వరాటి.1, 2. శ్రేష్ఠమైనకత్తి: చూ, హేతి. 4. (రిష్టి. 2.)

వరాశ్రయము. సం. వి. అ. పుం. పూలగురివెం [ద*: చూ, శ్వేతపాకి.

వరాసవ. సం. వి. ఆ. స్త్రీ. గురివెంద*: చూ, శ్వేతపాకి.

వరాసి. సం. వి. ఇ. పుం: చూ, వరాశి. 1—2.

వరాహకర్ణి. అం: చూ, రూ-వారాహకర్ణి.

వసివాళ్లు. దే. వి. బ. (వసివాడు+లు) మిక్కిలి వాడుటలు: కసుగందులు.

వసిష్ఠసంహిత. అం: చూ, తంత్రములు.

వసిష్ఠసగోత్రము. అం:చూ, గోత్రము. 3.

వసిష్ఠుఁడు. అం. 1: చూ, గోత్రము. 13, 2: చూ, సన్న్యాసి; 3: చూ, శాస్త్రప్రవర్తకులు; 4: చూ, బ్రహ్మలు.

వసుంధర. సం. వి.ఆ. స్త్రీ. నేల:చూ,భూమి.1.

వసుకము. సం. వి. అ. న. 1. చేవుటుప్పు: చూ, లవణము. 1; పుం. 2. జిల్లేడు. *: చూ, వికిరణము. 2;3. తెల్ల జిల్లేడు*: చూ,వికిరణము.2; 4. బకపుష్పము*: చూ, శ్రీవల్లి; 5. ఒకానొకతీఁగ*: చూ, వృశ్చికము.

వసుఖేటము. సం. వి. అ. న. ఒకరకము డాలు: చూ, హరిగ. [చూ, శ్వానబర్బర.

వసుగంధిక. సం. వి.ఆ.స్త్రీ. కుక్కవాయింట*:

వసుగర్భ. సం.వి. ఆ.స్త్రీ. పైఁడిమోలాలు:చూ, భూమి. 1. [మహాదేవ, ఆసుధారిణి.*.

వసుచ్ఛిద్ర. సం. వి. ఆ. స్త్రీ: మహామిద,

వసుద. సం. వి. ఆ. స్త్రీ: చూ,రూ-వసుధ. 1.

వసుదేవుఁడు. సం. వి. అ. పుం. కృష్ణుని తండ్రి: ఆనక దుందుభి.

వసుధ. సం. వి. ఆ. స్త్రీ. 1. రూ-వసుద. నేల: చూ, భూమి. 1; అం. 2: చూ,వృత్తము.1. (ఒక్కొకపాదమునకు రెండు సగణములు. 6వ ఛందస్సు.)

వసుధర్మిక. సం.వి. ఆ. స్త్రీ.లెంట, స్ఫటికము: చూ,స్థాలోచ్చయము.1 (రత్నములు.12-3.)

వసుధానగరము. అం. పశ్చిమ సముద్రమున నుండు వరుణునిపోలు. [చూ,భార్య. 80.

వసుధార. సం. వి. ఆ. స్త్రీ. బుద్ధుని పెండ్లాము:

వసునామకము. సం. వి. అ. పుం.రాచజిల్లేడు *; చూ, వికిరణము. 2. [చూ, శ్రీవల్లి.

వసుపట్టము. సం. వి. అ. పుం. బకపుష్పము*:

వసుబంధులు. అం: చూ, విశ్వేదేవులు.

వసుభ. సం. వి. ఆ. స్త్రీ. పునర్వసునక్షత్రము: చూ, సత్తు. 1 (రిక్క. 2.)

వసుమతి. సం. వి. ఈ. స్త్రీ. 1:చూ,వసుధార; అం. 2: చూ, వృత్తము. 1. (ఒక్కొక్కపాదమున ఒకతగణము, ఒకసగణము. 6వ ఛందస్సు.)

వసుల. సం. వి. ఆ. స్త్రీ: చూ, వేశ్య.

వసులపాంతఅ. దే. వి. ఒకానొక పందెపు కోడి పుంజో. సా. 2, ఆ. 126: చూ, పుంజో.

వసులు. దే. అ. క్రి. తోలఁగు: చూ,విరియు. 5.

వసువు. సం. వి. ఉ. న. 1. బంగరు: చూ, లోహము. 1; 2. రత్నము: చూ, స్థూలోచ్చయము. 1 (రత్నములు.); 3.ధనము:చూ,హిరణ్యము. 3; 4. బుద్ధి*: చూ, సౌగంధ్యము (రాజార్హము 1-3.); 5. నీరు: చూ, సలిలము; 6. జీవుఁడు: చూ, హంసుఁడు. 2; 7: చూ, వసుపట్టము. *; 8. పలుపు: చూ, సూత్రము. 1; 9. కిరణము: చూ, హాయనము. 2; 10 అగ్ని: చూ,వహ్ని.1; 11. వసువను రాజో: చూ, రాజో. 1; 12. విశ్వేదేవులలో నొకఁడు: చూ, విశ్వేదేవుఁడు; 13.కుబేరుఁడు: చూ, శ్రీదుఁడు; 14. ఉచ్చింత*: చూ, కుండ. 5; 15. మధురరసము; స్త్రీ. 16. ఆవు: చూ, సౌరభేయి (ధేనువు.)

వసువులు. అం. గణాధిదేవతలు,అష్టవసువులు:- ఆపుఁడు (అప్పము), ధ్రువుఁడు, సోముఁడు, అధ్వరుఁడు, అనిలుఁడు, ప్రత్యూషుఁడు, అనలుఁడు, ప్రభాసుఁడు. (ఇవే మఱియొకవిధము:-వరుణుఁడు, పృథుఁడు, నహుషుఁడు, జయుఁడు,అనిలుఁడు, విష్ణువు, ప్రభాసుఁడు, ప్రత్యూషుఁడు. (8). [సూతపుత్రకుఁడు.

వసుషేణుఁడు. సం. వి. అ. పుం. కర్ణుఁడు:చూ,

వసూలు. వా. వి. ఆదాయము, జమ, రాఁబడిన ద్రవ్యము.

వస్త సం. వి. ఋ. పుం. తండ్రి: చూ, సవిత.2.

వస్తము. సం. వి. అ. న: చూ, వస్త్యము.

వస్తాదు. వా. వి. 1. ఉపాధ్యాయుఁడు: చూ, సురాచార్యుఁడు (వంతులు); 2. కసరతు నేర్పువాఁడు: వయిరుమాను- పైరుమాను, వయిలుమాను- పైలుమాను. (సం).-కణి, లుతితుఁడు (చూ, సాదనకాఁడు.);3.ఖాణా కత్తి త్రిప్పుటలోనగు పనులయందు నేర్పరి. చూ, సమర్థుఁడు.

వస్తి. సం. వి. ఇ. పుం, స్త్రీ. 1.=బద్దె. (గుడ్డ పీలిక అని కొందఱు): చూ, వస్త్రము; 2. క్రిఁగడుపు, పొత్తికడుపు:చూ, వే్ౖరఁకటి.

వస్తువు. సం. వి. ఉ. న. 1. పదార్థము: చూ, సరకు. 2. తద్వి.-శూన్య వస్తువనకు.-వశికము; అం. 2. నాటకలక్షణమందు.-వస్తువనఁగా కథ. దీనికే ఇతివృత్తమని పేరు. ఇది ఆధారక, ప్రాసంగిక భేదముచే ద్వివిధమైనది. అధికారముచేఁగాని అధికారిచేఁగాని నివృత్తమగునది. అధికారికము ఇది అప్రధానము. అధికారిఫలమందువాఁడు. ప్రసంగవశమునవచ్చినది ప్రాసంగికము.పతాకప్రకరీభేదముచే ప్రాసంగికము ద్వివిధము, దూరవ్యాపి కథ పతాక. స్వల్పకాల నివృత్తమవు కథ ప్రకరి, ముత్తముమీఁద వస్తువు ప్రఖ్యాత, ఉత్పాద్య, మిశ్రమనను ముత్తెఱంగుల నొప్పుచున్నది. పురాణ ప్రసిద్ధము ప్రఖ్యాతము. కవికల్పితముత్పాద్యము, ప్రసిద్ధకథకుఁ గొంత కల్పితము చేర్చుట మిశ్రమము ఇత్యాది.

వస్త్యము. సం. వి. అ.న. ఇల్లు: చూ, సదనము.1.

వస్త్రిగ్రంథి. సం. వి. అ. న, ఈ. స్త్రీ: చూ, వలపుకీలు.

వస్త్రచ్ఛేదకుఁడు. అం: చూ, జాతులు.

వస్త్రధారణ సమయము. అం. (ప్రభుత్వముగలుగును): చూ, గ్రహసమయములు.

వస్త్రనామాని. సం. వి. ఇ. పుం. ప్రవృత్తి*: చూ, సముద్రాంత. 3.

వస్త్రభేదకుఁడు. సం. వి. అ. పుం. బట్టలుకుట్టువాఁడు: చూ, సౌచికుఁడు.

వస్త్రము. సం. వి. అ. న. 1.=పాఁత: అంశుకము, కశిపువు- కసిపువు, కోకము, సహీవము, మాస్యము, నకకము, పోతము- పోత్రము-ప్రోతము, వరండము, వసనము- వస్నము-వాసనము- వాసము-వాసస్సు,సిచయము. (తె)- కోక, గుండ-గుడ్డ, పాఁత, బట్ట, ఎలువ. తద్వి.-ఖర్పరము,ఖల్లము,ఖల్లి,-చీరము; తద్వి.-౧. కోకకు:-అంబరము, అంశుకము, ఆచ్ఛాదనము, కర్పటము, కార్పాసము, కోకము, చీర, చేల-చేలము, చేలిక, ఫాలము, బావరము,వంగము, వసనము-వస్నము- వాసము- వాసస్సు, సంవ్యానము. (తె. వ).-ఒలె-ఒల్లియ-ఒల్లె, కట్టనము, కప్పడము, కోక, గుడ్డ, గుత్త, చీర-చీఱ, చేల, జీబు, జేబు, తోఁపు, పచ్చడము, పడము, పాఁత-ప్రాఁత, పావడ, పుట్టము, ౘట్ట, వాసెన, సేల; ౨. కట్టుఁగోకకు:- అంతరీయము, అధోంశుకము, అపినద్ధము. ఆముక్తము, ఉపసంవ్యానము, పరిధానము. (అవ్య).-అంతరము. (తె).-కట్టుఁగోక, కట్టుబట్ట, మొలకట్టు, సమ్మకరలచీర; 3. క్రొత్తచీరకు:-అనాహతము, అహతము- అహతము, తంత్రకము, నవాంబరము, నిష్ప్రవాణి. (తె).- కారికము, కోరా; ౪. మీఁగాలిదనుక నుండు కోకకు.- అప్రపదీనము, ప్రావారము. తద్వి.-అంగటట్టము, అరచేట్టు, గాగరా, తాబందు,దట్టము,పరికిణీ,పావడ,లంగ.లంగా, లుంగి-లుంగీ; ౫. పాడవు బట్టకు.-

ఆయామము. (తె).— ఉడుగర, కంగోరు, కంగోరుపావడ, చోఁపు, నిడుప్పు, నిడుప్పుకాసె, సోగ. (ఇది పొడవునకును వర్తించును.); ౬. ఎనుబగికిఁ గొన్నబట్టకు.— అసీతికము— అసీత్యము; ౭. పాదములదాఁకనుండు అంగీకి.—అంగిక, ఉన్మృక్తకము, శిరస్త్రాతము. (తె).—అంగి- అంగీ; ౮. అవికకు.—అంగిక—అంగిక, కంచుకము, కంచులిక – కుంచులిక, కింశుకము, కుర్పాసకము-కుర్పాసము – కూర్పాసకము- కూర్పాసము, చోలము. (తె) — కంచెల, కుపసము—కుప్పసము, చేనుఁగప్పు— చేన్నుఁగప్పు, చేనుకట్టు-చేన్కట్టు, చేనుమఱువు, పంజే, రవిక–రైక—అయిక — రైక—అవిక; ౯. చొక్కాకు.—అంగరఖు, అంగిక—అంగిక, అర్ధచోలకము, కుర్పాసకము-కుర్పాసము-కూర్పాసకము-కూర్పాసము, చోడము, చోలము, జామ, నిర్మోకము. (తె).—అంగరక—అంగరకా, అంగరేకు—అంగరేకు, అంగి-అంగీ, అరచేట్టు, కబాయి—కబాయీ, కమీజు, కుపసము—కుప్పసము, కుబుసము, చేట్టు, చొకా— చొకాయ— చొకాయి— చొక్కా— చొక్కాయ— చొక్కాయి— చొగా, చొలా—చోలా, జొబ్బ, దుత్తాయి, వగ, పేరణి—పేరణము— పేరిణి. తద్వి.— (౧): కోటు; (౨) దూదిబొంతచొక్కాకు:— కూర్పాసము, చోలకము; (౩.):(తె).— బనియను; (౪.): ఖేలకము— ఖోలకము; (౫.): (తె).—చిందియ— చిందె;(౬): (తె) టెక్కి; (౭.): కోలకము, మూర్ధత్రాణము; (౮.) (తె).— వర్జు; ౯. బాలురదట్టికి—: అర్ధోరుకము, చండాతకము, చలనము, ఛటి, ప్రముత్తరీయము. (తె).—ఇజారు—షిజారు, ఉడుప్పు, కచ్చె, కాస-కాసియ-కాసె-కుబుసే, గుడిగి, చెడీ-చెడ్డి—చెడ్డీ, చేల్లడము – చేల్లాడము, జీనపటము, దట్టి-దట్టీ, దిండు-దిండు, పేటి-పేటీ, మొలదట్టి, లాగు, షరాయి. (ఇజారులోనగునవి చీలమండలవఱకును, లాగు (పంట్లాము) లోనగునవి మోకాలువఱకును ఉండును); ౧౦. నడికట్టుకు.— అధికాంగము, పరికరము, సారసనము. (తె).— కాసెకోక, దట్టి- దట్టీ, నడికట్టు, పేటి— పేటే; ౧౧. అంగవస్త్రమునకు.—అంగవస్త్రము, అంశుకము, ఉత్తరవాసము, ఉత్తరాసంగము, ఉత్తరీయము, ఉపవీతము, కంబళము, కత్త్య, కర్పటము, చోడము, దీపము, పరిధానము, పరిచ్ఛాదనము, పారిసరణము, ప్రావారము, బృహతి—బృహతిక, వస్త్రిము, సంవ్యానము. (తె).— ఉత్తరిగము, ఒలె— ఒల్లియ— ఒల్లె, ఓణి—ఓణీ, కండువ— కండువా— ఖండువా, పంచియ— పంచె, బట్ట, బయిరవాసము— బైరవాసము; తద్వి.— (తె). కొల్లాయపంచె, గావంచే; ౧౨. మగవానిబట్టకు.— ఉపసంవ్యానము. (తె).—గోపతి, పంచియ- పంచె, పచ్చడము, వేష్టువ; ౧౩. మడిబట్టకు.— (తె).— నారమడి, మడిపంచే, మడిబట్ట, మడుఁగు-మడువు—మడ్గు— మణుఁగు- మణువు, ముకుటము— ముక్కుటము; ౧౪. బాలురకట్టుబట్టకు.— ఊరస్కటము, పంచావటము, వాలోపరీతము; ౧౫. ఉన్నిబట్టకు.— ఉన్నిబట్ట. తద్వి.— ప్లానెలు, బనాతు; ౧౬. కంబళికి.— అవి: (చూ. రల్లకము); ౧౭. ఉదికినబట్టకు — (తె).—చేలువ, చేలువబట్ట, పావడ, మడత, మడి, మడుఁగు-మడువు-మడ్గు-మడువు- మణుఁగు-మణువు, వలిపము—వల్పము—వెలిపము; ౧౮. వెండిసరిగబట్టకు -(తె)-జరబాజో, తగటి— తగటీ, సేరాజో, మాతాబి, సరిగ—సరిగె, సిరాజి; ౧౯. క్రొత్తబట్టకు.-(తె).—జేవళి; ౨౦. ఎఱ్ఱగుడ్డకు.—ఖోచకము;

౨౧. శాలువకు.- మృగరోమజము, రాంకవము, శాలువ. (తె).- జోమారు, పోరువ, సాలు-సాలువ, సెల్లా-సేలు; ౨౨. సన్నచారచేఁపునకు.- (తె).-నేఁత; ౨౩. వెడల్పుబట్టకు -పరిణాహము. (ఇది పాడవునకును వర్తించునని కొందఱు); ౨౪. వితంతువుబట్టకు.- జోమారు, సయినుపంచె; ౨౫. కండువా పంచెకలిసినబట్టకు - (తె).-జోమారు; ౨౬. ముతకగుడ్డకు - (తె.) జిమటపాఁత; ౨౭. తడిసినబట్టకు.- ఆర్ద్రవస్త్రము, జలార్ద్రము. (తె).- తడిబట్ట, తడుపంచె-తడుపంచె, తడుపు, పిడప, పొత్తియ-పొత్తు-పొత్తె, పాడుంగు-పాడువు; ౨౮. తడితుడుచుకొనుబట్టకు.- కర్పటము, గాత్రమార్జని, ఝిల్లి-ఝిల్లిక, నక్తకము. (తె).-తడియొత్తు; ౨౯. చిన్నగుడ్డకు.- (చూ, తడిసినబట్ట; వస్త్రము.1-౨౭.);౩౦. చేతిగుడ్డకు -(తె).-తువాలు-తువ్వాలు, రుమాలు- రుమాలువు; ౩౧. తెరచాఁపకు:-కాండపటము, జవనిక-యవనిక, తిరస్కరణి, ప్రతిసీర, వీరకము. (తె)- చాఁప, డమాను, తెరచాఁప; ౩౨. ప్రావరణవస్త్రమునకు.-(తె) పరవా; ౩౩. మధుపర్కమునకు.-ఆనందపటము,నవోఢావస్త్రము, మధుపర్కము; ౩౪. ముతకబట్టకు.- వరాటి,వరాశి-వరాసి; ౩౫. చారచేఁపునకు.-(తె).- చారచేఁపు- చారుచేఁపు, చారకోక, ఎక్కచేఁపు; ౩౬.అంచుకమ్ములులేనిబట్టకు.- మల్లు, మల్లుతాను,ముడిబట్ట, లేకు--లేకు, సయిను-సైను; ౩౭. గొప్పవెలగలబట్ట. (సం).-మహాధనము; ౩౮. సన్నపుబట్టకు.-అంశుకము,దుకూలము, పటము, వసనము, వస్నము, సుచేలకము, సూక్ష్మవస్త్రము. (తె).— నేఁత, రవపాళము, రవసెల్లా, పలువ-పలువము-పలువు-పల్వా- పల్వము, సన్నపుబట్ట; ౩౯. గొప్పబట్టకు.-పులసము. (తె).— పెద్దబట్ట; ౪౦. మైనపుబట్టకు.—సిక్థవస్త్రము. (తె).— అత్తు-హత్తు, అత్తెము, మైనపుగుడ్డ, మైనపుజిడ్డు; ౪౧. పైఁటపావడకు.- (తె). నెటిక; ౪౨. సరిగతో నేసినపట్టెకు.—(తె). పేటు; ౪౩. జుంటనేఁతబట్టకు.- (తె).-గింటెము-గింటెము, గెంటము- గెంటెము — గేఁటెము, గెట్టు; ౪౪. గుడారమునకు.—సూష్యము (చూ, పదనము. 1.); ౪౫. టోపీలలోని భేదమునకు.- (చూ, సీసకము. 1.); ౪౬. కిరీటమునకు - (చూ, సీసకము. 1.); ౪౭. ఉతికిన క్రొత్తకోకకు.- ఉద్గమనీయము; ౪౮. ఉదికిన పట్టు-చీరకు.— పత్రోర్ణము. తద్భ.- పట్టుచీర, పట్టుపంచె, జలిని (చూ, వస్త్రము. 1-౫౨.); ౪౯. వస్త్రపుటిక.- (తె) ఒడి; ౫౦. వస్త్రపుకట్టుకు.— ఒరగట్టు; ౫౧. కుచ్చెయిడినబట్టకు- (తె).-కుంచియ-కుంచె, నెఱి-నెఱిక; ౫౨: (తె).- అలుకటొట్టె, పిడచేపాఁత- పిడుచేపాఁత; ౫౩. దోమతెరకు:- చతుష్కి, జాలిక, మశహరి. (తె).-దోమతెర; ౫౪. చేదరపుగుడ్డకు.-(తె)చేవుకము-చౌకము; ౫౫. మోటుగుడ్డకు.-(తె) జిడ్డి;౫౬. తెల్లని నాజూకుగుడ్డకు-(తె) పరకాళాగుడ్డ; ౫౭: (తె).— బరకము; ౫౮: (తె).— రేనుగుడ్డ; ౫౯. వరుసగడ్డలపైనుంచెడి యొంటి గుడ్డకు. (తె).-కట్లంక;౬౦. పటకాలగుడ్డకు.- (తె). గోనెపణము; ౬౧. బొంతకు.-కంథ, కందాడిక-కదాడిక, ప్రోతము. (తె).-అంటెలు, గంత, జేడక, పప్పళిపచ్చేడము, బొంత; ౬౨. చింపిగుడ్డకు:-కంధ, కర్పటము, కుచేలము, చైత్రగంధ, నక్తకము, పటచ్చరము, ప్రోధము, సిచయము. (తె).— అంపియ-అంపె, అఱ, కప్పడము, కుళ్ళేలి

గంత, కుచ్చెలిబొంత, గుంజ-గుడ్డ, చింపి, చింపిగుడ్డ, చీరిక, పాఁత-ప్రాఁత, పీలిక-పేలిక-పేలికె-ప్రేలిక, మెదుగుడు; ౧౩. మాసినబట్టకు.- ఆహతము, కర్పటము, నక్తకము. (తె).- కప్పడము; ౧౪. కవచమునకు.— (చూ, వారవాణము); ౧౫: (తె).- జేబుతువ్వాలు-జేబురుమాలు; ౧౬: (తె).- జేంబుకానా- జేముకాణము; ౧౭. నల్లబట్టకు - చగలము. (తె) — నీలి, మంజిడి; ౧౮. తలకుఁజుట్టుకొను బట్టకు.- పరివేష్టనము. (తె).- పరివట్టము. (చూ, సేసకము. 1.); ౧౯. (చూ, వస్త్రము. 1-౫౧): తెరకు.-అపటి, కాండపటము, జవనిక-యవనిక, తిరస్కర (రి)ణి, ప్రతిసీర. (తె) - గండపడము, జేవనిక, తెర, పరదా-సీను; ౨౦. వ్రాఁతపనిబట్టకు.— (తె).— కలంకారి; ౨౧. నీలకలధౌతవస్త్రమునకు: (తె).—కసీసము; ౨౨. కాషాయవస్త్రమునకు.—కాషాయము. (తె).—కావి, కావిచీర, చేందుగు, తోఁపు; ౨౩:—కాశేయము- కాషేయము, చీవము. (తె).— తాపిత — తాపితా. (చూ, వస్త్రము. 1-౪౮); ౨౪. నారబట్టకు - క్షౌమము, వల్కలము.— వాల్కము; ౨౫. నారచీరకు.-చత్వరము, చీరము, ప్రుత్రిక, వల్కలము — వాల్కము. (తె).—నారమడి, నారచీర, బొత్తిచీరె, ముంగాముచీర, ముకుటము—ముక్కుటము; ౨౬. నూనెయగిసె నారచీరకు.-క్షౌమము; ౨౭. కుంజేటిత్రుప్పటి చీరకు:—క్షౌమము; ౨౮. బిచ్చగాని బట్టకు:—చీవరము; ౨౯. చైత్రకునిబొంతకు.— చైత్రగంధ; ౩౦. సన్యాసులబొంతకు.—కుచేలము. (తె)— కుచ్చెలిగంత, కుచ్చెలిబొంత; ౩౧. చటరచితముకుటమునకు.— (తె).— కుళాయి-కుళాయి-కుళ్ళా-కుళ్ళాయి-కుళ్ళాయి,

తాజో, తపాగము-తపారు; ౩౨. నెలిపట్టుచీరకు,— క్షోమము-క్షౌమము, ఖర్మము, దుకూలము- నేత్రము. (1). తద్వి.— (౧.) నేలైనపట్టుచీరకు.— (తె).-తాపిత-తాపితా. (౨.) పచ్చపట్టుచీరకు.- (తె).— మాందాళి. (చూ, వస్త్రము. 1-౪౩.); ౩౩. వెలిచలువకు.-కంచుకము.(తె).-తెల్లనిబట్ట, తెల్లనిచీర; ౩౪:—ఉల్లోచనము, వితానము. (తె).— చేందువ, మేలుకట్టు; ౩౫. వస్త్రముకొనకు:-(చూ, వత్తి. 1-2); ౩౬. సాంద్రవస్త్రమునకు.— (తె).— గడితము, సుగ్గడితము; ౩౭. సన్యాసులకాటికి.— కర్పటము, చివరము, చీరము, చీవము, చీవరము, చీరఖండకము, కాటి. (తె).— కప్పడము, కావులు. (చూ, వస్త్రము. 1-౩౦); ౩౮. ముసుఁగుచీరకు — యవనిక. (తె) - తెర; ౩౯. శృంగారోత్తరీయమునకు.— (చూ, వస్త్రము. 1-౧౧). (తె).— ఒలెవాటు-ఒల్లెవాటు- వలెవాటు- వల్లెవాటు, పయఁట- పయిఁట-పయ్యఁట- పయ్యెఁట-పైఁట, పయ్యఁద— పయ్యెఁద; ౪౦. ప్రత్యుత్తరికోకకు -(తె).-ఒలె-ఒల్లియ-ఒల్లె, ఒల్లెచీర, వల్లెకోక. (నాగులచీర, గళ్లచీర అనియు వాడుక.); ౪౧. చిత్రవర్ణపుకోకకు.-(తె).- ఓరవలి, కలికంచుచీర, కస్తురిమల్లెచీర, వన్నెచీర; ౪౨. ఎఱుపుమించిన పసుపువన్నెచీరెకు.- మాంజిష్ఠము; ౪౩. రక్తకము.(తె)-తోఁపు; ౪౪. పొడవన్నెకోకకు.-(తె).-హేరవళి-హేరావళి, హారవలి- హారవలి; ౪౫. చిత్రవర్ణవస్త్రములు.- (తె).—కడుతచౌర, ఏనుఁగడుగు, పట్టెమాలుపు, పప్పళి, బవంతి, బొమ్మంచు, మంజిడి, వన్నియ— వన్నె— వన్నెచీర;

౯౬: (తె).- పాత్తి- పాత్తిక- పాత్తియ, పొత్తు, బొమ్మచీర; ౯౭. కపిలవర్ణముగల చీరకు.- (తె).— మాదవళము- మాదళము- మాదావళము- మాదావళి; ౯౮: (తె).- మయిల-మైల, మయిలకోక- మైలకోక; ౯౯: (తె).- మేలుకమ్మిచీర; ౧౦౦. ముసుగుకోకకు.- వరాశి, స్థూలశాటకము; ౧౦౧. పలుపుచీరకు.- నిచోళము, ప్రచ్ఛదపటము; ౧౦౨. కప్పుకొనుకోకకు.-నివీతము; ౧౦౩. పఱచెడుబట్టకు.- ప్రచ్ఛదపటము. (తె).- పచ్చేడము. (చూ, వస్త్రము.1—౧౦౧.); ౧౦౪. మంచికోకకు.— పటము, సుచేలకము. (చూ, వస్త్రము. 1-౩౯.); ౧౦౫. నూలుబట్టకు.- కార్పాసము, ఫాలము, వంగము. తద్వి.- కౌశేయము; ౧౦౬. దుప్పటికి.-కంబ, చరకము, చోటి-జోటి, ద్విపటము-ద్విపటి, నిచోళము, నిశారము-నీశారము, పరిచ్ఛదనము, శాటి, స్థూలశాటకము. (తె).— తోడుగు- తోడువు- తోడ్గు, దుప్పటము— దుప్పటి— దుప్పటీ— దువ్వటము, దూవలువ- దూవల్వ, పచ్చేడము, వీణము— వీణాము, హంసావళి. (చూ, వస్త్రము. 1-౧౦౦). తద్వి.—(౧.)(తె).-రగ్గు, రజాయి; (౨.) దుప్పటీలోసగమునకు.- (తె).-రేకు- ఱేకు; ౧౦౭. వీణెలోనగువానియొఱకు-.నిచోళము, పంజరము, ప్రచ్ఛదపటము. (తె).— గవిసెన (చూ, నిచోళము. 1.). తద్వి.-ఖడ్గాదుల యొఱకు.— ప్రత్యాకారము; ౧౦౮. (తె).- జిలిబిలిచీర; ౧౦౯. చిత్తరువువ్రాయు వస్త్రాదికమునకు.— పటము; ౧౧౦. స్త్రీపార్శ్వచేలాంచలమునకు.-(తె).- పంజెఱఁగు; ("చూ, స్థూలశాటకము."); 2. కోక: చూ, వస్త్రము. 1—౧; అం. 3: చూ, ఉపచారములు; 4: చూ, ఐశ్వర్యములు; 5: చూ, అష్టభోగములు, భోగములు; 6: చూ, అలంకారములు.

వస్నస. సం వి. ఆ. స్త్రీ. సన్నపునరము: చూ, స్నాయువు.

వస్నము. సం. వి. అ. న. 1: చూ,వస్త్రము.1; 2. ధనము: చూ, హిరణ్యము. 3; 3. కూలి. (జీతము అనియు): చూ, సంబళిక. 2; 4. వెల: చూ, విలువ; 5. కన్ను: చూ,లోచనము; 6 బరిణె: చూ, హరివాణము: (చూ, పాత్రము. 6-3.) [వ్యవధానము. 3.

వస్త్రాచ్ఛాదనము. సం.వి.అ. న. ముసుఁగు:చూ,

వస్త్రాదికృతచ్ఛత్రము. సం. వి. అ. న. గుడ్డలోనగువాని గొడుగు: చూ, వారిత్ర.

వస్వోకసార. అం. 1. కుబేరునిపట్టణము; చూ, సీమ. (1) (దేశములు); 2. అమరావతీ పట్టణము: చూ, సీమ. (1) (దేశములు )

వహతి. సం. వి. ఇ. పుం. 1. ఎద్దు: చూ, వృషభము. 1; ఈ. స్త్రీ.2.నది: చూ, హ్రాదిని.2 (నది.)

వహతువు. సం. వి. ఉ. పుం. 1. ఎద్దు: చూ, వృషభము. 1; 2. పథికుఁడు:చూ,వాటచారి.

వహతేబ్రాహ్మణులు.అం: చూ,వక్తారీబ్రాహ్మణులు.

వహనము. సం. వి. అ. న. 1. వహించుట:చూ, సంశ్రుతి. 2; 2. ఓడ: చూ, వహోడము.

వహము. సం. వి. అ. పుం. 1. ఎద్దుమూఁపురము: చూ, స్కంధము. 1; 2. రూ- వాహము. గుఱ్ఱము: చూ, హయము, 3. పదియూలుతూములు; 4. ఆవులయూపిరి: చూ, వాయువు; 5. గాలి: చూ, వాయువు.

వహోరువు. సం. వి. ఉ. పుం. నరము: చూ, స్నాయువు.

వహి. సం. విశే. (న్. ఈ. న్) 1. వహించువాఁడు: చూ, స్వీకర్త; 2. పీత: చూ, హారిలాంఛనము; దే. వి. (1) లెక్కలపుస్తకము: చూ, సంపుటము. 3; (2) పుస్తకము: చూ,

సంపుటము. 3; (3): చూ, విధము. 1. పాండు. 4, ఆ. 184.

వహించే. సం. స.క్రి. తాల్చు: చూ, స్వీకరించే.3.

వహిత్రము. సం. వి. అ. న. దోనె: చూ, ప్లోడము.

వహేలనము. సం. వి. అ. న. తిరస్కారము: చూ, హేళనము. తద్విశేషములకు:- చూ, హేళనము.

వహేలనుఁడు. సం. విణ. 1. తిరస్కరింపఁబడినవాఁడు: అవగణితుఁడు, అవజ్ఞుఁడు, అవమతుఁడు, అవమానితుఁడు, అవరీణుఁడు, ఏకతరుఁడు, పరాజితుఁడు, పరాభూతుఁడు, పరిభూతుఁడు. (తె).— తెగడికమానిసి; 2. ఓడినవాఁడు:—పరాభూతుఁడు.

వహ్ని. సం. వి. ఇ. పుం. 1. (హవ్యమును దేవతలకుఁబొందించేవాఁడు) తద్వి..౧. అగ్నులు:- గార్హపత్యము, ఆహవనీయము, దక్షిణము, నిర్మంథ్యము, వైద్యుతము, శూరము, సంవర్తము, లౌకికము, జాఠరము, విషకము, క్రవ్యాత్తు, క్షేమవంతము, వైష్ణవము, దస్యుమంతము, బలదము, శాంతము, పుష్టము, విభావసువు, జ్యోతిష్మంతము, భరతము, భద్రము, స్విష్టకృత్తు, వసుమంతము, క్రతువు, సోమము, పితృమంతము, అంగిరస్సు (27); ౨. ఆయుర్వేదౌషధములు వండుటకు వలసిన అగ్నులు.-దీపాగ్ని, కమలాగ్ని, మందాగ్ని, గాఢాగ్ని; 3. అగ్నిపంచకము.— బుద్ధి, ఉదానము, చక్షువు, రూపము, పాతము(5); ౪. అగ్నిహోత్రుని జిహ్వలు.- కాళి, కరాళి, మనోజవ, ధూమవర్ణ, స్ఫులింగిని, విశ్వపద. (6); (౧—౨—౩—౪ ఇందుల పదములను శీర్షికాపదములుగ చేర్చలేదు); అగ్నికి:- అంకతి, అంగారకము, అంగారము- అంగారము, అంచతి, అగ్ని, అగ్నిహోత్రము, అగ్నిహోత్రుఁడు, అనలము, అనలుఁడు, అప్పిత్తము, అభిప్రియము, అయఃపచి, అర్కత్విడు, అసితార్చి, అరము, అశము, అశిరుఁడు, ఆశిరము, ఆశుశుక్షణి, ఆశ్రయాశి (సి), ఆశ్రయాశుఁడు, ఈషిరుఁడు, ఉదర్చి, ఉద్బుధము, ఉల్క, ఉషర్బుధుఁడు, ఉష్ణము, ఊర్ధ్వశోచిషము, ఏధతుఁడు, క, కతమాలము, కపిలుఁడు, కర్కము, కపాకుఁడు, కాష్ఠేంధనప్రియము, కీలకము, కీలి, కుతపము, కుధాకువు, కుశాకరము, కుపాకువు, కృత్తిక, కృపీటయోని, కృశానువు, కృపాణువు, కృష్ణవర్త్మ, కృష్ణార్చి, కృష్ణుఁడు, కేతువు, కోసలము, ఘాసి, ఘృతదీధితి, ఘృతదిధీచి, గర్భము, గుల్మి, గోపతి, చకుశృంగము, చిత్యము, చిత్రభానువు, ఛాగరథము, ఛాగవాహనుఁడు, ఛిదగము, జగన్ను (న్ను) వు, జన్యువు, జసురి, జాతవేదుఁడు, జుహూవాణుఁడు, జ్వలనము, జ్వాలాజిహ్వుఁడు, జ్యోతి, త, తనూనపాత్తు, తపువు, తమోఘ్నుఁడు, తమోపహుఁడు, తరము, తుత్థము, తుషాగ్రహుఁడు, త్రిధాముఁడు, దమునసుఁడు, దహనుఁడు, ధనంజయుఁడు, ధమనుఁడు, ధూమకేతువు, ధూమధ్వజుఁడు, నాచికేతుఁడు, నారాయణుఁడు, పచి, పర్ష్రికుఁడు, పవనతనయుఁడు, పాంచజన్యుఁడు, పాచకుఁడు, పావకుఁడు, పింగళుఁడు, పీథువు, పృథువు, ప్రజ్వలనము, ప్రభాకరుఁడు, బభ్రువు, బర్హి, బర్హిష్మశ్ము, బర్హిస్సు, బహులుఁడు, బృహద్భానువు, భాస్కరుఁడు, భుజి, మ, మంత్రదీధితి, మలిమ్లుచుఁడు, రోహితాశ్వుఁడు, వమి, వల్లూరము, వసువు, వాయుసఖుఁడు, విభాకరుఁడు, విభావసుఁడు (వు), విరోచనుఁడు, విశ్వపుఁడు, వీతిహోత్రుఁడు, వైశ్వానరుఁడు, శమీగర్భము, శిఖావంతుఁడు, శిఖి, శుక్రుఁడు, శుచి, శుష్క, శుష్కము,

శోచిష్కేశుఁడు, శోణము, సధి, సప్తజిహ్వుఁడు, సప్తదీధితి, సప్తహస్తుఁడు, సప్తార్చి, సమంతభుక్కు, సమిధుఁడు, సర్వభక్షకుఁడు, సృదాకువు, స్వర్ణదీధితి, హరి, హవ్యవాహుఁడు, హవ్యవాహనుఁడు, హసనీమణి, హిరణ్యరేతసుఁడు, హిరణ్యరేతుఁడు, హుతభుక్కు, హుతవహుఁడు, హుతాశనుఁడు. (తె. వ).- అంటనిజేజె (అంటరానివేల్పు), అగిని, అగ్గి, అన్నితిండికాఁడు, అన్నిఁదినువాఁడు, ఇంగలము - ఇంగిలము, ఎఱుపులు, ఎఱ్ఱనివేలుపు, ఏడికవజీరు, ఐదార, అయిరుపు-ఐరుపు, కణఁకు, కప్పుఁదెరువుజోడ, కప్పుఁదెరువుదారి, కప్పుతోవరి, కప్పుఁదెరువరి, కరువలివిందు, కిత్తు, గాడుపుసంగడీఁడు, గాలిచూలి, గాలినెచ్చెలి, చేవుగంటి-చాగంటి, చిచ్చు, జంటమోములవేలుపు, డిగ్గి, తగరుబాబాసామి, తగరుగవుతు-తగరుకొతు, తిగకాళ్లదేవర, తెమ్మెరచెలి, తెఱ - తెఱ్ఱ, దంటమోములదేవర, దుగమోములవేల్పు, దుగమోములయ్య, దుగమోరపాదుసా, నాల్గుకన్నులవేల్పు, నిప్పు, నిప్పుక, నీటికానుపు, నీటిచూలి, నీటిబిడ్డఁడు, నీరుపాప, నీరుపుట్టువు, మబ్బుపూనినువు, వయిరవులు - వయిరాలు - వైరవులు - వైరాలు, వినుమనుమఁడు, వేఁడివేలుపు, వేల్పుల మొగము, సతనాలుకల దనీఁడు, సతనాల్కలజేజే, సతనాల్కలపాదుసా, సెగకాఁడు. ("చూ, హుతాశనుఁడు."); తద్వ్యాక్షేపములు.— ౧: (చూ, త్రేతాగ్నులు). (తె).— ముచ్చిచ్చు, ముయ్యగ్గి; ౨. యజ్ఞాగ్నికి.— ఉద్ధవము, క్రతుపావకము, యజ్ఞవహ్ని, యజ్ఞాగ్ని, యాగాగ్ని; ఉపచాయ్యము, పరిచాయ్యము, సమూహ్యము; ౩. గార్హపత్యాగ్నిలోనుండి యెత్తిదక్షిణాగ్నియందుంచిన అగ్నికి.- ఆనాయ్యము; ౪. చయనాగ్నికి.— చయనము, చేయము. (తె. వ).— కరువడము; ౫. వేదప్రణిధానాగ్నికి.- జామదగ్ని; ౬. జంతువుయొక్క యాకారముగల తిన్నెలోని అగ్నికి:-చయనము; ౭. యజ్ఞమునందు వేదికకుఁబడమట గుండ్రని గుండమునందు అగ్నికి— గార్హపత్యము; ౮. శవముతోమ్తుపై నుంచెడు అగ్నికి.- (తె). తలకొఱవి; ౯. విచ్ఛిన్నాగ్నిని మరలఁగూర్చుటకు —పునస్సంధానము; ౧౦. అగ్నిసంకాశమునకు:— సంకృతి; ౧౧. హోమరహితాగ్నికి:- సభ్యము; ౧౨. మంత్రాగ్నికి:— ప్రణీతము; ౧౩. అగ్నిమయమునకు.-అంగారము. (తె). చిగుర్చు, చిచ్చెఱ-చిచ్చెఱ, నిప్పులగుంపు; ౧౪: అగ్నికణము, కుక్కుటము, విస్ఫులింగము, షణ్ముఖి, స్ఫులింగము. (తె).— అవరులు, నిప్పు, నిప్పుకలు, నిప్పులు, మిడుఁగు - మిడుఁగుఱులు— మిణుఁగుఱులు—మినుఁగుఱులు - మిడుఁగులు—మిఱుఁగులు; తద్వి.- (తె) — తుట్టు; ౧౫. మేఘాగ్నికి.—ఇరమ్మదము, నిర్ఘాతాగ్ని, మేఘజ్యోతి, వజ్రాగ్ని; ౧౬: అనలము, జఠరాగ్ని; ౧౭. కాలాగ్ని; ౧౮. పర్యగ్నికరణాది పశు సంస్కారమునకు:— వ్యంజనము; ౧౯. నీరుపోసిననిప్పునకు:—(తె). కుమ్ము; ౨౦. జ్వాలలేని నిప్పునకు:— (తె). కుమ్ము. (సం).—ఉల్క, కంతసీలకము; ౨౧. తృణాగ్నికి:-వత్సలము; ౨౨. ఉల్కాగ్నికి.—(చూ, రిక్క.౨. 2171పొరట); ౨౩. కార్చిచ్చుకు.— ఖ, దవము—దావము. (తె).-ఎగగలి—ఎరవలి, కారగ్గి, కారుచిచ్చు-కార్చిచ్చు-కాఱుచిచ్చు-కాఱ్చిచ్చు; ౨౪. కొఱవికి.—అలాతము, ఉల్ముకము, జ్వలదంగారము. (తె).—కడకొఱవి, కొఱకచ్చు, కొఱవి; ౨౫: ఇంగలము, క్రమము, కరీషాగ్ని, భగలము, భాగణము.(తె).— పిడకనిప్పు; ౨౬. మంటకు.- అగ్నిజారము,

అగ్నిజ్వాల, అగ్నిసకశ్రిజరాయువు, అగ్ని నిర్యాసము, అగ్నిశిఖ, అర్చి, ఇ, కాఘృణి, కీలము, కేల, జ్వలనము, జ్వాల, జ్వాలము, జ్యోతి, త్రేట్టు, ప్రజ్వలనము, మయూఖము, వర్చస్సు, వహ్నిజాతము, హేతి. (తె).— ఏర్పు, కనలు, తమట, సెగడి, మంట, సెక-సెగ-సెవ; ౨౭: అంగార్య. (తె).- బొగ్గులకుప్ప; ౨౮. బడబాగ్నికి.- ఔర్వము, కాకధ్వజము, కాష్ఠధృక్కు, కోశాతకి, ఘోరధ్వని, తృణధృక్కు, పాతాళము, బడబాగ్ని, బడబానలము, బాడబము, వడవాముఖము, వాణిజము, సలిలేంధనము, స్కంధాగ్ని. (తె) —నీరుచిచ్చు-నీర్చిచ్చు, మున్నీటియగ్గి, వార్వఘుటగ్గి; ౨౯. బొగ్గుకు.— (చూ, బొగ్గు.); ౩౦. అగ్నిభేదములు.—అవలము, కుకూలము, ఛగలము, వత్సలము; ౩౧. భస్మమునకు.— (చూ, భస్మము, చూ, నిగరి. 1.); ౩౨. ఉముకనిప్పునకు.— కుకూలము, కులాలము, కుశూలము, తుషానలము, ముర్మురము. (తె).— ఉముకనిప్పు, కుమ్మ, కుమ్ము; ౩౩. హోమకుండమునకు.- కుండము. (తె).—కొండము-గుండము; (త్రేతాగ్నులు= ఆహవనీయము, దక్షిణాగ్ని, గార్హపత్యము ఇవి క్రమముగా వేదికిఁబూర్వ దక్షిణ పశ్చిమ దిక్కులయందుండును. పంచాగ్నులు= పైమూఁడును సభ్యము, అపసధ్యము. సభ్యాపసధ్యములు ఈశాన్యదిక్కునందుండును. సామాన్యాగ్నుల భేదములు.—అనలము, కుకూలము, ఛగలము, వత్సలము. అనలము మొదలగువాని కర్థములను ఆయాపదములకడఁజూచి తెలిసికొనవలెను.(చూ, అగ్నులు).అగ్నిచటాత్కారము సంకాగిము.); ("చూ, హుంతాశనుఁడు."); 2. చిత్రమూలము*: చూ, వహ్నిసంజ్ఞికము; 3. గుజ్జము: చూ, మాయము.

వహ్నిగర్భ. సం. వి. ఆ. స్త్రీ. జమ్మి*: చూ, శమి;

వహ్నిగర్భకము. సం. వి. అ. పుం. రావి*: చూ, శ్యామలము. 2. [వహ్ని. 1-౨౬.

వహ్నిజాతము. సం. వి. అ. పుం. మంట: చూ,

వహ్నిజ్వాలము. అం: చూ, నరకములు.

వహ్నిదేవత. సం. వి. ఆ. స్త్రీ. ప్రతిపత్తు. (తె). పాడ్యమి: చూ, హరివాసరము.

వహ్నిశిఖము. సం. వి. అ. న. 1: అగ్నిశిఖము, కాంతరజము, కాలేయకము, కాలేయము, కావేరము, కశ్మీరజన్మ- కాశ్మీరజన్మము- కాశ్మీరజము, కాశ్మీరము, కుంకుమము, కుచందనము, కుబేరము, కుసుంభము, కుసుమాత్మకము, కేసరవరము, గణేశభూషణము, గాంధారము, గుడము, గోనసము, ఘుస్రము, ఘుస్రము, ఘుసృణము, చందనము, చంద్రిక, చారువు, జాగుడము. ధీరము, నాగజము, నాగసంభవము, పిశునము, పీతనము, ప్రియంగువు, రక్తము, రక్తాంగము, రక్తసరోరుహము, రుధిరము, రోహితము, లోహితచందనము, లోహితము, వరము, వీరము, సంకోచపిశునము, సంకోచము, సిందూరము, సీమంతమండనము, సూర్యరక్తసంజ్ఞము, సైమంతికము, సౌరభము. (తె. ప).-కుంకుమ పువ్వు—కుంకుమపూవు, కుంకుము, చేందురము, చేంద్రము, చెందిరము- చెంద్రము, చెందిరము-చెంద్రిమము,దీరము, సిందురము- సిందూరము. (చూ, రాజార్హము. 1-౪౩-(౬.); 2: అగ్నిశిఖము,కమలోత్తరము,కరటము, కుసుంభము, పిణ్యాకము, బాహ్లికము- బాహ్లీకము, మహారజనము. (తె. ప)..కుసుంబపువ్వు—కుసుంబా - కుసుమ—కుసుమపూవు, చేందురపూవు, చెందిరిక - చెంద్రిక. తద్వి.- అడవికుసుంబపువ్వునకు.-కౌసుంభము. [రక్త.

వహ్నిసంజ్ఞిక. సం. వి. ఆ. స్త్రీ. కృత్తిక: చూ,

వహ్నిసంజ్ఞికము. సం. వి. అ. పుం: అగ్ని, అగ్నిజారము, అగ్నిమాత, కృమికంటకము, క్రిమికంటకము, చిత్రిచరణము, చిత్రము, చిత్రిమూలము, చిత్రాంగము, జ్యోతిష్యము, దహనము, ద్వీపినామాపచనము, పాకి, పాక కము, వహ్ని. *తద్వి:-అగ్ని, కాలము, కాల మూలము, చిత్రాంగము, క్రిమికంటకము. (మి. వ.).— ఎఱ్ఱచిత్రిమూలము. *.

వళక్షము. సం. వి. అ. పుం, విణ: చూ, రూ-వలక్షము. (రూ-బలక్షము అనికొందఱు.)

వళవు. దే. వి. 1: చూ, విధము. 1; 2: చూ, వెరవు. 1.

వళాంధ్రిబ్రాహ్మణులు. అం: చూ, ఘూర్జర బ్రాహ్మణులు. 2118 పొరట.

వళాగ్రిము. దే. వి. క్రిముకభేదము: చూ, స్రింపి. 1 (పోఁక).

వళావళి. దే. వి 1. కుతూహలము. ప్రిభా. 2, ఆ. 70: చూ, వ్యసనము.8; 2: చూ, విజృంభణ ము. భాను. 3, ఆ; వసు. 3, ఆ. 132;

వళావళికాఁడు. దే. వి: చూ, వ్యర్థభాషణుఁడు: అం, భా. తృ. 12.

వళావళికాయ. దే. వి. కుతూహలముతో [నుండు వాఁడు.

వళి. సం. వి. ఇ. స్త్రీ. రూ-వలి. 1. కడుపు మీఁది ముడుత: (తె). ఉగ్గులు, తరులు-తఱులు, నెత్తలులు, నొక్కులు, స్రుక్కులు. ("చూ, సుక్కులు."). తద్వి.— కడుపుమీఁది త్రివళులు: (తె)— ముత్తరంగలు; 2. బట్టనెఱి: ఊర్మి-ఊర్మిక, కక్ష-కక్షము, కచ్ఛము, కుచ్ఛి. (తె).— ఉగ్గు, కచ్చె, కుచ్చె— కుచ్చెల- కుచ్చిళ్లు- కుచ్చెళ్లు, చింగు— చెంగు, నెఱి- నెఱిక, నొక్కు, పింజె, ముడుత, రింగులు. (తద్వి.—౧. వెనుకప్రిక్క జేఱ్రిలాడు కొంగునకు.—కక్షము; ౨. అంగ వస్త్రపు కొంగునకు.— కక్షము; ౩. కొత్త బట్ట మడత లోనున్న తక్కువచెంగునకు.-(తె). పిక్కు; ౪. కోక యొక్క కట్టుకొను చెఱఁగునకు.- (తె).— కట్టుఁగొంగు("చూ, పైజాఱు."); ౫. ఆఁడుదానికోక కుచ్చెళ్లకు.-వలిభము; ("చూ, పింజె. 1-2-3-4.")

వళితకోశము. సం. వి. అ. పుం. ముగ్గ్రవాలిన యుపస్థ: చూ, స్మరాంగారకము(భగము.12.)

వళిరుఁడు. సం. విణ: చూ, రూ- వలిరుఁడు— వళీరుఁడు.

వళీరుఁడు. సం. విణ. —పై.—

వళుకు. దే. వి. 1. తగవు: చూ, రూ-వలుకు. రా, వి. 4, ఆ. 90; 2. అపదేశము. ఆం, పదా. నర. 65: చూ, వ్యాజము. 1.

వళులు. పా. 1. దీనికిఁ ఉపమానములు.- తరంగ ములు, నిచ్చెనమెట్లు, మేడమెట్లు, ఇసుక తరంగములు; అం. 2. (పురుషుని కడుపుపై ముడుతలు): చూ, లక్షణాంగములు. (ఒకటి గలిగిన శస్త్రహతుఁడగు. రెండు గలిగిన స్త్రీల గెలుచును. మూఁడుగలవాఁడు యోని సుఖమునొందును. నాలుగుగలిగిన సుపుత్రి వంతుఁడై పరాక్రిమశాలి యగును. పార్శ్వ ముల వంకలైయున్న సంతసము గలుగును.); 3. (ఆఁడుదాని కడుపుపైముడుతలు.): చూ, స్త్రీ లక్షణాంగములు. (జలతరంగములవలె మూఁడు కనుపించియున్న యుత్తమురాలగు.)

## వా

వా. సం. అవ్య. 1. ఇవార్థము, వలెను; 2. ఇతర వ్యవచ్ఛేదార్థకము: అయ్యావే, 3. అట్లైన నిట్లై నను: చూ, వికల్పార్థకములు; 4. నూతనకల్ప ము; 5. నిశ్చయార్థకము: చూ, సత్యము. 1; 6. మఱియొకటియు: చూ, సముచ్చయము. 1;

7. తిరుగులాడుట, విహారము: చూ, సంచారము; 8. మంచికల్పము: చూ, సుకల్పము; వై. వి.—వాక్. రూ-వాయి. (1) నోరు: చూ, వదనము. 1; (2): చూ, వాదర. జై 2, ఆ. 79; (3) మొగము: చూ, వదనము. 2.

వాంకము. సం. వి. అ. పుం: చూ, సముద్రము.

వాంచే. వై. పే్రి. వంగఁజేయు: చూ, రూ-వంచే. 2.

వాంఛ. సం. వి. ఆ. స్త్రీ.—ఇచ్ఛ: అనుతర్షము, అనుషంగము, అనుస్మరణము, అపేక్ష, అభిరతి, అభిలాష, అభీప్సితము, అభీష్టము, అర్థి, ఆకలనము, ఆకాంక్ష, ఆగ్రహము, ఆదిత్స, ఆమిషము, ఆశ, ఆశంసనము, ఆశాస్తి, ఆశిత, ఆశీస్సు, ఆసక్తి, ఇచ్ఛ, ఇషణము, ఇష్టి, ఈప్స, ఈహ, ఉత్థానము, ఉదాసము, ఏషణము, కాంక్ష, కాంతి, కామన, కామము, కామి, కౌతుకము, గమనము, గాధము, గార్ధ్యము, జ, చికీర్ష, ఛందస్సు, జృంభితము, తర్కము, తర్షము, త్వట్టు, తృష, తృష్ణ, దయితము, దోహదము, పరాయణము, ప్రతియత్నము, ప్రియము, భగము, మతి, మనోరథము, రుచి, లిప్స, వ, వరము, వల్లభము, వశము, వ్యసనము, శంస, శంసనము, శోభ, సమ్మతి, స్పృహ, హృద్యము. (అవ్య).—అజ్. (తె. వ).—అక్కఱ, అరుసము, అర్మిలి, ఆస, ఆసత్తి, ఆసపాటు, ఇంపు-ఇంబు, ఇచ్చ, ఇయ్య-ఈయ, ఏఁకట, కచ్చ, కసి, కాయువు-కాయ్వు, కెలసము, కొసరు, కోరిక-కోరికి-కోరిక-కోర్కి, క్రచ్చ-క్రమ్మ, జేవవు, జెంజాటము, జేడ్డు, జేడ్డుతనము, తగులము, తగులు-తౌలు, తమి, తరితీపు, తలఁపు, తివుట, తీపి, తోఁపిక, తోఁపు, నర్మిలి, పట్టింపు, పట్టు, బాళి, మచ్చిక-మచ్చిక-మచ్చిగ, మాఁటు, ముచ్చట, మోజు, రహి, వచ్చ, వలపు, వాఁపిరి, వేడుక-వేడ్క, సడ్డ, సోము, హాళి. ("చూ, హాళి.") తద్విశేషములు.- ౧. అత్యాశకు.—అత్యపేక్ష, అభిరుచి, అభిష్వంగము, ఆశ, ఉత్కృష్ణ. (తె).—ఆస, ఉబలాటము, ఏఁకట, పేరాస, వాఁపు; ౨. దురాశకు.—అర్థాశ, అధి, దురాశ, పర్యాశ, వాసన. (తె).—అడియాస; 3. పరద్రవ్యాపేక్షకు.—అభిధ్య; ౪. కుత్సితమైన యాశకు.—కదీహ; ౫. ఎఱుఁగనిచ్చయించేటకు. (అవ్య)—ఖలు; ౬. అధికేచ్ఛకు.—లాలస-లాలసము-లాలూచి; ౭. కొలువనిచ్చకు:—దిధక్షు; ౮. గెలువనిచ్ఛకు:—జిగీష, దేవశము, దేవనము. తద్వి.—విజిగీష; ౯. గ్రహింపనిచ్ఛకు:—జిఘృక్షు; ౧౦. చంపనిచ్ఛకు.—జిఘాంస, ద్రోహము; ౧౧. చావనిచ్ఛకు:—ముమూర్ష; ౧౨. చూడనిచ్ఛకు:—దిదృక్షు; ౧3. తెలియనిచ్ఛకు.—జిజ్ఞాస; ౧౪. నిర్మింపనిచ్చకు:—నిర్మిమీష; ౧౫. పోవనిచ్ఛకు.—జిగమిష, సిసృప్స; ౧౬. బోధగొననిచ్చకు:—బుభుత్స. ౧౭. మిక్కిలి యిచ్చకు:—నిరతి; ౧౮. రక్షింపనిచ్ఛకు:—రిరక్షు; ౧౯. రమింపనిచ్ఛకు:—రిరంస; ౨౦. విడువనిచ్చకు.—జిహాస; ౨౧. విననిచ్చకు.—శుశ్రూష; ౨౨. సంధింపనిచ్చకు:—సంధిత్స; ౨3. సంభోగేచ్ఛకు:—(తె.) దూల, మసకము; ౨౪. సృజింపనిచ్చకు:—సిసృక్షు; ౨౫. హరింపనిచ్చకు:—జిహీర్ష; ౨౬. అనుభవింపనివస్తువునందుగలయిచ్చకు.—కుతుకము, కుతూహలము, కౌతుకము, కౌతూహలము, తమి; ౨౭. అంతటరమింపవలయుననిచ్చకు:—అరిరంస; ౨౮. అన్నముమీఁదియిచ్చకు:— (తె).— చొరవ; ౨౯. చెప్పనిచ్చకు.—వివక్షు; 3౦. ఒకటివెనుక నొకటి వ్యాపింపనిచ్చకు.—వీప్స;

(విణ). ౩౧. ఇచ్ఛగలఅదినుటకు.–కమనము, క్రమము, కామనము, కాముకము; ౩౨ కోరఁదగినది అనుటకు.— ఆపేక్షణీయము, ఆపేక్ష్యము, కామ్యము, చికీర్షితము, వాంఛనీయము; ౩౩. కోరఁబడినది అనుటకు.— ఆపేక్షితము, అభీప్సితము, అభీష్టము, అర్దితము– అర్థితము, ఆకాంక్షితము, ఆశంసితము, ఆసేచనము, ఇష్టము, ఈప్సితము, ఈహితము, కాంక్షితము, దయితము, స్పృష్టము, ప్రార్థితము, ప్రియము, లలితము, వల్లభము, వాంఛితము, సమీహితము, హృద్యము. (తె).–కోరిక, బాఁతి–బ్రాఁతి, వలసినది. ("చూ, హాళి.")

వాంఛనీయము. సం. విణ. ఆపేక్షణీయము: చూ, వాంఛ. ౩౨.

వాంఛించు. సం. స. క్రి: ఆపేక్షించు, అభిలషించు, అభ్యర్థించు, అర్థించు, ఆకాంక్షించు, ఆశించు, ఇచ్ఛించు, కాంక్షించు, ప్రార్థించు, వరించు–వరియించు; అ. క్రి:–(మి). అపేక్షపడు, ఆశపడు. (తె).— అక్కఱగొను, అక్కఱపడు, ఆసపడు, ఎలయు, పనివడు, మరగు, తమికొను, పురపురలాడు; స. క్రి:— ఆసచేయు, ఆసించు, ఇంచు, ఇచ్ఛగించు, కచ్చికొను, కోరు, గుక్కిలుమ్రింగు–గుక్కిళ్లుమ్రింగు, గుక్కుమిక్కుమను, తివురు, నోరూరు, మరగు, వలచు, వేడు, వేడుకపడు, వేడుకసేయు. తద్వి.–వివక్షించు.

వాంఛితము. సం. విణ. కోరఁబడినది: చూ, వాంఛ. ౩౩.

వాంఛితుఁడు. సం. విణ. ప్రియవస్తువును కోరువాఁడు: ఆశంపిత– ఆశంసిత– ఆశంసువు. (తె).—కోరువాఁడు. తద్వి.—౧. మిక్కిలి ఆశగలవానికి.–లోలుపుఁడు– లోలుభుఁడు; ౨. చెప్ప నిచ్ఛించువానికి.—వివక్షువు.

వాంఛిని. సం. వి. ఈ. స్త్రీ: చూ, వ్యభిచారిణి.

వాంతము. సం. విణ.= వాఁతి. 1. వాంతియెత్తఁబడినది; 2. వెడలఁగ్రక్కఁబడినది: ఉద్గీర్ణము, ఉద్వాంతము, నిరస్తము, నిర్గతము, నిర్గళితము. తద్వి.—వెడలఁబడినది అనుటకు.–నిర్యాతము. [శునకము.

వాంతాదము. సం. వి. అ. పుం. కుక్క: చూ,

వాంతి. సం. వి. ఈ. స్త్రీ.= వాంతి. 1: అలంబుషము, ఉద్గరణము, ఛర్దనము– ఛర్దము– ఛర్ది, ప్రచ్ఛర్దిక, లేఖనము, వమథువు, వమనము, వమి– వమీ. (తె. వ.)— ఓకర, ఓకరింత–ఓకలింత–ఓకిలింత– ఓకిలి, కక్కు– కక్కుడు– క్రక్కు– క్రక్కుడు, కక్కుఁదెవులు, కుమటు, గ్రక్కుర, వేలది, డోఁకు, వాంతి–వాఁతి. తద్వి.–పిల్లివాంతికి. కాశికి; వై. వి. (1).= వాంతి: చూ, వాంతి. 1. [యుఁడువాఁడు.

వాంశికుఁడు. సం. వి. అ. పుం. పిల్లంగ్రోవి

వాఁక. వై. వి. 1. ఏఱు: చూ, నది; 2: చూ, రూ–వాగు. 1; విణ. 3.= వక్రి. వంకర. పర. 4, ఆ. 205: చూ, వేల్లితము. 3; దే. వి. 4. కరవాఁక: చూ, భూమి. 1.

వాఁకతాలుపు. ద్వ.వి. గంగాధరుఁడు. పాండు. 1, ఆ: చూ, శివుఁడు.

వాఁకుడు. వై. వి.=వ్యాఘ్రి. *: చూ, స్పృశీ (దగ్గు, ఉబ్బసము తగ్గించును.)

వాఁగడుపు. దే. వి. (వాఁపు + కడుపు) వాఁపుగల కడుపు. శుక. 3, ఆ: చూ, వ్రేఁకటి (భ్రూణము. 1.)

వాఁగరత. వై. వి. (వాఁగులు + అరత) రూ– వాగర్త. సముద్రతీరము. (వృత్తియందేకవచనాంతము.) ఏనాదము. (సం). కూలడి కుక్క: చూ, రోధస్సు.

వాఁగర్త. వై. వి. —వై.—

వాఁగు. వై. వి. 1. సెలయేఱు: చూ, నది. ౯; 2. దండు. భాగ. విరా.3, అ: చూ, సేన.1; ఆ. క్రి. 3. పేలు: చూ, వదరు 5; 4.=వాక్. మ్రోఁగు. విజ.1, అ: చూ, శబ్దించే.

వాఁగుడు. వై. వి. మ్రోఁగుడు. మ్రోఁత: చూ, స్వరము. 3.

వాఁగులు. వై. వి. బ. అలలు: చూ, వీచి. 1.

వాఁచే. వై.అ. క్రి. 1.=వాఘ్. ఏఁకరు-ఏఁకారు. వి, పు. 6, అ; 2: ఊఁచు.

వాఁడి. దే. వి. 1. నైశిత్యము. భార. సౌ. 1, అ; విజ. 3, అ. 8: రూ—వాఁడిమి, కూచి, పదను, వాని, వాలు, వాలురమ్ము. (సం).—ఖరిమము—ఖరువు; 2. రూ—వాఁడిమి. భార. ఉద్యో. 4, అ: చూ, శౌర్యము; 3. ప్రతాపము. ఆం, భా. ద్వి. 190: చూ, రూ—వాఁడిమి. 1; విణ. 4. పదనైనది: (సం). క్ష్ణుతము, తేజితము, నిశితము, నిశాతము: చూ, శాతము. 2; 5. తీక్ష్ణము: చూ, సంజ్వరము. 2; 6. క్రూరము. నిర్వ. 10, అ. 129: చూ, రౌరవము. 2; అం. 7: చూ, జేతనము. 4 (త్రియము.)

వాఁడిగలాఁడు. దే. విణ: చూ, శూరుఁడు.

వాఁడిచేయు. దే. స. క్రి. నూఱు, పదనుపెట్టు.

వాఁడిచేయుట. వా. వి: (సం).—ఉత్తేజనకము.

వాఁడిమగఁడు. దే. విణ: చూ, వాఁడిగలాఁడు.

వాఁడిమి. దే. వి. 1: తీండ్రి, వాఁడి, వాలు, విడి, వేఁడి, వేఁడిమి. (సం).— తేజము, ప్రతాపము; 2: చూ, శౌర్యము; 3. పదను: చూ, వాఁడి. 1.

వాఁడిముక్కువాఁడు. వా. వి: గద్దముక్కువాఁడు—గ్రద్దముక్కువాఁడు, డొల్లముక్కువాఁడు, బుఱ్ఱముక్కువాఁడు. (సం):— ఖరణసుఁడు— ఖురణసుఁడు.

వాఁడు, దే. స. అప్రథమపుఁడు. (ఆ శబ్దమునకు మహద్దర్శక ప్రథమైక వచనరూపము. మహాత్తు.) (ఇట్లు ఈశబ్దమువీఁడు.)

వాఁత. వై. వి. తెవులుగొంటులైన పశ్వాదులకు వేసెడుమోఁదు: డాగు, రచ్చె-అచ్చె, ఆంపు. (సం).—రక్షు. [(రూ—వాంతి.)

వాఁతి. వై. వి.=వాంతి: చూ, వాంతి. 1.

వాఁపి. వై. విణ.(వాపు+ఇ.): చూ, శోఫరోగి.

వాఁపిరి. ద్వ. వి.(వాఁపు + ఇరి.) ఏఁకట: చూ, వాంఛ. [అపేక్ష: చూ, వాఁపిరి.

వాఁపు వై. వి. 1: చూ, శోఫ; 2. మిక్కిలి

వాకట్టు. ద్వ. వి 1. (మూలికా మంత్రములచేత చేసెడు) వాగ్బంధనక్రియ. విష్ణు. పూ. 2, అ; విణ. 2. వాగ్బంధనము చేయఁబడినది. కళా. 2, అ. 171; కళా. 3, అ. 79; వా. 3. నియమితకాలము దాఁటినది, నిరుపయోగమైనది, అడుగుటకు వాక్కు లేనిది. "శాకట్టు వాకట్టు అయినది."

వాకబు. వా. దరియాప్తు-దర్యాప్తు, విచారణ: చూ, సంఖ్య. 3.

వాకము. దే. విణ: చూ, వాటము. (1).

వాకాటు. ద్వ. వి. వాగ్వాదము: రూ—వాగాయిత్తము.

వాకిటిలెంకలు. వా. వి. బ. ద్వారపాలకులు.

వాకిలి. ద్వ. వి. (వా + ఇల్లు.) దుర్గమపురద్వారము. (వాను, ఇల్లు అనువాని మూలపదములనుగానుంచి మిశ్రపదముగాఁ జేసినయెడల నచ్చె తెనుఁగు ప్రయోగములకు విరోధమగుచున్నది): గవఁక— గవఁకు— గవ్వఁకు, పెద్దవాకిలి. (సం).— కూటము, గోపురము, పరిఘము, వళజము, వారము. (మా, సదనము. 1.). తద్విశేషములు.— ౧. గడపకు.— కడప — గడప. (సం).— ఉదుంబరము, కుతుపము, గృహావగ్రహణి, గేహళి, దేహళి; ౨. తలుపుతగిలించిన చట్రమునకు.—గుంబము-గుమ్మము, దారబందము-ద్వారము—దువారము—దర్వాజా, మొకము,

మొగ, మోము, మొగము, సరబడి. (సం).- గోపురము, ఘర్ఘరము, ద్వారబంధము, ద్వారము, నిర్యూహము, వారము; ౩. దొడ్డి గుమ్మమునకు.— దొడ్డివాకిలి, పెరటిగుమ్మము; ౪. లోపలివాకిలికి — లోవాకిలి. (సం) -అంతర్ద్వారము, ప్రచ్ఛన్నము; ౫. పెద్దతలుపునకు.— బోరతలుపు—బోర్తలుపు; ౬. పసులదొడ్డి తలుపునకు.—పలుఁగాడి, పెండియము—పెండెము; ౭. తలుపునకు — తలుపు—తల్పు. (సం).— అరరము, అగళము, కపాటము- కవాటము, కవటి—కవాటి, ఘనాఘనము, ద్వారకంటకము, నిష్కుటము, ప్రతీహారము, సంభావన; ౮. తడికకు.—అంతిక-అంతికె, తడక-తడిక-తడికె-తడుక, దడి;౯:-(చూ, లచ్చికమ్మి). (మిగతవానికి "చూ, సదనము 1."); వా. 2.ఇంటినిగాని దొడ్డినిగాని చేరియున్న నాలుగుగోడలనడిమిభాగము."పిల్లలు వాకిట ఆడుకొనుచున్నారు;""చనికత్తెవాకిలిఊడ్చినది"; 3.ఇంటియందు మొదటిద్వారము దాఁటఁగానే కాన్పించేనాలుగుగోడల నడిమి భాగము, నడవ, "పెద్దలు వాకిటఁగూర్చుండి మాట్లాడుచున్నారు."; చూ, హజారము.

వాకు. సం. వి. చ్. (స్త్రీ). 1.=పలుకు. రూ—వాక్కు: చూ, శబ్దము. 2; 2. రూ-వాక్కు. పలుకుఁజెలి: చూ, సరస్వతి; వై. వి. (1). పంతము: చూ, స్పర్థ. 4; (2).=వాక్కు. మాట, పలుకు: చూ, శబ్దము. 2.

వాకూచి. సం. వి. అ. (స్త్రీ). రూ-వాగుజి-వ్యాకోచి. కారుగచ్చే*: చూ, సోమరాజి.

వాకొను. దే. అ. క్రి. 1.=వాగు. ద్వి. రా. కిష్కిం, కాం: చూ, శబ్దించు; 2. అఱచు. అచ్చ. యు, కాం. 226; ప్రే. 3. వాకొలుపు—వాకొల్పు. సై. 7, ఆ. 61.

వాకొనుట. ద్వి. వి. వచనము. ఆం, భా. ప్రి. 11: చూ, వచనము.

వాక్కు. సం. వి. చ్. (స్త్రీ). 1: చూ, రూ-వాకు. 1; 2: చూ, రూ-వాకు. 2; ఆం. 3: చూ, హృషీకము; 4: చూ, కరణములు; 5: చూ, కర్మేంద్రియములు (ఇంద్రియములు); 6: చూ, మానసిక పూజాకుసుమములు.

వాక్పతి. సం. వి. ఇ. పుం. 1. నలువ: చూ. బ్రహ్మ. 1; 2. బృహస్పతి: చూ, సురాచార్యుఁడు; 3. కవీశ్వరుఁడు: చూ, మాటలల్లువాఁడు; విశే. 4. మిక్కిలి చతురముగ మాటలాడువాఁడు.

వాక్పరుషము. అం: చూ, క్రోధజములు.

వాక్పారుష్యము. అం. 1: చూ, క్రోధజములు; 2: చూ, వ్యవహారపదములు; 3. (కఠినముగఁ బలుకుట): చూ, సప్తవ్యసనములు.

వాక్యగతదోషములు. అం. (కావ్యదోషములు పద అర్థగతములై దోషములుండును. పదగతములు వాక్యగతములుఅని పదదోషములు ద్వివిధము. అందు పదదోషములు ౧౭:— (చూ, కావ్య దోషములు); వాక్యదోషములు:—౧. అక్రమము (క్రమముతప్పుట), ౨. విసంధి (సంధితప్పు), 3. ప్రక్రమభంగము (మొదటి నియమము తుదకుఁజెడుట), ౪. పునరుక్తి (చెప్పినదే చెప్పుట), ౫. అపూర్ణము (క్రియాన్వయము లేనిది), ౬. వాక్యసంకీర్ణము (వాక్యముల కూడిక), ౭. వ్యాకీర్ణము (భ్రాంతికరాన్వయము), ౮. అధికపదము(లేనిపోని మాటలు చెప్పుట), ౯. వాచ్య వివర్జితము (చెప్పఁదలఁచినది మానుట), ౧౦. అరీతి (రసమునకుచితముకాని పదరచన), ౧౧. న్యూనోపమ (తక్కువను బోల్చుట), ౧౨. అధికోపమ (ఎక్కువను బోల్చుట), ౧3. సమాప్తపునరాత్తము (వాక్యార్థముఁ బూర్తిచేసియు

మరలఁజెప్పుట), ౧౪. అస్థాన సమాసము (అపదసమాసము), ౧౫. ఛందోభంగము (ఛందస్సు తప్పుట), ౧౬. యతిభంగము (యతి తప్పుట), ౧౭. పరిపక్ర్తప్రకర్షము (అతిశయముతప్పి చెప్పుట), ౧౮. భిన్నలింగము (లింగభేదము), ౧౯. భిన్నవచనము (వచనభేదము), ౨౦. అక్రియ లేక అశరీరము (క్రియలేకుండుట), ౨౧ సంబంధ వర్జితము (సంబంధము లేకుండఁజెప్పుట), ౨౨ వాక్యగర్భితము (చెప్పఁబోవు దాని నడుమ మఱియొక వాక్యమిముడ్చుట.); మఱికొందఱు: శబ్దహీనము, క్రమభ్రష్టము, విసంధి, పునరుక్తియుతము, వ్యాకీర్ణము, వాక్యసంకీర్ణము, అపూర్ణము, వాక్యగర్భితము, భిన్నలింగము, భిన్నవచనము, న్యూనోపమము, అధికోపమము, భగ్నచ్ఛందము, యతిభ్రష్టము, అశరీరము, అరీరతశము, విసర్గలుప్తము, అస్థానసమాసము, వాచ్యవర్జితము, సమాప్తపునరాత్తము, సంబంధవర్జితము, పతత్ప్రకర్షము, అధికపదము, ప్రక్రమభంగము అని ౨౪ గాను; మఱికొందఱు:— అక్రమము, పునరుక్తి, అరీతి, భిన్నలింగము (భిన్నవచనము), పరుషము, విరుద్ధము, విరసము, అతిమాత్రము, హేతుశూన్యము, నిరలంకృతి అని పదియును; మఱికొందఱు:—అక్రియము, పునరుక్తి, అపూర్ణము, కర్తృపదము క్రియాపదము భిన్నవచనముల నుండుట, ఏకదేశాన్వయము, వ్యాకీర్ణము, వాచ్యవివర్జితము, అరీతి, న్యూనోపమము, అధికోపమము, సమాప్తపునరాత్తము, న్యూనపదము, అశరీరము, అధికపదము, ప్రక్రమభంగము, పతత్ప్రకర్షము, భిన్నలింగము అని ౧౭ గాను భిన్నాభిప్రాయములం జూపియున్నారు; (అర్థదోషములకు=చూ, అర్థదోషములు. అర్థదోషములు అను శీర్షికాపదముకడఁజూపిన రీతిని ౧౮ కలవు. కాని మఱికొందఱు:— హీనోపమ, అధికోపమ, అసమోపమ, అప్రసిద్ధోపమ, పరుషము, వ్యర్థము, ఏకార్థము, ససంశయము, విరుద్ధము, విరసము, అప్రయోజనము, అతిమాత్రము (లోకాతీతము), హేతురహితము, నిరలంకృతి (జాతిశూన్యము), అశ్లీలము (లజ్జాకరము), సహచరచ్యుతము (సరిగానిదిఁగూర్చుట), భిన్నము (సంబంధములేనిది) ౧౭ అనియు; మఱికొందఱు:—వ్యర్థము, హీనోపమము, అధికోపమము, అసమోపమము, అఖ్యాతోపమము, పరుషము, విరుద్ధము, విరసము, హేతుశూన్యము, సహచరచ్యుతము ౧౦ అనియు: (చూ, కావ్యదోషములు, కావ్యగుణములు.)

వాక్యగతము. అం. 1: చూ, అత్యంత తిరస్కృతవాచ్యము (రెండవది పదగతము); 2: చూ, అర్థాంతర సంక్రమిత వాచ్యము (రెండవది పదగతము.)

వాక్యగర్భితము అం: చూ, వాక్యగతదోషములు.

వాక్యదోషములు. అం: చూ, వాక్యగతదోషములు.

వాక్యము. సం. వి. అ. న. 1. పదపదార్థముయొక్క పరస్పరసంబంధము చెడక యేకార్థత్వముగలిగి క్రియతోఁగాని తదితరముతోఁగాని ముగిసెడి పదసముదాయము; (౧. కర్తృ కర్మ క్రియగలది వాక్యము; ౨. వాక్యము సంపూర్ణ వాక్యము, అసంపూర్ణవాక్యము అని ద్వివిధము; క్రియాసహితము రహితము అని సంపూర్ణ వాక్యము ద్వివిధము. సమాపక క్రియతోఁగూడినది క్రియాసహితము. అసమాపక క్రియతో నంత్యమగునది యసంపూర్ణవాక్యము, క్రియలేనిది క్రియారహితవాక్యము; 3. వాక్యములు.—

సామాన్య వాక్యము, సంబంధ వాక్యము, ఉపవాక్యము, సముదాయవాక్యము, మహా వాక్యము అని వాక్యమైదువిధములు. (సమాపకక్రియతోఁగూడినది సామాన్యవాక్యము, సంబంధ సర్వనామములతోఁగూడినది సంబంధవాక్యము, కర్తగాఁగాని కర్మగాఁగాని వాడఁబడు వాక్యముపవాక్యము, అసంపూర్ణ వాక్యముతోఁగాని యుప వాక్యముతోఁగాని కూడిన సముదాయ వాక్యము, రెండు సామాన్యవాక్యముల సంబంధముగలది మహా వాక్యము ఇత్యాది); 2. వాక్యములకుపమానములు — శేషుఁడు, బృహస్పతి, బ్రహ్మ మొ; 3. మాట: చూ, శబ్దము. 2.

వాక్యసంకీర్ణము. అం: చూ, వాక్యదోషములు.

వాకృచ్చు. ద్వ. స. క్రి. (వా + కూర్చు.) 1. పేరుచెప్పు. కళా 1, ఆ.7: చూ, శబ్దించు; 2. చెప్పు. వి.క. 5, ఆ.120: చూ, శబ్దించు (సంధిని వికారము.)

వాకృచ్చుట. ద్వ. వి: చూ, వాకొనుట.

వాక్శుద్ధి. అం: చూ, శుద్ధులు.

వాగ. సం. వి. ఆ. స్త్రీ.= వాగె: చూ, వాగియ.

వాగఱ. దే. వి. (వ్రాయు+కఱ్ఱ) ముచ్చెవాఁడు చిత్తరువు వ్రాయుతూలిక. (సంధిని వర్ణలోపము): జాలిని, తూలిక, దూషిక.

వాగలము. వై. వి రూ_వాగళము-వాగల్లము. కళ్లెపుమొంగి, ఖలమునుఖము.

వాగళము. వై. వి. —పై.—

వాగల్లము. వై. వి —పై.— [వాకాటు.

వాగాయిత్తము. వై. వి. వాగ్వివాదము:

వాగియ. వై. వి.=పగ్గ. రూ-వాగె, లగాము, కళ్లెము. (సం).—అవక్షోణిక, పగ్గ, వాగ, (చూ, ముఖరజ్జువులు.)

వాగీశాంశము. అం: చూ, షష్ట్యంశములు.

వాగీశుఁడు. సం. వి. అ. పుం. 1. నలువ: చూ, బ్రహ్మ. 1; 2. బృహస్పతి: చూ, సురాచార్యుఁడు; 3. కవీశ్వరుఁడు: చూ, వాక్పతి.3.

వాగీశ్వరుఁడు. సం. వి. అ. పుం: చూ, వారికొట్టు.

వాగుజి. సం. వి. ఈ. స్త్రీ = బావంచి*: చూ, వాకూచి.

వాగుర. సం. వి. ఆ. స్త్రీ. (మృగములను పక్షులను పట్టెడి) ఉరి: (తె).— ఉచ్చు, ఉరి, గుచ్చిక, జిగురుఁగండె— జీగురుఁగండె, జోవ్వ, వల. తద్విశేషములు.— ఉరి; ఉరిగోల; ఒడిత్రాడు; కరకణి; కాలుచ్చులు; చిక్కము; జిగురుఁగండె— జీగురుఁగండె; తలముల్లు; తీపుఁద్రాడు, చోను. (చూ, వల.1.)

వాగురికుఁడు. సం. వి. అ. పుం. జాలికుఁడు, వలవాఁడు: చూ, వేఁటకాఁడు.

వాగె. వై. వి.= వాగా: చూ, రూ-వాగియ.

వాగ్గలికుఁడు సం. వి. అ. పుం: (తె):— అడపకాఁడు.

వాగ్దండము. అం: చూ, త్రిదండము. 1-2.

వాగ్దానము. అం: చూ, కన్యాదానాంగములు.

వాగ్మి. సం. వి. న్. పుం. 1. చిలుక: చూ, శుకము; 2. బృహస్పతి: చూ, సురాచార్యుఁడు; విణ. 3. యుక్తి యుక్తముగా మాటలాడువాఁడు: చూ, వక్త. 1.

వాఙ్మీబ్రాహ్మణులు. అం: చూ, పంచద్రావిడబ్రాహ్మణులు.

వాఙ్మయము. సం. వి. అ. న. (చూ, వేదము, ఉపవిద్యలు.) వాఙ్మయము:— ౧ వైదిక విజ్ఞానము, ౨ భాష, ౩ వాఙ్మయ విభాగము, ౪ ఋక్సంహిత, ౫ సామసంహిత, ౬ బ్రాహ్మణములు, ౭ వేదాంగములు, ౮ గృహ్యసూత్రములు, ౯ స్మృతులు, ౧౦ భాష్యములు; (౧. వైదిక విజ్ఞానము:— (౧) వేదనిత్యత్వా పౌరుషేయత్వ విచారము, (౨) ఋగ్వేద వాక్య విచారణ, (౩) అపౌరుషేయత్వవిచారపర్యవసానము, (౪) వేదకాలము, (౫) అదితియనాది నిర్ణ

యము; ౨. భాష:— (౧) సంస్కృత, (౨) లాటిన్, (౩) గ్రీకు, (౪) జర్మనీ, (౫) ఇంగ్లీషు, (౬) ఆర్యలిపి, (౭) జ్యోతిర్విజ్ఞానము లిపి, (౮) ఆర్యభాష, వ్యావహారిక భాష, స్థితి, (౯) సంస్కృత ప్రాకృతములు, (౧౦) ప్రాకృతములు దేశభాషలు, (౧౧) సంస్కృతభాష మొ; ౩. వాఙ్మయ విభాగము:—(౧) వేదములు, (౨) సంహితల పౌర్వాపర్యము, (౩) త్రయి-అధర్వణము, (౪) వేదప్రశంసాదులు; ౪. ఋక్సంహిత:— (౧) మండలక్రమమున ననువాక విభాగము, (౨) మండలక్రమమున సూక్త విభాగము, (౩) ఋక్సంఖ్యానిర్ణయము, (౪) సూత్రద్రష్టలు— సూక్తములు, (౫) మండలద్రష్టలు— మండలములు, (౬) మండలములు— ఏర్పాట్లు, (౭) ఋషుల ఇతిహాసములు, (౮) ఋగ్వేద దేవతలు, (౯) ఋగ్వేద శాఖలు, (౧౦) ఋక్సంహిత లోని వర్ణనలు; ౫. సామసంహిత:— (౧) సామసంహిత విభాగము, (౨) సామవేదసంప్రదాయము, (౩) సామగాచార్య పరంపర, (౪) సామగానప్రవచన కర్తృపరంపర, (౫) యజుర్వేదము, (౬) యజుశ్శాఖలు, (౭) యజుశ్శాఖలపౌర్వాపర్యాది విచారణ, (౮) తైత్తిరీయసంహితవిభాగము, (౯) తైత్తిరీయ బ్రాహ్మణ విభాగము, (౧౦) కాండములు—ఋషులు, (౧౧) సంహితా విషయము, (౧౨) పశుమేధము— నరమేధము, (౧౩) దేవతాఛందస్సులు, (౧౪) సంహితలోని వర్ణనలు, (౧౫) రుద్రప్రశ్న (చమక)ప్రశస్తి, (౧౬) వాజసనేయసంహిత, (౧౭) అధర్వసంహిత, (౧౮) అధర్వణశాఖలు, (౧౯) శౌనకీయాధర్వసంహిత, (౨౦) సంహితావిషయవిచారము, (౨౧) పైప్పలాద సంహితా చరిత్ర, (౨౨) అధర్వసంహిత— మంత్రద్రష్టలు, (౨౩) అర్థవిచారణ— ఛందో దేవతాదులు, (౨౪) అధర్వమంత్ర విశేషములు, (౨౫) ఆభిచారిక పిశాచోచ్చాటనాది మంత్ర తంత్రములు, (౨౬) సాంఘిక లక్షణములు, (౨౭) కతిపయకాండ విశేషములు; ౬. బ్రాహ్మణములు:— చూ, బ్రాహ్మణములు 1930 పుట; ౭. వేదాంగములు:— చూ, ఉపవిద్యలు; ౮. గృహ్యసూత్రములు: చూ, కల్పము; ౯. స్మృతులు:— చూ, స్మృతులు; ౧౦. భాష్యములు:— (౧) ఋగ్భాష్యము, (౨) సాయనభాష్యము (మాధవభాష్యము), (౩) సామవేద ఋగ్భాష్యము, (౪) కృష్ణ యజుర్వేద భాష్యము, (౫) ఉపనిషద్భాష్యము, (౬) బృహదారణ్యక భాష్యము, (౭) శంకరభాష్యము, (౮) తైత్తిరీయోపనిషద్భాష్యము) ఇత్యాది (ఈ విషయమపారము. సంస్కృత వాఙ్మయ చరిత్రచూడుము)

వాఙ్ముఖము. సం. వి. అ. న: 1. ఉపన్యాసము, ఉపోద్ఘాతము, ఉ. (తె).— వావాదు; 2. ఉదాహరణము: చూ, వృత్తాంతము. 7; 3. వాక్యారంభము: ఉపోద్ఘాతము.

వాచ. సం. వి. చ్. (స్త్రీ): చూ, రూ-వాకు.

వాచంయముఁడు. సం. వి. అ. పుం: చూ, మౌని.

వాచకము. సం. వి. అ. పుం. వాచ్యార్థమును తెలిపెడి శబ్దము: చూ, శబ్దము. 2.

వాచకుఁడు. సం. వి. అ. పుం. అనుప్రాసబంధ నియమాదుల నెఱింగి చెప్పువాఁడు: చూ, కృతికర్త.

వాచస్పతి. సం. వి. ఇ. పుం. వేలుపుటొజ్జ. లక్ష్మీ. 2, ఆ. 43: చూ, సురాచార్యుఁడు.

వాచస్పత్యము. సం. వి. అ. పుం. తారానాథ తర్క వాచస్పతిచే వ్రాయఁబడిన బృహన్నిఘంటువు.

వాచాటుఁడు. సం. విణ. రూ-వాచాలుఁడు: చూ, వక్త. 1.

వాచాలుఁడు. సం. విణ. —పై.—

వాచించు. సం. స. క్రి. 1. చెప్పు. చంద్రా. 1, అ: చూ, రూ-వచించు; 2. చదువు. చంద్రా. 3, అ: చూ, పఠించు.

వాచికము. సం. వి. అ. న. 1: చూ, వర్ణనము; 2. మాటలచేతఁబుట్టిన శృంగారభావము; అం. 3. వాక్కుచేత కలిగినది. (కావ్యనాటకములను రసోచితముగ నుచ్చరించుట చూ, వ్యంజకము. 1; 4: చూ, కర్మములు; 5: చూ, స్వాధ్యాయము; 6: చూ, అభినయములు.

వాచోయుక్తిపటుఁడు. సం. విణ. పండితుఁడు [చూ, సుధి.

వాచ్యము. సం. వి. అ. పుం. 1. అభిధచేఁ దెలియఁదగిన యర్థము; విణ. 2. చెప్పఁదగినది: ఆఖ్యేయము. తద్వి.— చెప్పనిచ్ఛించినది:— వివక్షితము (చూ, శబ్దము. 2.); 3. నిందింపఁదగినది: చూ, హీనము. 2.

వాచ్యవర్జితము. అం: చూ, వాక్యగతదోషములు.

వాచేగడము. ద్వ. వి. రూ-వాచేరడము—వాచేగము—వాచోరడము—వాచోరపము, దేవరింపు-దేవురింపు, దేవురు, ఒతిమాలడము— బ్రతిమాలడము, బతిమాలిక-బ్రతిమాలిక, వసటు, వసపు, వలపు. (సం).— దైన్యము, పరిదేవనము, మనువు, విలపనము- విలాపము. (మి).—దైన్యపాటు.

వాచేరడము. ద్వ. వి. —పై—

వాచేరము. ద్వ. వి. —పై—

వాచోరడము. ద్వ. వి. —పై.—

వాచోరపము. ద్వ. వి. —పై.—

వాచేచ్చు. వా. అ. క్రి. (వెచ్చఁజేసిన అప్పడములులోనగునవి) మెత్తఁబడు.

వాచేడి. వా. వి. నోటిధ్వని.

వాచేఱచు. దే. అ. క్రి. నొఱసెట్టు: చూ, శ్లోకించు. (గట్టిగా అఱచుటయని యర్థము.)

వాచేవి. వి. రుచిచూచుట.

వాచోరు. ద్వ. అ. క్రి. పరిదేవనముచేయు: ఏకులాడుచు, దేవురించు, వలపుగొను, వలపులాడు. (మి).—దైన్యపడు.

వాచోరు. దే.వి: ముంజోరు: చూ, సదనము.1.

వాజపేయము. సం. వి. అ. పుం, న. 1. ఒకానొక యాగము: చూ, హోమము. 3. (యజ్ఞము): అం 2: చూ, ఆసనములు (సహాసనాసనములు).

వాజము. సం. వి. అ. న. 1. నెయ్యి: చూ, హవిస్సు. 2; 2. నీరు: చూ, సలిలము; 3 సాన్నాయ్యము: చూ, హవిస్సు. 1; పుంక్త్రి 4. బాణము రెక్క: చూ, రెక్క. 1; 5 రెక్క: చూ, రెక్క. 1; 6.=వెస. వేగము: చూ, స్యదము.

వాజసనేయ బ్రాహ్మణులు. అం: చూ, ఆంధ్రులు. 653 పుట. (వీరుశుక్లయజుర్వేదులు. ప్రథమశాఖీయులను నామాంతరముగలవారు. కాత్యాయన సూత్రము. వీరిలో వైదిక లౌకికవృత్తులవారు కలరు. మీసములుంచి విష్ణు చిహ్నముల ధరింతురు.)

వాజి. సం. వి. న్. పుం. 1. గుఱ్ఱము: చూ, హయము; 2. పిట్ట: చూ, పక్షి; 3. అమ్ము: చూ, బాణము. 1. [కర్ణి. 1.

వాజికరి. సం. వి. ఈ. స్త్రీ: చూ, వారాహి.

వాజిగంధక. సం. వి. ఆ. స్త్రీ. అడ్డసరము కః చూ, సింహాస్యము.

వాజిదంతకము. సం. వి. అ పుం.—పై.—

వాజపేయము. అం: చూ, సోమయజ్ఞములు.

వాజిబీ. వా. విణ. న్యాయమైనది, సరియైనది.

వాజిశాల. సం. వి. ఆ. స్త్రీ. గుఱ్ఱపుసాల: చూ, సదనము. 1.

వాజే. దే. వి. 1. రోఁత: హరిశ్చ. 4, ఆ. 103: చూ, సెగ్గింపు; 2. ఉపశాల. అం, భా.ద్వి.

12: చూ, సదనము 1; విశే. 3. గోంతగలది, గోరము: చూ, వికృతము. 3.

వాజెము. దే. వి. ఒకానొక పక్షి. చూ, పక్షి.

వాజెమ్మ. వా. వి. దద్దమ్మ, అంబేద: చూ, వ్యాఘ్రుండు. 2. [చూ, స్వరము. 2.

వాజ్జెము. వై. వి.=వాద్య. మృదంగాదివాద్యము:

వాటధాని. సం. వి. ఇ. పుం.=బాటసారి: చూ, సమీరణుండు. 2.

వాటపడు. ప్ర.అ. క్రి. అనుకూలపడు. కవిక.2, ఆ: చూ, పరిపడు. 1.

వాటపద్యము. వా. వి. ఆట విడుపుపద్యము.

వాటము. సం. వి. అ. పుం, న. 1. రూ-వాటి. కూరలోనగు వానితోంట: చూ, వనము. 2—౧౧; అ. పుం. 2.=వాడ. రూ-వాటి. త్రోవ: చూ, మార్గము. 1; 3. రూ-వాటి. చెట్టునెలుగు వేసినచోటు; 4. రూ-వాటి. కంచె: చూ, వెలుగు; 5. ఇండ్లవరుస, వాటిక: చూ, శ్రేణి 1; 6. భాగము: చూ, విభాగము. 2; దే. విశే. (1) జోలుపుగానుండునది: వాకము; (2) అనుకూలమైనది. య. 1, ఆ. 121: చూ, సంగతము. 3; (3) సక్తమైనది. మార్క. 6, ఆ: చూ, సహితము; (4) పొందికయినది. జై. 2, ఆ 86: చూ, సంసక్తము; (5): చూ, వక్రిమము. 2. వి, పు. 7, ఆ.

వాటా. వై. వి.=వాటము: చూ, వాటము. 6.

వాటాలజోపితా. వా. వి: చూ, విభాగపత్రము.

వాటి. సం. వి. ఈ. స్త్రీ.: చూ, రూ—వాటము. 1*—2—3—4.

వాటిక. సం. వి. ఆ. స్త్రీ. 1. తోంట: చూ, వనము. 2; 2. పెండ్లియందు నవధాన్యములు వేసి మొలపించుట కాధారమగు పాత్రము. అనఁగా పాలిక; 3. (ఊరినడుమనుండు) రచ్చచెట్టు: చూ, రచ్చ. 7; 4. ఇండ్లవరుస: చూ, వాటము.5;5.దిరిసెన*:చూ, శిరీషము.

వాటినధూని. సం. వి. ఈ. స్త్రీ.=వాడవదిన: చూ, వేశ్య.

వాటు. దే. వి. 1. వైచేట; 2. దెబ్బ. పంచ నా. 1, ఆ. 205_206: చూ, హతి.

వాటుఁగాలు. దే. వి. నడచునపుడు పక్క—వాటుగా పోయెడుకాలు. ద్వి. హరిశ్చ 2, భా: చూ, హజ్జి. [హరివాలుకము.

వాటిక. సం. వి. ఈ. స్త్రీ. సక్క—దోస* చూ,

వాటుపడు. వా. అ. క్రి: ఒడ్డగెడపడు, దోరగలుపడు-దోరగల్లుపడు. [దోరగల్లు.

వాటుపడుట. వా. వి: ఒడ్డగెడవు, దోరగలు_

వాటురాయి. దే. వి. దొంగలు వైచేటకు అనువుగా ఏటితీసికొనిపోయెడు రాయి. ద్వి. భాగ. 5, స్క—ం: చూ, స్థూలోచ్చయము.1 (రత్నములు.)

వాటులాడు. దే. అ. క్రి. (నై. 3, ఆ. 95.): ఏటులాడు, కాటులాడు, కీఁచేట్లాడు, కొట్టులాడు, జగడమాడు, జగడించు, తార్పులాడు, పెనఁగు, పాడుచే, పోటులాడు-పోట్లాడు, పోరాడు, పోరు, మేడము, మొత్తులాడు, రాయు. (సగ).—కలహించు, విగ్రహించు. తద్వి.—మాఱుమసలు.

వాట్యాలకము. సం. వి. అ. పుం. ముత్తవపులగము*: చూ, సహదేవ.

వాట్లేఁడు. దే. విశే. (వాట్లు+ఈఁడు) కొట్లాడువాఁడు. ఉ, హరి.3,ఆ.112:వాదులాఁడు.

వాడ. వై. వి. 1.=వాటీ. వాట. వీధి. నై. 3, ఆ. 82: చూ, మార్గము. 1; 2. ఇండ్లవరుస:చూ, శ్రేణి. 1; దే. వి. 3. వాడగాలి.పసుపుతాడి (అని కొండఱు): చూ, వాసన. 1 (చూ, వాయువు.); వా. 4. ఓడ: చూ,పోడము.

వాడఁబాఱు. దే. అ. క్రి. వాడు: చూ, వడలు.

వాడకట్టు. ద్వ. వి: చూ, వాడ. 1.

వాడకము. వా. వి. 1: చూ, జెచ్చెము. 2:

2: చూ, వ్యయము. "ఇంటివాడకము."
వాడగన్నేరు. దే. వి. ఒకరకము గన్నేరు. పచ్చగన్నేరు (అని కొందఱు)*: చూ, హాయమారకము. [వాయుప్ర.
వాడగాలి. దే. వి. మలయమారుతము: చూ,
వాడనిపువ్వులమాని. ద్వ. వి. కల్పవృక్షము. అం, పదా. సుర. 41: చూ, వేలుపుఁజెట్టు.
వాడపల్లి. వా. వి: చూ, రూ-ఓడపల్లి
వాడపదినె. వై. వి. 1. కులట: చూ, స్వైరిణి; 2 = వాటి వధూటి: చూ, వేశ్య.
వాడిక. దే. వి. చెప్పక చూపకయుంచిన యిల్లడ: ఇల్లడ-ఇల్లడము, కుదవ- కుదువ. (సం).— ఉపనిధి, నిక్షేపము, నివేశము, న్యాసము.
వాడిపత్తలగుట. జా. మిక్కిలి కృశించుట "అల జెడి వాడి వత్తలయి." (కవికర్ణరసాయనము); "ఇక్షుశరాసనసాయకవ్యథా, ఖిన్నత వాడివత్తలయి." (మనుచరిత్ర); "కమల నాళములు వాడివత్తలై." (రసికజనమనోరంజనము); "ద్వి. వాడివత్తలయి యేమి వాంఛచేసితివి." (విష్ణుమాయావిలాసము.)
వాడివాఱు. దే. అ. క్రి: చూ, సోలు.
వాడు. దే. వి. 1. వాడుట. సా. 2, ఆ. 197: చూ, సొగటు; అ. క్రి. 2: చూ, విన్నవోవు.ఆం.నా.శే.26; 3. వడలు: చూ, సుక్కు. 14; స. క్రి. 4. ఉపయోగపఱచు: (సం).— వినియోగించు.
వాడుక. దే. వి. 1. ఉపయోగము; 2. అభ్యాసము: చూ, స్వభావము; 3. పాడి: చూ, వ్యవహారము. 3; వా. 4. రివాజో, మామూలు; 5. లోక వ్యవహారసిద్ధము. "వాడుక మాటలు."
వాడుకపడు.ద్వ.వి. పనుపడు: చూ, సరిపడు.2.
వాడుకొను, దే. స. క్రి. 1. జనులు పరివాదముగా చెప్పుకొను; 2. ఉపయోగపఱచుకొను.
వాడుచు. దే. స్రి. వాడఁజేయు, వాడించు.
వాడుదల. దే. వి: చూ, వాడుక. 2.
వాడుపెంచు. దే. అ. క్రి. (అని. 3, ఆ. 122): వాడుపడు, వాడుపాటు
వాడుపడు ద్వ. అ క్రి.—పై.— (ప్రే. వాడు పఱచు.- ఉ, రా. 4 ఆ. 227.)
వాడుపాటు. దే. అ. క్రి. —పై.— ఉ, రా. 4, ఆ 227. [ఉపకరణములు.
వాడుముట్లు. వా. వి బ. వాడుకొనెడు
వాడెవవ. దే. వి. చెఱకుచివర: చూ, సుకుమారము. 1.
వాణి. సం. వి. ఈ. స్త్రీ. 1. పలుకు:చూ, కల్గుము. 2: 2: చూ, సరస్వతి; ఇ, ఈ. స్త్రీ. 3. నేత; చూ, వ్యూతి; అం. 4: చూ, ఆడికత్తెలు. [హంసము. 1.
వాణిజుఁడు. సం. వి. అ. పుం. చూ, సార్థవా
వాణిజ్యము. సం. వి. అ. న. 1: చూ, వర్తకము; అం. 2: చూ, వైశ్యవృత్తి; 3: చూ, అష్టవర్గము; 4: చూ, ఉపవిద్యలు; 5: చూ, వృత్తులు (మనుజవృత్తులు.) (వ్యవహారముఁజేయునప్పుడు ధాన్యాదులఁ గొనుకాలము, విక్రయకాలము, లాభవిధి, విక్రయనిషేధవస్తు వివరణములఁ దెలుపునది.)
వాణిద్వారము. అం: చూ, ద్వారములు.
వాణిని. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆటకత్తె: చూ, లాసిక; 2. కుంటెనకత్తె: చూ, శంభళి; 3. ముగ్ధ: చూ, స్వీయ (చూ, యౌవనభేదములు.); 4: చూ, విదగ్ధ.
వాతంగిని. సం. వి. ఈ. స్త్రీ: కాంభోజి, వాతఘ్ని. (తె) పులిసరి, పులుగుడు: తద్వి.— ౧. తెల్లపులుగుడు, ౨. నల్ల పులుగుడు*.
వాతకము. సం. వి. అ. పుం. రూ-వాతకి*: చూ, సోమిదము.
వాతకి. సం. వి. ఈ. స్త్రీ. 1.—పై.—;విణ. 2. (పు. ఈ. న) వాతరోగముగలవాఁడు.

వాతకుంభము. సం. వి. అ. పుం: చూ, పిన్న నుదురు.

వాతగానివాఁడు. దే. వి. బట్టలకు రంగువేయు వాఁడు: రంగ-రంగారి-రంగిరీజో. (సం) రంజకుఁడు. [చూ, వ్యాడంబకము.

వాతఘ్నము. సం. వి. అ. పుం. ఆముదము*;

వాతఘ్ని. సం.వి. ఈ. స్త్రీ: చూ, వాతంగిని.*

వాతనాడి. వా. వి. శ్లేష్మపైత్యవాతనాడులను ప్రధాననాడులలో నొకటి: చూ, నాడులు. 3. (చూ, వాతప్రకృతి.)

వాతపోనము. సం.వి అ. పుం: చూ, మోదుగు.*

వాతప్పు. వా. వి. (వాయి+తప్పు) నోటవెలువడిన తప్పుమాట: చూ, వితథము.

వాతప్రకృతి. అం: చూ, ప్రకృతిత్రయము.

వాతప్రమి. సం.వి. ఇ.పుం: చూ, వాతమృగము.

వాతమండలి. సం. వి. ఇ స్త్రీ సుడిగాలి: చూ, వాయువు.

వాతము. సం. వి. అ. పుం. 1. గాలి: చూ, వాయువు; వా. 2. వాతము అధికమై వాతనాడి నీరసించిన రోగము.

వాతమృగము. సం. వి. అ. పుం. గాలికెదురు నడిచెడి యిఱ్ఱింటి మృగము, జవి, వాతప్రమి, వాతాయువు: చూ, హరిణము. 1.

వాతరట్టు. ద్వ. విణ: చూ, వక్త. 1.

వాతరథము. సం.వి. అ. పుం: చూ, మేఘము.1.

వాతవాఁడి. ద్వ. విణ. అప్రియంవదుఁడు.

వాతాంతకతైలము. అం: చూ, తైలములు.

వాతాటము. సం. వి. అ. న. సూర్యుని గుఱ్ఱము: చూ, హయము. [చూ, సన్యాసి.

వాతాశిసూనుఁడు. సం. విణ. అవస్త్రుఁడు:

వాతాయనము. సం. వి. అ. న. 1: గవాక్షము, గృహాక్షము, జాలకము, వధూటిశయనము. (తె).—కిటికి —కిటికీ, జోల, జోలకట్టు. తద్వి.—గవ్రగీవము; 2: చూ, వాతాశ్వము.

వాతాయువు. సం. వి. అ. పుం. 1. జింక: చూ, హరిణము. 1; 2: చూ, వాతమృగము.

వాతారి. సం.వి. ఇ. పుం: (తె).—వాలుడు*.

వాతాలి. సం. వి.ఇ. స్త్రీ: చూ, వాతమండలి.

వాతాశ్వము. సం.వి. అ. పుం. ఉత్తమాశ్వము: చూ, హయము. [చూ, సితము. 1.

వాతికము. సం. వి. అ. న. ఒకానొక పులుసు:

వాతికాను. వై. వి. (వాయి + కాను) లంచేము: చూ, నూడిద. (పామరులవాడుకమాట)

వాతిబియ్యము. ద్వ. వి. (వాయి + బియ్యము.) దహనము చేయునపుడు బంధువులు పీనుగు నోటవేసెడు బియ్యము: చూ, సేసఁబ్రాలు (బియ్యము)

వాతూలము. సం. వి. అ. పుం. 1. గాలి: చూ, వాయువు; 2. సుడిగాలి: చూ, వాయువు; విణ. 3. గాలిసయిఁచేనిది; 4. పత్రొత్తినది; అం. 5: చూ, ఆగమములు (ఉపవిద్యలు); 6: చూ, తంత్రములు.

వాతూలోత్తరము. అం: చూ, తంత్రములు.

వాతెర. ద్వ వి: చూ, రూ—వాతెఱ.

వాతెఱ. ద్వ. వి. (వా+తెఱపి): రూ—వాతెర. అదరము, కెమ్మోవి, పలుకప్పు-పల్కప్పు, పలుదెర— పలుదెఱ, పలువలువ- పల్వల్వ, పెదవి, మోవి. (సం).—అధరము, ఓష్ఠము, దశనవాసస్సు, రదనచ్ఛదము— రదనచ్ఛదస్సు. తద్వి.— ౧. దవడ— దవుడ- దౌడ, దారువ. (సం) — కాకుదము, తాలువు; ౨. అంకిలి—అంకు. (సం).— తాలుమూలము; ౩. పెదవి మూలకు.— సెలవి. (సం).— సృక్వము, సృక్వి. ("చూ, సెలవి.")

వాతెఱకెంపు. ద్వ.వి: (చూ, దంతక్షతములు.2) కప్పు, కెమ్మోవిగుఱి, పలుకెంపు-పల్కెంపు, పలుగంటి— పలుగంటు- పల్గంటి- పల్గంటు, పలునొక్కు—పల్నొక్కు, పల్లొత్తు, పెదవికెంపు, పెదవిగంటు. తద్వి.—౧. దంతక్షత

స్థానవిశేషము. (సం).-కంఠము; ౨. అధర మందలి దంతక్షతమునకు.—(తె) - కెంపు. చూ, కామము 8.)

వాతోర్మి. అం: చూ, వృత్తము. 1. ("మ. భ, త, వగణములు. 7 యతి. 11 ఛందస్సు.)

వాత్య. సం. వి. అ. స్త్రీ. సుడిగాలి: చూ, వాయువు (వాయువులు.)

వాత్సకము. సం.వి.అ. న. దూడలగుంపు. (వత్స ము=దూడ): చూ, సౌరభేయి (ధేనువు.)

వాత్సల్యము. సం. వి. అ. న: (తె).—అరులు-అర్లు-ఆయర్లు, అర్మిలి, మాలిమి. (అవ్య). (సం).—అహో, ఆక్. (చూ, స్నేహము. 1.)

వాత్స్యాయనవ్యాకరణము. అం: చూ, వ్యాకరణములు.

వాత్స్యాయనుఁడు. సం. విణ: చాణక్యుఁడు.

వాధూలసగోత్రము. అం. (వాధ్వస-వాశ్రేయస): చూ, గోత్రము. 13.

వాదడుచే. ద్వ. అ. క్రి. రూ-వాదాడు. కాశీ. 5, ఆ. 89: చూ, వాదించే. 1.

వాదనము. సం. వి. అ, న.=వాదు. వీణాది చతుర్విధ వాద్యధ్వని: చూ, స్వరము. 2.

వాదము. సం వి. అ. పుం. 1.=వాదు. వాగ్వివాదము: చూ, సంవాదము; 2. రసవాదము: చూ, విద్యలు; 3. తగవు: చూ, యుద్ధము.

వాదర. వై. వి. (వాఁడి+దార) (ఖడ్గాది) తీక్ష్ణధార. వా-వాయి, దార-దారి. (సం).—ధార: చూ, బాణము, 1-౧౪.

వాదాడు. ద్వ. అ. క్రి: చూ, వాదడుచే

వాది. సం. వి. న్. పుం. 1. తగవునకుపోయిన వాఁడు (ప్లయింటిఫ్); విణ. 2. వాదించే వాఁడు. [డు; 2. తగవాడు.

వాదించే. సం. అ. క్రి. 1: వాదడుచే, వాదా

వాదికుఁడు. సం. వి. అ. పుం. జైనశాస్త్రజ్ఞుఁడు: చూ, శాస్త్రవిదుఁడు.

వాదిత్రము. సం. వి. అ. న. 1. తతము, ఆనద్ధము, సుషిరము, ఘనముఆనెడి వాద్యచతుష్టయము: చూ,ఆతోద్యము; 2. వాద్యధ్వని: చూ, స్వరము. 2.

వాదు. వై. వి.=వాద. 1. వాదము: చూ,సంవాదము. 2; 2. ధ్వని: చూ, స్వరము. 2; 3 దావా: చూ, వ్యాజ్యము; 4 నింద:చూ, నిగ్గింపు.

వాదులాట. వా. వి. మల్లగుల్లము:చూ,వాదు 1.

వాదులాఁడు. ద్వ. విణ: చూ, వాట్లేఁడు.

వాదోడు. ద్వ. విణ. (వా+తోడు) 1. మాటకు సహాయము. విజ. 2, ఆ. 115; 2. పసులకు నాటకచేయులలోను గాఁగల తెప్పర్లను పరిశీలింప నోటఁజొప్పించి నోరు తెఱపించుటకై యేర్పఱచిన దార్వాయస రూపయంత్ర విశేషము (చూ, ముకుబంతి).

వాద్దెము. వై. వి.=వాద్య. రూ-వాయిదము: చూ, వాద్యము. 1-2-3.

వాద్యము. సం. వి. అ. న.=వాయిదము-వాద్దెము-వాజ్జెము. 1. వీణలోనగునది: చూ,వీణ; 2. చెప్పుడు: చూ,స్వరము 2; అం. 3: చూ, తతవాద్యములు; 4: చూ, శోధనములు.

వాద్యభేదములు. అం. 1. (వాద్యములు). డమరుగము (డమరు), గుమ్మెట (మడ్డువు), రాయిడిగిడిగిల్లు (డిండిమము), కైమల్లు (ఝర్ఝరము), మద్దెల (మర్దలము), ఉడుక (పణవము) (6); 2: చూ, వాద్యములు.

వాద్యములు. అం. 1. (వాద్యచతుష్టయము) ౧ వీణాదులు తతములు; ౨ మర్దలాదులానద్ధములు; 3 మురళ్యాదులు సుషిరములు; ౪ కాంస్యతాళాదులు ఘనములు (4): (చూ,స్వరము. 2.): 2.చూ,వాద్యభేదములు.

వాద్రోణవాయసము. సం. వి. అ. పుం. కొండకాకి: చూ,సత్త్రసూజము.[కల్పసూత్రములు.

వాధూలము (మా) వాధూలము. అం: చూ,

వాధ్రాణసము. సం. వి. అ. పుం. రూ-వార్ధ్రీణసము, ఖడ్గమృగము: చూ, శరభము.

వార్ధ్రీణసము. సం. వి. అ. పుం.—పై—

వాన. దే. వి. 1: చిత్తడి—చిత్తతి, జడి, జల్లి, జల్లు, తొలకరి, దల్లు, ముసురు, సోన. (సం).— అంబకీషము, అవసరము, మారి, మేఘపుష్పము, వర్షము. తద్వి.— ౧. అల్పవర్షమునకు.— చినుకు— చిన్కు, సోన: ౨ తొలకరి వానకు.— తొలకరి — తొలుకరి — తొల్కరి, తొలుకారు— తొల్కారు; 3. తుపానుకు.— గాలివాన, తుపాను, కసరు. (సం).— అతిబల్వఝ, ఝంఝు, మహావాతము, సవృష్టికము. తద్వి.— ఉప్పెన, ఉబుకు, పొంగు, పోటు. (సం) ఉల్బణము (చూ, సముద్రము; ౪. ధారావర్షమునకు:— జడి, జల్లు, దల్లు, తుంపిల్లు, తూరజల్లు, వానతూర. (సం).— ఆసారము, ధారాసంపాతము, పిండాభ్రము; ౫. సానుడు వానకు.— సానుడువాన, పసపస, ముపాబు, ముసురు; ౬. పటపటమని వచ్చేవానకు— ఎలగోలు, ఎలగోలుజల్లు; ౭. మంచువంటివానకు —తుట్ర, తుత్తు; ౮. మట్టివానకు.—(సం).— పినాకము; ౯. వర్షబిందువునకు.— చినుకు—చిన్కు; ౧౦. వర్షధారలకు — వానకాల్లు, దార. (సం) —ధార; ౧౧. పెచ్చువానకు.— దెబ్బాటు. (సం).— అతివృష్టి, మహావాతము; ("చూ, సోన. 1—2."); 2. వర్షర్తువు. శ్రావణభాద్రపద మాసములు: చూ, మాసద్వయము (ఋతువులు).

వానకాళ్లు. దే. వి. బ. దార. (సం). ధారలు. వర్షధారలు. భా. 4, ఆ. 267. చూ, వాన. 1—౧౦.

వానకోయిల. ద్వ. వి. 1. ఒకానొక పాము: చూ, సర్పము; 2. వానసెచ్చెలి: చూ, ప్తోకము. 2.

వానజోలిపులుగు. దే. వి: చూ, హంస.

వానతతి. దే. వి: చూ, వాన. 2.

వానతూర. వా. వి. పిండాభ్రము: చూ, వాన. 1—౪.

వానసెచ్చెలి. దే. వి: చూ, వానకోయిల. 2.

వానపాము. దే. వి. ఎఱ్ఱి, మహీలత: చూ, సర్పము.

వానపేము. దే. వి. —పై.—

వానప్రస్థము సం. వి. అ. పుం. 1: చూ, సమిత* (మోదుగ); 2. ఇప్ప*: అలిమకము—అళిమకము, అవష్టబ్దము, గుడపుష్పము, దోలాఫలము, తీక్ష్ణసారము, మధుకము—మధూకము—మధూలకము, మధుద్రుమము, మధుపుష్పము, మధుష్ఠీలము, మధుష్ఠీవము, మృదుద్రుమము, లోధ్రపుష్పము. (తె).—ఇప్ప. తద్వి.— ౧. నీరిప్పకు.—కీరేష్టము, గిరికాఖ్యము, గిరిజము, గైరికాక్షము, గౌరశాకము, జలమధూకము. (తె).— నీరిప్ప; ౨. పిన్నయిప్పకు:— గౌరీవాసము, మధుశ్రేణి, మధుష్ఠీల, మధూళిక, హ్రస్వపుష్పము. (తె).— పిన్నయిప్ప.* ("చూ, హ్రస్వపుష్పము."); అం. 3: చూ, ఆశ్రమము. 2. తద్వి.—విఘానసము. [వర్జ్యములు.

వానప్రస్థ సన్యాసములు. అం: చూ, కలియుగ

వానప్రస్థుఁడు. సం. విశే. వని: చూ, సన్యాసి.

వానము. సం. వి. అ. న. 1. కుట్టుపని: చూ, స్యూతి. 1; 2. చోఁప: చూ, చాఁప 1; 3. గతి: చూ, సమయము. 2; 4: చూ, వాసన. 1; 5: చూ, సారంగము (గంధ్రము. 1.); విశే. 6. ఎండిన కాయలోనగునది: విశిష్టము, విశీర్ణము. (తె).— చొక్కు, పొడి; 7. అడవిది.

వానరము. సం. వి. అ. పుం. (నరుని వలె నుండునది): అగచరము, అధిపికము, ఉక్షాలము, కపి, కరి, కరేయువు, కలిప్రియుఁడు, కిఖి—ఖిఖి, కీశము, కుధాతువు, కుధాకువు, కురంగము, కుశాక్షము,

2. అంగీకారములేమి; 3. అక్కఱలేదు; 4. తిరస్కారము: చూ, హేళనము.

వాపి. సం. వి. ఈ. స్త్రీ.=బావి. నడబావి, దీర్ఘిక: చూ, సరస్సు. 1.

వాపితము. సం. విణ. 1. గొఱుగఁబడినది: పరివాపితము, ముండితము. (తె).— బోడి; 2. విత్తఁబడినది: ఉప్తము. [లోభి.

వాపిరిగొట్టు. వా. వి కక్కుఱితికాఁడు: చూ,

వాపు. వై. వి: చూ, రూ.—వాయింపు.

వాపుచ్చు. ద్వ. స. క్రి. 1. నోరుతెఱచు; 2: చూ, పచించు. కవిక. 6, ఆ.

వాపోక. ద్వ. వి. 1. అఱచుట: చూ, శబ్దము. 2; 2. ఏడ్చుట: చూ, శోకము.

వాపోవు. ద్వ. అ. క్రి. 1. ఏడ్చు. కళా. 6, ఆ. 178: చూ, శోకించు; 2. అఱచు. భాగ. 1, స్కం. 337: చూ, శబ్దించు.

వాప్యము. సం. వి. అ. స. రూ.— వ్యాప్యము, చెంగల్వకోష్టు*: చూ, వాలుకము.

వామ. సం. వి.ఆ. స్త్రీ. ఉత్తమమైన ఆఁడుది: చూ, స్త్రీ.

వామకర్ణాగ్రశ్రుతి. అం: చూ, చిత్రవర్ణములు.

వామజుష్టతంత్రము. అం: చూ, తంత్రములు.

వామదేవ ముఖమునఁబుట్టిన చర్చపుటతాళము. అం: చూ, ముఖ్యకళా ప్రాణము.

వామదేవస గోత్రము. అం: చూ, గోత్రము. 13.

వామదేవుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, శివుఁడు; అం. 2: చూ, బ్రహ్మలు; 3: చూ, శివాననములు.

వామన. దే. వి. 1. వామనపాతుగాఁడు: చూ, పక్షి; వా. విణ. 2. లేఁతది. [లేఁతకాయ.

వామనగాయ. దే. వి. లేఁత చింతకాయ; 2.

వామనగొమ్మ. దే. వి. (వామనము+కొమ్మ) ఊరవేసిన వామనగాయముక్క.

వామనపాతుగాఁడు. దే. వి: చూ, వామన. 1.

వామనము. సం. వి.అ. పుం. 1. దక్షిణపుదిక్కునందలి యాఁడేనుఁగు: చూ, హస్తిని; 2. మానమునకు రెండు రత్నులకంటె మీఁద గొఱవడిన యేనుఁగు (ఇది నింద్యము): చూ, హస్తి; 3. ఊడుగు*: అంకోఠము, అంకోలము, అతామ్రఫలము, కోఠరము, కోలక—కోలకము, గంధపుష్పము, గిరికోలం, గుప్తస్నేహము, గూఢపల్లిక, నికోచకము, పీతసారము, మహాయమళపత్రిక. (తె).— ఊడుగు*; వా. విణ. 4. పొట్టి: చూ, హ్రస్వము; అం. 5: చూ, వామనావతారము; 6. (౧౪౦౧౦ శ్లో. బ్రహ్మదేవుఁడు కర్త): చూ, పురాణములు; 7: చూ, దిగ్గజములు.

వామనములు. దే. వి. బ. వామనగాయలు.

వామనాయనమః. అం. (వామనః=వామైర్మంగళ రూపైర్వేదాది భిర్నీయతే గీయతఇతి.): చూ, ఓమ్. (వామనుఁడు.)

వామనావతారము. అం (వామనము): చూ, అవతారములు. (బలిచక్రవర్తి మహాదాత. వానివలన రాక్షసులు చెలరేఁగి మానులను, మంచివారలను బాధించుచుండిరి. అదివిని విష్ణువు పొట్టి బ్రాహ్మణుఁడై మూఁడడుగులస్థలమును బలిని యాచించెను. బలిచక్రవర్తి యిచ్చెను. పొట్టివాఁడు పెరిఁగి యొకపాదమున నాకాశమును, రెండవ పాదమున సమస్తభూమినిఁ గప్పెను. మూఁడవ యడుగునకు రాజా తన తలనే యీయఁగా వానినిఁ బాతాళమునకు నడఁగఁ ద్రొక్కెను. ఇదియె వామనావతారము.)

వామనుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, విష్ణువు. 1; విణ. 2: అపోగండఁడు, ఖర్వేరకుఁడు, ఖర్వుఁడు, నీచుఁడు, వంతుఁడు, వర్తనుఁడు, హ్రస్వుఁడు. (తె).— అఱపొఱఁడు, కురుఁజె, కుఱుచ, కుసులి,

కొటిక, కొట్రి, గిటక, గిడ్డ-గిడ్డి, గిఱిక, గున్న, గుజ్జె, గునిసె, గొనను, గొనప-గొనబ, గొనిసె, టింగ—టింగణా, రంగన—రింగణా, పొట్టి, పొదలు, పొదను, పొదిటి, పొనుఁగు, బుడుత, బురక - బురికి - బుఱుక - బురకఁడు, మట్ట, మట్టసి, మట్టు, మొట్టి. తద్వి.—గి. పొట్టిది.-ఠంగన; వా. కుబ్జుఁడు, గడురుఁడు—గడులుఁడు, గదువు. (తె).--గూనివాఁడు, మఱుగుజ్జె-మఱుగుజ్జు ("చూ, హ్రస్వుఁడు.")

వామనేత్రము. అం: చూ, నేత్రములు.

వామపాదము. అం: చూ, పాదములు.

వామము. సం. వి. అ. న. 1 ధనము: చూ, హిరణ్యము. 3; 2. అవుపొదుఁగు: చూ, స్తనము; విశే. 3. ఎడమ: చూ, సవ్యము. 1; 4. సుందరము: చూ, హృద్యము; 5. వక్రము: చూ, వేల్లితము. 3; 6. పొట్టి: చూ, హ్రస్వము; 7. ప్రతికూలము: చూ, సవ్యము. 3.

వామలూరము. సం. వి. అ. పుం. రూ-వామలూరువు. పుట్ట: చూ, వల్మీకము.

వామలూరువు. సం. వి. ఉ. పుం.—వై.—

వామలోచన. సం. వి. ఆ. స్త్రీ. 1. చేక్కని కన్నులుగల యాఁడుది: చూ, స్త్రీ; 2. ఆఁడుది: చూ, స్త్రీ.

వామావర్త. సం. వి. అ. స్త్రీ: అగ్నిమేషి, తిందుకిని, పీతకి. (తె).—అగ్గిమేడి*.

వామహనురేఖ. అం: చూ, చిత్రవర్ణములు.

వామహస్తము. అం: చూ, హస్తములు.

వామావిద్ధము. అం: చూ, ఆకాశమండలములు.

వామి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుగుఱ్ఱము: చూ, హయము; 2. ఆఁడుగాడిద: చూ, హయము (రాసభము. 1.); 3. ఆఁడులొట్టియ: చూ, శృంఖలకము (లొట్టిపిట్ట.); 4. ఆఁడునక్క: చూ, సృగాలము; దే. వి. (1) గడ్డిమేటి, కుప్ప: చూ, వెంటి; (2) ప్రా. ప్రయ. 1, ఆ. 119: చూ, రాశి. 1.

వాము. దే. వి. 1. బంధుత్వము: చూ, నావి; వా. 2. ఓమము: (సం) లోచమస్తకము, వల్లి (చూ, యవాని. 1.); దే. స. క్రి. 3. చేతులఁగుప్పఁజేసి యెత్తు: జెవ్రుచు-కొను.

వాముఁడు. సం. వి. అ. పుం. (రూ-వామను, డు-వామదేవుఁడు) 1: చూ, శివుఁడుఁ 2: చూ, మన్మథుఁడు.

వాయ. వై. వి. 1.=భాగ. ఱోటిలోనొకతడవ వంతు, ఱోటిలో నొక్కతూరి పోసి దంచెడు ధాన్యాదులవంతు: చూ, భాగము. 4; 2: చూ, ధాన్యము; 3. కొండసందిచ్చిన నేల: చూ, భూమి. 1.

వాయఁగొట్టు. వా. అ. క్రి. వలఁగఁగొట్టు.

వాయదండము. సం. వి. అ. పుం. సాలెవాఁడు నేఁతనరితట్టెడు పలక: చూ, సరి 2 (మగ్గము.)

వాయనము. సం. వి. అ. న. 1. వ్రతోద్యాపన కాలమందు ఉపాయనముగా నిచ్చెడు పొపకము; వై. వి. (1)=ఉపాయన. వ్రతాదుల యందు స్త్రీలు ముత్తయిదువులకిచ్చే కానుక, నోములందిచ్చే కానుక.

వాయము. వై. విశే.=వ్యర్థము. (దేశ్యమని శ ర) మార్క. 4, ఆ; భార. అర. 6, ఆ: చూ, వ్యర్థము.

వాయవ్యము. సం. విశే. 1. వాయుసంబంధమైనది; 2. వాయవ్యమూల: చూ, హరిత్తు. 1; అం. 3: చూ, దిక్కులు. [సంధిభేదము.

వాయసతుండకము. సం. వి. అ. పుం. ఎమ్ముల

వాయసము. సం. వి అ. పుం. 1. కాకి: చూ, సకృత్ప్రజము; 2. అగలుమ్రాను*: చూ, సుగంధము; 3. నరళమను ధూపద్రవ్యము: చూ, రాజార్హము.

వాయసారాతి. సం. వి. ఇ. పుం. గుడ్లగూబ: చూ, సకినంపుఁబులుఁగు.

వాయసి. సం. వి. ఈ. స్త్రీ. 1. (కాకులసంబంధమైనది): కరట, కాకమాచి - కాకమాచిక, కాకమాత, కాకి, గుచ్ఛఫల, గుడఫల, ఫుకము, సర్పమాచికాకళి. (తె).-ఉడుసర, కాంచి, కామంచి. నల్లబుడుసర*: (చూ, "సర్పమాచికాకళి.") (చూ, తృణము, 1. రెండవకాలములో: చూ, కామంచి.); 2. బమ్మమేడి*: చూ, బెట్టిమేడి; 3. పొట్టికాఁకర*: చూ, నుసవి. 1.

వాయసోలి. సం. వి. ఈ. స్త్రీ. (కాకివలె చేలించేనది.) కారుకొల్లి*: చూ, స్వాదురస.

వాయి. వై. వి.=వాక్. 1.నోరు. భార. సభా. 1, అ: చూ, వదనము. 1; 2. వాయుగోకము: వాయుగండము; 3. ఖడ్గాదిధార: చూ, వా. (2); 4. ముఖము: చూ, వదనము. 2.

వాయించే. వై. స. క్రి. 1. వీణాది వాద్యము లను వాదనము చేయు; వా.2. (చెంపమీఁద) కొట్టు: చూ, వేయు. 1.

వాయింట. దే. వి: రూ—వావింట*. (సం):—అజగంధిక, అజగంధిని, అమరసర్షప, కబర, కబరి, కవర, ఖరపుష్ప, చక్రింద, టుంగి, బర్బర. తద్వి.—కుక్కవాయింట- కుక్కవావింట. (సం).- వసుగంధిక, శ్వానబర్బర. (చూ, "శ్వానబర్బర.")

వాయింపు. వై. వి.= వాద్య. వీణాదివాదనము, వాయించేట. (ఇంపువ్యంతము ప్రాచీనకవి సమ్మతము గాదు): చూ, స్వరము. 2.

వాయిదము. వై. వి.=వాద్య. రూ—వాద్దెము. —వై.—య. 4, ఆ. 84.

వాయిదా. వా. వి. 1. గడువు: చూ, మితి; 2. గడువునకు చెల్లించే పైకము; 3. న్యాయాధిపతి విమర్శనకై నియమించిన దినము: హీరింగు. [ద్వి: చూ, రిస్టి. 2.

వాయిదార. వై. వి. వంకలుగలకత్తి. అం, భా.

వాయివిళంగము. వై. వి. రూ—వాయువిళంగిము: చూ, విడంగము. 1.*

వాయుగండము. సం. వి. అ. పుం: చూ, వాయి. 2. (ముండవాయి, కోరవాయి ఇందుఁజేరును.) (అజీర్తి అని కొందఱు)

వాయుగుల్మము. సం. వి. అ. పుం: చూ, సుడి.1.

వాయుదారువు. సం.వి.ఉ.పుం: చూ, మేఘము.1.

వాయుధాటి. సం. వి. ఈ. స్త్రీ. వాయువేగము, అపరాజము: చూ, స్యందము.

వాయుపంచకము. అం: మనస్సు, ధ్యానము, త్వక్కు, స్పర్శము, పాణి. (5)

వాయులింగము. సం. వి. అ. పుం. శ్రీకాళహస్తీశుఁడు: కలింగుఁడు. [విళంగము.*

వాయువిళంగము. వై. వి: చూ, రూ—వాయి

వాయువు. సం. వి. ఉ. పుం. (వా తీతి వాయుః. ఉ. పుం. వాగతిగంధనయోః. విసిరెడువాఁడు):1: అ, అంకతి, అగ్నిమిత్రము, అజిరము, అర్భకము, అవి, ఆత్మ, అధ్వాతము, ఆశుగము, క, కంపలక్ష్మ, కంపాకము, కంబు, కలుషము, కుముదము, కృపీటపాలము, కేతుధరము, క్షితివ్యంతుఁడు, క్షిత్యా, క్షిపణువు, క్షేపణ్యువు, ఖగము, ఖచరము, ఖరువు, ఖశ్వాసము, గంధవహుఁడు-గంధవాహుఁడు, గమిష్ణువు, చంచలము-చంచలుఁడు, చణకము, చరణ్యువు, చరయువు, ఘనము, జగద్బలుఁడు (జగద్బలము), జగత్తు, జగత్ప్రాణుఁడు, జూహూరాణము-జూహవారాణము, ఝు, ఝుంఝానిలము, తతగము, తతము, ధారావని, ధూలిధ్వజుఁడు-ధూళిధ్వజుఁడు, నభప్రాణుఁడు (నభప్రాణము), నభస్వంతుఁడు, నాగము, వ, పవనము, పవమానుఁడు, పృషదశ్వుఁడు, ప్రకంపనుఁడు, ప్రభంజనుఁడు, ప్రాణము, ప్రాణవాయువు, బలదేవుఁడు, భోగికాంతుఁడు, మరుతము-మరుత్తు-మరుత్వంతము, మహాబలుఁడు, మాతరిశ్వుఁడు,

మారుతము, మృగవాహనుఁడు, వ. వరంధకము, వాతము, వాతూలము, వాహము, వి. శరణ్యుఁడు, శారము, శ్వసనము, శ్వాసము, స. సంఘర్షము, సదాగతి, సమీరణుఁడు, సమీరము, సగయుఁడు, సోముఁడు, స్పర్శనము, హరి. (తె. వ).—ఈఁదు, ఎదమోలి, ఒంటిమ్రాఁకుల పెనుముప్పు, కరువలి-కర్వలి, గందపుఁగొండ టెంకి, గాడుపు-గాడ్పు, గాలి, చేలిసట్టు. చేలియిక్క, చిలువమేఁత, జింకగుఱ్ఱమువలంతి, జింకరవుతు, తావిమోపరి, తెమ్మెర, దుస్సఁగావించే జోణ, నింగిమోలి, నీటితాత, నెత్తమ్మికోలని కాఁపు, పయర-పయిర-పయ్యర-పయ్యెర-పైర, పాముమేఁత, బీదల పెనుబాధ, మబ్బుపగ, మబ్బుమేపరి, మబ్బువిప్పు, మరుతేరు, మింటిమోలి-మినుమోలు, వలపువోపరి, వలి, వినుమోలి-విన్నుమోలి, వీవలి, సుడిగొట్టు, సుడిగొట్టుజోగి, సుర, సురఁటి వీవనులఁబుట్టు, సోఁకు, సోఁకుడయ్యము. తద్విశేషములు.—౧. పంచవాయువులు.—(౧) ప్రాణము (ఇది హృదయమున నుండి నాసికనుండి వెడలు వాయువు): అసవు-అసువు, ఆత్మజని, ఉచ్ఛ్వాసము, గిత్వము, ప్రాణము. (తె).—ఉసులు, గుండెగాలి, పానము, మందల; (౨): అపానము (తె).—ముడిగాలి-మూడిగాలి (ఇదిపొత్తికడుపునకు దిగువనుండి మలమూత్రాదులను బయలువెడలింపఁజేయువాయువు);(౩): వ్యానము, ఉద్ధిము. (తె).—ఒడలుగాలి. (శరీరమునం దంతటను వ్యాపించిన వాయువు); (౪): ఉదానము. (ఇది గొంతుగాలి. కంఠముననుండి మాటలాడ వీలుకలుగఁజేయును); (౫): సమానము. (తె).-బొడ్డుగాలి. (నాభియందుండు వాయువు. అన్నాశయమున జఠరాగ్నికిసమీపమునను ండును); ౨. పంచోపవాయువులు. (౧): కూర్మము (దర్శన పరివర్తమాన వాయువు);(౨): క్రృకిరము (క్షుత పరివర్తమాన వాయువు;) (౩): దేవదత్తము. (జృంభపరివర్తమాన వాయువు); (౪): ధనంజయము (శవశరీర పరివర్తమాన వాయువు); (౫): నాగము (ఉద్గారపరివర్తమాన వాయువు); 3. సప్త వాయువులు.— ప్రవహము, ఆవహము, ఉద్వహము, సంవహము, వివహము, పరివహము,పరావహము (7); ౪. ఎనిమిది(అష్ట) వాయువులు.—(౧): గోగంధనము, పురోవాయువు. (తె).-ఎదురుగాలి; (౨): వాసంతము. (తె).—చిఱుగాలి, తెమ్మెర, నాలిగాలి, పయ్యెర, సన్నగాలి; (౩): చరవాయువు—చారవాయువు-చారము. (తె).—పడమటిగాలి, వడగాలి, వేసఁగి గాలి; (౪): కించులికము-కించులుకము. (తె).-మీఁదిగాలి; (౫): ఇరింగణము, చండవాయువు. (తె)—పడిగాలి; (౬): ఝుంఝు, ఝుంఝానిలము, ఝుంఝావాతము. (తె).—కసరు-కసురు, గాలివాన, వానగాలి (ఇది గొప్పగాలి); (౭): చూషకము. (తె).—సరిగాలి; (౮): వాత్యా-వాతూలము, వాతమండలి, ఆవంగిని, కథాప్రసంగము, తరుతూలిక, సానువు. (తె).—మడియుగాలి, మప్పు, సుడి, సుడిగాలి, సుర, సురగాలి; ౫: అనిలము-అనిలుఁడు (49 వాయువులలో నిదియొకటి. మిగతవి లభింపవయ్యె); ౬: ఉచ్ఛ్వాసము-ఉచ్ఛ్వసనము-ఉచ్ఛ్వసితము,ఊర్ధ్వము, ఆవము.(తె).-ఎగయూపిరి;౭:నిశ్వసనము-నిశ్వాసము,అపానము, అవానము.(తె).—ఎగరొప్పు, ఎగరోజు, నిట్టూరుపు—నిట్టూర్పు.

బుస; ౮: అవశిష్టవాయువు; ౯: హంస; ౧౦: ప్రవహము, ఆవహము; ౧౧: మలయమారుతము. (తె).— కమ్మగాడుపు—కమ్మగాడ్పు; ౧౨: (తె).— మండవాయి; ౧౩: ప్రకంపనుఁడు. (తె).— ఓరుగాలి; ౧౪: శీతము, శీతలము, శీతవాయువు. (తె).— అల్లిగాలి, అల్లితెమ్మెర, ఈఁద, ఈఁదురు—ఈఁదురుగాలి, చేలిగాలి, చేల్లగాలి, తుపానుగాలి; ౧౫: ఉదజని; ౧౬: వత్రజని; ౧౭: ముక్కగాలి; ౧౮: ఈశాన్య వర్షవాయువు; ౧౯: (తె) — కోరవాయి; ౨౦. తూర్పుగాలికి:—(తె).— తూరుపాలి— తూర్పాలి, తూర్పిడి; ౨౧. దక్షిణపుగాలికి:—(తె).— పయర— పయిర—పయ్యర—పర్యొర—పైర; ౨౨:(తె)అమ్మోనియా; ౨౩. చలింపనిగాలికి:— నిర్వాతము; ౨౪. పశ్వాదులమీఁదిగాలికి:— (తె).— పసి; ౨౫. పువ్వులమీఁదిగాలికి:—(తె).— పసి; ౨౬. వాయుభేదము:— ఝ; ౨౭. వాయులక్ష్మికి:— గాధ; ౨౮. వాయుభార్యకు:—అంజన: చూ, సహధర్మిణి (భార్య. 1—౫౫.); ౨౯. వాయుసమూహమునకు:— కరఘట, కునాభి; ౩౦. చామరపుగాలికి:—కప్తేపువు, మంధరువు.(తె).—విసనకఱ్ఱగాలి; ౩౧. చేటగాలికి:—నిష్పావము.(మఱియు బొగ్గుపులుసువాయువు, గంధకజలవాయువు, నవాచారవాయువు మొదలగునవి కలవు.) (“చూ, హరి. 10.”); అం. 2: చూ, దిగధిపతులు; 3: చూ, మేఘములు; 4: చూ, భూతములు; 5: చూ, కర్మేంద్రియములు; 6: చూ, మూర్తులు; 7: చూ, ద్రవ్యములు.

వాయువులు. అం: చూ, వాయువు. 1.

వాయువేగి. సం. వి. స. పుం. వాయువుయొక్క వేగమువంటి వేగముగలిగినదగుటచేతకుక్కకియ్యఁబడిన పేరు. స్వా. 4, అ. 32: చూ, సివంగి. 2.

వాయువ్యాస్త్రము. అం: చూ, అస్త్రములు.

వాయుసఖుఁడు. సం. వి. అ. పుం. వానచెచ్చెలి: చూ, వహ్ని. 1.

వాయుస్కంధన్యాయము. అం. ఒకన్యాయము.

వారోడు. వ్య. అ. క్రి. (వా + ఓడు) మాటపెటికియగు. భార. ఉద్యో. 1, ఆ.

వార. దే. వి. 1. ఎనిమిది పుంజెములనూలు; 2. (లెక్కలయందలి) ఎక్కువతక్కువలు, వై. వి. 3.=వారణ. నివారణ.

వారంకము. సం. వి. అ. న. పిట్ట: చూ, పక్షి.

వారంటు. వా. వి. 1. (ఒకనిని పట్టుకొనుటకు) అధికారపత్రిక (హాజరువారంటు); 2. (ఒకని ఆస్తిని జప్తుచేయుటకు) అధికార పత్రిక; 3. ఆజ్ఞ: చూ, సెలవు; 4. తొందరపని.

వారఁడు. వై. వి.=వారణ. చౌలింపఁడు.

వారఁబట్టు. వ్య.స. క్రి. (వా+ రాన్ + పట్టు.) ఆపోశించే. జై. 1, అ. 100; జై. 5, అ.3.

వారఁబోఁత. వా. వి: పారఁబోఁక—పోరఁబోఁత.

వారఁబోయు. వా. స. క్రి. 1. పారఁబోయు; 2. ఉపయోగముగ పారఁబోయు. [త్రి.68.

వారక. దే. అవ్య. నిరంతరార్థకము. ఆం, భా.

వారకము. సం. వి అ. పుం. 1. గుఱ్ఱపునడ: చూ, హయము; 2. కష్టస్థానము: చూ, స్థానము. 1; 3. తగదనుట; విణ. 4. వారించునది; దే. వి. (1) తాకట్టు: ఆధి, ఆహకము, బంధకము, బంధనము, బంధము, వినిమయము. (తె. వ).—ఆగావు, అడ్డము, ఆయకము, ఈడు, ఉద్దనవు, ఉద్దర—ఉద్దరువు, ఎగుదల, ఏపు, కుదువ, కోరు, గిరవు, గీవు, తనకా—తనఖా, తాకట్టు, తేగడ, బండకము, మారకము, మార్పు—మాఱుపు, రో—రోయి. తద్వి.—౧. అప్పునకు.— ఉద్ధారము, ఋణము, ధారమల, పర్యుదంచనము, ప్రామిత్యము. (తె).—

అచ్చేదల, అప్పు, అగవడి, తంట-తెంటా, బదులు, బాకి-బాకీ,రవది, లోను; ౨: చేబదులు,పొరచి, బదులు;3:ఎరవు-ఎరువు, రో-రోయి; ౪: (చూ,ఋణత్రియము); ౫. వస్తువులమాఱుపునకు.— (చూ, వినిమయము); ౬. ధాన్యాదుల ఋణమునకు:— (తె) ఎరవు-ఎరువు; 2. లేనికాలమందు వృద్ధ్యాదులులేక యుపయోగార్థ మొకరికిచ్చి కలిగిన కాలమునందు మరలఁ బుచ్చుకొనెడి ధనాదికము.భార.ఆది. 3, ఆ;విక్ర. 7, ఆ. 62. (ఎరవు-ఎరువు అని కొందఱు.)

వారకాంత. సం. వి. ఆ. స్త్రీ: చూ, వేశ్య.

వారట. సం. వి. ఆ. స్త్రీ. ఆఁడుహంస. రూ-వరట: చూ, హంస. 1.

వారడ. దే. వి. తాటాకువారిన చివ్వ.

వారడి. దే. వి. తేడా,నష్టి. "ఆవారడి యిందుఁ గలసివచ్చెను" "బడేవారడి": చూ, సేగి.

వారడు. వై. స. క్రి: చూ, చౌలించే. 1-2. (అప్రి.) [రోధన్ను.

వారణ. సం. వి. ఆ. స్త్రీ. చెలియలికట్ట: చూ,

వారణబుస. సం. వి. ఆ. స్త్రీ. రూ-వారణవృష. అరఁటి*: చూ, రంభ. 2.

వారణమాల. అం: చూ, మహాకావ్యము.

వారణము. సం. వి. అ. న. 1. నిరోధము:చూ, సంరోధము; 2. ఏనుఁగు: చూ, హస్తి; 3.= వార. వారింపేట, నివారణము (ఇందుఁగల 1వ అర్థమునకిది వర్తించునని కొందఱు.); దే. వి. (1) ఒకరకము డేగ: చూ, శ్యేనము.

వారణవృష. సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ—వారణబుస*.

వారణాసి. సం. వి. ఇ. పుం. (రూ-వారణసి-వారాణసి- వారాణాసి- వరణసి- వరణాసి-వరాణసి- వరాణాసి): చూ, కాశి. 1-2-3 (దేశములు.)

వారధి. సం. వి. ఇ. పుం. 1: చూ, సంద్రము; 2. అడ్డకట్ట: చూ, సేతువు.

వారము. సం. వి. అ. న. 1. మద్యపాత్రము: చూ, పాత్రము. 6; పుం. 2. సూర్యాదివాసరము (ఉదయాద్యుదయము. ఉదయమున కుండు హోరాధిపతులను బట్టియే ఆయా వారములకట్టి నామములు కలుగును.): చూ, వారములు; 3. తడవ: చూ, పెండియు; ౪: చూ, సమూహము; ౫: చూ, వాకిలి; 6: చూ, క్షణము. 1; 7. కుబ్జ, పొట్ల*: చూ, కొన్రికి, 8.= వారు. వరుస: చూ, శ్రేణి. 1;అఁ (బ) 9: చూ, దినాంగములు; దే. వి. (1) గుఱ్ఱము. అచ్చ. యు, కాం. 382: చూ, హయము.

వారములు. అం. ౧: ఆది, ఆదిత్య, సూర్య. (తె).-తొలివారము;౨: ఇందు,సోమ. (తె): సెలవారము, మలివారము, రెండవవారము; 3: అంగారక. కుజ, జయ,భౌమ, మంగళ; ౪: బుధ, సౌమ్య.(తె).-పెద్దవానము,బుధవారము;౫: గురు, బృహస్పతి,లక్ష్మి.(తె).—బేస్తవారము, లచ్చివారము; ౬. శుక్రి, భృగు; ౭: శని, మంద. (తె).—సనివారము. తద్వ.- మూఁడు తిథులుఁగూడిన వారమునకు:—అవమము, తిద్యుస్పృక్కు.

వారముఖ్య. సం.వి.ఆ.స్త్రీ. యోగ్యతంబట్టిజనులచేతసత్కరింపఁబడినభోగముది: చూ,వేశ్య.

వారయాత్రికుఁడు. సం. వి. అ. పుం. పెండ్లిచేట్టము. వై. 6, ఆ. 126: చూ,సంబంధి. 1.

వారవాణము. సం. వి. అ. పుం, న: చూ, రూ-వారవారణము.

వారవారణము. సం. వి. అ. పుం, న: రూ-వారివారణము- వారవాణము, అయోగము, ఆముక్తము, ఉరచ్ఛదము-ఉరశ్ఛదము,కంకటము, కంచుకము, కకటిక, కదళి, కవచము-కవసము,కాయబలనము-కాయవలనము, కాలబలనము - కాలవలనము, కింశుకము, కుశూలము, కూర్పాసము, జగరము-జాగర్థ

ము, తనుత్రము, తనుత్రాణము, దంశనము-దంసనము-దశనము, భండనము, యోగము, వరూథము, వర్మము-వర్మువు, సజ్జ, సన్నాహనము, సన్నాహము. (తె).--కత్తళము, చేట్ట, జిరా-జిరాయి-జీరా, జోడు, తొడుగు-తొడ్గు, తొడుపు-తొడువు, దగళా, దుప్పటము, పక్కెర, పేరణము-పేరణి-పేరిణి, బొందడము-బొందళము, మఱువు, మయిమఱువు - మెయిమఱుగు-మెయిమరువు-మెయిమర్వు-మెయిమఱువు-మేమఱుగు-మేమరువు - మేమర్వు-మేమఱువు-మైమఱువు, సమకట్టు, తద్వి.—౧. (శిరస్త్రాణము-శిరస్కము-శిరస్త్రము, ముఖత్రాణము దలపము, ఉదరత్రాణము నాగోదము, జంఘాత్రాణము మంఖణము, బహుత్రాణము బాహులము, అంగుళిత్రము-అంగళిత్రాణము-అంగులీత్రాణము గోధ, ఉరస్త్రాణము, తనుత్రాణము, తలము. హస్తకవచము-హస్తత్రాణము. (తె) అత్తెము ఇత్యాది); ౨. ఇనుపకవచమునకు.-జాలిక; 3. ఏనుఁగు పక్కెరకు.- గుడము, ప్రఖరము (చూ, కల్లకము. ౨; చూ, హస్తి); ౪. గుఱ్ఱములో నగువాని కవచమునకు.— కంబళము, జయపము, ప్రఖరము. (తె):కురాళము, పక్కెర: (చూ, వస్త్రము; చూ, హయము); ౫. వాహనాదులగవుసెనకు.-(తె).- కువాళము, గవుసెన, బురకా(చూ, వస్త్రము, నిచోళము.1.); ౬.తొడుగఁబడినకవచమునకు-అపినద్ధము, పినద్ధము, ప్రతిముక్తము; ౭. ఏనుఁగు చెవివంటి పాదకంచుకమునకు.— రేచకము; ౮. వజ్రమయ కవచమునకు.— వజ్రాంగి; ౯. కవచముల గుంపునకు.— వార్మణము; ("చూ, హస్తత్రాణము")(చూ, వస్త్రము)

వారసత్వము. వా. వి. వక్రమముగ సంక్రమించెడియాస్తి.

వారసు. వా. వి. వంశపరంపరలో మిగిలిన ఆస్తికి కర్త

వారస్త్రీ. సం. వి.ఈ.స్త్రీ: చూ, వారకాంత.

వారాంగన. సం. వి. ఆ. స్త్రీ. —పై.—

వారాంగి. అం: చూ, వృత్తము. 1. (ఇంద్రవజ్రచ్ఛాయను మొదటిచరణమున్ను, ఉపేంద్రవజ్రచ్ఛాయను రెండవచరణమున్ను, కలితాంత వృత్తచ్ఛాయను మూఁడవ చరణమున్ను, వాతోర్మి వృత్తచ్ఛాయను నాల్గవ చరణమున్ను నడచును.)

వారాలిక. సం. వి. ఇ. పుం: చూ, సముద్రము. వి, పు. 7, ఆ.

వారాలిక. సం. వి. ఆ. స్త్రీ: చూ, పార్వతి.

వారాశి. సం. వి. ఇ. పుం. రూ—వారిరాశి. సటికుప్ప. స్వా.3, ఆ. 23: చూ, సముద్రము.

వారాహకర్ణి. సం. వి. ఈ. స్త్రీ. రూ—వరాహకర్ణి - వరాహపర్ణి, అశ్వ, అశ్వగంధ, అశ్వారోహ, కంజిక, కంబుక- కాంబుక, కామరూపిణి, కుష్ఠగంధ, గంధపత్రి, తురగి, బల్య, వాజికరి. (తె).— దొమ్మడోలు, పెన్నేరు- పెన్నేరు, పెన్నేరుగడ్డ- పెన్నేరుగడ్డ. తద్వి.—మహాశ్వగంధ. (తె).— పెద్దపెన్నేరు*.

వారాహము. అం.(౨౪౦౦౦ శ్లో. భూదేవికివరాహమూర్త్యుపదేశము): చూ, పురాణములు.

వారాహి. సం. వి. ఇ. స్త్రీ. 1: చూ, మాతృకలు; 2. రూ— వరాహి. అడవియాఁడుపంది: చూ, సూకరము; 3. పాఁచితీఁగ*: చూ, శైవలము; 4. నేలతాడు*: చూ, శిలీంధ్రకము; 5: బ్రహ్మదండి, అవాక్పుష్పి, కంటకపత్రఫల, గుచ్ఛకంటకము. (తె).-బమ్మదండి*; 6. పొట్టిగుమ్మడి*: చూ, సర్వతోభద్ర; అం. 7: చూ, రసాయనములు.

వారాహీభైరవతంత్రము. అం: చూ, తంత్రములు.

వారి. సం. వి.ఇ.న.నీరు: చూ, సలిలము; 2. కురువేరు*: చూ, హ్రీబేరము; ౩. స్త్రీ. 3: చూ, సరస్వతి. 1; ఈ. స్త్రీ. 4. కుండ: చూ.

వారివాణము (ఖాండము. 3.); ౪. ఈ. స్త్రీ. ౫. ఏనుఁగుఁబట్టెడు చోటు: చూ, హాస్తి; ౬. ఏనుఁగుఁబట్టెడు పల్లము: అవపాతము, శ్వభ్రము. (తె. ప).— ఒగ్గము, ఓదము, పంగిడి— పంగిడీ— పంగిణీ— పంగెన. (చూ, హాస్తి.)

వారించే. సం. స. క్రి. నివారించే: చూ, సంరోధించే.

వారికర్పూరము. సం. వి. అ. పుం. ఇల్లీశమను చేఁప: చూ, మత్స్యము. 1.

వారిజము. సం. వి. అ. న. 1. తామర: చూ, సహస్రపత్రము; 2. ఉప్పు: చూ, సౌవర్చలము (లవణము. 1.); 3. శంఖము: చూ, సంకు. 1; 4. శంబూకము: చూ, సంకు. 1; 5. బాడిద*: చూ, సూక్ష్మదారువు.

వారిజీము. వై. వి. 1.=పారిజాతః. రూ-వారిదము*. ఆం, భా. ద్వి. వనా. 43: చూ, సూక్ష్మదారువు; 2: కొండబూరుగు* (సం).— కూటశాల్మలి, రోచన: చూ, శాల్మలి.

వారిణ. దే. వి. చిన్నచేఁపలఁబట్టు వల: చూ, వల.1.

వారిత్రి. సం. వి. ఆ. స్త్రీ: ఆతపత్రము, ఆతపవారణము, ఉత్కూటము, ఉష్ణవారణము, ఖర్పరము, గోత్రము, చక్రాంగము, ఛత్రము, ఛాయామిత్రము, పత్రపిశాచిక, పుటోటజము, ప్రోతోత్సాదనము, మూర్ధఖోలము, లోకసమ్మతము. (తె. ప).—ఎండచేటు పుట్టువు, ఎండమఱువు, ఎల్లి, గొడుగు-గొడువు, చేట్టువు. తద్వి.— ౧. ఆకుల (మొగలియాకులలోనగునవి) గొడుగునకు.- కావారి, జంగమకుటి, జలత్రి, భ్రమత్కుటి, మూర్ధకర్పరి; ౨: వస్త్రకుట్టిమము. (తె).— ఆలవట్టము, గుడ్డగొడుగు; ౩. చిన్నగొడుగునకు.—ఛత్రి; ౪: జలతాలము. (తె).— గూడ, గూడచేఁప, తెంబుగూడ- జెమ్మగూడ; ౫. తెల్లగొడుగునకు.- పుండరీకము; ౬. రాజోనకుఁబట్టెడు తెల్లగొడుగునకు.-కనకదండము, నృపలక్ష్మము, రాజలింగము. (ఇది బంగారుకఱ్ఱలుగల గొడుగు); ౭. శ్వేతచ్ఛత్రాది రాజార్హవస్తువునకు.- పరిబర్హము, పరివాహము- పరీవాహము; ౮. వరుణునిఛత్రమునకు.- ఆభోగము; ౯. కామకేని గొడుగునకు.-(తె).—గొడుగు, జొన్నగొడుగు; ౧౦: (చూ, పంజె. 3)

వారిదము. సం. వి. అ. పుం. 1. మబ్బు: చూ, స్తనయిత్నువు (మేఘము. 1.); 2. ముస్త*: చూ, హరిత (తృణము. 1, ముస్తకము); వై. వి. (1).=: చూ, రూ-వారిజీము. 5. ఆచ్చ. యు, కాం. 505.

వారిధాన్య. సం. వి. ఆ. స్త్రీ: చూ, పక్షి. 1.

వారిధాపయంత. అం: చూ, గోత్రము. 13.

వారిధి. సం. వి. ఇ. పుం: చూ, వారాశి.

వారిపర్ణి. సం. వి. ఈ. స్త్రీ: చూ, శైవలము*.

వారిభవ్యము. సం. వి. అ. న: చూ, రూ-పారిభావ్యము*.

వారిమసి. సం. వి. ఇ. పుం: చూ, మేఘము.1.

వారిరాట్టు. సం. వి. జ్. పుం: చూ, బుద్ధుఁడు.

వారిరాశి. సం. వి. ఇ. పుం: చూ, రూ-వారాశి.

వారివారణము. సం. వి. అ. పుం, న: చూ, రూ-వారవారణము.

వారివాహము. సం. వి. అ. పుం: చూ, వారిమసి.

వారు. వై. వి. 1.=వరత్రా. రూ-వాఱు. తోలుచీలిక: చూ, వరత్ర. తద్వి.—చివ్వ, చిక్కు; వై. అ. క్రి. 2. ఉడుగు, అడఁగు. భార. ఆది. 6, ఆ; భార. శాం. 6, ఆ (దీనికి వ్యతిరేకక్త్వార్థకమందును వ్యతిరేకార్థకవిశేషణమునందును మాత్రము ప్రయోగము కానఁబడెడి.): చూ, సుక్కు. 4; 3: చూ, సహించే. "గంజివారెను"; దే.స.క్రి. 4. రెండుచేతులతో తాటాకు ఓరచివ్వు; స. 5.తత్సమ ధుమంతంబులకుఁ గొన్నింటికి ద్వితీయా

బహువచనంబు మీఁదఁ బూజ్యతయందు వారగు. "శ్రీరాముల వారు" మొ. అర్థవిశేషంబున నేకవచనములమీఁదను గొన్నిరొడలఁ గాననగు. "అయ్యవారు, అమ్మవారు, దేవరవారు, (చూ, గారు.)"

వారుఁడు. సం. వి. అ. పుం: చూ, శివుఁడు.

వారుచు. వై. ప్రే.1.రూ-వార్చు. వారఁజేయు; దే. అ. క్రి. 2. ఆచమించు. రూ-వార్చు; స. క్రి. 3. రూ-వార్చు: చూ, పరీక్షించు.

వారుతము. సం. వి. అ. న. ఖట్వి: చూ, శవయానము.

వారుణము. అం: చూ, ఉపపురాణములు.

వారుణాస్త్రము. అం: చూ, అస్త్రములు.

వారుణి. సం. వి. ఈ. స్త్రీ. 1. పడమటిదిక్కు: చూ,దిక్కు. 1; 2. సారాయి:చూ,సుర.2; 3. శతభిషము: చూ,రిక్క; 4. ఒకగడ్డి*: చూ,తృణము. 1; ఇ. పుం. 5. అగస్త్యుఁడు: చూ, సన్యాసి.

వారుపు. వై. వి. రూ-వారుపుడు-వార్పు:చూ, పాదము (1). (మెతుకులుగల గంజికిన్ని.)

వారుపుడు. వై. వి. —పై.—

వారువపుజేన్నము. ద్వ. వి. అశ్వమేధయాగము. అచ్చ. బాల, కాం. 58:చూ, హోమము.3 (యజ్ఞము. 3).

వారువము. దే. వి. (రూ-వార్వము-వావురము) గుఱ్ఱము: చూ, హయము. భీ. 4,అ.

వార్చు. వై. ప్రే. 1: చూ,రూ-వార్చు; దే. అ. క్రి. 2:చూ, రూ-వారుచు. 2. ప్యా. 2,అ. 78; స. క్రి. 3: చూ, రూ-వారుచు. 3.

వార్డరు. వా. వి. చెఱసాలఁగావరి.

వార్డు. వా. వి. కొన్ని యిండ్లయొక్కయుకొన్ని వీధులయొక్కయు కలిసిన భాగము.

వార్త. సం. వి. ఆ. స్త్రీ. 1. వృత్తాంతము: చూ, సమాచారము. 1; 2. నడవడి: చూ, సమయము. 2; 3. జీవనోపాయము: చూ, స్థితి. 5; 4. అర్థానర్థముల తెలుపు శాస్త్రము (ఇదియొకవిద్య): చూ, విద్యలు; 5. వంగ*: చూ, వార్తాకము; అం.6:చూ, రాజవిద్యలు.

వార్తము. సం. వి. అ. పుం. 1. పొల్లు: చూ, స్తంబకరి (ధాన్యము ౧౩);2: అనామయము, ఆరోగ్యము,కల్యత్వము: చూ,సంతోషము ;వి-ణ.3.రోగముతీఱినది;4.జీవనోపాయముగలది

వార్తాకము. సం.వి. అ. పుం. 1.=వంగ:కర్షవృ, వంగము, వార్త,వార్తాకువు, శాకబిల్వకము, (తె).— వంగ*.తద్వి.—౧.(సం). వృంతాకము, నల్లవంగ, నీరువంగ, నీరెత్తువంగ; ౨: అమ్లగంధకృత్తు, ఉపదంశము, కాకామరిము, కోకాగరిము, గండీరము, సమష్ఠిల- సమష్ఠిల. (తె).— ఏఱువంగ; 3: (సం). కర్తారి. (తె).— కత్తెరవంగ, పెద్దవంగ, మెట్టవంగ; ర: కంటకఫలము. (తె).— ముళ్లవంగ; ౫: కూటవార్తాకి. (తె).— కప్పురపువంగ, కపరిములక; ౬:(తె).—సీమవంగ:(టొమేటో)("చూ,సీమవంగ."); 2: చూ, వార్తికము. 2.

వార్తాకి. సం. వి. ఇ. స్త్రీ. ములక*: చూ, సింహి. 2. [వర్తిని*.

వార్తార. సం. వి. ఆ. స్త్రీ: చూ, సూర్యాను.

వార్తావహుఁడు. సం. వి. అ. పుం. 1. కావడి మోసెడివాఁడు: చూ, భారవాహుఁడు; 2. వృత్తాంతములను తెలిసికొనిపోయి చెప్పువాఁడు: చూ, సందేశహరుఁడు.

వార్తికము. సం. వి. అ. న. 1. ఉక్తానుక్త దురుక్తార్థములను వ్యక్తము చేసెడు గ్రంథము. (వ్యాకరణమునందు వరరుచిచేసిన వార్తిక సూత్రములు.): చూ, సంపుటము. 3; పుం. 2. వార్తాకపక్షి: వార్తాకము, వార్దాకము; అం. 3: చూ,తాళమార్గములు(మార్గప్రాణములు.) [వహుఁడు.2.

వార్తికుఁడు. సం. వి. అ. పుం: చూ, వార్తా

వార్తుఁడు. సం. విణ. 1. రోగము తీఱినవాఁడు: అరోగి, ఉల్లాఘుఁడు, కల్యుఁడు, నిరామయుఁడు; 2. రోగములేనివాఁడు: అరోగి, కల్యుఁడు. [చూ, సుభద్రికుఁడు.

వార్త్రఘ్నుఁడు. సం. వి. అ. పుం. అర్జునుఁడు:

వార్దాకము. సం. వి.అ. పుం: చూ, వార్తికము.2.

వార్ధకము. సం. వి. అ. న. 1. ముదిమి (50 ఏండ్లకు పైఁబడిన యీడు): చూ, స్థావిరము; 2. ముదుసలులగుంపు: చూ, సమూహము.

వార్ధక్యము. సం. వి. అ. న. 1: చూ, వార్ధకము. 1; అం. 2: చూ, అవస్థలు.

వార్ధని. సం. వి. ఇ. న: చూ, రూ—వర్ధని. 1.

వార్ధి. సం. వి. ఇ. పుం. 1: చూ, రూ—వారిధి; 2: చూ, సముద్రము.

వార్ధుషి. సం. విణ: చూ, రూ—వార్ధుషికుఁడు.

వార్ధుషికుఁడు. సం. విణ. వడ్డికిచ్చి జీవనము చేయువాఁడు: కుసీదుఁడు, వృద్ధ్యాజీవి-వృద్ధ్యాజీవుఁడు.

వార్ధ్రి. సం. విణ: చూ, రూ—వర్ధి-వర్ధ్రి.

వార్నిషు. వా. వి: చూ, మెఱుఁగునూనె.

వార్పు. వై. వి: చూ, రూ—వారపు.

వార్మణము. సం.వి.అ.న. వర్మములసమూహము. (వర్మము=కవచము): చూ, వారవారణము.

వార్వపుటగ్గి. ద్వ. వి. (వార్వము+అగ్గి) బడబాగ్ని. య. 1,ఆ.95: చూ,వహ్ని.1-అా.

వార్వము. దే. వి: చూ,రూ-వారువము. కళా. 3, ఆ. 62. [చూ, హసంతి. 2.

వార్షిక. సం. వి. ఆ. స్త్రీ. వానాకాలపుమల్లె*:

వార్షికము. సం. వి. అ. న. 1: కారుజము, కృతత్రాణ, గిరిజానుజ, త్రాణము, త్రాయంతి, త్రాయమాణ, దేవబల, బలభద్రిక, భయనాశని, మంగళ్యము, వార్షికి. (తె): —కలుఁగానుగు-కలుఁగానుగు,కలుక్రాంత.తద్వి.-జత్తిలము.(తె).-కారుమావు-కాఱునువ్వు- కాఱునూవు. (చూ,నువ్వులు.)*; 2. పండితులు లోనగువారికి యేఁటేఁట దాత లొసంగెడి సన్మానము:వర్షాశనము.(తె).-పడితరము; విణ.3. వానకాలమున బుట్టినది; 4.సంవత్సరకాలపరిమితి గలది: చూ, వార్షికము. 2.

వార్షికి. సం. వి. ఈ. స్త్రీ: చూ, వార్షికము. 1.

వాఱంటువిల్లు. దే. వి. (వాఱు+అంటువిల్లు.) జాళ్లపనివారి వాఱుగట్టిన వింటికోల.

వాఱు. వై. వి.=వర్ర(తా. రూ.వారు. సన్నగాఁ గోసినతోలు:చూ,వరత్ర. (దే. అని శ. ర.)

వాఱెన. దే. వి. (వాఱు+ఎన.) 1. నొగతో కాఁడినిఁజేర్చి కట్టెడు వాఱులోనగునది. ఉ, హరి. 3, ఆ. 99: చూ, సూత్రము. 1; 2. ఏఁడికోలతో కాఁడినిచేర్చి కట్టెడు వాఱులోనగునది. శేష.4, ఆ: చూ,సూత్రము.1; 3. ముంగిసమ్రానుతో గడనుచేర్చి కట్టెడు మ్రానులోనగునది: చూ, సూత్రము. 1.

వాఱెనపీఁట. ద్వ. వి. ఏఁడికోలకును కాఁడికిని నడుమ చేరకగానుండెడు కొయ్య.

వాలకము. సం. వి. అ. పుం, న. 1.ఉంగరము: చూ, హవణిక. 2 (భూషణము. 2-౧౭-(౨)); 2. సూడిగము:చూ,హవణిక. 2 (భూషణము. 2-౧౭—(3) (ర).); దే. వి. (1): చూ,వంచన. రామా. 7, ఆ; (2):చూ, వేషము. ప్రభా. 1, ఆ. 51. (నిందయందు వాడుకయని కొందఱు.); వా. (3).రూపు. "వాని వాలకము చూడుము."

వాలకర్కటక న్యాయము. అం. నక్క తన తోఁక పీతకన్నములోఁబెట్టి అదిపట్టుకొనఁగా నీవలకులాగి తినునను రీతి.

వాలధి. సం. వి. ఇ. పుం. ఏనుఁగు గుఱ్ఱములోనగువాని తోఁక: చూ, వాలము. 1.

వాలపాశ్య. సం. వి. ఆ. స్త్రీ. జడబిళ్ల, పాపిటబొట్టు: చూ, హవణిక. 2 (భూషణము. 2-౧౧-(౧).)

వాలము. సం. వి. అ. పుం. 1.=వాలు: పిచ్ఛము-పుచ్ఛము, లలామము, లాంగూలము, లూమము. (తె).—తోంక-తోఁక, మట్ట, లవిటి, వాలు. తద్వి.—౧ ఏనుఁగు గుఱ్ఱములోనగు వాని తోఁకకు.-(సం): వాలధి; ౨. కేశయుక్తమైన తోఁకకు.— (సం): వాలహస్తము; ౩. గుఱ్ఱపుతోఁకకు.-(తె): లవిటి; ౪. పందితోఁకకు.-(సం): ఋషభము, వరాహపుచ్ఛము. (తె): పందితోఁక; ౫. అడవిపంది తోఁకకు.- ఋషభము; ౬. పక్షితోఁకకు.-(తె): లక్రుటి, లావు; ౭. తేలుతోఁకకు.-(తె) కొండియ-కొండె; ౮. యజ్ఞపశువుతోఁకకు.— జాఘని; 2. తలవెండ్రుకకు: చూ, వెండ్రుక; 3.=వాలు. కత్తి: చూ, రిష్టి. 2; వై. వి. (1).=వ్యాళి. రూ-వాలాము. బెబ్బులి. సా. 1, ఆ. 102: చూ, వ్యాఘ్రము.

వాలమృగము. సం. వి. అ. న.=వాలుమెకము. అడవిపంది: చూ, సూకరము.

వాలయించు. దే. అం. క్రి. రూ-వాలాయించు, నిర్బంధించు. భో. 5, ఆ: చూ, సంధించు.

వాలఱుగుడు. ద్వ. వి. (వాలు + అఱుగుడు) చూ, వాలిఁడి.

వాలవామభాగరేఖ. అం: చూ, చిత్రవర్ణములు.

వాలహస్తము. సం. వి. అ. పుం. 1. వెండ్రుకలుగల తోఁక: చూ, వాలము. 1-౨; 2. వెండ్రుకలగుంపు: చూ, వెండ్రుక. 1.

వాలాము. వై. వి.= వ్యాళి: చూ, రూ-వాలము. (1)

వాలాయము. దే. వి. రూ-వాలెము. 1. నిర్బంధము. పా. 3, ఆ, 94: చూ, హఠము. 2; విశ. రూ-వాలెము. 2. తప్పనిసరి. భాగ. 10, స్కం. పూ: భద్రా. 2, ఆ: రూ-వాలెము, పట్టపిడుసు. (సం).-అనివార్యము; 3. నిరంతరము: పాండు. 5, ఆ. 67: చూ, సతతము. 2; క్రి. విశ. 4. అవశ్యము. రామా. 3, ఆ. 67: నెట్టన-నెట్టనము. (సం): అగత్యము, అవశ్యము, భృశము.

వాలాయించు. దే. అ. క్రి. 1. నిర్బంధపడు, చెఱపోవు: చూ, సంధించు; అం. క్రి. 2: చూ, రూ-వాలయించు. భో. 7, ఆ. 352.

వాలారు. ద్వ. విశ. (వాలు + ఆరు) వాలిక, వాడియైనది. పా. 5, ఆ. 46; రామా. 4, ఆ: చూ, శితము. 1.

వాలార్చు. ద్వ. స. క్రి. వేయు: చూ, వైచు. 3.

వాలిఁడి. ద్వ. వి. (వాలు + ఇఁడి) 1. వాలఱుగుడు, తోఁకలేని కోఁతి: చూ, వానరము; విశ. 2. తోఁకలేనిది.

వాలిక. సం. వి. ఆ. స్త్రీ. 1. అంగిటిగుంట: చూ, వావిక; దే. విశ. (1). దీర్ఘము. రామా. 1, ఆ: చూ, సోగ. 3; (2): చూ, వాలారు.

వాలికతూఁపు. దే. వి. వాఁడిబాణము: చూ, హేతి. 4 (బాణము. 1.)

వాలిశుఁడు. సం. వి. అ. పుం: చూ, విష్ణువు. 1.

వాలు. వై. వి. 1.=వాల. కత్తి: చూ, రిష్టి. 2; 2: చూ, వాలిక. (1); 3: చూ, వాఁడిమి. 1; 4: చూ, వాలము. 1; విశ. 5: చూ, వాలిక (1). రామా. 1, ఆ. 122; 6: చూ, వాఁడి. 1. భార. భీష్మ. 2, ఆ; 7. క్రూరము: చూ, సాధ్వసము (రౌరవము. 2.); అ. క్రి. 8. అతిశయించు: చూ, సందడించు; 9. క్రిందికిదిగు; 10. ఒఱగు: చూ, రూ-వ్రాలు. 8; 11: చూ, వంగు; స. క్రి. 12. అతిక్రమించు. భార. శాం. 3, ఆ: మట్టుమిగులు, మట్టుమీఱు, మించు, మిగులు- మివులు (దాఁటు. 6-9.)

వాలుఁగంటి. దే. వి. రూ-వాలుగకంటి-వాల్గంటి. 1. విశాలాక్షి, దీర్ఘములయిన కన్నులుగల యాఁడుది: చూ, స్త్రీ; 2. ఆఁడుది- హరిశ్చ. 3, ఆ. 164: చూ, స్త్రీ.

వాలుఁడు. సం. వి. అ. పుం: చూ, రూ-బాలుఁడు.

వాలుక. సం. వి. ఆ. పుం. 1. ఇసుక: చూ, సికత. 4; వా. 2. వాలుకాయంత్రము (కుండయందిసుకఁబోసి సదుమ మందుంచి వండుట.)

వాలుకము. సం. వి. అ. న. 1. వాలుకమను విషము: చూ, సంగరము. 6; 2. కూఁతురు బుడతు*: చూ, కూరివాలుకము; 3: చెంగలి కోష్టు-చెంగల్వకోష్టు, పారిభాష్యము, వాప్యము-వ్యాప్యము, వారిభవ్యము, వ్యాధి.*

వాలుకాన్యాయము. అం. ఓకానొక న్యాయము.

వాలుకొంగ. ద్వ. వి: చూ, బకము.

వాలుగ. దే. వి. రూ- వాలువ-వాలుగు. ఒక చేఁప: చూ, మత్స్యము. 1; (బ. వాలుగలు.)

వాలుగకంటి. దే. వి: చూ, రూ-వాలుఁగంటి.

వాలుగటెంకి. దే. వి: చూ, వాలుగ.

వాలుగడాలు. దే. వి. మీనకేతనుఁడు: చూ, మన్మథుఁడు. [బొజ్జ.

వాలుగడుపు. ద్వ. వి. రూ-వాల్గడుపు: చూ,

వాలుగసొము. దే. వి: చూ, వాలుగ.

వాలుగు. దే. వి: చూ, రూ-వాలుగ.

వాలుచే. దే. క్రి. రూ-వాల్చు. వాలఁజేయు.

వాలుచేక్కు. ద్వ. వి: చూ, రాహువు. 2.

వాలుచూపు. ద్వ.వి.ఓరచూపు: చూ,వీక్షణము.

వాలుదు. దే. వి: చూ, వాతారి.* పంచ. వేం. 1, ఆ. 888.

వాలుపు. దే. వి. రూ-వాల్పు- వాల్చుట.

వాలుబొద్దు. ద్వ. వి: చూ, లేఁబొద్దు.

వాలుమగఁడు. ద్వ. విణ: చూ, శూరుఁడు. పంచ. వేం. 3, ఆ. 38.

వాలుమెకము. వై. వి.=వాలమృగ, అడవిపంది. అం, భా. ద్వి, కాం. 82: చూ, సూకరము.

వాలుమెఱ్గ. వా. వి: పిల్లమిరియము, పిల్లమెఱము, పిల్లేరుగంతు, మెఱము, మెఱ్గ, లాఁగు. (సం).— లంఘనము.

వాలురమ్మ. వై. వి: చూ, రూ-వాఁడి. 1.

వాలువ. దే. వి: చూ, రూ- వాలుగ. పంచ. వేం. 4, ఆ. 133. [రంచే. 3.

వాలూరు. దే. అ. క్రి. ఆలస్యమగు: చూ, విచ

వాలెము. దే. వి,విణ: చూ, రూ-వాలాయము. (నిరంతరమునకు.- అచ్చ యు, కాం. 259; అవశ్యమునకు.- అచ్చ. కిష్కిం, కాం.83.)

వాలోపచీతము. సం. వి అ. పుం. పంచావటము: చూ, ఉరస్కటము (చూ, వస్త్రము.)

వాల్కము. సం. విణ. నారచీర: చూ,వస్త్రము.

వాల్గంటి. ద్వ. వి: చూ, రూ-వాలుఁగంటి.

వాల్గడుపు. ద్వ. వి: చూ, రూ-వాలుగడుపు.

వాల్చు. దే. క్రి: చూ, రూ-వాలుచే.

వాల్పు. దే. క్రి: చూ, రూ-వాలుపు.

వాల్మికము. సం. వి. అ. న.ఇంద్రధనుస్సు: చూ, హేతి. 4 (బాణము. 1.)

వాల్మికి. సం. వి. ఇ. పుం: చూ, రూ-వాల్మీకి.

వాల్మికుఁడు. సం. వి. అ. పుం. —పై.—

వాల్మీకి. సం. వి. ఇ. పుం. సంస్కృత రామాయణమును రచించిన మహర్షి: ప్రాచేతసి, వాల్మికి-వాల్మీకి-వాల్మీకుఁడు.

వాల్మీకుఁడు. సం. వి. అ. పుం. —పై.—

వాల్మీకిబ్రాహ్మణులు. అం: చూ, ఘూర్జర బ్రాహ్మణులు 2118 పుట. (ఋగ్వేదులును యజుర్వేదులును కలరు): చూ, బ్రాహ్మణులు.

వాల్లభ్యము. సం. వి. అ. న. దొరతనము: చూ, స్వారాజ్యము.

వావదూకుఁడు. సం. విణ. పిరికితనము లేక యుక్తియుక్తముగా మాటలాడువాఁడు: చూ, వక్త. 1.

వావాదు. వై. వి: (సం).— ఉపన్యాసము, ఉపోద్ఘాతము, ఊ, వాఙ్ముఖము.

వావి. దే. వి. బంధుత్వము. భాగ. 10, స్కం.- పూ: చూ, సంబంధము.

వావింట. దే. వి: చూ, రూ-వాయింట*.

వావిక. దే. వి. కస్తూరి మొదటగలగుంట: అంగి టి గుంట- అంగిలిగుంట, అంగిటిముల్లు, కామగుంట. (సం).—గళగర్తము, వాలిక. (చూ, మెడ.)

వావిరి. దే. వి. 1, క్రమము: చూ, విధము.1; 2. అనుగతి. భో. 5, ఆ. 240: చూ, వెంబ డి; 3. ఉత్కర్షము:చూ,హెచ్చు. 2; విశే. 4. అధికము: చూ, హేరాళము; 5. అను గతము: చూ, వెంబడి; 6. ఉత్కృష్టము. నిర్వ. 4, ఆ. 10: చూ, శ్రేష్ఠ్యము.

వావిలి. దే. వి. (వాతమునుహరించునది.): (సం).- ఇంద్రసురసము, ఇంద్రాణి- ఇంద్రాణిక, నిర్గుండి, సింధుకము, సిందువారము. తద్వి.- ఁ: నల్లవావిలి. (సం).— కపిక, నిర్గుండి, నీలిక, శేఫాలిక, సువహ; ౨: తెల్లవావిలి, ఫుల్లవావిలి.(సం).—భూతవేశి, శ్వేతసురస. ("చూ, సువహ. 4.")

వావురము. దే. వి.(రూ-వాయువము- వార్వము- వారము.)గుఱ్ఱము. రా, వి. 1, ఆ. 71:చూ, హయము. (దీనికి సరియైన ప్రయోగము చిక్కినది గాదు.)

వావృత్తము. సం. విశే. వరింపఁబడినది.

వాశకము,సం.వి.అ.పుం. (రూ-వాసకము-వాస ము-వాశము)అడ్డసరము*:చూ,వైద్యమాత.

వాశము. సం. వి. అ. పుం. —పై.—

వాశి. సం. వి. ఈ. స్త్రీ: రూ-వాసి. బాడా సువు, తక్షణి. (తె).— బాడిత-బాడిద- బాడిస- బాడిసె. తద్వి.— (తె).— పెద్ద బాడిసె.

వాశిత. సం.వి. ఆ. స్త్రీ. రూ-వాసిత. 1.ఆఁడే నుఁగు: చూ, హస్తి; 2. ఆఁడుది:చూ,స్త్రీ.

వాశితము. సం. వి. అ. న. రూ-వాసితము. 1. మృగపక్షిధ్వని: చూ, స్వరము. 2; విశే. రూ-వాసితము. 2. వాసన కట్టఁబడినది; 3. వాసనకట్టినది. [వెదుర

వాస. దే.వి.రూ-వాసము. అని. 1,ఆ. 48:చూ

వాసంతము. సం. వి. అ. పుం. 1: చూ, లొట్ట పిట్ట; 2. కోయిల: చూ, సాఁకుడుపులుఁగు 3. తెమ్మెర: చూ, వాయువు. 1-ర-(౨) విశే. 4. ఉంచఁబడినది: చూ,వ్యాఘము. 2 5. వసంత సంబంధమైనది.

వాసంతి. సం. వి. ఈ. స్త్రీ. 1. అడవిమొల్ల* చూ, వసంతి. 2; 2. పువ్వులగురివెంద* చూ, స్యందనము; 3. బట్టకడిమి*: చూ హలిప్రియము.

వాసంతికుఁడు. సం. విశే: చూ, హాస్యగాఁడు

వాసకము. సం. వి. అ. పుం. 1. ఇల్లు: చూ సదనము. 1; 2: చూ, రూ-వాశకము* 3: కసవోత్పాటనము*.

వాసకసజ్జిక. అం. (రూ-వాసవసజ్జిక.) ("క్లో ప్రియాగమన వేళాయాం మండయంతీవ హుర్ముహుః। కేళీ గృహం తథాత్మాన పాస్యాద్వాసక సజ్జికా") పతివచ్చువేళ తయుసాదులలంకరించునది:చూ, నాయికల

వాసగృహము. సం. వి. అ. న. 1. పడకిల్లు భోగగృహము: చూ, సదనము. 1; వ 2.కాఁపురముండెడి యిల్లు:చూ, సదనము.

వాసన. సం. వి. ఆ. స్త్రీ. 1: ఆమోదము, గ ధము, చందనము, పరిమళము- పరిమళవ బలము, మలయజము, శ్రీఖండము, శ్రీగం ము, సువాసన, సౌగంధ్యము, సౌరభవ (తె).—కడి,కమ్మన, గుమగుమ, తావి, ప పొలపము,మలాక,వలపు, పిరిగందము.తద్వి షములు.-ఁ.(తె):-కమరు; ౨: కాలసారవ తైలపర్ణి,పీతచందనము,వర్ణకము;3: కుచంద ము,కుకిదము,క్షుద్రచందనము,తిలపర్ణి,పత్ర గము,రంజనము,రక్తచందనము, లోహితవ (తె).—ఎఱ్ఱగందము (చూ, కాష్ఠార్ద్రము

౪: కుణపము- కుణపి, దుర్గంధము, పూతిగంధము. (తె).— కంపు, కలము, గదురు, గబ్బు, గవులు-గౌలు, చెడుకంపు, పుస్తు, బూజో, విస్తు, వేదు; ౫: కుష్ఠము, లోహితము; ౬: కృష్ణతామ్రము, గోశీర్షము, హరిచందనము; ౭: కృత్రిమధూపకము, వృకధూపము; ౮: కైరాతము, గంధకాష్ఠము, శంబరచందనము; ౯:(తె):-గత్తు-గొత్తు; ౧౦: (తె):- గాలి; ౧౧. ఘ్రాణతర్పణమను గంధ ద్రవ్యమునకు.- (చూ, రాజార్హము.); ౧౨: పరిమళము; ౧౩. (తె):-పొల; ౧౪: ముఖవాసన; ౧౫: వికటగంధము. (తె):-కనరు, చేఁదు, వెగటు, వేము; ౧౬: (చూ, వర్తి. 4); ౧౭: (చూ,సుగంధము. 4); (విణ.) ౧౮: ఆఘ్రాతము, ఘ్రాణము, ఘ్రాతము; ౧౯: ఇష్టగంధము, క్షీవణ్యావు, ఘ్రాణతర్పణము, సుగంధి, సురభి; ౨౦: కటువు, కషాయము, గంధిలము ("చూ, సుగంధము. 5.); 2. రూ-వాసనము. ముందనుభవించెదానిఁదలఁచుట; 3. ప్రత్యా: చూ, వాంఛ. [వర్తి. 1-౨.

వాసనకొడుపు. మి.వి. పెద్దయూఁదువర్తి: చూ,

వాసనము. సం. వి. అ. న. 1. వాసనకట్టుట; 2: చూ, వస్త్రము; 3: చూ, వీరాసనము. 1; విణ. 4. వసన సంబంధమైనది.

వాసనమొలక. వా. వి. మరువము. (సం). ఇంద్రిమరువకము: చూ, రాజార్హము. 2-3౦.

వాసనరాజనాలు. అం: చూ, ధాన్యము.

వాసనలు. అం: దేహము,శాస్త్రము, తీర్థనలు(3)

వాసపుచ్చు. వా. అ. క్రి. వాసాలుపటుత్రు: వాసపోయు. [3, ఆ. 40.

వాసపోయు. దే. అ. క్రి. —పై.— రా, వి.

వాసము. సం. వి. స్. న. రూ-వసనము- వాసన్ను. 1: చూ, వస్త్రము; 2. శోక: చూ, వస్త్రము; అ. పుం. 3.—జన. ఇల్లు: చూ, సదనము. 1; 4. అష్టపగము*: చూ, వైద్యమాత; 5. కాఁపురము: చూ, స్థానము. 1; 6. చోటు: చూ, స్థానము. 1; అం. 7: చూ, సుషిరవాద్యములు; దే. వి. (1): చూ, రూ-వాస. రా, వి. 3, ఆ. 40.

వాసయోగము. సం. వి. అ. పుం. గంధపొడి: చూ, సురము (బుక్కా.)

వాసయోగ్యము.సం.విణ.కాఁపురమునకుఁదగినది.

వాసరము. సం. వి. అ. పుం, న: అహము-అహస్సు, అయత్తి, ఘస్రము, దినము-దివము- దివసము. (తె).- పగలు, పొద్దు. (చూ, రోజు.). తద్విశేషములు.- ౧. పగలునకు.- దినము. (తె).- నిచ్చ- నిచ్చలు, పగలు-పవలు; ౨. నడిచే పగలుకు.-అద్య; 3. పట్టుపగలుకు.- ఉద్దినము, కుతపము, మధ్యాహ్నము. (తె).-పగలు-పవలు, పట్టపగలు, మిడసరలగ్గము, (మి) మట్టమధ్యాహ్నము, మిట్టమధ్యాహ్నము; ౪: అపరేద్యువు. (తె):-నిన్న; ౫: (తె):-మొన్న; ౬: దినదినము, ప్రతిదినము, ప్రత్యహము; ౭. పగలు రాత్రి కలిసినకాలము:-దినము; ౮. ఇంగ్లీషుతారీఖునకు.- దినము (డేటు); ౯. సౌరమాసపు దినమునకు.- తేది, దినము; ౧౦: తద్దినము, దినము, ప్రత్యాబ్దికము. ("చూ, రోజు."); ౧౧: (చూ, రేపకడ); ౧౨: (చూ, ఎల్లుండి.); ౧౩: (చూ, అవలినాఁడు); ౧౪: (చూ, అటుమొన్న); ౧౫: (చూ, కాలములు); ౧౬: (చూ, సంధ్యోపాసన); (౧) దినముయొక్క భాగములు:-

౧: రౌద్రము; ౨: శ్వేతము; 3: మైత్రము; ౪: శారభటము; ౫: సావిత్రము; ౬: విజయ-విజయము; ౭: గాంధర్వము; ౮: కుతపము; ౯: రౌహిణేయము; ౧౦: విరించము;

౧౧: సోమము; ౧౨: నిర్పృతి; ౧౩: మాహేంద్రము; ౧౪: వరుణము; ౧౫: భటము; ౧౬: ఉత్తమాహము,సుదినము; ౧౭: పూర్వాహ్ణము. (తె) లేఁబగలు; ౧౮. త్రికాలములు:- ప్రాహ్ణము, అపరాహ్ణము, పూర్వాహ్ణము; ౧౯. దినము మూఁడుభాగములైనపుడు కడపటిభాగము:-అపరాహ్ణము; ౨౦. ఉదయాదిపది గంటలవఱకు.-ప్రాహ్ణము. (తె). లేఁబగలు; ("చూ, హరివాసరము.")

వాసవదత్త. అం. (ఈ గ్రంథము సుబంధుఁడు వ్రాసెను): చూ, కావ్యనాటకములు.

వాసవసజ్జిక. అం: చూ, రూ-వాసకసజ్జిక.

వాసవుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రుఁడు: చూ,సహస్రాక్షుఁడు.

వాసస్థానము. సం. వి. అ. న:చూ,వీడుపట్టు.3.

వాసి. సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, రూ-వాశి; దే. వి. (1) తారతమ్యము: చూ, వేఱుపాటు. 1; (2) భేదము. కళా. 5, అ. 54: చూ, వేఱుపాటు. 1; (3) ఆధిక్యము: చూ, హెచ్చు. 2; (4): చూ, లాభము. 1; (5) ప్రసిద్ధి. భాగ. 2, స్కం. 123: చూ, సంభావన. 3; (6) మితి: మాత్ర-మాత్రము: చూ, పరిమితి; విశ. (7): చూ, పొడగరి; (8) దీర్ఘము: చూ, పొడవు.2; (9)ఉత్కృష్టము:చూ, పేరాళము; (10): చూ,స్వస్థము;(11)క్షేమము:చూ,శుభము.1; (12) ఆరోగ్యము: చూ, సవ్యము. 1; (13) బాగు: చూ, సౌందర్యము.

వాసించే. సం. అ. క్రి. 1: చూ, రూ-వసించే, స. క్రి. 2. వాసనకట్టు. కళా. 7, అ. 80: పరిగొను, పసిబట్టు.

వాసిక. సం. వి. అ. స్త్రీ: చూ, వాశకము *.

వాసికెక్కినవాఁడు. వా. విశ: చూ, వాసైన వాఁడు.

వాసిగోత్రిలు. వై. వి.=వంశి. రూ-వాసెగోత్రిలు. (ద్వ అని శ.ర) మురళి: చూ, వీణ. 1.

వాసిత. సం. వి. అ. స్త్రీ: చూ, రూ-వాశిత.

వాసితము. సం. వి. అ. న, విశ: చూ, రూ-వాశితము. [(రూ-వాసె.)

వాసియ. వై. వి.=వంశి: చూ, వాసిగోత్రిలు.

వాసుకము. సం. వి. అ. న: చూ, వైకుంఠము.

వాసుకి. సం. వి. ఇ. పుం. ఒకసర్పరాజు: చూ, సర్పము.

వాసుదేవాయనమః. అం: చూ, ఓమ్. (వాసుదేవః=సర్వత్రాసౌ వసత్యాత్మ రూపేణ, విశ్వంభరత్వాదితి.)

వాసుదేవుఁడు. సం. వి. అ. పుం. వసుదేవుని కొడుకు, కృష్ణుఁడు: చూ, విష్ణువు. 1.

వాసువు. సం. వి. ఊ. స్త్రీ. 1. నాట్యపరిభాషయందు బాలిక; ఉ. పుం. 2: చూ, వాసుదేవుఁడు.

వాసె. వై. వి. 1.=వంశి: చూ, రూ-వాసియ. య. 4, ఆ. 12; 2.=వైశ్య. కోమటి: చూ, వైశ్యుఁడు. [వాసిగోత్రిలు.

వాసెగోత్రిలు. వై. వి.=వంశి: చూ, రూ-

వాసెత. వై. వి.=వైశ్య. కోమటిది: చూ, వైశ్య. 1 (భార్య.)

వాసెన. వై. వి.=వాసన్. వాసిన. అవిరిపోక యొసటి కుండమూతి మూసికట్టినగుడ్డ: చూ, వస్త్రము. [పా. 1, ఆ. 89.

వాసెనకట్టు. ద్వ. వి. వాసెనగుడ్డకట్టువంటికట్టు.

వాసెనకుడుము. ద్వ. వి. 1: చూ, భక్ష్యము; వా. 2. పిట్టు: చూ, సాదము. (1)

వాసెనపోలె. వా. వి.—పై — [వాఁడు.

వాసైనవాఁడు. వా. విశ: చూ, వాసికెక్కిన

వాస్తగాయిబ్రాహ్మణులు. అం: చూ, నేపాళదేశపుబ్రాహ్మణులు.

వాస్తవము. సం. వి. అ. న: చూ, సత్యము. 1.

వాస్తవికము. సం. విణ: చూ, సమంజసము. 2.

వాస్తవ్యము. సం. విణ. 1. వసింపఁదగినది; వా. 2: చూ, వాస్తవికము.

వాస్తవ్యుఁడు. సం. వి. అ. పుం. 1. గృహస్థుఁడు. స్వా. 1, అ. 66: చూ, స్వామి. 1. (యజమానుఁడు. 1.); వా. 2. కాఁపురమున్నవాఁడు. "కరపవాస్తవ్యుఁడు"

వాస్తుకము. సం. వి. అ. న. 1: రూ-వాస్తూకము, చక్రవర్త-చక్రవర్తము-చక్రవర్తిని, రామము*; పుం. 2. చేల్లుట: చూ, సంప్రోక్షణము. 1; 3. పొర్లాడుట: చూ, విలుంఠనము (చూ, లుంఠనము. 1)

వాస్తుకుఁడు. సం. వి.అ.పుం. వాస్తుపురుషుఁడు.

వాస్తుపతి. సం. వి. ఇ. పుం. రూ-వాస్తోష్పతి. ఇంద్రుఁడు: చూ, సహస్రాక్షుఁడు.

వాస్తువు. సం. వి. ఉ. పుం, న. 1. ఇండ్లు మొదలైనవి యేర్పఱుపఁదగిన నేల: చూ, హరిప్రియ. 1 (భూమి. 1.); 2. ఇల్లు: చూ, సదనము. 1; 3: చూ, వాస్తుశాస్త్రము.

వాస్తుశాస్త్రము. అం. 1: చూ, శాస్త్రములు. (గృహములు, సౌధములు, దేవాలయములు నిర్మించుటకు యుక్తాయుక్తములఁ దెలియఁజేయునది. అవాంతరము శల్యవాస్తు ఇంటిలో నేదిక్కున నేశల్యములుగలిగినది తెలియఁజేయునది); 2: చూ, ఏకాదశ వర్గగణితము; 3: చూ, కళలు.

వాస్తైనవాఁడు. మి. వి: చూ, విశ్రుతుఁడు.

వాస్తోష్పతి. సం. వి. ఇ. పుం: చూ, రూ— వాస్తుపతి.

వాస్త్రము. సం. విణ. 1. వస్త్రముచేతఁ గప్పఁబడినది (రథము); 2. వస్త్రసంబంధమైనది.

వాహకుఁడు. సం. వి. అ. పుం: చూ, సాది. 1.

వాహద్విషము. సం. వి. ష్. పుం. ఎనుపోతు: చూ, మహిషము.

వాహనపదము. అం: చూ, ఆరూఢము.

వాహనము. సం. వి. అ. న. 1. ఎక్కఁదగినదై యేనుఁగులోనగునది: ధోరణము, పత్రము, యానము, యుగ్యము, వాహ్యము. (తె).— ఎకిరింత-ఎక్కిరింత-ఎక్కుడు; అం. 2: చూ, భావములు: (జ) 3. చూ, ఐశ్వర్యములు, (అష్టైశ్వర్యములు)

వాహనములు. అం: చూ, ఐశ్వర్యములు.

వాహము. సం. వి. అ. పుం. 1 గుఱ్ఱము: చూ, హయము; 2. ఎద్దు: చూ, వృషభము. 1: 3. భుజము: చూ, స్కంధము. 1; 4: చూ, వాయువు; 5: (తె) ఇరప-ఇరుస; ఇరుసదిప్పుట్లు (అని కొందఱు) (చూ, ప్రస్థము.)

వాహసము. సం. వి. అ. పుం. 1. పెనుఁబాము: చూ, సర్పము; 2. తూముకాలువ: ఉచ్ఛ్వాసము, ఉపవాహము, కుల్య, జలనిర్గమము, జలాంచలము, జలోచ్ఛ్వాసము, పరీవాహము, ప్రణాళి-ప్రణాళిక-ప్రణాళము, భ్రమము, వర్తరూకము. (తె).— అలుగ—అలుగు-అల్గు-అలువు, ఒప్పరము, ఓపిక, కలుఁజో, జేలదారి, జోలారి, తూపరాణ—తూపరాణి—తూప్రరాణి, తూము, తూర, దొన, దొరుగండి, దోని, నీరుగండి, మరిగొమ్మ, వరవ. (చూ, నది. (౧౧) (౧౨); చూ, శౌరిదివి.); 3. నీరుచెంపేలిక: చూ, సునిషణ్ణకము. [సంసక్తము.

వాహితము. సం. విణ. వహింపఁబడినది: చూ,

వాహిత్థము. సం. వి. అ. న. ఏనుఁగుయొక్క వాతకుంభము క్రిందిచోటు: చూ, హస్తి.

వాహిని. సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకానొకనది: చూ, శౌరిదివి. 2 (నది.); 2: చూ, సేన. 1; 3. సేనావిశేషము (ఎనుబదియొక్క రథము అన్ని యేనుఁగులు ఇన్నూటనలుబదిమూఁడు గుఱ్ఱములు నన్నూట యేవురుకాల్బంట్లును

గలది): చూ, సేన. 1; వై. వి. (1)=వాక్.
వాగ్ధోరణి: చూ, శబ్దము. 2.

వాహినీపతి. సం. వి. ఇ. పుం. 1. సేనానాయకుఁడు: చూ, సైనికుఁడు; 2: చూ, సముద్రుఁడు.

వాహ్యము. సం. వి. అ. న. 1: చూ, వాహనము. 1; విణ. 2. వహింపఁదగినది. [స్వారి.

వాహ్యాళి. సం. వి. ఇ. స్త్రీ.=వయాళి: చూ,

వాళి. దే. వి. 1. పసులుపోవుదారి: చూ, మార్గము. 1-౭; 2. వాడుక. రూ-వాళీ. "ఈ దారినిపోవుట వాళియైనది.": చూ, పతను; వా. 3. క్రమము: చూ, విధము. 1.

వాళీ. వా. వి: చూ, రూ-వాళి. 2.

## వి

వి. ఉప. 1. (౧. వికచము.=ఇచేట 'వి' అనునది ధాత్వర్థమును వికసించే అను నర్థమునకు మార్చినది; ౨. వికాలము, విశంకటము.=ఈరెండుచోటుల 'వి' అనునది కాల, శంకట అను తద్ధిత ప్రత్యయములతోఁగూడినది; ౩. వికత్థనము.=ఇచేటనిరర్థకము; ౪. వికాచము. ఇచేటధాత్వర్థమును వికృతి అను నర్థమునకు మార్చినది; ౫. వికిరము.=ఇచేట ధాత్వర్థమును గజకుంభాద్యర్థము కలదిగా మార్చినది. ఇత్యాది.); సం. వి. ఇ. పుం. 2. ఒకపక్షి: చూ, విహంగము; 3. కన్ను: చూ, సింగనాదము (లోచనము.); 4: చూ, సురవర్త్మము; 5: చూ, వాయువు; 6: చూ, హంసుఁడు; అవ్య. 7. అతిశయము: చూ, హెచ్చు. 2; 8: వలదు; 9. వేఱుగాసెంచుట; 10: కదలుట: చూ, చలనము; దే. అవ. (1). 'ది' అనుదానికి బహువచనము: చూ, ది.

వింఖము. సం. వి. అ. న: ఖురము, పుటము, రింఖ, వర్తకము, శఫము. (తె)— గిట్ట, గొరిజె, గొరిజయ-గొరిజె-గొరిసె, డెక్క. తద్విశే—౧. ఆవుడెక్క.- గోకంటకము; ౨. గుఱ్ఱపుడెక్క.- (తె) గెట్టె.

వింగడము. వై. విణ. 1: చూ, విస్తీరము. 1; 2. సుందరము: చూ, సౌందర్యము; 3.=వ్యంగ్య: చూ, వ్యత్యయము. విజ. 2, ఆ. 71. 4: చూ, వేఱుపాటు.

వింగడించే. వై. స. క్రి: చూ, విభజించే.

వింజామర. వై. వి.=వింధ్య. రూ-వింజామరము. (వెల్ల + చామర) తెల్లనిచామరము, వీచోపు. ప్రకీర్ణము: చూ, సురఁటి (మిశ్రమనిశ.ర.)

వింజామరము. వై. వి.=-పై.-(మిశ్రమనిశ.ర)

వింజిలి. దే. వి: చూ, మత్స్యము. 1.

వింజేము. వై. వి.=వింధ్య. వింధ్యపర్వతము: చూ, హిమాలయము (పర్వతము.)

వింట. దే. వి. వినుట: చూ, శ్రవణము. 2.

వింటాలము. అం: (రూ-వింటేశము): చూ, విన్నాణములు.

వింటికోల. దే. వి. (విల్లు + కోల) తాళ్లపని వానియొక్క ధనురాకారమైన పనిముట్టు.

వింటినడుము. వా. వి: చూ, లస్తకము.

వింటిపట్టు. దే. వి. (విల్లు + పట్టు): అమ్ము వేటు నేల. (సం).—ధన్వంతరము.

వింటిబద్ద. వా. వి. 1. గిలకలబద్ద; 2. పిట్టలఁగొట్టు బద్ద; 3. విల్లు.

వింటిపసి. దే. వి. కామధేనువు: చూ, ధేనువు.

వింటిరాసి. ద్వ. వి. (విల్లు + రాసి) ధనూరాశి: చూ, రాసులు. ౯.

వింటివాఁడు. దే. విణ: చూ, విలుకాఁడు.

వింటేశము. అం: చూ, రూ-వింటాలము.

వింత. దే. వి. 1: అక్కజము, అచ్చెరియము-అచ్చెరువు-అచ్చెరుపాటు-అచ్చెరువుపాటు, అబ్బురపాటు-అబ్రపాటు-అబ్బురము-అబ్బురము-అబ్రము, అరిది-అరుదు, చిట్ర, చిత్తరువు, చోద్యము, టంకారము, తటకాపాటు-తటుకుపాటు, నివ్వెర-నివ్వెఱ-నివ్వెఱఁగు-నివ్వెఱపాటు, విస్మయము, వెగడు, వెరఁ

ఘ-వెఱ-వెఱఁగు, సోదము - సోద్దము. (సం.ప.).—అద్భుతము, ఆశ్చర్యము, ఇంగము, క, కుతూహలము, చిత్రము, టంకారము, విచిత్రము, విస్మయము, వీక్ష్యము, వ్యళీకము, స్మయము. (అవ్య.) - అహో, కినము, ఆ, ఇ, హీ. (విశే.) ఆశ్చర్యకరమైనది.-అద్భుతము, చిత్రము, విచిత్రము, వీక్ష్యము, శోభ్యము, చోద్యము. (తె) - విసుమానము, సోదము-సోద్దము. (అవ్య).- ఆశ్చర్యార్థకమునందు.-(తె. ప):—అక్కు, అగుఁగదె-అగుఁగదే- అవుఁగదె-అవుఁగదే, ఔఁగదె-ఔఁగదే, అగుర-అగురా - అవుర-అవురా-ఔర-ఔరా, అటె- అటే- అటో - అటో - అట్టె - అట్టే, అదిర - అదిరా - అద్దిర - అద్దిరా- అన్నన్న-అన్నా, అప్ప-అప్పా, అమ్మ- అమ్మకచెల్ల-అమ్మచెల్ల, అమ్మక్కు, అమ్మరో-అమ్మరో, అయారె- అయారే-అయ్యారె-అయ్యరే- అయ్యారె- అయ్యారే, అహహ-అహహా- అహో- అహోరె- అహోరే- ఆహాహ- ఆహాహా-ఆహోహ- ఆహోహో- ఆహో, ఆ,ఓహో-ఓహోహో-హో. (మిగతవానికి "చూ,హో. 2.;); విశే. 2: చూ, క్రొత్త 2; 3. అవ్యము: చూ, వేఱు. 2.

వింతరాలు. దే. విశే. (వింత+ఆలు) అన్యురాలు. భాగ. 6, స్కం. 255: చూ, స్త్రీ.

వింతవాడు. దే. విశే: చూ, వేఱయినవాఁడు. కాశీ. 2, ఆ. 80.

వింతోక్తి. అం: చూ, అలంకారము. 3.

విందు. దే. వి. 1. మనుష్య యజ్ఞము; 2: ఆమెత, పబ్బము. (సం).— అతిథిక్రియ, అతిథిపూజ, అతిథి సత్కారము, ఆతిథేయము, ఆతిథ్యము. తద్వి.— అల్లియము- అల్లెము, మనుఁగుడుపు; 3. చేట్టములు లోనగువారికి పెట్టెడు భోజనము. జై. 8, ఆ. 197: చూ, సాపాటు; 4 విందునకు పిలువఁబడినవాఁడు: (సం) —అతిథి, ఆతిథ్యుఁడు, ఆవేశికుఁడు, కుతపుఁడు, గృహాగతుఁడు, గోఘ్నుఁడు. తద్వి.- పరదేశమునుండి వచ్చినవానికి.-అరదేసి-అరిదేసి, పరిదేసి. (సం)..ఆగంతుకుఁడు- ఆగంతువు, అభ్యాగతి-అభ్యాగతుఁడు, పరదేశి; హి. 6: మేజోవాణి-మేజోవాని.

విందుపురుగు. ద్వ. వి. ఒకానొక సాలెపురుగు. చూ, సాలెపురుగు.

విందువు. సం. విశే. (ఈ. ఊ. ఉ.) తెలియువాఁడు: చూ, విద్వాంసుఁడు.

విన్ధ్య. సం. వి. ఆ. స్త్రీ. 1. లవలి*: చూ. వృక్షము; 2=వింజేము. రూ_ విన్ధ్యము: చూ, వింజేము. [డు: చూ, సన్యాసి.

విన్ధ్యకూటుఁడు. సం. వి. అ. పుం. అగస్త్యు

విన్ధ్యము. సం. వి. అ. పుం.=వింజేము. 1: చూ, వింజేము; అం. 2: చూ, కులపర్వతములు. (పర్వతము.)

విన్ధ్యుఁడు. సం. వి. అ. పుం. బోయ. చూ, వ్యాధుఁడు. 1. [ఇరువది సంఖ్యగలవి.

వింశతి. సం. స. 1: చూ, ఇరువది; విశే. 2.

వింశతి విగ్రహములు. అం. (విగ్రహములు): రాజ్యము, స్త్రీ, స్థానము, దేశము, జ్ఞాపము, ధనాపహారము, పంచనము, మానము, విషయపీడ, జ్ఞానార్థము, ప్రభుశక్తి, మంత్రశక్తి, ఉత్సాహశక్తి, దైవము, మిత్రుఁడు, అవమానము, బంధువినాశము, భూతానుగ్రహ విచ్ఛేదము, మండల దూషణము, ఏకార్థాభినివేశము (20) (ఈ చెప్పిన పదార్థములన్నియు మొదట నొక్క సమూహమునకు సాధారణలక్షణమును, తరువాత విశేషలక్షణమును, అవాంతరభేదములును, ఏమిట దేనివలన నేదిపుట్టినదో అట్టి కార్యకారణభావములను, వాని వినియోగక్రమములను సాంగముగ బోధించేదేన్నవి.)

వింశము. సం. విశే. ఇరువదవది.

వింశాంశ. అం: చూ, షోడశవర్గ. (లగ్నమును ఇరువది సమభాగములు చేయుటకే వింశాంశ యని పేరు. వింశాంశ కనుఁగొనవలసిన గ్రహ మే రాశి యం దెన్నవభాగమందున్నదో కనుఁగొనవలెను. అట్టి గ్రహమున్న రాశి చర రాశియైనయెడల మేషాదిగను, స్థిర రాశియైన యెడల ధనురాదిగను, ద్విస్వభావరాశియైన యెడల సింహాదిగను బయినఁజెప్పినవిధమున నాగ్రహ మెన్నవభాగమందున్నదనిఁ గనుఁగొనఁబడెనో యన్నవరాసి వింశాంశ యనఁబడును. ఆరాశ్యధిపతి వింశాంశాధిపతి యగును.)

వికంకతము. సం. వి. అ. పుం. 1: అగ్నివృక్షము, కంటపత్రము, కంటపాదము, కాకనాసము, కాకపాదము, కింకిణి, కింకిరి, గోపకంటకము, వికంటకము. (తె) కానరేఁగు, ములువెలమ*. (చూ, రేఁగు. 1.) (చూ, స్వాదుఫల. 8.); 2. పుల్లవెలఁగ*: చూ, ములువెలఁగ.

వికంటకము. సం. వి. అ. పుం. 1-2. పై.-; 3. తీఁటకసింద*: చూ, సముదాంత.

వికచము. సం. వి. అ. పుం. 1. కేతువు: చూ, స్వర్భానువు (రాహువు 2); విశే. 2. వికసించినది: చూ, వ్యాకోచము; 3. వెండ్రుకలు లేనిది.

వికట. సం. వి. ఆ. స్త్రీ. 1. వజ్రవారాహియను దేవత; విశే. 2. మిక్కిలి వంకరైనది: చూ, వేల్లితము. 3; 3 వికృతియైనది: చూ, వికృతి. 3; 4: చూ, సౌందర్యము; 5, పెక్కైనది: వికటము.

వికటకవి. సం. వి. ఇ. పుం: హాస్యకరుఁడు.

వికటము. సం. విశే. 1: చూ, వికట. 2; 2: చూ, వికట. 3; 3: చూ, వ్యత్యయము; 4: చూ, వికట. 5. [వికటించెను."

వికటించె. సం. అ. క్రి. ఎదురుతిరుగు. "మందు

వికత్థనము. సం. వి. అ. న: చూ, స్తోత్రము.

వికము. సం. వి. అ. పుం. 1. కాకి: చూ, సకృత్ప్రజము; 2. వికసించుట.

వికర్తనుఁడు. సం. వి. అ. పుం: చూ, సూర్యుఁడు.

వికర్మికుఁడు. సం. వి. అ. పుం: చూ, హట్టాధ్యక్షుఁడు.

వికర్షణము. అం: చూ, హస్తక్రియలు.

వికర్షము సం. వి. అ. న: చూ, బాణము. 1.

వికలమగు. మి. అ. క్రి: చూ, వైకల్యమగు.

వికలము. సం. విశే: చూ, వైకల్యము.

వికలాంగుఁడు. సం. విశే: అంగహీనుఁడు, అంగవికలుఁడు, అపోగండఁడు-అపోగండుఁడు, పోగండుఁడు. (తె).- అవిటి, అవిడి, లేవఁజాలనివాఁడు: (చూ, నూరసనూతుఁడు)

వికలావస్థ. అం: చూ, అవస్థలు. 5 (అస్తంగతుఁడైన గ్రహము వికలావస్థనుబొందును = రోగము, శత్రువృద్ధి కలుగును.)

వికల్పము. సం. వి. అ. పుం. 1. భ్రాంతి: చూ, విభ్రమము. 1; 2. మాఱుదల: చూ, వ్యత్యయము; 3 అవాంతరకల్పము: చూ, కల్పము. 6; అం. 4: చూ, అలంకారము. 3. (సమానబలములకు విరోధము గలిగించుట.)

వికల్పార్థకములు. అం: "ఉన్నా, బలె" అనునవి. తద్వి.—వికల్పార్థమునకు.- వా.

వికవిక. దే. వి. రూ-వికావిక. నవ్వుట, కేరుట లోనగువానియందగు ధ్వన్యనుకరణము: చూ, హహాహహా.

వికవికలు. దే. విశే. బ: చూ, రూ-వికావికలు.

వికస. సం. వి. ఆ. స్త్రీ. మంజిష్ఠ*: చూ, సమంగ. 1.

వికసనము. సం. వి. అ. న. 1: చూ, వికాసము. 1; వా. 2: (తె) పూచి, పూత. [క్రోదఘ్న.

వికసము. సం. వి. అ. న. ఎఱ్ఱగలిజేరు*: చూ,

వికసించు. సం. అ. క్రి. ఉల్లసిల్లు, పుష్పించు, విజృంభించు. (తె) —అలరు, ఎలరుచు-ఎలర్చు, చెలఁగు, తొంగలించు, ననయు, నవ్వు, పూచు, పూయు, పొదుగు, పిప్పిదులు, ముదురు, విడుగు, విరియఁబాఱు, విరియు. (చూ, పల్లవించు) [ల్లము.

వికసితము. సం. విణ. వికసించినది: చూ, సంప్రు

వికసుఁడు. సం. వి.అ. పుం. చంద్రుఁడు: చూ, హిమాంశువు.

వికస్వరము. సం. విణ. 1. వికసించునది: చూ, సంఫుల్లము; అం. 2: చూ, అలంకారము 3. (విశేష సామాన్యముల విశేషము చెప్పుట. "ఉదా.—అతఁడజేయుఁడు. అల్లైకా ధీరులబ్ధి గంభీరులు.")

వికారము. సం. వి. అ. పుం. 1: అభివ్యక్తి, ఆభాసము, ఛాయ, పరిణామము, ప్రతిఫలనము, ప్రతిబింబము. (తె): అచ్చు, చాటు, నీడ, మాఱురూపు, వెడఁగు; తద్వి.–విణ: ప్రతిబింబించినది.– ప్రతిఫలితము, బింబితము, విస్మృతి; 2. తెవులు: చూ, రోగము 1; 3. పరిణామము, ప్రతిబింబము, మాఱురూపు, వెడఁగు: చూ, విస్మృతి; అం. బ. 4: చూ, వికారములు.

వికారములు. అం: ఏకాదశేంద్రియములు, పంచభూతములు, (జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, ప్రాణవాయువులు, చిత్తము (16).)

వికారి. సం. వి. న్. పుం. 1: చూ, సంవత్సరములు; విణ. 2. వికారముగలది: వికృతము. (తె) - ఓఱవ, వెక్కురు, వెడ.

వికావిక. దే. వి: చూ, రూ–వికివిక.

వికావికలు. దే. విణ. బ: రూ–వికవికలు, కకవికలు– కకావికలు, చెల్లచెదరు– చెల్లాచెదరు, పటాపంచేలు, పికపికలు, వకవకలు– వకావకలు. విచ్చి విచ్చేలు. (వి). కచ్చు మొగ్గ. (సం).– యథాయథలు.

వికాసము. సం. వి. అ. పుం. 1. తెలివి: చూ, ప్రహ్లాదము. 2; 2: చూ, విజృంభణము; 3 పుష్పాదివికాసము: ఉత్కోచము– ఉత్కోశము, ఉద్బోధము, ఉన్మీలనము, ఉన్మేషము. (తె).— ఉవ్వాయి, ఎలమి, ఎలను, గెలివి, తెలివి, నవ్వు, పిసాళము. పూఁత, రేకు, లలి, విప్పు, విరియుట; అం. 4: చూ, సంచారీభావమునఁబుట్టిన దృష్టులు.

వికాసవంతుఁడు. సం. విణ: ఉన్మేషకుఁడు. (తె).–ఎలమికాఁడు.

వికాసి. సం. విణ.(న్. ఈ. న్.)వికాసముగలది.

వికిరము. సం. వి. అ. న. 1. గజకుంభస్థలమధ్యము: చూ, హస్తి; పుం. 2. రూ–విష్కిరము: చూ, పక్షి; 3. ఖండము: చూ, శకలము. 4; 4. శ్రాద్ధకాలమందు నిమంత్రితులు భుజించినపిమ్మట విస్తరకు ముందఱవేసెడు అన్నాదికము: చూ, పాదము. (1); 5. నూయి: చూ, సరస్సు. 1.

వికీరణము. సం. వి.అ. న. 1. వెదచల్లుట: చూ, వెద. 2; పుం. 2: అర్కపర్ణము, అర్కము– అర్కాహ్వయము, ఆసారము, ఆస్ఫోటము, ఆస్ఫోతము, కంపూఘ్నము, కల్యాణగోత్రము, క్రిమిచ్ఛదము, క్షవకము, క్షీరకాండకము, క్షీరదళము, క్షీరపర్ణి, క్షీరి, క్షీరిణి, గజాఖ్యము, గణరూపకము– గణరూపము, చక్రిమర్దము, మందారము, వసుకము– వసుకము, శిఖరికము, సదాపుష్పి. (తె).– జిల్లెను–జిల్లేడు. తద్వి.—ు: క్ష్వేడము, రక్తార్కము. (తె).–ఎఱ్ఱజిల్లేడు; ౨: అర్కరాజము, అలకము, అలర్కము, ఏకాష్ఠీల, గణరూపి, ప్రతాపసము, వసుకము, శివమల్లిక. (తె).–తెల్లజిల్లేడు; 3: అత్యర్కము, కాష్ఠీ

లము, గణరూపకము, రాజార్కము, వసు
నామకము. (తె).- రాచజిల్లేడు, వెల్లి జిల్లే
డు; ౨. ఎట్టి జిల్లేడుకాయకు.- క్ష్వేడము;
౩: చూ, ఏకవిదారణ పుటక ఫలము.
("చూ, సదాపుష్పి."); 3. ఉచింత*: చూ,
కుండ. 5. [దరినది.
వికీర్ణము. సం. విణ. 1. వెదజల్లఁబడినది; 2. చె
వికుంఠీశ్వరము. అం: చూ, తంత్రములు.
వికుర్వాణుఁడు. సం. విణ. సంతోషమునొందిన
మనస్సు గలవాఁడు: చూ, హృష్టుఁడు.
వికృతము. సం. విణ. 1. వికారమునొందినది:
చూ, వికారి. 2; 2. తెవులునొందినది;
3 రోఁతయయినది: (తె).—గోరము, వాజి;
అం. 4: చూ, పరిచారములు.
వికృతి. సం. వి. ఇ. స్త్రీ. 1: చూ, విస్మృతి;
అం. 2: చూ, ఛందస్సులు; 3: చూ, సంవ
త్సరములు; విణ.4. ఆద్యద్వితీయప్రకృతుల
వికారరూపమగుటచే ప్రాంధ్రము వికృతి
యనఁబడును: చూ, వైకృతము.
వికృతుఁడు. సం. విణ: చూ, వ్యాధితుఁడు.
వికృష్టము. అం: చూ, నాసికాక్రియలు.
విక్కము. సం. వి. అ. పుం. ఇరువదేండ్ల వయ
స్సుగల యేనుఁగు: చూ, హస్తి.
విక్కవిరియు. దే. అ. క్రి. (విరియు+విరియు)
మిక్కిలివిరియు.
విక్కు. దే. అ. క్రి. 1: చూ, విజృంభించు.
అచ్చ. కిష్కిం, కాం. 90; 2. గర్వించు.
(చంద్రరేఖావిలాసము. 2, ఆ. 3): చూ,
హంకరించు.
విక్రమ. అం: చూ, సంవత్సరములు.
విక్రమము. సం. వి. అ. పుం. 1. విక్రాంతి,
అధికబలము: చూ, శక్తి. 1; 2. ఆక్రమణ
ము: చూ, పురి. (4); 3: చూ, శౌర్యము;
4: చరణము.

విక్రమార్కశకము. అం: చూ, శకములు.
విక్రమించు. సం. అ. క్రి. 1. వీర్యముచూపు;
2. శౌర్యముచూపు.
విక్రముఁడు. సం. వి. అ. పుం. 1: చూ, విష్ణు
వు. 1; 2. విక్రమార్కరాజు, విక్రమా
ర్కుఁడు.
విక్రమోర్వశీత్రోటకము. అం. (కాళిదాసు
వ్రాసెను): చూ, కావ్యనాటకములు.
విక్రయము. సం. వి. అ. పుం. 1. విపణము:
చూ, వెల. 1. తద్వి.-(తె) రోకము; అం.
2: చూ, సౌమ్యములు. [పదములు.
విక్రయాసంప్రదానము అం: చూ, వ్యవహార
విక్రయి. సం. వి. న్. పుం: చూ, విక్రయికుఁడు.
విక్రయించు. సం. స క్రి: (తె).- అమ్ము,
జట్టియుచ్చు, నెట్టియుడు, పోకడపెట్టు, విలు
చే-విల్చు. [వాఁడు: విక్రయి, విక్రేత.
విక్రయికుఁడు. సం. వి అ. పుం. అమ్మెడు
విక్రాంతి సం. వి. ఇ. స్త్రీ. 1: చూ, విక్రమ
ము. 1; 2. అశ్వగతి: చూ, హయము; అం.
3: చూ, అశ్వోత్పత్తులు.
విక్రాంతుఁడు. సం విణ. 1. విక్రమించినవాఁ
డు; 2: చూ, శూరుఁడు. [విస్మృతి.
విక్రియ. సం. వి. అ. స్త్రీ. వికారము: చూ,
విక్రీడితము. సం. విణ. మిక్కిలి ఆడఁబడినది.
విక్రీతము. సం. విణ. విక్రయింపఁబడ్డది.
విక్రేత. సం వి. ఋ. పుం: చూ, విక్రయికుఁడు.
విక్రేయము. సం. విణ. విక్రయింపఁదగినది.
విక్లబుఁడు. సం. విణ. భయశోకాదులచేత చేతు
లు కాళ్లు విలవిలపోవువాఁడు: చూ, వెఱపరి.
విక్షావము. సం. వి. అ. పుం. 1: చూ, దగ్గు 1;
2: చూ, తుమ్ము. 1.
విక్షిప్తము. సం. విణ. 1. ఎగురవేయుట. తద్వి.-
అసనము, క్షేపము-విక్షేపణము-విక్షేపము.
(తె). చిమ్మనము, చిమ్ముడు; 2. విసరివేయు
ట: విక్షేపణము-విక్షేపము; 3. విక్షేపము

విక్షేపణము, అంగవిక్షేపము: చూ, నలనము (లోలము); 4. చిమ్ముట: చూ, విక్షిప్తము.1; అం. 5: చూ, కరణములు; 6: చూ, వైశేషిక క్రియలు. [రజ్జువులు.

విక్షిప్తైకకరము. అం. వాఁగ్, వల్గ: చూ, ముఖ

విక్షేపణము. సం. విణ: చూ, విక్షిప్తము. 1-4.

విక్షేపము. సం. విణ: చూ, విక్షిప్తము. 1-2-3-4; అం. 5: చూ, హస్తక్రియలు; 6: చూ, నిశ్శబ్దక్రియలు.

విక్షేపించు. సం. స. క్రి. 1. ఎగురవేయు: చూ, వైచు. 1; 2: విసరివేయు: చూ, వైచు. 2. 3. పడవేయు. చూ, వైచు. 3.

విఖుఁడు. సం. విణ: చూ, రూ—విఖ్యుఁడు.

విఖ్యాతము. సం. విణ. విఖ్యాతిఁ జెందినది.

విఖ్యాతి. సం. వి. ఇ. స్త్రీ. మిక్కిలి ప్రసిద్ధి: చూ, సంభావన. 3.

విఖ్యుఁడు. సం. విణ. ముక్కుపోయినవాఁడు: రూ— విఖుఁడు — విఖ్రుఁడు — విగ్రుఁడు. (తె):—ముక్కిఁడి. తద్వి.—౦. ముక్కులేనివానికి.— అనాసికుఁడు; ౨: చిపిటము. (తె).— చేప్పట ముక్కువాఁడు, చిదక ముక్కువాఁడు, నడ్డిముక్కుగలాఁడు— నడ్డిముక్కువాఁడు. (చూ, నాసిక. 1. 4)

విఖ్రుఁడు. సం. విణ. —పై.—

విగడియ. వై. వి.=విఘటికా. 1⁄60 గడియ, 24 సెకనులు, మూఁడుకళల కాలము. తద్వి.—ఘటిక, నాడి, నాడిక. (తె).— గడియ-గడి. (చూ, గడియ. 1.)

విగణనము. సం. వి. అ. న: ఋణమోక్షము, ఋణవిముక్తి. (తె) అప్పువిడుదల.

విగతము. సం. విణ. 1. బొత్తిగాపోయినది, ప్రగతము: చూ, హీతము. 8; 2. వెలుఁగు లేనిది: అలోకము, నిష్ప్రభము, విరతము.

విగతాలోకము. సం. విణ. కాంతిలేని దివాచం ద్రాదులు. [సంస్థ. 3; 2: చూ, విభజనము.

విగమము. సం. వి. అ. పుం. 1. నాశము: చూ,

విగళనము. సం. వి. అ. న. మిక్కిలిజారుట, విష్ఖలనము: చూ, స్ఖలనము. [తము. 1.

విగళితము. సం. విణ. మిక్కిలిజారినది: స్ఖలి

విగాఢము. సం. విణ: చూ, విగాహితము.

విగాహనము. సం. వి. అ. పుం. రూ— విగాహము, మునుఁగుట: చూ, స్నానము. 1.

విగాహము. సం. వి. అ. పుం. —పై.—

విగాహించు. సం. అ. క్రి: చూ, స్నానమాడు.

విగాహితము. సం. విణ. మునిఁగినది, గాహితము, విగాఢము, మగ్నము. (తె).— బ్రుంగుడు: చూ, స్నానము. 1.

విగిరి. దే. వి. స్ఫోటభూమి: విరిగి-విఱిగి, విరివి: చూ, భూమి. 1.

విగుణము. సం. విణ. విభిన్నగుణముగలది.

విగుర్వించు. దే. స. క్రి. (విఱుచు + విఱుచు) చేక్కఁగా విఱుచు. భార. ఆది. 6, ఆ: చూ, విఱుచు. [యానము. 2.

విగృహ్యము. అం. (విగృహ్యయానము): చూ,

విగృహ్యాసనము. అం: చూ, ఆసనము. 4.

విగ్రహము. సం.వి.అ. పుం. 1: చూ, శరీరము; 2: చూ, విభాగము.2; 3: చూ, విస్తారము. 1; పుం, న. 4: చూ, యుద్ధము; 5. రూ— విగ్రాహము: చూ, నఱుకు; 6. బొమ్మ: చూ, హారిణి. 8; 7. మూర్తి: చూ, హారిణి. 3; 8. బింబము: చూ, హారిణి. 3; అం. 9: చూ, షడ్గుణములు (గుణములు.)

విగ్రహములు. అం: చూ, వింశతి విగ్రహములు.

విగ్రహ వికల్పము. అం: చూ, ప్రకరణములు.

విగ్రహించు. సం. అ. క్రి. పోరు: చూ, పాటులాడు.

విగ్రుఁడు. సం. విణ: చూ, రూ—విఖ్యుఁడు.

విఘటిక. సం. వి. అ. స్త్రీ=విగడియ: చూ, విగడియ.

విఘటితము. అం: చూ, చుంబనములు.

విఘసము. సం. వి. అ. పుం. దేవతాతిథుల

భుక్తశేషము, యజ్ఞశేషము (అనికొందఱు): అమృతము.

విఘాతము. సం. వి. అ. పుం, న. 1. అడ్డంకి: చూ, సంరోధము; 2. పెద్దదెబ్బ: చూ, హతి; 3. చెఱుపు: చూ, సవ్యము.

విఘాతించే. సం. స. క్రి. 1: చూ, చెఱచే; 2. చేంపు: చూ, సంహారించే.

విఘ్నచ్ఛేదము. అం: చూ, తంత్రిములు.

విఘ్ననాశకుఁడు సం. వి. అ. పుం: చూ, వినాయకుఁడు. 1. [వినాయకుఁడు. 1.

విఘ్ననాశనుఁడు. సం. వి. అ. పుం: చూ,

విఘ్నపడు. మి. అ. క్రి. (విఘ్నము + పడు) అడ్డిపడు: చూ, పట్టుపడు.

విఘ్నము. సం. వి. అ. పుం: అంతరాయము, గండకము, గడము, ప్రత్యూహము, వ్యాఘాతము. (తె).—పనిచెఱుపు, దొసఁగు-దొసవు ("చూ, సంరోధము.")

విఘ్నరాజు. సం. వి. అ. పుం: చూ, వినాయకుఁడు. 1.

విఘ్నవినాయకుఁడు. సం. వి. అ. పుం. —పై.—

విఘ్నశాకము. సం. వి. అ. న. కొయ్యతోఁట కూర*: చూ, శాకిని. 2 (మారిషము.)

విఘ్నహారి. సం. వి.ఇ. పుం: చూ, విఘ్నరాజు.

విఘ్నేశుఁడు. సం. వి. అ. పుం: చూ, వినాయకుఁడు. 1.

విచకము. సం. వి. అ. పుం. 1. ఖర్జూర*: చూ, హింతాలము; 2. పొగడ*: చూ, వకుళము; 3. పుట్టకొననున్న పాము: చూ, సర్పము.

విచకుఁడు. సం. వి. అ. పుం: చూ, లోభి.

విచక్షణుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, విద్వాంసుఁడు; విణ. 2. నేర్పరి: చూ, సమర్థుఁడు. [సమీక్షణము. 2.

విచయనము. సం. వి. అ. న. వెదకుడు: చూ,

విచర్చిక. సం. వి. ఆ. స్త్రీ 1: చూ, విచర్చిక;

2. లక్ష్మీదేవి: చూ, హీర. 2 (లక్ష్మి. 1.)

విచారణ. సం. వి. ఆ. స్త్రీ. 1. ప్రమాణముల చేత విషయమును పరిశీలించుట, చర్చ, విమర్శనము: చూ, సంఖ్య. 8. 2: చూ, సంతాపము.

విచారణీయము. సం. విణ. విచారణ చేయఁదగినది.

విచారపడు. సం. అ. క్రి: చూ, సంతాపించే.

విచారము. సం. వి. అ. పుం. 1: చూ, యోచన; 2: చూ, సంతాపము; అవ్య. 3: ఉతాపహో; పుం. 4. వగ: చూ, శోకము; 5. వంత: చూ, శోకము.

విచారించే. సం. అ. క్రి. 1. అరయు: చూ, విమర్శించే; 2. చర్చించే: చూ, విమర్శించే; 3. మనస్సునందు ఆలోచించే: చూ, విమర్శించే; 4: చూ, సంతాపించే. కళా. 5, అ. 83; 5: చూ, వెదకు; 6: చూ, శోకించే.

విచారితము. సం. విణ. విచారింపఁబడినది: విత్తము, విన్నము.

విచార్యము. సం. విణ. విచారింపఁదగినది.

విచికిత్స. సం. వి. ఆ. స్త్రీ: చూ, సంశయము.

విచికిలము. సం. వి. అ. పుం. 1. ఒకానొక మల్లె*: చూ, వాసంతి. 2; 2. మల్లె*: చూ, వాసంతి. 2; 3. దవనము*: చూ, రుచి. 5.

విచికిలిత. అం: చూ, వృత్తము. 1. ("ఏడునగణములు, ఒకగురువు. 13 యతి. 22 ఛందస్సు" ఇది సులక్షణసారమందు తరళవృత్తమని కలదు.)

విచిత్రకము. సం. వి. అ. న. 1. ఆశ్చర్యరసము (చూ, రసములు); విణ. 2. అద్భుతరసము గలది.

విచిత్రము. సం. వి. అ. న. 1. ఆశ్చర్యము: చూ, వింత. 1; పుం. 2. చిత్రవర్ణము: చూ, వర్ణము. 8; విణ. 3. ఆశ్చర్యకరము: చూ, వింత. 1; 4. చిత్రవర్ణములు గలది: చూ, వర్ణము. 8; అం. 5: చూ, అలంకారము. 3; 6: చూ, ఆకాశమండలములు.

విచిత్రవీర్యునువు. సం. వి. ఉ. స్త్రీ. శంతనుని భార్య: చూ, భార్య.

విచిన్వత్కము. సం. వి. అ. పుం. 1. పరామర్శ ము: చూ, విమర్శనము; 2. దేవతలగుంపు చూ, వేలుపు.

విచిన్వత్కుఁడు. సం. వి.అ.పుం: చూ, శూరుఁడు.

విచిల్లిక. సం. వి. అ. స్త్రీ. పావలి*.

విచేష్టించే. సం. అ. క్రి. మిక్కిలిచేష్టించే.

విచ్చేయు. మి. అ. క్రి. 1. వచ్చే. పారి. ఉ. 5, ఆ. 156; 2. వెళ్లు. భాగ. 1, స్కం. 253: చూ, సాగు. 2; 3. కూర్చుండు. భాగ. 1, స్కం. 372: చూ, విజయంచేయు

విచ్చే. దే. వి. నాలుగు వేళ్లకు చుట్టితీసిన నూలు చుట్ట: చూ, సూత్రము. 1.

విచ్చలవిడి. దే. వి. 1: చూ, స్వాతంత్ర్యము; విశే. 2: చూ, స్వతంత్రము. 1; క్రి. విశే. 3. యథేచ్ఛము. అచ్చ. బాల, కాం. 189: చూ, స్వేచ్ఛ.

విచ్చేవిచ్చేలు. దే. అవ్య: చూ, వికావికలు.

విచ్ఛాయ. వై. వి.=విచ్ఛాయ. రత్నదోష విశే షము: చూ, స్థూలోచ్ఛ్రయము.1 (రత్నములు. ౧౦-(౬.) )

విచ్చే. దే. అ. క్రి. 1: చూ, విరియు; 2. చీలు, విదారించే: చూ, స్ఫోటించే; అం. ప్రే.3.విరియఁజేయు, ప్రే. 4: విడఁజేయు, విమోచనము చేయు, విడుచే- విడ్చు- వీడుచే, విప్పు. [రిష్టి. 2.

విచ్చేకత్తి. వ్య. వి. ఒఱదూసినకత్తి: చూ,

విచ్చేటాకు. దే. వి. (విచ్చే+ఆకు): చూ, చెవి యాకు. 1-2.

విచ్చెమెంగము. వా. విశే: కంచుమించే, చటా పంచే- చటాపంచేము, మాయము. (సం):- అగోచరము, అతీంద్రియము, అత్యధ్యక్షము, అదృశ్యము, అదృష్టము, అస్తము, దురాలోకము.



విచ్చెమొగ్గ. వ్య. వి. 1. విరియుమొగ్గ: చూ, మొగ్గ. 1; 2. చెల్లాచెదరగుట: చూ, వికావిక లు; విశే. 3. చెల్లాచెదరైనది; 4 చెల్లా చెదరు చేయునది.

విచ్ఛాయము.సం వి అ.పుం 1.=విచ్ఛాయ. రత్న దోషవిశేషము: చూ, స్థూలోచ్ఛ్రయము.1(రత్న ములు ౧౦-(౬). ); విశే.2.చాయపోయినది.

విచ్ఛిత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఎడఁబాటు: చూ, విరహము; 2. పూఁత: చూ, సమాలం భము. 1; 3. నఱకుట: చూ, హతి; వా.4. బొద్దలగుట; అం. 5. వస్త్రభూషణాద్యలం కారము కొలఁదిగానుండినను మిక్కిలి రూపు ష్టముగాఁ జేసెడు స్త్రీలయొక్క శృం గార చేష్టావిశేషము: చూ, శృంగారచేష్టలు.

విచ్ఛిన్నము. సం. విశే. 1. ఎడఁబడినది; 2.పూ యఁబడినది: లిప్తకము, లిప్తము, వసితము. ("చూ, సమాలంభము. 1"); 3. నఱకఁబడి నది: ఖండితము, నికృత్తము, మూషితము, వర్ధితము. తెన్వ.—౧. చీల్చఁబడినది:-ఆస్ఫో టితము, దారితము, విదారితము, దీర్ణము, పాటితము, విదీర్ణము; ౨. భేదింపఁబడినది:- ఉద్ఘాటితము, కృత్తము, దళితము, భేదిత ము, భేదితము; ౩. చీలినది:- అవదీర్ణము, దురితము, భిన్నము. (తె).— సారపు; ౪. చెక్కఁగా భేదింపఁబడినది:-నిర్దళితము- నిర్దారితము, నిర్భిన్నము; ౫. భేదిల్లినది- (తె):—లవలవ; ౬. కోయఁబడినది:-(చూ, వృక్ణము. 2); ౭. చినిఁగినది:- జీర్ణము. (తె):—చింపి. ("చూ, సారపు"); ౮. వంకే రైనది: చూ, వేల్లితము. 6.

విచ్ఛేదనము. సం. వి. అ. పుం. 1. ఎడఁబాటు: చూ, విరహము; 2. నఱకుడు: చూ, హతి-

విజనము. సం.విశే.జనులు లేనిది: చూ, రహస్యము.

విజయ. సం. వి. ఆ. స్త్రీ. 1. జయతిథి: చూ, హరివాసరము; 2. గౌరి: చూ, హైమవతి

(శార్వరి); అం. 3: చూ, సంవత్సరములు; 4. దినముయొక్క ఆఱవభాగము: చూ, వాసరము (విజయము).

విజయంచేయు. మి. అ. క్రి. (రూ-విజయము చేయు- విచ్చేయు- వేంచేయు.) 1: చూ, వచ్చు. 2; 2: చూ, వెళ్లు.3. నిర్వ. 7, ఆ.134.

విజయక్రియ. అం: చూ, క్రియాంగములు.

విజయచ్ఛందము. సం. వి. అ. పుం. ఏనూఱుపేటలుగల హారము: చూ, హారము. (భూషణము. 2.)

విజయదశమి. సం. వి. ఈ. స్త్రీ. ఆయుధములలోనగువానిం బూజించెడు ఆశ్వయుజ శుద్ధమునందలి పదవ తిథి: చూ, వారివాసరము (తిథి.)

విజయభద్రము. అం: చూ, వృత్తము. 1. ("నవవిధరగడలలో నొకటి. ద్విరదగతి రెండు పాదములుకలసి యొక పాదమగును: చూ, రగడ")

విజయమంగళము. అం: చూ, వృత్తము. 1. ("నవవిధరగడలలో నొకటి. తురగవల్గనరగడయొక్క రెండు పాదములు కలిసి యొక పాదమగును: చూ, రగడ.")

విజయము. సం. వి. అ. పుం. 1. =విచ్చేము. రూ- జయము- జయనము, దండయాత్ర; 2: చూ, విజయ. 4; అం. 3: చూ, దండవ్యూహములు; 4: చూ, ఆగమములు.

విజయముచేయు. మి. అ. క్రి: చూ, రూ-విజయంచేయు. 1-2. (పూజ్యులయొక్క రాకపోకలయందే ప్రయోగింపఁబడెడి.); 3: చూ, జన్యరాగములు.

విజయానందము. అం: చూ, జన్యరాగములు.

విజయాభినందనశకము. అం: చూ, శకములు.

విజయి. సం. విణ. (న్. ఈ. న్.) మేలుచేయు: చూ, సమర్థుఁడు.

విజయుఁడు. సం. వి. అ. పుం. 1. అర్జునుఁడు: చూ, సుభద్రేశుఁడు; 2. కృష్ణద్వార పాలకులలో నొకఁడు. (చూ, ప్రతిహారుఁడు.) (చూ, జయుఁడు. 3.)

విజాతి. సం. వి. ఇ. స్త్రీ. 1. విభిన్నజాతి; 2. విశేషజాతి. (చూ, వైజాత్యము)

విజాతీయము. సం. విణ. విజాతిసంబంధమైనది.

విజిగీష. సం. వి. ఆ. స్త్రీ. మిక్కిలి జయింప నిచ్ఛ: చూ, వాంఛ. ౮.

విజిగీషువు. సం. విణ. (ఉ). 1. మిక్కిలిజయింప నిచ్ఛగలవాఁడు; అం. 2: చూ, ద్వాదశరాజమండలము.

విజితుఁడు. సం. విణ. జయింపఁబడినవాఁడు.

విజనము. సం. వి. అ. న: చూ, రహస్యము. 1.

విజలము. సం. విణ. మీఁగడగట్టినది: పిచ్ఛిల.

విజృంభణము. సం. వి. అ. న. మిక్కిలిజృంభణము: ఉద్రేకము, జృంభ, జృంభణము, జృంభము, డంబము, వికాసము. (తె).— ఉంకింపు, ఉప్పెన, ఎగసిపాటు, ఎసకము, ఏర్పాటు, ఏపు, ఏన, ఒడి, ఒడికారము, ఒత్తరము, కడంక, కయిపు- కైపు, కేడపు, కొవ్వరము, గుంపెన, గోటాపన- చిందట- చీఁదట, డంబము, డాక, త్రుళ్లగింత, తుళ్లి(ళ్ళి)ల్లింత, తుళ్లుమింత- తుళ్లుమింత, తుళ్లు, మీటు, ముమ్మరము, మెఱపడి, వళావళి, వీఁక.

విజృంభించు. సం. అ. క్రి. 1. మిక్కిలిచెలరేఁగు: ఉద్రేకించు, జృంభించు, పూరించు. (తె).— అడరు, అడరుకొంచు, ఉప్పొంగు, ఉరణించు- ఉరడించు- ఉరవడించు- ఉరవణించు, ఎసఁగు, ఎసకేఁగు- ఏసకేఁగు, ఏచు, ఏపారు, ఒదరు, కదురు, కవిమసఁగు, కెరలి యాడు, కెరలు, కెరలుకొడుచు, కెలయు, కేరించు, కేరు, కొవ్వరించు, కొసరు, గుబ్బతిలు- గుబ్బతిల్లు, గొదకొను, చిందులగొను-

చిమ్మిరేఁగు, చిఱుఁగు, చెంగలించు, చెలరేఁగు, చెలరేఁగు, జోవ్వరించు, తనరు-తనరు చు-తనర్చు, నిగుడు-నివుడు, నిట్టగ్రిమ్మ, నిట్టవొడుచు, పురడించు- పురణించు-పురాణించు, పురాయించు, పెఱుగు, పేరుచు-పేర్చు, పొంగారు, పొంపిరివోవు, బుగులుకొను, మలయు, మిటారించు, మీఁరిఁబోవు, మెండుకొను, రెచ్చు, రేఁగు, రేయు-రేయు, అంపిలు- అంపిల్లు, లాఁతసేయు, లాయు, విక్కు, విరియు, సెలయు, సోఁకించు, హవణిల్లు. ("చూ, హవణిల్లు. 2"); 2: చూ, వికసించు.

విజృంభితము. సం. విణ. 1. వికసించినది: చూ, సంఫుల్లము; 2. ఆవులించినది; అం. 3: చూ, ఉత్తాన కరణబంధములు [సంజ్ఞపనము. 2

విజ్ఞప్తి. సం. వి. ఇ. స్త్రీ. విజ్ఞాపనము: చూ,

విజ్ఞాతము. సం. విణ. ప్రసిద్ధికెక్కినది: అభిపన్నము: చూ, సంభావన. 3.

విజ్ఞాతుఁడు. సం. విణ. 1. ప్రసిద్ధకులుఁడైన తండ్రివలనఁ బుట్టినవాఁడు: చూ, సజ్జనుఁడు; 2: చూ, విశ్రుతుఁడు.

విజ్ఞానమయము. అం: చూ, కోశములు.

విజ్ఞానము. సం. వి. అ. న.=విన్ననువు. 1. శాస్త్రాదులయందలి జ్ఞానము: చూ, హృల్లేఖము. 2, 2. విశేషజ్ఞానము: చూ, హృల్లేఖము. 2; 3. చాతుర్యము: చూ, సామర్థ్యము. 1; 4. కార్యము: చూ, వ్యాపారము. 1; అం. 5: చూ, బౌద్ధశాస్త్రస్కంధములు.

విజ్ఞాపనము. సం. వి. అ. న.=విన్నపము: చూ, విజ్ఞప్తి. [విన్నవించు.

విజ్ఞాపించు సం. స. క్రి. మందలించు: చూ,

విజ్ఞుఁడు. సం విణ: చూ, సమర్థుఁడు.

విజ్ఞె. దే. వి. 1. తన్నుకొనుటయందగు ధ్వన్యనుకరణము, జై. 5, ఆ. 192: చూ, హాహా; అ. క్రి. 2: చూ, వ్యాకించు. ఉ, హరి. ఫూ, ఆ. 50. (ఆమే్రడితమందు విజ్ఞెవిజ్ఞె. స్కాం. 4, ఆ. 58.)

విజ్జోడు. ద్వ. విణ. (వీసు+జోడు) సరిజోడుకానిది, సరికానిది. వైజ.1, ఆ. 108: చూ-వీసు జోడు. [ఆ. 79: చూ, వేఱుపడు.

విజ్జోడుపడు. ద్వ. అ. క్రి. భేదపడు. కళా. 5,

విటంకము. సం. వి. అ పుం, న: చూ, కపోతపాలి. 1—2: (చూ, లోన, వలభి-కు.)

విటకత్తె. మి. వి. విటుకులాఁడి: చూ, విటి. (వైకృతిఅని పురుషోత్తము కవీయము.)

విటకాఁడు. మి. వి: చూ, విటుఁడు (వైకృతి అని పురుషోత్తమ కవీయము.)

విటతటము. దే.వి. (రూ-విటతాటము-విటతాటనము- వీటతటము- వీటతాటనము- వీటతాటము), తాఱుమాఱు: చూ, వ్యత్యయము.

విటతాటము దే. వి.-పై-భాగ.3, స్కం.805.

విటతాటనము దే. వి. —పై.— [మాతుఁడు.

విటమాత. సం. విణ. బడవ-బడవా: చూ,

విటపము. సం. వి. అ. పుం, న. 1. చిగిరించిన కొమ్మ: చూ, శాఖ. 1; 2. కొమ్మ: చూ, శాఖ. 1; 3. చిగురు: చూ, విస్రిమము; 4. బోదజేనిచెట్టు: చూ, వృక్షము.

విటపి. సం. వి. న్. పుం 1. చెట్టు: చూ, వృక్షము; 2. మఱ్ఱి*: చూ, స్కంధజము.

విటప్రుఁడు. సం. వి. అ. పుం. విటశ్రేష్ఠుఁడు: చూ, విటుఁడు.

విటరాయుఁడు. వై. వి. —పై.—

విటాలిక. సం వి. అ. స్త్రీ. చిళిగలిశేరు, దీక్షపత్రము.*: చూ, వక్షకేతువు. [స్వైరిణి.

విటి. సం. వి. ఈ. స్త్రీ.= విటుకులాఁడి: చూ,

విటుఁడు. సం. వి. అ. పుం. 1. విటకాఁడు, అశిపకుఁడు, అభీకుఁడు, ఉపపతి,

ఉపపతుఁడు, ఉపుఁడు, కంచుకి, కక్షావేక్షకుఁడు, కామకేళి, కాములుఁడు, కామి, కుమారుఁడు, ఖర్పరుఁడు, చంచలుఁడు, చుంబకుఁడు, ఛిత్వరుఁడు, ఛిదురుఁడు, జారుఁడు, టారుఁడు, ణ,తరలుఁడు, నారంగుఁడు, పల్లవుఁడు, పీఠకేళి, పీఠమర్దుఁడు, భవిలుఁడు, భృంగుఁడు, మింతుఁడు, ముదిరుఁడు, లంగుఁడు, విదూషకుఁడు, వ్యాళీకుఁడు, శృంగారి, షట్ప్రిజ్ఞుఁడు, షిడ్గుఁడు-షిద్గుఁడు. (తె. ప).-అంటుగాఁడు. ఎంగిలివాఁడు, కోడె, కోడెకాఁడు, గోవాల్లు, చెలువుఁడు, జోమ్మకాఁడు- జోమ్మికాఁడు- జోమ్మఁడు, తిరుగుఁబోతు, వనుపుకాఁడు- నన్పుకాఁడు, పెఱమగఁడు, బోజేఁగు, మిండగాఁడు- మిండగీఁడు- మిండఁడు, మేలువాఁడు, ఱంకుఁబోతు, ఱంకుమగఁడు, లంజెకాఁడు, వెచ్చెకాఁడు, వేడుకకాఁడు- వేడ్కకాఁడు, సొగసుకాఁడు, సొబగుఁడు, హావుసుకాఁడు-హౌసుకాఁడు. తద్వి:-చూ, వైశికుఁడు. 1; అం. 2: చూ, నాయకసఖులు; 3: చూ, నాయకులు. [(ద్వ.అనికర)

విటుకులాఁడి. వై. వి=విటి: చూ, స్వైరిణి.

విట్ఖదిరము. సం. వి. అ. పుం. 1. తుమ్మ*: అజభక్షము, అపామారకము, అరిమేదము, అశ్వదుగ్రివు, అహిమారకము, కఫాంతకము, కింకిరాలము, కుష్ఠారి, కేదరము, క్షేమము, గోశృంగము, చతురశ్రి, బర్బురము-బర్భూరము, వజ్రాక్షి. (తె).-తుమ్మ, నల్లతుమ్మ, బొబ్బలి: (చూ, తుమ్మకుటుంబము) ("చూ, సోమవల్కము"); 2: చూ, వెలివేండ్రి; తద్వి.-(తె)వెట్టితుమ్మ.

విట్చరము. సం. వి. అ. పుం. ఊరఁబంది: చూ, సూకరము. [చూ, శారిక. 1.

విట్సారిక. సం. వి. అ. స్త్రీ. పీతిగోరువంక:

విట్టము. దే. వి. పీరుపాటు: చూ, సత్యము. 1.

విట్టాలయము. అం: చూ, విన్నాణములు.

విట్టీ. వా. వి. 1. తమాషా; 2. యుక్తి.

విట్టు. సం. వి. శ. పుం. 1. కోమటి: చూ, వైశ్యుఁడు;వ. స్త్రీ.2: చూ, విష్ఠ.[వైశ్య.1.

విడంగ. సం. వి. అ. స్త్రీ. కోమటిది: చూ,

విడంగము. సం. వి. అ. పుం, న. 1: అమోఘ, కుష్ఠఘ్ని, కృమికంటకము-క్రిమికంటకము-క్రిమికంటకము, కృమిఘ్ని, క్రమిఘ్నము-క్రిమిఘ్నము, కృమిరిపువు, క్రిమిశత్రువు, క్రిమిజిత్తు, కేరలము, కైరాతతము, కైరాతతండులము, కైరాలము, కైవలము, గర్దభము, చిత్రతండుల- చిత్రతండులము, జంతుహృద్రోగఘ్నంకులము, తండులము, రసాయనము, వేల్లము. (తె) వాయివిళంగము- వాయువిళంగము*; 2. వంటయుప్పు: చూ, సౌవర్చలము (లవణము. 1.); విణ. 3. నేర్పరి: చూ, సమర్థుఁడు.

విడంబన. సం. వి. అ. స్త్రీ. 1. అనుకరించేట; 2.=వేడబము: చూ, వేడబము (వంచన).

విడంబనము. సం. వి. అ. న.—పై.—

విడంబించే. సం. స. క్రి. 1: అనుకరించే; 2. మోసపుచ్చే: చూ, వంచించే.

విడఁద్రొక్కు. దే. స. క్రి. విడుచే: చూ, విసర్జించే. [వడు. 4.

విడఁబడు. వా. అ. క్రి. బరిదెగు: చూ, విడి

విడనాడు. దే. స. క్రి: చూ, విడఁద్రొక్కు.

విడవలి. దే. వి. ఇండ్లకుకప్పెడుగడ్డి:వంజో. (విడవలిలోనగువానికట్టు; విడవలిలోనగు వానిగంటు.) [వ్రాసికొనిన పత్రము.

విడాకు. వా. వి: భార్యాభర్తలఎడఁబాటునకై

విడి. దే. వి. 1: చూ, విసర్జనము; 2. కృత్రిమపద్మరాగకాంతి: చూ, వెలుతురు. 1; 3.అరుణకాంతి: చూ, వెలుతురు. 1; 4. వ్రీతావము: చూ, వాఁడిమి; 5. క్రోధము: భాగ.

1, స్కా. 471: చూ, రోషము; 6. పరా క్రమము: చూ, శౌర్యము; 7. ప్రత్తికాయ లోనిపీచు. కళా. 8, అ. 12; విశే. 8. అరు ణము. స్వా. 3, అ. 110: చూ, వర్ణము.6; 9. ప్రత్యేకమైనది. "విడాకు, విడివాస, ఒకరొద్దు విడిగామేయుచున్నది."; 10. విడు వఁదగినది. "విడికథ:": చూ, విసర్జనీయ ము. 2; 11. పనినుండి విడిచినది. "విడి కోడె."; క్రి. విశే. 12. ఒంటరి. "విడిమట్టు.".

విడిగోలు. దే. వి. 1. మాఱుపు: చూ, వినిమ యము; విశే. 2. పనిలేనిది.

విడిచివాటుగుదియ. ద్వ. వి. సాఁగు, భిండిపాల ము: చూ, ముప్పదిరెండాయుధములు (బాణ ము. 1.)

విడిదల. ద్వ.వి. (విడిది+తల) (రూ-విడిది-విడి పట్టు- విడిమట్టు- వీడు- వీడుపట్టు) విడియు చోటు (దండువిడియుచోటు స్కంధావార ము,దండునందొక్కొక్కఁడు విడిసినచోటు శిబిరము): చూ, స్కంధావారము. 1.

విడిది. దే. వి. 1.—పై—1; 2. పెండ్లికి తర లివచ్చిన పెండ్లివారు విడిసినచోటు: వీడుప ట్టు; 3. విడియుట. [ల. రుక్మి.3, అ. 145.

విడిపట్టు. దే. వి (విడిది+పట్టు): చూ, విడిద

విడిమట్టు. దే. వి. 1: చూ, వీడుపట్టు. 3. య. 2, అ. 36; 2. కాఁపురము: చూ, సంసార ము. 1; 3: చూ,విడిదల;వా.4.ప్రత్యేకము: చూ, వేఱు. [50: చూ, హిరణ్యము. 3.

విడిముడి. దే. వి. ధనము. అప్ప, బాల, కాం.

విడిముడిగలవాఁడు. దే. వి. ఆఢ్యుఁడు: చూ, సంపన్నుఁడు.

విడియ. వై.వి.=వీటికా. (రూ-విడియము-విడె ము- విడ్యము- వీడియము- వీడెము- వీడ్య ము) తాంబూలపు బీడి: చూ, విడెము.

విడియము. వై. వి.= —పై.—

విడియు. దే. అ.క్రి. 1. బాటసారులు దారిలో నొకచోటవిడుచు. తవ్వి.- పాళెంబువిడు; 2. పీడు: చూ, సడలు. 6; 3. జాఱు: చూ, సర్లు. 2.

విడివడు. ద్వ. అ. క్రి. రూ- విడువడు. 1.జాఱు. పంచ. నా. 3, అ. 250: చూ, సుర్లు. 2; 2. పీడు. శశాం. 4, అ. 74: చూ, సడలు. 6; 3. తెగనుండి వేఱుపడు; 4. నిర్బంధమునుండి తొలఁగు: రూ- విడుప డు-విడఁబడు, బరిగెను.

విడివాటుబడియ. దే. వి: చూ, విడిచి వాటుగుదియ. కవిక. 4, అ.

విడివేఁట. దే. వి. దేగవేఁట. య. 2, అ. 28: చూ, వేఁట. 3. (చూ, విడి, వేఁట)

విడివోవు. దే. అ. క్రి. వదలు: చూ, సడలు.6.

విడు. దే. అ. క్రి. 1. —పై.—; అం. ప్రే. 2: విడుచు, విప్పు. పాండు. 2, అ. 6.

విడుగడ. దే. వి: చూ,విసర్జనము.నిర్వ.7,అ.12.

విడుగర. దే. వి. —పై.—

విడుగు. దే. అ. క్రి: చూ, వికసించు.

విడుచు. దే. ప్రే. 1: రూ- విప్పు, విడు- వీడుచు; స. క్రి.2. విడ్చు: చూ, విసర్జించు, 3: చూ, పెట్టు. 9.

విడుట. దే. వి. అఱుట: చూ, విసర్జనము.

విడుత. దే. వి. తడవ: చూ, పెండియు.

విడుదల. దే. విశే. రూ-విడుమర- విడుగడ: చూ, విడుట.

విడుపరి. దే. విశే. (విడుపు+అరి) 1.పరిత్యాగ శీలుఁడు: చూ,వదాన్యుఁడు; 2. దాత: చూ, వదాన్యుఁడు.

విడుపు. దే. వి. రూ-విడ్పు. 1. దానము. య. 1, అ. 95: చూ, వితరణము; 2: చూ, విస ర్జనము.

విడుమర. దే. వి: చూ, విడుట.

విదుపడు. ద్వ. అ. క్రి. (విదుపు+పడు): చూ, రూ-విడిపడు. 1-2-3-4. భాగ.7, స్కం.253.
విదువు. అం: చూ, చిహ్నములు.
విదూరము. అం. రూ-విదూరము. వైదూర్య మణిపుట్టెడు దేశము: చూ, సీమ (1) దేశములు.
విడెము. వై. వి.=వీటికా. రూ-విడియ-విడియము-విడెము-విద్యము- వీడియము-వీడెము-వీద్యము, తములము- తమ్మలము, తమ్మ, వక్కలాకులు, వక్కాకు. (సం) — తాంబూలము, వీటి. (చూ, కారపుకిల్లి- కారాకిల్లి, కిల్లి-కిల్లీ. మొ.)
విద్చు. దే. క్రి: చూ, రూ-విడుచు. 1-2-3
విద్దూరము. వై. వి.1: చూ, మూర్ఖ్యము; 2.=విద్వర. ఉపద్రవము: చూ, విపత్తు; విశ. 3: చూ, మూర్ఖ్యము.
విద్పు. దే. వి: చూ, రూ-విడుపు. 1-2.
విద్యము. వై. వి.=వీటికా: చూ, రూ-విడెము. పాండు. 3, ఆ. 74. [విపత్తు.
విద్వరము. సం. వి. అ. న.=విద్దూరము: చూ,
విత. వై. విశ.= వృథా. రూ- వితా- వెడ. శశాం. 3, ఆ. 73: చూ, వ్యర్థము.
వితండ. సం. వి. ఆ. స్త్రీ. 1. (వితండవాదము) అవు ననునది కాదని వాదించెడు వాదము; విశ. 2. వేఱయినది.
వితండము. సం. వి. అ. పుం. తలుపునకువేసెడు తాళము (చూ, బీగము.)
వితంతువు. సం. వి. ఉ. స్త్రీ: చూ, విధవ.
వితంసము. సం. వి. అ. పుం. రూ- వీతంసము. మృగములను పక్షులనుబట్టెడు ఉరితాళ్లు: చూ, సూత్రము. 1.
వితతము. సం. విశ. 1. విరివిచేయఁబడినది; అం. 2: చూ, తతవాద్యములు.
విత తహోషితము. అం: చూ, శిక్షాకాలములు.
వితతి. సం. వి. ఇ. స్త్రీ. 1: చూ, విరివి. 2; 2: చూ, సమూహము.
వితథము. సం. విశ. అసత్యమైనది: అనర్థకము అనృతము, అబద్ధము, అవాస్తవము, అసత్యము, అలీకము, అహతము, కల్లము, కూటము, టక్కరి, మిథ్య, వ్యలీకము. (అన్య). ఆశాత్, కిల, మృష. (తె). -అటమట-అటమటము, కల్ల, కాఱులు, కొడిమె- కొడిమజెల్లి, జాడ, జోకు, టక్కు, టవటవ, టవలి టవళి, తవరవ, డబ్బ, డబ్బఱ- దబ్బఱ డబ్బు-దబ్బు, తక్కు, తటపట, తపళి, తనకు, తాటోటు, దుద్దు, ననుకు, నీటిప్రాలు పలువ, పలువతిట్టు, పిక్కలి(ని), పొల్ల-పొల్లుబద్దు-బద్దుర, బిత్తిరి, బురడా-బురుడు, బూటకము, బూమియ- బూమె, బొంకు బొల్లు, మసి, రిత్త, లేదుబంతి- లేదుబంటిబట్టి, వెడబము-వేడబము, సట, సబ్బండ హుళక్కి- హుళికి- హుళిక్కి. ("చూ హుళక్కి. 3.") [హార్త.
వితమరి. ద్వ. విశ. (వితము + అరి): చూ, వ్య
వితము. వై. వి.=విధ: చూ, విధము. 1.
వితరణము. సం.వి.అ.న. ఈవి: చూ, స్పర్శము.
వితరణి. సం. వి. ఇ. పుం. దాత. విక్ర. 2, 187: చూ, స్థూల లక్షణము.
వితర్కము. సం. వి. అ. పుం. 1. ఊహ: చూ హం. 1 (యోచన.); 2: చూ, సంశయము 3. తర్కించుట; అం. 4: చూ, సంచారి భావములు. ("నాకిమ్మడిక్కనుమ్మలికంగ్రమ్మకొనఁ బ్రాణసఖులకుఁ దెలుపుదమా మనము వెనుదీయును. తెలుపకున్న మఱుదు కమ్మచ్చుగంబట్టి సాగఁనీయదు. ఏ చేయంగలదాన.")
వితర్కించు. సం. అ. క్రి. ఊహించు: చూ సంకల్పించు; 2: చూ, సంశయించు.
వితర్కితము. అం: చూ, సంచారిభావము బుట్టిన దృష్టులు.

వితర్ది. సం. వి. ఇ. స్త్రీ. అరుఁగు: చూ, వేదిక.

వితర్దిక. సం. వి. ఆ. స్త్రీ. —పై.—

వితర్దితము. అం: చూ, స్థితకరణబంధములు.

వితర్దితకము. అం: చూ, సంభోగబంధనభేదము.

వితలము. అం: చూ, లోకములు (అధోలోకములు.)

వితస్తి. సం. వి. ఇ. పుం, స్త్రీ: చూ, జేన. (చూ, హస్తము) [అవ్య. 2. వ్యర్థార్థకము.

వితా. పై. విణ.=వృథా. 1: చూ, రూ-విత;

వితాకు. దే. వి. 1: చూ, వెఱవెఱపాటు; 2. పార వశ్యము. శకాం. 2, ఆ. 78: చూ, విస్మృతి; 3. పరాకు. య. 5, ఆ. 22: చూ, స్థాకీత్యము; విణ. 4: రూ-వితాకుఁడు (వం).- నిశ్చేష్టితుఁడు; 5. నిశ్చేష్టితురాలు: చూ, స్త్రీ; 6: పరవశుఁడు. విజ. 1, ఆ. 138

వితాకుఁడు. దే. విణ: చూ, రూ- వితాక. 4. రామా. 8, ఆ. 121; పంచ. వేం. 3, ఆ 103.

వితాకుపడు. ద్వ. అ. క్రి. నిశ్చేష్టితుఁడగు.

వితానము. సం. వి. అ. పుం, న. 1: ఉల్లాభము, ఉల్లోచము, కత్షకము, కదకము, చంద్రికము, చందాప్రము. (తె).- ఉల్లడ- ఉల్లెడ, ఉల్లబము, ఎల్లడ, కలువడము, చేందువ- చేందువా, తలిమము, మేలుకట్టు; 2: చూ, యజ్ఞము; 3. విస్తృతి: చూ, విరివి. 2; పుం. 4: చూ, సమూహము; 5. అవసరము, అదను (అనికొందఱు): చూ, సమయము. 1; విణ. 6: చొరవలేనిది: చూ, మంథరము. 2; 7. మెల్లగాఁబోవునది: చూ, మ ం థ ర ము. 3; 8: చూ, శూన్యము. 1; అం. 9. (వితాన) చూ, వృత్తము. 1: (జ, మ, గగ, 8 వఛందస్సు.")

వితావిత. పై. విణ.=వృథావృథా. మిక్కిలి వ్యర్థము. శకాం. 2, ఆ. 20: చూ, వ్యర్థము.

వితాళచతుష్పద. అం: చూ, వృత్తము. 1. "భాను యుగముపై-పయినవలనిం, పూనమణివిరతి-నొందిధరలో, జాకలయఁజను-ష్పదవితాళా, ఖ్యానమున వినా-యక తురంగా.")

వితాళితము. అం: చూ, పుటక్రియలు.

వితీర్ణము. సం. విణ. 1. దాఁటఁబడినది: అవతీర్ణము, ఉత్తీర్ణము, తీర్ణము: చూ, లంఘా. 3; 2. ఇయ్యఁబడినది: ఉచితము, ఉత్సృష్టము, దత్తము.

వితీర్ణి. సం. వి. ఈ. స్త్రీ: చూ, వితరణము.

వితున్నకము. సం. వి. అ. న. 1: కుస్తుంబరి- కుస్తుంబురువు, ధన్యాకము- ధాన్యాకము. (తె) - కొతిమిరి- కొతిమెర- కొతిమెరి- కొత్తమిరి- కొత్తిమెరి, దనియము.*; 2: చూ, మయిలుతుత్తము: చూ, రసాంజనము; పుం. 3. నేలయుసిరిక*: చూ, శివ. 4.

వితున్నము. సం. వి. అ. న. 1. నీరుచెంచేలి*: చూ, సునిషణ్ణకము; 2. పాఁచి*: చూ, శైవలము; 3: చూ, వితున్నకము. 2.

విత్తి. దే. వి. మిక్కిలి సన్నగోనె: చూ, సంచి.

విత్తనము. దే. వి: రూ-విత్తు, గింజే, (బ) గింజలు, పిక్క, పిలక-పిల్క. (సం).-పిల్లాకము, బీజము. తద్వి.-౧: టెంక; ౨: డొక్క- బుఱ్ఱ, బుఱ్ఱ; 3: పిచ్చె-పిచ్చె.

విత్తనాలకట్ట. వా. వి. గడ్డివెంటియందిమిడ్చిన విత్తనములకట్ట: ముడికట్ట.

విత్తము. సం. వి. అ. న. 1. ధనము: చూ, హిరణ్యము. 3. తద్వి.-ప్రీతిపత్తము: (చూ, లబ్ధి. 1-2.); విణ. 2. తెలియఁబడినది: చూ, వ్యక్తము. 2; 3. పొందఁబడినది: చూ, సంసక్తము; 4. ప్రసిద్ధికొండినది: సంభావన. 3; 5. విచారింపఁబడినది: చూ, విచారితము.

విత్తు. దే. వి. 1: చూ, విత్తనము; స. క్రి. 2. (విత్తనములు) చల్లు: చూ, సంప్రోక్షించే.

విత్తుఁడు. సం. విణ: చూ, విశ్రుతుఁడు.

విత్తెడువాఁడు. వా. విణ: చూ, వప్త. 2.

విత్తైషణము. అం. (ధనేషణము.): చూ, ఈషణత్రయము.

విదగ్ధ. అం. (వాణిని) మున్నది సం॥ల మింమే జీవ్వనముగలఅఁడుది: చూ, యౌవనభేదములు.

విదగ్ధుఁడు. సం. విణ. 1. నేర్పరి: చూ, సమర్థుఁడు; 2. చోరవకాఁడు: చూ, సాహసికుఁడు

విదరము. సం. వి. అ. న. చీల్చుట: చూ, స్ఫోటము.

విదర్చిక. సం. వి. ఆ. స్త్రీ. రూ-విచర్చిక, కండువు, కండూతి, కండూయ, కండూయనము, కచ్ఛువు, ఖర్జువు, ఖసము, పాము, పామము, వ్రణము. (తె).— కండు, కసి, కసిమిరి, గజ్జి, గురగుర-గుఱగుఱ, గుల, గులగుల, చిడుము, జిల, తీఁట, తీంట్రము, తీవిరము, దురద, దూల, నవ, నస, నుస, బులుపు, రాక. (చూ, వ్రణము.)

విదర్భ. అం: చూ, దేశములు. (విదర్భము)

విదలించే. వా. సం. స.క్రి: చూ, రూ-విదళించే.

విదశలకు సూక్ష్మదశలుకట్టు పద్ధతి. అం. ఎవని దశలో నెవనిసూక్ష్మదశను కనుఁగొనవలెనో యట్టివాని విదశాపరిమాణమును సూక్ష్మదశానాథుని మహాదశాసంవత్సరసంఖ్యచే గుణించవలెను. అట్లుగుణించిన మొత్తమును 120 చే భాగించినయెడల సూక్ష్మదశా పరిమాణము తెలియును.

విదళనము. సం. వి. అ. న. కందులులోనగువాని పప్పు: చూ, సూపము.

విదళించే. సం. స. క్రి. 1. మిక్కిలిఖండించే: చూ, సెలగు; 2. మిక్కిలిభేదించే: చూ, స్ఫోటించే; 3: (తె).—దులుపు, రాలఁగొట్టు, రాలుచే, విదలించే, విసరు. తద్వి.— పోడించే- పోపలించే.

విదళింపు విలకడ. అం: చూ, ఉపవీతములు.

విదాకరము. సం. వి. అ. పుం. 1. చెలమ: చూ, సరస్సు. 1; 2. పిల్లనూయి: చూ, సరస్సు. 1; విణ. 3. చీల్చునది.

విదారకుఁడు. సం. విణ: దారకుఁడు.

విదారణము. సం. వి. అ. న. 1. చీల్చుట: చూ, స్ఫోటము; 2. చంపుట: చూ, హింస. 1; 3: చూ, యుద్ధము. (ప్రవిదారణముఅనియు.)

విదారి. సం.వి. ఈ. స్త్రీ.1. తెల్లనేలగుమ్మడి*: చూ, సర్వతోభద్ర; 2.ముయ్యాకుఁబొన్న*: చూ, సాలపర్ణి; 3: చూ, రోగము. 1.

విదారించు సం. స. క్రి. చీల్చు, వ్రచ్చు: చూ, స్ఫోటించే.

విదారిగంధ. సం. వి. అ.స్త్రీ: చూ, విదారి.2*.

విదారితమగు.మి. స. క్రి.చీలు: చూ,స్ఫోటించే.

విదారితము. సం. విణ: చూ, విచ్ఛిన్నము. 3.

విదాహము. వా. సం. వి. అ. పుం: మిక్కిలిదప్పిక: చూ, వెక్కిలి.

విదిక్కు. సం. వి. శ్. స్త్రీ. రెండుదిక్కులనడుము: (సం)అపదిశము, అస్రము, ఉపాంతము, కోణము, సంబాధము. (తె).—ఇఱుకు, కోన, గొంది, గొతి, గొబ, అయిమూల-ఐమూల, మూల,మూలవాటు, రోక. తద్వి.— ౧. పర్వతముయొక్క అత్యల్పకోణమునకు.—(తె).—గొంది, మూల; ౨. నాలుగు మూలలకు. (తె).—చేపు పదము —చొపదము. ("చూ, హరిత్తు. 1.")

విదితమగు. మి. స. క్రి: వికదమఁగుచే, అధిగమించే, గ్రహించే-గ్రహియించే. (తె).— ఎఱుకఁబడు, తెలియు, పట్టువడు.

విదితము. సం. విణ. 1. తెలియఁబడినది: చూ, వ్యక్తము. 2; 2. అంగీకరింపఁబడినది: చూ, స్వీకృతము.

విదియ. వై. వి.=ద్వితీయ. పక్షమందు రెండవతిథి: చూ,తిథి-తిథులు.(చూ,హరివాసరము.)

విదీర్ణము. సం. విణ. చీల్పఁబడినది: చూ, విచ్ఛిన్నము. 3. [చూ, సడలు. 4.

విదుర. దే. అ. క్రి. రూ—విదులు. గళితమగు:

విదురుఁడు. సం. వి. అ. పుం. 1. ధృతరాష్ట్రుని

తమ్ముఁడు; విణ. 2. తెలియునట్టివాఁడు; 3. తెలిసినవాఁడు: చూ, సుధి.

విదురుచు. దే. క్రి. రూ-విదుర్చు-విదులుచు-విదుల్చు-విదుర్చు, విదిలించు, విదురఁజేయు.

విదురుపు. దే. వి. విదురుచుట: రూ-విదుర్పు, విదులుపు-విదుల్పు.

విదుర్చు. దే. క్రి: చూ, రూ-విదురుచు.

విదుర్పు. దే. వి: చూ, రూ-విదురుపు.

విదులము. సం. వి. అ. పుం. (రూ-విచులము-విదులము) 1. ప్రబ్బ*: చూ, సహస్రవేధి 2; 2. నీరుప్రబ్బ*: చూ, పవాసవేధి. 2.

విదులు. దే. అ. క్రి: చూ, రూ-విదురు.

విదులుచు. దే. క్రి: చూ, రూ-విదురుచు.

విదులుపు. దే. వి: చూ, రూ-విదురుపు.

విదుల్చు. దే. క్రి: చూ, రూ-విదులుచు.

విదుల్పు. దే. వి: చూ, రూ-విదులుపు.

విదువు. సం. వి. ఉ. పుం. ఏనుఁగు కుంభస్థల మధ్యము: చూ, హస్తి.

విదుషి. సం. వి. ఈ. స్త్రీ. విద్వాంసురాలు: చూ, స్త్రీ. [విదూరకము.

విదూరము. సం. వి. అ. పుం: చూ, రూ-

విదూషకుఁడు. సం. విణ. 1. పరులను దూఱు వాఁడు; 2: చూ, విటుఁడు; అం. 3. (ఆత్మవీరుఁడు): చూ, నాయకసఖులు; 4: చూ, నాయకులు. [చూ, సువవి. 1.

విదూషిక. సం. వి. ఆ. స్త్రీ: పొట్టికాఁకర*.

విదేశము. సం. వి. అ. పుం. ఇతరదేశము.

విదేశీయుఁడు. సం. విణ. ఇతరదేశస్థుఁడు.

విదేహము. సం. విణ. 1. దేహములేనిది; అం. 2: చూ, సీమ (1) (దేశములు); 3: చూ, తంత్రములు.

విద్దియ. వై. వి.=విద్యా. రూ-విద్దె: చూ, విద్య.

విద్దె. వై. వి.= —వై.— [క్రీడ

విద్దియము. వై. వి.=వేద్య, విద్యా: చూ, బాల



విద్దెము. వై. వి.= : చూ, రూ-విద్దియము.

విద్య. సం. వి. ఆ. స్త్రీ.=విద్దె-విద్దియ. 1. ఆగమము, ఆమ్నాయము, నిపఠము-నిపాఠము, పఠనము-పాఠము. (తె) —చదువు, విద్దియ-విద్దె. తద్వి.—౧. పాఠము; ౨: అనుసంధానము; 3: అనుగవచనము, తురాయణము; ర. (తె):—నెఱవిద్దె, ౫: పఠనము, విద్య. (తె).—సంత, 2. జ్ఞానము: చూ, [illegible]ఖము 2; పా 3 ఉపమానము:— [illegible]భావ సరస్వతి; అం. 4: చూ, మదములు; 5: చూ, దానములు; ట 6: చూ, విద్యలు.

విద్యచెప్పినవాఁడు. అం: చూ, పితలు.

విద్యమానము. సం. విణ: వర్తమానము.

విద్యలు. అం. 1. చతుర్విద్యలు.- ఆన్వీక్షికి (ఇందు విజ్ఞానము తెలుపఁబడును), త్రయి (ఇందు ధర్మాధర్మములు తెలుపఁబడును), వార్త (ఇందు అర్థానర్థములు తెలుపఁబడును), దండనీతి (ఇందు నయానయములు తెలుపఁబడును); 2. షడ్విద్యలు - ఆకర్షణము, స్తంభనము, మారణము, విద్వేషణము, ఉచ్చాటనము, మోహనము: (చూ, శాస్త్రములు); 3. చతుర్దశవిద్యలు.- చతుర్వేదములు (ఋగ్యజుస్సామాథర్వణ వేదములు), షడంగములు (శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము), మీమాంస, న్యాయశాస్త్రము, పురాణములు, ధర్మశాస్త్రము; 4. అష్టాదశ విద్యలు.— చతుర్దశ విద్యలు, ఆయుర్వేదము, ధనుర్వేదము, నీతిశాస్త్రము, అర్థశాస్త్రము, 5. అఱువదినాలుగు విద్యలు:- చూ, తంత్రములు; తద్విశేషములు.-౧: బల; ౨. [illegible]వాదము, వాచము. ("చూ, శాస్త్రములు"); పా 6. ఉపమానము.- బృహస్పతి.

విద్యాధరశాస్త్రము. అం: చూ, అస్త్రములు.

విద్యాధరుఁడు. అం: చూ, దేవతాభేదము.

విద్యాప్రిభావసూచకము. అం: చూ, ప్రిమేయములు.

విద్యాప్రిసంగసమయము. అం. (పండితుఁడగు వు): చూ, గ్రిహసమయములు.

విద్యామదము. అం: చూ, మదములు.

విద్యార్థి. సం. వి న్. పుం. చేసువుకోరువాఁడు, చేసువువాఁడు. [చూ, సుధి.

విద్యావంతుఁడు. సం. విశ. (త్. ఈ. త్):

విద్యావర్తి అం: చూ, అను భావర్తములు.

విద్యాసముద్దేశము. అం: చూ, ప్రికరణములు.

విద్యుత. అం: చూ, విద్యుత్తులు.

విద్యుత్తు. సం. వి. త్. స్త్రీ. 1: చూ, విద్యుత్తులు; 2: చూ, సంధ్య; 3: ఐరావతి. (తె) కోలమెఱుపు; విశ. 4. మెఱుఁగు లేనిది.

విద్యుత్తులు. అం. 1: తటిత్తు, సౌదామిని, విద్యుత్తు, పీణ, చంచలము, చపలము, నిశ్చలము, అచలము (7); విద్యుత్తునకు.— అక్షణప్రిభ, అచిరద్యుతి, అచిరాభ, అణుభావము,అశనిసౌదామిని, అకాలికి,ఐరావతి,కంతి, కంకిక, క్షు,క్షణప్రిభ,క్షణిక,ఖర్జువు,ఘనరసము, ఘనవల్లిక,చంచల,చపల,చిలనీలిక, చిలిమోలిక, ఛటాభ,ఛటాంబి,తటిత్తు,రాధ,విద్యుత-విద్యుత్తు,శంప_సంప,శతహ్రిద, సంధ్య, సౌదామని-సౌదామిని, హ్రాదిని. (తె).-మించు, మిఱిమిఱి, మెఱుఁగు-మెఱుఁగు, మెఱపు-మెఱుపు-మెఱుము, మొగుల్పుట్టువు తద్వి.—౧: (తె).—తీఁగమెఱుఁగు; ౨: (తె).—తోలకరిమెఱుపు-తొలకరిమెఱుపు; 3: వీణ. (తె).—మలఁకమెఱుపు; (ఇందుకు సంబంధించిన శాస్త్రపరిభాషా పదములు.—విద్యుచ్ఛక్తి-విద్యుచ్ఛక్తిశాస్త్రము, విద్యుత్ప్రవాహము, విద్యుత్ప్రేరణ, విద్యుద్యంత్రిము, విద్యుద్ఘాత కంపము, విద్యుత్ చణుకు, విద్యుత్కారణము, విద్యుత్ప్రమాణువు-విద్యుత్కణము, విద్యుజ్జనకము, విద్యుత్ సూచకము; మఱియు.— విద్యుద్ఘటమాల-విద్యున్మాల, విద్యుద్రజ్జు, విద్యుత్ గడియారము, విద్యుత్ప్రవాహము, విద్యుదగ్రిము, విద్యుత్ ప్రిణము, విద్యుద్దీపము— విద్యుత్త్రికాశము, విద్యుద్యంత్రిము, విద్యుచ్ఛాలక-విద్యుత్ ప్రవాహ జనకోపకరణము, విద్యుల్లేఖిని, విద్యుత్ రైలు, విద్యుత్కిరణము, విద్యుత్ తారా ప్రేషణయంత్రము, వోల్టు-విద్యుచ్చలనశక్తిమాత్రి, విద్యుద్వేత్త, విద్యుచ్ఛాస్త్రజ్ఞుఁడు; మఱియు. వాతావరణజన్యవిద్యుత్తు- ఆకాశస్థవిద్యుత్తు, చలవిద్యుత్తు-గతివిశిష్టవిద్యుత్తు, ఘర్షణజన్యవిద్యుత్తు-ఘర్షణ విద్యుత్తు, చుంబకీయ విద్యుత్తు-చుంబన జన్య విద్యుత్తు, ఋణవిద్యుత్తు, ధనవిద్యుత్తు, లాక్షవిద్యుత్తు, స్థిరవిద్యుత్తు, వాల్టేయిక విద్యుత్తు, కాచవిద్యుత్తు; మఱియు.— విద్యుత్ప్రేరణము- విద్యుద్ఘటనము, విద్యుద్గతిశాస్త్రము, విద్యుత్ చుంబకము, విద్యుజ్జీవన శాస్త్రము, విద్యుత్ శోషకత-విద్యుత్ కోశాకర్షకత, విద్యుత్ సూక్ష్మకాలదర్శకము, విద్యున్మార్గము, విద్యుత్ప్రవాహమాపణయంత్రిము, విద్యుత్ మలామా-విద్యుద్ధాత్వారోహణము,విద్యుద్గతిస్థితిశాస్త్రము, విద్యుద్విచ్ఛేదనము, విద్యుద్వికారము, విద్యుచ్చుంబనీయ, విద్యుద్ధాత్వారోహణవిద్య, విద్యున్మాపకము, విద్యున్మితి, విద్యుచ్చలనము, విద్యుచ్చాలక, విద్యుచ్చాలకశక్తి, విద్యుచ్చాలక, విద్యుత్పరమాణువు- (ఋణ) విద్యుత్కణము-అణీయము, ఋణాత్మక విద్యుత్తు, విద్యుత్స్వరయంత్రిము, విద్యుత్ స్ఫురక, విద్యుదింద్రియ విజ్ఞానశాస్త్రము, విద్యుత్ మలామా, విద్యుత్ ధ్రువీయ, ధనాత్మక విద్యుత్తు, విద్యుద్దర్శకము— విద్యు

వ వు లు-డా లు, త మ కు, తీ రు-
తీఋ, తెగ, తెన్నడి, తెఱఁగు-తెఱవు,
తోగ, తోయము, దారి, దినుసు-దినుస్సు,
నెవ్వ, నెఱి, పంతము, పక్కి, పగిది, పదిది,
పదకను, పముసు, పరుసడి, పసరు, పత్తి,
పాట, పాటి, పాటు, పాళము, పొలను.
పొలువు-పొల్పు, పోఁడిమి-పోణిమి, పోపి
డి, ప్రోిన, బడి, బలువిడి-బల్విడి, బాగు,
మంచల, మయి-మెయి, మయిపడి-మెయి
పడి-మైపడి, మరియాద, మాడికి-మాడ్కి,
మాదిరి-మాద్రి, మే-మై, మేర, మొగి,
మోయిను, రకము, రమణ-రవణ, రహి,
రాణ, రీతి, రూపు, లలి, లాగు, లీల,వగ,వడు
గు-వడువు, వన్నియ-వన్నె, వయినము-
వైనము, వగుపడి, వరుస, వలను, వళవు,
వహి, వావిరి, వాళి, విధము, విన్నువు,
వీఁక, వెంట, వెరవు-వెరువు,సంగడి, సంచే,
సరవి, సవురు-సౌరు, సూటి, సొరిది,
సోివి, హంగు. ("చూ, హంగు.");
2. చేయుట: చూ,విధి.2; 3. వేతనము: చూ,
సంబళిక. 2; 4: చూ, విధానము. 4.

విధవ. సం. వి. ఆ. స్త్రీ. పెనిమిటిలేనిది: చూ,
స్త్రీ. తద్వి.—దిక్కులేనిది.— అనాథ,
విధవ. (తె) ఆనద, అలకి.

విధాత. సం. వి. ఋ. పుం. (రూ-విధాతృఁ
డు-ధత-ధాత-విధత.) 1: చూ, బ్రహ్మ.1;
2. రూ-విధాతృఁడు: చూ, మన్మథుఁడు;
ఆ. స్త్రీ. 3. రోహిణీనక్షత్రము: చూ,
రిక్క; అం. 4: చూ, దూతీచతుష్టయము.

విధాతృఁడు. సం. వి. ఋ. పుం: చూ, రూ-
విధాత. 1-2. [చూ, సన్న్యాసి.

విధాతృభువు. సం. వి. ఉ. పుం. నారదుఁడు:

విధానము. సం. వి. అ. న. 1.చేయుట, విధము,
విధి: చూ, వ్యాపారము. 1; 2. ఆజ్ఞ: చూ,
సెలవు; 3. పూజ: చూ, సపర్య; 4. ఏనుఁ
గున కిచ్చే ఆహారపుముద్ద, కరికవలము, పుల
కము, విధము: చూ, సాదము. (1); 5. ఉ
పాయము: చూ, వెరవు; 6. ధనము: చూ,
హిరణ్యము. 3.

విధాయకము. సం. వి. అ. న. ఆజ్ఞ:చూ,సెలవు.

విధాయకుఁడు సం. విశే. విధించువాఁడు:
విధాయి.

విధాయి. సం. విశే. (న్. ఈ. న్)—వై.—

విధి. సం. వి. ఇ. పుం. 1: చూ, విధాత. 1;
2. చేయుట: చూ, వ్యాపారము. 1;
3. కాలము: చూ, సమయము. 1; 4. భాగ్య
ము: చూ, సంపత్తి. 1; 5. ఏర్పాటు (ఇది
త్రివిధము.— అపూర్వవిధి, నియమవిధి,
పరిసంఖ్యావిధి);స్త్రీ. 6. రోహిణి: చూ,
రిక్క; 7: చూ, విధము. 1; అం. 8: చూ,
అలంకారము. 3. ("సిద్ధవిషయమును చెప్పు
ట. ఉదా.—పంచమం బెత్తుగడ సేయు
నపుడె కోయిలయని తెలియఁబడు.");
9: చూ, విధులు. (ఇది వేదాంగమైనవిధి).

విధించు. సం. స. క్రి. 1. కట్టడచేయు; వా.
2: చూ, సృజించు.

విధుంతుదుఁడు. సం. వి. అ. పుం. రాహు
గ్రహము: చూ, రాహువు. 1.

విధుతము. సం. విశే. రూ-ధుతము. 1. విడువఁ
బడినది: చూ, సముజ్ఝితము; 2. కదలింపఁ
బడినది: చూ, వేల్లితము. 2; అం. 3: చూ,
శిరఃక్రియలు; 4: చూ, ముఖక్రియలు.

విధురము. సం. వి. అ. న. 1. ఎడఁబాటు:చూ,
విరహము; 2:చూ,వైకల్యము; విశే.3. ఎడఁ
బాటునొందినది; 4. వైకల్యమునొందినది.

విధురుఁడు. సం. వి. అ. పుం. భార్యావియోగ
మైనవాఁడు: అయోగుఁడు.

విధులు. అం: అపూర్వవిధి, నియమవిధి, పరి
సంఖ్యావిధి (3.) (చూ, విధి, 5-9.)

విధువనము. సం. వి. అ. న. (రూ-విధూవనము. విధువము-విధవనము- విధూన్యము-విధూయము-విధన్యము- విధాన్యము) కదలించుట చూ, స్ఫారము. 1 (లోలము. 1)

విధువము. సం. వి. అ. పుం —పై.—

విధువు. సం. వి. ఉ. పుం. 1. చంద్రుఁడు చూ, హిమాంశువు; 2. విష్ణుఁడు: చూ, విష్ణువు 1; 3. కర్పూరము: చూ, సితము. (2)

విధూతము. సం. విణ. 1: చూ, విధుతము. 2; 2. విడువఁబడినది: చూ, హీనము. 3; అం. 3: చూ, శస్త్రములు.

విధూతి. సం. వి. ఇ. స్త్రీ. చూ, విధువనము.

విధూవనము. సం. వి. అ. న. —పై.—

విధేయుఁడు. సం. విణ. వినయముగలవాఁడు: అనూచానుఁడు, ఆశ్రవుఁడు, వచనప్రకారకర్త, వచనేస్థితుఁడు, వశవర్తి, వినయగ్రాహి, వినయశీలుఁడు, వినీతుఁడు, శిష్టుఁడు. (తె).—మాటదాఁటనివాఁడు, మేపడికాఁడు. (చూ, సేవకుఁడు.)

విద్ధకము. అం: చూ, అజాతస్మరాలింగనములు.

విద్ధకర్ణి. సం. వి. ఈ. స్త్రీ: రూ-విద్ధకర్ణిక-విద్ధపర్ణి, అంబష్ఠ, ఏకాష్ఠీల, కుచేల-కుచేలి, పాఠ, పాపచేలి, ప్రాచీన, రస, వక్త్రి, వనతిక్తక, వృకి, శివ, శ్రేయసి, స్థాపని. (తె).—అగలుసొంటి, చిఱుబొద్ది, పాటతద్వి.— (తె) విసబొంది-విసబొద్ది*.

విద్ధకర్ణిక. సం. వి. ఆ. స్త్రీ. —పై.—

విద్ధపర్కటి. సం. వి. ఈ. స్త్రీ. కానుగు*: చూ, శాదఘ్నము.

విద్ధపర్ణి. సం. వి. ఈ స్త్రీ: చూ, రూ-విద్ధకర్ణి*.

విద్ధము. సం. విణ. 1. తొలువఁబడినది: ఛిద్రితము; 2. త్రోయఁబడినది: అస్తము, ఈరితము, క్షిప్తము, నికృతము, నిరస్తము, పర్యుదస్తము, ప్రణీతము. (తె).—పొల్లు; 3. బాధింపఁబడినది: చూ, వేధితము. 2; 4. సమానమైనది: చూ, సుషమ. 2.

విధ్యర్థకము. అం. ధాతువు చివర (అవి) చేరిన విధ్యర్థకమగును. "చేయునది."

విధ్వంసము. సం. వి. అ. పుం. మిక్కిలి ధ్వంసము: చూ, సంస్థ. 3

వినఁబడు వా. అ. క్రి: వినిపించు.

వినకపోవు. వ్యా. స. క్రి: చూ, పెడచెవిఁబెట్టు.

వినత. సం వి. ఆ. స్త్రీ. 1. గరుత్మంతునితల్లి: చూ, సవిత్రి 1;2 వంపుపెట్టె: చూ, సందుకా.

వినతము. సం విణ. 1. వంకరైనది: చూ, వేల్లితము. 3; 2. వంగినది: చూ, వక్రము; 3 గురుశిక్షితమైనది.

వినతి. సం. వి. ఇ. స్త్రీ. 1: చూ, వినయము 1; 2. నమస్కారము: చూ, మాణిగలు.

వినతుఁడు. సం. విణ: చూ, ప్రణతుఁడు. 2.

వినతేయుఁడు. సం. వి. అ. పుం. రూ-వైనతేయుఁడు. గరుత్మంతుఁడు: చూ, హరివాహనుఁడు.

విననివాఁడు. దే. విణ: చూ, బధిరుఁడు.

వినమితము. సం. విణ. మిక్కిలివంగినది: చూ, వక్రము. [యము. 1.

వినమ్రిత. వా. సం. వి. ఆ. స్త్రీ: చూ, విన

వినమ్రము. సం. వి. అ. న. 1. తగరము: చూ, పూన్న (లోహము. 1-౭.); విణ. 2. మిక్కిలి వంగినది: చూ, వక్రము.

వినమ్రుఁడు. సం. విణ. మిక్కిలివంగినవాఁడు: నమ్రుఁడు, ప్రణతుఁడు, ప్రవణుఁడు. (తె).—వంగినవాఁడు.

వినయ అం: చూ, వృత్తము. 1. ("ఒక్కొక్క పాదమునకు ఒకసగణము. శివ ఛందస్సు.")

వినయగ్రాహి. సం. విణ: చూ, విధేయుఁడు.

వినయము. సం. వి. అ. పుం. 1: ప్రణయము, ప్రణతి, ప్రసరము, మానన, వినతి, వినమ్రత. (అన్య).— అ. (తె).— అడఁకువ-అణఁకువ-అణుఁకువ, డింగు, మందట, మడుఁ

గు-మడువు-మడ్గు-మణుఁగు-మణువు, మే
వడి, వందిలీకము; 2. గురుశిక్ష.

వినయశీలుఁడు. సం. విణ: చూ, విధేయుఁడు.

వినశ్యతి. అం: చూ, భావవికారములు.

వినాత. అం: చూ, భిన్నపంచమజభాషలు.

వినాముఖము. సం. వి. అ. పుం. బౌద్ధాలయము: చూ, సదనము. 1.

వినాయకుఁడు. సం. వి. అ. పుం.=వెనకయ్య. (స్వతంత్రుఁడౌటవలనఁ దనపయిపెర ప్రభువు లేనివాఁడు, దుష్టులనువిఘ్నములను శిక్షించే వాఁడు.): అనేకపముఖస్వామి, ఆఖువాహనుఁడు, ఇభుఁడు, ఉమాసుతుఁడు, ఉమో ద్భవుఁడు, ఏకదంతుఁడు, ఐశుఁడు, కరిముఖుఁడు. గ, గజాననుఁడు, గణపతి, గణాధిపతి, గణాధిపుఁడు, గణాగ్రణి, ఢుండి, త్రిధాముఁడు, ద్విదేహుఁడు, ద్వైమాతురుఁడు, న, పృశ్నిశృంగుఁడు, మూషికాంచనుఁడు, లంబోదరుఁడు, వజ్రదంతుఁడు, వానవుఁడు, విఘ్ననాయకుఁడు, విఘ్ననాశకుఁడు, విఘ్ననాశనుఁడు, విఘ్నరాజు, విఘ్నవినాయకుఁడు, విఘ్నహారి, విఘ్నుఁడు, విఘ్నేశుఁడు, వృషాంకుఁడు, సుముఖుఁడు, హేరంబుఁడు. (తె.):—ఇద్దఱుతల్లుల ముద్దుబిడ్డఁడు, ఏనుఁగు మోముసామి, ఒంటికొమ్ము వేలుపు, కుడుముల తిండికాఁడు, కొక్కురవుతు- కొక్కురౌతు, కోడెపెక్కుమువానన్న, గఱి(రి)కజేఁ మెచ్చేగబ్బి వేల్పు, గుంజిళ్లుపెట్టించే కొమవేల్పు, గుజ్జువేలుపు, గొప్పబొజ్జగలాఁడు, గొప్ప మెయిపోడ, చేటచెవుల వేలుపు, చేటవీనులసామి, జేజితల్లులబిడ్డ, టింగణాసామి, పగడపంటికొర, పనిచెఱుచే వాఁడు, పనిచెఱుపువేల్పు, పాఁపజేందెములమేటి, పాఁపజేన్నిగట్టు, పిళ్లారి, పెద్ద కడుపువేల్పు, బిబ్బికడుపువేల్పు, బొజ్జదేవర, మూక్కంటి తొలిపట్టి, ముక్కంటిపండుల మెక్కెడు దిండిఁడు, మొదటివేల్పు, మొట్టికాయలమెప్పు, మ్రొక్కువారల పను లోఁ జెక్కఁజేసెడుసామి, వంకరతొండంబువాఁడు, వెనకయ్య. ("మా, హేరంబుఁడు."); 2. చూ, బుద్ధుఁడు; 3. చూ, హరివాహనుఁడు; 4. గురువు: చూ, సురాచార్యుఁడు (పంతులు. 1); అం. 5: చూ, శాస్త్రప్రవర్తకులు.

వినాయకుపిరి. మి. వి: చూ, బాలక్రీడ.

వినార్థకములు. అం: కాక, తప్ప, తక్క. (3)

వినాశకాలే విపరీతబుద్ధిః. లో. నశించిపోవు కాలమున వ్యతిరేకపు బుద్ధులు కలుగును. ("వినాశకాలే విపరీతబుద్ధిః" అను వచనం బేల తప్పు.") (నీతిచంద్రిక).

వినాశము. సం. వి. అ పుం. 1. చేటు: చూ, సంస్థ. 3; 2. చోడము: అదర్శనము.

వినికి. దే. వి. (రూ-వినికిడి, వినుకలి-విన్కలి-విన్కి.): చూ, శ్రవణము. 2. [ర్థమున ఇడి.]

వినికిడి. దే. వి. (వినికి + ఇడి).—పై.—(స్వా

వినిగూహితము. అం: చూ, అధరము. 6.

వినినిందించే. మి. స క్రి. మిక్కిలినిందించే.

వినిపాతప్రతీకారము. అం: చూ, అంగపంచకము.

వినిపించే. వా. అ. క్రి: వినఁబడు, వినుచే.

వినిమయము. సం. వి. అ. పుం. 1. వస్తువుల మాఱుపు: ఆపమిత్యకము, నిమయము—నిమేయము- నైమేయము, పరిదానము, పరివర్తనము-పరివర్తము-పరీవర్తము, ప్రతిదానము, బంధకము. (తె).—కుండమార్పు, సిరాయింపు (షిరాయింపు), బదలాయింపు, మారుగడ, మారకము-మాఱకము-మార్కము, మాఱుపు-మార్పు, విడిగోలు, వినిగోలు, వీడు; 2. కుదువ: చూ, వారకము (1); అం. 3: చూ, స్వామ్యములు.

వినియుక్తము. సం. విణ. వినియోగింపఁబడినది. (నియోగింపఁబడినది=ప్రతిసరము)

వినియోగము. సం. వి. అ. పుం. 1. ఉపయోగము: చూ, సమృద్ధి; 2. ఉపయోగించుట: 3. నియమనము: చూ, సత్యము 1.

వినియోగించు. సం. స. క్రి. ఉపయోగపఱచు: (తె). వాడు, వీలు. [విపాగ్రింతము.

వినిర్గతము. సం. విణ. బయలువెడలినది:

వినివర్తితము. అం: చూ, పార్శ్వక్రియలు.

వినివృత్తము. అం. 1: చూ, ముఖక్రియలు; 2: చూ కరణములు

వినీతబాహువు. అం. చూ, పరిచారములు.

వినీతము. సం వి. అ. పుం. 1. చేకట్టఁగా మోసెడి గుఱ్ఱము: చూ, హయము; 2: చూ. నిభృతము.

వినీతుఁడు. సం. వి. అ పుం. 1. వర్తకుఁడు: చూ, సార్థవాహుఁడు. 1; విణ. 2. జితేంద్రియుఁడు: చూ, హంసుఁడు. 3; 3. గురువుచేత శిక్షింపఁబడినవాఁడు; 4. గురువుచేత శిక్షింపఁబడనివాఁడు; 5. వినయముగలవాఁడు: చూ, విధేయుఁడు; 6: చూ, ప్రశ్రితుఁడు.

విను. దే. వి. 1. రూ-విన్ను, మిను-మిన్ను. ఆకసము: చూ, సురవర్త్మము; స. క్రి. 2: ఆలకించు-ఆలించు, ఊఁకొట్టు, ఊఁకొను, చెవిదోరఁబెట్టు, చెవియొగ్గు, చెవివాలఁబెట్టు, వీనిచ్చు. (సం).—ఆకర్ణించు, శ్రుతమగు; వా. 3. చనివిను. [వినికి.

వినుకలి. దే. వి. రూ-విన్కలి: చూ, రూ-

వినుకలికంటి. దే. వి. (వినుకలి+కన్ను) పాము, చక్షుశ్శ్రవము: చూ, సర్పము.

వినుకెంపు. దే. వి. ద్యుమణి. ఉ, రా. 1, ఆ. 48: చూ, సూర్యుఁడు. (ఇట్లు వినుమానికము, వినురతనము).

వినుచు. దే. అ. క్రి. 1. వినవచ్చు. భో. 5, ఆ. 73: 2. వినఁబడు. అం, భా. త్వ. 115; శే°. 3. వినఁజేయు: చూ, వినిపించు. భార. ఆది. 4, ఆ.

వినుచోఱి. దే. వి రూ-విన్నుచోఱి. నభస్వంతుఁడు: చూ, వాయువు. [సాం. దే. 3.

వినుజొట్టువేల్పు. దే. వి: చూ, శివుఁడు.

వినుదివ్వె. దే. వి. ఖచరుఁడు. అచ్చ. అ. కాం. 13: చూ, వేలుపు

వినుప్రోలు. ద్వ. వి రూ-విన్నుప్రోలు-విన్నోలు: చూ, స్వర్గము. [సాంక్రుఁడు.

వినుప్రోల్దొర. ద్వ. వి. ఇంద్రుఁడు: చూ. సహా

వినుమనుమఁడు. దే. వి. 1. భీముఁడు. అం. పదా. 2-6: చూ, వృకోదరుఁడు; 2. హనుమంతుఁడు. అచ్చ. యు, కాం. 407: చూ, వానరము. [సాం. దే. 18.

వినుమిటారులు. దే వి. బ: చూ, వేలుపు.

వినుము. వా. వి: (సం)—అనధారణము—అవధారము—అవధారు, మాత్రి.

వినుమ్రాను. దే. వి. కల్పవృక్షము. అచ్చ. సుం. కాం. 34: చూ, వేలుపుఁజెట్టు.

వినురతనము. ద్వ. వి: చూ, వినుకెంపు. [అం 20.

వినులంజెలు. ద్వ. వి. బ: చూ, వినుమిటారులు. వేం.

వినుపలను. దే. వి. రూ-విన్పలను: చూ. వినుప్రోలు.

వినువాఁక. ద్వ వి. స్వర్నది. గంగ. రామా. 1. ఆ, 122: చూ, నది.

వినువాఁకతోవరి. ద్వ వి: చూ, శివుఁడు.

వినువాఁడు. వా. వి: (సం) శ్రోత.

వినువారలమానికము. ద్వ. వి. చింతామణి. అం. పదా, సుర. 27: చూ, రత్నములు.

వినుసిగదేవర. ద్వ. వి. వ్యోమకేశుఁడు. రామా. 1, ఆ. 7: చూ, శివుఁడు.

వినోక్త్యలంకారము. అం: చూ, అలంకారము. 3. ("కొంచెమును బాసినచము, కొంచెమును బాసి రమ్యమునయ్యేనేని యిట్లు ద్వివిధము. ఉదా.—గ. వినయమును బాసి విద్యయవిద్య

యయ్యో. ఆ ఖులులతోఁ బాసి నీసభ ఘనత కెక్కు.")

వినోదము. సం. వి. అ. పుం. 1. క్రీడాదులచేత పొద్దుపుచ్చుట: (తె) వేడుక-వేడ్క; 2. క్రీడ: చూ, విలాసము. 1.

వినోదించు. సం. అ. క్రి. 1. క్రీడాదులచేత పొద్దుపుచ్చు; 2. క్రీడించు: చూ, చేరలాడు.

వినుకలి. దే. వి: చూ, రూ-వినుకలి.

వినికి. దే. వి. —పై.— (రూ—వినికి)

విన్న. వై. విణ =ఖిన్న. వివర్ణమైనది.

విన్నఁబడు వై. అ. క్రి (విన్న + పడు) వివర్ణమగు-పా. 4, ఆ.61: చూ, వెలవెలఁబాఱు.

విన్నఁబాటు. వై. వి. విన్నఁబడుట. హరి. ఉ. 8, ఆ. 144: చూ, వైవర్ణ్యము. 1.

విన్నఁబోవు. ద్వ. అ. క్రి: చూ, విన్నఁబడు. సా. 2, ఆ. 99.

విన్నన. వై. వి. 1.=ఖిన్న: చూ, విన్నఁబాటు; 2. న్యూనత: చూ, సొడ్డు. 1.

విన్ననువు. వై. వి.=విజ్ఞానమ్. 1. నేర్పు: చూ, సామర్థ్యము. 1; 2: చూ, విధము. 1.

విన్నపత్రిక. వా. మి. వి. (విన్నపము + పత్రిక) విజ్ఞాపన పత్రిక. భల్లా. 4, ఆ.

విన్నము. సం. విణ. 1. పొందఁబడినది: చూ, సంసక్తము; 2. తెలియఁబడినది: చూ, వ్యక్తము. 2; 3: చూ, విచారితము.

విన్నవించు. వై. స. క్రి =విజ్ఞాపన: మందలించు. (సం).—విజ్ఞాపించు.

విన్నవోవు. ద్వ. అ. క్రి. (అం. శే. 26): ఒల్లఁబోవు, చిన్నఁబోవు-చిన్నవోవు, తూలపోవు, పుయిలోడు, బుచ్చివాఱు, వాఁకు. (సం).—ఖిన్నుఁడగు.

విన్నాణము. వై. వి.1.= విజ్ఞానమ్: చూ, సామర్థ్యము. 1; 2: చూ, విన్ననువు; విణ. 3. ఒప్పిదమైనది. వసు. 2, ఆ. 137; శశాం. 4, ఆ. 1: చూ, హృద్యము; అం. (బ.) 4: చూ, విన్నాణములు.

విన్నాణములు. అం: కక్కు, కొక్కుస, డొక్కుస (డొక్కుర-డొక్కురము-డొక్కురము), ముత్తెర, కుమ్మరింపు, జోడింపు, సందుసీసకము, గొంతుమూరు (ఉ), సమసీసము, సురాటము, చేవ, కరదనము (కందణము), కల్లము, తొట్టి, కిర్లి, బకిపోటు, గొండివేటు, పణము, కర్ణాతు, సుభారము, చొంగణము, పెట్లాగు, రూణింపు, సరిచిత్తరము, వింటిశము (వింటాలము), లాగు, సింగిణి, పాదవాగణము, పదగళాస్తి, గళకత్తెర, నృసింహము, కానెనిల్కడ. (3౨); తద్వి.—(తె) లోలాంక; విసరాకడ; విసరువెంన; (చూ, మొసలు-మల్లబంధములు)

విన్నాణి. వై. వి =విజ్ఞాని-వైజ్ఞానిక. (విన్నాణము + ఇ) 1: చూ, సన్యాసి; విణ. 2. నేర్పరి. భాగ. 2, స్కం.9: చూ, సమర్థుఁడు.

విన్ను. దే. వి: చూ, రూ-విను. 1.

విన్నుచూలి. దే. వి: చూ, రూ-వినుచూలి.

విన్నుపొ్రలు. దే. వి: చూ, రూ-వినుపొ్రలు.

విన్ప్రోలు. దే. వి. —పై.—

విన్యసించు. సం. స. క్రి. ఉంచు. కాశీ 3, ఆ. 240: చూ, హసణించు. 4.

విన్యస్తము. సం విణ. రూ-న్యస్తము. ఉంచఁబడినది: చూ, ప్ర్యూఢము. 2.

విన్యార్థకము. అం. "ఏస్." అనునది.

విన్యాసము. సం. వి. అ. పుం. 1. ఉనుచుట, పెట్టుకోలు: చూ, సంభృతి. 2; 2. మాల్యాదినిర్మాణము: ఆకల్పము, కల్పన-కల్పనము, న్యాసము, పరిస్పందము, ప్రపంచము, రచన-రచనము. (తె).-పన్నకము-పన్నిక-పన్నికము-పన్నుగడ. తద్వి.—ప్ర్యూహము.

విన్వలను. దే. వి: చూ, రూ-వినువలను.

వెన్నుమాగ్రిను. దే. వి: చూ, వెన్నుబద్ద.

వెన్నుమచ్చేదునీఁడు. ద్వ. వి. అర్జునుఁడు: చూ, సుభద్రేశుఁడు.

వెన్నునలమోపు. ద్వ. వి: చూ, సూర్యుఁడు.

వెన్నుముక. దే. వి: కోలెముక-కోలెమ్ము-కోలెమ్ముక- క్రోలెముక, పూసయెముక, వెన్నుపట్టె, వెన్నుపూస. (సం). ఆధారదండము, పీకవింశన్మహామణి, కశేరుక-కషేరుక-కసేరుక, గాంగేయము, వంశము: (చూ, శల్యము. 1.) (ఇందుకు సంబంధించిన శాస్త్రపరిభాషాపదములు.- కశేరుక పిండము,కశేరుక చక్రము, కశేరుకా సంధి ప్రవర్తనకము, గ్రైవేయ కశేరుకము, పృష్ఠకశేరుకములు- పృష్ఠమణి- హృదయకుహరమండలి వెన్నుపూసలు, కశేరుక పత్రికము, కటిమణి-కటికశేరుక- నడ్డిపూసలు, కశేరుకా పృష్ఠకంటకము, కశేరుకాబాహువు. ఇత్యాది.)

వెన్నెల. ద్వ. వి. (వెల్ల + నెల) 1: చందిరిక, నెలవెలుఁగు, రేయెండ. (సం).- కత్ఫ్యము, కామవల్లభ, కార్తికోత్సవము, కైరవి,కౌముది, చంద్రశాల, చంద్రిక, చాంద్రి, చార్వి, జ్యోత్స్న-జ్యోతిస్న, జ్యోతిస్నిక-జ్యోతిస్నికి, హరిచందనము. తద్వి.- పండువెన్నెల, తలిపి వెన్నెల. (చూ, పున్నమ) ("చూ, హరిచందనము. 2"); 2. నది: చూ, వాణిగలు; 3. నది విశేషము: చూ, వాణిగలు.

వెన్నెలకారు. ద్వ. వి. శరదృతువు: చూ, మాసద్వయము.

వెన్నెలకుప్పలు. ద్వ. వి. బ: చూ, బాలక్రీడ.

వెన్నెలకోలు. ద్వ. వి. నది: చూ, వాణిగలు.

వెన్నెలగుత్తి. ద్వ. వి: చూ, హిమాంశువు.

వెన్నెలచిన్నిపువ్వులు. ద్వ. వి. బ.నదివిశేషము: చూ, వాణిగలు.

వెన్నెలనారి. ద్వ. వి. మన్మథుని అయిదవది యగు వింటియొక్క-నారి. (దీనిబాణములు.- మొదలిజొన్న, దిరిసనము, మొగలిపూలు) : చూ, స్థావరము. 1.

వెన్నెలపిట్ట. ద్వ. వి: చూ,వెన్నెలపులుఁగు.

వెన్నెలపులుఁగు. ద్వ. వి: చందమామపులుఁగు, నిప్పుఁదిండి, నిప్పులనుమ్రింగుపులుఁగు, నెలత్రావడము, నెలపులుఁగు - నెలపుల్గు, మంచుత్రాగుడుపులుఁగు, వన్నియలపిట్ట, వన్నెపులుఁగు, వెన్నెలపిట్ట,వెన్నెలపులుఁగు. (సం).—ఊతిథము, గుండ్రాలము, చ,చకోరకము ,చకోరము, జీవంజీవము-జీవజీవము, జ్యోత్స్నాప్రియము. తద్వి.—చకోరముల గుంపునకు. (సం).—చాకోరము.

వెన్నెలప్రోవులు. ద్వ. వి బ: చూ, వెన్నెలకుప్పలు.

వెన్నెలరాయఁడు. ద్వ. వి: చూ, హిమాంశువు.

వెన్నెలఱేఁడు. ద్వ. వి. —పై.—

వెన్బడు. ద్వ. అ. క్రి: చూ, రూ—వెనుఁబడు. (విషాదించుటకు.- భార. ఆది. 2, ఆ.9.)

వెన్బాటు. ద్వ. వి: చూ, రూ-వెనుబాటు. (విషాదమునకు.- భార. విరా. 2, ఆ. 105.)

వెన్వెంట. దే. ద్ర.మిక్కిలిసంబడి: చూ,వెంబడి.

వెప్పు. దే. వి. ఉష్ణము. స్వా. 4, ఆ. 60: చూ, సంజ్వరము. 2.

వెమ్ము. దే. అ. క్రి. తపించు: చూ,సంతాపించు.

వెయి. దే. స. రూ-వెయ్యి-వే-వేయి: చూ, సహస్రము. (చూ, సంఖ్య)

వెయ్యి. దే. వి. —పై.—

వెరఁగు. దే. వి: చూ,రూ—వెఱఁగు. 1-2-3. (వింతకు.-ప్రభా. 4, ఆ. 47.)

వెరఁజోడు. దే. స. క్రి. జోరకొను: వెరజో.

వెరఁజో. దే. స. క్రి. —పై.—

వెరవరి. దే. విశ. నేర్పరి: చూ, సమర్థుఁడు (ఇతఁడె ఉపాయశాలి.)

వెరవిఁడి. దే. విశ. ఉపాయహీనుఁడు.

వెరవు. దే. వి. రూ-వెరువు. 1: అనువు,ఇమ్ము, ఉత్తి, ఉపమ, ఎత్తు, ఎత్తుగడ, ఒడికము,

ఒఱపు, కీలు, జీతనము, జిత్తు, తెఱకువ, తంతు, దీమసము, నెప్పు, పొక్కు, మందు, మేవడి, వజ్జె, వయినము-వైనము, వయిపు-వైపు, వలను, వళవు. (సం):- అంగము, ఉపమ, ఉపాయము, క్రియ, గండకము-గండము, గతి, తంత్రము, తీర్థము, ద్వారము, నిస్తరణము, నిస్సరణము, ముఖము, యుక్తి, యోగము, విధానము. తద్వి.— ౧ ఉపాయములు నాలుగు.- సామ, దాన, భేద, దండములు; ౨. ఉపాయములు ఏడు.- సామ, దాన, భేద, దండ, మాయ, ఉపేక్ష, ఇంద్రజాలములు; 3. ఉపాయములు ఆఱు.- సామ, దాన, భేద, నతి, ఉపేక్ష, రసాంతములు; 2. జీవనోపాయము. హరి. పూ. 7, అ. 130: చూ, స్థితి. 5; 3: చూ, విధము. 1. య. 2, అ. 92; విశే. 4. యుక్తము. ఉ, హరి. 4, అ. 168: చూ, యోగ్యము. 2; 5. వశము. నిర్వ. 3, అ. 5: చూ, స్వాధీనము.

వెరవేకి. ద్వ. వి. విరహతాపము. హరి. ఉ. 7, అ. 190: చూ, సంతాపము.

వెరసి. దే. వి. 1. లెక్క మొత్తము: చూ, సంకలనము; విశే. 2. కడపటిది. కళా. 5, అ. 78: అంత, కడగొట్టు. (సం).-అంతము, అంతిమము, అంత్యము, ఉత్తమ, చరమము, జఘన్యము, పశ్చిమము, పాశ్చాత్త్యము, సాంతము, సాకల్యము. (అవ్య).-కించ. ("చూ, సాకల్యము.")

వెరసు. దే. వి. రూ-వెరుసు. అంకెలలోనగువాని సంకలనపువంక్తులు. "పుట్టువెరసు, టంకాలవెరసు" మొ. [అ. 61.

వెరువు. దే. వి: చూ, రూ-వెరవు. విక్ర. 7,

వెరుసు. వా. వి: చూ, రూ-వెరసు.

వెఱ. దే. వి. 1. రూ-వెఱఁగు-వెఱపు-వెరఁగు, భయము: చూ, సాధ్వసము; 2: చూ, వింత. 1.

వెఱఁగు. దే. వి. రూ- వెరఁగు. 1. భయము: చూ, సాధ్వసము; 2: చూ, వింత. 1. జై. 1, అ. 114; 3: చూ, వెఱవెఱపాటు. ఉ, హరి. 5, అ. 83.

వెఱఁగుపడు. ద్వ. అ. క్రి. 1: అక్కజపడు: చూ, వెఱఁగొందు. 1. భార. అర. 7, అ. 158; 2: తటకాపడు: చూ, వెఱఁగొందు. 2.

వెఱఁగుపడువాఁడు. వ్వ. విశే. విస్మయాన్వితుఁడు.

వెఱఁగుపాటు. ద్వ. వి: చూ, వెఱఁగు. 1-2-3. (వింతకు.-భార. విరా. 5, అ. 126.)

వెఱఁగొందు. దే. అ. క్రి. 1: అక్కజపడు, అచ్చెరుపడు- అచ్చెరువుపడు, అబ్బురపడు- అబ్రపడు, అరుదందు, వెఱఁగుపడు. (మి).-అద్భుతపడు, ఆశ్చర్యపడు; 2: ఉబ్బరపోవు, తటకాపడు, నివ్వెరపడు, ముడుగు, విచ్చేపడు, వెఱఁగుపడు. (మి):-చేష్టలుడుగు. ("చూ, స్రుక్కు (6)")

వెఱక. దే. వి: చూ, పెండ్రిక.

వెఱచేఱచు. దే. అ. క్రి. భయపడు: చూ, స్రుక్కు. (6).

వెఱచే. దే. అ. క్రి.— పై.— ఉ, హరి. 6, అ. 134; రామా. 2, అ. 13.

వెఱపరి. దే. విశే. 1: అదురుగుండియ—అదురుగుండె, అళుకరి, కోళె, పంద, పిఱికి, బెడిదుఁడు. (సం).—అధీరుఁడు, అశూరుఁడు, ఆతంకితుఁడు, అపోగండుఁడు, ఉగ్రంపశ్యుఁడు, ఉగ్రుఁడు, కాకరూకుఁడు, కాకలూకుఁడు, కాతరుఁడు, ఘోరుఁడు, చకితుఁడు, త్రిస్నువు, దీనుఁడు, భయంకరుఁడు, భయశీలుఁడు, భీకరుఁడు, భీరుకుఁడు, భీరువు, భీలుకుఁడు, భీముఁడు, భీష్ముఁడు, భేలుఁడు, విక్లబుఁడు, విలక్షుఁడు, వృకుఁడు, శంకితుఁడు. తద్వి.—౧. భయమును పుట్టించేవానికి:-భయంకరుఁడు, భీకరుఁడు, భీముఁడు; ౨. భయపడినవాఁడు:—దరితుఁడు, దీనుఁడు; 2. భయశీలురాలు: చూ, స్త్రీ.

వెఱపించు. వా. స. క్రి: అంకించు, అడలఁగొట్టు, అడలించు, అదరించు-అదలించు, అదలు, అదలుచు-అదల్చు, ఆడించు, ఆరుచు-ఆర్చు-ఆలుచు, కంకు, గదుము, గదుముకొను, గద్దించు, జంకించు, జంకెయొనర్చు, జళిపించు, బెదరించు, విసరు. (సం).— అధిక్షేపించు, తర్జించు, నిర్భర్త్సించు. (ము) భయపెట్టు. [2. భయములేనిది.

వెఱపిఁడి. దే. విశే. 1. భయములేనివాఁడు;

వెఱపు. దే. వి. భయము: చూ, సాధ్వసము.

వెఱపుఁదీర్చికాపాడినవాఁడు. అం: చూ, పితలు.

వెఱబొమ్మ. దే. వి. పక్ష్యాదులకు వెఱపు పుట్టుటకై భీకరాకారముగఁ బ్రతిష్ఠించెడు ప్రతిమ. విక్రి. 2, ఆ. 179. (గండారపుబొమ్మ అని కొందఱు): చూ, హరిణి. 3.

వెఱవెఱపాటు. ద్వ. వి: తటకా, నివ్వెర-నివ్వెఱ-నివ్వెఱఁగు, నివ్వెఱపాటు, బెచ్చు, వితాకు, వెరఁగు-వెఱఁగు. (సం).— నిశ్చేష్టత. (చూ, విభ్రమము. 1.)

వెఱ్ఱి. దే.వి.1.(ఉ, హరి. 4, ఆ. 48): ఉమాదము- ఉమ్మాదము, కయివు- కైవు, తిక్క- త్రిక్క, పిచ్చె, పిచ్చి, పిచ్చితనము, రింబ-రిబ్బ-రిమ్మ, పీరడి, వెంగళితనము-వెకలితనము, వెడఁగుతనము, వేదుఱు, వేలాకోలము, సీసము. (సం).— ఉన్మాదము-చిత్తవిభ్రమము, పిత్తము, పైత్రమము("చూ, సీసము. 2."); (పిచ్చికిని వెఱ్ఱికిని కొద్దిభేదము కలదనికొందఱు); 2. అవివేకము. రామా. 6, ఆ. 152: చూ, స్వాపము. 3; 3. తిక్క, పిచ్చివాఁడు, లేమరి, పీరఁడి-పీఱఁడి, వెంగలి-వెంగళి, వెకలి-వెక్కలి, వెడఁగు, వెడఁద, వెఱ్ఱివాఁడు, వేదుఱు, వేఱిఁడి. (సం).—ఉన్మత్తుఁడు, ఉన్మదితుఁడు, ఉన్మదిష్ణువు, ఉన్మాదవతుఁడు, ఉన్మాదవంతుఁడు-ఉన్మాదవతుఁడు, ఉన్మాదుఁడు, కార్యకూటుఁడు. తద్వి. పుట్టువెఱ్ఱి; 4. అవివేకి: చూ, స్తబ్ధుఁడు 5. వికారము గలవాఁడు: భీభత్సుఁడు 6. వివేకములేనిది: వెఱ్ఱిబాగులు.

వెఱ్ఱికుక్క. దే. వి. పిచ్చికుక్క: చూ, శునకము

వెఱ్ఱిచెఱకు. దే. వి. చెఱకువంటి యొకానొక గడ్డి*: చూ, తృణము. 1.

వెఱ్ఱిజిల్లేడు. దే.వి.అలర్కము*: చూ, వికిరణము

వెఱ్ఱితుమ్మ. దే. వి. ఒకరకముతుమ్మ*: చూ, విట్ఖదిరము.

వెఱ్ఱిదీరెరోఁకలితలఁజొట్టుమన్నట్టు. జా. రోఁకలితలఁజొట్టుమనుటచే వెఱ్ఱి తీరలేదనుట "వెఱ్ఱిదీరె రోఁకలిఁ దలఁజొట్టుమన్న క్రిఁగా." (కళాపూర్ణోదయము.)

వెఱ్ఱినిమ్మ. దే వి. ఒకానొకనిమ్మ*: చూ, నిమ్మ

వెఱ్ఱినీళ్లమేలువాఁడు. దే. వి. బలరాముఁడు చూ, హలాయుధుఁడు.

వెఱ్ఱినీళ్ళు. ద్వ. వి. బ. మద్యము. అచ్చ. యు కాం. 231: చూ, సుర. 2.

వెఱ్ఱిపుచ్చ. దే. వి. ఒకరకముపుచ్చ*: చూ హరివాలుకము. [హీలమో

వెఱ్ఱిబచ్చలి. దే. వి. ఒకరకముబచ్చలి*: చూ

వెఱ్ఱిబాగులు. దే. వి. 1: చూ, వెఱ్ఱి. 2: చూ, వెఱ్ఱి. 6. [గవేధు

వెఱ్ఱిబీఱ. దే. వి చేఁదిబీఱ*: చూ, హ్రీ

వెఱ్ఱిమేడి. దే. వి: కాకిమేడి, కుక్కమేడి, బమ్మమేడి- బొమ్మమేడి- బ్రిమ్మమేడి (సం).—అరాజి, అద్యుదుంబరి, కాకోదుంబరము- కాకోదుంబరిక- కాదుంబరిక, కుష్ఠఘ్ని, కృష్ణోదుంబరిక, ద్రోదుంబరిక, చిత్రాంగధము, జఘనేఫల్గుష, మలపువు, మలయువు, వాయసి (చూ, మేడి. 1.) (కాకిమేడి=వాయసి కుక్కమేడి=మలపువు, మలయువు.)("హేమదుగ్ధకము.")

వెఱ్ఱిమొగము. వా. వి. తెలివిలేనివాఁడు: చూ, స్తబ్ధుఁడు.

వెఱ్ఱియావలు. దే.వి.బ. తెల్లావలు: చూ, సర్షపము.

వెఱ్ఱివాఁడు. దే. విశే. పిచ్చివాఁడు: చూ, వెఱ్ఱి. 3

వెఱ్ఱెత్తు. వా. అ. క్రి: తిక్కగొను, పిచ్చెత్తు.

వెల. దే. వి. 1. కొనువస్తువులు లోనగువానికిచ్చెడు విలువ (అమ్మెడువస్తువులులోనగు వానికిఁజెప్పెడుధర): అగ్గువ, అమ్మకము, అమ్మడు, కిమ్మతు-కిమ్మత్తు, ఖరీదు, జెట్టి, తెగుబడి, దర, బేగము, మొల్లమి-మొల్లము, రో-రోయి. (సం.).—అపక్రయము, అవక్రయము, అర్ఘము, అర్ఘువు, క్రయము, పణము, భృతి, మూల్యము, రుచకము, రోకము, వస్నము, విక్రయము, విపణము, శూలము. (అన్య):- ఓ; తద్వి.- ఎండిన మాంసముయొక్క వెలకు.- శౌష్కలము; 2. పందెము. ఉ, హరి. 3, ఆ. 112: చూ, వ్యవహారము. 4.

వెలందుక. వై.వి.=వనితా: చూ, రూ-వెలఁదుక.

వెలఁగ. దే. వి. 1. (సం. వ).— అక్షస్యందము, కపిప్రియము, కపిత్థము-కబిత్థము, కరంజఫలకము, కరభవల్లభము, కాతిస్యఫలము, ఖరపాదాఢ్యము, గంధఫలము, గ్రంథిఫలము, గ్రాహి, చిరపాకి, దంతశతము, దధితము, దధిఫలము, దధిసారము, పుష్పఫలము, మన్మథము. తద్వి.— ౧. నల్లవెలఁగకు.- (సం).- టంకము; ౨: పుల్లవెలఁగ. (సం): వ్యాఘ్రపాదము; 3: ములువెలఁగ. (సం).-కంటకపిత్థము, కశేరుకము, గ్రంథిలము, చతురశ్రికము, వ్యాఘ్రపాదము. (౨-3లకు భేదములేదని కొందఱు) (పైపెంకు కండకాయజాతిలోనిది.); అం.2: చూ, దోహదశాస్త్రము. (తేనె నెయ్యి బెల్లము పాలు దీనికి పంచి దొరవులు.)

వెలఁది. వై. వి. 1.=వనితా. (దేశ్యమని శ-ర) ఆఁడుది. విజ. 1, ఆ. 146: చూ, స్త్రీ; 2.=వనితా. (దేశ్యమని శ-ర.) గరగరికయైన ఆఁడుది: చూ, స్త్రీ; దే. వి. 3. ధాళధళ్యము. విజ. 1, ఆ. 195; విశే. 4. నిర్మలము. భో. 2, ఆ. 96; స్వా. 3, ఆ. 31: చూ, శుద్ధము. 3; 5. ప్రసన్నము: చూ, శుద్ధము. 8

వెలఁదుక. వై. వి.=వనితా. రూ- వెలందుక. (దేశ్యమని శ-ర): చూ, వెలఁది. 1-2. అచ్చ. సుం, కాం. 61

వెలచు. వై. స.క్రి: చూ, రుద్దు. పర. 4, ఆ. 186.

వెలనాడు. దే. వి. రూ-వెల్నాడు. ఒకానొక దేశము: చూ, సీమ (1) (దేశములు.)

వెలపట. దే. ద్ర: చూ, రూ-వెలపల.

వెలపలుండు. వా. అ. క్రి. 1. ఋతుమతియగు: చూ, సమర్తాడు; 2. బయటనుండు.

వెలపల. వా. ద్ర. 1: చూ, వెలపట; 2. ఎడమ: చూ, సవ్యము. 2.

వెలపోవు. దే. అ. క్రి: అమ్ముడువోవు.

వెలమ. దే. వి. శూద్రజాతి విశేషము: దొర. (మి) పద్మవెలమ, (సం) పద్మనాయకుఁడు. (వీరు గౌరవముగ పిలిపించుకొనుటయందును తమ నామముతుదను గౌరవచిహ్నముగా 'గారు' లోనగువానిని పెట్టుకొనుట యందును ఇష్టముగలవారు)

వెలమసంది. దే. వి: రూ-వెలమసంది, వెలమ, చివికివెలమ, చెలికవెలుఁగు. (సం).—కాక, కాకకల, కాకజంఘ, జీవన-జీవని, లోమశ*.

వెలయాలు. దే. వి. (వెల + ఆలు): చూ, వేశ్య.

వెలయించు. దే. స. క్రి: వెల్లడించు, వెల్లడిచేయు. (సం).—ఆవిష్కరించు, ప్రకటించు.

వెలయు. వై. అ. క్రి. 1. ఒప్పు: చూ, సమ్మతించు; 2.=విలస్. ప్రకాశించు: చూ, వావజిల్లు; 3. ప్రసన్నతనొందు. హరి. పూ. 6,

ఆ. 95: తిలకించే, తెలియు, తేఱు; 4. ప్రసిద్ధికెక్కు. మార్క. 2, ఆ. 340: పొంపిరివోవు, మీసుమిగులు; 5. ప్రకాశితమగు. భార. విరా. 4, ఆ. 75: చూ, నుబ్బు. 2.

వెలయెలనాగ. దే. వి: చూ, వెలయాలు.

వెలరారు. ద్వ. అ. క్రి. 1 తెల్లనగు: చూ, వేవు, 2: చూ, వెలవెలఁబాఱు.

వెలరు. వై. వి. = ధవళ. తెల్లన: చూ, వర్ణము. 6.

వెలరువాఱు. ద్వ. అ. క్రి. 1. తెల్లనగు. లక్ష్మీ. 3, ఆ. 131: చూ, వేవు; 2: చూ, వెలవెలఁబాఱు.

వెలలఁబన్ను. ద్వ. స. క్రి: చూ, వెళ్లగొట్టు.

వెలలు. దే. అ. క్రి. రూ-వెడలు. భార. ఉద్యో. 1, ఆ. 126: చూ, సాగు.

వెలలుచే. దే. ప్రే: చూ, రూ-వెడలుచే.

వెలవ. వై. వి. = విలేపి. కాఁపుదుగంజి, పేయము: చూ, సాదము. (1).

వెలవెలఁది. దే. వి: చూ, వెలయాలు.

వెలవెలఁబాఱు. ద్వ. అ. క్రి. వివర్ణమగు. స్వా. 5, ఆ. 62: రూ- వెలవెలనగు-వెలవెల్లనగు-వెలవెలనవోవు- వెలవెలఁబోవు, వెలరారు-వెలరువాఱు, వెలుకఁబాఱు, వెల్లఁబాఱు, వెల్లనగు, వెల్వెలఁబాఱు, గాజువాఱు, తెలతెలఁబోవు, తెలతెలవాఱు, డిల్లపడు-డీలుపడు-డిల్లపోవు, నీరువిడుచే, పుల్లసిలు-పుల్లసిల్లు, విన్నఁబడు, విన్నఁబోవు. తద్వ.— వెలువెలుకఁబాఱు-వెల్వెలుకఁబాఱు.

వెలవెలఁబోవు. ద్వ. అ. క్రి. —పై.—

వెలవెలన. వై. వి: చూ, వెలవెలపాటు. (విణయందు.—పంచ. వేం. 1, ఆ. 221.)

వెలవెలనగు. ద్వ. అ. క్రి: చూ, వెలవెలఁబాఱు. పంచ. నా. 5, ఆ. 19. [4, ఆ. 125.

వెలవెలనవోవు. ద్వ. అ. క్రి. —పై.— శకుం.

వెలవెలపాటు. వై. వి: చూ, వైవర్ణ్యము.

వెలవెల్లనగు. ద్వ. అ. క్రి: చూ, వెలవెలఁబాఱు.

వెలారించే. దే. స. క్రి. రూ-వెలారుచే-వెలార్చు. 1: చూ, వెళ్లగొట్టు; 2: చూ, వెలిపుచ్చు.

వెలారుచే. దే. స. క్రి. —పై.— (బయలుగా వఱచే అనుటకు.-కళా. 2, ఆ. 117.)

వెలార్చు. దే. స. క్రి. —పై.—

వెలి. దే. వి. 1. బహిఃప్రదేశము: చూ, వెలుపల. 1; 2. వెలివేయుట. (సం). ఆంత్య, బహిష్కరణము, బహిష్కారము; 3. దేహముయొక్క బహిః ప్రదేశము; 4. బయలుపాటు. పాండు. 3, ఆ. 53; విణ. 5. బాహిరము, బాహ్యము. మార్క. 3, ఆ. 368: చూ, స్పష్టము; వై. వి. 6. = ధవళ. తెలుపు: చూ, వర్ణము. 6; విణ. 7. తెల్లనిది: చూ, వర్ణము. 6; అవ్య. 8: చూ, వెలపల. 1.

వెలికత్తె. వా. వి. తోపనంగొలవి.

వెలికత్తెరనేల. ద్వ. వి. కంకరమన్నుకలిసిన భూమి: చూ, హరిప్రియ. 2 (భూమి. 1.)

వెలికి. దే. వి: చూ, వెలిచే*.

వెలికిలు. దే. అ. క్రి. 1. వీఁపుక్రిందగు, తిరుగఁబడు; 2. వీఁపుక్రిందుగా పరుండు. హరి. పూ. 8, ఆ. 135.

వెలిగడ. ద్వ. వి. మెట్టనేల: చూ, హరిప్రియ. 2 (భూమి. 1.) [1-౫.

వెలిగారము. వై. వి. గవ్యచాకము: చూ, లవణము.

వెలిగిడ్డి. వై. వి. కామధేనువు: చూ, ధేనువు.

వెలిగుల్ల. వై. వి. కూఁతకైదువు, శంఖము: చూ, సంకు. 1.

వెలిగొండ. ద్వ. వి. కైలాసము: చూ, పర్వతము.

వెలిగొఱు. ద్వ. వి. ఐరావతము: చూ, హస్తి.

వెలిఁగుక్క. దే. వి. రతికూజితము: చూ, స్వరము. 2.

వెలిచే. దే. వి. పిండీతకము*, చూ, శ్వసనము. 3.

వెలిచేండ్రి. ద్వ. వి: ఉండ్రి- ఉండ్రిన- ఉండ్రిన-ఉండ్రిస, ఉలిఁబూను, కంపుఁదుమ్మ, చండ్ర, తెల్లతుమ్మ, వెలితుమ్మ. (సం). అనసా—

రము, అవతోరము, అహిమారకి, అరిమేదము, అహిమేదము, కంటకి, కంటకీద్రుమము, కదరము, కల్పకము, కాంభోజము, కాంభోజి, కార్ముకము, కుబ్జకంటకము, కుష్ఠఘ్నము, కుష్ఠహృత్తు, కుష్ఠారి, కుహరము, క్రిమిశాత్రవము, క్షితిక్షమము, ఖదిరము, ఖదిరాసారము, గండకారి-గండకాలి, గాయత్రి, గిరిమేదము, గువాకము-గూవాకము, గోధాస్కంధము, తిక్తశాకము, దంతధావనము, ధవము, బాలతనయము, రోహిణి, విట్ఖదిరము, శ్యామసారము, సారము, సోమవల్కము.* ("చూ, సోమవల్కము.")

వెలిచేవి. దే. వి. అంకాట: చూ, వ్యభిచారము. 2.

వెలిచేపుల్ గన్నతొయ్యలి. ద్వ. వి. అంకులాఁడి. వేం. ఆం. 84: చూ, స్వైరిణి.

వెలిబిత్తరి. అం: చూ, కాయమానములు. [క.1.

వెలిచియ. దే. వి. రూ-వెలిచె-వెల్చె: చూ, వర్తి

వెలిచె. దే. వి.—పై.—

వెలితి. దే. వి. రూ-వెల్తి. 1: జీబు, దట్టము, వలపల-వలపలన-వలుచేవ-వల్చన. (సం).-విరళము; 2. న్యూనము: చూ, సొడ్డు. 1. తద్వి.—తొట్టి, రిక్తు, వీసర-వీసరము: చూ, సొడ్డు. 1; 3. తఱచేఁదనములేమి; విణ. రూ-వెల్తి. 4. తక్కువైనది; 5. తఱచేకానిది.

వెలితిప్ప. వై. వి: చూ, వెలిగొండ.

వెలితిమానిసి. ద్వ. వి. అల్పుఁడు: చూ, హీనుఁడు.

వెలితుమ్మ. ద్వ. వి: చూ, వెలిచేండ్రి *.

వెలిదమ్మి. ద్వ. వి. తెల్లదమ్మి. విజ. 2, ఆ. 194: చూ, సహస్రపత్రము.

వెలిదుక్కి. దే. వి. వానతడిదుక్కి. దుక్కి: చూ, సేద్యము. (చూ, రొంపిదుక్కి.)

వెలినాడుబ్రాహ్మణులు. అం: చూ, ఆంధ్రులు: చూ, బ్రాహ్మణులు. ("కృష్ణయజుర్వేదులా ఆపస్తంబసూత్రమును, ఋగ్వేదులు ఆశ్వలాయన సూత్రమును, శుక్లయజుర్వేదులా కాత్యాయన సూత్రమును, అయి ఆశ్వలాయనులకును ఆపస్తంబులకును సంబంధములు గలిగియున్నవి. ఈ వెలినాడులు నైజాము రాజ్యములోఁ జేరిన యాంధ్రదేశమున నుండువారు. వల్లభమతోద్ధారకుఁడను వల్లభాచార్యులీ వెలినాడులలోనివాఁడు, వీరిలో మూఁడు తెగలుగలవు. (౧) శుద్ధవెలినాడులు, (౨) పేరుంబేడి వెలినాడులు, (3) వెలినాడులు. మొదటిరెండును లౌకిక వైదికముల యందు వర్తించువారు. మూఁడవతెగ గ్రామపాచకాది పురోహిత వృత్తిగలవారగుటచే కొంతకాలము వఱకు నింద్యముగఁ జూడఁబడిరి.")

వెలిగోటిమెకము. ద్వ. వి: చూ, వెలుఁగుబంటి.

వెలిపము. దే. వి, విణ: చూ, రూ-వలిపము.

వెలిపుచ్చు. దే. స. క్రి: కక్కు, పెట్టు, బయలుపఱచు, బుగులుపుచ్చు, వెలారించు, వెలారుచు-వెలార్చు, వెలిపుచ్చు. (మి) బహిరంగపఱచు. [స్వా. 2, ఆ. 73.

వెలిపెట్టు. దే. స. క్రి: చూ, వెలివేయు.

వెలిబిత్తరి. అం: చూ, కాయమానములు.

వెలిమాడు. దే. వి. విదేశముల కంపఁబడు ధాన్యాదులు. (చూ, లోమాడు.)

వెలిమావు. ద్వ. వి. ఉచ్చైశ్శ్రవము, ఇంద్రుని గుఱ్ఱము: చూ, హయము.

వెలిమిడి. ద్వ. వి. (వెలి + మిడుగు) రూ-వెల్మిడి. పంచ. నా. 1, ఆ. 384: చూ, భస్మము.

వెలిమొట్ట. ద్వ. వి. ఒకచేఁప: చూ, మత్స్యము. 1.

వెలిమొన. అం: చూ, మొనలు.

వెలిమ్రాను. ద్వ. వి: చూ, వేలుపుఁజెట్టు.

వెలియాలపోతురాతు. ద్వ. వి: చూ, శివుఁడు.

వెలియాలు. దే. వి: చూ, రూ-వెలయాలు. అం, భా. ద్వి. 111.

వెలియు. దే. అ. క్రి. 1. వానకురిసి నిలుచు; 2. పోయయెత్తిపోవు.

వెలియునికి. దే. వి. (వెలి + ఉనికి) పరదేశము నందలి యునికి: చూ, ప్రవాసము. 2.

వెలిరతి. అం: చూ, రతి (సమరతులు).

వెలిపడు. వా. అ. క్రి: చూ, పాయపడు.

వెలివాఁడు. దే. వి. 1. మాల: చూ, సురియాళువు; 2. భ్రష్టుఁడు: చూ, సురియాళువు.

వెలివాడ. ద్వి. వి. మాలపల్లె: చూ, సీమ (1) (దేశములు.)

వెలివాడవాఁడు. ద్వి. వి: చూ, వెలివాఁడు. 1. కాశీ. 7,ఆ.241. [చేట్టుపాటించెడుపోఁగు.

వెలివాలు. దే. వి. వేఁటాడెడుచోట బయట

వెలివిరియు. దే. అ. క్రి: చూ, రూ-వెల్లివిరియు; 2: చూ, ముమ్మరించు; 3: చూ, వ్యాపించు; 4. ప్రకటితమగు; 5: కొదరు, చెదరు.

వెలిసరు. దే. అ. క్రి. ప్రకాశితమగు. పంచ. వేం. 4, ఆ. 14: చూ, సుబ్బు. 2.

వెలివెల్గు. ద్వి. వి: చూ, హిమాంశువు.

వెలివేయఁబడు. వా. అ. క్రి: బహిపడు.

వెలివేయు. దే. స. క్రి: బహివెట్టు, వెలిపెట్టు.

వెలిసె. దే. వి. పటలప్రాంతము: ఇంటిచూరు: చూ, సదవము. 1.

వెలు. దే. వి. వృత్తియందు వెలికివచ్చెడు ఆకేశము. "వెలువల."

వెలుఁగు. దే. వి. 1. కిరణము: చూ, హాయనము. 2; 2. ప్రకాశము: చూ, వెలుతురు. 1; 3. (అచ్చ. అ, కాం. 42): ఎండ. (సం).—ఆతపము, ఆభాసము, ఆలోకనము, ఉష్ణము, ఉద్యోతము, ఓజస్సు, ఘర్మము, ద్యోతము, ప్రకాశము, రాదృ ము: తద్వి.—౧: పొటము; ౨: ఈరెండ-కీరెండ; 3. పొడ. యెండ; అ. క్రి. 4. ప్రకాశించు: చూ, హవణిల్లు; 5. (మార్క. 7, ఆ. 57): అడిచిపడు, ఎగసిపడు, ఎరియు, కనలు, కమరు-కమలు, కాలు, చిటచిటమను, చిటచిటలాడు, చిఱచిఱలాడు, చేరమేరవోవు, తనుకు, తీండ్రించు, దరికొను, మండిపడు, మండు, మటమటలాడు, మాఁడు, ముసముస మను-ముసముసయను, మెలకు. (సం) జ్వలించు. (మి).—దగ్ధమగు. (స. క్రి).—దహించు. తద్వి.—౧: (వి)ఎఱమంట; ౨: బగ్గమను.

వెలుఁగుబంటి. దే.వి: రూ-వెలుఁగుమంటి-ఎలుఁగుబంటి (ఎలుఁగుమంటి), ఎలుఁగు-ఎల్గు-ఎలువ, ఎలుఁగుగొడ్డు, ఎల్లువెలినోటిమెకము, ఇబ్బందిగాఁడు, పుట్టకాఁపు, పుట్టకూటిమెకము, పుట్టకూడుదిండి, పుట్టకూడుమెక్కు-మెకము, బొచ్చెమెకము, బొల్లిమోరమెకము, మొంగము తెలుపుమెకము, లేదు, వెనుకచూపులమెకము, వెనుచూపుమెకము, వెలినోటిమెకము. (సం).—అక్షము, అచ్ఛభల్లము, అచ్ఛము, ఋక్షము, గుహాశయము, భల్లము-భల్లుకము-భల్లూకము-భాలూకము, మృగదంశకము-తద్వి.-ఏదడి. (చూ, భల్లము. 2.)

వెలుఁగుమంటి. దే. వి.—పై.—

వెలుఁగుఱేఁడు. దే. వి. ద్యుపాంపతి: చూ, సూర్యుఁడు.

వెలుఁగొందు. దే. అ. క్రి: చూ, వెలుఁగు. 4.

వెలుక. ద్వి. వి. (వెలి+ఉక) తెల్లన: చూ, వర్ణము. 6. [బాలు. పాండు. 4, ఆ. 35.

వెలుకఁబాఱు. ద్వి. అ. క్రి: చూ, వెలవెలఁ

వెలుగు. దే. వి: రూ-వెల్గు, ఆలవ, కంచియ-కంచె, కంచెకోట, కంచెగోడ, కంపకోట, కంపగోడ, కట్టువ, కల్ల-కల్లి, కాట్రగడ, తడుకు, దడి, తెట్టు-తెట్టువు. (సం).—

అపహాలిక, అవేష్టకము, ఓక, ఓద్యోలి, దశాలి, పాంచీనము, పాంచీరము, వాటము, క్షేప్తము. తద్వి.—౧: కరగోడ, కోరడి, గోడకాలు; ౨: (సం).—కుంబ; 3: చూ, మఱుంగుగోడ. ("చూ, సరాతి.")

వెలుచే. దే. వి. రూ—వెల్చు: చూ, సర్పము.

వెలుచు. దే. స. క్రి: రూ— వెలలుచే- వెల్చు. 1: కడపు, తోలు—త్రోలు, నడపు, నూకు, చేఱపు, ఘూరగించు; ప్రే. 2: చూ, వెడలుచు. ఉ, హరి. 5, ఆ. 112; 3. (నూలు) తోఁడు: మెట్టు, తోఁడు.

వెలుతురు. దే. వి. రూ—వెల్తురు. 1: ఒప్పు, కళుకు-కళ్కు, గచ్చు, చెన్ను, చెలువము-చెలువు-చెల్వు, చాయ, జిగి, జోతి, జోత-జోతము-జోతాము-జోతి, డంబు, డాల్-డాలు, తీండ్రి, తుఱంగలి, తులకింపు, తెలివి, తేజో, తొంగలి, తొలఁకు, దవురు-దౌరు, పగటు, పిసాళము, పొలపము, పోసనము, బాజో, బిత్తరము, మించు, మిన, మిస, మెఱఁగు-మెఱుఁగు, మెఱపు- మెఱుపు, మేని, మొక్కలి, రంగు, రాణి, రువాణము, వంచియ-వంచె, వన్నియ-వన్నె, వెలుఁగు, వేఁడి, సిరి, సెర, సొంపు, సోయగము. (సం. ప):—అంశువు, అభిఖ్య, అభిరుచి, అర్చి, అర్చిస్సు, అభ, ఆభాసము, ఇద్ధము, ఈశానము, ఈహ, ఉద్దీపనము, ఊము, ఉల్లసము-ఉల్లాసము, ఊర్మి, ఓజస్సు, కకుప్పు, కచ, కమ, కలహము, కాంతి, కాశకము, కాశము, కాసువు, కేతువు, గోవు, చార్వి, ఛవి, ఛాయ, జ్యోతి, త్విట్టు, దీప్తి, ద్యుతి, ద్యోతము, ధామము, నీకాశము, ప్రకాశము, ప్రభ, భా, భాతి, మయూఖము, మహస్సు, రశ్మి, రుక్కు-రుచి, శోకము, శోచిస్సు, వర్చస్సు, వర్ణము, విలసనము, వీకాశము, వీతి, వీర్యము, వ్యవాయము, శమ్, శోచిస్సు, శోభ, శ్రీ, సహము. (అవ్య):-అపి, ఇ, ఇదానీమ్, ఏ, చ. తద్వి.—౧. అధికప్రకాశమునకు.- జిగ్గు, తలుకు-తళుకు, తళతళ, నిగనిగ, నిగ్గు,పస, తెళఁకు-తెళుకు, మినమిన, మిలమిల, మెఱఁగు-మెఱుఁగు, రవరవ. (సం):-క; ౨. నిప్పునందలి యధికప్రకాశమునకు.- కనకన; 3: చాయ. (సం).-ఛాయ, శోభ; ౪. ఎంక జిగికి.- (సం) —ఝల్లి-ఝల్లిక; ౫. వజ్రకాంతికి:-తనుపు-తన్పు; ౬: ఎఱ్ఱనిజిగి, బిడి. (సం).- అరుణాభము, రక్తకాంతి; ౭. కృత్రిమ పద్మరాగకాంతికి.-బిడి; ౮. మిసిమి; ౯: (సం).—పరిస్ఫోటనము; ౧౦: చాయ, నీడ. (సం) ఛాయ; ౧౧: పొడనీడ. (విణ) ౧౨. వెలిగినది:-ఘృతము, దీప్తము; ౧౩. వెలిగించునది:-ఉద్దీపకము, దీపకము; ౧౪. వెలిగింపఁబడినది:-ఇద్ధము, ఉద్దీపితము, ఉద్యోతితము, ఉద్భాసితము, ఉపశోభితము, ఉల్లసితము, ప్రకాశితము, రాజితము, విలసితము; ౧౫. కాఁచఁబడినది:-తప్తము, శ్రాణకృతము; ౧౬. తపింపఁజేయఁబడినది:- ఇద్ధము, ఉత్తప్తము, శ్రాణ. (తె).— ఉదిరి (వి). కాంతివిశేషమునకు—రవరవ; వై. వి 2.—వేల్లంతరా.*: చూ, రూ—వెలుతురు

వెలుపల. దే. వి. (వెలి+పల). 1. (ఉ, హరి 6, ఆ. 28): రూ—వెల్పల, బయలు-బంలు—బైలు. మయిదానము—మైదానము, మెన, వెలి, వెల్లడి. (అవ్య) వెలపట-వెలపట వెలి, బయట, వరపట. (సం).—అంతరము తద్వి:-బంగనబయలు, బటాకబయలు-బటాయలు—బట్టబయలు; విణ. 2. వెలిదైనది. కళా. 8, ఆ. 152. [వెలుపించు—వెల్పించు

వెలుపలించు. దే. స. క్రి: రూ—వెల్పలించు

వెలుపలుండుట. దే. వి. బహిష్ఠయగుట: చూ, సమర్త.
వెలుపించు. దే. స. క్రి: చూ, వెలుపలించు.
వెలుపు. దే. వి: చూ, రూ-వెడలుపు.
వెలుపుడు. దే. వి: తోడుడు.
వెలుమ. దే. వి: చూ, వెలమసంది.*
వెలుమసంది. దే. వి.—పై.— [సస్యము. 1.
వెలువడము. దే. వి. రూ-వెల్వడము: చూ,
వెలువడములు. దే. వి. బ: చూ, ధాన్యము.
వెలువడు. ద్వ. అ. క్రి. 1. ప్రకాశితమగు: చూ, సుబ్బు.2;2.బయలుదేఱు: చూ, పోగు.
వెలువడుట. ద్వ. వి. రూ-వెల్వడుట: చూ, వెడలఁబాటు.
వెలువరించు. ద్వ. ప్రే: రూ-వెల్వరించు, వెలువఱుచు. స్వా. 4, అ. 48.
వెలువఱుచు. ద్వ. ప్రే.—పై.—
వెలువెలుకఁబాఱు. ద్వ. అ. క్రి: చూ, రూ-వెల్వెలుకఁబాఱు.
వెలువెల్ల. వా. వి. తెలుపు: చూ, వర్ణము. 6.
వెల్కఁబాఱు.ద్వ.అ.క్రి: చూ,రూ-వెలుకఁబాఱు.
వెల్గు. దే. వి: చూ, రూ- వెలుగు.
వెల్చ. దే. వి: చూ, రూ-వెలుచే.
వెల్చు. దే. స. క్రి. ప్రే: చూ, రూ-వెలుచు.
వెల్చె. దే. వి: చూ, రూ-వెలిచె.
వెల్తి. దే. వి, విణ: చూ, రూ-వెలితి.
వెల్తురు. దే. వి, పై. వి: చూ, రూ-వెలుతురు.
వెల్నాడు. దే. వి: చూ, రూ-వెలనాడు.
వెల్పల. దే. వి: చూ, రూ-వెలుపల.
వెల్పలించు. దే. స.క్రి: చూ, రూ-వెలుపలించు.
వెల్మ. దే. వి: చూ, రూ-వెలమ.
వెల్మిడి. ద్వ. వి: చూ, రూ-వెలిమిడి.
వెల్ల. పై. విణ. 1.=వలక్షు. తెల్లనిది: చూ, వర్ణము. 6; 2. కర్షణము.
వెల్లంకి. దే. వి: చూ, లోష్టము. నిర్వ. 10, అ. 122; "వడకి తేరపోయి వేరు వెల్లంకి."

(క్షేత్రీయపదములు).
వెల్లఁగొమ్ముల మెకము. ద్వ. వి: చూ, హస్తి.
వెల్లఁబాటు. పై. వి: చూ, వైవర్ణ్యము.
వెల్లఁబాఱు. ద్వ. అ. క్రి. 1: చూ, వేవు; 2. వైవర్ణ్యమునొందు: చూ, వెలవెలఁబాఱు.
వెల్లచేఱుపు. ద్వ. వి. సున్నపుపూఁత: చూ, సమాలంభము. 1.
వెల్లజక్కి సామి టెంకి. ద్వ. వి: చూ, స్వర్గము.
వెల్లజోల్గలవీఁడు.ద్వ. వి.—పై.—[చూ, స్పష్టము.
వెల్లడి. పై. వి. 1: చూ, వెలుపల; 2. ప్రసిద్ధి:
వెల్లడించు. వా. స. క్రి: పచరించు, పగటు, వెల్లడిచేయు. (సం) ప్రకటించు.
వెల్లడిచేయు. వా. స. క్రి.—పై.—
వెల్లదమ్మి. ద్వ. వి: చూ, రూ-వెలిదమ్మి.
వెల్లన. పై. వి.=వలక్షు. తెల్లన: చూ, వర్ణము.6.
వెల్లనగు. ద్వ. అ. క్రి: చూ, వెల్లఁబాఱు. 1-2. భార. అర. 6, అ. 245.
వెల్లనిడాల్గలయింతి. ద్వ. వి: చూ, సరస్వతి.
వెల్లపోలిక. ద్వ. వి. క్షుద్రజలచరము: చూ, మత్స్యము. 1.
వెల్లముత్తైదువ. ద్వ. వి: చూ, సరస్వతి.
వెల్లయెలుక. ద్వ. వి. రూ-ఎల్లెలుక: చూ, మూషికము. [చూ, స్వైరిణి; 2: చూ, వేశ్య.
వెల్లాటకత్తియ. ద్వ. వి. రూ-వెల్లాటకత్తె:
వెల్లాటకత్తె. ద్వ. వి.—పై.—
వెల్లాటకము. ద్వ. వి. ప్రసిద్ధి: చూ, స్పష్టము.
వెల్లి. పై. వి. 1=వలక్షు. తెలుపు: చూ, వర్ణము. 6; దే. వి. 2: చూ, వెల్లువ. 1; 3. అధికప్రవాహము: చూ, వెల్లువ. 1; 4. కాలువ-కాల్వ, తెర, తెరతెర-తెరలు, దొంతర, పరంపర, వరుస. (సం).—ఊర్మి, ఓఘము, ధార, పరంపర, ప్రవాహము (క్రమపద్ధతి యని కొందఱు.)
వెల్లిక. దే. వి: చూ, వెల్లువ. వసు. 4, అ. 52.

వెల్లిగొను. దే. అ. క్రి. 1: ఓడిగిల్లు, జాలుకొను, జాలువాఱు, తొట్టు, తొరఁగు‒ తొరుఁగు, పరఁగు, పార్తెంచు, పాఱు‒పాఱు, పాఱు తెంచు, వరదవాఱు, పఱ్ఱొడ్డు, వెలివిరియు‒ వెల్లివిరియు, వెల్లివొడుచు, వెల్లువగట్టు. (సం).—ప్రవహించు; 2. పరంపరగా వెడలు. పా. 5, ఆ. 16; ప్రే. 3. వెల్లిగొలుపు.

వెల్లివాఁక. ద్వ. వి. గంగ: చూ, నది.

వెల్లివిరి. దే. వి. ప్రకటితము.

వెల్లివిరియు. దే. అ. క్రి. రూ‒వెలివిరియు, 1: చూ, వెల్లిగొను. తద్వి.— నీటిబొట్టులో నగునవి ఎగిరిపడు.‒ చెదరఁబడు, చెదరు, బెగ్గిలు‒బెగ్గిల్లు; 2. ఊలుకు. భార. విరా. 2, ఆ. 146: చూ, స్రుక్కు. 6; 3: చూ, వ్యాపించు; 4. ప్రకటితమగు. అచ్చ. యు, కాం. 501; 5: కొదరు, చెదరు; 6: చూ, ముమ్మరించు.

వెల్లివొడుచు. దే. అ. క్రి: చూ, వెల్లిగొను.

వెల్లుల్లి. ద్వ. వి. (వెల్ల + ఉల్లి) తెల్లఉల్లి*: చూ, సుకందము. 1.

వెల్లువ. దే. వి: అంపాచౌరము, ఓడిక, జేక్కర, నిట్ట, నీళ్లపాఱుడు, పఱత‒ పఱతి‒పఱద‒ పఱప, పాఱుడు, వరద‒వఱద, వఱ్ఱు, వెల్లి, వెల్లిక, వేగము. (సం).— అంబుసరణము, అంభశ్చారము, అట్టము, ఊర్మి, ఓఘము, పూరము, ప్రవాహము, ప్రవృత్తి, వనము, విసృతి. (అవ్య).‒ఆరము. తద్వి.—౧ అధిక ప్రవాహమునకు.‒పెనువెల్లి, ముంపు, ముఱుగుడు, వరద, వెల్లి ‒ వెల్లువ. (సం). రయము, ప్రవాహము; ౨. అల్పప్రవాహమునకు.— జాలు‒జాలువు; 2. అధికప్రవాహము: చూ, వెల్లువ. 1‒౧; 3: చూ, సేన. 1. య. 3, ఆ. 38; 4. ఇటికగోడల యింటిచూరు: చూ, సదనము. 1. [2. మడుఁగుకట్టు.

వెల్లువగట్టు. దే. అ. క్రి. 1: చూ, వెల్లిగొను 1;

వెల్లెలుక. ద్వ. వి: చూ, రూ‒వెల్లయెలుక.

వెల్వడము. దే. వి: చూ, రూ‒వెలువడము. రసి. 1, ఆ. 48. [భార. ఆది. 6, ఆ. 174.

వెల్వడు. ద్వ. అ. క్రి: చూ, రూ‒వెలువడు.

వెల్వరించు. ద్వ. ప్రే: చూ, రూ‒వెలువరించు.

వెల్వెలఁబాఱు. ద్వ. అ. క్రి: చూ, రూ‒ వెలవెలఁబాఱు.

వెల్వెలుకఁబాఱు. ద్వ. అ. క్రి. మిక్కిలి వెలుకఁబాఱు: రూ‒ వెలువెలుకఁబాఱు: చూ, వెలవెలఁబాఱు.

వెల్వెల్ల. వై. విశే. (వెల్ల + వెల్ల) మిక్కిలి వైవర్ణ్యము: చూ, వైవర్ణ్యము.

వెస. వై. వి. 1.=వాజ. వేగము: చూ, స్యదము; ద్రి. క్రి. విశే. 2. శీఘ్రముగ: చూ, స్యదము. [శోకము; 2: చూ, విపత్తు.

వెసనము. వై. వి.=వ్యసన. 1. జిజ్ఞాస: చూ,

వెసల. దే. వి. వంటకుండ. విజ. 2, ఆ. 150: చూ, హరివాణము (భాండము. 8‒3);

వెళకు. వై. వి.=విలాస. రూ‒వెళుకు: చూ, విలాసము. 2.

వెళుకు. వై. వి.=—వై.—

వెళ్లగొట్టు. వా. స. క్రి. ఉచ్చాటనముచేయు. సాంబ. మా. 27: వీచు, వెడలించు, వెలలఁ బన్ను, వెలారించు‒వెలారుచు‒వెలార్చు.

వెళ్లు. దే. అ. క్రి. రూ‒వెడలు. 1. ధావనమొనర్చు: ఉఱుకు, ఊడనిఁబాడు, ఊడు, ఓడిగిల్లు, ఓడు, కదలు, దుయ్యు‒దూయు‒ దూర్యు, పరుగిడు, పరుగుగొను, పరుగువాఱు, పరుగుపెట్టు, పరుగెత్తు, పరువిడు, పరువుగొను, పరువువాఱు, పరువెట్టు, పరువెత్తు, పాఱు, పాటాడు, పేరెమువాఱు, సురఁగు. (సం):‒ఉపధావించు, ప్రధావించు. (మి) ధావనమొనర్చు. తద్వి.‒ గునుకు.

("చూ, సురుఁగు. 2."); 2. నిర్గమించే: పోవు: చూ, సాఁగు. 2; 3. గమనించే: చూ, సాఁగు. 2.

# వే

వే. దే. స. 1 రూ-వేయి: చూ, సహస్రము; విశే. 2. అనేకము. "వేమాఱులు." : చూ, పేరాళము; వై. క్రి. విశే.3: చూ, స్వదము.

వేంకటాచలము. సం. వి. అ. పుం. 1. తిరుమల: చూ, ఋషభము. 3; అం. 2: చూ, క్షేత్రములు. (అనుబంధములో చూ,1332 పొరట.)

వేంకటేశ్వరస్వామి. సం. వి. న్. పుం. తిమ్మప్పఁడు: చూ, వేలుపు.

వేంచేయు. వా. అ. క్రి. 1: చూ, వచ్చే. 2; 2. గమనించే, పోవు. భాగ. 4, స్కం. 211: చూ, వెళ్లు. 3; 3: చూ, కూర్చుండు; 4. నివసించే: చూ, వసించే.

వేండ్రము. దే. వి. తాపము. భాగ. 7, స్కం. 315: చూ, సంతాపము.

వేంబరించే. వై. వి.=వ్యాపన: చూ,వ్యాపించే.

వేఁకటి. దే. వి. రూ-వెక్కటి: చూ, భ్రూణము.

వేఁకరము. దే. వి. ఉపద్రవము: చూ, విపత్తు.

వేఁకరి. దే. వి. (వేఁకము + అరి) కిరాతభేదము: చూ, వ్యాధుఁడు. 1. [చూ, రోగము. 1.

వేఁకి. దే. వి. జ్వరము. ఉ, హరి. 6, ఆ. 77:

వేఁగి. వై. వి. 1: చూ,వేగుజాము; దే. 2: చూ, సర్జకము.2*; అం. 3: చూ, సీమ(1)(దేశములు.)

వేఁగిస. దే. వి: చూ, సర్జకము. 2.*

వేఁగు. దే.అ.క్రి: చూ, సంతాపించే.విజ.3,ఆ.25.

వేఁచు. దే. ప్రే. వేఁగజేయు: వేఁగించు, గోలించు, వ్రేలించే. (సం).—భర్జించే.

వేఁపుట. వా. వి: (సం).— భర్జనము, భృష్టి.

వేఁట. 1. వేఁకపోతు [illegible]మేషము. 1; షికారు. (సం).-ఆఖేటము, ఆచ్ఛోదనము-ఆచ్ఛోదనము, ఖేటము, గోకర్ణము, మృగయ, మృగవ్యము. (ఇది ద్వివిధము.- మృగములవేఁట, పక్షులవేఁట. అందు మృగముల వేఁట:-ఏఁదువేఁట, గంటవేఁట, తెరవేఁట అని త్రివిధము.-పక్షులవేఁట:- పాది- పాది వేఁట-పారివేఁట, విడివేఁట అని ద్వివిధము) (ఏదువేఁట ఆఖేలనము. విడివేఁటడేగవేఁట); అం. 4: చూ, కామజంబులు; 5. (వేఁటాడుట) : చూ, వ్యసనములు.

వేఁటకాఁడు. దే. వి. 1: బోయ, వలకాఁడు; వేఁటగిరి, వేఁటరి, షికారీ. (సం).—ఆఖేటకుఁడు, ఖట్టికుఁడు, జాలికుఁడు, జీవాంతకుఁడు, మృగయుఁడు, వాగురికుఁడు, శాకునికుఁడు. తద్వి.— తెరవేఁటకాఁడు; విశే. 2: చూ, సంహారకుఁడు. అచ్చ. అ, కాం. 42.

వేఁటకుక్క. ద్వ. వి. 1. విశ్వకద్రువు: చూ, శునకము; 2: చూ, సివఁగి. 2.

వేఁటగిరి. దే. వి: చూ, వేఁటకాఁడు.

వేఁటతెర. ద్వి. వి; తట్టి, తెర.

వేఁటపల్లియ. ద్వ.వి. బోయపల్లె.చూ,దేశములు

వేఁటపల్లె. ద్వ. వి: —పై.— కాశీ. 4, ఆ. 60

వేఁటపిట్ట. ద్వ. వి. దీమపుపిట్ట: జెలగండె, దీము-దీము.

వేఁటరి. దే. వి: చూ, వేఁటగిరి.

వేఁటలాడు. దే. స. క్రి. 1. అడవియందు మృగములను పక్షులనువధించే: చూ, సంహరించే 2. వధించే. భార. ఉద్యో. 4, ఆ. 144: చూ సంహరించే.

వేఁటాడు. దే. స. క్రి. —పై.—

వేఁడఁబడినవాఁడు. వా. విశే: (సం) —అభ్యర్థితుఁడు, ప్రార్థితుఁడు.

వేఁడి. దే. వి. 1. తాపము. లక్ష్మీ. 2, ఆ 118: చూ,సంతాపము; 2. వేఁడిమి. వై.

ఆ. 70: చూ, సంజ్వరము. 2; 3. చేఱుకు. భార. అర. 4, ఆ. 245: చూ, స్వేదము; 4. పరితాపము. మార్క. 7, ఆ. 84: చూ, వాఁడిమి; 5. ప్రకాశము: చూ, వెలుతురు. 1; విణ. 6. ఉష్ణము. సా. 3, ఆ. 79: చూ, సంజ్వరము. 2; 7. ఎక్కడనున్నాఁడు. భో. 1, ఆ. 74: ఏఁడి-ఏఁడీ-(బ) ఏరి-ఏరీ. (దీనికి నీరుశబ్దము పరమగునపుడు డివర్ణలోపము చేపట్టెడు. మార్క. 3, ఆ 254.)

వేఁడికంటి. దే. వి. (వేఁడి + కన్ను) ఉగ్రాక్షుఁడు. య. 1, ఆ. 16: చూ, శివుఁడు.

వేఁడికొను. దే. స. క్రి: రూ-వేఁడుకొను, వేఁడు, అడిగికొను-అడుగుకొను, అడుగు-అడ్గు, కొసరు, బతిమాలు-బ్రతిమాలు-బతిమాలుకొను, సాఁగఁదీయు. (సం).—అభ్యర్థించే, అర్థించే, ప్రార్థించే, యాచించే. తద్వ.—(చూ, వేఁడు 4.)("చూ, స్తుతించే.").

వేఁడికోలు. దే. వి. రూ-వేఁడుకోలు: చూ, యాచన.

వేఁడిమి. దే. వి. వేఁడి-వేండ్రము. 1. కాఁక, తాపము. భార. ఉద్యో. 3, ఆ. 197: చూ, సంతాపము; 2. వెచ్చన: చూ, సంజ్వరము. 2. తద్వ.-(విణ). వేడిమిగలది యనుటకు.-(చూ, సంజ్వరము. 2); 3. పరితాపము: చూ, వాఁడిమి.

వేఁడిమిలేనివాఁడు. దే. విణ: (సం).-అనుష్ణుఁడు.

వేఁడివెలుఁగు. దే. వి: చూ, సూర్యుఁడు. భో. 4, ఆ. 351.

వేఁడివేలుపు. దే. వి. రూ-వేడివేల్పు. 1. -పై.- రామా. 7, ఆ. 180; 2: చూ, వహ్ని. 1. వసు. 4, ఆ. 12.

వేఁడివేల్పు. దే. వి. —పై.—

వేఁడు. దే. స. 1. ఏపురుషుఁడు: రూ—ఎతఁడు-ఏతఁడు, ఎవఁడు-ఎవ్వఁడు- ఎవ్వాఁడు-ఏవాఁడు-ఏఁడు. (రామా. 7, ఆ. 192); తద్వ.—ఏ పురుషుఁడు: రూ-ఎతఁడు-ఏతఁడు-ఎవఁడు- ఎవ్వఁడు- ఎవ్వాఁడు- ఏవాఁడు-ఏఁడు; 2. ఎవ్వఁడును: రూ- ఎతఁడు-ఏతఁడు-ఎవఁడు-ఎవ్వఁడు-ఎవ్వాఁడు-ఏవాఁడు-ఏఁడు, ఎల్లవాఁడు; స. క్రి. 2. ప్రార్థించే: చూ, వేఁడికొను; 3: చూ, వాంఛించే. భార. విరా. 4, ఆ. 200; 4: అడిగికొను, అడుగుకొను, అడుగు-అడ్గు, తిరిపెమెత్తికొను. (సం):—భిక్షించే, యాచించే. (చూ, వేఁడికొను.)

వేఁడుకొను. దే. స. క్రి: చూ, రూ-వేఁడికొను.

వేఁడుకోలు. దే. వి: చూ, రూ-వేఁడికోలు.

వేఁడువాఁడు. దే. విణ. 1: చూ, యాచకుఁడు; 2: (సం).—ప్రార్థకుఁడు.

వేఁత. దే. వి: చూ, రూ—వ్రేఁత.

వేఁదుఱు. దే. వి. 1. ఉన్మాదము. లక్ష్మీ. 5, ఆ. 12: చూ, వెఱ్ఱి; విణ. 2. మూఢుఁడు: చూ, స్తబ్ధుఁడు; 3: చూ, వెఱ్ఱివాఁడు.

వేఁపి. దే. వి. రూ-ఏపి. కుక్క. (బేపి అని కొందఱు): చూ, శునకము.(ఇది వేఁగుధాతు కృదంతము.)

వేఁపు. దే. వి. రూ-వేఁపుడు-వ్రేఁపు-వ్రేఁపుడు. (సం).—భర్జనము, భృష్టి.

వేఁపుడు. దే. వి. 1.—పై.—; 2. వేఁచెడు చట్టి: చూ, పాత్రము. 6_రగ; విణ. 3. వేఁచినది.

వేఁపుడుచట్టి. దే. వి: చూ, వేఁపుడు. 2.

వేఁపుడుపిండి. దే. వి. జ్యోతిర్గంధ, వల్లరి: చూ, సాదము (1).

వేఁబోక. దే. వి: చూ, రూ-వేగుఁబోక.

వేకువ. దే. వి: చూ, వేగుజాము.

వేకువతానము. వ్యు. వి. ప్రాతస్స్నానము, అవగాహము: చూ, స్నానము.

వేగ. దే. వి. 1. వడి: చూ, స్యదము; 2. త్వర. భార. ఉద్యో. 3, ఆ. 25: చూ, సంభ్రమము; క్రి. విశే. 3. త్వరితము: చూ, స్యదము; ద్రి. 4. ఝుడితిత్యర్థకము: చూ, స్యదము.

వేగంటి. దే. ద్రి. (వే + కన్ను) ఇంద్రుఁడు. రామా. 6, ఆ. 104: చూ, సహస్రాక్షుఁడు.

వేగంటికచ్చేరి. దే. వి: చూ, స్వర్గము. సాంబ. దే. 16.

వేగంటికొమరుఁడు. ద్వి. వి. అర్జునుఁడు. సాంబ. దే. 16: చూ, సుభద్రేశుఁడు. [డు. 1.

వేగంటిగొంగ. దే. వి. రక్కసుఁడు: చూ, శాత్రుసుఁ

వేగంటియెక్కుడు. దే. వి. ఐరావతము: చూ, హస్తి.

వేగంటిరాతు గావించినదశి. వా. వి: చూ, సముద్రము.

వేగంటిసైదోఁడు. దే. వి: చూ, విష్ణువు. 1. సాంబ. దే. 4.

వేగన్నులసామి. ద్వి. వి: చూ, వేగంటి.

వేగపడు. మి. అ. క్రి. త్వరపడు: చూ, సంభ్రమించు.

వేగపాటు. మి. వి: చూ, సంభ్రమము.

వేగమధ్యము. అం: చూ, సౌవీరజభాషలు. (చూ, ఉపవిద్యలు. 419 పుట.)

వేగము. సం. వి. అ. పుం. 1. సత్త్వ: చూ, శక్తి. 1; 2. ప్రవాహము: చూ, పల్లవ, 3.=వేగ-వే-వేగిరము. వడి: చూ, స్యదము; 4. విసృష్టఫలము; 5. మలమూత్రాది ప్రవృత్తి; విశే. 6. త్వరితము. హరి. ఉ. 1, ఆ. 75: చూ, స్యదము.

వేగరంజి. అం: చూ, టక్కజభాషలు.

వేగరి. దే. వి. రూ-వేగురి: చూ, వేగువాఁడు.

వేగవతి. సం. వి. ఈ. స్త్రీ. 1: అశ్వంతరి; అం. 2: చూ, వృత్తము. 1. ("వేసిపాదము లందు మూఁడుపగణములున్న ఒకగురువును, సరి పాదంబుల భ-భ-భ-గగములున్న. 7 యతి.")

వేగి. సం. వి. న్. పుం. 1: చూ, హాయము; విశే. 2. వడిగలది: చూ, సత్వరము; వై. వి.(1)=వ్యాఘ్రి. పులి: చూ, శార్దూలము.

వేగించు. దే. అ. క్రి. జాగరముచేయు. పర. 3, ఆ. 219.

వేగినాటిబ్రాహ్మణులు. అం: చూ, ఆంధ్రులు. (వీరు ఋగ్వేదులు. ఆశ్వలాయన సూత్రము వారు.)

వేగిరకత్తియ. వై. విశే. త్వరగలది (ఆఁడుది). రూ-వేగిరకత్తె: చూ, స్త్రీ.

వేగిరకత్తె. వై. విశే.—పై.—విజ. 3, ఆ. 206.

వేగిరకాఁడు. ద్వి. విశే. (విజ. 3, ఆ. 206): అత్రిగాఁడు, తమకి, తుజోగు, పరవాది,. వడికాఁడు. (సం)—అరుఁడు, చపలుఁడు,. జవనుఁడు, జవుఁడు, తరస్వి, ప్రజవి,. వ్యగ్రుఁడు.

వేగిరపడు. వై. అ. క్రి: చూ, సంభ్రమించు.

వేగిరపాటు. వై. వి: చూ, సంభ్రమము. భార. విరా. 2, ఆ. 48-61. [విరా. 5, ఆ. 267.

వేగిరపెట్టు. ద్వి. స. క్రి. త్వరపఱచు. భార.

వేగిరము. వై. వి. 1.=వేగ. వేగము. శీఘ్రము. ఉ, హరి. 6, ఆ. 22: చూ, స్యదము; 2. త్వర. సై. 4, ఆ. 82: చూ, సంభ్రమము. [క్రి. విశే. 3. త్వరితము. పాండు. 4, ఆ. 153: చూ, స్యదము. [కళా. 3, ఆ. 115.

వేగిరించు. వై. అ. క్రి: చూ, సంభ్రమించు.

వేగు. దే. వి. 1: చూ, వేగుజోము; 2. రాజ్య సమాచారము. రామా. 7, ఆ. 49: కొట్టిక కోటి; 3: చూ, వేగువాఁడు; అ. క్రి. 4. ఉదయమగు: చూ, వేవు. తద్వి.—తెల్లగా తెల్లవాఱుటకు.- తెలతెలవాఱు- తెలతెల్ల

వాఱు; 5. శుభోదయమగు: రూ- వేగు. హరి. పూ. 9, ఆ. 87.

వేగుఁజుక్క. ద్వ. వి. శుక్రుఁడు. రామా. 2, ఆ. 102: చూ, రాహువు. 2-గా.

వేగుఁజుక్కవారము ద్వ. వి. శుక్రవారము: చూ, వారములు. [129: చూ, వేగుజాము.

వేగుఁబోక. దే. వి. రూ-వేఁబోక. నై. 7, ఆ.

వేగుజాము. ద్వ. వి. (కళా. 4, ఆ. 112);రూ-వేవుజాము, చీఁకటి, తెల్లవాఱుగ, తెల్లవాఱె, తెల్లవాఱుగడ, పొద్దు- ప్రొద్దు, ప్రేవు, పఱువాయి, వేకువ, వేఁగి, వేగు- వేవు, వేఁబోక-వేగుఁబోక, వేవిన. (సం).-అహర్ముఖము, ఉషఃకాలము, ఉషస్సు, ఉషము, ఔషసి, కల్యము-కాల్యము, తుషారాత్యయము, గోపీతము, గోసంగము, గోసర్గము, గోసము, నిశాంతము,ప్రత్యూషము-ప్రత్యూషము,ప్రభాతము, వ్యుష్టము, సాయోత్సవము. (అవ్య).-ఉపాంసమ్. ("చూ, సూర్యోదయము.")

వేగురిక్క. ద్వ. వి: చూ, వేగుఁజుక్క.

వేగురు. దే. స. బ. వేయిమంది. రూ-వేవురు. (వేయికి సహస్రార్థక బహువచనాదేశము.)

వేగురుఁజుక్క. ద్వ. వి. (వేగు + చుక్క): చూ,రూ-వేగుఁజుక్క. పా. 2, ఆ. 58.

వేగురులు. దే. వి. బ:చూ, వేగరి. (ఇట్లు వేగులవారు-వేగులు-వేగువారు.)

వేగువాఁడు. దే. వి. చారుఁడు. రా. యు, కాం. 172: చూ, సందేశహారుఁడు.

వేచు. దే. అ. క్రి. 1. గర్వించు: చూ, హంకరించు; స. క్రి. 2: చూ, ప్రతీక్షించు.

వేచెంగలపాగ. దే. వి. సహస్రఫణుఁడు: చూ, సర్పము.

వేటు. దే. వి. రూ-వ్రేటు- వేఁత- వ్రేఁత. 1. వేయుట; 2. దెబ్బ: చూ, హతి.

వేట్క. దే. వి: చూ, సంతోషము.

వేడబము. వై. వి. 1. బొంకు: చూ, వితథము; 2 కుతూహలము: చూ, వ్యసనము. 8; 3.=విడంబనమ్. దగా: చూ, వంచన; 4.=విడంబనమ్: చూ, వేసము. కాశీ. 5, ఆ.75; 5.=విడంబనమ్. మాయ. ఉ, రా. 5, ఆ. 228: విడంబన-విడంబనము: చూ, మాయము. 1. తద్వి.—(సం) యక్షిణి.

వేడము. వై. వి.=వేలా. మండలాగ్రము: రూ-వేలము. [కళా. 6, ఆ. 222.

వేడించు. వై. స. క్రి =వేష్టన: చూ, వేష్టించు.

వేడు. దే. అ. క్రి: చూ, వాంఛించు.

వేడుక. దే. వి. రూ-వేడ్క. 1: చూ, సంతోషము; 2: చూ, వాంఛ. భో. 4, ఆ 235; 3. కుతూహలము: చూ, వ్యసనము. 8; 4:రూ-వేడ్క. (సం):-వినోదము; 5.వినోదకార్యము:చూ,గోష్ఠి. 2-3; విశ. 6. వినోదకరము. "అది విన విన వేడుక."

వేడుకకత్తియ. ద్వ. వి. రూ- వేడుకకత్తె- వేడ్కకత్తె. 1. జారిణి: చూ, స్వైరిణి; 2: చూ, వేశ్య. [3, ఆ. 31.)

వేడుకకత్తె. ద్వ. వి. -పై.-(వేశ్యకు.- రాజ.

వేడుకకాఁడు. దే. వి. రూ-వేడ్కకాఁడు. 1.జారుఁడు. శకుం. 4, ఆ. 44; ఉ, రా. 4, ఆ. 204: చూ, విటుఁడు; వా. 2. ఆనందుఁడు:చూ, హృష్టుఁడు;విశ. రూ-వేడ్కకాఁడు. 3. కుతూహలపరుఁడు; 4. అపేక్షకుఁడు; 5. క్రీడాసక్తుఁడు.కాశీ. 6, ఆ. 50; 6. వినోదకరుఁడు.

వేడుకచెలి. దే.వి:చూ,వేశ్య. పాండు. 2,ఆ.13.

వేడుకజూదము. ద్వ. వి. కరిఖలము; చూ, వ్యవహారము. 4.

వేడుకపడు. ద్వ. అ. క్రి. రూ-వేడ్కపడు. 1.కుతూహలపడు; స. క్రి.2:చూ,వాంఛించు.

వేడుకసేయు. ద్వ. అ. క్రి. —పై.— రూ—వేడ్క—సేయు. [పరివేష్టింపఁజేయు.
వేడెపెట్టు. ద్వ. స. క్రి. (వేడెము + పెట్టు)
వేడెము. వై. వి.=వేష్టన. 1. వేచితము: చూ, హయము; 2. మండలగతి.
వేడ్క—. దే. వి, విణ: చూ, రూ—వేడుక.
వేడ్క—కత్తె. ద్వ. వి: చూ, రూ—వేడుకకత్తియ.
వేడ్క—కాఁడు. దే. వి, విణ: చూ, రూ—వేడుకకాఁడు.
వేడ్క—కోమ. దే. వి: చూ, వేశ్య.
వేడ్క—పడు. ద్వ. అ. క్రి, స. క్రి: చూ, రూ—వేడుకపడు.
వేడ్క—సేయు. —పై.—
వేణి. సం. వి. ఇ. స్త్రీ. 1. అనేక ప్రవాహములయొక్క కూడిక: చూ, సంభేదము. 1; ఇ, ఈ. స్త్రీ. 2.=వేనలి. సర్పాకారముగ అల్లినజడ: రూ—ప్రవేణి, వేణిక. తద్వి.—(తె).—సింపిణి: చూ, వేనలి; ఈ. స్త్రీ. 3. కాలువ: చూ, ప్రదిని. 2 (నది.); 4. డాపరడంగి*: చూ, విషనాశని.
వేణిక. సం. వి. ఆ. స్త్రీ: చూ, వేణి. 2.
వేణివేధిని. సం. వి. ఈ. స్త్రీ. జలగ: రక్తప, శుక్తి: చూ, బుడ్డపిడుఁదు.
వేణీసంహారము. అం. (ఈగ్రంథమును భట్టనారాయణుఁడువ్రాసెను): చూ, కావ్యనాటకములు.
వేణుకము. సం. వి. అ. న. రూ—వైణుకము. 1. ఏనుఁగును పొడిచెడి బరికోల: చూ, తోతి. 4 (బాణము. 1—౨౧—౭౮); 2. పసులను దోలెడుమునికోల: చూ, సిల్లు.
వేణుకాఖ్యము.అం:చూ,తిర్యక్కరణబంధములు.
వేణుగోత్రము. అం: చూ, గోత్రము. 13.
వేణుధ్మఁడు. సం. వి. అ. పుం. పిల్లంగ్రోవియూఁదువాఁడు: చూ, వైణవికుఁడు.
వేణునాదానములు.అం:చూ, వ్యవహారపదములు.
వేణులావకుఁడు. సం. వి. అ. పుం: కటకారుఁడు, కులకుఁడు—కులికుఁడు—కులుఁడు, కులశ్రేష్ఠుఁడు—కులశ్రేష్ఠి, బురుడుఁడు. (తె).—ఏతుల, చేఁపల్లువాఁడు, దబ్బవాఁడు, మేదరవాఁడు—మేదరి. [ములు.
వేణువిదారితము. అం: చూ, ఉత్తానకరణబంధ
వేణువు. సం. వి. ఉ. పుం.=వెదురు. 1: చూ, వెదురు; 2. పిల్లంగ్రోవి: చూ, వీణ. 1—౫౬; 3. ఒకరాజు: చూ, హంసుఁడు. 5 (రాజు); అం. 4: చూ, అవరోహివర్ణగతాలంకారములు; 5: చూ, ఆరోహివర్ణగతాలంకారములు; 6. చూ, సంచారివర్ణగతాలంకారములు; 7: చూ, ప్రణవనాదములు; 8: చూ, ముప్పదిరెండాయుధములు (బాణము. 1)
వేతనము. సం. వి. అ. న. జీతము: చూ, సంబళిక. 2.
వేతసన్యాయము. అం. ప్రబ్బలిచెట్టు ఏటిరొడ్డుననుండి నీరువచ్చినపుడు వంగి నీరు పోయినపుడు మరలనిలఁబడునను రీతి.
వేతసము. సం. వి. అ. పుం. ప్రబ్బలి*: చూ సహస్రవేధి. 2.
వేతస్వంతము. సం. విణ. (త్. ఈ. త్) మిక్కుటమైన ప్రబ్బలుగలది (దేశము.)
వేత్తృ. సం. విణ. (ఋ. ఈ. ఋ) తెలిసినవాడు: చూ, సముద్ధుఁడు. [హస్తుఁడు
వేత్రధరుఁడు. సం. వి. అ. పుం: చూ, వేత
వేత్రము. సం. వి. అ. న. 1: ఛడి, యష్టి, పకము, శబ్దపతి. (తె):—చివర—చివ్వ, చేకఱ్ఱ, చేపక—చేవ్వ—జావ్వ, జాఁక, పేజావ్వ, పేపబెత్తము, పేము—ప్రేము, బరిబెత్తము—బెత్తు, బ్రిద్ద, రువ్వ, లాతము—లాతాము, సజ్జినకోల, తద్వి.— ౧. రౌవేత్రమునకు.—ఔశీరము, దండము, వేత్రవ (తె).—ఉండకోవి, లాతము—లాతావ

౨: (తె).—గొణుకుకఱ్ఱ; ౩: కరము, దండము, లఘుడము. (తె).— దుడ్డు-దుడ్డు, దుడ్డుఁగఱ్ఱ, దుడ్డుఁగోల, లగుడము_ లవుడి, లాఠీ, లోడి; ౪: (తె).— బడియ- బడె; ౫: కాష్ఠము, దాఁడువు, విసారము. (తె).- కఱ్ఱ, కొయ్య; ౬:- (చూ, వెదురు.) ("చూ, సమిధ."); పుం. 2. బెత్తపుచెట్టు: ఉండకోల, పేము_ప్రేము, బెత్తము- బెత్తు, బ్రిద్ద, సజ్జనకోల. (సం).— అర్క- మచ్చంది, అర్పము. తద్వ.-(తె).-వేవపాద.

వేత్రవతి. సం. వి. ఈ. స్త్రీ. ఒకానొకనది: చూ, నది. 1563 పొరట.

వేత్రహస్తుఁడు. సం. వి. అ.పుం: వేత్రధరుఁడు, ప్రతిహారి-ప్రతీహారి- ప్రతిహారుఁడు-ప్రతీహారుఁడు. (తె).—కటిక, కట్టిక, కటికవాఁడు- కటికివాఁడు- చోపుదారుఁడు, నకీబు, పడిహారి-పణిహారి- పడిహారుఁడు-పణిహారుఁడు, (బ) బ్రిద్దలవారు, రిక్కలు.

వేదండము. సం.వి.అ.పుం.ఏనుఁగు: చూ, హస్తి.

వేదకబ్రాహ్మణులు. అం: చూ, ఆచార్యఅను బ్రాహ్మణులు.

వేదకాలము. పా. ("వేదకాలముక్రీస్తు పూర్వము 1200 సంవత్సరములకు దాఁటదని మోక్షమూలరును, 1500 సంవత్సరములని మేగ్డోనలును, 2000 సం॥రములని విట్నీపండితుఁడును, 2800 సం॥రములని బ్రిన్‌హోపరును, 4000 సం॥రములపైమాటయని జాకోబీపండితుఁడును వక్కాణించెను." ప్రాచీనార్యావర్తదేశమునకు నాలుగు సరిహద్దులుగా నాలుగుసముద్రములును మున్నొకకాలమున నుండినట్లును యీసముద్రము లంతరింపక పూర్వము ఋగ్వేదము పుట్టెనని దాసుగారనిరి. దీనినిబట్టి లక్షయేండ్లనవచ్చెను. కావున వేదకాల నిర్ణయమున నిర్వివాదమైన సిద్ధాంతము లేదు.") [బ్రహ్మ. 1.

వేదగర్భుఁడు. సం. వి. అ. పుం. నలువ: చూ,

వేదన. సం. వి. ఆ. స్త్రీ. 1: రూ-సంవేదము. (తె. వ).—చిమ్మ, నొవ్వి-నొవ్వు-నోవి_నోవు. తద్వ.—౨: (తె).— చిమ్మచిట్లు; ౩: అమానస్యము- అమనస్యము. (తె).— బిడ్డకుట్టు; 3: కారణ, కారిక, యాతన, విఘణి. (తె).—కాఁతియ, తినుకు, తీపు; 2. తెలివి: చూ, హృల్లేఖము. 2; అం. 3: చూ, బౌద్ధశాస్త్ర స్కంధములు.

వేదనాస్కంధము. అం: చూ, వేదన. 3.

వేదభాష్యములు. అం: ఋగ్భాష్యము (సాయణాచార్యకృతము.), సామవేద ఋగ్భాష్యము (భారతస్వామి కృతము.), కృష్ణయజుర్వేద భాష్యములు (భట్టభాస్కర మిశ్రుఁడు వ్రాసెను.), శుక్లయజుర్వేద భాష్యములు (మహీధరాచార్య విరచితము), ఉపనిషద్భాష్యములు శంకరులు, ఆనందతీర్థులు, జయతీర్థభిక్షువు, విశ్వేశ్వరతీర్థులు, నరసింహాయతి, కృష్ణాచార్యాదులును, శరాది భాష్యములు కొన్నిఁటికి వ్యాసతీర్థ, వేదేశ భిక్షుక, శ్రీనివాసాచార్యాదులు టీకావివరణాగులును, ఛాందోగ్య మాండూక్యాదులు కొన్నింటికానందతీర్థుల భాష్యముగాక రాఘవేంద్రయతికృతయర్థ సంగ్రహములుఁగూడ గలవు. విద్యాధిరాజాది మునీంద్రులు ఛాందోగ్యాదులకుభాష్యములు వ్రాసిరి. ఇత్యాది.)

వేదము. సం. వి. అ. పుం. (దీనిచేత ధర్మాధర్మముల నెఱుఁగుదురు): ఆమ్నాయము, ఆపారము, ఋషి, ఛందస్సు, నిగమము, ప్రవచనము, బ్రహ్మ-బ్రహ్మము, శాఖి, శివము, శ్రుతి. (తె).— ఉడివోనిపలుకులు, చేదువు, తొలిచేదువులు- తొలువేదువులు- తొల్పదువులు, తొలుఁబలుకులు, తొలుమి-

ముకులు, పెనుమినుకులు, ప్రాఁగబ్బములు, ప్రాఁజేదువులు, ప్రాఁతఁబలుకులు, ప్రాఁబలుకులు- ప్రాఁబల్కులు, ప్రామినుకులు- ప్రామిన్కులు, మినుకులు- మిన్కులు, మొదటిపలుకులు; తద్వి.- ౧: చూ, వాఙ్మయము; ౨: చూ, బ్రాహ్మణములు; ౩: చూ, తైత్తిరీయ బ్రాహ్మణము, తైత్తిరీయ సంహిత; ౪: చూ, ఉపనిషత్తులు 7-9-11-13; 8-10-12-14; ౫: చూ, ఋగ్వేదము; ౬: చూ, యజుర్వేదము; ౭. (మంత్రము): చూ, అథర్వణవేదము; ౮. (ఉద్గీథము, గాంధర్వి): చూ, సామవేదము; ౯: చూ, మహావిద్యలు; ౧౦. వ్యాసప్రోక్తమైన ఐదవవేదము: భారతము; ౧౧. వేదోపాంగములు.- మీమాంస, న్యాయశాస్త్రము, పురాణము, ధర్మశాస్త్రము (స్మృతి): (చూ, ఉపవిద్యలు 15-16-17-18); ౧౨:- చూ, వేదాంగములు; ౧౩: చూ, ఉపనిషత్తులు; ౧౪. వేదస్వరములు:- ఉదాత్తము, అనుదాత్తము, స్వరితము: (చూ, స్వరము. 2); ౧౫. అష్టకమునకు ప్రశ్నలును ప్రశ్నకు అనువాకములును అనువాకములలోనుండి కండికలు లేక పంచాశత్తులుగాను విభజింపఁబడినవి. (౧): అష్టకము. (తె). అట్టము- అట్టము; (౨): ప్రశ్న-ప్రశ్నము. (తె).- పన్నము; (౩): అధ్యాయము, అనువాకము. (తె).—అజ్జము; (౪): పంచాశత్తు లేక కండిక. (తె) పనస (ఏఁబదిపదముల సమూహము); ౧౬. కొన్ని యనువాకముల గల వేదభాగమునకు.— ప్రపాఠకము; ౧౭: అగ్నిహోత్రివి - ఆరాధించు వేదభాగమునకు.—అగ్నిముఖము; ౧౮: చూ, అంతర్యామి బ్రాహ్మణము; ౧౯. ద్రావిడ వేదములోనిభాగమునకు.—ప్రాకారము; ౨౦. ప్రకరణముల సమాహారమునకు:—ఆహ్నికము; ౨౧. యజుర్వేదమునందలి పరాయితములో మూఁడవ అష్టకమునందు ఒకపన్నమునకు.— అష్టకము, ఋక్-ఋక్కు. (తె).—అజ్జము, అట్టము-అట్టము; ౨౨. వేదభాగమునకు:—తంత్రము, శాఖ: ౨౩: అసాత్రిమణి; ౨౪. వేదవాక్యమునకు.—(తె). మిడియ; ౨౫. వేదపాఠమునకు.—బ్రహ్మయజ్ఞము; ౨౬. సామవేదప్రకరణమునకు.—ఉద్గీథము; ౨౭. సామవేదభాగమునకు.— ఉద్గీథము; ౨౮. బ్రహ్మయొక్క మొదటిజ్ఞాత రూపమైన వేదమునకు.—శోపజ్ఞము; ౨౯. సామవేదవేత్తకు - గిష్ణుఁడు (వు); ౩౦ వేదాంతమునకు.—ఉపనిషత్తు, ధర్మము, నైగమము, వేదాంతము; ౩౧: చూ, కల్పము. 15; ౩౨: చూ, కల్పసూత్రములు; ౩౩: చూ, ఓమ్; ౩౪: చూ, గాయత్రి; ౩౫: చూ, మంత్రము; ౩౬. వేదమునందు కొంతిభాగమునకు సంహిత. ఇత్యాది; జా. 2. ప్రమాణము. "వారివచోగుంభము వేదమే కప్రలవారింపందరంటే." (శ్రీనివాసవిలాసము.)

వేదముఖ్య. సం. వి. అ. స్త్రీ. జివ్వాజిపిల్లి: చూ, మార్జాలము. 1-3 (పునుఁగుఁబిల్లి అని కొందఱు.) [చూ, షడ్గ్రంథ.

వేదముఖ్యము. సం. వి. అ. పుం. కఠోరము*;

వేదవతి. అం: చూ, మాళవ పంజమిజభాషలు.

వేదశాఖలు. పా. ఋగ్వేదమునకు 21 శా, సామ 1000 శా, యజు 101 శా (కొందఱిమతము 109), అథర్వ 9 శా (కొందఱిమతమున 15 శా. గలవు.) (వీనికన్నిటికి నొక్కొక్క యుపనిషత్తు కలదని చెప్పుచే ముక్తికోపనిషత్తు 108 ఉపనిషత్తులను చూపినది. ఇవి సటీకములు.): చూ, ఉపనిషత్తులు.

వేదశాస్త్రాభ్యాసము. అం; చూ, వినయమువులు.

వేదస్వరములు. అం: చూ, వేదము. 1-౧౮.

వేదాంగములు. అం: చూ, ఉపవిద్యలు. (1. శిక్ష.- వర్ణస్వరస్థాన ప్రయత్నాదులను శిక్షించునది; 2. వ్యాకరణము.— ప్రకృతిప్రత్యయ పదస్వరూప తదర్థాదులు వివరించునది; 3. ఛందస్సు.- మంత్రముల వృత్తలక్షణములను నిరూపించునది; 4. నిరుక్తము - శబ్దముల యర్థములను నిరపేక్షముగా నిర్వర్తించునది; 5. జ్యోతిషము.— యాగాదుల యాచరణమునకును, తదర్థసిద్ధికిని దగిన గ్రహనక్షత్రాదుల యుదయాస్తమయాదులను దెలుపునది; 6. కల్పము.— యాగప్రయోగమును సమర్థించునది.) [1-౩౦.

వేదాంతము. సం. వి. అ. పుం: చూ, వేదము.

వేదాంతి. సం. వి. న్. పుం. 1. వేదాంతము తెలిసినవాఁడు: గిష్ణుఁడు(ు), బ్రహ్మవాది. తద్వి.—౧: చూ, వేదము. 1-౨౯; ౨. వేదము తెలిసినవానికి.- త్రైవిద్యుఁడు; 2. బ్రహ్మచారి: చూ, వటువు. [ఉపదేశకులు.

వేదాధ్యయనము చేయించినవాఁడు. అం: చూ,

వేది. సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. యజ్ఞాదులకై చేదరముగా నేర్పఱచినతిన్నె: చూ, వేదిక; 2. తిన్నె: చూ, వేదిక; 3. ముద్దుటుంగరము: చూ, పావణిక. 2 (భూషణము.2-౧౨-(౨)); ఇ. న్. పుం. 4. విద్వాంసుఁడు: చూ, సుధి; న్. 5. నలువ: చూ, బ్రహ్మ. 1; విణ. 6. తెలిసినవాఁడు: చూ, సమర్థుఁడు.

వేదిక. సం. వి. ఆ. స్త్రీ: అంకపాళి-అంకపాళిక, జాంగలము, వితర్ది, వేది, వేదిక. (తె).- అరఁగు-అరుఁగు-అఱుఁగు, జగతి, జగిలె-జగ్గిలె-జవిలె, తిన్నియ-తిన్నె-తీనియ-తీనె. తద్వి.—౧:- చూ, వేది. 1; ౨. రత్నఖచితవేదికకు.— ఏ; 3: హాస్తినఖము; ౪: (తె).—పుట్టకోట; ౫. లోపలితిన్నెకు.-వరండము; ౬. యజ్ఞమున వేదికమధ్యమునకు.—వరండము.

వేదిమధ్యము. అం: చూ, యతిప్రాణము.

వేదీశుఁడు. సం. వి. అ. పుం: చూ, వేది. 5.

వేదు. దే. వి. 1. గంధము: చూ, వాసన; 2. వికటగంధము: చూ, వాసన; 3: చూ, వైరస్యము; బ. 4. వెగటుమాటలు.

వేదోదయుఁడు. సం. వి. అ. పుం: చూ, సూర్యుఁడు.

వేద్యము. సం. విణ. తెలియఁదగినది: జ్ఞేయము, జ్ఞాతవ్యము.

వేధ. సం. వి. స్. పుం. 1. నలువ: చూ, బ్రహ్మ. 1; 2. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 3. విద్వాంసుఁడు: చూ, సుధి. [సిరము.

వేధకము. సం. వి. అ. పుం. కర్పూరము: చూ,

వేధము. సం. వి. అ. పుం. తొలిపుచ్చుట.

వేధముఖ్యకము. సం. వి. అ. పుం. రూ- వేదముఖ్యకము: చూ, షడ్గ్రంథ*.

వేధించు. సం. స. క్రి. 1: తూఁటాడు; 2. బాధించు: చూ, హింసించు. 2.

వేధితము. సం. విణ. 1. తొలిపుచ్చఁబడినది; 2. బాధింపఁబడినది: చూ, హింసితము.

వేధ్యము. సం. వి. అ. న. 1. గుఱి: చూ, సూటి. 1 (లక్ష్యము. 1.); విణ. 2. తొలిపుచ్చఁదగినది.

వేనలి. దే. వి. కేశము: చూ, వెండ్రుక. 1; తద్వి.—౧.=వేణి: కొప్పు, కొప్పెద, తుఱుము, వెద. (సం).—కబరి-కవరి, కరవి, కూటకము, కేశవేశము, కేశగర్భకము, ధమ్మిల్లము-ధమ్మిల్లము, మౌళి; ౨: తుఱుము. (సం).—కుసుమగర్భకము, కేశబంధము, కురుంభము; 3: గంటు, దుయ్యముడి-దూముడి- దూయముడి, ముడి. (సం).—కేశకలాపము, గ్రంథి; ౪: కీలుగంటు-కీల్గంటు (కీలుజెడ-కీల్జడ, కీలుముడి—

కీల్మ్రుడి); ౫: అల్లికజడ, జిగ, సిరి, వేనలి. (సం). కవుర్య, కుధము, కోటిరము, జట, ప్రవేణి, వేణి, వేణిక; ౯: పింపిణీ. (చూ, వెండ్రుక.) [సంఖ్య. 1.

వేనవేలు. దే. విశ. బ. పెక్కు-వేలు: చూ,

వేను. దే. వి. చోటుమాట: చూ, శబ్దము. 2.

వేపథువు. సం. వి. ఉ. పుం. 1. (చూ, లోలము. 1-౧): కంపము. (తె) వడుకు, వడఁకు; 2. స్వరకంపము. [ము. 1 (లోలము. 1.)

వేపనము. సం. వి. అ. న. కంపనము: చూ, స్ఫార

వేపితము. సం. విశ. కంపితము: చూ, స్ఫారము. 1 (చలితము.) [సరి. 2 (మగ్గము.)

వేమము. సం. వి. అ. పుం. నేతపలక: చూ,

వేమరు. దే. ద్రి. క్రి. విశ. మాటిమాటికి. రూ-వేమారు-వేమఱు-వేమాఱు: చూ, శశ్వత్తు. 1.

వేమఱు. దే. ద్రి. క్రి. విశ.—పై.—

వేమారు. దే. ద్రి. క్రి. విశ.—పై.—

వేమాఱు. దే. ద్రి. క్రి. విశ.—పై.—

వేము. దే. వి: వేఁప*. (సం).—అరిష్టము, అర్క-పాదపము, అవటము, కషాయి, కాకేష్టము, కైటర్యము, ఛర్దనము, చీర్ణపర్ణము, నింబము, పారిభద్రము, పిచుమందము-పిచుమర్దము, పూలకిము, సర్వతోభద్రము, సాలము, హింగునిర్యాసము. తద్వి.—౧: పెద్ద వేము. (సం).—కాకాండము, కాకాంధము, కార్ముకము, కేశముష్టి, కైటర్యము, మహానిష్టము, హిమద్రుమము; ౨: తురక వేము*. ("చూ, హింగునిర్యాసము.")

వేయంచేలవాలు. ద్వ. వి. శతారము, విష్ణుచక్రము: చూ, బాణము. 1-౭౨-౭౫. (ఆఁడ వజ్రాయుధము.)

వేయి. దే. సం. చూ, రూ-వే. 1.

వేయిచేతులదొరకొడుకు. ద్వ. వి. కార్తవీర్యార్జునుఁడు: చూ, సహస్రబాహువు.

వేయిమొంగలపాగగలదిట్ట. ద్వ. వి: చూ, శివుఁడు.

వేయిచేతులదిట్ట. ద్వ. వి. సహస్రకరుఁడు: చూ, సూర్యుఁడు.

వేయు. దే. స. క్రి. రూ-వేయు: చూ, వైచు. 1-2-3; 4. విగవిసము: చూ, విసర్జించు; 5. పెట్టు: చూ, హావణించు; 6. (దెబ్బ) కొట్టు: చూ, రూ-వేయు. 1; 7. నఱకు: చూ, రూ-వేయు. 2; 8: పొడుచుకొను: చూ, రూ-వేయు. 3.

వేరమి. వై. వి.=వైరమ్. (రూ-వేరము): చూ, వైరము. భార. ఉద్యో. 3, ఆ. 74.

వేరము. వై. వి. 1.—పై.—; 2. వేగము: చూ, స్యాగము.

వేరు. దే. వి. 1. చెట్టుయొక్క-మూలము: గడ్డ-గెడ్డ, దుంప, మోసు. (సం).—అంఘ్రి, చరణము, నేత్రము, పదము-పాదము, బుధ్నము-బ్రిధ్నము, మూలము, శఫము. తద్వి.—౧. ద్విబీజదళవృక్షములవేరు.-కుంకటివేరు, కూఁకటివేరు (తల్లివేరు); ౨. ఏకబీజదళ వృక్షముల వేళ్లు.—(గుబురువేళ్లు,) జల్లివేళ్లు, నారవేళ్లు; ౩. పసుపుగడ్డవు.—కొమ్ము; ౪: అల్లమునకు.-(చూ, శృంగబేరము); ౫: శలాటువు; ౬: (చూ, సన్నరాష్టము); ౭: (చూ, వృక్షము); స. ఏ. 2. అన్యము. భార. ఉద్యో. 2, ఆ. 116: చూ, వేఱు. 3.

వేరుపడు. దే. అ. క్రి: చూ, రూ-వేఱుపడు.

వేరుపనస. ద్వ. వి. వేరునందు పండు పండెడు పనస*: (సం).—అంఘ్రిపనస, బహిర్గంధిఫలము. తద్వి.—౧: పనస. (సం) —కంటకఫలము-కంటకిఫలము-కంటఫలము-కంటాఫలము-కంటకాలము, చంపకోల్వము, పనస, మురజఫలము; ౨: కొమ్ముపనస. (సం).—కాష్ఠ .౩: (చూ, పంపరపనస); ౪:

(చూ, పుల్లపంపరపనస); 3. పూయక కాచెడు పనసచెట్టునకు.-(సం).-వనస్పతి.

వేరుపరువు. దే. వి. కడుగు: చూ, శోధనము.

వేరువిత్తు. దే. విణ. 1. నాశకము: చూ, సంస్థ.3; 2: చెఱుచువాఁడు, తుట్టు, విసపాలవిత్తు. (సం).-నాశకుఁడు.

వేర్పడు. ద్వి. అ.క్రి: చూ, రూ-వేరుపడు.

వేర్పాటు. ద్వి. వి. 1: చూ, రూ-వేఱుపాటు. 1; 2: చూ, వైరము.

వేఱడము. దే. వి: చూ, వేఱుపాటు. 1.

వేఱయినవాఁడు. దే. విణ: రూ-వేఱైనవాఁడు, అంది పొందనివాఁడు, ఉన్నవాఁడు, ఎడకడవాఁడు, ఎడవాఁడు, ఎదురు, ఒండొకఁడు, ఒకరుఁడు-ఒకరువుఁడు, ఒకోఁడు-ఒకోరుఁడు-ఒకోరువుఁడు, ఒకఁడు-ఒక్కఁడు, ఒక్కరుఁడు-ఒక్కరువుఁడు, ఒక్కొఁడు-ఒక్కొరుఁడు-ఒక్కొరువుఁడు, ఒడ్డు, కడవాఁడు, తేగకాఁడు, పరాయివాఁడు, మఱియొకఁడు, రిత్తకాఁడు, వింతవాఁడు. (సం. వ).— అన్యతరుఁడు, అన్యుఁడు, ఇతరుఁడు, పరుఁడు.

వేఱెడి. దే. విణ. 1. వెఱ్ఱివాఁడు: చూ, వెఱ్ఱి 3; 2: వెఱ్ఱిది: చూ, వీఱేఁడి. 3; 3. అవివేకి. భార. ఉద్యో. 3, ఆ. 107: చూ, స్తబ్ధుఁడు.

వేఱేఁడించు. దే. స. క్రి. అవివేకమొందఁజేయు.

వేఱిమి. దే. వి: చూ, వేఱుపాటు. 1.

వేఱు. దే. వి 1: చూ, వేఱుపాటు. 1; 2. (భేదము) చతురుపాయములలో నొకటి: చూ, ఉపాయములు; స. ఏ. 3. (భార. విరా. 1, ఆ. 76.) :రూ-వేరు, అన్నెము, ఎడకడ, ఎరవు, ఒండు, ఒండువలను, ఒకటి, కడమ, తక్కు, పరాయి, పఱ, పెర-పెఱ, మఱియొకటి, మాఱు, లాఁతి, వింత.

వేఱుపడు. ద్వి. అ. క్రి: రూ-వేరుపడు-వేర్పడు-ఏరుపడు-ఏర్పడు, ఎడఁబాయు-పెడఁబాయు, ఎడచుగు, కత్తిరిల్లు, కెడయు, కెడించు, గాతికలఁగు, గివురు, చెంగు, తెగుపడు, తొట్రిలు-తొట్రిల్లు, పాయు, ప్రవిచ్చు, సేటాడు, మార్పడు-మాఱుపడు, విజ్జోడుపడు, విరిపోటుసేయు, వీడు, సీడుపడు-వీడువడు, వీడ్వడు, సెంపరలాడు, వేఱుపోవు. (సం).— భేదిల్లు. తద్వి.-అతలకుతలపడు, ఉత్తలపడు, ఎదురెక్కు, తగఁబడు, తారుమారగు-తాఱుమాఱువడు, పల్లటిలు-పల్లటిల్లు. (మి).— వ్యత్యస్తమగు. ("చూ, స్ఫోటించు.")

వేఱుపఱచు. వా. స. క్రి: చూ, విభజించు.

వేఱుపాటు. ద్వి. వి. రూ-వేర్పాటు. 1. భేదము: చూ, వ్యత్యయము. తద్వి.- పృథగ్భావమునకు.- (సం).— పార్థక్యము; 2: చూ, వైరము. [(ప్రే. వేఱుపుచ్చు.)

వేఱుపోవు. దే. అ. క్రి: చూ, వేఱుపడు.

వేఱుబందము. ద్వి. వి. వేఱుపాటు: చూ, వ్యత్యయము.

వేఱువేఱగు. వా. అ. క్రి:(సం)-ప్రత్యేకించు.

వేఱువేఱు. వా. వి: విడిపట్టు. (సం).— ప్రత్యేకము.

వేఱుసేయు. దే. స. క్రి. విభాగముచేయు.

వేఱైనవాఁడు. దే. వి: చూ, రూ-వేఱయినవాఁడు.

వేల. సం. వి. ఆ. స్త్రీ. 1. చెలియలికట్ట: చూ, రోధస్సు; 2. పొలిమేర: చూ, సీమ. 1; 3. ఉప్పెన: చూ, సముద్రము; 4. రాజభోజనము: చూ, సాపాటు; 5. అనాయాసమరణము: చూ, సావు; 6. వ్యాధి: చూ, మానువు. 4 (రోగము. 1.); 7. బుధునిభార్య: చూ, సహధర్మిణి (భార్య. 1-ర౦.).

వేలము. వై. వి. 1.=వేలా: చూ, రూ-వేడము; 2: శిబిరము: చూ, స్కంధావారము. 1;

3. వేగము: చూ, స్వేదము; 4: రూ-ఏలము-ఏలాము, పాట, సేలు. "వేలము పాడు చేస్నారు." [2: చూ, రూ-వేళంకోళము.

వేలాకోలము. దే. వి. 1: చూ, వెఱ్ఱి. 1; వా.

వేలిమి. దే. వి. రూ-వ్రేల్మి. 1: చూ, హోమము; 2: చూ, యజ్ఞము. [వేలిమికఱ్ఱ.)

వేలిమికట్టియ. ద్వ. వి: చూ, సమిధ. 1. (ఇట్లు

వేలిమిబొట్టు.ద్వ.వి.రక్ష:చూ,సిగరి.1(భస్మము).

వేలు, దే. వి. రూ-వ్రేలు. 1. అంగుళి: చూ, హస్తము; 2. అంగుళము: చూ, హస్తము; స. బ. 3. వేయికి బహువచనరూపము. "పదివేలు, అయిదువేలు."; అ. క్రి. 4: చూ, వ్రేలాడు; 5. మునకవేయు: చూ, స్నానమాడు.

వేలుచు, దే. స. క్రి. హోమాగ్నియందు నేయి మొదలగువాని సమర్పించు: రూ-వేల్చు.

వేలుపు. దే. వి: రూ-వేల్పు. అంకుఁడు, ఈసరుఁడు, వేదలుకాఁపు, చావనివారు, జన్నపుఁదిండి, జియ్య, జేజ-జేజే, తక్కురుఁడు-ఠాకురు, తెలుగంటి, తొలిపేల్పు పగతురు, దయ్యము, దేవర-దేవుఁడు, పల్కుటల్గుమేటులు, బాసవాలు, బాసవాలు దిట్టరులు, బుదుఁడు, మింటితెరువరి, ముదియనివారు, మూపోకలాఁడు, వినుదిమ్మరి, నుకులు. (ఇందుకొన్ని బహువచనపదములు చూపఁబడెను.)(సం).-అగ్నిముఖుఁడు, అదితినందనుఁడు, అనిమిషుఁడు, అనిమేషుఁడు, అప్రమేయుఁడు, అమరుఁడు, అమర్త్యుఁడు, అమృతాంధసుఁడు, అమృతుఁడు, అస్వప్నుఁడు, ఆదితేయుఁడు, ఆదిత్యుఁడు, ఊ, ఋ, ఋభువు, ఋషి, ఌ, క్రతుభుజుఁడు, ఖగుఁడు, ఖచరుఁడు (ఖేచరుఁడు), గీర్వాణుఁడు, తక్కురుఁడు, త్రిదశుఁడు, త్రిదివేశుఁడు, దానవారి, దివిజుఁడు, దివిషదుఁడు, దివౌకసుఁడు, దేవుఁడు, దైత్యారి, దైవతము, దైవము, నిర్జరుఁడు, నిర్గణుఁడు, నిలింపుఁడు, పూజితుఁడు, బుధుఁడు, బృందారకుఁడు, మరుత్తు, లేఖుఁడు, విబుధుఁడు, వివస్వంతుఁడు, సుపర్వుఁడు, సుమనస్సు, (బ)సురలు.తద్వి.-గ(సం) -వియచ్చరుఁడు, ౨: (సం).—కృత్తి, కృత్య, దేవత; ౩: తిమ్మప్ప, తిమ్మప్పఁడు. (సం).—వేంకటేశ్వరస్వామి; ౪: దేవగణ విశేషము:—కార్తికి, కుబేరుఁడు(చూ, దేవతాభేదము.); ౫: దేవతలగుంపునకు.—(సం) విబిన్నత్కము;౬:చూ, దేవతలు.(చూఅనుబంధములో); 2. దేవతాస్త్రీ: చూ, స్త్రీ; 3: చూ, జ్యోస్యము.

వేలుపుఁజెట్టు. దే. వి: ఈగిమ్రాను (ఈవిమ్రాను), ఈవులమ్రాను, కడలికానుపు, జోల్మొలక, తెలుగంటిమ్రాఁకు, తెల్లమ్రాను, పుడుకుమ్రాను, పెట్టుఁజెట్టు, మింటిఁజెట్టు, మేచ్చేలచెట్టు, వాడనిపువ్వులమ్రాను, వినుమ్రాను, వెలిమ్రాను, వేలుపుమ్రాను-వేల్పుమ్రాను. (సం. ప).—అబ్జము, అబ్ధిజము, కల్పకము, కల్పపాదపము, కల్పము, కల్పవృక్షము, దేవతరువు, పారిజాతకము-పారిజాతము, మందారము, సంతానము, హరిచందనము. (ఇవి 5—మందారము, పారిజాతము, సంతానము, కల్పవృక్షము, హరిచందనము.)

వేలుపుఁదెరువు. దే. వి. రూ-వేల్పుఁదెరువు: చూ, సురవర్త్మము. [బ్రహ్మ. 1.

వేలుపుఁబెద్ద. ద్వ. వి. సురజ్యేష్ఠుఁడు: చూ,

వేలుపుగమికాఁడు. దే. వి. 1.—పై—; 2: చూ, స్కందుఁడు.(రూ-వేల్పుగమికాఁడు.);

వేలుపుగాణ. ద్వ. వి. రూ-వేల్పుగాణ. గంధర్వుఁడు. (చూ, దేవతాభేదము).

వ్యాసుఁడు. సం. వి. అ. పుం. 1. పరాశరుని కొడుకు: ద్వైపాయనుఁడు, మాఠరుఁడు: చూ, సూనుఁడు. 1; 2. చిరజీవి: చూ, సన్యాసి.

వ్యాహతము. సం. విణ. 1. మిక్కిలికొట్టఁబడినది (చూ, ప్రహతము. 1); 2 తెక తేర: చూ, వ్యర్థము. [శబ్దము. 2.

వ్యాహారము. సం. వి. అ. పుం. పలుకు: చూ,

వ్యాహృతము. సం. విణ. వచింపఁబడినది: చూ, సంభావ్యము.

వ్యాహృతి. సం. వి ఇ. స్త్రీ 1: చూ, వ్యాహారము; 2. ఒకానొక మంత్రము: చూ. హృద్యము 5

వ్యాళగ్రాహి. సం. వి. న్. పుం. పాములవాఁడు: అహితుండికుఁడు, కాళికుఁడు, గారుడికుఁడు, చక్రాటుఁడు, జాంగలికుఁడు-జాంగులికుఁడు, జీవకుఁడు, తాంత్రికుఁడు, నరేంద్రుఁడు, వర్తకుఁడు, విషవైద్యుఁడు, వ్యాళగ్రాహుఁడు. (తె).— కుడిమిగాఁడు_కుడిమివాఁడు, పాములవాఁడు. తద్వి.— గారడివానికి:- అన్యజుఁడు, ఆన్యజుఁడు, ఇంద్రజాలికుఁడు- ఐంద్రజాలికుఁడు, కథాప్రసంగుఁడు, కాపటికుఁడు, కుహకజీవి, కుహారి, కౌసృతికుఁడు, జాంగలికుఁడు-జాంగులికుఁడు, డాంబికుఁడు, ప్రతిహారకుఁడు- ప్రతిహారికుఁడు-ప్రాతిహారకుఁడు, మంత్రికాఁడు, మాయాకారుఁడు, మాయావి, మాయి, మాయికుఁడు, వ్యంసకుఁడు, సౌభికుఁడు. (తె).— కయిలాటకాఁడు-కైలాటకాఁడు, గారడి-గారడివాఁడు-గారడీఁడు, జిగజెంత, టంకు, టకటంకు-టకటొంకు, టక్కరి, టక్కులాఁడు, టెక్కులాఁడు, తవలికాఁడు, డాంబికుఁడు, తక్కరి, తక్కులాఁడు, బూటకీఁడు- బూటకుఁడు, మటుమాయకాఁడు, మటుమాయలాఁడు, మతకరి, మాయకాఁడు, మాయదారి, మాయపోఁడు, మాయలమారి, మాయలాఁడు.

వ్యాళగ్రాహుఁడు. సం. వి. అ. పుం.—వై.—

వ్యాళము. సం. వి. అ. పుం. రూ-వ్యాడము. 1. పాము: చూ, సర్పము; 2 =వాలాము. పులి: చూ, శార్దూలము; 3. తులువయేనుఁగు: చూ, హస్తి; విణ. 4 క్రూరమైనది: కరాళి, వక్రము: చూ, పాధ్వసము. (చూ, రౌరవము. 2.) [వ్యాడాయుధము

వ్యాళాయుధము. సం. వి. అ. న: చూ, రూ—

వ్యాళీముఖము. అం: చూ, తతవాద్యములు.

## వ్యు

వ్యుత్క్రమము. సం. వి. అ. పుం. క్రమవిపర్యయము, వ్యతిక్రమము.

వ్యుత్థానము. సం. వి. అ. న. 1 అడ్డపాటు: చూ, సంరోధము; 2. సమాధినుండిమరలుట; 3. ప్రతికూలవర్తనము; 4: చూ, స్వాతంత్ర్యము.

వ్యుత్పత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. శాస్త్రాదిజన్యపరిజ్ఞానము: చూ, వ్యుల్లేఖము. 2; 2. శబ్దసంభవ ప్రకారము.

వ్యుత్పన్నుఁడు. సం. విణ శాస్త్రాదిజన్యపరిజ్ఞానముకలవాఁడు: ప్రహితుఁడు.

వ్యుత్పాదకము. సం. విణ. వ్యుత్పత్తిని కలిగించునది.

వ్యుషితము. సం. వి. అ. న. వేరిది-వేర్ది-వేడ్డి చూ, పాదము. (1).

వ్యుష్టము. సం. వి. అ. న. 1. వేకువ: చూ వేగుజాము; విణ. 2. వేగినది.

వ్యుష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. ప్రయోజనము: చూ, వ్యాపారము. 1; 2: చూ, సమృద్ధి.

## వ్యూ

వ్యూఢము. సం. విణ. 1. వ్యూహముగా ఉంచఁబడినది (సేన); 2. ఉంచఁబడినది: అధిక్షిప్తము, ఆయస్తము, ఆవిద్ధము, ఆహితము, ఉచితము, ఉపహితము, నిహితము, న్యస్తము, పర్యుషితము, ప్రణిహితము, వాసంతము, విన్యస్తము; 3. దట్టమైనది: చూ, సాంద్రము. 2; 4. విశాలమైనది: చూ, నుర. (3).

వ్యూతి. సం. వి. ఇ. స్త్రీ.=నేఁత. నేయుట: వాణి, వాపము. (తె).—అనికి, అల్లకము, అల్లి_అల్లిక, అల్లుడు, నేఁగ. [హో భేదములు.

వ్యూహపార్ష్ణి. అం. ప్రత్యాసారము: చూ, వ్యూ

వ్యూహభాగము. అం:చూ, ప్రకరణములు

వ్యూహము. సం. వి అ. పుం.1. మిక్కిలిఊహ: చూ, ఆలోచన. 3; 2: (తె).— ఒడ్డణము_ఒడ్డన_ఒడ్డనము_ఒడ్డము_ఒడ్డు, మొగరము - మొగ్గరము, మొన, మోహరము. తద్వి.—౧. వలయాకారముగఁదీర్చిన వ్యూహమునకు.-మండలము: ౨: బండిమొగ్గరము; ౩. దండవ్యూహమునకు.—(తె) వరుసమొగ్గరము. (చూ, వ్యూహములు); ౪: చూ, సమూహము; ౫: చూ, విన్యాసము. 2.

వ్యూహములు. అం. ఇందు ప్రధానవ్యూహములు.-శ్యేనము, సూచి, వజ్రము, శకటము, మకరము, ధ్వజము, పద్మవ్యూహము, క్రౌంచవ్యూహము మొ॥

వ్యూహాంగములు. అం: (చూ, గురుమతమునవ్యూహాంగములు; చూ, శుక్రమతమున వ్యూహాంగములు.) (పృష్ఠము 9_10.)

వ్యూహభేదములు. అం. (వ్యూహశాస్త్రము): దండ, భోగ, మండల, అసంహత వ్యూహములును చక్రగోమూత్రికాదులు వీనియవాంతరభేదములు. మఱియొకవిధమున:—ప్రకృతి, అసంహత, భోగ, మండలప్రధానవ్యూహములును గురుమతమునవ్యూహాంగములు శుక్రమతమున వ్యూహాంగములు (అనికొందఱు). తద్వి.—౧. పద్మము; ౨: బలవిన్యాసము; ౩. వ్యూహపార్ష్ణి, ప్రత్యాసారము ఇత్యాది. [స్త్రములు)

వ్యూహశాస్త్రము. అం. —వై.— (చూ, శా-

## వ్యో

వ్యోకారుఁడు. సం. వి. అ. పుం. 1. ఇనుముచేయువాఁడు: చూ, స్వర్ణకారుఁడు; 2. కమ్మరి: చూ, స్వర్ణకారుఁడు.

వ్యోమకేశుఁడు. సం. వి. అ పుం. వినుసిగదేవర: చూ, శివుఁడు.

వ్యోమచారి. సం. వి. న్. న: చూ, పక్షి.

వ్యోమధూమము. సం. వి. అ పుం: చూ, మేఘము. 1. [భారతి.

వ్యోమనాసిక. సం వి. ఆ. స్త్రీ: గరుద్వ్యోధి,

వ్యోమపదము. అం: చూ, ఉత్తానకరణబంధములు.

వ్యోమము. సం. వి. న్. న. 1. ఆకసము: చూ, సురవర్త్మము; 2. నీరు: చూ, సలిలము.

వ్యోమయానము. సం. వి. అ. న. ఆకాశమందు తిరుగెడు విమానము: చూ, విమానము 1.

వ్యోమాభుఁడు. సం. వి. అ. పుం: చూ, బుద్ధుఁడు.

వ్యోషము. సం. వి. అ. న: చూ, త్రికటుకము.

## వ్ర

వ్రంత. దే. వి. రూ-వరఁత. 1. పల్లము: చూ, రంధ్రము. 1; 2. ఏఱు: చూ, నది; 3. కొండకాలువ, ఝురము: చూ, నది.

వ్రిక్క. వై. వి. ముక్క: చూ, శకలము. 4.
వ్రిక్కలించు. వై. స. క్రి. తునుమాడు: చూ, సెలగు.
వ్రిక్కలింత. వై. వి: చూ, వ్రిచ్చేట.
వ్రిక్కవారు. ద్వ. అ. క్రి: చూ, వ్రిక్కవాఱు.
వ్రిక్కవాఱు. ద్వ. అ. క్రి: కోఁతపడు, చీలు, తునియు, తునుఁగు, తూఁటకట్టు, తుగ్రింగు, తెగ్రిగు, తెగ్రియ్యు, తెగ్రివ్వు, నఱుసుడుపడు, పెరుగు, మురియు, మోఁదుపడు-మోడ్పడు, విఱుగు, వ్రిక్కవారు, వ్రియ్యఁబడు. వ్రియ్యవాఱు, వ్రియ్యు, ("చూ, స్ఫోటించు.") [చూ, సెలగు
వ్రిచ్చు. వై. స. క్రి.=వ్రిక్చు చీల్చు, భేదించు:
వ్రిచ్చేట. వా. వి. చీల్చుట, విదరము: చూ, స్ఫోటము. 1.
వ్రిజము. సం. వి. అ. పుం. 1. పసులమంద: చూ, సౌరభేయి (ధేనువు); 2. పసులకొట్టము: చూ, సదనము. 1; 3: చూ, సమూహము; 4. త్రోవ: చూ, మార్గము. 1.
వ్రిజ్య. సం. వి. ఆ. స్త్రీ. 1. అటాట్య: చూ, సంచారము; 2 ప్రయాణము: చూ, సంచారము; 3. ఒకతెగ: చూ, సమూహము.
వ్రిణము. సం. వి. అ. పుం, న: అరుస్సు, ఈమ, ఈర్మము, ఉపనాహము, కందము, గండము, త్వక్కుండురము, పిటకము- (పీటకము). (తె).— కురుపు-కుఱుపు, గడ్డ-గెడ్డ, పుండు. తద్వి.—౧: (తె) ఎఱ్ఱగడ్డ, నెత్తురుగడ్డ; ౨: గతి, నాడి, నాడీవ్రణము. (తె): నాడి, నారికుఱుపు, సెలపుండు; ౩:కక్షారువు; ౪: చూ, విదర్చిక; ౫: (తె) చెల్లజొండు; ౬: (తె). జెంతికపుండు, లూటీ-లూటీ; ౭: భగంధరము; ౮: (తె) మండలూటి - మండిలూటీ; ౯: (తె) పోఁద; ౧౦: గులి, విస్ఫోటము. (తె).— గంజిగుల్ల, గుల్ల, చెమటకాయ, చెమరకాయ, పొక్కు, బొబ్బ; ౧౧: (తె) కప్పకుఱుపు; ౧౨:(తె). గోరుచుట్టు, పుప్పి-ప్రుప్పి; ౧౩: కంఠమాల, గండమాల,గలగండము-గళగండము. (తె). వలయము, ౧౪: మసూరి-మసూరిక; ౧౫: పూరము, వ్రితిసరము; ౧౬: కేమము, పాటనము. (తె) పుంగుడు, పులిపిరి, పులిపులి, పులిపిరికాయ-పులిపురికాయ; ౧౭: కచము; ౧౮: (తె). సూద; ౧౯: పిచ్చు; ౨౦: కుసుమ; ౨౧. (పుం):కిణము; ౨౨.రణము. (తె). లాడి; ౨౩. (తె) అనాసపుండు; ౨౪: ముక్కల్లము. (తె) ముక్కు, ముక్కనగాయు; ౨౫: (తె) రాచేపుఱుపు, రాచపుండు; ౨౬:(మి)దొడవ్రిణము:-(తె).లూటి-లూటీ. ౨౭:నలుకు,గాయము: చూ,హతి. (ఇందుకు సంబంధించిన శాస్త్రపరిభాషాపదములు-.ఖరవ్రిణము; విలంబివ్రణము-జీర్ణవ్రిణము; పామావ్రిణము; సమ్మృద్ధవ్రిణము; అంకురితవ్రిణము; వాతరక్తవ్రిణము; విషమాణవ్రిణము-మానుడువ్రిణము; రక్తాసిదోషవ్రిణము-నిజవ్రిణము; దాహవ్రిణము; శోధోత్పాదక (వాపు) వ్రిణము; దుష్టవ్రిణము-శ్శోభితవ్రిణము; సారూజవ్రిణము; వేధకవ్రిణము; వ్రిసర్పివ్రిణము; ధ్వంసకవ్రిణము; రక్తపైత్తికవ్రిణము; శుద్ధవ్రిణము-సామాన్యవ్రిణము, శోధోత్పాదకవ్రిణము; ఫిరంగోపదంశజవ్రిణము; క్షయజవ్రిణము; సిరాజవ్రిణము- సిరావృద్ధిజవ్రిణము; పూతివ్రిణము, నిశ్శక్తవ్రిణము; వ్యాపకవ్రిణము ఇత్యాది )
వ్రితతి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. రూ-వ్రితతి.

తీఁగ *: చూ, వృక్షము; 2. విరిఁ: చూ, పోఁ రాశిము.

వ్రతమాచరించే. సం. స. క్రి. నోఁచే, నోము.

వ్రతము. సం. వి. అ. పుం. 1: నియమము, పుణ్యకము, సంయమనము. (తె):-జేన్ని యజేన్నె, నేమము, నోము, బతము, బాస. (వ్రతములు.—౩౬౫ వ్రతములుకలవు.౧ లక్షవర్తివ్రతము; ౨. పండ్రెండు దినములలో ముగింపఁదగినవ్రతము.— ప్రాజాపత్యము ఇత్యాది); అం. 2: చూ, పాళములు.

వ్రతముచెడ్డ సుఖముదక్కదు. లో. "వ్రతము చెడ్డ సుఖముదక్కదటన్న వచోనిరూఢి." (వై జయంతీవిలాసము).

వ్రతసూత్రము. సం. వి. అ. న: కంకణము, కౌతుకము, వ్రతినరము. (తె).—తోరము. ("చూ, సూత్రము. 1.").

వ్రతి. సం. వి. న్. పుం. 1: చూ, యజ్ఞకర్త; 2: చూ, అనువ్రతుఁడు.

వ్రతిభేదములు. అం: ఋషి, స్నాతకుఁడు, యతి, స్థాండిలుఁడు, ద్వయాతిగుఁడు, మూలికుఁడు, లోచకుఁడు, ఔర్వుఁడు, ఖఫుటుఁడు (౯). [లము. 4.

వ్రిష్వ. వై. వి.=వ్రిశ్చ. చీలిక: చూ, శకలము. 4.

వ్రియ్య. వై. వి.—వై.—

వ్రియఁబడు. వై. అ. క్రి: చూ, ప్రక్కవాఱు.

వ్రియ్యబము. వై. వి: చూ, వ్రియ్య.

వ్రియ్యవాఱు. ద్వ. అ.క్రి: చూ, వ్రక్కవాఱు.

వ్రియ్యు. వై. అ. క్రి.—వై.—

వ్రశ్చనము. సం. వి. అ. న. 1. భేదనము; చూ, స్ఫోటము; 2. పత్రిపరశువు, వృశ్చనము. (తె).-అకుటాయి (చూ, వృక్షాదనము. 1.)

# వ్రా

వ్రాఁకుడు. వై. వి.=వ్యాఘ్రీ.రూ-వాఁకుడుశ్చు చూ, స్పృశి.

వ్రాఁత. దే. వి. 1: దస్తూరి, వ్రాయసము, వ్రాయి. (సం).-అక్షరసంస్థానము, ఆలేఖనము-ఆలేఖ్యము, ఉత్పాదనము, లిఖితము, లిపి-లిబి, లేఖ, లేఖనము. (అన్య).-ఆర్ట్. తద్వి.—౧: చిత్తరువు. (సం).-ఆలేఖనము- ఆలేఖ్యము; ౨: బిలుగు, తీఁగమోడి- మోడి; (సం) — చీరము; 3: చూ, సంతకము; ౪: చూ, వ్రాలు; ౫: (సం). లేఖ్యము; ౬: ముసాయిదా. ౭: సాపు; వా. 2: చూ, వ్రాలు. 2.

వ్రాఁతకాఁడు. దే. విఙ: లేకరి, వ్రాయసకాఁడు, మునిసి-మునిషి, రాయసకాఁడు. (సం).-అక్షరచరణుఁడు, అక్షరచుంచువు, కిరకుఁడు-కిరికుఁడు, లిపింకరుఁడు-లిపికరుఁడు-లిపికారుఁడు, లిపీకరుఁడు, లేఖకుఁడు, వర్ణి. తద్వి.—చూ, సంవ్రతి.

వ్రాఁతచావిడి. దే. వి. వ్రాసెడుచోటు: చూ, గ్రంథకుటి. (చూ, సదనము. ౬౫).

వ్రాఁతపని. దే. వి. 1. రంగువేయువాఁడు వస్త్రములయందుమేలయందు రంగుతో వ్రాసెడు చిత్రము; 2. అక్షరములులోనగువానిని వ్రాసెడు-చిత్రము.

వ్రాఁతబల్ల. దే. వి. వ్రాసికొనెడుపలక.

వ్రాఁతసాకిరి. ద్వ. వి. లిఖితుఁడు:చూ, సాక్షి.

వ్రాజె. వా. వి: అంబేద, ఈబరి, ఈబరిగొట్టు, ఎంగిలికాయ, ఎంబన్న, ఎపగొట్టు, ఏబరాసి, కలుమ్రిచ్చె, కానివాఁడు, కిర్గాడి, కొఱగానివాఁడు, కొంపచెఱుపు, గలపడింపు, గొడ్డుఁబోతు, చేపట, చూపుగుఱ్ఱము,

డాకూళ్లమారి, దూబ, నడపీనుఁగు, నేరఁబోతు, పీతమ్మ, పెంటగాడిద, పెడ కొక్కులగొడ్డు, పెయ్యమ్మ, బచ్చెవ్వ, బికారి, బికాసి, మూసనముదికి, మోటవాఁడు, లేకి, లేకివాఁడు, వాజెమ్మ. (సం).—అంతర్గతుఁడు, అకౌశలుఁడు, అక్షముఁడు, అధృష్టుఁడు, అప్రయోజకుఁడు, అమిత్రుఁడు, కింజుఁడు, కింపాకుఁడు, క్షణుఁడు, క్షుద్రుఁడు, త్వాష్ట్రుఁడు, దివాభీతుఁడు, నిష్ప్రయోజకుఁడు, ప్రబుద్ధుఁడు, మందుఁడు, విధవ, వ్యర్థుఁడు, శాలీనుఁడు.

వ్రాతము. సం. వి. అ. పుం. గుమి: చూ, సమూహము. [న్యాయము.

వ్రాత్యసంస్కారన్యాయము. అం: ఒకానొక

వ్రాత్యుఁడు. సం. వి. అ. పుం. ఉపనయనాదిసంస్కారములేని బ్రాహ్మణుఁడులోనగువాఁడు: చూ, స్వస్తిముఖుఁడు.

వ్రాయసకాఁడు. దే. వి: చూ, వ్రాఁతకాఁడు.

వ్రాయసము. దే. వి. 1: చూ, వ్రాఁత; 2. జాబు: చూ, లేఖ.3.

వ్రాయి. దే. వి. 1: చూ, వ్రాఁత; 2. అక్కరము: చూ, వర్ణము. 1; 3. పాచికమీఁది బొట్టు: చూ, వ్యవహారము; 4. గీటు: చూ, రేఖ. 3.

వ్రాయు. దే. స. క్రి: రూ-రాయు, గీచు, గీయు. (సం).—లిఖించు- లిఖియించు. తద్వి.—సవరుచు, పూజెనేయు. (సం).—చిత్రించు.

వ్రాయుట. అం: చూ, అవధానములు.

వ్రాలు. దే. వి. 1: చూ, సంతకము. తద్వి.—౧: గోలునుమోడి; ౨. ఇతరులవ్రాలునకు.-దస్తూరీ; 3. చేవ్రాఁతకు.-దస్తూరీ;2. వ్రిస్తు నుదుట వ్రాసిన వ్రాఁత: వ్రాఁత; అ. క్రి. 3: రూ—వాలు, అత్తమిల్లు, ఇగ్గు-ఈగు, ఒడ్డగిలు-ఒడ్డగిల్లు, ఒరగఁబడు, ఒరగు-ఒఱగు-ఒఱవు, ఒరగువోవు-ఒఱగువోవు, ఒఱగఁబడు-ఒఱవఁబడు, ఓరగిల్లు-ఓరవోవు, కైయిజోలు-కైజోలు,కయివ్రాలు-కైవ్రాలు, కొంగోడువడు, కొంగోడువోవు, చేరు, చోగిలు-చోగిల్లు, చోఁగు-సాఁగు, తట్టువిఱుగఁబడు,తొంగు, తొప్పరిలఁబడు, తొప్పఱిలు-తొప్పఱిల్లు- తొప్పఱు, తొరఁగు- తొరుఁగు, దొరగిలు-దొరగిల్లు, దొరు, సాల్వడు. (మి):-అవనతమగు. తద్వి.—దండాకారముగావ్రాలు:- చోఁగు- సాఁగు; 4 మీఱు: చూ, సందడించు; 5. పక్షులుక్రిందికిదిగు, కొమ్మపైవ్రాలు, నేలపైవ్రాలు, ప్రక్కపై పరుండు:చూ, వ్రాలు. 3; 6. తగ్గు, ఒత్తగిల్లు, ఓరగిల్లు: చూ, సుక్కు. 9.

వ్రాలుచు. దే. ప్రే. వ్రాలఁజేయు. రూ—వ్రాల్చు.

వ్రాల్చు. దే. ప్రే.—పై.—

## వ్రి

వ్రిడ. సం. వి. అ. స్త్రీ. 1.=బిడియము: చూ, సిగ్గు; అం. 2: చూ, వృత్తము. 1. ("ఒక్కొక్కపాదమునకు ఒకయగణము, ఒకగురువునుగలదై] వాల్గవఛందస్సునందుఁబుట్టినవృత్తము").

వ్రిలు. కే. అ. క్రి. 1. చీలు: చూ, స్ఫోటించు; 2. చ్యుతమగు. సాం. మాన. 40: చూ, వీడుకొను.

వ్రిలుపడు. ద్వ. అ. క్రి. దౌర్బల్యముఁబొందు.

వ్రీహి. సం. వి. ఇ. పుం. 1. వడ్లు:చూ, ధాన్య.

ము; 2. ఎఱ్ఱవడ్లు: చూ, ధాన్యము. ౪౧; ౫౦. ౪: చూ, దర్భలు.

వ్రీహ్యాగారము. సం. వి. అ. న: చూ, వంటసాల.

# వ్రే

వ్రే. దే. వి. గొల్లకులము. (వ్రేఁడు-వ్రేత.)

వ్రేఁక. వా. వి. 1. అతిశయము: చూ, హెచ్చు. 2; 2. బరువు: చూ, భారము. 1.

వ్రేఁకటి. దే. వి. (వ్రేఁగు + కట్టు) రూ-వేఁక టి: చూ, భూ్రణము. 1. తద్వి.-వాఁగడుపు.

వ్రేఁకటివాఁడు. వా. వి. వృకుఁడు: చూ, లంద.

వ్రేఁకన. దే. వి. బరువు: చూ, భారము 1.

వ్రేఁకము. దే. వి. 1. —పై.—; 2. అతిశయము: చూ, హెచ్చు. 2.

వ్రేఁగు. 1. బరువు: చూ, భారము. 1; అ. క్రి. 2: రూ-వేఁగు, తపించు: చూ, సంతాపించు; 3. శుభోదయమగు: చూ, రూ-వేఁగు. 5

వ్రేఁగుపడు. ద్వ. అ. క్రి. భారమునొందు, భారపడు. [వ్రేలుచు-వ్రేల్చు.

వ్రేఁచు. దే. ప్రే. రూ-వేఁచు. వ్రేగఁజేయు:

వ్రేఁడు. పై. వి.=వృష్ణి. (దేశ్యమని శ. ర.): అలఁగాపరి-అలకాఁపరి-అలకాఁపు, కాటిపావఁడు, కిలారి-కీలారి, గొల్లకిలారి-గొల్లకీలారి, గొల్ల-గొల్లఁడు, గొల్లవాఁడు, పసిగాఁపు, పసిమసపరి, పసులకాఁపరి, పసులవాఁడు. (సం)-అనుగవీనుఁడు, ఆభీరుఁడు, ఔరభి్రకుఁడు, కోమలుఁడు, గోత్రుఁడు, గోధుమాఁడు, గోపాలుఁడు, గోపుఁడు, గోసంఖ్యుఁడు, ఘోషుఁడు, టంకుఁడు-టకుఁడు, దోగ్ధ, పల్లవుఁడు, వృష్ణి. తద్వి.— ౧: ఎఱ్ఱగొల్ల. (సం) మహాశూద్రుఁడు; ౨: పూనిగొల్ల; ౩: (సం) శూద్రుఁడు.

వ్రేఁత. దే. వి. రూ-వేఁత-వేటు-వ్రేటు 1. వ్రేయుట: 2. దెబ్బ. నిర్వ. 4, అ. 56: చూ, హతి.

వ్రేఁపు దే. వి: చూ, రూ- వేఁపు-వ్రేఁపుడు.

వ్రేఁపుడు. దే. వి.—పై.—

వ్రేటు. దే. వి: చూ, రూ-వ్రేఁత. [వ్రేయు. 1.

వ్రేటుగొను. దే. స. క్రి. కొట్టు: చూ.

వ్రేత. దే. వి. గొల్లత-గొల్లెత-గొల్లది, మందపోరియాలు. (సం).—ఆభీరి, గోపి, గోపిక, గోపాలి, పార్వతి, మహాశూద్రి, రాధ. తద్వి.—ఒకానొకగోపికకు.—(సం). పార్వతి.

వ్రేతలమేలువాఁడు. దే. వి: చూ, విష్ణువు 1.

వ్రేపల్లియ. ద్వ. వి గొల్లపల్లె: చూ, దేశము. 1516 పొరటలో. ౬.

వ్రేపల్లె. ద్వ. వి.—పై—

వ్రేయు. దే. స. క్రి: రూ-వ్రేయు. 1: అంచు, అడుచు, కొట్టు, కొను, చేదు్ర, చేయుచు, చోఁగఁటగొను, జేపురు-జౌరు, తాటించు, తాపించు, నుఱుపు, పులుము, పెట్టు, బాఁదు, బాఁదుకొను, మొత్తు, మోఁదు, రాకించు, రుత్తు, లగాయించు, వ్రేటుగొను. (సం): తాడించు, ప్రహరించు, వాయించు; 2. నఱకు: చూ, ఛెలగు. భార. ఆది. 4, అ. 13; 3: కొను, పాడుచు; 4: చూ, రూ-పైచు. 1; 5: చూ, రూ-పైచు. 2; 6: చూ, రూ-పైచు. 3; 7. దిగవిడుచు; చూ, విసర్జించు; 8. పెట్టు: చూ, హాపణించు.

వ్రేలఁబడు. ద్వ. అ. క్రి: చూ, రూ-వ్రేలాడు.

వ్రేలాడు. ద్వ. అ. క్రి: రూ- వ్రేలఁబడు-వ్రేలియాడు. ఈఁదులాడు, ఊరియాడు, ఊఁగాడు- ఊగాడు, ఊఁగు-ఊపు, ఊఁగులాడు, ఊటాడు, తుంపెసలాడు, తూఁగాడు-తూఁగియాడు-తూఁగు-

డింపులువోవు, విత్రరించే, వేలు, వ్రేలు, వ్రేలుకాడు. (సం).-ఆందోళించే.

వ్రేలినగ. వా. వి. అంగురీయకము: చూ, భూషణము. 12-(౨).

వ్రేలియాడు. ద్వ. అ. క్రి: చూ, రూ-వ్రేలాడు.

వ్రేలు. దే. వి, అ. క్రి: చూ, రూ-వేలు.

వ్రేలుకాడు. దే.అ. క్రి: చూ, రూ-వ్రేలాడు.

వ్రేలుచే. దే. స్రే. రూ-వ్రేల్చు. 1. వ్రేలఁజేయు; 2. కడుగు-కడువు- కడ్గు-కణఁగు, తొడయు. (సం) ప్రక్షాళించే.

వ్రేలుట. వా. వి. ఆలస్యము: చూ, విలంబము.1.

వ్రేలుడు. దే. విశ. వ్రేలాడినది: లంబితము. తద్వి. ౧: (వి).-(సం).—లంబనము-లంబము. (తె): డింపు-దింపు; ౨. (వి) మిక్కిలి వ్రేలుడుకు.—(సం): ప్రలంబము; 3. (విశ) వ్రేలాడునది:-అవలగ్నము, లంబమానము-లంబము.

వ్రేలుబొట్టన. వా. వి: చూ, బాలక్రీడ.

వ్రేలుమడఁచేట. జా. లెక్కపెట్టుట. "వ్రేలుమడఁచి యొక్కని నెతఁగింపుము." (నీతిచంద్రిక—విగ్రహము.)

వ్రేలుమిడి. దే. వి: రూ—వ్రేల్మిడి-వ్రేల్మిడి, చిటిక-చిటికె, చిటికెరింత. (సం).— అజి, క్షణము, క్షణికము, క్ష్వెడి, ఛోటిక, త్రుటము-త్రుటి: చూ, స్వరము. 2; 2 భూతి: చూ, భస్మము.

వ్రేల్చు. దే. స్రే: చూ, రూ-వ్రేలుచే.

వ్రేల్నడి. వా. వి: చూ, రూ—వ్రేలుమిడి. తద్వి.— అంగుళిపోటనము-అంగుళిస్ఫోటనము, ప్రచ్ఛటి.

వ్రేల్మి. వా. వి: చూ, రూ-వేలిమి. 1-2.

వ్రేల్మిడి. దే. వి. రూ-వెలిమిడి-వెల్మిడి: చూ, రూ-వ్రేలుమిడి. 2.

వ్రేళ్లు. పా. దీనికి ఉపమానములు.—పద్మపు రేకులు, చిగుళ్లు, పెసరకాయలు, పగడపు తీఁగలు.

# వై

వ్రైహేయము. సం. విశ. వ్రీహిపంట పెట్టఁదగినది (నేల): చూ, భూమి. 1-౯౧.

# శ

శ. ఒకయక్షరము. అం. 1: చూ, బూ. 21; 2: చూ, తాలవ్యములు. 1; 3: చూ, ఊష్మములు.

శమ్. సం. వి. అ. పుం. 1: చూ, శివుఁడు; 2: చూ, శిష్యుఁడు; 3. రాజో: చూ, హంసుఁడు. 5; 4. తాఁబేలు: చూ, వృత్తము. 4. (తాఁబేలు); 5. చిన్నసలుచేట; స్త్రీ. 6. దేవపూజ: చూ, సపర్య; 7: చూ, శక్తి. 1; 8: చూ, వెలుతురు; 9. రమ: చూ, హీర. 2. (లక్ష్మి. 1); 10: చూ, శైశ్య్వము; 11: చూ, శాస్త్రము; 12: చూ, శుభము. 1; 13. కీర్తి: చూ, సమాఖ్య; 14: చూ, బాణము. 1-౧౬; 15: చూ, స్వర్గము; న. 16. కోరినవస్తువు; 17. బుద్ధి*: చూ, వృద్ధి. 7; విశ. 18. సుందరము: చూ, హృద్యము; 19. ఎదుటలేనిది; పుం. 20: చూ, శకునము; 21: చూ, శాంతము; 22: చూ, సంతోషము; అవ్య. 23: చూ, సంతోషము; 24: చూ, శుభము. 1; 25: సుందరము: చూ, హృద్యము.

శంక. సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, సంశయము; 2 —జంకు: చూ, వెఱపు; 3: చూ, రొంచన; అం. 4. చూ, సంచారిభావములు. ("తన చెలికత్తెలుపలుకుచుండఁ జిలుకలుపలుకుచున్నవోయనియునిగ్గుటద్దముం గాంచి కలు

వక్షోజద్వోయనియొనచ్చెలితలఁకుచుండె.")

శంకరనారాయణము. అం: చూ, క్షేత్రములు

శంకరాభరణము. సం. వి. అ. న. ఒకరాగము: చూ, స్వరము. 2.

శంకరుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, శివుఁడు; విణ. 2: చూ, శుభంకరుఁడు.

శంకానివృత్తి. వా. సం. వి. ఇ. స్త్రీ. 1. అనుమానరాహిత్యము; 2. మలవిసర్జనము చేయుట.

శంకించు. సం. అ. క్రి. రూ-శంకిల్లు 1: చూ, సందేహించు; 2: చూ, భయపడు.

శంకిల్లు. సం. అ. క్రి —పై.—[2: చూ, వెఱపరి.

శంకితుఁడు. సం. విణ. 1: చూ, సంశయాళువు;

శంకిని. సం. వి. ఈ. స్త్రీ: చూ; రూ-శంఖిని

శంకుల. సం. వి. ఆ. స్త్రీ. 1. అడకత్తు, అడకత్తెర, అడకొత్తు, పోఁకొత్తు. (సం): పూగదళని; 2. ఉలి: చూ, వృక్షాదనము. 1.

శంకువు. సం. వి. ఉ. పుం. 1. మోడు: చూ, వృక్షము: 2. మేకు: చూ, శూలము. 8; 3. నీరుపంది: చూ, సూకరము; 4. ఒకానొకసంఖ్య: చూ, సంఖ్య. 1; అం. 5: చూ, ముప్పదిరెండాయుధములు (ఆయుధములు, బాణము. 1.) [భూషణము. 2

శంఖచరి. సం. వి. ఈ. స్త్రీ. చేర్చుక్క: చూ,

శంఖచూడము. అం: చూ, రి_ధ_హీనతానములు (తానములు.)

శంఖద్రావకము. అం: చూ, ద్రావకములు.

శంఖధారి. సం. వి. ఇ. పుం: చూ, శంఖపాణి.

శంఖనఖము. సం. వి. అ. పుం. నత్తగుల్ల: చూ, సంకు. 1. [చూ, విష్ణువు. 1.

శంఖపాణి. సం. వి. ఇ. పుం. వలమురితాలుపు:

శంఖశృంఖాది తైలము. అం: చూ, తైలములు.

శంఖపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. శంఖపుష్పిక*: చూ, కుక్కకంద.

శంఖపుష్పిక. సం. వి. ఆ. స్త్రీ: చూ, శంఖపుష్పి.*

శంఖభస్మము. అం: చూ, భస్మములు.

శంఖమర్దళము. అం: చూ, తంత్రములు.

శంఖము. సం. వి. అ. పుం, న.=సంకు. 1: చూ, సంకు. 1; పుం. 2 నొసటిరెముక: చూ, శల్యము. 1; 3. గజదంత మధ్యభాగము, కటము: చూ, హస్తి; 4. ఒకానొక నిధి (దుఃఖమును శమింపఁజేయునది): చూ, లిబ్బి. 2; 5. ఒకపాము: చూ, సర్పము; 6. నఖమనెడి గంధద్రవ్యము: (శంఖసామ్యము గలది): చూ, రాజార్హము. తద్వి:— కంబువు, జలజము, దీర్ఘనిస్వనము, శంఖము, వారిభవము. *; అం. 7: చూ, సంయుతహస్తములు; 8: చూ, సుషిరవాద్యములు; 9: చూ, పంచమహావాద్యములు; 10: చూ, విష్ణ్వాయుధములు; 11: చూ, నిధులు; 12: చూ, ప్రణవవాదములు; 13: చూ, సంఖ్యాభేదములు (శంకువు).

శంఖస్మృతి. అం: చూ, మూలస్మృతులు.

శంఖావర్తి. అం: చూ, అశుభావర్తములు.

శంఖిఁడి. అం: చూ, స్త్రీజాతులు.

శంఖిని. సం. వి. ఈ. స్త్రీ. 1: రూ-శంకిని, కేశిని, చోరపుష్పి. (తె).-ఎఱచిపిడుక, కట్ల-కట్లి-కట్లె, కడిల-కడిలము, పద్మపుఁదీఁగ; 2. గయ్యాళి: చూ, స్త్రీ. (ఇదరాక్షసజాతి అఁడుది): 3. బౌద్ధదేవి: చూ, స్వాహా. 3. (చూ, భార్య. 1-౪౦); అం. 4: చూ, స్త్రీజాతులు ("దృఢమైన కుటిలకేశములును, దీర్ఘస్తనములును, దీర్ఘదంతములును, క్షీరగంధమును, రూక్షస్వరమును, పాదసౌభాగ్యమును, కలహప్రియత్వమును గలిగియుండునది.")

శంఖినీనాడి. అం: చూ, నాడులు.

శండము. సం. వి. అ. పుం, న: చూ, షండము. 1

-శండుఁడు. సం. వి. అ. పుం.=షన్నగండు: చూ, షండుఁడు.

-శంప. సం. వి. ఆ. స్త్రీ. 1. రూ-సంప: చూ, విద్యుత్తు; 2. శంఖధ్వని: చూ, స్వరము. 2.

-శంపాకము. సం. వి. అ. పుం. రేల*: చూ, సువర్ణకము. (రూ-సంపాకము-శమ్యాకము.)

-శంబము. సం. వి. అ. పుం. 1. వజ్రాయుధము: చూ, బాణము. 1; 2. రోఁకలిపొన్ను: చూ, శంబరము. 4; విశే. 3. సుఖముకలది: చూ, సుఖము. [మూ్రిను*: చూ, శాకోటము.

-శంబరదారువు. సం. వి. ఉ. పుం. పెద్దటేఁకు

-శంబరము. సం. వి. అ. న. రూ- సంవరము. 1. నీరు: చూ, సలిలము; పుం. 2. చేఁప: చూ, మత్స్యము. 1; 3. ఎఱ్ఱనిచిన్నజింక: చూ, హరిణము. 1; 4. రోఁకలిపొన్ను: శంబము. (తె). పొన్ను, బొందియ. తద్వి.—౧ ఏనుఁగుకొమ్మునకువేసెడు పొన్నునకు.—కటకము; ౨. బండికల్లుబోవగువాని మొనను వేసెడు లోహవలయమునకు:- (తె): తొడవు.

-శంబరారి. సం. వి. ఇ. పుం: చూ, మన్మథుఁడు.

-శంబరి. సం. వి. ఈ. స్త్రీ. ఎలుకజీడి*: చూ, స్ఫోటశోఫ. [చూ, రాక్షసుఁడు. 1.

-శంబరుఁడు. సం. వి. అ. పుం. ఒకరక్కసుఁడు:

-శంబలము. సం. వి. అ. పుం, న. 1.=సంబడము: చూ, రూ-సంబళము; 2: చూ, మాత్సర్యము; 3. తీరము: చూ, రోధస్సు.

-శంబాకృతము. సం. విశే. రెండుచోళ్లుదున్నినది (నేల), నిడివియొకచోలును అడ్డమొకచోలును దున్నినది (అనికొందఱు.) రూ-సంబాకృతము: చూ, భూమి. 1.

-శంబుఁడు. సం. వి. అ. పుం. 1. రామునిచేతఁ జచ్చిన శూద్రతపస్వి: చూ, సన్న్యాసి; 2: చూ, శంబరుఁడు.

శంబుకము. సం. వి. అ. పుం, ఆ. స్త్రీ. రూ-శంబూకము-శాంబుకము-శంబువు. 1. కవ్వచిప్ప: చూ, సంకు. 1; అ. పుం. 2: రూ-శంబూకము, కణిక. (తె).-నూక. తద్వి.-౧: (తె) పూనూక; ౨: (తె) గండ్రినూక, ముదురునూక; ౩: (తె) చీరు, చెప్పు; ౪: (తె) రవ-రవ్వ-అవ-అవ్వ; ౫: (తె) చిట్టు; ౬: (తె) దూగర-దూవర; ౭: కంజాకము, కంబూకము. (తె).— తవుడు-తౌడు; ౮: (తె) ముక్కలు (ముక్కల్లు.); 3. ఏనుఁగు కుంభస్థలముకడచోటు: చూ, హస్తి.

శంబూకము. —పై.— [డు. 1.—2.

శంబూకుఁడు. సం. వి. అ. పుం: చూ, శంబుఁ

శంభళి. సం. వి. ఈ. స్త్రీ.=సంబళి. వేశ్యావిటసంధానకర్త్రి: అభ్యండి, అర్జుని- అర్జుని, ఆర్థతి, ఆగ్వాది, ఇజ్జ్య, కర్ణిక, కార, కిరాతి, కుంభదాసి, కుట్టని, గణేరుక, ఘటదాసి, ఘటోడ్డిక, చుందరి, దూతి_దూతిక, బడబ-వడవ, మాధవి, వాణిని, విభావరి, సంచారిక. (తె).— ఎడకత్తియ- ఎడకత్తె, కుంటికత్తె-కుంటినకత్తియ_ కుంటినకత్తె-కుంటెనకత్తియ_కుంటెనకత్తె, కొమ్మతారుపుగుల్ల, తాపికత్తియ- తాపికత్తె, తారుపుకత్తియ-తారుపుకత్తె, తార్పుకత్తియ_తార్పుకత్తె, తారుపుది, దొంతకత్తియ_దొంతకత్తె, బడవ, బొంతకత్తియ, బోటి, బోటికత్తియ, వంతకత్తియ, సంబరి.

శంభువు. సం. వి. ఉ. పుం. 1: చూ, శివుఁడు; 2: చూ, విష్ణువు. 1; 3: చూ, బ్రహ్మ. 1; 4: చూ, బుద్ధుఁడు. 1.

శంభువ్యాకరణము. అం: చూ, వ్యాకరణములు.

శంస. సం. వి. అ. స్త్రీ. 1. మాట: చూ, శబ్దము. 2; 2: చూ, స్తోత్రము; 3: చూ, వాంఛ.

**శంసనము.** సం. వి. అ. న. 1. చెప్పుట: ఆఖ్యానము, ఆముఖము, ఆరంభము, కీర్తనము, నిదేశము, నిర్దేశము, పర్వము, పరిసంగము, ప్రసక్తి, ప్రస్తావము, వృత్తాంతము, శుశ్రూష. (తె) — అంట-అనుట, చెప్పుట. తద్వి. — ౧. స్పష్టముగాఁ బలుకుటకు.—(తె) నిగదము-నిగాదము; ౨. చెప్పినది మరలఁజెప్పుటకు.—(తె).— తోడుపు. (చూ, శబ్దము. 2.); 2. స్తుతించుట: చూ, స్తోత్రము; 3. ఇచ్ఛించుట: చూ, వాంఛ.

**శకటము.** సం. వి. అ. పుం. న.=చెకడా. బండి: అనస్సు, కణిచి-కణీచి, కుటీరము, కుబ్రము, కూబరి- కూవరి, చంకరము-చంకురము, చక్రపాదము, చక్రి, నేత్రము, రథము, స్యందనము. (తె):— అరదము, తేరు, బండి. తద్వి.—౧: (తె) కట్టుబండి; ౨. ఇంద్రరథమునకు.— అపరాజితము, కౌతుకము; 3: బ్రహ్మరథము; ౪. విష్ణురథమునకు.—శతానందము; ౫. దేవతలరథమునకు.—చూ, విమానము; ౬: పుష్పరథము, పుష్యరథము: ౭. యుద్ధరథమునకు.-శతాంగము, స్యందనము; ౮. తేలికగాఁ బోవురథమునకు:-త్వాష్ట్రి, రథి, లఘ్వి; ౯.కప్పఁబడిన రథమునకు:— కాంబలము, కాంబళము, కూవరి; ౧౦. దేవతాదుల కుపయుక్తమగుబండికి:—(తె) బండి; ౧౧: ధూమశకటము. (తె):-కమ్మిబండి, కమ్ములపైబండి, కేకలబండి, పొగబండి, రైలు; (ట్రాము మొ.); ౧౨: (తె)సారటు; ౧౩: (తె) గిలకబండి; ౧౪: (తె) గూఁడుబండి; ౧౫: (తె) పెట్టెబండి; ౧౬: (తె) కచ్చడము, చెకడా; ౧౭: అమటము, గంత్రిరథము, (తె): పెంటబండి; ౧౮: కంబళిరథము, కర్ణీరథము, డయనము, ప్రవహణము, ౧౯: కంబళివాహ్యకము- కంబలి వాహ్యకము, కణి, గంత్రి-గాంత్రి, గంత్రీరథము. (తె): కంచేరము, కొలారుబండి-కొల్లారుబండి-కొల్లాబండి, గాడి-గాడీ, గొల్లెనబండి, పాటబండి, హాయలుబండి; ౨౦: నేమి, ప్రధి. (తె): నెమ్మి-నెమ్ము, కమ్మి, దాకల్లు; ౨౧. బండికన్నునకు:-(చూ, బండికన్ను); ౨౨: రథకట్యా-రథకడ్యా, రథ్యా; ౨౩. టాకుబండికి: (తె) మసిలె; ౨౪:- టాంగా: (చూ, బండి.); వా. 2. శకటు. (తె) సగటు; పుం. 3. రెండువేలపలముల పరిమాణము: చూ, పరిమితి; 4. తినాసము *: చూ, స్యందనము. 2; అం.5:చూ, భోగవ్యూహములు.

**శకటవ్యూహము.** సం. వి. అ. పుం: చూ, బండిమొగ్గరము.

**శకటాస్యము.** అం. 1: చూ, భూచారులు; 2: చూ, భౌమమండలములు; 3: చూ, కరణములు.

**శకటి.** అం: చూ, కకుజభాషలు.

**శకటు.** వా. వి. చేదరంగములోనిజంతువు:చూ, శకటము. 2. (ఇది ఐమూలగానడచును.)

**శకము.** సం. వి. అ పుం. 1. ఒకని పరిపాలనతోఁజేరిన వత్సరము: చూ, సంవత్సరములు; 2. ఒక దేశము:చూ, దేశములు; 3.ఒక జాతి.

**శకములు.** అం: యుధిష్ఠిర, విక్రమార్క, శాలివాహన, విజయాభినందన, నాగార్జున, కలిభుజశకములు (6).

**శకలము.** సం. వి. అ. న. 1. చెట్టుమీఁదిపట్ట: చూ, వల్కము-వల్కలము. తద్వి.— ౧: చూ, వడదోలు 1; ౨: చూ, వడదోలు.2. ("మా, బెరడు".); 2. నార, బెరడు:

-చూ, వల్కలము. 2; 3. గన్యము: చూ, రాగద్రవ్యము; పుం. న, 4: రూ-శాకలము, -అర్ధము, ఆస్ఫోటనము, ఖండము, తోదనము, త్వష్ట, భాగము, భిత్తము, వల్కము, వికిరము, శల్కము. (తె).— అరవరలు-అఱవఱలు, అరవుడు-అరువుడు, ఇండె, ఇడుపు, ఈరిక, కనియ-గనియ-గనె, గండ్రలు-గండ్రికలు, చిందఱ, చిందఱవందఱ, చిదుగ, చిప్ప, చీరిక-చీలిక, చెక్క, తుంట, తుండము-తుండు-తుండె-తుండెము, తునక-తునుక, తునియ-తునె, తుగ్గింపు-తుగ్గింపుడు, నగ్గు, నెఱియ-నెఱె-నెఱ్ఱియ-నెఱ్ఱె, నేమము, పచ్చేడి, పఱియ-పఱియ-పఱె-పఱ్ఱియ-పఱ్ఱె, పలక, పలుకు-పల్కు, పాయ, పగ్గు-పగ్గప్పు, బద్ద-బద్దర-బ్రిద్ద-బ్రిద్దర, బిల్ల, ముక్క, మురియ, ముఱు, మొటిక-మొట్టిక, మోసు, రవ-రవ్వ, వందఱ, వకవకలు-వకావకలు, వ్రిక్క, వ్రయ్య, వ్రయ్యలము. తద్వి.— ౧: (తె) బద్ద; ౨: (తె) చెక్క; ౩: లవము: (తె).- రవ-రవ్వ; ౪: సూక్ష్మఖండములు. (తె) -అరవరలు-అఱవఱలు, కడికండలు, తుందునుకలు- తుత్తునియలు, తుమురు; ౫: (తె) పాయ, ౬: పీలుపు; ౭. బంగారులోనగువాని చీలికకు: స్ఫారము.

-శకలి. సం. వి. న్. పుం: చూ, రూ-శకిలి.

-శకాహ్వావళి. అం: చూ, పంచమపాదపజాంతరభాషలు.

-శకిలి. సం. వి. న్. పుం. చేప: చూ, మత్స్యము. 1.

-శకుంతము. సం. వి. అ. పుం. 1. పులుఁగు: చూ, పక్షి; 2. చేమురుకాకి: చూ, భాసపము. 1; 3. ఒకపురుగు: చూ, పురుగు.

శకుంతి. సం. వి. ఇ. పుం. పక్షి: శకుంతము, వంశాకువు. తద్వి.— ౧: బంగాళము; ౨: (తె) పద్దకంకణము; ౩. పకాగ్రింగము; ౪: పరకేము, ౫: విష్కిరము; ౬: వృత్తచటకము; ౭: సూచీముఖము; ౮: బిలబిలాఖులు; ౯: (తె) బేరుండము, ౧౦: (తె) ముక్కుపూరెడు; ౧౧: బలిభుక్కు; ౧౨: రథాంగము, రథాంగాహ్వయము; ౧౩: రామదాసు; ౧౪: లావిల; ౧౫: మంజులము; ౧౬: భద్రిము; ౧౭: (తె) పాదిగువ్వ: ౧౮. పెద్దపెంటికొక్కెరకు.—బిసకంఠిక; ౧౯. పెంటికొక్కెరకు—బిసకంఠిక; ౨౦. పెద్దకొక్కెరకు.—బలాకము; ౨౧. కొక్కెరకు.—బలాకము; ౨౨. పక్షిలోనగువానిపిల్లకు.—పిల్లాకము, పోతము, పీలుకము, శాబకము. (తె) కందు, పిలక-పిలుక-పిల్ల, బోద-(బోదలా- బోదు-బోదులా- బోదె.) (చూ, శిశువు); ౨౩. (తె) పెంట; ౨౪. గుగ్గిడ్డునకు: చూ, పేశీకోశము; ౨౫: (తె) నీర్పిచ్చుగాఁడు; ౨౬. నల్లపిచ్చుకకు.—శ్యామ; ౨౭. పిట్టకు— సుపర్ణము. (చూ, పక్షి)

శకుఁడు. సం. వి. అ. పుం. 1. (నాయికామాత్రవిదితవిప్రియకారి): చూ, నాయకులు. 2; 2. ఒకరాజు: చూ, రాజు. 3-22.

శకుటము. సం. వి. అ. పుం.(తె) అడవిచేమ*. తద్వి.-౧. చేమకు:—ఆలుకము, ఆలువు-ఆలూవు. (తె) చేమ;౨: (తె) నల్లచేమ.

శకునము. సం.వి.అ.న.1.శుభసూచకమునిమిత్తము. (తె) వలను, సకినము;పుం.2.(రూ-శకుంతి-శకుంతము-శకుని) పిట్ట: చూ, పక్షి; 3 =సకినంపుఁబక్కి: చూ, సకినాలఁబులుఁగు.

శకునగహితములు. అం: దేవునిదర్శనము, స్వస్త్రీ సంగమము,నిత్యకర్మానుష్ఠానము,తీర్థయాత్ర, పుణ్యక్షేత్రయాత్ర, భోజనము, శయనము, గురుసేవ, భిక్షుకసేవ, అర్థకర్మము. (10)

శకునశాస్త్రము. అం. 1: చూ, మహావిద్యలు. (చూ, ఉపవిద్యలు 4-(3, చూ, వేదము, శాస్త్రములు.)

శకుని. సం. వి. ఈ. స్త్రీ. 1. నల్లపిచ్చుక: చూ, పిచ్చుక; ఇ. పుం. 2. పులుఁగు: చూ, పక్షి: 3. దుర్యోధనుని మేనమామ; అం. 4: చూ, కరణము. 14; 5: చూ, దుష్టులు.

శకునుఁడు. అం: చూ, దుష్టులు.

శకుల. సం. వి. ఆ. స్త్రీ: అరణ్యవాసిని, అతపత్రిక, కపిత్థపత్ర, కుపకాలుక, క్షుద్ర, ఖురపత్రిక, గౌరి, ఘోలి-ఘోళి, ఛిద్ర, జాతి, ఘురసి, శల్కపత్రిక. (తె): గచ్చెలి, చేఁతరాసి - చేఁతలాసి*. తద్వి - మహాఘురసి. (తె) పెద్దచేఁతరాసి. *.

శకులము. సం. వి. అ. పుం. (రూ-శకలము-శకుళి-శల్కి) బేడిసచేఁప: చూ, మత్స్యము. 1.

శకులాక్షకము. సం. వి. అ. పుం. తెఁగగతిక*, తెల్లగతిక (అనికొందఱు): చూ, తృణము. 1.

శకులాదని. సం. వి. ఈ. స్త్రీ. 1: అంజని, అశోక, అశోకరోహిణి, కటంభర-కటుంభర, కటుక-కటుకము, కటుకరోహిణి-కటురోహిణి, కటువు, కట్వి, కాష్ఠవల్లిక, కృష్ణ, కృష్ణభేద-కృష్ణభేది, కేదారకటుక, కైతవము, చక్రగుచ్ఛము, చక్రాంగి, తపస్విని, తిక్త, తీవ్ర, మత్స్యపిత్త, రోహిణి, వక్రాంగి. (తె): అసోగము *; 2: అనంత, పేదపిప్పలి*: చూ, కొండి. 1 (పిప్పలి. 1-8.)

శకులార్భకము. సం. వి. అ. పుం. గడిశము, కుచ్చెమీను,పిల్లవంటిమీను, జెల్ల (అనికొందఱు): చూ, మత్స్యము. 1.

శకులి. సం. వి. న్. పుం. రూ-శకలి-శకిలి- చేఁప: చూ, మత్స్యము. 1.

శకృత్కరి. సం. వి. ఇ. పుం. ఏఁడాదిలోపు దూడ, వత్సము: చూ, ధేనువు.

శకృత్తు. సం. వి. త్. న. పురీషము: చూ, శమలము.

శక్కరి. సం.వి.ఇ.పుం.ఎద్దు: చూ, వృషభము. 1-

శక్తావస్థ. అం: చూ, అవస్థలు (వక్రించియుండు గ్రహము శక్తావస్థను బొందును. శుభగ్రహములకు వక్రము గలిగినపుడు ధైర్యము, సుఖము, శుభము గలుగును.)

శక్తి. సం. వి. ఇ. స్త్రీ. 1.=సత్తి: అనుభావము, అవధి, అ, ఉపక్రమము, ఊర్జ-ఊర్జము, ఓజస్సు, క్రమము, ఖర్మము, గోత్రము,ఘనము,తరము-తరస్సు, తేజము-తేజస్సు, దాక్ష్యము, ధృష్టము, ద్యుమ్నము, ద్రవిణము, ధిష్ణ్యము, నిర్వాహము, పక్షము, పరాక్రమము, పరాక్రాంతి, పర్యాప్తము, పాటవము, పింజము, పిండము, పుష్టి, పౌరుషము, ప్రభవము-ప్రభావము, ప్రాణము, బలము, బీజము, భగము, భవము-భావము, లలామము,విక్రమము,వీర్యము,వేగము,శమ్,శాకము,శుష్మము,శౌర్యము, సత్వము, సహము, సారము, స్థామము, స్థేయము, స్థౌల్యము. (తె): అలవు, అవకాశము, ఆవాలు, ఆనిక, అనువు, ఉఁటిది, ఊట, ఊనిక, ఒమ్ము, ఓపిక, ఓపు, కొమ్ము, కొవ్వు, ఖుద్ది, గండు,గడి, చిక్కన, చేగ-చేవ, జెవ, జోరు-జోఁటు, డంక, తాత్రి, దిట-దిట్ట - దిట్టము, దిటవు, దిమాకు, నిగరము, పించే-పీఁచము, పూఁపు, బలిమి-బల్మి, బలుపు-బల్పు, బలువు, లా-

తృ, లేవ, సత్తు - సత్తి-సత్తు- సత్తువ, హొమ్ము. తద్వి.—౧: అతిశక్తత, విక్రమము, విక్రాంతి; ౨: పౌరుషము. (తె).—గండు, గెండ, గెండకము, పంతము, ప్రాయి, మగఁటిమి—మగఁటిమి, మగతనము. 2. సుజనుపటిమకు.—సాధుశక్తి; ర. బలము గలది :— చూ, శ్లాఘ్యము; 2 = సత్తి. గౌరి: చూ, పార్వతి. 1; 3. చిల్లకోల: చూ, సర్వల (బాణము. 1.); అం. 4. ప్రభుత్వాదిశక్తులు. ఇచ్ఛాది.—ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి. ఇచ్ఛాశక్తికి దివ్యశక్తియనియు పేరు: చూ, త్రయము; 5. ఉత్సాహాది.—ఉత్సాహము, ప్రభుత్వము, మంత్రము: చూ, త్రయము; 6. సత్త్వాది.—సత్త్వము, రజస్సు, తమస్సు: చూ, త్రయము; 7: చూ, ముప్పదిరెండాయుధములు (ఆయుధములు); 8: చూ, గుణములు; 9: చూ, దిక్పాలాయుధములు; పుం. 10. వశిష్ఠపుత్రుఁడు: చూ, మానుఁడు. 1; 11.=సత్తి. పిశాచము: చూ, పోఁకుడు. 1.

శక్తిత్రయము. అం: చూ, శక్తి. 4.

శక్తిధరుఁడు. సం. వి. అ. పుం: చూ, స్కందుఁడు.

శక్తిభైరవతంత్రము. అం: చూ, తంత్రములు.

శక్తిహేతికుఁడు. సం. వి. అ. పుం: శాక్తికుఁడు- శాక్తీకుఁడు.

శక్తుఁడు. సం. విణ: అండీరుఁడు, అంసలుఁడు, అతిబలుఁడు, ఉదారుఁడు, ఉపోఢుఁడు, ఊర్జస్వలుఁడు, ఊర్జస్వి, ఓజస్వ్యుఁడు, ఔజసికుఁడు, కుండీరుఁడు, క్షముఁడు, తరస్వి, బలవంతుఁడు, మహాబలుఁడు, బలుఁడు, మాంసలుఁడు, యువ. (తె).- కలవాఁడు, బంటోతు, బలితుఁడు, బలిమికాఁడు, బలియుఁడు, బలిసినవాఁడు, బలువుఁడు, బల్లిదుఁడు, బళాయి, బొనుక, బోరంపోతు, మొక్కఁడు, మొద్దఁడు, మొద్దు, మోటవాఁడు, లావరి. [చూ, మాతృకలు.

శక్తులు. అం: చూ, శక్తి. 3-4-5-6; తద్వి:-

శక్యము. సం. విణ: అఘాటము, వశము, సాధ్యము. (తె). అయితి-ఐతి, అలవి, కొలఁది—కొల్ది, తరము—తలము, వల్ల, వసము.

శక్రధనువు. సం. వి. స్. న. ఇంద్రాయుధము: (చూ, బాణము. 1.)

శక్రపాదపము. సం. వి. అ. పుం. దేవదారువు*: చూ, సూక్ష్మదారువు.

శక్రపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. వెన్నవెదురుకూర*: చూ, హాలిని.

శక్రభవనము. సం. వి. అ. న: చూ, స్వర్గము.

శక్రవల్లిక. సం. వి. ఆ. స్త్రీ: (తె) బుడ్డకాకర* ("చూ, సువవి. 1.")

శక్రవృక్షము. సం. వి. అ. పుం: చూ, వత్సకము*. [సహస్రాక్షుఁడు.

శక్రుఁడు. సం. వి. ఇ. పుం. ఇంద్రుఁడు: చూ,

శక్వరి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఏఱు: చూ, నది; 2. వడ్డాణము: చూ, భూషణము. 2; అం. 3: చూ, ఛందస్సులు.

శచి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఇంద్రుని భార్య; వృషాకపాయి: చూ, భార్య; 2. పిల్లపీఁచెర*: చూ, శతమూలి.

శచీదేవి. అం: చూ, దిక్పాలభార్యలు.

శచీపతి. సం. వి. ఇ. పుం: చూ, శక్రుఁడు.

శటి. సం. వి. ఈ. స్త్రీ. శఠి*: చూ, షడ్గ్రంథ.

శటిరము. సం. వి. అ. పుం: చూ, రోషము.

శఠత్వము. అం: చూ, అజ్ఞానదాయకములు.

శఠి. సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-శటి*.

శఠుఁడు. అం. 1: చూ, నాయకులు. 2; పుం. 2. మధ్యస్థపురుషుఁడు; విశ. 3.=చిట్టకట్టె: చూ, స్తబ్ధుఁడు; 4. కుత్సితుఁడు: చూ, వ్యాధుఁడు. 2.

శణపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. బ్రాహ్మి: చూ, సోమిదకూర. [చూ, శణము. 1.

శణపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. పచ్చజేనము*:

శణపుష్పిక. సం. వి. అ. స్త్రీ: కింకిణి, ఘంటారవ. (తె): కారుజేనము, గిలక-గిలగిచ్చే, గిలిగిచ్చే- గిలుగిచ్చే- గిలగింత- గిలగిల- గిలిగిట్ట. *.

శణము. సం. వి. అ. న. 1.=జేనము-జనుము. (సం)కటుతిక్తకము.తద్వి.—ఁ:చూ, వృత్తపర్ణి; ౨: చూ, శణపుష్పిక; 2: చూ, బాణము. 1; 3. తెల్ల*: చూ, తృణము 1; 4. వేరుపనస*: చూ, పనస. 2.

శణసూత్రము. సం. వి. అ. న. రూ-సణసూత్రము. జేనపనారతో నల్లిన వలత్రాడు, పవిత్రకము: చూ, సూత్రము. 2.

శతకము. సం. వి. అ. న. 1. నూఱుపద్యముల గ్రంథము: చూ, సంపుటము. 3; విశ. 2 నూఱుసంఖ్యగలది: చూ, సంఖ్య. 1.

శతకోటి. సం. వి. ఇ. పుం.1. వజ్రాయుధము: చూ, బాణము. 1; అం. 2: చూ, సంఖ్యాభేదములు.

శతఘ్ని. సం. వి. ఈ. స్త్రీ. 1. నాలుగుమూరల నిడివిగల యినుపముండ్లకట్ట: చూ, వెదురు. 1-౧(; 2. కానుగు*:చూ, శాదఘ్నము.

శతద్రువు సం.వి.ఉ.స్త్రీ:ఒకనది.రూ-శతద్రువు. (పుత్రశోకదుఃఖితుఁడై కంఠంబున రాయిఁ గట్టుకొని తనయందు దుమికిన వశిష్ఠునిఁజూచి నూఱుపాయలుగాఁ బ్రవహించినది): చూ, నది. [1; 2: చూ, శక్రుఁడు.

శతధృతి. సం. వి. ఇ. పుం. 1: చూ, బ్రహ్మ.

శతపత్రము. సం. వి. అ. న. 1. తామర: చూ, సహస్రపత్రము; పుం. 2. నెమలి: చూ, శిఖి. 2; 3. బెగ్గురు: చూ, సారసము; 4: దార్వాఘాటము. (తె): బెబ్బులుఁగు, మానిపుక్కిటి పులుఁగు, మానుపోటుపు, మానికోటుపులుఁగు- మ్రానికోటుపులుఁగు, మ్రానుగోయిల, మ్రాను తొలుచుపిట్ట, వడ్రంగిపిట్ట-వడ్లంగిపిట్ట; 5. రాచిలుక: చూ, శుకము.

శతపత్రిక. సం. వి. ఆ. స్త్రీ:చూ, సేమంతి*.

శతపది. సం. వి. ఈ. స్త్రీ. 1. కట్లజెఱ్ఱి, నల్లజెఱ్ఱి: చూ, సర్పము; 2. చెవిచొరుపాము: చూ, సర్పము; 3. రోకటిబండ: చూ, సర్పము; 4: చూ, ఆవర్తములు; 5: చూ, ఆగంతుకములు. [చూ, భార్య.

శతపర్వ. సం. వి. ఆ. స్త్రీ. శుక్రునిభార్య:

శతపర్వము. సం. వి. న్. పుం. 1: చూ, వెదురు*; 2.ఒకరకము చెఱకు*: చూ, రసాలము. 3.

శతపర్విక. సం. వి. ఆ. స్త్రీ. 1. గఱిక*:చూ, తృణము. 1; 2. వస*: చూ, వస.

శతపర్వేశుఁడు. అం. శుక్రగ్రహము: చూ, రాహువు. 2. [బ్రాహ్మణులు.

శతపస్త్రిబ్రాహ్మణులు. అం: చూ, శాలీన

శతపుష్ప. సం. వి. ఆ. స్త్రీ.=సదాప*: చూ, సదాప. [చూ, హయమారకము.

శతప్రాసము. సం. వి. అ. పుం. గన్నేరు*:

శతబిందువు. సం. వి. ఉ. పుం:చూ,విష్ణువు. 1.

శతభిషము. సం. వి. జ్. స్త్రీ. (రూ-శతభిష-శతభిషక్కు): చూ, రిక్క.

శతమన్యువు. సం. వి. ఉ. పుం:చూ, శక్రుఁడు.

శతమానము. సం. వి. అ. న. 1: చూ, పలము. 2; 2. కర్షద్వయము; 3. నూటికొలఁది; వా. పుం; న. 4. పుస్తె: చూ, మంగళసూత్రము (సూత్రము. 1); పుం. వ. 5. ఫలావళి

మిశ్రమైనవెండి. తూమెడుధాన్యము మొదలైనవి (అనికొందఱు): చూ, లోహము. 1.

శతము. సం.వి. అ. న. నూఱు: చూ, సంఖ్య.1.

శతమూలి. సం. వి. ఈ. స్త్రీ: అభీరుపత్రి, అభీరువు, అహేతువు, ఆహేతువు, అహిజిహ్వక, ఇందీవరి, ఊర్ధ్వకంటక, ఋష్యప్రోక్త- ఋష్యప్రోక్త, కాంచనకారిణి, కార్ష్ణి, కేశిక, తుంగిని, ద్వీపిశత్రువు, ద్వీపిన, నారాయణి, బహుసుత, భిత్తిక, భీరువు, వరము, వరి, వృషాకపాయి, శచి, శతావరి, సూక్ష్మపత్రి. (తె): చేల్లగడ్డ, పిల్లపిచ్చెర- పిల్లపీఁచెర- (పిల్లిపీఁచెర.). తద్వి.- మహాశతావరి, పీవరి. వీరవృక్షము. (తె): పెద్దపీఁచెర.

శతర్చులు. అం: మధుచ్ఛందుఁడు, మేధాతిథి, శునశ్శేపుఁడు, హిరణ్యస్తూపుఁడు, కణ్వుఁడు, ప్రస్కణ్వుఁడు, సవ్యుఁడు, నోధసుఁడు, పరాశరుఁడు, గోతముఁడు, కుత్సుఁడు, కశ్యపుఁడు, కక్షీవంతుఁడు, పరుచ్ఛేపుఁడు, దీర్ఘతముఁడు, అగస్త్యుఁడు. (16): (చూ, సూక్తద్రష్టలు)

శతవక్త్రము. అం: చూ, శస్త్రములు.

శతవీర్య. సం. వి. అ. స్త్రీ. తెల్లగఱిక*: చూ, తృణము. 1.

శతవేధి. సం. వి. న్. పుం. పుల్లప్రబ్బలి*: చూ, సహస్రవేధి.

శతహ్రద. సం. వి. అ. స్త్రీ. 1. మెఱుపు: చూ, విద్యుత్తు; 2. వజ్రాయుధము: చూ, బాణము. 1.

శతాంగము. సం. వి. అ. పుం. స్యందనము: చూ, శకటము. 1.

శతానందము. సం. వి. అ. పుం. విష్ణురథము: చూ, శకటము. 1. (రథము. 1.)

శతానందుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, బ్రహ్మ. 1; 2: చూ, విష్ణువు. 1.

శతారము. సం. వి. అ. న: చూ, శతహ్రద. 2.

శతావధానము. సం. వి. అ. పుం. భిన్నాభిప్రాయముల నూటింటి నొక్కసారి వెలిఁబుచ్చుశక్తి: చూ, అవధానములు.

శతావధాని. సం. వి. ఇ. పుం: భిన్నాభిప్రాయముల నూటింటి నొక్కసారి వెలిఁబుచ్చు శక్తిగల మేధావి): చూ, అవధాని.

శతావరి. సం. వి. ఈ. స్త్రీ. 1. పిల్లపీఁచర*: చూ, శతమూలి; 2: చూ, శచి. 1.

శతావర్తి. సం. వి. న్. పుం: చూ, విష్ణువు. 1.

శతాహ్వయ. సం. వి. ఆ. స్త్రీ. పెద్దసదాప *: చూ, సదాప.

శతేపంచాశన్న్యాయము. అం. ఒకన్యాయము.

శతోదరము. అం: చూ, శస్త్రములు.

శత్రువు. సం. వి. ఉ. పుం. 1: (శత్రుఁడు). అభిఘాతి, అభిమాతి, అభియాతి, అమిత్రుఁడు, అమృష్యుఁడు, అరాతి, అరి, అరుఁడు, అసహనుఁడు, అసహ్యుఁడు, అసుహృత్తు, అహి, అహితుఁడు, ఋ, కల్లోలుఁడు, కైరవుఁడు, ఛిత్వరుఁడు, జిఘాంసువు, జీవదుఁడు, దస్యుఁడు, దుర్హృదుఁడు, ద్విషత్తు- ద్విషుఁడు, ద్వేషణుఁడు- ద్వేషి.- ద్వేష్యుఁడు, పరిపంథి, పరుఁడు, ప్రతిపక్షుఁడు, ప్రతియోగి, ప్రతిరోధి, ప్రతీపుఁడు, ప్రత్యనీకుఁడు, ప్రత్యర్థి, రిపువు, విద్విషుఁడు, విద్వేషి, విపక్షుఁడు, విమతుఁడు, విరోధి, వృత్రుఁడు, వైరి, వ్యతిరేకుఁడు, శాత్రవుఁడు, సపత్నుఁడు. (తె. ప).— ఎదిరి_ఎదురు, ఒంటనివాఁడు, కంటు, గొంగ, గొట్టు, తొలఁగుబావ, దాయ, పగ, పగతుఁడు- పవతుఁడు, (బ) పగఱు, పగవాఁడు, బరి, మచ్చరి, మాఱు, మాఱుతుఁడు- మాఱుతుఁడు_మార్తుఁడు, వెట్టమా, సూడు, సూడుకాఁడు. తద్వి.—గ: అల్పశత్రువు, కంట

కుఁడు, క్షుద్రశత్రువు; ౬: అహితుఁడు; ౩: ద్వేష్ట; ౪: ద్వేష్యుఁడు. (తె): పగ దారి; ౫: అక్షిగతుఁడు, అభియోక్త, అభి యోగి, అభ్యమిత్రీణుఁడు- అభ్యమిత్రీ యుఁడు-అభ్యమిత్ర్యుఁడు, ప్రతిపక్షుఁడు, ప్రతిరోధి, ప్రతివాది, ప్రత్యర్థి, ప్రత్యుద్గ తుఁడు.(తె):పగదారి;2. దగ్గఱత్తిపోవువాని దేశమునకుఅవలిదేశపురాజు. (శత్ర్వాది రాజ మండలము.—శత్రుమిత్రులు, శత్రుమిత్రులు, శత్రుమిత్రమిత్రులు, పార్ష్ణిగ్రాహుఁడు, ఆక్రం దనుఁడు, ఆసారులిరువురు, మధ్యముఁడు, ఉ దాసీనుఁడు వీరుపన్నిద్దఱు); అం. 8: చూ, భావములు.

శత్రువుతోడి సంధులు. అం: కోశప్రధానహే తుకము, దండప్రధానహేతుకము, భూమి ప్రధానహేతుకము అనునవి.

శని. అం.=సని-సెని: చూ, రాహువు. 2.

శనివారము. అం: చూ, వారములు.

శనైశ్చరుఁడు అం: చూ, శని.

శపథము. సం. వి. అ. పుం: అభియోగము, కటము, ప్రత్యయము, ప్రమాణము, భాష, శపనము, శాపము, సత్యము. (తె): ఒట్టు- వట్టు, పాటి, పూనిక- పూనికి- పూన్కి, బాస. (చూ, శాపము. 1.)

శపనము. సం. వి. అ. న. —పై.—

శపించు. సం. స. క్రి: రూ—శాపించు, ఆక్రో శించు, శాపించు. (తె): కంకు, కంకులుపె ట్టు, దోకు, తిట్టాడు, తిట్టు, సాపించు- సెపియించు.

శఫము. సం. వి. అ. పుం. 1. గుఱ్ఱములోనగు వానిగొరిసె: పింఛుకుఁ; 2. చెట్టువేరు: చూ, వేరు. 1. [దుచేప: చూ, మత్స్యము. 1.

శఫరము. సం. వి. అ. పుం. ప్రోష్ఠి: ఎగసిపడె

శఫరి. సం. వి. ఈ. స్త్రీ.—పై.—(స్వలింగ మనికొందఱు).[చేప: చూ, మత్స్యము. 1.

శఫరాధిపము. సం. వి. అ. పుం. ఇల్లిశమను

శబరము. అం: చూ, దేశములు.

శబరాలయము. సం. వి. అ. పుం. బోయపల్లె, పక్కణము: చూ, దేశములు.

శబరి. సం. వి. ఈ. స్త్రీ. శబరస్త్రీ: చూ, స్త్రీ.

శబరుఁడు. సం. వి. అ. పుం. 1. ఆకులుకట్టు కొని యడవియందు తిరిగెడువాఁడు: చూ, వ్యాధుఁడు. 1, 2: చూ, శివుఁడు.

శబలము. సం వి. అ. పుం. 1. చిత్రవర్ణము: చూ, వర్ణము. 6; విశ. 2. చిత్రవర్ణము గలది: చూ, వర్ణము. 6; అం. 3: చూ, నరకములు. [వన్నెయావు: చూ, ధేనువు.

శబలి. సం. వి. ఈ. స్త్రీ. రూ-శబలి. పైది

శబళి. సం. వి. ఈ. స్త్రీ —పై.—

శబ్దగుణము. సం. వి. అ. పుం. ఆకాశము: చూ, సురవర్త్మము. [శ్రోత్రము.

శబ్దగ్రహము. సం. వి. అ. పుం. చెవి: చూ,

శబ్దదోషములు. అం: చూ, పదదోషములు- (దోషములు.) [2: చూ, రవణుఁడు. 2.

శబ్దనుఁడు. సం. విశ. 1: చూ, రవణుఁడు. 1;

శబ్దము. సం. వి. అ. పుం. 1.=సద్దు. ధ్వని- చూ, స్వరము. 2; తద్వి.—ం. (తె). వాకొనుట-వాకుప్రచ్చుట, ౨: ప్రసంచము, ("చూ, స్వరము. 2"); 2. వ్యాకరణ శిక్షితమైనమాట (శబ్దముఅనఁగా ఆక్రోశిం పఁబడునది. ఆస్వాదింపఁబడునది. స్పృశిం పఁబడునది. ఇంద్రియములను బంధించునది. అర్థము నెఱింగించునది): ఇడ, ఉక్తి, కల్యా ణానువు, గిర, గోవు, జ, పదము, ఫణితము- ఫణితి, భాష, భాషణము, భాషితము, ముఖము, లపనము, లపితము, వచనము- వచ స్సు, వాకు-వాక్కు, వాచకము, వాచము,

వాణి, వ్యాహారము, వ్యాహృతి, శంస, శ్రుతి, సంభాషణము, సంవిత్తు. (అవ్య): అక్, ఇ, బు, బూ, గీ. (తె): కరుదు-కఱద, దబ్బు, నుడి-నుడు-నొడి, నుడికారము-నొడికారము, నుడుగు-నుడువు-నొడుగు-నొడువు, పలుకు-పల్కు, బాస, మాట, ముక్క, వాకు, సాకు, సుద్ది. తద్విశేషములు:—౧: అత్యర్థమధురము, అమృతవాక్కు: చూ, సాంత్వము; ౨: అనక్షరము, పరిఘోషము; ౩: అబద్ధము. (తె) బద్దు-బద్దుర. (చూ, వితథము.); ౪: అపభ్రంశము, అపశబ్దము, అశ్లీలము, కలాపము, గ్రామ్యము, దురాలాపము. (తె): చెడ్డమాట, చెనుపరి, తొచ్చియము-తొచ్చెము, వెడ; ౫: అపలాపము, అపహ్నవము, అవేలము, జనాంతికము, నిహ్నవము. (తె): అటమట, నానుడి-నానుడు, మఱుఁగుమాట, వేసు, సామెత; ౬: అరుంతుదము, మర్మస్పృక్కు; ౭: అవిస్పష్టము, మ్లిష్టము; ౮: అనులాపము, ముహుర్భాష; ౯: అతివాదము, ఉక్తి, కంటకము, కఠినము, కఠినోక్తి, కర్కశవాక్యము, కోపోక్తి, గజనిమిలిక, నిష్ఠురము, పరుషము, పరుషోక్తి, పారుష్యము, ప్రలాపము, రుషోక్తి, విప్రలంభము, విప్రలాపము, విరసోక్తి, విసంవాదము. (విణ): శుక్తము. (అవ్య): ఊమ్. (తె): ఈఱతాఱలు, కంకర, కంటకము, కంటసము, కచ్చె, కట్టెవిరుపుమాట, కరసు-కరుసు, కఱకు-కఱుకు, కల్ల, కాఱులు, కాఱొడ్డెము, క్రొవ్విదము, గండ్రలు, గెంటసము, గొడ్డి, చిడిపి, టుటారము, దురుసు, పగటు, పదరు, పరుసదనము, పరుసనము, పురుసు, పలుసము, పిఱుము, పైటుకుమాట, పెడకట్టెమాట, ప్రల్లదము, బెట్టిదము, బెడిదము, బేరజేము, మొఱకు-మొఱ్ఱ. (చూ, పరుషము); ౧౦: ఆదేశము, ఆమ్నాయము, ఉపదేశము, ఓఘము, చటుచాటుని, చటువు, పరిభాష, సంగతము, సంప్రదాయము, సామము, సుప్రలాపము, స్వాంతనము, హితవచనము, హృదయంగమము. (తె): జెల్లింపుమాట, మంచి, మంచిమాట; ౧౧: ఆభాషణము, ఆలాపనము, ఆలాపము, ప్రవచనము, పరిభాషణము, సంభాషణము, సంలాపము. (తె): నిందుమాట; ౧౨. ఉచ్చరణము, ఉచ్చారణము, ఉల్లేఖము. (తె): పలుకుబడి-పల్కుబడి; ౧౩: ఉచ్చైర్ఘుష్టము, ఘోషణ (తె): జెట్టుపరి-జెట్ట్రిసరి; ౧౪: ఉత్ప్రాసము, ఉపాలంభము, ఉల్లుంఠనము, పరిభాషణము. (తె): ఉల్లకట్టు, ఉల్లసము, పాడుమాట; ౧౫: ఉత్సాదనము; ౧౬: కింవదంతి, కోవాళము, జనశ్రుతి, ప్రవాదము, లోకోక్తి, వదంతి. (తె): ఉత్తమాట, గాలిమాట, నానుడి-నానుడు-నానొడి-నానోడు, ఫుకారు, పొక్కిపోవడి, పొక్కు, బజేఱు, బాస, సామిత-సామెత, సుబ్బు; ౧౭: (తె) కేరడము; ౧౮: క్లిష్టము; ౧౯: (తె) కోఱడము; ౨౦: కాసువు; ౨౧: కుత్స్యము; ౨౨: కురుకుంచిత; ౨౩.గ; ౨౪: గద్గదము; ౨౫.(విణ) ఆఖ్యేయము, గద్యము, వాచ్యము; ౨౬: గుహ్యభాషితము; ౨౭: (తె) గుటగుటు; ౨౮: (తె) గంబెసము; ౨౯: (తె) గయాళము-గయ్యాళము; ౩౦: (తె) గడ్డపాంకము; ౩౧. గ్రస్తోక్తి: (తె) కొచ్చెమాట, కొతుకు-కొదుకు, గచ్చె-గ్రచ్చె, తొందఱమాట, పదరు; ౩౨: (తె) చేదువు; ౩౩: (తె): చిచ్చి-చిచ్చీ; ౩౪: (తె) చీవాట్లు; ౩౫: (తె) చెవ్వాకు; ౩౬: (తె) చిపట

మాట; ౩౭. వక్రోక్తికి:- జల్పము. (తె): ఒడ్డారము, ఒరగొడ్డియము- ఒరగొడ్డెము- ఒఱగొడ్డియము- ఒఱగొడ్డెము- వఱగొడ్డము, కేరడము, వంకరమాట, (బ)సడుగు; ౩౮: జ్యోక్స్య; ౩౯: (తె) జిడికిరింత; ౪౦: టు; ౪౧: తప్పు; ౪౨: తప్పి; ౪౩: (తె) తియ్యము-తీయము; ౪౪: (తె) తొకతొక; ౪౫: (తె) తొక్కు; ౪౬: (తె) తోడు (చూ, శపథము. 1.); ౪౭: తుంబకము. (తె): నంగి, నంగిమాట; ౪౮: దాయము; ౪౯: నికృతి, నిగ్రహము; ౫౦: నిదేశము. (తె): చెప్పుడుమాట; ౫౧: నిజము (తె): నిజేము; ౫౨: నిరూహము; ౫౩: (తె) పదరు; ౫౪: (తె) పల్లెమాట; ౫౫: (తె) పేలాపన; ౫౬: ప్రిజ్ఞ. (తె): పగ్గియ-పగ్గె, బింకము; ౫౭: ప్రశంస; ౫౮: ప్రలాపము, స్వప్నభాషణము. (తె): పదరు, పయిజో, పలవరము-పలువరము, పలవరింత-పలువరింత-పలవరింపు-పలువరింపు, పలుము, పలువ, పల్లఅపులు, పల్లదము-ప్రల్లదము, ప్రేలడము (ప్రేలుడు), రజ్జో, రొంజోడు-రొండుడు-రొడ్డుడు-రొల్లి, రోఁజోడు, పదావళి; ౫౯: (తె) పలుకరింత- పల్కరింత-పలుకరింపు; ౬౦: భర్త్సనము; ౬౧: మధ్యము; ౬౨: మన్మనము; ౬౩: (తె) ములికి-ముల్కి; ౬౪: (తె) మెలిక్కుఅము; ౬౫: (తె) మాట (ప్రతిజ్ఞావచనము); ౬౬: (తె) లాచోరీమాట; ౬౭: సంకులము; ౬౮: (చూ, వ్యంజకము. 1.); ౬౯: (తె) వాహిని; ౭౦: (చూ, శంసనము. 1.); ౭౧: (విణ) చెప్పఁబడినది: అభిహితము, అవగీతము, ఆఖ్యాతము, ఇర, ఇలఖళ, ఉక్తము, ఉచ్చరితము, ఉదితము, ఉద్గాహితము- ఉద్గ్రాహితము, ఉల్బణము, ఉల్లాపము, ఉళతి- ఉపతి-ఉర్ష- ఋళతి, కథితము, కల్యము, కానుష్, జటాజ్వాలము, జల్పితము, నిరస్తము, నిరుక్తము, ఫణితము, ప్రస్తుతము, భాషితము, రౌగ్యము, లపితము, వ్యాఖ్యాతము, వ్యాహృతము, సంభావ్యము. తద్వి.—(౧). చెప్పఁదగినది: చూ, శబ్దము. 2-౨౭; (౨): జల్పితము; (౩): వివక్షితము; (౪): శబ్దితము; (౫): ధ్వనితము: చూ, రవణము. 1; ౭౨: చూ, సూనృతము. ("చూ, సంభావణము.") (చూ, స్వరము. 2.); అం. 3: చూ, ఇంద్రియార్థము-ఇంద్రియవిషయములు; 4: చూ, ప్రత్యక్షప్రమాణములు; 5: చూ, రసవదలంకారములు; 6: చూ, ప్రకృతులు.

శబ్దపతి. సం. వి. ఇ.న. చేతికఱ్ఱ: చూ, వేత్రము. 1.

శబ్దశక్తిమూలము. అం: చూ, వ్యంజనములు.

శబ్దశక్తిమూలానురణనరూపవ్యంగ్యము. ళ. అం: చూ, సంలక్ష్యక్రమవ్యంగ్యము. [ణము. 1.

శబ్దశాస్త్రము. సం. వి. అ. న: చూ, వ్యాకర

శబ్దహీనము. అం: చూ, వాక్యదోషములు.

శబ్దాతిదేశము. పా. (ఉదా.—వాక్యము. ఒక చిట్టెలుక విచ్చలవిడిగా సంచరించుచు సింగమునకు నదరిపాటున నెదురుపడెను.")

శబ్దాధిష్ఠానము. సం. వి. అ. న. చెవి: చూ, శ్రోత్రము.

శబ్దాలంకారములు. అం: (చూ, అలంకారము 3 లో 1-2; 1-2-3-4-5-6. మీనివివరము లాయాపదములకడఁ జూచుకొనవలయును: చూ, యమకము. 3.): ఛేకానుప్రాసము, వృత్త్యనుప్రాసము, లాటానుప్రాసము, పునరుక్తవదాభాసము, యమకము (ఇందుపదయమకము, పాదయమకము, ముక్తపదగ్రస్తము, సింహావలోకనము), అంత్యనియమము, పునరు

క్త్రవదాభాసము ఇత్యాది.(మణికము)'-చక్రబంధము, చాపబంధము, గోమూత్రికాబంధము, నాగబంధము, అష్టదళపద్మబంధము, షోడశదళపద్మబంధము, మురజబంధము, కంకణబంధము, సర్వతోభద్రము-సర్వతోభద్రబంధము, ఖడ్గబంధము, క్షురికాబంధము, హలబంధము, ఛత్రబంధము, గుచ్ఛబంధము, త్ర్యక్షరి, మత్స్యబంధము, పుష్పమాలికాబంధము, రథబంధము, గోపురబంధము, ఏకాచ్కము, సర్వలఘువు, నిరోష్ఠ్యము. నిస్తాలవ్యము, నిష్కంఠ్యము, నిర్దంత్యము, నిర్మూర్ధన్యము, నిరంతస్థము, నిరూష్మకము, ఏకాక్షరము, ద్వ్యక్షరము, సర్వశ్లోకయమకము, అంతర్లాపిక, అచలజిహ్వ, అనులోమము, విలోమము (మిగతవానికి "చూ, హేతువు. 2.")

శబ్దావధానము. అం: చూ, కళలు.

శబ్దించు. సం. అ. క్రి: ఆఘోషించు, గర్జించు, ఘోషించు, ధ్వనించు, నాదించు, హుంకరించు. (తె. ప): అఱచు-అరచు-అఱుచు-అర్చు, ఉగ్గడించు, ఊళియు, ఎలుఁగించు, ఒఱలు, కరాళించు, కిచకిచకొట్టు, కిచకొట్టు, కిలకొట్టు, కిలారించు, కిలారుచు-కిలార్చు, కుట్టు, కూపెట్టు, కూయు, కెరలు, క్రిందిలు-క్రిందిల్లు-క్రిందు, క్రేఁటు, క్రోలుచు-క్రోల్చు, గఱగఱలాడు, గీపెట్టు, గుండ్రలుకొలుపు, గోడగించు, చిటుకను-చిటుక్కను-చిటుకురను, చెలఁగు, చప్పుడించు, చేఱుకగు, జడియు, తివురు, పెళపెళయను, బిబ్బిరించు-బిబ్బిరిల్లు, బెక్కొట్టు, బొబ్బరించు, బోరుకలఁగు, బోరుకొను, మలుగు- మూలుగు- మూల్గు, మొగకట్టు, మొత్తుఁగు- మొఱవు, మ్రోఁగు-మ్రోయు-మ్రోవు, రవళించు-రవాళించు, రొదాళించు, రొప్పు, ఱంపిలు-ఱంపిల్లు, లొటలొటమను, వాఁగు, వాకొను, వాపోవు. తద్వి.— ౧ ఘోషలు బొబ్బరించు: అఱచు- అఱుచు- అర్చు, శబ్దించు: ౨: (తె) కిలకిలఁబలుకు, కిలకిలలాడు, కిలారించు, కిలారుచు- కిలార్చు, కెగకొట్టు; ౩:(తె)కేకరించు(1); ౪: (తె)కేకరించు(2); ౫: (తె) క్రేఁటు, క్రేఁటుకొను; ౬: (తె) గుండ్రలుకొలుపు, గూండ్రించు; ౭. పులికూయు: (తె) గాండ్రించు, గాండ్రిలు-గాండ్రిల్లు; ౮. ఎలుఁగుకూయు: (తె) గాండ్రించు, గాండ్రిలు- గాండ్రిల్లు, రొప్పు. ౯: (తె) గీపెట్టు; ౧౦: ఘుర్ఘురించు; ౧౧: ప్రతిధ్వనించు (తె): ఎదురుమ్రోయు, మాఱుచెలఁగు, మాఱుమ్రోయు; ౧౨: (తె) బావురుమను; ౧౩: (తె) బెకబెకలాడు; ౧౪: (తె) ముసముసమను-ముసముసయను; ౧౫: (చూ, రొల్లు. 2); ౧౬: (తె) ఱంతిలు-ఱంతిల్లు; ౧౭: (తె) లొట్టవేయు; ౧౮: చెప్పు, వచించు: ఉచ్చరించు, భాషించు, వచించు-ప్రవాచించు, శబ్దించు, సంభాషించు. (తె) అను, ఆడు, ఉగ్గడించు, ఎత్తు, గోడగించు, చిటుకుపొటుకుమను, చెలఁగు, చెప్పు, డాఁగురించు, తడవు, తలపెట్టు, దబ్బు, నుడుగు-నుడువు-నొడుగు-నొడువు, పలుకరించు-పల్కరించు, పలుకు-పల్కు, పేరుకొను-పేర్కొను, పేరుగుర్చు, బాసాడు, మంచలించు, మాటాడు, మునుకు, వక్కణించు- వక్కాణించు-వాకొను, వాక్రుచ్చు, వాప్రుచ్చు. తద్వి.— (౧) ఏదేని యొకవిషయమును విస్తరించిచెప్పు: ప్రసంగించు; (౨) నిద్దురలేపి మాటాడు.— (తె) పలుకరించు-పల్కరించు; (౩) పిలుచు

మాటాడు.—(తె) పలుకరించు-పల్కరించు; (౪) ప్రస్తావనకు తెచ్చు.—ప్రసంగించు, ప్రస్తావించు; (౫) మాటాడించు.—(తె) పలుకరించు-పల్కరించు, మాటాడించు; (౬) వ్యతిరేకముగా సంభాషించు:-(తె) ఎదురాడు, మాఱాడు, మాఱుపలుకు; (౭) స్పష్టముగా చెప్పు.—నిగదించు. ("చూ, హుంకరించు.")

శబ్దితము. సం. విణ. శబ్దము చేయఁబడినది: చూ, శబ్దము. 2. తద్వి.— మ్రోయునది: చూ, రవణము. 1. (చూ, శబ్దము. 2.)

శమంతకము. సం. వి. అ. పుం. విష్ణుహస్తమునందలి మణి: చూ, రత్నములు.

శమథము. సం. వి. అ. పుం. శాంతి: చూ, శాంతము. 1.

శమథుఁడు. సం. వి. అ. పుం: చూ, మంత్రి 1.

శమనము. సం. వి. అ. న. 1: చూ, శమథము; 2. రూ-శసనము: చూ, వధము.

శమనస్వస. సం. వి. ఋ. స్త్రీ. యమునానది (యముని చెల్లెలు అనికొందఱు): చూ, నది.

శమనుఁడు. సం. వి. అ. పుం: చూ, యముఁడు.

శమము. సం. వి. అ. పుం. రూ. శాంతి. 1: చూ, శమథము; అం. 2: చూ, రసస్థాయీభావములు; 3: చూ, మానసికపూజాకుసుమములు.

శమలము. సం. వి. అ. న: అమేధ్యము, అవస్కరము, ఉచ్చారము, కల్కము, కిట్టము, గూథవర్చస్కము, గూథము, ఝిల్లిక, పురీషము, మలము, వర్చస్కము, వర్చస్సు, విట్టు, విష్ఠ, విష్ఠి, శకృత్తు, శమలము, శోదనము. (తె): పీయుగడము, పీయుగు, చెంబట్టిక- చెంబట్టికి, నింకిరి, నింపిరి, పియ్యి, పీయి, పిసరు, మసటు-మస్టు, సలగము. తద్వి.— ౧ పురాతన మలమునకు.—చిరిక; ౨: కర్ణగూథము, కర్ణజమలము, కర్ణమలము, కర్ణవిట్టు, కర్ణ్యము, కల్కము, తోక్మము, పింజూషము, (
గుబిలి-గులిబి-గులిమి—గుల్మి; ౩: (
పుట్టు; ౪: కంకష్ఠ్యము, కాచనికము, ద
మలము, పుష్పిక. (తె): పండ్లపాఁచి, పాఁచు
ప్రాఁకుడు, పాఁచి-ప్రాఁచి, బంపు;
లింగమలమునకు.— పుష్పిక; ౬: (చూ,
నామలము); ౭. దంతమలమునకు:-పిప్పి
౮: దూషి-దూషిక, దూషము, అశ్రు
(తె): పుసి-పుసె; ౯. మలసామాన్యము
అత్యుషిత, కల్కము, కిట్టము. (చూ,
ములు.); ౧౦: (తె) ఒంటినుస్న:
(విణ) గూవము; ౧౨: (తె) గొబ్బెనుచె
నుచ్చు, పెంటిక- పెంట్రిక- పెంటు
రొచ్చు; ౧౩: (తె) లద్ది; ౧౪: (తె)
౧౫. గ్రహణికి.—(చూ, రోగము. 1-
(౧) (౨)); ౧౬. పందిలోనగువాని మ
నకు.—(తె) గొద్ది- గొద్దియు—గొద్దె;
గోమయమునకు.—(చూ, పిడక. ౪,

శమాంతకుఁడు. సం. వి. అ. పుం: చూ, మన్మథు

శమాదిషట్కము. అం: చూ, సాధన
ష్టయము.

శమాదులు. అం: శమము, దమము, ఉపరతి
తితిక్ష, సమాధానము, శ్రద్ధ (6) (చూ, శ
షట్కము.)

శమి. సం వి. ఈ. స్త్రీ. 1.= జంబ-జంబు-జమి
కచరిఫల, కట్వామ్లిక, కర్కరాహ్వ,
నసారి, కేశమథని, కేశహంత్రి, కేశహ
ఫల, గోపఘోంట, చీన, జీవంతి, తపనతన
న్యగ్రోధము, మంగళ్యా, వహ్నిగర్భ,
శితశివము, సక్తుఫల. (తె): జంబ, జం
జమ్మి; *. తద్వి.—శమీరము. (తె):
జమ్మి*; 2. పెసలులోనగువాని పైపొ
చూ, శింబ; విణ. 3. (స్. ఈ. స్.) శ

గలవాఁడు: చూ, సహనుఁడు. [క్కు. 4.
శమించే.సం.అ.క్రి.=సమయు.అడఁగు: చూ, స్రు

శమితము. సం.విణ.శమించినది: చూ, శాంతము.1.

శమీరోహుఁడు. సం. వి. అ పుం: చూ, శివుఁడు.

శమీధాన్యము. అం. మినుములు పెసలులోనగు కాయధాన్యములు: చూ, ధాన్యము.

శమీరము. సం. వి. అ. పుం. నేలజమ్మి*: చూ, శమి. 1.

శమ్యా. సం. వి. ఆ. స్త్రీ. 1: యుగకీలకము. (తె): తమిరె; 2. యజ్ఞపాత్రవిశేషము: చూ, పాత్రము. 6; 3 =సెమ్మె. దీపస్తంభము: చూ, స్తంభము.

శమ్యము. అం: చూ, సశబ్దక్రియలు.

శమ్యాకము. సం. వి. అ. పుం. ఱే*: చూ, సువర్ణకము.(రూ-శంపాకము-సంపాకము.)

శయదీపము. సం. వి. అ. న.=చేదివియ. కరదీపము: చూ, దివిటి.

శయనము.సం. వి.అ.న.1. పడక: చూ, శయ్యా.1; 2. నిద్ర: చూ, స్వప్నము. 2; 3. సురతము: చూ, సంయోగము; అం. 4: చూ, శకున రహితములు. [చూ, గ్రహసమయములు.

శయనసమయము. అం. (సౌభాగ్యవిహీనము):

శయనించే. సం అ. క్రి: రూ-శయించే (తె): అత్తమిల్లు, తెండు, తెనమణు, తెన్నుండు, తేఁడు, తొంగు, తొన్నుండు, పండు, పండుకొను, పడు, పన్నుండు, పరుండు, పవడించే-పవళించే- పవ్వడించు-పవ్వళించే.

శయనీయము. సం. వి. అ. న. 1. పడక: చూ, శయ్యా. 1; విణ. 2. శయనింపఁదగినది: చూ, శయ్యా. 1. [సందుకా.

శయపేటి. సం. వి. ఈ. స్త్రీ. చేపెట్టె: చూ,

శయము. సం. వి. అ. పుం. 1.=చే-చెయ్యి-చేయి. పంచశాఖము, పాణి: చూ, హస్తము; 2. పడక: చూ, శయ్యా. 1; 3: చూ, సర్పము.

శయాలువు. సం. వి. అ. పుం. రూ-శయాళువు. 1. కుక్క: చూ, శునకము; 2. నక్క: చూ, సృగాలము; 3. కొండచిలువ: చూ, సర్పము; విణ. 4. నిదురపోతు: చూ, శయితుఁడు.

శయాళువు. సం. వి. అ. పుం. —పై.—

శయించే. సం. అ. క్రి: చూ, రూ-శయనించే.

శయితుఁడు. సం. విణ: శయాలువు-శయాళువు-నిద్రాణుఁడు (నిద్రాళువు), సుప్తుఁడు, స్వప్నకుఁడు-స్వప్నక్కు. (తె) నిదురపోతు-నిద్దురపోతు. తద్వి.-చూ, సుప్త్యన్మఖుఁడు.

శయువు. సం. వి. ఉ. పుం: చూ, శయాలువు.3.

శయ్యా. సం. వి. ఆ. స్త్రీ.1.=సెజ్జ: ఆస్తరణము, ఆస్తరము, ఔశీరము, కశిపువు-కసిపువు, తల్పము, పిచండము, మందుర, శయనము, శయనీయము, శయము, స్వాపము. (తె), ఒత్తు, తలిమము-తలిపము, దడిబము-దడిమము-దడిపము(దలిపము), పడక-పడుక, పక్క, పరపు-పరుపు-పఱపు-పఱుపు, పరియంకము, పలంగు, పవళింత-పవళింపు-పవ్వళింపు, పానుపు-పాన్పు, మెత్త, సెజ్జ. తద్వి.—౧. శయ్యపైపఱుపునకు: (తె) లేబ, లేపు; ౨. చిగుళ్లులోనగువాని సెజ్జకు: ప్రస్తరము, సంస్తరము. (తె): సెజ్జ; 3: హంసతూలికాతల్పము. (తె): అంచెగరులపాన్పు; ౪: (విణ) శయనింపఁదగినది: శయనీయము; ౫. మంచమునకు.—అవసక్థిక, ఆసంది-ఆసంధి, కర్ణవంశము, ఖట్వ, ఖట్వికా, ఖట్వా, విమద్య, పరికరము, మంచము. (తె): కంకటి-కంగటి, పానుపు-పాన్పు, మంచము. తద్వి.—(౧): రవమంచము. (తె): నకినలమంచము-నకిసెలమంచము; (౨): పట్టికామంచము. (తె): పటెమంచము- పట్టెమంచము- పట్టెడమం

చేము; (౪): (తె) చప్పరమంచేము; (౫). లఘుఖట్వికకు: పర్యంకము-పల్యంకము. (తె).- పరియంకము, పలంగు, పలకము, పక్కి, (ఇది చిన్న మంచేము); (౬): చతుష్పథము; (౭) మంచేపుపట్టెకు: (తె) పట్టియ-పట్టె; (౮) మంచేపు వేటిని మనసు: పట్టిక; 2: చూ, విధము. 1; 3. పదగుంభనము (వచ్చిన యర్థమె రాకుండ శబ్దములు మరలమరలఁ బ్రయోగించి చెప్పుట.); 4: చూ, కావ్యస్వరూపము.

శరండము. సం. వి. అ. న. 1.=సరడు. మెడనగ: చూ, హావళిక. 2 (భూషణము. 2-౬-(౨౬)); 2. తొండ: చూ, సరటము.

శరండుఁడు. సం. వి. అ. పుం. జాదరి: చూ, పందెకాఁడు.

శరగమనగుణదోషవిభాగము. అం: చూ, ప్రమేయములు.

శరగ్రహణహస్తప్రతిపాదనము. అం: చూ, ప్రమేయములు.

శరజన్ముఁడు. సం. వి. న్. పుం. రెల్లుమొలి: చూ, స్కందుఁడు.

శరణము. సం. వి. అ. న. 1. రూ-శరణి. దిక్కు, చేరుగడ: చూ, సంరక్షణము; 2. రూ-శరణి. రక్షణము: చూ, సంరక్షణము; 3. ఇల్లు: చూ, సదనము; 4. చంపుడు, వధము: చూ, హింస. 1; 5. నతి: చూ, హణిగలు.

శరణీయుఁడు. సం. విణ: అభిపన్నుఁడు, శరణ్యుఁడు. (తె) ఎరఁగుడుకాఁడు.

శరణి. సం. వి. ఈ. న. 1: చూ, రూ-శరణము. 1; 2: చూ, రూ-శరణము. 2; 3. శరణాగతి; 4: చూ, శరణము. 5.

శరణ్యుఁడు. సం. వి. అ. పుం. 1. గాలి: చూ, వాయువు; విణ. 2: చూ, శరణీయుఁడు.

శరత్తు. సం. వి. ద్. స్త్రీ. రూ-శరద. 1: చూ, ఋతువులు. (ఆశ్వయుజకార్తికమాసములు): చూ, మాసద్వయము; 2. ఏఁడాది: చూ, సంవత్సరము.

శరద. సం. వి. ఆ. స్త్రీ: చూ, శరత్తు.

శరధారి. సం. వి. ఇ. పుం.=సరదారు-సర్దారు: శూరుఁడు: చూ, హంవీరుఁడు.

శరధి. సం. వి. ఇ. పుం. 1: చూ, సముద్రము; 2. అమ్ములపొది: చూ, బాణము. 1.

శరనిధి. సం. వి. ఇ. పుం. —పై.—

శరపుంఖ. సం. వి. ఆ. స్త్రీ. గా-శరపుంఖము. 1. వెంపలి*: చూ, వెంపలి; 2. తెల్లవెంపలి*: చూ, వెంపలి.

శరప్రయోగ సమయాసమయ నిరూపణము. అం: చూ, ప్రమేయములు.

శరభక్రీడ. అం: చూ, వృత్తము. 1. ("చంద్రశ్రీచ్ఛాయను ప్రథమచరణమును, విశాలవృత్తఛాయను కడమ మూఁడుచరణములును నడచును.)

శరభము. సం. వి. అ. పుం. 1.=సెరబము. (ఎనిమిది కాళ్లుగలిగి సింహమును జంపెడు మృగము): చూ, సెరబము; 2. ఒంటెపిల్ల, కరభము: చూ, శృంఖలకము (లొట్టిపిట్ట.)

శరభలీలము. అం: చూ, జన్యతాళములు.

శరభుఁడు. సం. వి. అ. పుం. శరభుఁడనుకోఁతి: చూ, వానరము.

శరము. సం. వి. అ. న. 1.=సరుదు-సరము: చూ, బాణము. 1; 2. రెల్లు*: చూ, తృణము. 1; 3. నీరు: చూ, సలిలము; 4. మీఁది పెరుఁగు (అడుగు పెరుఁగు ద్రప్పము, నడిమి పెరుఁగు ఘనము, మీఁది పెరుఁగు శరము): చూ, ద్రవ్యము: 5: అతిఖరము, ఇక్షుగంధ, ఇక్షురంక, క్షురము, గంధోత్కట, పోటగళము, భద్రముంజము, ముంజేక్షువు. (తె): కాకివెదురు, కుందు రెల్లు*. (చూ, తృణము. 1).

శరమోచనప్రకారము. అం: చూ, ప్రమేయములు.

శరవ్యము. సం. వి. అ. న. గురి: చూ, లక్ష్యము. 1.

శరవ్యాపారయోగ్యతిథివారాది వివరణము. అం: చూ, ప్రమేయములు.

శరాఫల. సం. వి. అ. స్త్రీ: చూ, శ్రీతాళము*.

శరాభ్యాసము. సం. వి. అ. పుం. విలువిద్య నేర్చుట: ఉపాసనము. [పరిమేయములు.

శరాభ్యాసోచితమాసోపన్యాసము. అం: చూ,

శరారి. సం. వి. ఇ. స్త్రీ: ఆటి-ఆడి-ఆతి, పిప్పలము. (తె): ఆడెలు-ఆడేలు, శిగాతు-బాతువు. తద్వి.—౧: (తె): అడవిబాతు, కాకిబాతు; ౨: (తె): గూడబాతు.

శరారువు. సం. విశే. 1. చంపునది: చూ, హింస్ర. 2; 2. చంపుస్వభావముగలవాఁడు: చూ, హింసకుఁడు. [చూ, నది.

శరావతి. సం. వి. ఈ. స్త్రీ. ఒకానొకనది:

శరావము. సం. వి. అ. పుం, న.=సావ. మూఁకుడు: చూ, పాత్రము. 6.

శరాశరాసనగ్రహణ పౌర్వాపర్యసూచనము. అం: చూ, పరిమేయములు.

శరాసనము. సం. వి.అ. న.రూ-శరావాసము-శరాసము, విల్లు, ధనుస్సు: చూ,బాణము.1.

శరీరము. సం. వి. అ. న. (నశించునది) 1: అంగము, అజిరము, అపఘనము, అవతారము, ఆకారము, ఆకృతి, ఆత్మ, ఉత్సేధము,ఘ్రా, కరణము, కర్మ, కలాపము, కళేబరము, కాయము, ఘటి, ఘడి, కులము, కులాయము, కోశము, క్షత్రము, క్షపణ్యువు, క్షేత్రము, ఖగము, గాత్రము, చకము, తనువు, దేహము, ధామము, పంజరము, పురము, భూతాత్మము, మూర్తి, రథము, వపువు, వర్ష్మము, విగ్రహము, సంహననము, స్కంధము. (తె): ఒడలు-ఒళ్లు, ఓలము, నెమ్మయి-నెమ్మేను, పై, బొంది, మయి-మెయి-మే-మేను-మై. తద్వి.—౧. కోమలశరీరమునకు.—అంగము; ౨. దిగంబరదేహమునకు:(తె): బరిమేను; 3: చూ, ఇ. 11; ౪: శేతాళము; ౫: (చూ, పిండము. 7.); ౬: (చూ, అంగి. 2); ౭: (చూ, శల్యము. 1.); ౮: (చూ,ఎముకలగూఁడు);౯: (చూ, కండరములు.); ౧౦: చూ, సంధి 7, 14;అం. 2: చూ, దేహము. 3; 3: చూ, దేహము. 4.

శరీరశాస్త్రము. అం: చూ, శాస్త్రములు.

శరీరమాద్యంఖలు ధర్మసాధనమ్. లో. దేహము ధర్మములను సాధించువానిలో మొదటిది. *ఉదా. "శరీరమాద్యంఖలు ధర్మసాధన" మ్మని ప్రాజ్ఞులు వక్కాణింతురు" (నీతిచంద్రిక.)

శరీరములు. అం: స్థూలము, సూక్ష్మము. (2).

శరీరి. సం. వి. న్. పుం. 1. జంతువు: చూ, సత్త్వము. 10; విశే. 2. శరీరముకలవాఁడు: దేహి, జంతువు, జగత్తు (స్సు) పు, జన్తి. (తె): మయితాలుపు-మెయితాలుపు-మేతాలుపు-మేనుతాలుపు-మైతాలుపు. తద్వి.—౧: అల్పతనువు, కిరాతుఁడు, కృశ్ని. (తె): అలిపిరి-అల్పిరి; ౨: పరివారము-పరీవారము; 3: (చూ, ప్రాణి. 1.), ౪: చూ, మానుఁడు. 2.

శరీరిశరీరసంబంధము. అం: చూ, సంబంధములు.

శరులు. అం: "శ, ష, స." లు.

శర్కర. సం. వి. ఆ. స్త్రీ. 1.=చేక్కర. (రూ-శర్కరము-శర్కరిలము- శర్కరావంతము-శార్కరము-శార్కరిలము.): ఖండము, ఖేటము, గుడశర్కర, గుడోద్భవ, పంచసారము, మత్స్యండి - మత్స్యండి, మాధవీరసాల, సితఖండము. (తె): ఇసుకపులకండము, కండ, కండచేక్కర, కలకండ-కల్కండ, చేక్కరపంచదార, చేక్కర, నవాతు, పంచదార, పటికబెల్లము, పులకండము-పులకండము, పులోజో, బాతు, తద్వి.—౧: కఠిన, ఖండజము, గండోలము, గుడము, గులము, గూడము,

స్వాదువు. (తె) అచ్చె, చెఱకడము, బెల్లము; ౨: (తె) మంచిబెల్లము; 3: పణిదము, పాకము. (తె) పాగు; ౪: (తె) తాటిబెల్లము; ౫: (తె) పెద్దాపురి; ౬: మహాశ్వేత, మధుజ, ౭: (తె) కరుగు—కరుపు, పోంత అచ్చె; ౮: (తె) సీసా; 2. మొరపనేల: చూ, భూమి. 1—౯౨; 3: (తె) పెంకు, పెంచి— పెంచిక— పెంచే, ఓడుబిల్ల. తద్వి.—బంగాళా పెంకు; 4. పర్యాయ: చూ, శకలము. 4; 5. తెవులువగ: చూ, రోగము. 1.

శర్కరాంకము. సం. వి. అ. పుం: (తె) కమ్మ నిమ్మ, తియ్యనిమ్మ. *. తద్వి.—౧: ఐరావతము, పారేవతము, రుద్రాక్షము, రైవతకము. (తె): ఈడ, ఎఱ్ఱకిత్తలి; ౨: చక్రవాకముఖప్రియము, నారంగము, సుగంధము. (తె): కంచెయీడ; 3: ఖారీభము, మహాపారేవతము, సువర్ణపారేవతము. (తె): పెద్దయీడ; ౪: (తె) చిట్టీడ; ౫: కమల, కమలాఫలము, నాదేయి. (తె): కమలాపండు, కిత్తలి; ౬: కిమ్మీరము, నాదేయి. (తె): నారదబ్బ; ౭: (తె) కోలదబ్బ; ౮: (తె) దూదిదబ్బ; ౯: (చూ, దబ్బ 4); ౧౦: (తె) బత్తాయి, బత్తాయినారింజ; ౧౧: అధివాసము, ఐరావణము—ఐరావతము, కంటకి, కర్మి, కిమారము—కిర్మీరము. కిర్మీరత్వక్కు, గంధపత్రము, గంధాఢ్యము, గోస్తనము, గోరక్ష—చకార్ధివాసి, చోళకి, తిలభావి, దంతశఠము, నాదేయు, నాగరంగము—నారంగము, నారదము, భూమిజంబుక. (తె): నారింజ; ౧౨. నిమ్మకు:—వక్త్రశోధనము. తద్వి.—బొజ్జనిమ్మ. (చూ, నిమ్మ).

శర్కరాసవము. లం; చూ, ఆసవములు.

శర్కరిలము. సం. విశ. మొరపనేల: చూ, శర్కర. 2. [దుమట: చూ, వాయువు.

శర్ధము. సం. వి. అ. న. అపానవాయువు వి

శర్ధించే సం. అ. క్రి. 1.అపానవాయువు విడుచే; వా. 2: చూ, విష్ఠించే.

శర్మ. సం. వి. న్. పుం. రూ—శర్మము. బ్రాహ్మణుల పట్టపుఁబేరు "విష్ణుశర్మ." (వర్మ=క్షత్రియుల పట్టపుఁబేరు; గుప్త=వైశ్యుల పట్టపుఁబేరు, దాస=శూద్రులపట్టపుఁబేరు.)

శర్మము. సం. వి. న్. న: చూ, సంతోషము; పుం. 2: చూ, శర్మ; విశ. 3. సంతోషము కలది: చూ, సంతోషము.

శర్వరి. సం. వి. ఈ. స్త్రీ. 1. రూ—శార్వరి. శ్యామ, సంధ్యారాత్రి: చూ, రాత్రి 1; 2. వసువు: చూ, వర్ణము. 6. 3. ఆఁడుది: చూ, స్త్రీ.

శర్వాణి. సం. వి. ఈ. స్త్రీ: చూ, పార్వతి. 1.

శర్వుఁడు. సం. వి. అ. పుం; చూ, శివుఁడు.

శలకము. సం. వి. అ. పుం.=చెలగము: చూ, సాలెపురుగు.

శలభము. సం. వి. అ. పుం: చీరకము, పతంగము. (తె): మిడత—మిడుత. తద్వి.—౧. (తె) ఆకుపురుగు, ఆకుమిడుత; ౨: త్రికంటువు. (తె) దివ్వార్పుపులుఁగు—దివ్వెఆర్పుఁబుర్వు— దివ్వెయార్పు (దీనినే మిడతఅని కొందఱు); 3: (తె) పెదురుమిడుత.

శలము. సం. వి. అ. పుం, న.=సెల. 1. ఏదుపందిముల్లు: చూ, సితాగ్రము; పుం. 2. ఏదుపంది: చూ, సూకరము.

శలలము. సం. వి. అ. న. 1: చూ, శలము. 1; పుం. 2: చూ, శలము. 2.

శలవి. సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, శలము. 1; న్. పుం. 2. చూ, శలము. 2.

శలాక. సం. వి. అ. స్త్రీ. 1=సలాక. 1.గోడసులోనగువాని కమ్మి: చూ, పంకాంకము

2. వీణలోనగువాని వాయించెడు కొడుపు:- నఖము, పరివాదము- పరీవాదము, శారిక, (తె): కొడుపు, గోరు, నుడిగోరు. (చూ, నఖము); 3.=సలాక. ఏసణి, శల్యము.(తె): కడ్డి-కడ్డీ, కోపు, గసిక, పాళము- పాళా, వాగలు, సలాక. తద్వి.—౧ (తె): శ్వేడ; ౨: (తె) గజము; 4: చూ, బాణము. 1; 5. ఎముక: చూ, శల్యము. 1; 6.=సలుగు. ఏదుపంది: చూ, సూకరము; 7. మంగ*: చూ, శ్వపనము.

శలాటువు. సం. వి. ఉ. పుం. 1. ఒకానొక వేరు: చూ, వేరు. 1; విణ. 2. పండనిది (కాయ) - (తె): అలము, కాయ, పచ్చికాయ. తద్వి.—౧: (తె) దోరకాయ; ౨: (తె) పసరుగాయ; ౩: (తె) పసుగాయ; ౪: క్షారకము, జాలకము, బాలశలాటువు. (తె) అలము, కసుగాయ, కసురు, పిందె-పిందియ-పిందె, పచ్చికాయ, పూఁబిందియ-పూఁబిందె, పూప, లేఁతకాయ; ౫: (తె) కుక్కమూతిపిందె; ౬: (చూ, ఫలము. 1); ౭: (చూ, ఫలములు.)

శలుఁడు. సం. వి. అ. పుం: అస్థివిగ్రహుఁడు, తుండి, నంది, నందీశ్వరుఁడు, నాడీదేహుఁడు, భృంగి, భృంగిరిటుఁడు, భృంగీశ్వరుఁడు.

శల్కము. సం. వి. అ. న. 1.=చెక్కు. తునుక: చూ, శకలము. 4; 2: చూ, నార. 1-2-3-4. (చూ, బెరడు; చూ, వల్కలము; చూ, శకలము. 1-2.); 3. చేఁపపొలుసు: చూ, శల్కము. 2.

శల్మలి. సం. వి. ఇ. పుం, స్త్రీ. రూ-శాల్మలి. 1: చూ, నరకములు; 2. బూరుగు*: చూ, రూ-శాల్మలి. 1; 3. రూ-శాల్మలి. ఒకద్వీపము: చూ, లంక. 1.

శల్యకము. సం. వి. అ. పుం. ఆసువ: చూ, సూకరము.

శల్యకాష్ఠము. సం. వి. అ. న.=సెలకట్టె, బా ము: చూ, పేంతి. 4 (బాణము. 1.) [

శల్యపంజరము.సం వి.అ.పుం:చూ, ఎముకలగు

శల్యపర్వము. అం: చూ, పర్వములు. 2.

శల్యము. సం. వి. అ. న. 1: అస్థి, గ్రా, కీ ము, కుల్యము, భవ్యము, శలాక. (తె): మికె-ఎముక-ఎమ్ముక-ఎమ్ము, ఎఱక, మ్మ, సెమ్మ, బొమిక, బొఁకె, ముక్క క్క, ముదుసు.తద్వి.—౧: అళి, శంఖము.(తె నొసటియెముక; ౨: కంపళము, కపాల కరంకము, కరోటము-కరోటి-(కరోటీ), ర్పరము- ఖర్పరము, కోలము, శుక్తి. (తె కట్టెర, కప్పెర, చిప్ప, తలపాలు, పిం పుచ్చి-పుచ్చియ-పుచ్చె, పునుక-పున పుఱియ-పుఱ్ఱియ-పుఱ్ఱె, పెంకు, పెం పెంచిక-పెంచె, పెరక, బుఱ్ఱ, బొ బొచ్చె, బోఁకి, బోలె; 3: కపికందుక మస్తికాస్థి, శిరోస్థి; ౪: (తె) కొంకి, పె కొంకి; ౫: (తె) (చూ, కొంకి. 4); (చూ, ఎముకలగూడు); ౭: కోరక సంధి: (తె): అతుకు, ఇంటె, ఎముకకీ కీలు, టంకపుహాడి, పూస, మాటు; (వస్తు యొక్కరంధ్రములఅతుకునందునుపర్తించుచో ౯: (తె) చిప్ప, సోఁకాలిచిప్ప; ౧౦: తుర్రు; ౧౧: (చూ, వెన్నెముక.); చూ, పక్కక; ౧౨: (చూ, మహాశంఖమ ౧౩: (చూ, ముదుసు); ౧౪: త్రికము.( టికము-తికము, ముచ్చె, ముడుసు, పూస; ౧౫: (తె) ముకుదూలము-ము దూలము, ముక్కుకంబము; ౧౬: చూ, ప ము.ఇత్యాది;2: చూ, శల్యకాష్ఠము; 3.=

క, చూ, శలాక. 3; 4: చూ, విసము. 1; పుం, న. 5 = సెల్లుఁడు-చిల్ల-చీల-సీల-సెల, బాణపుములికి (లేక) మేకు, వసి: చూ, శూలము; 6. చిల్లకోల: చూ, సర్వల (చూ, బాణము. 1.); పుం. 7. ఏదుపంది, ముండ్లపంది-ములుపంది: చూ, సూకరము; 8. మంగ*: చూ, శ్వసనము; 9. దోసము: చూ, వృజినము; అం. 10. చూ, తంత్రములు.

శల్యములు. అం: చూ, ధాతువులు. [రాజు. 1.

శల్యుఁడు. సం. వి. అ. పుం. ఒకరాజు: చూ,

శల్లకి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఏదుపంది: చూ, సూకరము; 2. అందుగు*: చూ, రూ-సల్లకి.

శవము. సం. వి. అ. న. 1. నీరు: చూ, సలిలము; పుం, న. 2.=సబము; కటము, కుణపము, కుణపి, కుముదము, క్షితివర్ధనము, పూయము, స్థాగము. (తె): పీనుఁగు-పీన్గు, బడుగు, సవము-సబము-సబరము. తద్వి.— ౧: మృతజీవుఁడు; ౨: జీవన్మృతుఁడు; 3: జీవచ్ఛవము; ౪: ఆకారుఁడు, పరాసువు, పరేతుఁడు, ప్రమీతుఁడు, ప్రాప్తపంచత్వుఁడు, ప్రేతుఁడు, మృతుఁడు, సంస్థితుఁడు. (తె):—చేనిపోయినవాఁడు.

శవయానము. సం. వి. అ. పుం: అంకశయ్య, ఆసంది, ఖట్టి-ఖట్టిక, ఖటువు, కాష్ఠమల్లము, ఖాచి, ఖాటము, ఖాటి, వారుడము, శవవాహనము. (తె): కంపరము, కటుగు-కటువు, పాడె, బడియ-బడె. తద్వి.—మృతినొందిన పవ్యానులను తీసికొనిపోయెడి వాహనమునకు:—బ్రహ్మరథము. (చూ, మృతశయ్య.)

శవవాహనము. సం. వి. అ. పుం.—పై.—

శశకపింజలన్యాయము. అం. ఒక న్యాయము.

శశకము. సం. వి. అ. పుం: చూ, రూ-శశము. 1.

శశజాతి. అం: చూ, అంతరజాతిత్రయము.

శశధరుఁడు. సం. వి. అ. పుం. శశి: చూ, హిమాంశువు.

శశము. సం. వి. అ. పుం. 1: రూ-శశకము. (తె): కుందెలు-కుందేలు, చెవులపిల్లి, చెవులపోతు; 2. బోళము: చూ, సారగంధము. 3; 3: చూ, లొద్దుగు *. [లేదనురీతి.

శశవిషాణన్యాయము. అం. చెవులపిల్లికి కొమ్ము

శశవిషాణము. జా. లేనిది. "దేశాంతరమందున్న నాఁటి నాకుశలమో శశవిషాణము" (నీతిచంద్రిక-విగ్రహము) "శశవిషాణంబు దీర్ఘమై" (కవికర్ణరసాయనము)

శశశృంగము. సం. వి. అ న: (తె). కుందెనకొమ్ము, కుందేటికొమ్ము.

శశాంకుఁడు. సం. వి. అ పుం: చూ, శశధరుఁడు.

శశాదనము. సం. వి. అ. పుం. (కుందేటినిభక్షించునది) డేగ: చూ, శ్యేనము.

శశి. సం. వి. న్. పుం: చూ, శశధరుఁడు.

శశికళ. వా. సం. వి. ఆ. స్త్రీ: చంద్రకళ- (తె): నెలతునియ, నెలపాలు, నెలవీసము. (చూ, చంద్రకళలు, చూ, హిమాంశువు.)

శశిబిందువు. అం: చూ, మహారాజులు.

శశివదన. అం: చూ, వృత్తము. 1 (ఒకనగణము ఒకయగణము. 6వ ఛందస్సు).

శశోర్ణము. సం. వి. అ. న. కుందేటి తుప్పకంబళి: చూ, రల్లకము (కుందేటి వెండ్రుక అనికొందఱు.)

శశ్వత్తు. సం. అవ్య: అభీక్ష్ణము-అభీక్ష్ణము, అసకృత్తు, అజస్, పునఃపునః, ముహుః. (తె):—అఱమడి, అఱిమఱి, చీటికిమాటికి, పలుమరు-పలుమఱు-పలుమారు-పలుమాఱు-పల్మరు-పల్మఱు-పల్మారు-పల్మాఱు, మాటికి, మాటిమాటికి, మాఱు, వేమరు-వేమఱు-వేమారు-వేమాఱు-సారె-సారెకు, సారెసారెకు. (ఇవి ముహురర్థకమందును, అసకృదర్థకమం

చును కూడఁ జెల్లును.) (చూ, వెండియు); 2. ఎల్లప్పుడు, సదా: చూ, సతతము. 2; 3. మఱియు: చూ, వెండియు; 4: చూ, వెంబడి.1.

శష్కులి. సం. వి. ఈ. స్త్రీ. 1.=చెక్కిలము: చూ, భక్ష్యము; 2. బయటిచెవి: చూ, శ్రోత్రము.

శష్పము. సం. వి. అ. న. 1. లేఁతకసవు*: చూ, తృణము. 1; 2. శాంభవి, నల్లగఱిక*: చూ, తృణము. 1; పుం. 3. అప్పటప్పటికి వికసించెడు బుద్ధియొక్క హాని, ప్రతిభాహాని: చూ, హాని.2; వా.ని.అ.న. 4 స్త్రీపురుషుల గుఱుల చేట్లువంటియుండు వెండ్రుకలు: చూ, వెండ్రుక. 1.

శసనము. సం. వి. అ. న. యజ్ఞమునందలి పశువధము: రూ- శమనము, పరంపరాకము, ప్రోక్షణము.

శస్తము. సం. వి. అ. న. 1. మేలు: చూ, శుభము. 1; విణ. 2. శుభకరమైనది: చూ, శుభము. 1; 3.=సిస్తు. స్తుతింపఁబడినది: చూ, స్తోత్రము; 4. శ్రేష్ఠమైనది: చూ, శ్రైష్ఠ్యము

శస్త్రకారుఁడు. సం. విణ: చూ, కుశారువు. 2.

శస్త్రమార్జకుఁడు. సం. వి.అ పుం. (రూ-శస్త్రమార్జుఁడు): ఆయుధములు కడుగువాఁడు: చూ, సానలవాఁడు.

శస్త్రమార్జుఁడు. సం. వి. అ. పుం. —పై.—

శస్త్రము. సం. వి. అ. న. 1. అస్త్రము: చూ, బాణము. 1; 2. ఇనుము: చూ, లోహము.1.

శస్త్రములు. అం. ఇవి 47:-సత్యవంతము, సత్యకీర్తి, ధృష్టి, రభసము, ప్రతిహారతరము, పరాఙ్ముఖము, అవాఙ్ముఖము, లక్ష్యాలక్ష్యవిషమము, దృఢనాభము, సునాభము, దశాక్షము, శతవక్త్రము, దశశీర్షము, శతోదరము, పద్మనాభము, మహానాభము, సునాభకము, దుందునాభము, జ్యోతిషము, కృశనము, నైరాశ్యము, విమలము, యోగంధరము, హరిద్రము, దైత్యము, ప్రశమనము, శుచిర్బాహువు, మహాబాహువు, నిష్కలి, విరుచి, సార్చిర్మాలి, ధృతిర్మాలి, వృత్తిమంతము, పిత్ర్యసౌమనసము, విధూతము, మకరము, కరవీరకనము, ధనధాన్యము, కామరూపము, కామరుచి, మోహనము, మారణము, జృంభకము, సర్వనాభము, సంతానము, వరణము, రుచిరము. (ఈ శస్త్రములును అస్త్రములును కామరూపములనియు భృశాశ్వుని పుత్రులనియు శ్రీ మద్రామాయణము బాలకాండములో విశ్వామిత్రముని శ్రీ రామచంద్రునకు ఉపదేశించినట్లు చెప్పఁబడియున్నది.)(చూ, బాణము. 1; చూ, అస్త్రములు; చూ, ముప్పదిరెండాయుధములు; చూ, ఉపవిద్యలు ) [నములు )

శస్త్రశ్లోకము. అం: చూ, నిహీనతానములు (తా

శస్త్రాజీవుఁడు. సం. విణ. ఆయుధములచేత బ్రదుకువాఁడు: ఆయుధికుఁడు, ఆయుధీయుఁడు, కాండపృష్ఠుఁడు, కాండస్పృష్ఠుఁడు, స్పృష్టకాండుఁడు. తద్వి —శస్త్రి.

శస్త్రి. సం. వి. ఈ. స్త్రీ. 1. చేరకత్తి: చూ, రిష్టి. 2(బాణము. 1.); 2. మాదిగకత్తి: చూ రిష్టి. 2; విణ. 3. శస్త్రముధరించువాఁడు చూ, శస్త్రాజీవుఁడు.

## శా

శాంకరము. సం.వి.అ.పుం.ఎద్దు: చూ, వృషభము.1

శాంఖికుఁడు. సం. వి అ. పుం. 1.=సంకులవాడు. (సం): శాంబవికుఁడు. జంగమాఁడు అ. కొందఱు ); 2 శంఖమునూఁదువాఁడు.

శాండిల్య. అం: చూ, గోత్రము. 13.

శాండిల్యము. సం. వి. అ. పుం. 1. మారేడు: చూ, శ్రీఫలము; అం. 2: చూ, కల్పసూత్రము

శాండిల్యుఁడు. సం. వి. అ. పుం. 1. శాండిల ముని: చూ, సన్యాసి; అం. 2: చూ, శాస్త్ర

పరివర్తకులు. [దృష్టులు.

శాంత. అం: చూ, సంచారిభావమునఁ బుట్టిన

శాంతనవుఁడు. సం. వి. అ. పుం: శాంతనదంతుఁడు, గంగాజుఁడు, గంగాపుత్రుఁడు, గంగాసుతుఁడు, గాంగేయుఁడు, గాంగుఁడు, గాంగాయని, గాందినీసుతుఁడు, దేవవ్రతుఁడు, పురావసువు, భీష్ముఁడు, స్వేచ్ఛామృత్యువు.

శాంతము. సం. వి. అ. పుం. 1. శాంతరసము: చూ, రసములు; 2: ఉపశమము, ఉపశాంతి, క్షమ, క్షమ, క్షా, క్షాంతి, ప్రశాంతి, మర్షము, విస్రబ్ధము, శమ్, శమథము, శమనము, శమము, శాంతి, శామనము, సహనము, సహము. (తె): అడకర, ఓపిక, ఓపు, ఓరిమి, ఓరుపు-ఓర్పు, డిందుపాటు, తాలిమి-తాల్మి-(తాళిమి), తాళిక, తెఱప, నిమ్మళము, నిమ్మళి, నెమ్మది, పటిమ, మెత్తన, సయిఁపు-సైఁపు, సయిఁపుడు- సైఁపుడు, సయిరణ-సైరణ; విణ. 3. శమించినది:-శమితము, శాంతము; తద్వి.—క్షమను. (తె): తాళిక; అం. 4: చూ, రసదృష్టులు, 5: చూ, వేళావళ్యుపాంగములు. పా 6. దీనిఉపమానము:—ధర్మరాజు.

శాంతములేనిచేదువు. అం: చూ, నిరర్థకములు.

శాంతారము. సం. వి. అ. పుం. ఒకరకముచెఱుకు*: చూ, సుకుమారము. 1.

శాంతావస్థ. అం: చూ, అవస్థలు. 5. (శుభవర్గములయందున్న గ్రహములు శాంతావస్థనుబొందును.—శాంతము, వినయము, విద్య, సంపత్తిగలుగును.)

శాంతి. సం. వి. ఇ. స్త్రీ. 1. కామక్రోధాదిరాహిత్యము: చూ, శాంతము. 2; అం. 2: చూ, షడ్రి-హీనస్థానములు (చూ, స్థానములు, సర్వస్థానములు.) పా. 3. దీనిఉపమానము:-భూమి; వా. బ. 4. శాంతులు:—గ్రహశాంతి, నక్షత్రశాంతి, గృధ్రశాంతి మొదలగునవి; విణ. 5. ముగిసినది: చూ, సమాప్తము.

శాంతించే. సం. అ. క్రి: సహించే. (తె): ఓర్టు, తాళికయగు, తాళు, తాళుకొను, సంచే-సయిఁచే-సైఁచే.

శాంతిపర్వము. అం: చూ, పర్వములు. 2.

శాంతుఁడు. సం. విణ: చూ, సహనుఁడు.

శాంబరి. సం. వి. ఈ. స్త్రీ. 1. మాయ. (ఇంద్రజాలాదులు): చూ, మాయము. 1; 2. రతీదేవి, మన్మథునిభార్య: చూ, సహధర్మిణి (భార్య. 1–౮౭.)

శాంభవి. సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, పార్వతి. 1; 2. శష్పము, నల్లగఱిక*: చూ, తృణము. 1; అం. 3: చూ, ముద్రలు.

శాంభవీయము. అం: చూ, కల్పసూత్రము.

శాకకారుఁడు. సం. వి. అ. పుం. కూరలువండువాఁడు: కటంపకుఁడు-కటంబకుఁడు.

శాకటము. సం. వి. అ. పుం. 1. బండియెద్దు: చూ, వృషభము. 1; విణ. 2. బండిని. (బండిచేమోయఁదగినది) బరువు: ఆచితము. (తె): బండిబరువు.

శాకటికన్యాయము. అం. ఒకన్యాయము.

శాకద్వీపము. అం: చూ, ద్వీపములు. [వార్తాకము.

శాకబిల్వకము. సం. వి. అ. పుం. వంగ*: చూ,

శాకము. సం. వి. అ. న. 1. కూర. (చూ, వ్యంజనము. 1.): తద్వి.—(౧: కడంబము-కదంబము. కలంబము; ౨: కట్వరము; ౩: వ్యంజనము; ౪: శిగ్రువు; ౫: కుకురము; ౬: సితావరము; ౭: హారితకము); (తె) కూర, కూరకాడ, కూరనార: తద్వి.—౧: (తె) కలగూర; ౨: (తె) కలగలపు-కలగల్పు, కలుసుఁగూర; ౩: (తె) తియ్యగూర; ౪: అనుపానము;

౫: కుకుభ, రాగిణి (చూ, మారిషము); ౬: జాజూత; ౭: (తె) అలము, కూర; ౮: వృక్ష; ౯: నాడి. (తె) కూరకాడ; ౧౦. ఈనెకు: శిర-సిర (చూ, పొరక. 2.); పుం. 2.=టేఁకు. పెద్దటేఁకుమ్రాను*: చూ, శాకోటము; 3. చిఱుటేఁకు*: చూ, హంజిక; 4 = టేఁకు. టేఁకుదీవి: చూ, లంక. 1; వా. 5: (తె) తాలింపు; 6: చూ, శక్తి. 1.

శాకిని. సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకానొక పిశాచ స్త్రీ: చూ, సోఁకుడు. 1; 2. పెరుఁగుతోఁటకూర*. చూ, మారిషము. తద్వి.—౧. కొయ్యతోఁటకూరకు.-విష్నుశాఖము; ౨. ఎఱ్ఱతోఁటకూరకు - గుంజరి-గుజ్జరి-గుర్జరి, గుడకరి, రాగిణి.*.

శాకునము. సం. వి. అ. పుం. 1.శకునశాస్త్రము. చూ, శాస్త్రములు; విణ 2. శకునసంబంధమైనది. [చూ, వేఁటకాఁడు.

శాకునికుఁడు. సం. వి. అ. పుం. జీవాంతకుఁడు:

శాకోటము. సం. వి. అ. పుం: రూ-శాఖోటము, ఆపంచనఖము, కుష్ఠఘ్నము, కైశిక్యము,క్షీరనాశకము-క్షీరనాశము, క్షురచ్ఛదము, గంధమూలఘ్నము, గవాక్షి, గృహద్రుమము,ఘూకావాసము, పాలితము, వరదారువు. (తె): పెద్దటేఁకుమ్రాను, సిందురము. ("చూ, హంజిక"); తద్వి.—౧. టేఁకునకు: (చూ, సర్వతోభద్ర); ౨. పాలతేఁకునకు: (చూ, సర్వతోభద్ర)); 3, చిఱుతేఁకునకు: (చూ, హంజిక); ౪:గుమ్ముడుకు: (చూ,సర్వతోభద్ర.)*.

శాక్కరము.సం.వి.అ.పుం.ఎద్దు:చూ,వృషభము.1

శాక్తము. అం: చూ, మతములు.

శాక్తవ్యాకరణము. అం: చూ, వ్యాకరణములు.

శాక్తికుఁడు. సం. వి. అ. పుం: రూ-శక్త్యాయుధమును ధరించినవాఁడు: రూ-శాక్తీకుఁడు.

శాక్తీకుఁడు.సం.వి.అ.పుం: చూ,రూ-శాక్తికుఁడు.

శాక్తుఁడు. సం.వి అ.పుం. శక్తిమతప్రవర్తకుఁడు.

శాక్తేయబ్రాహ్మణులు. అం: చూ, బ్రాహ్మణులు. (శైవబ్రాహ్మణులలోనొకతెగ. ఋగ్యజుస్సామశాఖా ప్రవర్తకులై అశ్వలాయన కాత్యాయనాపస్తంబాది సూత్రములకుఁ జెందినవారు. తంత్రోపాసకులు. "సర్వంఁశక్తిమయంజగత్." అను శక్తియందు సర్వసృష్ట్యాది కర్తృత్వమును స్థాపించి అర్ధనారీశ్వరుఁడగు శివునియందలి శక్త్యంశమును విశేషము విశ్వసించి వామాచారసంప్రదాయము నవలంబించియున్నవారు): చూ, శైవబ్రాహ్మణులు.) [చూ, బుద్ధుఁడు. 1.

శాక్యముని. సం. వి.ఇ. పుం. శాక్యబుద్ధదేవుఁడు:

శాక్యసింహుఁడు. సం. వి. అ. పుం.—పై.—

శాఖ. సం. వి. ఆ. స్త్రీ. 1:కిర్మి, ప్రకాండము, ప్రలంబము,లత,విటపము,శిఖ.(తె):కొమ-కొమ్మ-కొమ్మ, మండ, రేట. తద్వి.—౧.శాఖ, స్కంధశాఖ. (తె): కవట, పెద్దకొమ్మ, పెనుఁగొమ్మ; ౨: ఉపశాఖ. (తె): కళ, గోల చివక, చివర, చివ్వ, చేవక, చేవ్వ, జేబర-జెబర, జొంపము, బలుగు, మండ, మట్ట, మెణత, మెల్లె, రివట, రివ్వ, రెంబ-రెబ్బ-రెమ్మ, రొట్ట, రేట, సురిగ-సురిగె, సెల, సెలగ, సెలగొమ్మ, సోగ; 3: చమరి, వీరుధము; ౪: పల్లవము, మంజరి, వల్లరి, విటపము; ౫. వితతశాఖకు:- (తె) మండ; ౬. రెండుకొమ్మలమొదలుపకు:-(తె) పలవకొమ్మ, పంగ, పలప, పాయగొమ్మ, ప్రగ్గ; ౭: (తె) మట్ట; ౮. మ్రానునకు:- చూ, స్కంధము. 2; 2. వేదభాగమునకు:- చూ,వేదము. ౨.౨; 3. చేయి: చూ,హస్తము; వా. ౫. 4: చూ, శాఖలు.

శాఖలు. అం: (చూ, నాడులు. 1; చూ, గోత్రములు 13; చూ, వాఙ్మయము: చూ, వేదము.)

శాఖాచంక్రమణన్యాయము. అం. ఒకకొమ్మమీఁదనుండియింకొకకొమ్మ యెక్కునరీతి.

శాఖాచంద్రన్యాయము. అం. ఆకాశమందున్న చంద్రుఁడు చెట్టుకొమ్మ దగ్గఱగానుండెనని చూపించినరీతి.

శాఖాదండుఁడు. సం. వి. అ. పుం. అన్యశాఖాపాఠకుఁడు: చూ, సంతచెప్పువాఁడు.

శాఖానగరము. సం. వి. అ. పుం. ఉపనగరము, పేఁట: చూ, పేంట. 4–5. [వానరము

శాఖామృగము. సం. వి. అ. పుం. కోఁతి: చూ,

శాఖి. సం. వి. న్. పుం. 1. చెట్టు (కొమ్మలుగలది): చూ, వృక్షము; 2. వేదము: చూ, వేదము. 1; 3. తురక: చూ, మ్లేచ్ఛుఁడు; విణ. 4. అంతర్భాగములుగలది.

శాఖోట. సం. వి. అ. స్త్రీ: చూ, రూ_శాఘోట*.

శాఖోపశాఖలు. జా. 1. ఒకకొమ్మకు బయలుదేరిన మఱికొన్ని చిన్నకొమ్మలు; 2. ఒకమాటవెంబడి దానితోఁగలసిన మఱియొకమాట. "శాఖోపశాఖవారి, వైఖరిఁదెలుపంగ." (శంతనూపాఖ్యానము.)

శాఘోట. సం. వి. అ. స్త్రీ: (రూ_శాఖోట_శాఘోటము_శ్యాఘాటము_శ్యాఘోట_ష్యాఘాటము), అధోపుష్పి, అధోముఖి, కరచ్ఛద_కరచ్ఛదము, కర్కటచ్ఛద, కాళకోజ్యము, క్షురిక, ఖరపత్రి, గోజిహ్వా, చరచ్ఛద, జలవర్ధనము, ఝూబుకము, పిచులము, భూతవాసము, సిందూరపుష్పి. (తె): పక్కియ_పక్కి_పర్కి_పర్కి_పర్కి, బరివెంక.* (చూ, శాకోటము)

శాఘోటము. సం. వి. అ. పుం. 1.—పై.—; 2: చూ, రూ_శాకోటము.

శాటి. సం. వి. ఈ. స్త్రీ.=జేడక. రూ_శాటిక. 1. యతిలోనగువారిబట్ట: చూ, వస్త్రము. 1–౮౭; 2. దుప్పటి: చూ, వస్త్రము. 1–౧౦౬.

శాటిక. సం. వి. ఆ. స్త్రీ.—పై.—

శాఠ్యము. సం. వి. అ. న. శఠత్వము, కపటము: చూ, సూక్ష్మము. 2.

శాడ్వలము. సం. విణ: చూ, రూ_శాద్వలము.

శాణతనము. వా. మి. వి: చూ, సమర్థనము (జాణతనము అని కొందఱు).

శాణము. సం. వి. అ. పుం. 1. రూ_శాణి, శానము.=సాన. ఒఱగల్లు: చూ, సాన. 1.2–3.

శాణి. సం. వి. ఇ. పుం =సాన: చూ, రూ_శాణము. 1. (చూ, రత్నములు.)

శాణికుఁడు. సం. వి. అ. పుం: చూ, సానలవాఁడు.

శాణితము. సం. విణ. సానపెట్టఁబడినది: చూ, శాతము. 2

శాతకుంభము. సం. వి. అ. న. 1. బంగారు: చూ, లోహము. 1; 2. ఉమ్మెత్త.*: చూ, హాలాపుష్పము. [(అంగము. 9)

శాతనీపరాటి. అం: చూ, పరాట్యుపాంగములు.

శాతము. సం. వి. అ. న. 1. రూ_సాతము. సుఖము: చూ, సంతోషము; విణ. 2. వాఁడిచేయఁబడినది: ఉత్తేజితము, క్ష్ణుతము, క్ష్ణుతము, తేజితము, నిశితము, నిశాతము, శాణితము. (తె): వాఁడి; 3. కృశించినది: చూ, విశీర్ణము. 2. [వృక్షము.

శాతల. సం. వి అ. స్త్రీ. అంతిక అనుఓషధి.*: చూ,

శాతలము. సం. వి. అ. పుం.—పై.—

శాతాతపస్మృతి. అం: చూ, మూలస్మృతులు.

శాతుఁడు. సం. వి. అ. పుం. రూ_ఛ్యాతుఁడు_ఛాతుఁడు, అమాంసుఁడు, అర్భకుఁడు, కృశుఁడు, క్షైవాత్మకుఁడు, దుర్బలుఁడు. (తె):

అతగుఁడు, ఎముకలవట్టు, చిక్కినవాఁడు, వల్లికనరము, పేద, బక్క, బక్కవాఁడు, బడుగు-బడువు, బెండుమానిసి, వక్కికట్టియ-వక్కికట్టె. (చూ, బీదవాఁడు)

శాతోదరి. సం. వి. ఈ. స్త్రీ. 1. కృశించిన కడుపుగలయాఁడుది. (కడుపు కృశించియుండుట భాగ్యవతీలక్షణము): చూ, స్త్రీ; 2. ఆఁడుది: చూ, స్త్రీ.

శాత్రవము. సం. వి. అ. న 1. శత్రుత్వము; 2. శత్రుసమూహము. [చూ,శత్రువు.

శాత్రవుఁడు. సం. వి. అ. పుం. పగవాఁడు:

శాదఘ్నము. సం. వి. అ. పుం: అంగారవల్లి-అంగారవల్లిక, అవకీర్యకము, ఆమిషము, ఉదకీర్యము, కరంజకము-కరంజము, కాకభాండి, క్షుద్రరస, ఖలము, గుచ్ఛకరంజము, గుచ్ఛి, చిరిబిల్వము, ఛాయాప్రియము, ఛిత్తి, తమాలము, తిక్తగుంజ, ధృతమాలకము, నక్తమార (ల) ము, మంజరీపుష్పము, మహాకరంజము, మాతృనందనకము- మాతృవందనకము, లాజపుష్పము, విద్ధకర్కటి, సరఘ. (తె): కానుగు-క్రానుగు. తద్వి.— ౧: కంటఫల-కంటఫలము, మర్కటి, లతాకరంజము, వజ్రబీజకము, వీరాఖ్యము. (తె): తీఁగెకానుగు; ౨:షడ్గ్రంథము. (తె):గంట్లకానుగు; 3: అంగారమంజరి-అంగారమంజి, అంగారవల్లరి, కరతాళిక, కాకఘ్ని, కాకస్త్రీ, కుబేరాక్షి. (తె): నిప్పువన్నెగుత్తులకానుగు. ౪: వల్లికరజము. (తె): తోఁతివన్నెకానుగు·

శాదము. సం. వి. అ. పుం. 1. లేఁతపచ్చిక, శష్పము*: చూ, హరిత (తృణము. 1.); 2: కట్టరము, కిర్దమము-కర్దమము, కీర్తి, చికిలీలము, జంబాలము, జలకల్కము, జలేంద్రము, దమము, నిషద్వరము, పంకము, పద్ధతి, పలలము, పలితము. (తె): అడుసు, అవుఁజ
జోఁజో, అసలు, ఉబ్బలి-ఉమ్మలి, ఊ
ఒండు, కేజో, చేదుకు-చేవుకు-చాకు, జే
కు-జొకు, జోతుకు, దమ్ము, పంకి, బం
బందన, బాడి-బాడియ, బాడె, బుర
బెండడి, రొంపి, రొచ్చు-లొచ్చు, వం
డు-వండు, సుబ్బలి తద్వి.—౧: గొప్పబు
దకు.-ఘనజంబాలము, చులకము; ౨: నీ
తోనుండుబురదకు.-దిలాఢ్యము, పంకక
టము; 3: (తె) పుట్టు; ౪: వానబురదకు
(తె) కర్షమము, పంకము. (తె) రొంపి,
తాడు; ౫: తూములనుండిపాఱెడి ము
బ ం ద కు.— (తె) రొచ్చు-లొచ్చు
౬:ఎండినబురదకు.(తె)-వండ-వండలి-వండ

శాద్వలము. సం. విశే. 1.లేఁతపచ్చికకలదేశ
వల్లరము. (తె): కడిమిడి: చూ, దేశము

శానము. సం. వి. అ. పుం. స్వర్ణచ్ఛేదనసాధ
విశేషము: చూ, సాన-శాణము.

శానీనబ్రాహ్మణులు. అం: చూ, ఉత్కళబ్రా
హ్మణులు. (ఉత్కళులలో నొకతెగవా
శుక్లయజుర్వేదులై మాధ్యందినశాఖకుఁజెం
నవారును, కృష్ణయజుర్వేదులై ఆపస్తంబస
త్రము కలవారునై యున్నారు): చూ
బ్రాహ్మణులు.

శాపము. సం. వి. అ. పుం. 1: అకరణి, అవ
రము, అభియోగము, అభిషంగము-అభిష
గము-అభీషంగము, అవాచ్యము, ఆక్రో
నము-ఆక్రోశము, ఆక్షేపము, ఇంద్రకో
ము, క్షారణము, గాలనము, గాలి,చోద్యవ
పరిగ్రహము,లంభనము.(అన్య):కజ్.(తె)
సరు-కసురు, జోకు, తిట్టాట, తిట్టు, బం
టు-బండాటము, బండు ,బడవ-బడవా,
స, బూతు, బూతుమాట, లంబిడి-లంబ్డి
మిడి-లమ్డి, విశంగీలు. తద్వి.—౧:ఆక్షార

ఇ: (తె) బండబూతు; 2. ఒట్టు: చూ, శపథము.

శాపించే. సం. స. క్రి.=సాపించే_సెపియించే, తిట్టు: చూ, రూ_శపించే.

శాబకము. సం. వి. అ. పుం. రూ-శాబము. పిల్ల, కూన: చూ, శిశువు.

శాబకుఁడు. సం. వి. అ. పుం: చూ, శిశువు.

శాబము. సం. వి. అ. పుం: చూ, రూ-శాబకము.

శాబరము. సం. వి. అ. పుం. 1. రూ-సాబరము. లొద్దుగ*: చూ, హేమపుష్పకము (లొద్దుగు.); 2. శివకృత తంత్రవిశేషము: చూ, తంత్రయులు); విశ. 3. శబరసంబంధమైనది.

శాబాను. వా. వి: చూ, రూ-సెబాను.

శాబ్దము. సం. విశ. 1. శబ్దసంబంధమైనది; అం. 2: చూ, తార్కికప్రమాణములు; 3: చూ, ప్రత్యక్షాది ప్రమాణములు. [తెలిసినవాఁడు.

శాబ్దికుఁడు. సం. వి. అ. పుం. శబ్దశాస్త్రము శాబ్దిలక్ష్యశరాభ్యాసవిలాసము. అం: చూ, ప్రమేయములు.

శామనము. సం. వి. అ. న. 1: చూ, శాంతి. 2; 2. వధము: చూ, హింస. 1. [సస్యము. 1.

శామాకము. సం. వి. అ. పుం.=చోమలు: చూ,

శామిత్రము. సం. వి. అ. న. 1. జేన్నము: చూ, హోమము. 3 (యజ్ఞము); 2. పశుబంధనము; 3 యజ్ఞపాత్రము: చూ, హరివాణము (పాత్రము. 6-రశి.) [మిడి*: చూ, ప్రస. 1.

శార. సం. వి. ఆ. స్త్రీ.=చోటు. రేఖ, జీడిమా

శారంగము. సం. వి. అ. పుం: చూ, వానకోయిల.

శారద. సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, సరస్వతి; 2. గౌరి: చూ, హైమవతి (పార్వతి.)

శారదగాఁడు. మి. వి: చూ, హాస్యగాఁడు.

శారదము. సం. వి. అ పుం. 1 పచ్చేపెసర*: చూ, స్తంబకరి (పెసర. 14.); పుం. 2. ఏఁడాది: చూ, సంవత్సరము; 3. ఏఁడాకులరఁటి: చూ, సువర్ణకదళి (రంభ. 1. ర); విశ. 4. శరత్కాలమందుఁబుట్టినది; 5 క్రొత్తది: చూ, హాస; 6. ప్రతిభ లేనిది: చూ, నిష్కా. 2.

శారది. సం. వి. ఈ. స్త్రీ. 1. ఏఁడాకులరఁటి*: చూ, శారదము. 3; 2. నీరుపిప్పలి*: చూ, శొండి.

శారభటము. సం. వి. అ. పుం. దివసముయొక్క నాలుగవభాగము: చూ, దినభాగములు (చూ, వాసరము.)

శారము. సం. వి. అ. పుం. 1. చిత్రవర్ణము: చూ, హారితము. 1 (వర్ణము. 6-ర.); 2. జూదపుసారె: చూ, వ్యవహారము. 4_ఒ; 3. గాలి: చూ, వాయువు; విశ. 4. చిత్రవర్ణము కలది: చూ, హారితము. 1. (వర్ణము. 6-ర.)

శారి. సం. వి. ఇ. స్త్రీ. 1.=సారియ. గోరువంక పిట్ట: చూ, శారిక. 1; 2. యుద్ధార్థము ఏనుఁగుమీఁదఁబఱచిన పల్లము: చూ, హస్తి; 3. వ్యవహారవిశేషము; పుం. 4.=సారె. జూదపుసారె. సొగటాలకాయ: చూ, వ్యవహారము. 4.

శారిక. సం. వి. ఆ. స్త్రీ. 1.=సారియ-సారె: రూ-శారి, ఉత్క్రోశము, కలహప్రియ, కాహాలప్రియ, కురరము, గోకిరటి-గోకిరాటి, గోకిరాటిక, గోరంకువు, గోరాండిక, గోరాటక-గోరాటి, గారిక-గారీక, చిత్రనేత్ర, చిత్రపాద, చిత్రలోచన, చిత్రాక్షి, వచ. (తె): గొరంకి_గొరక-గొరవంక-గొరవక-గొరువంక-గోర_గోరంక_గోరంకి_గోరఁకి-గోరవంక-గోరింక-గోరువంక-గోర్వంక, బట్టికాఁడు, సారియ-సారె. తద్వి.—ఐ: కాదంబరి. (తె): అఁడుగోరింక (చూ, పక్షి); ఇ: కుణప్తి, విట్సారిక. (తె): పీతిగో

లిపంక; 2. నఖక్షతము: చూ, స్ఫుటక; 3. వీణ లోనగువాని వాయించెడుకోడుపు, నఖము, కోడుపు: చూ, కలాక.

శారిఫలము. సం. వి. అ. పుం, న. జూదమాడెడుపీట: అష్టాపదము. (తె) చదరంగపుపలక, నెత్తపుపలక–నెత్తపలక, పలక, పాళి, పాళియ-పాళీ-పాళె. (చూ, వ్యవహారము. 4–౯).

శారిబ. సం. వి. అ. స్త్రీ: అనంత, ఉత్పల, ఉత్పలశారిబ, కన్యాగోపి, కరాళత్రిపుట, కాలానుసారి, కాష్ఠ, కాష్ఠగోష్ఠ, కృష్ణవల్లి–కృష్ణవల్లిక, గోపవధువు, గోపి, చందన, శతానిక-ప్రతానిక, ఫణిజిహ్వక, బస్తాంద్రి, వధువు, శారద, శ్యామ-శ్యామము. (తె): గూడపాల, దూడపాల, మామెన. తద్వి.— ౧: సుగంధ-సుగంధి, గోపవల్లి, మూలభద్ర. (తె): సుగందిపాల; ౨: ఉత్పలశారిబ, కాష్ఠశారిబ, గంధమూల, గోపి, సుగంధిమూల. (తె): తెల్లసుగందిపాల, మావలి; 3: కృష్ణ, కృష్ణమూలి. (తె): నల్లసుగందిపాల; ర:(తె) అడవిమామెన*.

శారీరము. సం. వి. అ. పుం. 1. కంఠస్వరము: చూ, స్వరము. 2; విణ. 2. శరీరసంబంధమైనది: శారీరకము, కాయికము.

శారీరి. అం: చూ, ష-రి-హీనతానములు (తానములు) (చూ, సర్వతానములు)

శారీరికము. సం. విణ. శరీరసంబంధమైనది: చూ, శారీరము. 2.

శార్కరము. సం. వి. అ. పుం. 1. పాలనురుగు: నురగ–నురుగు, ఖడ్గికము: చూ, స్తన్యము; విణ. 2. మొరముగలది (నేల): చూ, హరిప్రియ. 2 (భూమి. 1–౯౨.)

శార్ఙ్గదేవప్రోక్త సంగీతరత్నాకరము. అం: చూ, భరతశాస్త్రగ్రంథములు.

శార్ఙ్గదేవుఁడు. అం: చూ, శాస్త్రప్రవర్తకులు.

శార్ఙ్గము. సం. వి. అ. న.=సింగిణి. 1. విష్ణువుయొక్క విల్లు: చూ, హేతి. 4; విష్ణుపంచాయుధములు (బాణము 1–౭౮.); 2. విల్లు: చూ, హేతి. 4 (బాణము. 1–3౭.); విణ. 3. శృంగసంబంధమైనది.

శార్ఙ్గి. సం. వి. న్. పుం. శార్ఙ్గమను ధనుస్సుకలవాఁడు, విష్ణుఁడు: చూ, విష్ణువు. 1.

శార్దూలము. సం. వి. అ. పుం. పులి: కర్బురము, కర్వరము, గుహాశయము, ఘోరదర్శనము, చండకము, తరస్వి, ద్వీపి, పంచనఖము, పుండరీకము, పృదాకువు, భయానకము, వ్యాఘ్రము, వ్యాడము-వ్యాళము, శ్వాపదము. (తె): కోల్పులి, చౌఁజలమెకము, తెఱవుగాఁచరి, దువ్వి-దువ్వు, పసితిండి, పులి, పెద్దపులి, బల్‌చౌఁజలిమెకము, బెబ్బులి, మువ్వగలవన్నెమెకము, మువ్వన్నెమెకము, మెకములతిండి, వాలము-వాలాము, వేగి. తద్వి.—౧. ఆఁడుపులికి:-కర్బురి; ౨. పులిపిల్లకు:-అర్వాము; 3: అల్పశార్దూలము, చిత్రకము, చిత్రకాయము, చులుకము, ద్వీపి, పృదాకువు. (తె): చిఱుత, చిఱుతగండు, చిఱుతపులి–చిఱుపులి, దువ్వి-దువ్వు; ర: అకుచిఱుత; 2. ఏటిప్రింత: చూ, వ్యాఘ్రాటము; అం. 3. శార్దూలవిక్రీడితము: చూ, వృత్తము. 1. ("మ, స, జ, స, త, త, గ. 13 యతి. 21 ఛందస్సు.")

శార్దూలవాహనుఁడు. సం. వి. అ. పుం. పూర్వజైనవిశేషము: చూ, బుద్ధుఁడు.

శార్దూలవిక్రీడితము. అం: చూ, వృత్తము. 1. (చూ, శార్దూలము. 3.)

శార్దూలుఁడు. సం. వి. అ. పుం. 1. ఒకఅసురుఁడు: చూ, సురారి (రాక్షసుఁడు. 1.);

2. (ఉత్తరపదమైన-నో) శ్రేష్ఠుఁడు: చూ, శ్రేష్ఠుఁడు.
శార్వరము. సం. వి. అ. న. 1. కటికచీఁకటి: చూ, శ్యామిక. 1; విణ. 2. చంపునది:చూ, హింస్రి. [న్.పుం. 2:చూ, సంవత్సరములు
శార్వరి. సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, రాత్రి;
శాల. సం. వి. అ. స్త్రీ.=సాల. 1. ఇల్లు: చూ, సదనము. 1; 2. చావడి: చూ, సదనము. 1; తద్వి.-౧. ఇంటిలోనిభాగము: చూ, సదనము. 1; ౨. పసువులసాల: చూ, సదనము. 1; 3. పెనుఁగొమ్మ: చూ, శాఖ. 1-౧; 4. ఒకచెట్టు: (తె) పేరుటురము, పేరెడ*: చూ, వృక్షము.
శాలంకాయనుఁడు. సం. వి. అ. పుం. నందికేశ్వరుఁడు, తాండవతాలికుఁడు.
శాలపర్ణి. సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-సాలపర్ణి *. [చూ, రూ-సాలభంజిక.
శాలభంజిక. సం. వి. అ. స్త్రీ. కొయ్యబొమ్మ:
శాలము. సం. వి. అ. పుం. వేగముగాఁబోయెడుచేప: చూ, మత్స్యము. 1.
శాలవము. సం. వి. అ. పుం. లొద్దుగ*: చూ, హేమపుష్పకము. (లొద్దుగు.)
శాలామృగము. సం.వి.అ.పుం 1. కుక్క: చూ, శునకము; 2. నక్క: చూ, సృగాలము.
శాలావృకము. సం. వి. అ. పుం: చూ, రూ-సాలావృకము.
శాలి. సం. అవ.న్, 1. ఒకప్రత్యయము. "బుద్ధిశాలి, ధీశాలి" మొ; వి. ఇ. పుం. 2. వరి. శాలియనుసస్యము: చూ, సస్యము. 1; 3. గంధమార్జాలము: చూ, సూచకము. 5 (మార్జాలము.); విణ, 4: చూ, హృద్యము
శాలికుఁడు. సం. వి. అ. పుం. 1.=సాలె-సాలీఁడు; చూ, సాలెవాఁడు; 2: చూ, సుంకరి.
శాలిని. అం: చూ, వృత్తము. 1. ("మ, త, త, గగములు. 7 యతి. 11 ఛందస్సు")
శాలివాహనరాజు. సం. వి. న్. పుం. కుమారపాలుఁడు: చూ, రాజో. ౮౦.
శాలివాహనశకము. అం: చూ, శకములు. [ము.
శాలిహోత్రము.సం.వి.అ.పుం.గుఱ్ఱము:చూ,హయ
శాలిహోత్రుఁడు. సం. వి. అ. పుం. ఒకసిద్ధుఁడు: చూ, సిద్ధుఁడు. [చూ, వ్రీశె.
శాలీనుఁడు. సం. విణ. దిట్టతనములేనివాఁడు:
శాలువు. వా. వి: చూ, రూ-సాలువు.
శాలూకము. సం. వి. అ. న. 1. తామరమొదలగువానిదుంప: చూ, సహస్రపత్రము; 2: జాజీఫలము, జాతిఫలము, జాతికోశము. (తె) జాజికాయ.
శాలూరము. సం. వి. అ. పుం. రూ-సాలూరము, కప్ప: చూ, హరి. 11.
శాలేయము. సం. వి. అ. పుం. 1: చూ, సదాప*; 2. అడవిసదాప*: చూ, సదాప; విణ. 3. (రాజనములు పండునది) పొలము: చూ, హరిప్రియ. 2 (భూమి. 1.)
శాల్మలి. సం. వి. ఇ. పుం, స్త్రీ. రూ-శల్మలి. 1: కంటకాసి, కంటకి, కంటద్రుమము, కదళి, కర్కశ, కుకూటి-కుక్కుటి, చిరజీవి, చిరాయువు, తూలఫల, దీర్ఘాయువు, దురారోహ,పిచులము,పిచ్ఛిల,పుష్పరమ్యత్వక్క, పూరణి, మాతులద్రుమము, మోచ, రక్తపుష్పిక, వయస్థ, శారద. (తె): బూరుగ-బూరుగు-బూరువు *. తద్వి.-౧: కాశాల్మలి, కుశాల్మలి, హంసమోచ. (తె): పిన్నబూరుగు; ౨: (తె) కుక్కబూరుగు; 3:కూటశాల్మలి, రోచనము. (తె): కొండబూరుగు, వారిజేము. *; 2: చూ, ద్వీపములు. (ఇందులనదులకు: చూ, నది (౨) ౨); 3: చూ, హరివాహనుఁడు; 4: చూ,నరకములు.
శాల్మలిఫలాటువు. సం. విణ. (ఉ): కర్కటము. (తె): బూరుగుకాయ.

శాల్మలీవేష్టము. సం. వి. అ. పుం: అజమోద, నిర్యాసము, పిచ్ఛ, మోచారసము. (తె): బూరుగుబంక. [(శాశితుఁడు అనియు)

శాశిత. సం. వి. ఋ. పుం: చూ, శాస్త. 3

శాశ్వతము. సం. విణ: అక్షయము, అక్షీణము, అప్రతిహతము, ధ్రువము, నిత్యము, సదాతనము, సనాతనము స్థాణువు, స్థిరము (తె) నిజము, నిలుపు, నిలువరము-నిలువారము-నిలవరము-నిల్వరము, నెప్పు, పొలుపు, వెక్కలము-మెగ్గలము, సతము. తద్వి.—౧: ప్రతిష్ఠితము; ౨: అనశ్వరము, అవశ్యము, ఆద్యంతరహితము, నిత్యము, శాశ్వతము; ౩: క, క్షతము, జమ్, ధ, దురత్యయము, నిజము, నియతము, నిరత్యయము, శుచి; ర. నిలుకడైనది:- చూ, స్థిరము. 4.

శాశ్వతుఁడు. సం. వి. అ. పుం: అక్షరుఁడు, సదాతనుఁడు, సనాతనుఁడు, స్థిరుఁడు. (తె): చెడనివాఁడు. (చూ, స్థిరుఁడు ")

శాష్కులుఁడు. సం. విణ: చూ, టీ-శౌష్కులుఁడు.

శాష్కులికము. సం. వి. అ. న. చేక్కులముల సమూహము: చూ, సమూహము (భక్ష్యము).

శాష్కులికుఁడు. సం. విణ: ఆమిషాశి, మాంసాశనుఁడు, మాంసాహారి. (తె): కాచేమేపరి, పొలసుదిండి. తద్వి.— శాష్కులుఁడు-శౌష్కులుఁడు.

శాసకుఁడు. సం. విణ. శాసించువాఁడు: శాస్త.

శాసనము. సం. వి. అ. న. 1. రాజు తానుదానము చేసిన భూమికై వ్రాసియిచ్చిన కవులు, భూదానధర్మశాసనపుపట్టా (అనికొందఱు), రాజశాసనము, శిలాశాసనము (అనిమఱికొందఱు); 2. ఆజ్ఞ: చూ, సెలవు; 3. శిక్షించుట: చూ, శిక్ష. 2; 4. ఆక్ట్సు, చట్టము, లా; చూ, శాస్త్రములు; వా. 5: ఫర్మానా-ఫర్వానా; వా. 6. ఉల్లు, వియ్యులు, వీలు. "మరణశాసనము"; 7. ఏర్పాటు: చూ, సత్యము. 1.

శాసించు. సం. స క్రి. 1. ఆజ్ఞాపించు, విధించు: చూ, సెలవిచ్చు; 2: చూ, శిక్షించు; 3. తిట్టు: చూ, శపించు.

శాస్త. సం. వి. ఋ పుం. 1: చూ, బుద్ధుఁడు. 1; విణ. 2. శాసించువాఁడు: శాసకుఁడు; 3: శిక్షకుఁడు, అన్వవసాయవంతుఁడు, దేశకుఁడు, శాసిత, శాసితుఁడు, సంసక్తుఁడు.

శాస్తి. సం. వి. ఇ. స్త్రీ 1. శాసనము: చూ, శిక్ష. 2; 2: చూ, శాస్త్రము. 1. [సన్యాసి.

శాస్త్రకృత్తు. సం. వి. త్. పుం. ఋషి: చూ,

శాస్త్రప్రవర్తకులు. అం: శివుఁడు, పార్వతి, బ్రహ్మ, విష్ణువు, నందీశ్వరుఁడు, దత్తిలుఁడు, కోహలుఁడు, యాజ్ఞవల్క్యుఁడు, నారదుఁడు, హనుమంతుఁడు, వినాయకుఁడు, కుమారుఁడు, బృహస్పతి, అర్జునుఁడు, రావణుఁడు, బాణాసురుఁడు, ఉషాకన్య, ఉత్తర, వశిష్ఠుఁడు, భారద్వాజుఁడు, చ్యవనుఁడు, శాండిల్యుఁడు, శుక్రుఁడు, గౌతముఁడు, శార్ఙ్గదేవుఁడు, సోమేశ్వరుఁడు, అభినవగుప్తుఁడు మొదలగువారు.

శాస్త్రము. సం. వి. అ. న=చట్టము. (దీనిచేత శిక్షింపఁబడును.) 1. నియమన గ్రంథము: కల్పము, కార్మ్మికము, కోశము, తీర్థము, దర్శనము. దృష్టాంతము, పురుషము, ప్రస్థానము, మతము, శమ్, శాసనము, శాస్తి, శ్రుతము, సంహిత. తద్వి.— ౧: (చూ, శాసనము. 8.); ౨: (చూ, శాస్త్రములు.) ౩: (చూ, శాసనము. 4); 2. ఆజ్ఞ: చూ, సెలవు; విణ. 3. శస్త్రమువలనఁగలిగినది; అం. 4: చూ, వాసనలు.

శాస్త్రములు. అం. 1: (షట్ శాస్త్రములు:- శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము. (తర్కము, వ్యాకరణము, ధర్మము, మీమాంస, వైద్యము, జ్యోతిషము

అని మతియొకక్రమము); 2: చూ, విద్యలు. 3: చూ, ఉపవిద్యలు; 4: చూ, వాఙ్మయము; 5: చూ, వేదము; (౧. శిక్ష=దండనము; ౨. వ్యాకరణము=తంత్రము, లక్షణము, వ్యాకరణము. (తె): లక్కణము-లచ్చనము.) (తద్విశేషములు.-౧ కకుప్పు; ౨ పరిమాణము; 3 సాముద్రికము; ౪ హోర; ౫ వాస్తు; ౬ మల్ల; ౭ సూత; ౮ వైద్య; ౯ శకున; ౧౦ స్వర (శారీర); ౧౧ శకునశాస్త్రాదులు ఉపవిద్యలు అను శబ్దమునందుఁ జూడఁవలయును.); (చూ, శాస్త్రము. 1.)

శాస్త్రలక్షణములు. అం: స్వరము, వర్ణము, పదము, ధాతుకృత్తులు, తద్ధితములు, కృత్ప్రత్యయములు, తద్ధితము, కారకము, సమాసము. (10)

శాస్త్రవిదుఁడు. సం. విణ. (ద్). శాస్త్రము తెలిసినవాఁడు: అంతర్వాణి, ప్రామాణికుఁడు. శాస్త్రి.— తద్వి.—జైనశాస్త్రజ్ఞానము వారికుఁడు.(చూ, సమస్థుఁడు.)[ఉపదేశకులు.

శాస్త్రాభ్యాసము చేయించినవారు. అం: చూ,

శాస్త్రి. సం. వి. న్. పుం: చూ, శాస్త్రవిదుఁడు.

శాస్త్రీయము. సం. విణ. శాస్త్రసంబంధమైనది.

శాస్యము. సం. విణ. శాసింపఁదగినది.

## శి

శింఘాణము. సం. వి. అ. న. రూ-సింహాణము. 1. ఇనుపచిట్టెము: చూ, లోహము. 1-౧౫. తద్వి.—మండూరము; 2. రూ-సింఘాణము-సింహాణము. (తె):-చీమిడి, చీఁదు; 3. కాచపాత్రము, అవిలి: చూ, హరివాణము (పాత్రము. ౮-౫.)

శింజ. సం. వి. ఆ. స్త్రీ. 1. వింటినారిమ్రోఁత: చూ, స్వరము. 2; 2. అందెలమ్రోఁత: చూ, స్వరము. 2.

శింజానము. సం. విణ. శింజయనుధ్వనిగలది.

శింజితము. సం. వి. అ. న. భూషణములమ్రోఁత: చూ, స్వరము. 2.

శింజిని. సం. వి. ఈ. స్త్రీ. 1. వింటినారి: చూ, స్థావరము. 1; 2. కాలియందె: చూ, భూషణము. 2.

శింబ. సం. వి. ఆ. స్త్రీ. పెసలులోనగువానిపైపొట్టు: రూ-శింబి-సింబ-సింబి, శమి, డాకిని, డుండువు. (తె) కాయ, పొట్టు, బుస్సి. బూగర. తద్వి.—౧: పెసరపొట్టు; ౨: కందిపొట్టు; 3: సెనగపొట్టు. మొ. (చూ, బరడు. 1.) (చూ, పెసర.) [సమ్మెట.

శింబలి. సం. వి. ఈ. స్త్రీ.=సంబెళ: చూ,

శింబి. సం. వి. ఈ. స్త్రీ. 1.=చెమ్మ. (తె) చెమ్మ, తంబ- తమ్మ*. తద్వి.—వల్మీకశింబి. (తె): పుట్టచెమ్మ, పుట్టతమ్మ.*; 2: చూ, రూ-శింబ. [పెసర*.

శింబికము. సం. వి. అ. పుం. నల్లపెసలు: చూ,

శింశప. సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ-శింశుప*.

శింశుప. సం. వి. ఆ. స్త్రీ: రూ-శింశప, అగరువు-(అగురువు), కాముకము, కాలానుసార్యము, కృష్ణశార-కృష్ణశారము- కృష్ణసారకము, కృష్ణసారము, గురునాభము, జొంగకము, తీక్ష్ణసారము, నటము, పిచ్ఛిల, పరిసారణి, బింబచ్ఛద, భస్మగర్భ, మండలచ్ఛదము, మహాశ్యామము. (తె):-ఇరుగుడు-ఇరువుడు, నల్లదిరిసెనము (అనికొందఱు) *. తద్వి.—౧: కృష్ణశింశుప, నీపము, వీరవృక్షము. (తె): నల్లయిరుగుడు; ౨: కపిశింశప-కపిశింశుప, కపిల, భస్మగర్భ. (తె): కంపిఱుగుడు-కంపుటిరుగుడు; 3: కపిలశింశుప, కపిలాక్షి, కుశింశప-కుశింశుప, సారిణి- (తె) పచ్చయిరుగుడు; ౪: శ్వేతపత్రము-

(తె) తెల్లయిరుగుడు.* (ఇరుగుడు-రూ-ఇబు
గుడు)

శింశుమారము. సం. వి. అ. పుం. రూ-శిశుమా
రము. 1. మొసలి: చూ, మత్స్యము. 1-3;
2. నీరుకోఁతి: చూ, వానరము; 3. నీరు
దిమ్మరి: చూ, మత్స్యము. 1-౧౦.

శిక్కుఁడు. సం. వి. అ. పుం: అవ్యవసాయవం
తుఁడు, శా స్త్ర.

శిక్యము. సం. వి. అ. న.=చిక్కము. 1. కావ
డియుట్టి (తె): ఉట్టి, చిక్కము; 2. కావ
డిమట్టు: కాచము. (తె): ఉట్టి, కావడిమ
ట్టు. తద్వి.—త్ర్యింగటము; 2.=చిక్కము.
ఒకరకముకావడియుట్టి: (తె) ఉట్టి, చిక్క
ము; 3. ఏనుఁగుచేను మొనలఁబుట్టెడిమదము:
చూ, గజమదములు. [కాచితము.

శిక్యితము. సం. విశే. ఉట్టియందుంచేఁబడినది:

శిక్ష. సం. వి. ఆ. స్త్రీ. (చూ, షండగము
లు, చూ, అంగము. 9: చూ, వేదాంగము
లు: చూ, ఉపవిద్యలు, చూ, వాఙ్మయము).
1. దోషనివృత్తికిశిక్ష:- పాచనము, ప్రాయ
శ్చిత్తము.(తె): పాచితము-ప్రాచితము; 2.
శిక్షించుట: అపచితి, క్రియ, దండనము,దం
డము, దమథము, నిష్కృతి, పాచనము,
ప్రాయశ్చిత్తము. (తె) దిద్దుగడ, దిద్దుడు,
దిద్దుపాటు, దిద్దుబడి, పాచితము-ప్రాచిత
ము. తద్వి.—౧: ఉపగ్రహము, కరమరి,
బంది. (చూ, బంది); ౨: (తె) వగకము;
3. విద్యాభ్యాసము; అం. 4: చూ, మహా
విద్యలు; బ. 5: చూ, శిక్షలు.

శిక్షలు. అం. "అంగోపాంగోప వేదములు పదునా
లుగును వేదమునకుపకరించెడిరీతి.— శిక్ష వే
దముయొక్క అకారము మొదలుకొని హకా
రముదనుక నున్న 50 అక్షరములయొక్క ప
లికెడిరీతిని స్వర, కాల, స్థాన, ప్రయత్న
అను ప్రధానముల నైదుప్రకారములచేత
నేర్పాటుగా నేర్పడినగ్రంథము. అవి
9ప్రధానశిక్షలు, 9 ఉపశిక్షలు మహర్షులచేఁ
జేయఁబడియుండె.శంభు-పాణినీయ-వ్యాస-
భారద్వాజ-సర్వసమ్మతశిక్షఅని. ఈలాగున
నేవీనికి భాష్యములుకలవు. (చూ, వేదాంగ
ములు.) (పాణినీయశిక్షయను పేరఁబ్రసిద్ధమై
న శిక్షాగ్రంథమే వేదాంతశిక్ష. ఇది సర్వవే
దసంబంధమైనది ) పాణిని-వ్యాస-భరద్వా
జ-వ్యాళి-వ్యాళి-వాల్మీకి-కౌహల-కాలనిర్ణ
య-బోధాయన-సర్వసమ్మతి-సిద్ధాంత-ఆర
ణ్య-హారితనామకములైన 13 శిక్షలు నెల్ల
వేదములకు సంబంధించినవి; శమానశిక్ష ఋ
క్శాఖాసంబంధము; నారద-గౌతమ-లోమ
శశిక్షలు 3 ను సామశాఖాసంబంధములు;
అపిశలి-శంభు-స్వర-ఆత్రేయశిక్షలు 4 ను
కృష్ణయజుశ్శాఖకుసంబంధములు; యాజ్ఞవ
ల్క్య- వశిష్ఠ- కాత్యాయన- పరాశర-
మాండక్య-అమోఘనందినీ- లఘ్వమోఘనం
దినీ-అమరేశమాధ్యందినీ-లఘుమాధ్యందినీ-
కేశవ-కేశవకారికా-మల్లశర్మ-స్వరభక్తి-
స్వరాష్టక-షోడశశ్లోకీ- అవసాననిర్ణయ-
క్రమసంధాన-గళదృక్- మనస్స్వార-ప్రా
తిశాఖ్య-ప్రదీప-వేదసూత్రపరిభాషా- వేద
పరిభాషాకారికా-యజుర్విధాన- క్రమకారి
కాశిక్ష 25ను మఱిరెండును శుక్లయజుశ్శా
ఖాసంబంధములు. శిక్షలమొత్తము48శ్లోకశిక్ష-
కపిల-కాలాది శిక్షలుకలవట." (చూ, ఉప
విద్యలు.)

శిక్షాకాలములు. అం: ఉపదేశకాలము, నిద్ర,
స్ఖలితము, దుష్టచేష్ట, బడబాలోకనౌత్సుక్య
ము, వితతహోషితము, సంతాపనము, దురు
ద్ధానము, విమార్గగమనము, భయము, శిక్షా
త్యాగము, చిత్తచాంచల్యకాలము (12).

శిక్షాత్యాగము. అం: చూ, శిక్షాకాలములు.

శిక్షించు. సం. స. క్రి: శాసించు (తె) దండించు, దిద్దు, మందలించు.

శిక్షితాక్షరుఁడు. సం. వి. అ. పుం: అక్షరముఖుఁడు, కాలాక్షరికుఁడు, కావ్యకర్త.

శిక్షితుఁడు. సం. విశే. 1. శిక్షింపఁబడినవాఁడు: ఆమ్నాతుఁడు, శాసితుఁడు, దండితుఁడు, వినీతుఁడు. తద్వి.—౧. దండించువానికి:- దండుఁడు; ౨. దండింపఁదగినవానికి:—దండ్యుఁడు; 2. నేర్పరి: చూ, సమర్థుఁడు.

శిఖ. సం. వి. ఆ. స్త్రీ. 1 =సిగ. జొట్టుముడి: చూ, సిగ. 3; తద్వి.—జొట్టునకు.— శిఖ (చూ, సిగ. 3); 2. నెమలిసిగ: చూ, సిక. 1; 3. జ్వాల: చూ, హుతాశనుఁడు (వహ్ని 1-౨౬); 4. కొన: చూ, సుద; 5. ఊడ: చూ, శిఫ. 1; 6. కొమ్మ: చూ, శాఖ. 1; 7. తతిగొట్టి*: చూ, హాలిని; 8. కిరణము: చూ, హాయనము. 2; 9. కాకపక్షము, పిల్లజొట్టు: చూ, సిగ. 3; 10. సిగబంతి: చూ, భూషణము. 2.

శిఖండకము. సం. వి. అ. పుం. 1. పిల్లజొట్టు: చూ, సిగ. 3; 2: చూ, రూ-శిఖండము.

శిఖండము. సం. వి. అ. పుం: రూ-శిఖండకము, శిఖండి, కలాపము, పింఛము, పిచ్ఛము, బర్హము. (తె):— పించియము-పించెము-పీఁచేము, పెంచేము, పురి.

శిఖండి. సం. వి. ఆ. స్త్రీ. 1. అడవిమొల్ల*: చూ, హారిణి. 5; న్. పుం. 2. ధృష్టద్యుమ్ని నియన్న; 3. నెమలి: చూ, శిఖి. 2; 4. నెమలిపురి: చూ, శిఖండము; 5. కోడి: చూ, సెలుకాలుది (పుంజో.); 6. అమ్ము: చూ, హేతి. 4 (బాణము. 1.)

శిఖండిని. సం. వి. ఈ. స్త్రీ. తెల్లగురిజె*: చూ, శ్వేతపాకి.

శిఖధరుఁడు. సం. వి. అ. పుం. పూర్వజైనవిశేషము: చూ, బుద్ధుఁడు.

శిఖరము. సం. వి. అ. పుం, న. 1.=సిగరము. కొండకొన: ఐ, ఐక్యము, కంకణము, కూటము, కూలము, జిష్ణువు, శృంగము, శేఖరము. (తె): కొండకొన, కొండకొమ్మ, కొండసిక, కొపురు, కొప్పరము-కొపళ్ము, కొమ్మ, పేటు, మోరు, సిగరము. తద్వి.— ౧: కపిశృంగము, ౨: ప్రాగ్భారము. (చూ, సుద); 2.=చివర. చెట్టుకొన: చూ, సుద; 3.=చివర. మంచేపుకోడుకొన: చూ, సుద; 4.=చివర. కొన: చూ, సుద; 5. కచ్చే (అని కొండలు) (చూ, వలి. ౧-౨-3-౪); 6. పండిన దానిమ్మవిత్తువంటి కెంపుతునుక; 7. శిలావిశేషము: చూ, స్థూలోచ్ఛ్రయము (రత్నములు); 8. అభినయ హస్తవిశేషము: చూ, వ్యంజకము. 1; అం. 9: చూ, అసంయుత హస్తములు. [పార్వతి. 1

శిఖరవాసిని. సం. వి. ఈ. స్త్రీ. గౌరి: చూ,

శిఖరాస్త్రము. అం: చూ, అస్త్రములు.

శిఖరి. సం. వి. న్. పుం. 1. కొండ: చూ, పర్వతము; 2. చెట్టు: చూ, వృక్షము; 3. ఉత్తరేను*: చూ, శైఖరికము; 4: చూ, మొక్క-ము. *. [వికీరణము. 2.

శిఖరికము. సం. వి. అ. పుం. జిల్లేడు*: చూ.

శిఖరిణి. సం. వి. ఈ. స్త్రీ. 1.=సిగరి. చేల్లత్రలుసు: చూ, సిగర; 2: చూ, వృత్తము. 1. ("య, మ, న, స, భ, వగణములు. 13 యతి. 17 ఛందస్సు."); 3. ఉత్తమస్త్రీ: చూ, స్త్రీ; 4: రోమరాజి, రోమావళి, కాలిక. (తె): ఆరు-ఆలు, నూఁగారు-నూఁగాలు; 5. మల్లె*: చూ, హసంతి. 2;

శిఖలు. అం: బ్రహ్మశిఖ. ఇంద్రశిఖ, యమశిఖ, వరుణశిఖ, కుబేరశిఖ (5) [చూ, సెమ్మె-

శిఖాతరువు. సం. వి. ఉ. పుం. దీపస్తంభము:

శిఖాఫలము. సం. వి. అ. పుం: చూ, సీకాయ.

శిఖావంతుఁడు. సం. వి. త్. పుం. అగ్ని: చూ, వహ్ని. 1

శిఖావళము. సం.వి.అ.పుం. నెమలి:చూ, శిఖి. 2.

శిఖి. సం. వి. న్. పుం. 1. అగ్ని:చూ, వహ్ని. 1; 2. నెమలి: అపస్వన్యము, అర్జునము, అహిద్విషము,అహిభుక్కు, క, కంబు, కలధ్వని, కలాపి, కాంతపక్షి, కాలకంఠము, కాలాపుఁడు, కుండలి, కుమారవాహిని, కృకవాకువు, కేకాలము, కేకావలము, కేకి, గంధవహము, గరవ్రతము-గలవ్రతము, చంద్రికి, చిత్రపక్షము, చిత్రపింగలము, చిత్రపింఛకము, చిత్రమేఖలము, నీలకంఠము, బర్హి, బర్హిణము, భుజంగభుక్కు, మధుకము, మయూరము, మేఘనాదానులాసి, లాసకము, విష్కిరము, వీరంధరము, శతపత్త్రము, శిఖావళము. (తె. వ):— కన్నులుగలపక్కి, కప్పుఁగుత్తుకపుల్గు, చిలువతిండి, జొట్టుఁబులుఁగు, నట్టుపులుఁగు-నట్టువపులుఁగు-నట్టువపిట్ట, నమిలి-నమ్మి-నెమ్మి-నెమలి-నెమిలి-నెమ్మిలి-నెవిలి, పాఁపమేపరి, పాఁపమేపుడు, పురిడిపిట్ట, పురిపులుఁగు, పురివిదర్పు పిట్ట, పురివిప్పియాడెడుపులుఁగు. తద్వి.—౧. ఆఁడునెమిలికి.—కేకి; ౨. తెలమయూరమునకు:—గురుంటకము, తెలమయూరము; ౩. నెమిళ్లగుంపునకు.—మాయూరము; 3. కోడి: చూ, నెలుకాలుది (పుంజో); 4. చెట్టు: చూ, వృక్షము; 5. కేతువు: చూ, రాహువు. 2; 6. అమ్ము:చూ, బాణము. 1; 7. ఎద్దు: చూ, వృషభము. 1; విశే. 8. సిగగలవాఁడు.

శిఖికర్పూరన్యాయముఅం:ఒకానొకన్యాయము.

శిఖిగ్రీవము. సం. వి. అ. న. మయిలుతుత్తము: చూ, రసాంజనము.

శిఖిధ్వజము. సం. వి. అ. న: చూ, పొగ.

శిఖిధ్వజుఁడు.సం.విశే. కేతువు:చూ, రాహువు.2.

శిఖిముఖి. సం. వి. న్. పుం. చెకుముకిరాయి: చూ, స్థాలోచ్చయము. 1 (రత్నములు. ౧౨-(౧).)

శిఖివాహనుఁడు. సం. వి. అ. పుం: చూ, [స్కందుఁడు.

శిగ్రుజము. సం. వి. అ. న. మునగవిత్తు.

శిగ్రుపుష్పాదిరసాయనము. అం: చూ, రసాయనములు.

శిగ్రువు.సం.వి.ఉ.పుం.1 మునగ*:అక్షీబము-అక్షీబము-ఆక్షీబము, అసారము, అపదంశక్షమము, కటుకందము, కాక్షీవకము, కాక్షీవము, కామిపీళము, కృష్ణగంధ, కృష్ణశిగ్రువు, క్షమాదంశము, గంధకము, ఘటచ్ఛదము, ఘనపల్లవము, ఘనపుష్పము, చక్షుష్యము, తీక్ష్ణగంధము, బహుళపల్లవము, మోచకము-మోచము, యువతి, శోభాంజనము. (తె): మునగ-మునుగ*. తద్వి.—౧ మునగకాయకు.—శాలకము; ౨. మునగవిత్తునకు.—గరాత్మకము, శ్వేతమరిచము; 3: ఉదది, శమి, గృంజనము, మురంగి, మూలకదళ, వనశిగ్రువు, సునాభము, హారితము. (తె): అడవిమునగ, కారుమునగ- కార్మునగ*; ౪: కృష్ణబీజము, కేసరి, గర్భపాతకము, గుగ్గులువు, గుడశిగ్రువు, మధుశిగ్రువు, రక్తశిగ్రువు, రక్తశోభాంజనము. (తె): ఎఱ్ఱమునగ, తీమునగ-తీయమునగ-తియ్యమునగ.*; 2. కూర: చూ, శాకము. 1.

శితద్రువు.సం.వి.ఉ.స్త్రీ:చూ, రూ-శతద్రువు.

శితము. సం. విశే. 1. వాఁడియైనది: కటువు, తీక్ష్ణము, ప్రచండము, రౌద్రము. (తె) చేఱుకు, వాలారు, వాలిక. తద్వి.—వాఁడిచేయఁబడినది అనుటకు (చూ, శాతము. 2.); 2. బక్కదైనది: చూ, విశీర్ణము. 2.

శితశూకము. సం. వి. అ. పుం. యవధాన్యము: చూ, ధాన్యము. ౩౫. [చూ, న్యూర్జకము.

శితసారకము. సం. వి. అ. పుం. తుమ్మికి*:

శితాగ్రము. సం. వి. అ. న. చెట్టుముల్లు: చూ, రూ-సితాగ్రము.

శితి. సం. విశే. (ఇ). 1. తెల్లనిది: చూ, హరితము. 1. (వర్ణము. ౬-౫-(౧).); 2. నల్లనిది: చూ, వర్ణము. ౬-౬-(౧).

శితికంఠుఁడు. సం. వి. అ. పుం. కంఠకంఠుఁడు: చూ, శివుఁడు.

శిఖుఁడు. సం. వి. అ. పుం. శుక్రుఁడు: చూ, రాహువు. 2.

శిథిలము. సం. విశే. 1. సంధులువదలినది: శైథిల్యము, శ్లథము. (తె) ఆఱుంగుల్లు-అఱువుల్లు; అం. 2: చూ, మూషిరజ్జువులు. [పిపీలిక.

శిథిలి. సం. వి. ఈ. స్త్రీ.=చెద-చెదలు: చూ,

శిద్ధాంశ.అం (సిద్ధాం):శచూ,షోడశవర్గ.("లగ్నమును ౨౪ సమభాగములు చేయుటకే సిద్ధాంశ యని పేరు. శిద్ధాంశకనుఁగొనవలసిన గ్రహమే రాశియందెన్నవభాగమునందున్నదో తెలిసికొనవలెను. అట్లుగ్రహము ఓజరాశియందున్నయెడల సింహాదిగను. యుగ్మరాశియందున్నయెడల కర్కాటకాదిగను బయిఁజెప్పినరీతిని ఆగ్రహమేరాశియందెన్నవ భాగమునందున్నదనిఁగనుఁగొనఁబడునో యన్నవ రాశి శిద్ధాంశయనఁబడును. ఆరాశ్యధిపతియే శిద్ధాంశాధిపతి")

శిపిశిష్టుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, విష్ణువు. 1; 2: చూ, శివుఁడు; 3: చూ, బట్టతలవాఁడు; 4: చూ, కుష్ఠి.

శిప్రి. సం.వి.ఆ.స్త్రీ.గంగ: చూ,హ్రదిని (నది.)

శిఫ. సం. వి, ఆ. స్త్రీ. 1: రూ-శిఫము, అవరోహము, జట, బుధ్నము, మూలము. (తె) ఊడ, పడుగొమ్మ (చూ, వేరు.); 2. పడుగొమ్మ; 3. తామరదుంప: చూ, సహస్రపత్రము; 4: చూ, మాంసి. 1; 5. ఏఱు: చూ, హ్రదిని (నది.)

శిఫము. సం. వి. అ. పుం: చూ, రూ-శిఫ. 1.

శిబి. సం. వి. ఇ. పుం. 1. హింసించెడిపశువు; 2. శిబిచక్రవర్తి: చూ, రాజో. ౩౨.

శిబిక. సం. వి. ఆ. స్త్రీ. పల్లకి: చూ, సవారి.

శిబిరబ్రాహ్మణులు. అం. సారస్వతులలోని మూఁడవతెగవారు: చూ, ఆమగోత్ర బ్రాహ్మణులు (బ్రాహ్మణులు)

శిబిరము. సం. వి. అ. న. 1. దండువిడిసినచోటు: చూ, స్కంధావారము. 1; 2. డేరా: చూ, సదనము. 1. ~

శిర. సం. వి. ఆ. స్త్రీ. 1. నరము: చూ,రూ-సిర. 1; 2. ఈనె: చూ, శాకము. 1-౧౦. (పారశ.)

శిరఃకంపనము. అం: చూ, గాయకదోషములు.

శిరఃక్రియలు. అం: ధుతము, విధుతము, ఆధూతము, అంచితము, కంపితము, అకంపితము, పరావృత్తము, అవధూతము, అధోముఖము, నికుంచితము, ఉత్క్షిప్తము, లోలితము, పరివాహితము, సమము, ఆలోలితము, ఉద్వాహితము, సౌందర్యము (17) (చూ, శిరోభేదములు).

శిరము. సం. వి. అ. పుం. 1. రూ-శిరసు-శిరస్సు-శీర్షము.=సిరసు: ఉత్తమాంగము, క, కంబు, కరంకము, కరణత్రాణము, ఛ, తిరువు, మస్తకము-మస్తము, ముండము, మూర్ధము, వరాంగము, శిరసు-శిరస్సు—శీర్షము. (తె): అవుదల-బొదల, తల, తలకాయ, తలాటము, నెత్తి, నెత్తికాయ, పోలు, బుఱ్ఱ, బుఱ్ఱకాయ, పిరము-సిరము. తద్వి.—౧. తలవెనుకటిభాగమునకు.—అవటువు, కృకాటిక,ఘాట-ఘాటము-ఘాటి—

ఘాటిక, సీమ. (తె) పెడతల; ౨: (తె) బోడిగుండు, బోడితల; 3. (వెండ్రుకలు గొరుగఁబడిన) తల: (తె) గుండు; ౪. బ్రహ్మరంధ్రమునకు: చూ, సోదు; ౫. లోమెదడు:-వరుటము. (తె) లోమెడ. ౬: శిరోధి (చూ, మెడ. 1.); ౭: (చూ, మెదడు): 2. పిప్పలివేరు: చూ, శౌండి; స్. న. 3 రూ-శిరసు-శిరస్సు. తల: చూ, శిరము. 1; 4. శిఖరము: చూ, నుద; 5. సేనాగ్రము: చూ, సేన. 1; 6. బుద్ధి: చూ, ప్రజ్ఞ. 2; 7: చూ, శ్రైష్ఠ్యము; 8. చెట్టు కొన: చూ, సుక; అం. 9: చూ, తాడితాంగములు; 10: చూ, లక్షణాంగములు. (తల:-"బుడుపులుగలిగినరములుగనఁబడుచే మిక్కిలిరొండినట్లున్న దరిద్రుఁడై కష్టము ననుభవించును. విశాలమైనరాజేగు. మచ్చేయున్న రాజ్యలాభమగు"); 11: చూ, స్త్రీలక్షణాంగములు. ("శిరమునడుమ సుడియున్న విధవయగు. విరివియైన నల్పాయువగు."): 12: చూ, నాట్యోపయోగములైన యంగములు. (చూ, శిరఃక్రియలు-శిరోభేదములు) 13: చూ, శరీరాంగములు.

శిరశ్చాలి. అం: చూ, గతివిశేషములు.

శిరసావహించే. సం. స. క్రి. 1. తలయందు ధరించే: చూ, స్వీకరించే. 3; వా. 2. అంగీకరించే: చూ, సమ్మతించే; 3. తీసికొను.

శిరస్కము. సం. వి. అ. న. 1. కిరీటము: చూ, సీసకము 1; 2.కవచము: చూ, వారవారణము.

శిరస్త్రము. సం. వి. అ. న. — పై. —

శిరస్త్రాణము. సం. వి. అ. న. — పై. —

శిరస్యము. సం. వి. అ. పుం. స్నానాదిసంస్కారముచేత గరగరికయైన తలవెండ్రుక: చూ, వెండ్రుక. ౨౧.

శిరస్స్యూతము. సం. వి. అ. న. ఉన్మత్తకము, పాదములదాఁక నుండెడిఅంగి: చూ, వస్త్రము.

శిరాలుఁడు. సం విశే. లావునరములుగలవాఁడు.

శిరీషపత్రి. సం. వి. అ. స్త్రీ. గినియా*: చూ, శుకనాసము. 1.

శిరీషము. సం. వి. అ. పుం.=గిరిసెనము*: ఈశవాచకము, కపీతనము, కర్ణపూరము, తర్ణకము, భండి-భాండి-భండిగము-భండీరము, భండీలము, వాటిక, శుకము, శ్యామవర్ణ. (తె):—గిరిసెము, దిరిసన- దిరిసనము- దిరిసెనము- దిరిసెము. (తెల్ల దిరిసెనము- నల్లదిరిసెనము అని ద్వివిధము)

శిరోగృహము. సం. వి. అ. న. చంద్రశాల, సజ్జ: చూ, సదనము. 1.

శిరోగ్రీవము. సం. వి. అ. న. ముచ్చిలిగుంట మీఁది బుడిపి: రూ-శిరోగ్రీవము, కాలకలము, కృకము. (తె) బుడిపి-బుడ్పి.

శిరోగ్రీవము. సం. వి. అ. న. — పై. —

శిరోజము సం వి. అ పుం: చూ, శిరోరుహము.

శిరోధి సం. వి. ఇ. స్త్రీ. మెడ: చూ, శిరము. 1-౬ (మెడ. 1.)

శిరోనక్షత్రము. వా. సం. వి. అ. న. ఆకాశమధ్యముందున్న రిక్క. (ఆకాశమునం దుత్తరమునఁ గ్రిందుగ ధ్రువనక్షత్రముండును. ఇది యెప్పుడును గదలనిది. ధ్రువనక్షత్రమున కెదురుగనిలబడి ధ్రువనూత్రముగుండ నాకాశ మధ్యభాగమును జూడఁగ తనభ్రూమధ్యమునకు సరిగ నేనక్షత్రముగనిపించునో యది యశిరోనక్షత్రము.): చూ, సత్తు.1.(రిక్క)

శిరోనామము. సం. వి. న్. న.=చిరునామ-చిఱునామ, మతలబు. (సం): విలాసము.

శిరోభారము. సం. వి. అ. పుం: కంబాధ—కబాధ, కఘాతము. (తె): పీరు, తలరోత, తలనొప్పి, తలయేరు- తలేరు(లు.)

శిరోభేదములు. అం. 1: సమము, ఉద్వాహితము, అధోముఖము, ఆలోలితము, ధుతము, కంపితము, పరావృత్తము, ఉత్క్షిప్తము, పరివాహితము (9) (చూ, శిరః క్రియలు, శిరము. 10.)

శిరోరత్నము. సం. వి. అ. పుం. తలమానికము: చూ, స్థూలోచ్చయము. 1. (రత్నములు. ౧౦-(౪).)

శిరోరుహము. సం. వి. అ. పుం. 1. శిరోజము: చూ, వెండ్రుక; అం. 2: చూ, లక్షణాంగములు. (పురుషుని తలవెండ్రుకలు.- "దీర్ఘములైన దీర్ఘాయువును నైశ్వర్యమును గలుగును. విరళములై నునుపులై పింగళవర్ణములై తుమ్మెదలవలె నీలములై ఇప్ప ఆకులవలెనున్న సుఖవంతుఁడగును."); 3: చూ, స్త్రీలక్షణాంగములు. (స్త్రీజోట్టు:-"వంకలై నుదుట వ్రాలుచున్న భోగియును సుఖియుననగు. వంకరలైనఁబూజ్యురాలగు, విస్తారములైనఁబ్రశస్తము. కురుచలైనఁ బతిని సంపన్నునిగాఁజేయును. సన్ననై నలుపుగలిగియున్నఁబతిప్రియయగు. ఇంద్రనీలసమములై దీర్ఘములైనునుపుగలిగిన సుఖవంతురాలును ధనధాన్యసమృద్ధురాలుననగు, ఊర్ధ్వములైనను రక్తవర్ణములైనను నత్యంత దరిద్రురాలగు, కపిలవర్ణములై కురుచలై నుదుట నంటియున్న నప్రశస్తురాలగు. లంబములైన దరిద్రపతియు దుఃఖవతియునగు")

శిరోష్ఠి. సం. విణ. కపికందుకము: చూ, శల్యము. 1.

శిల. సం. వి. ఆ. స్త్రీ. 1. రాయి: చూ, రత్నములు. ౧౦; 2. కడప క్రింది త్రొక్కుడుఁగమ్మి: (తె) మండిగము; 3.=సెల, కొండకాలువ: చూ, సెలయేఱు. (చూ, నది.)

శిలము. సం. వి. అ. న. కోఁతకోసిన మళ్లయందు రాలిపడిన వెన్నులోనగువాని యేఱుకొని బ్రతుకుట: రూ-సిలము.

శిలాకుట్టకుఁడు. సం. విణ: చూ, రాతిపనివాఁడు.

శిలాక్షరము. జా. స్థిరమైనఅక్షరము: చూ, శిలాశాసనము.

శిలాజతువు. సం. వి. ఉ. న. 1.=సిలాజిత్తు: చూ, సిలాజిత్తు; అం. 2: చూ, భస్మములు.

శిలాపాకి. సం వి. ఈ. స్త్రీ. గురిగింజె*: చూ, శ్వేతపాకి. (గురిజెపూస అని కొందఱు.)

శిలాపుత్రము. సం. వి. అ. పుం. పొత్రము: చూ, రత్నములు. ౧౭-(౧౦)

శిలాఫల. సం. వి. ఆ. స్త్రీ: చూ, శ్రీతాళము*.

శిలాలిసూత్రములు. అం: చూ, భరతశాస్త్రగ్రంథములు.

శిలాశాసనము. జా: శిలలమీఁదఁ జెక్కఁబడిన యక్కరాదులెట్లు శిథిలముగాకయుండునో అట్లు ఎన్నటికిని మార్పుఁజెందక శాశ్వతముగ నుండునది. స్థిరమైనది. "అన్న మాట యన్న మనమ్మున శిలాశాసనమ్ముగఁ దలంచుచుండెదరు." (ధర్మజ రాజసూయము); "అనతి యిచ్చెనా యది శిలాశాసనము." (విజయవిలాసము); "పలుకుశిలాక్షరంబు." (రామాభ్యుదయము.)

శిలి. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుఎఱ్ఱ. గండూపది: చూ, సోరంగి (మత్స్యము. 1-౪౧.)

శిలీంధము. సం. వి. అ. న. 1. అరఁటిపువ్వు: చూ, సుమము; పుం. 2. పుట్టగొడుగు, రూ-శిలీంధ్రము: చూ, సర్పాక్షి. 2.

శిలీంధ్రకము. సం. వి. అ. పుం: అర్శోఘ్ని, ఖలిని, ఛత్రి, తాళమాలిక, ముసలి, వారాహి. (తె): నేలతాడి-నేలతాడు*.

శిలీంధ్రము. సం. వి. అ. పుం: చూ, రూ-శిలీంధము. 2.

శిలీముఖము. సం. వి. అ. పుం. 1. అమ్ము: చూ,

-హేతి. 4 (బాణము. 1.); 2. తుమ్మెద: చూ, షట్పదము.

శిలేషుమానవాస్త్రము. అం: చూ, అస్త్రములు.

శిలోచ్చయము. సం. వి. అ. పుం. కొండ: చూ, పర్వతము.

శిలోద్భవము. సం. వి. అ. న. ఇనుము: చూ, [లోహము. 1.

శిలౌకసుఁడు. సం. వి. అ. పుం. గరుడుఁడు: చూ, హరివాహనుఁడు.

శిల్పకము. అం: చూ, నాటికలు (1_3.4 అంకములు. రంగము శ్మశానము, నాయకుఁడు ద్విజుడు, ప్రతినాయకుఁడు చండాలుఁడు, ఇంద్రజాలము, ఆశ్చర్యము రసము.)

శిల్పకారి. సం. విశే. (ఇ): చూ, స్వర్ణకారుఁడు.

శిల్పకారుఁడు. సం. విశే. —పై.—

శిల్పకుఁడు. అం. 1. యమకాదులం జెప్పువాఁడు: కృతికర్త, శిల్పి; 2: చూ, జాతులు.

శిల్పము. సం. వి. అ. న. 1. చిత్తరువు వ్రాయుటలోనగు శిల్పులపని: కల-కళ, కారుజము, (తె) కొలు, పంచాణము, పని; 2. నృత్య గీతవాద్యాది చతుష్షష్టి బాహ్యక్రియలు; 3. ఆలింగనాది చతుష్షష్ట్యభ్యంతర క్రియలు.

శిల్పి. సం. వి. న్. పుం. 1. వడ్లంగిలోనగు వాఁడు (చూ, శిల్పులు); 2: చూ, శిల్పకుఁడు; విశే. 3. శిల్పికారుఁడు: చూ, స్వర్ణకారుఁడు.

శిల్పిని. అం. 1: చూ, దూతీ చతుష్టయము; 2: అభిసారిక.

శిల్పిశాల. సం. వి. ఆ. స్త్రీ. పట్టడ: చూ, సదనము. 1.

శిల్పిశాస్త్రము. అం. చూ, కళలు. (చూ, ఉపవిద్యలు.)

శిల్పులు. అం: వడ్లంగి, సాలె, మంగలి, చాకలి, మచ్చి (5). తద్వి:-౧ చిత్రకరుఁడు-చిత్రకారుఁడు, రంగాజీవుఁడు, వర్ణాటుఁడు, వర్ణి. (తె) మచ్చి; ౨: (చూ, మాదిగ.)

శివ. సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, పార్వతి. 1; 2. నక్క: చూ, సృగాలము; 3. ఉసిరిక*: చూ, శ్రీఫలి. 1; 4: అజ్ఝట, అమల, ఉత్తమ, గూఢపత్రి, ఝుట, తమాలము, తామలకి, తాలి, తాలీశివ, తాలీసపత్రము, భూధాత్రి, భూమ్యామలకి, వితున్నకము. (తె) నేలయుసిరిక*; 5. కరక*: చూ, హరీతకి; 6: చూ, శమి. 1*; 7. చిఱుబొద్ది*: చూ, విద్ధకర్ణి; 8. బౌద్ధదేవి: చూ, స్వాహా. 2. (భార్య 1-౧౧.)

శివంకరుఁడు. సం. విశే: చూ, శుభంకరుఁడు.

శివకము. సం.వి.అ.పుం.1. పసులఁగట్టుగూటము: చూ, స్తంభము. 1; 2. మేకు: చూ, శూలము.

శివకీర్తనుఁడు. సం. వి. అ. పుం: చూ, విష్ణువు. 1.

శివక్రియ. అం: చూ, క్రియాంగములు (అంగము. 9.)

శివతాతి. సం. విశే. (ఇ): చూ, శివంకరుఁడు.

శివదూతి. సం. వి. ఈ. స్త్రీ: చూ, పార్వతి.1.

శివదూతీయము. అం: చూ, తంత్రములు.

శివధర్మము. అం: చూ, ఉపపురాణములు.

శివపరిచారికలు. అం: చూ, పరిచారిక.

శివపూజాసమయము. అం: చూ, గ్రహసమయములు (శత్రుజయము.)

శివభద్రము. అం: చూ, కావ్యనాటకములు.

శివమల్లి. సం. వి. ఈ. స్త్రీ. 1. బకపుష్పము*: చూ, శ్రీవల్లి; 2. క్షుపకము. (తె) హోరాదెన-హోరాదెఱము*.

శివమల్లిక. సం. వి. ఆ. స్త్రీ. తెల్లజిల్లేము*: [చూ, వికీరణము.

శివమాడు. ఏ. అ. క్రి. (దేవతావేశముచేతఁగాని గ్రహపీడచేతఁగాని) తలవిసరు.

శివము. సం. వి. అ. న. 1. మంగళము: చూ, శుభము. 1; 2. సుఖము: చూ, సంతోషము; 3. నీరు: చూ, సలిలము; పుం. 4: చూ, వేద

ము; 5: చూ, మోక్షము. 1, 6: చూ, యోగములు; 7. తియ్యమామిడి*: చూ, సహకారము (మామిడి. 3.); 8. నాఁగుదోస*: చూ, వారివాలుకము; 9. గుగ్గిలము*: చూ, మహిసాక్షి; 10. మేకు: చూ, శూలము. ‡;11 ఇసివము. దేవతావేశము: చూ, సివము; విణ. 12. శుభకరము: చూ, శుభము. 1.

శివరాత్రి. సం. వి. ఇ. పుం. మాఘబహుళత్రయోదశి: (తె) బూది. (చూ, హరివాసరము.)

శివలింగము. అం: చూ, సంయుతహస్తములు.

శివవల్లి. సం. వి. ఈ. స్త్రీ: చూ, లింగిదొండ*.

శివశక్తి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకమహాయోగురాలు; 2. సోమాలమ్మయను గ్రామదేవత: చూ, (మహాలక్ష్మి.)

శివాంశ. అం. (పదునొకండు వర్గంబులు స్వవర్గంబులు వచ్చుట.) [పర్వతము.

శివాద్రి. సం. వి. ఇ. పుం. వెండికొండ: చూ,

శివాననములు: అం. (శివునిపంచముఖములు): ఈశాన, తత్పుర, వాసుదేవ, సద్యోజాత, అఘోరములు. (5) [చూ, మేషము. 1.

శివాప్రియము. సం. వి. అ. న. మేఁకపోతు:

శివార్చకుఁడు. సం. వి. అ. పుం: చూ, పూజారి.

శివాలము. సం. వి. అ. న: చూ, శైవలము*.

శివాలయము. సం. వి. అ. పుం. శివునియిల్లు: చూ, సదనము. 1; అం. 2: చూ, సంతానములు.

శివుఁడు. సం. వి. అ. పుం. (బ్రహ్మానందస్వరూపుఁడును నిర్వికారుఁడును గనుక శయించియుండువాఁడు. ఇతనియందు సజ్జనమనస్సులుండును. సాధువుల మనస్సులయందు శయనించి యుండువాఁడు. శివమనఁగా శుభము దానితోఁగూడినవాఁడు. శుభములనిచ్చువాఁడు.): అ, అంధకరిపువు, అంబరాంబరుఁడు, అంబరీషుఁడు, అంబుధీషుధి, అక్షరుఁడు, అగ్నిదృక్కు, అచ్యుతుఁడు, అజితుఁడు, అజుఁడు, అద్భుతశ్వానుఁడు, అద్రివాసుఁడు, అథర్వణుఁడు, అధ్యాఘుఁడు, అనఘుఁడు, అనాదిజటిలుఁడు, అనంగ్ఘుఁడు, అపగల్భ్యుఁడు, అపరాజితుఁడు, అబ్జవాహనుఁడు, అబ్దుఁడు, అభతుఁడు, అభవుఁడు, అభీకుఁడు, అరరుఁడు, అరుఁడు, అరుణాభుఁడు, అర్ధనారీశుఁడు, అర్ధనారీశ్వరుఁడు, అర్హుఁడు, అవ్యక్తుఁడు, అవ్యయుఁడు, అష్టమూర్తి, అసమనేత్రుఁడు, అస్థిహారుఁడు, అహిభూషణుఁడు, అహిర్బుధ్న్యుఁడు, ఆ, ఆత్మభువు, ఇ, ఈశానుఁడు, ఈశుఁడు, ఈశ్వరుఁడు, ఉ, ఉగ్రాక్షుఁడు, ఉగ్రుఁడు, ఉమాపతి, ఉమాప్రియుఁడు, ఉమేశుఁడు, ఊ, ఊర్ధ్వరేతసుఁడు, (ఊర్ధ్వరేతుఁడు), ఊర్ధ్వలింగుఁడు, ఋ, ఌ, ఏకపాత్తు, ఐ, ఓంకారేశ్వరుఁడు, కంకటకుఁడు, కంఠేకాలుఁడు, కటప్రువుఁడు, కఠమర్దుఁడు, కపర్ది, కపాలభృత్తు, కపాలిక, కపిశాంజనుఁడు, కలానిధి, కల్మాషకంఠుఁడు, కామధ(ధు)క్కు, కామధ్వంసి, కామాంతకుఁడు, కామారి, కాలంజరుఁడు, కాలకంఠుఁడు, కాలకాలుఁడు, కాలకూటాశనుఁడు, కాలాంతకుఁడు, కాళీపతి, కాళీశుఁడు, కాలుఁడు, కాశీనాథుఁడు, కీలుఁడు, కురంగపాణి, కుహానుఁడు, కూటకృత్తు, కృకరుఁడు, కృత్తివాసుఁడు, కృశానురేతసుఁడు, కృష్కరుఁడు, కేదారుఁడు, కేశభువు, కైలాసనికేతనుఁడు, కైలాసమందిరుఁడు, కోకనదుఁడు, కోకిలుఁడు, కౌశికీపతి, క్రతుధ్వంసి, క్రీడాకిరాతుఁడు, క్రీడాయుధము, క్రోడుఁడు, క్షోణీరథుఁడు, ఖండపరశువు-ఖండపర్శువు, ఖండేందుశుభికుఁడు, ఖకుంతలుఁడు, ఖట్వాంగభృత్తు, ఖట్వాంగపాణి, ఖట్వాంగి, ఖరువు, గంగాధరుఁడు, గజాసురారి, గణాధిపతి, గణాధి

పుఁడు, గణేశుఁడు, గయుఁడు, గరళకంఠుఁడు, గిరిధన్వుఁడు, గిరిశుఁడు-గిరీశుఁడు, గుడాకేశుఁడు, గుహాకేతుఁడు, గుహ్యగురువు, గోపతి, గోపాలకుఁడు, ఘ, ఘనవాహనుఁడు, ఘోరుఁడు, ఙ, చ, చండిలుఁడు, చంద్రమౌళి, చంద్రశేఖరుఁడు, చంద్రసూర్యాగ్నిలోచనుఁడు, చంద్రాపీడుఁడు, ఛన్నవీరుఁడు, జ, జగద్యోని, జటాచీరుఁడు, జటాటంకుఁడు, జటాటీరుఁడు, జయంతుఁడు, జిష్ణువు, జీమూతుఁడు, జోటింగుఁడు, టంకటీకుఁడు, ఠ, డ, తమోఘ్నుఁడు, త్రిధాముఁడు, త్రియంబకుఁడు, త్రినేత్రుఁడు, త్రిపురదహనుఁడు, త్రిపురాంతకుఁడు, త్రిలోచనుఁడు, త్ర్యంగటుఁడు, త్ర్యంబకుఁడు, త్ర్యక్షుఁడు, ద, దిగంబరుఁడు, దృగాయుధుఁడు, దేవమణి, ధన్వంతరి, ధరణీశ్వరుఁడు, ధర్మవాహనుఁడు, ధూర్జటి, ధ్రువుఁడు, నందివర్ధనుఁడు, నాగకంకణుఁడు, నారాయణుఁడు, నిరాకారుఁడు, నిశ్రేయసుఁడు, నీలకంఠుఁడు, నీలలోహితుఁడు, పంచముఖుఁడు, పంచాననుఁడు, పంచాస్యుఁడు, పరమేశ్వరుఁడు, పశుపతి, పళ్యశ్ఫాలుఁడు, పాంశుచందనుఁడు, పింగళుఁడు, పింగాక్షుఁడు, పినాకి, పునర్వసువు, పురహరుఁడు, పురారి, పురుషోత్తముఁడు, ప్రమథాధిపతి, ప్రహాసుఁడు, ఫాలుఁడు, బభ్రువు, బహురూపుఁడు, బుధ్నుఁడు, బ్రధ్నుఁడు, భగవానుఁడు, భగాలి, భద్రుఁడు, భర్గుఁడు, భవుఁడు, భస్మాంగుఁడు, భీముఁడు, భీష్ముఁడు, భూతేశుఁడు, భృగువు, భైరవుఁడు, భాతికుఁడు, మ, మహాకాలుఁడు, మహాదేవుఁడు, మహానలుఁడు, మహేశ్వరుఁడు, మారదుఁడు, మిహిరాణుఁడు, మృడుఁడు, మృత్యుంజయుఁడు, రుద్రుఁడు, రైవతుఁడు, వటమూలగుఁడు, వటుకుఁడు, వరవృద్ధుఁడు, వామదేవుఁడు, వాముఁడు, విభుఁడు, విరించి-విరించుఁడు, విరూపాక్షుఁడు, విశ్వనాథుఁడు, విషధరుఁడు, విషమాక్షుఁడు, వీధిసారథి, వృషధ్వజుఁడు, వృషాంకుఁడు, వృషాంచరుఁడు, వృషాకపి, వ్యోమకేశుఁడు, శమ్, శంకరుఁడు, శంభువు, శబరుఁడు, శమిరోహుఁడు, శర్వుఁడు, శితికంఠుఁడు, శిపివిష్టుఁడు, శూలపాణి, శూలి, శైలిధన్వుఁడు, శ్రీకంఠుఁడు, సంధ్యానాటి, సదాగతి, సదాతినుఁడు, సదాశివుఁడు, సర్వజ్ఞుఁడు, సర్వతోముఖుఁడు, సర్వేశ్వరుఁడు, సాంబుఁడు, సావిత్రుఁడు, సుప్రసాదుఁడు, సోముఁడు, స్థాణువు, స్మరహరుఁడు, స్వభువు, స్వయంభువు, హంసుఁడు, హరుఁడు, హీరకుఁడు. (అవ్య):— ఆధి. (తె. వ):— అంగమొలవేల్పు, అగ్గికంటి, అయిదుమోములవేల్పు-ఐదుమోములవేల్పు, అఱవదిమోములవేల్పు, ఆఁబోతురవుతు, ఈసరుఁడు, ఎత్తులకెకిమీఁడు, ఏనుఁగుఠాకానిగొంగ, కడదెసంగా చెడిరా, కడలిబత్తులికదునేదారి, కప్పుమైదువపెనిమిటి, కఱకంటుఁడు-కఱకంఠుఁడు, కాటిఱేఁడు-కాటేఱ్రేఁడు, కుత్తుగఁగందువాఁడు, కొండయల్లుఁడు, కొండమల్లయ్య, కొండఱటిజంగయ, కోడెరవుతు, గట్టువిలుకాఁడు-గట్టువిల్కాఁడు-గట్టువిలుతుఁడు-గట్టువిల్తుఁడు, గట్టువిల్దారి, గిత్తతత్తడిఱేఁడు, గిబ్బరౌతు, గుజ్జుకొమరునకుఁదండ్రి, గుజ్జువేల్పుతండ్రి, గుబ్బలివిలుకాఁడు, చిచ్చఱకంటి, చిలువతాలుపు, చిలువదారి, జక్కులఱేని చెలికాఁడు, జెడదారి, జెడముడిజంగము, జన్నఁపుఁగొంగ, జన్నంపువేఁటకాఁడు, జేముడంట, జాబిలితాలుపు-జాబిలితా

ల్పు, జింకతాలుపరి-జింకతాలుపు, తడవుఁగనిన పట్టిఁగన్నయ్య, తిగపోఁ్రలుదాయ, తిగపోఁ్రలువేఁటకాఁడు, తుదిదిక్కు-టెంకి, తెలివేల్పు, తెల్లనిదొర, తోఁడుకుసామి, తోల్జంగమయ్య, తోలుదాలుపు-తోలుదాల్పు, దిసమొలవేల్పు-దిస్సమొలవేల్పు, నల్లనైదువగేస్తు, నింగిసిగ, నెలతాలుపు-నెలతాల్పు, పాఁపతొడవులవేలుపు, పుడమితేరెక్కు-వాఁడు, పునుకచేట్టులదణి, పునుకతాలుపు, పునుకదారి, పునుకకంచేమువాఁడు, పొడకోకఁగట్టుప్రోడ, పొడలగింటెముదాల్పు, బుడంతనెలతాల్పు, బూచులఱేఁడు, బూఁతనాదుఁడు, బేసికంటి, బేసికంటివేల్పు, మడికానుపులఱేఁడు, మరునిపూఁడు, మిక్కిలికంటివేల్పు, మిత్తిగొంగ, మిత్తిమిత్తి, మిత్తివేఁటకాఁడు, మిత్తిసూఁడు, మినుసికగలాఁడు, మినుసిగవేల్పు, మిన్నువాఁకతాలుపు, మిన్నేటితాలుపు, ముక్కంటి, ముక్కోఁటికలకంటు, ముమ్మొనవాలుదాలుపు, ముమ్మొనవాల్దంట, మేలిమిమెట్టువిల్కాటి, లిబ్బిదొరచెలి, వలిమలల్లుఁడు, వలరాజుసూఁడు, వాఁకితాలుపు, విసజొట్టుదేవర, విసువాఁకమోపరి, విసుసిగదేవర, విన్నిగతుపాసి, విసపుమేతరి, వెండికొండదునీఁడు, వెలయాలపోతురాతు, వేఁడికంటి, వేయంచులపాఁగగలదిట్ట, వేల్పుటేటిమగఁడు, వేల్పుదణిగన్నతఁడు, సత్తిరా, సామేనుగరితదాలుపు, సెకకంటి, సెగకంటిజోదు. తద్వ్య. ౧. నాగపట్టణములోని శివుఁడు:- కాయారోహణేశ్వరుఁడు; ౨. పాతాళమఁదలి సర్వవనమునందుండు శివుఁడు:-అజవిూఘుఁడు; 3. పానవట్టముమీఁది శివమూర్తి:-లింగము. ర:(చూ, రుద్రులు, చూ, ఆదిత్యులు.); అం. 2: చూ, శాస్త్రపవిత్రకులు.

శివునియష్టమూర్తులు. అం: (అష్టమూర్తులు.) పృథివ్యప్తేజో వాయ్వాకాశములు, సూర్యచంద్రులు, సోమయాజి. (8)

శిశిర. అం: చూ, భాషాంగములు.

శిశిరము. సం. వి. అ. పుం, న. 1: చూ, మాసద్వయము, చూ, ఋతువులు (మాఘఫాల్గుణమాసములు); పుం. 2. చల్లన: చూ, శైత్యము; విణ. 3. చల్లనిది. (పద్మముల కాంతిఁ జెఱచునది.): చూ, హిమము. 3.

శిశుకము. సం. వి. అ. పుం. 1.=నిసుగు-నిసువు: చూ, శిశువు; 2. ఉలుచేమీను: చూ, మత్స్యము. 1.

శిశుఘాతిని సం.వి.ఈ.స్త్రీ: చూ, పడుచులతిండి.

శిశుత్వము సం. వి. అ. న: చూ, శైశవము.

శిశుపాలవధ. అం. (మాఘుఁడురచించెను): చూ, కావ్యనాటకములు. [మారము. 1-2-3.

శిశుమారము. సం. వి. అ. న: చూ, దూ-శింశు

శిశువు సం. వి. ఉ. పుం.=సిసువు, నిసుఁగు-నిసువు (మిక్కిలి నిద్రపోవునది): అనేడమూకుఁడు, అపత్యము, అపోగండఁడు-అపోగండఁడు, అర్భకుఁడు, అవలగ్నుఁడు, ఉత్తానశయుఁడు, కనిష్ఠుఁడు, కనీయుఁడు, కుష్మాండుఁడు, క్షీరకంఠుఁడు, ఖేలకము, గర్భము, డింభము, డింభుఁడు, తోకము, పాకుఁడు, పృథుకము, పృథుకుఁడు, పోతుఁడు, ప్రసవము, యవీయసుఁడు, బాలకుఁడు, శిశుకము, సంతతి, సంతానము, స్తనంధయ-స్తనంధయుఁడు. (తె): అడ్డపట్టుపాప, అడ్డపాప, ఎఱగందు, కందు-కందువు, కసుఁగందు, కున్న, కుఱ్ఱ-కుఱ్ఱఁడు, కూన, చేంటిపాప-చేంటిపాపఁడు, చేంటిపిల్ల, చంటివాఁడు, చిటికాఁడు, చోలి-చోలు, చేతిబిడ్డ, దుడ్డ, నిసుఁగు-నసువు, నెత్తురుకందు-నెత్రుకందు, పట్టి, పరచేంటివాఁడు, పసిపాప, పసి

బిడ్డ, పాప, పాలపాపఁడు, పిల్ల, పూప, బిడ-బిడ్డ-బిడ్డె.బుడుత-బుడుతఁడు, బురక-బురకఁడు, బుజ్జఁడు,సన్నఁడు, సన్నపాపఁడు,సిసువు. తద్విశేషములు.—౧.కడుపులోని పిల్లకు.—గర్భము. (తె): చేవిలివాఁడు-చేవిలె వాఁడు; ౨: (తె) ఎత్తుబిడ్డ; ౩. పశుపక్ష్యాదుల పిల్లకు.— కణకము. (తె): కందు, కూన, కొదమ, గున్న, నిసుఁగు-నిసువు, పిల్ల, బోద, బోదలా, బోదు-బోదులా (చూ, పక్షి); ౪. పిన్నవయసు వానికి.—కొమరుఁడు—కొమారుఁడు, కొమిర: కోడెకాఁడు (కోడీఁడు); ౫. బాలునకు.—(పదునారేండ్లకు లోఁబడినవాఁడు): అపటువు, అర్భకుఁడు, ఈలి, కిశోరుఁడు, కుతపుఁడు, కుమారుఁడు, క్షీరకంఠుఁడు, డింభుఁడు, దారకుఁడు, పోగండుఁడు, బాలకుఁడు, బాలిశుఁడు, బాలుఁడు, మాణవకుఁడు, మూఢుఁడు, వటుకుఁడు, వత్సుఁడు, వాలుఁడు, శాబకము, శాబకుఁడు, శాబము, శిశుకము. (తె): అబ్బాయి, అబ్బి, కందు, కున్నఁడు, కుఱ్ఱ-కుఱ్ఱఁడు, కొండిక-కొండొక, కొండికవాఁడు, చిన్న, చిన్నవాఁడు, చిఱుత-చోఱ-చోర-చోఱ, చోఱవాఁడు, తింగణా, దుడుకఁడు, దుడ్డె, నవ్వ, పడుచఁడు, పడుచే, పయిద-పైద, పసివాఁడు, పాప, పాపఁడు, పిన్న, పిన్నవాఁడు, పిల్లకాయ, పిల్లగాఁడు, పిడుచేఁడు, పోఱఁడు, పోటిగాఁడు, బిడ్డ-బిడ్డఁడు, బుడుత- బుడుతఁడు, బొట్టియ-బొట్టియఁడు, బొట్టె-బొట్టెఁడు, బోడిక,లేఁత; ౬.ఎనిమిదేండ్లలోపు బాలునకు.—కుమారుఁడు, శేశవుఁడు; ౭: గర్భాష్టమఁడు; ౮. విశాఖపట్టణప్రాంతపు బాలునకు:—(తె) గుంట-గుంటఁడు, బొట్టియ-బొట్టె- బొట్టియఁడు- బొట్టెఁడు; ౯. బాలురగుంపునకు.-మాణవ్యము. (ఆఁడుదానికి:—చూ,యౌవనభేదములు; చూ,స్త్రీ.)

శిశ్నము. సం. వి. అ. పుం. (భగముతోఁగూడునది): ఉత్తమాంగము, ఉపస్థ,కందర్పముసలము, కామలత, కామాంకుశము, కోశము, గిరిసారము, చపము, జఘన్యము, ధ్వజము, మేఢ్రము, మేహనము, లాంగలము,లాంగూలము, లింగము, వరాంగము, శేఫము, సాధనము. (తె): కామ, కోల, పుల్లి, పిల్లల గలిగించుకామ, బడ్డు, బుల్ల, బెల్లము, మగగుఱి, లొట్ట, లొట్టకాయ. తద్వి.—మగవానికామచివరకు:—మణి.

శిశ్విదానుఁడు. సం. వి. 1: చూ, సదాచారుఁడు;2.దురాచారుఁడు: చూ,వ్యాధుఁడు.2.

శిష్టకరణబ్రాహ్మణులు. అం. సారస్వతులలోని రెండవతెగవారు: చూ, ఆచార్యఅను బ్రాహ్మణులు.

శిష్టకారోణొబ్రాహ్మణులు. అం.ఉత్కళులలోనొకతెగవారు. సామవేదులు, సామవేదశిష్టులనియుఁ జెప్పఁబడుదురు. వీరిది కాత్యాయనసూత్రము. గౌడబ్రాహ్మణులుసాధారణముగా లేని ప్రదేశములందు కొందఱు ద్రావిడపురోహితులవుండా వైదికకర్మలను నడిపించుకొని యజుర్వేదమును ఆపస్తంబమును అనుసరించుచున్నారు. వీరుపట్టనాయకో యను పౌరుషనామము ముఖ్యముగగలవారు. (పట్టనాయకో అనఁగా విద్యాగురువు) మఱియు మహంతో పాత్రో, పాండితో, మొంత్రి అను పౌరుషనామములుగలవు. వీరి వృత్తి మంత్రిత్వము ఉపాధ్యాయత్వము, గంజాము విశాఖపట్టణము జిల్లాప్రాంతములలో గ్రామకరిణీకపు పనులలోనున్నారు. కొందఱు మీసములుంచెదరు: చూ, ఉత్కళబ్రాహ్మణులు (చూ, బ్రాహ్మణులు)

శిష్టి. సం. వి. ఇ. స్త్రీ. ఆజ్ఞ: చూ, సెలవు.

శిష్టుఁడు. సం. విణ. 1. సదాచారసంపన్నుఁడు: చూ, సంపన్నుఁడు; 2: చూ, విధేయుఁడు; 3. ఆజ్ఞాపింపఁబడినవాఁడు.

శిష్టకరణము. అం: చూ, శిష్టకరణబ్రాహ్మణులు.

శిష్టుకృష్ణమూర్తికవి.పా. ఇతఁడు క్రీ. శ. 1790 సం॥రమున కాకినాడ కనతిదూరమున నున్న గొల్లపాలెమున జన్మించెను. వీనిది ఆపస్తంబ సూత్రము. వశిష్ఠసగోత్రము. ఈతఁడు ధునాతన పండితకవులయందగ్రగణ్యుఁడు. సంగీతసాహిత్యకళావిశారదుఁడు. అభినవ కాళిదాస బిరుదాంకితుఁడు. బహు గ్రంథ రచయిత. గొప్పపురాణవేత్త. బహురాజాస్థానములయందు సమ్మానితుఁడై యనేక కవితాచమత్కారములంజూపిన విద్వత్కవి. (ఈతనిచరిత్ర మీయాంధ్రవాచస్పత్య కర్తచే ఆమూలాగ్రము సమగ్రముగా వ్రాయఁబడినది. అచిరకాలములోనే ప్రకటింపఁబడును.)

శిష్యవరణము. అం: చూ, ప్రమేయములు.

శిష్యుఁడు. సం. వి.అ.పుం.=సిసువుఁడు. 1: అంతేవాసి, ఉపసేదివంతుఁడు, కాపటికుఁడు, కార్పాటికుఁడు, ఛాత్రుఁడు, శుశ్రూషకుఁడు. (తె): చేట్టు, బంటు, సిసువుఁడు. తద్వి.—క్రొత్తశిష్యునకు.- క్రియాకారుఁడు, ప్రాథమకల్పికుఁడు, శక్ష, శైక్షుఁడు; అం. 2: చూ, పుత్రులు.

శిస్తు. వా. వి: చూ, రూ-సిస్తు. 1.

## శీ

శీకరము. సం. వి. అ. పుం. 1: అంబుకణము, తుంతుర్వము. (తె): తుంపర-తుంపురు-తుపర-తుప్పర- తూర- దూగర- దూపర. తద్వి:—చూ, వమథువు. 1; అం. 2. ఏనుఁగు తొండము చివరయందు పుట్టెడుమదము: చూ, గజమదములు.

శీఘ్రము. సం. వి. అ. న. 1. నీరుపట్టివేరు*: చూ, సేవ్యము; 2. బండికంటియాకు: అరమ. (తె): అంచే, ఆకు; క్రి. విణ. 3. త్వరితముగ: చూ, స్యదము; విణ. 4. వడిగలది: చూ, స్యదము. [సీత. 2

శీత. సం. వి. ఆ. స్త్రీ. నాఁగటిచాలు: చూ,

శీతకము. సం. వి. అ. పుం. చేలికాలము, సీతి-సీతు-సీతువు: చూ, సంవత్సరము (మాసద్వయము. ౬.)

శీతకరుఁడు. సం. వి. అ. పుం. చందమామ: చూ, హిమాంశువు (ఇట్లు శీతభానుఁడు, శీతమయూఖుఁడు, శీతాంశుఁడు).

శీతకుఁడు. సం. వి. అ. పుం: చూ, సోమరి.

శీతనగము. సం. వి. అ. పుం. పలిమల: చూ, పర్వతము.

శీతపిత్తహార. సం.వి.ఆ.స్త్రీ.ఉప్పి*: చూ, లవణి.

శీతభీరువు. సం. వి. ఉ. స్త్రీ. మల్లె*: చూ, వాసంతి. 2.

శీతము. సం. వి. అ. న. 1.=సీతి-సీతు-సీతువు. చల్లన: చూ, శైత్యము; 2.=సీతువు. చలికాలము: చూ, శీతకము, పుం. 3: ప్రబ్బ*: చూ, సహస్రవేధి. 2; 4. చలిగాలి: చూ, వాయువు; 5. విరిగి*: చూ, శ్లేష్మాతకము; విణ. 6. చల్లనిది: చూ, హిమము. 3; 7. అలసమైనది: చూ, విలంబము. 1; అం. 8: చూ, కాలములు.

శీతల. సం. వి. ఆ. స్త్రీ. 1. చొక్కాణ*: చూ, సోఖిదము; 2: (రూ-శీతళ) చూ, పొంగటి పనస*.

శీతలము. సం. వి. అ. న. 1. పర్వతధాతువిశే షము; 2. చందనము: చూ, సౌరభ్యము (వాసన. 1.): పుం. 3: చూ, శీతల.1.*. (ఈయర్థమునందిది ఆ. (స్త్రీ).): విశ. 4. చే ల్లనిది: చూ, హిమము. 3. [శీతము.4.

శీతలవాయువు. సం. వి. ఉ. పుం. చేలిగాలి: చూ,

శీతలించే. సం. అ. క్రి: చూ, శైత్యించే.

శీతశమనము. సం. వి. అ. న. అగురువు: చూ, రాజార్హము.

శీతశివము. సం. వి. అ. న. 1. ఇందుప్పు: చూ, సౌవర్చలము (లవణము. 1-౨౦.); 2: చూ, జాపువ్వు; పుం. 3. జేమ్మి*: చూ, శమి. 1; 4. అడవిసదాప* (ఈ యర్థమునందిది ఆ. (స్త్రీ).): చూ, సదాప.

శీతసహా. సం. వి. ఆ. (స్త్రీ): చూ, సదాప*.

శీతసారము. సం. వి. అ. పుం: కాండపుష్ప, కాండపుష్పి, క్రియము, పత్త్రూరప్రియము, బ్రిహ్మి-బ్రాహ్మి, మండూకపర్ణి, మత్స్యాక్షి, లోహమారకము, వనౌషధి, వయస్థ, సోమవల్లరి. (తె): పొన్నగంటి*.

శీతళ. సం. వి. ఆ. (స్త్రీ): చూ, రూ-శీతల. 1.

శీధువు. సం. వి. ఉ. పుం. 1. పక్వమైనచెఱకు రసమునఁజేసిన కల్లు: చూ, సుర. 2; 2. ఏనుఁగుకన్నులయందలిమదము. రూ- సీ ధువు: చూ, గజమదములు. [లాంగలము.

శీరాంగము. సం. వి. అ. న. నాఁగటిదుంప: చూ,

శీర్ణము. సం. విశ. 1. సడలినది; 2. సన్నగిల్లిన ది. తద్వి—సన్నమగునది:-నలిగొట్టు.

శీర్ణరోమము. సం. వి. అ. న. స్థౌణేయము: చూ, రాజార్హము. [సీసకము. 2.

శీర్షకము. సం. వి. అ. న.=సీసకము: చూ,

శీర్షచ్ఛేద్యుఁడు. సం.విశ. తలకొట్టఁదగినవాఁడు.

శీర్షణ్యము. సం. వి. అ. న. 1: చూ, శీర్షకము; పుం. 2: చూ, శిరస్యము.

శీర్షము. సం. వి. అ. న. తల: చూ, శిరము. 1.

శీర్షోదయపృష్ఠోదయరాసులు. అం. మిథున-సింహ-కన్య-తుల-వృశ్చిక-కుంభములు శీర్షోదయరాసులు. మేష-వృషభ-కర్కాటక-ధనుర్మకరములు పృష్ఠోదయరాసులు. మీనముభయోదయము.

శీలనము. సం. వి. అ. న. దివ్యపరిబంధములో పరీక్ష, పరిశీలనము: చూ, శోధనము. 1.

శీలము. సం. వి. అ. న. 1: చూ, స్వభావము; 2: అనూకము. (తె): ఆలుడి, మంచినడత.

శీలములేనియాఁడుది. అం: చూ, నిరర్థకములు.

శీలించే. సం. అ. క్రి. 1. వాడుకపఱచే; 2: చూ, విమర్శించే; 3: చూ, శోధించే.

శీలితము. సం. విశ: చూ, చీర్ణము.

## శు

శుంఠ. సం.విశ.=శుంఠ.రూ-శుంఠుఁడు. 1: చూ, వ్యాఘుఁడు. 2; 2. విద్యలేనివాఁడు.

శుంఠి. సం. వి. ఈ. (స్త్రీ). 1.=సొంటి: చూ, సొంటి; అం. 2: చూ, కటుకములు.

శుంఠీద్వయము. అం: సొంటి, అగలుసొంటి.(2).

శుంఠుఁడు. సం. విశ.=శుంఠ: చూ, రూ-శుంఠ.

శుండ. సం. వి. ఆ. (స్త్రీ). 1. రూ-శుండము-శుండాలము-తొండము: చూ, హస్తి; 2.కల్లు: చూ, సుర. 2; 3. కల్లుత్రాగెడి యిల్లు: చూ, సదనము. 1; 4. నీరేనుఁగు: చూ, హస్తి; 5.అర్కమందారము, ఆళము, వికిరణము. (తె): ఉచ్చింత-ఉచిఁత-ఉచ్చిఁత-ఉస్తె. తద్వి.—గా: అలర్కము, వసువు. (తె): ముండ్లయుచ్చిఁత-ముండ్లముస్తె, ములుచిఁత-ముల్లుచిఁత, ముల్లముస్తె*; 6: చూ, వేశ్య-

శుండాలము. సం. వి. అ. పుం. ఏనుఁగు: చూ, హస్తి.

శుండానూచీన్యాయము. అం: ఒకానొక న్యాయము.

శుంభపురి. అం. ఏకచక్రపురము: చూ, దేశములు.

శుంభము. సం. వి. అ. న. త్రాడు: చూ, సూత్రము. 1.

శుంభుఁడు. సం. వి. అ. పుం. ఒకఅసురుఁడు, శంబరుఁడు, శంబుఁడు, శంబూకుఁడు: చూ, సురారి (రాక్షసుఁడు. ౪)

శుకతుండము. అం. 1. అభినయహస్తవిశేషము. (చూపుడు వ్రేలిని కనుబొమ్మవలె వంచి బొటనవ్రేలుఁగూర్చి యుంగరపువ్రేలు వట్ల వంచి నడిమివ్రేలును చిటికెనవ్రేలు నున్నతోన్నతములుగాఁ బట్టినది.): చూ, వ్యంజకము, 1—౧౭; 2: చూ, అసంయుతహస్తములు.

శుకనాసము. సం. వి. అ. పుం. 1: అగస్తి, అగస్త్యకము, అగస్త్యము, అతసి, ఉమ, కుటజము, క్షౌమి, చోరతుండువు, ముని. (తె): అగసి-అగిసియ-అవిసి-అవిసియ-అవిసె*. తద్వి.—౧: వనయగస్తి. (తె) అడవియవిసె; ౨: లాలని. (తె) ఎఱ్ఱఅగిసె-ఎఱ్ఱగిసె; 3: ముతంగి, వంగసేనకము. (తె) తెల్లగిసె; ౪: కటభి, క్షైడర్య, క్షుమ, మసృణ. (తె) నల్లగిసియ, నూనెయగిసె; ౫: సీమఅగిసె; ౬: క్షుద్రశ్వేత, పళిరము-పసిరము, శిరీషపత్రి. (తె) గిరియ; ౭: కిణిహి, శిరీషపత్రి, సునాభము. (తె) తెల్లగిరియ; ౮: కిణిహి, క్షుద్రశిము. (తె) నల్లగిరియ (గిరియనే అగిసెఅని నల్లగిసెఅని కొందఱు.); 2. దుండిగగము*: చూ, శోణకము.

శుకము. సం. వి. అ. న. మాచి*: చూ, వాయసి. 1; పుం. 2. ౧ చిలుక: బుతువు, కీరము, కుమారము, కోకిలము, చిరి, చిరాయువు, మేధావి, లాటము, వచ-వచము, వాగ్విహారి. (తె): చెక్కెరతిండి, చేదువులపులుఁగు, చిలక-చిలుక-చిల్క, తొగరు ముక్కుపులుఁగు, తొగరుమోముపుల్గు, పచ్చఱెక్కలపిట్ట, పచ్చెదిలుతునితేజి, పండురతిబుడఁట, పలుకుఁదత్తడి, పలుకులపులుఁగు, పులుకానిపులుఁగు, బట్టికాఁడు, మరుతేజి, మోదుగుమొగ్గపుల్గు, రామతమ్మ, వెడవిల్కానిబాగా. తద్వి.—౧: (తె) పెంపుడుచిలుక; ౨: శతపత్రము. (తె). రాచిలుక; 3. చిలుకలగుంపునకు.—శౌకము; 3. దిరిసెనము*: చూ, శిరీషము; 4. స్థౌణేయకము: చూ, రాజార్హము.

శుకవర్ణి. అం: చూ, అనువర్ణములు.

శుకవాహుఁడు. సం. వి. అ. పుం. పచ్చవార్వపుజోదు: చూ, మన్మథుఁడు.

శుకశారికాప్రలాపము. అం: చూ, ఉపవిద్యలు. 1.

శుకసంహిత. అం: చూ, తంత్రములు.

శుకి. అం: చూ, సుషిరవాద్యములు.

శుకుఁడు. సం. వి. అ. పుం. 1. వ్యాసునికొడుకు: చూ, సూరుఁడు. 1; 2. రావణునిమంత్రి: చూ, సచివుఁడు.

శుక్కా. సం. వి. చ. (స్త్రీ). వగపు: చూ, శోకము.

శుక్తము. సం. వి. అ. న. 1: అభిషుతము, అవంతిసోమము, ఆరనాళకము-ఆరనాళము, కలి, కాంచికము-కాంజికము, కాంజి, కుంజలము-కుజలము, కుల్మాభిషుతము, కుల్మాషము-కుల్మాసము, గృహామ్లము, గృహశోరకము, గృహిణి, తండులాంబువు, తండులోదకము, తుషోదకము, ధాన్యామ్లము, వీరము, శుక్తము, శుక్లసారము, సిద్ధజలము, సౌవీరము. (తె): కూటినీళ్లు, పులగలి, పులికడుగు, పుల్లనీళ్లు. తద్వి.—౧: తండురీణము. (తె) కడుగు-కడ్డు, కలి, కాఁడి, కుడితి, పసగడుగు;

౨: (తె) ఒరగడుగు; ౩: (తె) కూరాడు, కూటినీళ్లు, తరవాణి (చూ, సాదము. (1).); ౪: శుక్తము; ౫: (విణ) (తె) పులి; ౬. (తె) పులిమెట్టు, మెట్టు, మెడుద, సిరకా. ("చూ, సౌవీరము. 1.") (చూ, సలిలము); 2: ఆమిషము-ఆమిషము-ఆమీషము, ఉద్ధసము, కర్దమము, కీరము, కుల్యము, క్రవ్యము, గోనసము, జ, జరూధము, జాంగలము, తరసము, పలము, పలలము, పిశితము, మాంసము, శల్కము. (తె): అరుచి, ఈరు-ఈరువు, ఎఱచి, కండ, కలిమము, కవుచే-కాచే-కాను, క్రొవ్వు, చిప్ప, చియ్య, నంజేడు, పెరసు, పొల-పొలను-పొలు (చూ, సాదము(1).). తద్వి.—౧. శ్రోత్రమునందు ప్రసిద్ధమైన మాంసమునకు:-బుక్కము; ౨: చూ, పప. 1; ౩. మాంసపుముద్దకు:- అర్బుదము, పేశి. (తె) కండ, దొబ్బ-ద్రొబ్బ, ముక్క; ౪. మాంస రజ్జుకు.- (చూ, కండరము); ౫: (చూ, సిర.1.); ౬. గోమాంసమునకు.- (తె) పెద్దపాల; ౭. కడుపులో నొకప్రక్కనుండెడి ఎఱ్ఱని మాంసమునకు.- కిమలము, క్లోమము, తిలకము; ౮: దుర్మాంసమునకు.- (తె) కుదుప, తస్స; ౯. ఉప్పుచేసిరి యొండఁబెట్టిన మాంసమునకు- (తె) ఉప్పుకండ-ఉప్పుఁగండ; ౧౦. ఎఱవేసిన మాంసమునకు.-తత్సము; ౧౧. దంతముల చుట్టునుండు మాంసమునకు.-(తె) చిగురు; ౧౨. విషము తిన్న పశువుయొక్క మాంసమునకు:-గృంజనము; ౧౩. పొగచిన మాంసపు ముక్కకు.-అభిషవము; ౧౪. ఎండిన మాంసమునకు.-ఉత్తప్తము, వల్లూరము, శుష్కమాంసము; ౧౫. ఇనుప సలాకను గ్రుచ్చి కాల్చినమాంసమునకు:- ఉత్తప్తము, శూల్యము. (తె). కఱకుట్లు-కఱుకుట్లు-కఱ్ఱకుట్లు-కఱ్ఱుకుట్లు; ౧౬. ఖండినంజేడుకు-వల్లూరము. ("చూ, సిర.1 "); పుం. 3: అంబ్లము- అమ్లము-అమ్లము, చుక్రము, పాచనము. (తె): పులి-పులును-పుల్ల-పుల్లన; విణ. 4. పుల్లనిది: (తె) పులి-పుల్ల-పుల్లన; 5. పరుషమైనది: చూ, శబ్దము.2; 6. పవిత్రమైనది: చూ, సమీచీనము. 2.

శుక్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. ముత్తెపుఁజిప్ప, సీపి: చూ, సంకు. 1; 2. శంఖము: చూ, సంకు. 1; 3. నత్తగుల్ల: చూ, సంకు. 1; 4. పెంచిక: చూ, శల్యము. 1; 5. ఏనుఁగుజేలగ: చూ, వేణివేధిని; 6. గుఱ్ఱపుసుడి: చూ, సుడి; 7. నేత్రరోగము: చూ, హానువు 4 (రోగము); 8 నఖమనుగంధద్రవ్యము: చూ, రాజార్హము; అం. 9: చూ, ఆవర్తరూపములు.

శుక్తిమంతము. సం. వి. త్. పుం. కులాచలము: చూ, కులపర్వతములు (పర్వతము.)

శుక్త్యంబుబిందున్యాయము. అం. ముత్యపుచిప్పలోఁ బడ్డ నీటిబిందువు ముత్యమగునను రీతి.

శుక్రమతమున వ్యూహాంగములు. అం: పక్షము, మధ్యము, పృష్ఠము, ప్రతిగ్రహము, కోటి [చూ, గురుమతమున వ్యూహాంగములు. (అనుబంధములో చూడుము).]

శుక్రము. సం. వి. అ. న. 1. (స్త్రీసందర్శనాదులచేత జాఱునది): చూ, రేతస్సు. 1; 2. కంటిపువ్వు: చూ, హార్షణము. 8; పుం. 3. జ్యేష్ఠమాసము: చూ, మాసములు; అం. 4: చూ, లక్షణాంగములు (పురుషుని రేతస్సు.-స్ఫటికమువలె తెల్లనై సుగంధమైనను, పద్మగంధమైనను, మదిరాగంధమైనను నృపతియగు. తేనెవాసనదైనను, మత్స్యగంధమైనను స్త్రీసంతతి గల్గును. ధనవంతుఁడగును. దుర్గంధమైన గోసమూహముగలవాఁ

జను. లాక్షాగంధమైనభోగి. మాంసగంధమైన దొంగ. వసగంధమైన వ్యవసాయకుఁడు. కటుగంధమైన దుర్బలుఁడు. దుర్గంధమైనను క్షారగంధమైనను నిత్య దరిద్రుఁడు. శీఘ్రముగశుక్లముపతనమైన దీర్ఘాయువు.చిరకాలపతనమైన నల్పాయువగు.) (శుక్లము=శుక్రము అని కొందఱు.)

శుక్రులుఁడు. సం. విశే. వీర్యవృద్ధిగలవాఁడు.

శుక్రవారము.అం.భృగువారము:చూ,వారములు.

శుక్రశిష్యుఁడు. సం. వి. అ. పుం. అసురుఁడు: చూ, రాక్షసుఁడు. 1.

శుక్రసంహిత. అం: చూ, సంహితలు. (చూ, వాఙ్మయము; చూ, వేదము.)

శుక్రుఁడు. సం. వి. అ. పుం. 1.=సుక్కురుఁడు-చుక్క. భార్గవుఁడు: చూ, రాహువు. 2; 2. నిప్పు: చూ, వహ్ని. 1; అం. 3: చూ, శాస్త్రప్రవర్తకులు.

శుక్ల. అం: చూ, సంవత్సరములు.

శుక్లకంద. సం. వి. అ. స్త్రీ: కంబుమాలిని, కంబుపుష్పి, మిత్తి, శంఖపుష్పి-శంఖపుష్పిక*.

శుక్లపక్షము. అం. శుద్ధపక్షము:చూ, శుక్లము.3.

శుక్లపాటల. సం. వి. అ. స్త్రీ. తెల్లకలిగొట్టు*: చూ, స్థాలి. 2.

శుక్లబ్రాహ్మణులు. అం. కన్యాకుబ్జులలో నొక తెగవారు. మాధ్యందినశాఖ. శుక్లయజుర్వేదము. గౌతమసూత్రము. ఈ శాఖలుగలవారై భోజనాదులు కలిగికొందఱును, సంబంధములుగలవారొకకొందఱునై ఒకరికంటె మఱియొకరు అధికులమనుకొనుచున్నారు: చూ, కన్యాకుబ్జులు (బ్రాహ్మణులు.)

శుక్లము. సం. వి. అ. న. 1. వెండి: చూ, లోహము. 1; పుం. 2. తెలుపు: చూ, వర్ణము. 6; 3. శుక్ల (శుద్ధ) పక్షము, మాసమునందు పూర్వపక్షము. (చూ, పక్షము. 1.)- తద్వి.-బహుళము. (చూ, పక్షము. 1.); విశే. 4. తెల్లనిది: చూ, వర్ణము. 6; అం. 5: చూ, ధాతువులు.

శుక్లవాల గౌడబ్రాహ్మణులు. అం. గౌడులలో నొకతెగవారు. శుక్లయజుర్వేదులు. కాణ్వమాధ్యందినశాఖలవారు. వీరిలో 'జోష్షీలు' 'ఒఝులు' అను రెండుశాఖలుకూడ గలవు: చూ, గౌడులు. [చూ, శుక్తము. 1..

శుక్లసారము. సం. వి. అ. పుం. పులికడుగు:

శుక్లయజుశ్శాఖా ప్రవర్తకులు. అం: వాజసనేయ, జాబాల, బౌధాయన, కాణ్వ, మాధ్యందిన, శాఫేయ, తాపనీయ, కపోల, పౌండరవత్స, ఆవటిక, పరమావటిక, పారాశర్య, వైణేయ, అర్ధ, బౌద్ధేయ అనునవి. (అనుబంధములో: చూ, కృష్ణయజుశ్శాఖా ప్రవర్తకుల శాఖలు.)

శుక్లిక. సం. వి. అ. స్త్రీ: అమ్లామ్లిక-అమ్లిక-అమ్లిక, అమ్లకము, అమ్లదళము, కృష్ణామ్లము, గురుపత్రి, ఘనచ్ఛాయ, చండము, చారిత్ర, చించ, చుక్రి-చుక్రము, తింతిడ, తింతిడి-తింతిడిక- తింతిడీకము- తింతిళి-తింతిళిక-తింత్రిణి- దంతశఠము, బహుపత్ర, సంధ్య. (తె): చింత*. తద్వి.- ౦:అమ్లము, చుక్రి, చుక్రము, చుక్రామ్లము, చుక్లము, చూడామ్లము, తింత్రిణీకము, వృక్షామ్లము. (తె)- చింతపండు; ౨. బరడుతో నుండుచింతపండును.-ఉట్టి, చింతఉట్టి, చింతగుల్ల.

శుచి. సం. వి. ఇ. పుం. 1.=చిచ్చు.నిప్పు: చూ, వహ్ని. 1; 2. ఉపధాశుద్ధుఁడైన మంత్రి: చూ, సచివుఁడు; 3. శృంగారరసము: చూ, రసములు; 4. గ్రీష్మఋతువు: చూ, మాసద్వయము; 5. జ్యేష్ఠమాసము: చూ, మాసము

లు; 6. ఆషాఢమాసము: చూ, మాసములు; 7. తెలుపు: చూ, వర్ణము. 6; 8: చూ, రేత స్సు. 1; విణ. 9. తెల్లనిది: చూ, వర్ణము. 8; 10. అనుపహతమైనది. (నాశమునొందనిది): చూ, నేగి; 11. పరిశుద్ధమైనది: చూ, శుద్ధము. 3; 12: చూ, శాశ్వతము; వి. 13. మడి: చూ, వర్తనము. 1.

శుచిత్వము. పా. (దీనికి ఉపమానము.—అగ్గి.)

శుచిర్భానువు. అం: చూ, శస్త్రములు.

శుద్ధజాతులు. అం: చూ, అంశములు.

శుద్ధతానములు. అం. ఇవి 28:—సహీనతానములు 7; రిహీనతానములు 7; పహీనతానములు 7; నిహీనతానములు 7: చూ, తానములు. 1376 పొరట.

శుద్ధనాంది. అం. నాందిద్వివిధము:—శుద్ధనాంది, క్రియానాంది. (కేవల పద్యపూర్వక దేవతాస్తుతి శుద్ధనాంది. ఈస్తుతిపద్యమునం"దాశీ, ర్నమస్క్రియా, వస్తునిర్దేశ" ములలో నొకటియుండును): చూ, నాంది.

శుద్ధపద్ధతి. అం: చూ, ఉద్ధతము.

శుద్ధభిన్న. అం: చూ, భిన్నపంచమజభాషలు.

శుద్ధమధ్య. అం: చూ, మధ్యమగ్రామగతమూర్ఛనలు.

శుద్ధమాళవి. అం: చూ, మాళవకైశికిజభాషలు.

శుద్ధము. సం. వి. అ. పుం.=సుద్దము. 1. తెలుపు: చూ, వర్ణము. 6; విణ. 2. తెల్లనిది: చూ, వర్ణము. 6; 3. పరిశుద్ధమైనది: చూ, సమీచీనము. 2; 4. దోషములేనిది: చూ, సమీచీనము. 2; 5. కేవలము: చూ, సర్వము; అం. 6. సూచ్యములైదింటిలో నిడగు విష్కంభము. శుద్ధము సంకీర్ణమునని ద్వివిధము. అందుశుద్ధ మొకటి: చూ, సూచ్యము (చూ, విష్కంభము. 8.); 7: చూ, ఆశ్వాసంచారమార్గములు; 8: చూ, భిన్నషడ్జకజభాషలు.

శుద్ధమూర్ఛన. అం: చూ, అవాంతరభేదములు.

శుద్ధమాళి. అం: చూ, పంచమషాడవజభాషలు.

శుద్ధవరాటి. అం: చూ, వృత్తము. 1. ("మ-స-జ-గురువులు. 6యతి. 10 ఛందస్సు.")

శుద్ధాంతము. సం. వి. అ. పుం. 1. అంతఃపురము: చూ, సదనము. 1; 2. అంతఃపురస్త్రీ: చూ, స్త్రీ; 3. రాజుయొక్క యేకాంతస్థలము: చూ, స్థానము. 1; 4. వెనుకటి తొట్టికట్టు: చూ, సదనము. 1.

శుద్ధాచమనము. సం. వి. అ. న: ఆచమనము, ఆచాంతి, ఆపోశనము, ఉపస్పర్శనము—ఉపస్పర్శము. (తె) అపోసానము—అపొసనము—అపోసనము—అపోసము, వారుపు—వార్పు.

శుద్ధాత్మ. అం: చూ, ఆత్మలు.

శుద్ధి. సం. వి. ఇ. స్త్రీ.=సుద్ది. శుద్ధిచేయుట: చూ, శోధనము. 1; 2. మార్జనము: చూ, రుద్దుడు.

శుద్ధుఁడు. సం. విణ: అగ్ని, అమలుఁడు, అర్యుఁడు—ఆర్యుఁడు, ఆప్తుఁడు, ఆచార్యుఁడు, పరిశుద్ధుఁడు, పవిత్రుఁడు, పావకుఁడు, పావనుఁడు, పూతాత్ముఁడు, పూజనీయుఁడు, పూజ్యుఁడు, పూతుఁడు, ప్రతీక్ష్యుఁడు, ప్రయతుఁడు, మహనీయుఁడు. (తె): అయ—అయ్య, అయగారు— అయ్యగారు— అయవారు—అయ్యవారు, నాన్న, నాయన, బాబయ్య, బాబు, సుద్దికాఁడు. ("చూ, సన్మానితుఁడు.")

శుద్ధులు. అం: మనశ్శుద్ధి, వాక్శుద్ధి, భాండశుద్ధి (3).

శునకము. సం. వి. అ. పుం: కుక్క. (ఇట్టుటుఁదిరుగునది): అరతత్రపము, అస్థిభక్షము, ఇంద్రమహకామకము, ఉదగ్రధము, కపిలము, కుకురము—కుర్కురము, కుక్కుటము,

కుక్కురము, కృతజ్ఞము, కాలేయకము, గ్రామమృగము, గృహమృగము, దీర్ఘసురతము, పత్రిఖరము, భషకము, భైరవుఁడు, మండలము, మండలి, మృగదంశకము, రతనాలిట్టు, రతపత్రిణము, వక్రపుచ్ఛము, వాంతాదము, విలోమము, వృకము, శయాలువు-శయాళువు, శాలామృగము, శుని, శ్వానము, సారమేయము, సాలావృకము-శాలావృకము, సూచకము. (తె): ఏపి-వేఁపి, కుక్క, జోగిలము, మొఱుగుపాకు మెకము, తద్వి:—౧. ఆఁడుకుక్కకు.-తుంబురి, శుని, సరమ; ౨: (తె) నీరుకుక్క; ౩: అలర్కము, యోగిలము. (తె) పిచ్చికుక్క, వెఱ్ఱికుక్క; ౪: సరమ; ౫: విశ్వకద్రువు. (తె): జోగిలము,జోడఁగి-జోఁణఁగి.-సోనంగి, వేఁటకుక్క; ౬. మొఱిగెడికుక్కకు:-సూచకము. (తె) రేసు-ఱేఁచే; ౭: (తె) ఊడుపకుక్క; ౮: (తె) కంచెమేపమారము; ౯:(తె) కాఱ్చిచ్చు; ౧౦: (తె) గడివోతు; ౧౧:(తె) దొంగలమిండగీఁడు; ౧౨: (తె) బురుకఁడు; ౧౩: (తె) మొఱసడము; ౧౪: (తె) రణబేరు; ౧౫: చూ, పిడఁగి. 2; ౧౬: శునీరము.

శునాసీరుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రుఁడు: చూ, సహస్రాక్షుఁడు.

శుని. సం. వి. ఇ. పుం. 1. కుక్క: చూ, శునకము; ఈ. స్త్రీ. 2. ఆఁడుకుక్క: చూ, శునకము.

శునీరము. సం. వి. అ. పుం. ఆఁడుకుక్కలసమూహము: చూ, శునకము. ౧౬.

శుభంకరుఁడు. సం. విణ: అరిష్టతాతి, ఉపకర్త, ఉపకారి, భ్రా, క్షేమకర్త, క్షేమకారుఁడు, క్షేమంకరుఁడు, గోప్తుఁడు, మద్రంకరుఁడు, శంకరుఁడు, శివంకరుఁడు, శివతాతి. (తె) అక్కఱకాఁడు, మేలుకాఁడు, మేలుచేయువాఁడు. తద్వి.—కృతజ్ఞుఁడు.

శుభంయువు. సం. విణ. (ఉ). శుభముతోఁగూడుకొన్నవాఁడు: శుభాన్వితుఁడు. [శుభము 4.

శుభకరము. సం. విణ. మంగళ్యము: చూ,

శుభకృత్తు. అం: చూ, సంవత్సరములు.

శుభదంతి. సం. వి. ఈ. స్త్రీ. రూ-శుభ్రదంతి-సుదంతి. వాయువుదిక్కునందలి ఆఁడేనుఁగు: చూ, హస్తి; విణ. 2. చక్కనిపండ్లుగలది.

శుభము. సం. వి. అ. న. 1. సేమము: అరిష్టము, అవ్యయము, ఋతి, కల్యాణము, కుశలము-కుసలము-కుసలము, కౌతుకము, క్షు, క్షేమము, గోజాకరికము, వ, పరిణామము, భద్రము, భవము-భకారకము-భవుకము-భవితవ్యము, భవిష్యము, భవ్యము, భావుకము, మంగళము, రిష్టము, శస్తము, శివము, శుభము, శ్వశ్శ్రేయసము, శ్రేయము. సుకృతము, సూనృతము, స్వస్తి. (అవ్య): అథ-అస్తు, తథా, ఈ, శమ్. శుభము. (తె):-చేల్లన, నెమ్మి, వంతు, బాగు, బనిసి-బైసి, మేల్-మేలు, లగ్గు, లెస్స, వాసి, సేమము, సోబనము. తద్వి.—౧. పైపైవచ్చిన మేలునకు.-కౌతుకము("చూ, స్వస్తి.") (శుభముకానిది=కృతాంతము);౨: పతాక, సౌభాగ్యము; పుం. అం. 2: చూ, యోగములు; 3. ఏడరత్నులపొడుగును తొమ్మిదియరత్నుల నిడుపును పదియరత్నుల వెడల్పునుగల యేనుఁగు (ఇది క్షేమకరము): చూ, హస్తి; అం. 4: చూ, తారలు; విణ. 4. మంగళకరమైనది: ఉపకార్య, కల్యాణము, ద్రవ్యము, భద్రము, మంగళ్యము, శస్తము, శివము, శుభకరము, శుభము, శ్వశ్శ్రేయసము. (తె): తిరు, మేలు; అవ్య. 5. మేలు: చూ, శుభము. 1; వి. అ. న. 6: చూ, వివాహము. (వా.)

శుభలేఖ. వా. సం. వి. ఆ. స్త్రీ: లగ్నపత్రిక.

శుభాంశము. అం: చూ, షష్ట్యంశములు.

శుభాంశుఁడు. సం. వి. అ. పుం. (రూ-శుభాంశువు-శుభ్రాంశువు- శుభ్రమాంశుఁడు-శుభ్రాంశుఁడు): చంద్రుఁడు: చూ, హిమాంశువు.

శుభాగతమగు. మి. అ. క్రి: (తె) అచ్చివచ్చు-అయివచ్చు-ఐవచ్చు,ఒమ్మికచ్చు,మేలైవచ్చు.

శుభాగతము. సం. వి అ. న: (తె) అచ్చుదల.

శుభాగముపంచకము. అం: చూ, తంత్రములు.

శుభావర్తములు. అం. అశ్వశాస్త్రములోనివి:-ఆవర్తములు శుభములని-యశుభములని ద్వివిధము. శుభావర్తములలో దశధ్రువలు ప్రసిద్ధములు: (చూ, ధృవస్థానములు: చూ, ఆవర్తరూపములు. ఇవిగాక మిగిలిన శుభావర్తములకు ఆగంతుకములని నామములు: చూ, ఆగంతుకములు. 65తెపొరట)

శుభోదయము. సం. వి. అ. పుం:అభ్యుదయము. వివర్ధనము, వృద్ధి. (తె): తెలుపు, మేలుకనుపు-మేల్కనుపు, మేలుకొలుపు- మేల్కొలుపు. తద్వి.—(స. క్రి.) ప్రబోధించు.

శుభ్రవంతి. అం: చూ, దిగ్గజభార్యలు.

శుభ్రము. సం. వి. అ. న. 1: అభ్రకము, అభ్రము, అమలము, ఖమ్, గిరిజము, గిరిజామలము, గైరికము, నిర్మలము, నీరకము, పర్వతోద్భూతము, విమలము. (తె): కాకిబంగారము, బేగడ, ముచ్చెబంగారు; పుం. 2. తెలుపు: చూ,వర్ణము.6;అం. 3: చూ, రోగములు; విణ. 4. తెల్లనిది: చూ, వర్ణము.6; 5. ప్రకాశించునది: చూ, శోభితము; వా. 6. ఒబ్బిడి; 7 పరిశుభ్రము; 8. నిర్మలము.

శుభ్రాంశువు.సం.వి.ఉ. పుం: చూ,శుభాంశుఁడు.

శుల్కము. సం. వి. అ. పుం, న. 1.=సుంకము: సుంకము. (తె) అసువు, దానము, సుంకము (చూ, పిస్తు. 1.); 2.=సంకు: కన్యాశుల్కము. (తె): ఉంకువు, ఉంకువ-ఉంకువు, ఓలి, పయిఁడి-పైఁడి, ప్రెండి, సంకు-సంకుము, సుంకము; (శుల్కము కన్యాశుల్కము వరశుల్కముఅని ద్వివిధము.); 3.=సంకు. వేశ్యకిచ్చెడి రోయి: భోగము. (తె): పయిఁడి-పైఁడి, భోగము, రో-రోయి-రోయివి; అం. 4: చూ, తంత్రములు.

శుల్కహారి. సం. వి. ఇ. పుం.=సుంకరి. పన్ను వసూలుచేయువాఁడు: చూ, సుంకరి.

శుల్బపత్రిక. సం. వి. అ. స్త్రీ. జీవపత్రిక*: చూ, శకుల.

శుల్బము. సం. వి. అ. న. 1. రాజి: చూ, లోహము. 1; 2. త్రాడు: చూ, సూత్రము. 1; 3=చెంబు. చేతిపాత్రము: చూ, వారివాణము (పాత్రము 6-౧౭.)

శుశ్రూష. సం. వి. అ. స్త్రీ. 1. వినవిచ్ఛ: చూ, వాంఛ; 2: చూ, సేవ. 1; 3. చెప్పుట:చూ, శంసనము. 1.

శుశ్రూషకుఁడు. సం. వి. అ. పుం. శుశ్రూషచేయువాఁడు: చూ, శిష్యుఁడు. [భావము (4)

శుశ్రూషలు. అం: ఆత్మ, అంగము, స్థానము,

శుషిర. సం. వి. అ. స్త్రీ. రూ-సుషిర. సుష్వగుత్తిక*: చూ, రాజార్హము.

శుష్కగోమయము. సం. వి. అ. పుం: చూ, పిడక. తద్వి.—౧.ముద్దపిడకకు — (తె) ముటము-మూటము; ౨.అప్పుడు పుట్టినదూడ పేఁడకు.—(తె): రేణము. (చూ,శమలము.)

శుష్కతటాకమత్స్యన్యాయము. అం. ఒకన్యాయము. [సొరుగాకు.

శుష్కపత్రము, సం. వి.అ. న. ఎండాకు: చూ,

శుష్కమాంసము. సం. వి. అ. న. వల్లూరము: చూ, శుక్తము. 2.

శుష్కము. సం. వి. అ. న. 1. వంటచెఱకు: చూ, సమిధ. 2;విణ. 2. ఎండినది: అస్కం

డనము, కాహళము, శుష్మము. (తె): అరవరలు, ఇంకుట-ఇంకుడు, నిట్టు-నిట్రు; 3: కేవలము: చూ, సర్వము; 4. వట్టిది: చూ, శూన్యము. 1.

శుష్కాశని. అం: చూ, అస్త్రములు.

శుష్కించు. సం. అ. క్రి. 1. ఇంకు: చూ, శోషించు. 1; 2. ఎండు: చూ, శోషించు. 2. తద్వి.-మిక్కిలిఎండు:- (తె) వఱువట్టుగొను.

శుష్కీభవించు. సం. అ. క్రి.—పై.—

శుష్మము. సం. వి. న. న. 1. బలిమి: చూ, శక్తి. 1; 2. తేజస్సు: చూ, వెలుతురు. 1; న. పుం. 3. నిప్పు: చూ, వహ్ని. 1; వి. 4. ఎండినది: చూ, శుష్కము. 2; 5. కేవలము: చూ, సర్వము; 6. వట్టిది: చూ, శూన్యము. 1.

## శూ

శూకకీటము. సం. వి. అ. పుం. 1: కండోఘ్నము, కంబళము, వృశ్చికము. (తె): కంబళిపురుగు, గొంగళిపురుగు; 2. కడుఁదురీఁగ: చూ, మక్షిక; 3. నల్లతేలు: చూ, వృశ్చికము.

శూకధాన్యము. అం. యవలులోనగునది: చూ, స్తంబకరి (ధాన్యము. 3 ౫.)

శూకపుట్టము. సం. వి. అ. పుం. రూ-శూకాపుట్టము. నీలము: చూ, రత్నములు.

శూకము. సం. వి. అ. పుం, న. 1. తేలుకొండి: చూ, వృశ్చికము. 2; 2. వరిముల్లు: చూ, సితాగ్రము; 3. కనికరము: చూ, హార్దము. 2.

శూకరము. అం: చూ, నరకములు.

శూకలము. సం. వి. అ. పుం. శిక్షింపఁబడిన దుష్టాశ్వము: చూ, హయము.

శూకశింబ. సం. వి. ఆ. స్త్రీ. రూ-శూకశింబి-శూకశింబిక, అజహా, అవ్యండ, ఆత్మగుప్త, ఋశ్య, ఋశ్యప్రోక్త-ఋష్యప్రోక్త, ఋషభి, కండుర-కండూర, కండూకరి, కండువు, కచ్ఛూమతి, కపికచ్ఛుర, కపికచ్ఛువు-కపీకచ్ఛువు, కపిచ్రిభ, కపిరోమఫల, కరీర, కులక్షయ, ఖంఖ, గర్భఘాతిని, గాత్రభంగ, గుప్త, జహా, జాంగలి, దూలవిగ్రహ, ప్రావృషాయణి, మర్కటి, లోమశ, వింఖ, వృష. (తె): తీఁటకోవెల, దురదగొండి, దురదగోవెల, దూలకొండి-దూలగొండి, దూలగోవెల*. తద్వి:-గ: పిన్నదూలగోవెల; అ: మహాత్మగుప్త. (తె) పెద్దదూలగోవెల *.

శూకశింబి. సం. వి. ఈ. స్త్రీ.—పై.—

శూకశింబిక. సం. వి. ఆ. స్త్రీ.—పై.—

శూకాపుట్టము. సం. వి. అ. పుం: చూ, రూ-శూకపుట్టము.

శూద్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. శూద్రజాతిఆఁడుది: వృషలి; 2. శూద్రజాతి: చూ, సంతతి. 1.

శూద్రకుఁడు. సం. వి. అ. పుం. అగ్నిమిత్రుఁడు: చూ, రాజు.

శూద్రబ్రాహ్మణులు. అం: "కృషిసేవాధమాచారో ధాన్యసంగ్రహతత్పరః। గోపోషణవిశేషజ్ఞస్సవిప్రశ్శూద్రఉచ్యతే." (కృషిసేవాపరులై అధమమగు ఆచారపరులై ధాన్యసంగ్రహామందతిలోలులై గోపోషణపరులై కుక్షింభరణపారీణులగువారే శూద్రబ్రాహ్మణులు: చూ, దశవిధబ్రాహ్మణులు.

శూద్రి. సం. వి. ఈ. స్త్రీ. 1. శూద్రునిభార్య: చూ, భార్య. 1-౫౯; 2. శూద్రస్త్రీ: చూ, స్త్రీ.

శూద్రులు. అం: చూ, మనుష్య వర్ణములు.

శూద్రుఁడు. సం. వి. అ. పుం. 1: అవరవర్ణుఁడు, కర్మవజ్రుఁడు, తపప్రియుఁడు, జఘన్యజుఁడు, దాసుఁడు, పద్యుఁడు, వృషలుఁడు-

(తె): అడుసుపుట్టువు-అడుసుఁబుట్టువు, కలపతాల్పు, కాఁపు, కాలిపుట్టువు, చేవుదరి-చాదరి, తుదకులము నేర్పరి, నాలవకొలము వాఁడు, మినువాఁకతోఁబుట్టువు. తద్వి.—౧: (తె) దాసరి; ౨: (తె) తవిదుదాసరి; 3: (తె) తెలగా (బ.) తెలగలు-తెలగాలు; ౪: (తె) బలిజె- బలిజెవాఁడు-బజ్జెవాఁడు; ౫: (తె)నాయఁడు; ౬: (తె)రెడ్డు; ౭:(తె) కమ్మలు;౮: సచ్ఛూద్రుఁడు; ౯ గొల్లకు:-చూ, వేఁడు; మొదలగువారు); అం. 2: చూ, జాతులు; 3: చూ,మనుష్యవర్ణములు;4: చూ, చేతనరత్నములు.

శూనాగము. సం. వి. అ. పుం. 1. కుక్కరొయిక్కపాలు: చూ, స్తన్యము;బ. 2.పాముగుడ్లు·

శూన్య. సం.వి.అ.స్త్రీ.మల్లె*: చూ, వాసంతి 2.

శూన్యనివేశనము. అం: చూ, అష్టవర్గము.

శూన్యమగు. వి. అ. క్రి: (తె). ఈటువోవు, ఉత్తదగు, రిత్తవోవు, వట్టిదగు.

శూన్యము. సం. వి, అ. న. 1.=సున్న. ఏమియు లేమి: అపదార్థము, అభావము, ఖ, ఖమ్, ఖంబు, త, వ, రిక్తకము, రిక్తము, రిష్టము, వశికము, వితానము, తుచ్ఛము-తుచ్ఛ్రము, సూవము. (అవ్య): అ, అన-అనా, కిమ్, నఞ్. (తె): ఈటు, ఉత్త, ఉళక్కి-ఉళ్లక్కి-హుళక్కి, ఎద్దడి, కాకు, కీత, కుందేటికొమ్ము, గొడ్డు, చెనఁటి-చెన్నఁటి, దోయిడి, నిప్పచ్చరము, పచ్చచుపాడు, పాడు, బయలు, బరిగి, బీడు, బెబ్బె, బొప్పటము, బొల్ల, రిచ్చ, రిచ్చపాటు, రిత్త, లేదు, లేబరము, లొటారము, వట్టి, సున్న, సోడు. తద్వి.—౧. రాహిత్యము. (తె): లేమి-లేమిడి-లేవడి; ౨: కాకాదు, లేలేదు; విశ. 2: (వి) ఎత్తుభారము. (తె) పాడు; అం. 3: చూ, సంచారిభావమునఁబుట్టిన దృ

ష్టులు; 4: చూ, పారిజాతయానము.

శూరణము. సం. వి. అ. పుం. కంద*: చూ, రూ-సూరణము.

శూరసేనము. అం: చూ, దేశములు.

శూరుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, సూర్యుఁడు; 2. ఒకానొకగొల్లవాఁడు: చూ, శౌరిఁడు; విశ. 3.=చేఁటకరి. యుద్ధమునకు భయపడనివాఁడు: చూ, వాంవీరుఁడు. 2: 4. పాణ్డుఁడు: చూ, సమర్థుఁడు; వా. 5: బిరుదాఢ్యుఁడు. (తె) బిరుదాయత్తు, బిరుదారి-బిరుదులాఁడు.

శూర్పకారాతి. సం. వి. ఇ. పుం: చూ, పుష్పదుధన్వుఁడు (మన్మథుఁడు.)

శూర్పణఖ. సం. వి. అ. స్త్రీ.=చేప్పనక-చేప్పనాక-చేప్పనాతి- సుప్పనక - సుప్పనాక, సుప్పనాతి, చేటగోళ్లబోటి, రావణుని సోదరి: చూ, రాక్షసి.

శూర్పము. సం. వి. అ. పుం, న. 1. రూ-సూర్పము, ప్రస్ఫోటనము. (తె) చేట. తద్వి.-బాలికలాడుకొనుచిన్న చేటకు.-(తె) మొంటె-మొఱఁటె- మొఱఁటి-మొంటి; 2. రెండుమున్తలకొలఁది. [కర్ణి:చూ, ద్రోణి. 3.

శూర్మి. సం. వి. ఈ. స్త్రీ. లోహప్రతిమ.

శూల. సం. వి. ఆ. స్త్రీ. 1=సూల. కొఱ్ఱు. చూ, శూలము. 4; 2: చూ, వేశ్య; 3. డొక్కయందలిపోటు: చూ, శూలము. 5; వా. వి. 4. వాతదోషము.

శూలదృక్కు. సం. వి.హ్.స్త్రీ:చూ,పార్వతి. 1.

శూలపాణి. సం. వి. ఇ. పుం: చూ, శివుఁడు.

శూలము. సం. వి. అ. న. 1. అమ్మకము: చూ, వెల. 1; పుం, న. 2. మూమొనవాలు: చూ, బాణము. 1; 3. శ్రీలమను బాణము: చూ, బాణము. 1; 4. రూ-శూల, అచలము, కీలము, కేల, శంకువు, శల్యము, శివకము, శివము, స్థాణువు. (తె): కొఱు-కొఱ్ఱు, గసి

గసిక, గూటము-గూటాము, చీల, జెంజెడ, మేకు, వసి, సీమ. తద్వి — (తె) తలచీల; (గుండుసూది, తీఁగమేకు, వాసముమేకు, ద బ్బనము, సూది మున్నగునవియీజాతియందు చేరును.); 5. శూల, డొక్కలోనిపోటు: చూ, వానువు. 4 (రోగము. 1.); 6: చావు: చూ, సావు; 7: చూ, సిడము; అం. 8: చూ, ము ప్పదిరెండాయుధములు; 9: చూ, యోగములు.

శూలాకృతము. సం. విణ. కఱకట్లు: చూ, శు క్తము 2.

శూలి. సం. వి. న్. పుం. 1: చూ, శూలపాణి; విణ. 2. శూలాయుధముధరించినవాఁడు; 3. శూలరోగి.

శూలించే. వా అ. క్రి. డొక్కలోనొప్పియెత్తు.

శూలిని. సం. వి. ఈ. స్త్రీ: నాగిని, మత్స్యా క్షి, లక్ష్మి. (తె) గొల్లజిడ్డు, నాగురు-నావురు*.

శూలుచితము. అం: చూ, ఉత్తానకరణబంధములు.

శూల్యము. సం. విణ: చూ, శూలాకృతము.

## శృ

శృంఖల. సం. వి. అ. స్త్రీ. రూ-శృంఖలము.= సంకెల-సంకళియ. 1. మగవాని మొలనూలు: చూ, నూత్రిము. 1; 2. ఏనుఁగుకాలిసంకె ల: అంకుకము, అందువు, కలాపకము, త్రి యి, త్రిపది, నిగడము-నిగళము, పారి, (తె) ఒరిజే-ఒరిజె, గొలుసు, చేరు-చేఱు, బారి-బారీ; 3. కాలియినుపగొలుసు: అందు కము, నిగడము-నిగళము, పారి, రూ-శృం ఖలి-శృంఖలిక-శృంఖలిక. (తె) సంకళియ-సంకెల, అరదండ-(బ) అరదం డాలు, గొలుసు, చేరు-చేఱు, బారి-బారీ, (బ) బేడీలు. తద్వి. —౧. చేతియినుపగొలుసు: (చూ, శృంఖల. 3.); ౨. నడుమునకుఁగట్టెడి గొలుసు: కటిశృంఖల, చిత్తిక.

శృంఖలకము. సం. వి. అ. పుం. కాళ్లకు బ్రాం దకొయ్యవేసిన యొంటెపిల్ల: శృంఖలము (చూ, లొట్టిపిట్ట.). తద్వి. — ౧. ఒంటెకు:- అంబొష్టము; (చూ, లొట్టిపిట్ట); ౨. ఆఁడు ఒంటెకు:- (తె) వామి (చూ, లొట్టిపిట్ట); 3. ఒంటెపిల్లకు:— శరభము: (చూ, లొట్టిపిట్ట.)

శృంఖలము. సం. వి. అ. పుం, న: చూ, శృంఖ ల 1-2-3; 4: చూ, శృంఖలకము.

శృంఖలిక. సం. వి. ఆ. స్త్రీ: చూ, శృంఖల. 3.

శృంఖలితము. సం. విణ. సంకెలవేయఁబడినది.

శృంఖలి. సం. వి. ఈ. స్త్రీ: చూ, శృంఖల 3.

శృంఖలిక. సం వి. ఆ. స్త్రీ: చూ, రూ-శృంఖలిక.

శృంగకాద్యభ్రియోగము. అం: చూ, తంత్రములు.

శృంగనాదము. సం. వి. అ. న. = సింగినాదము. కొమ్మువాద్యము: చూ, సింగినాదము.

శృంగబేరము. సం. వి. అ. న: రూ-శృంగిబేర ము, ఆర్ద్రికము-ఆర్ద్రిము, ఓలము-ఓల్లము, కందరము, కటుకందము, కటుభంగము, క టుభద్రము, కటూత్కటకము-కటూత్క ము, గుల్మమూలము, భేషజము. (తె) అల్ల ము. తద్వి. —౧: తృణపుష్పిక. (తె) కొం డల్లము; ౨: (తె) కస్తూరిపసుపు, మామిడి అల్లము (చూ, వేరు. 1.) (చూ, సొంటి.) (దేశవాళీఅల్లము, రంగూను (విదేశపు) అల్ల ము మున్నగునవి కలవు.) [చూ, సుమంగళి.

శృంగబేరి. సం. వి. ఈ. స్త్రీ. కోలపాల*:

శృంగభస్మము. అం: చూ, భస్మములు.

శృంగము. సం. వి. అ. న. 1. కూణిక, లలాను ము, విషాణము: చూ, పోనువు. (చూ, ప ల్లి. 1.). తద్వి. —ఏనుఁగుకొమ్మునకును, మేఁ కకొమ్మునకును; పందికోఱకును, ఎద్దులోన గువానికొమ్మునకును: చూ, పోనువు (పల్లి. 1.); 2. కొండకొమ్ము: చూ, శిఖరము;

3: నాళము. (తె): అండియ-అండె,కొమ్ము, చిమ్మనగొట్టము, చిమ్మనగ్రోవి, పింజెనగ్రోవి, బుఱటకొమ్ము-బుఱ్ఱటకొమ్ము- బుఱ్ఱకొమ్ము; 4. గుఱుతు: చూ, లక్షణము; 5. దొరతనము: చూ, స్వారాజ్యము; 6. ప్రధానత్వము: ప్రాధాన్యము, పుం. 7. జీవకమను గంధద్రవ్యము: చూ, రాజార్హము; అం. 8: చూ, సుషిరవాద్యములు.

శృంగాటకము. సం. వి. అ. న. 1. చేదుకము: చూ, మార్గము. 1-౧౭; పుం. 2. జలకంటకము, త్రిశృంగము. (తె) పందిగడ్డ, పరికి, పరికెగడ్డ;అం.3: చూ,అసంయుతహస్తములు.

శృంగారచేష్టలు. అం: భావము, హావము, హేల, విలాసము, మాధుర్యము, ధైర్యము, విభ్రమము, లీల, కిలకించితము-(కిలికించితము-కీలికించితము), మోట్టాయితము, లలితము, విచ్ఛిత్తి, బిబ్బోకము, విహృతము, చకితము, హసితము, కుట్టమితము-కుట్టిమితము, కుతూహలము (18). తద్వి.—౧: ప్రాగల్భ్యము; ౨: (తె)బయకారము.

శృంగారతిలకము. అం: చూ, రూపకములు.

శృంగారనాయకచతుష్టయము. అం. (శృంగారనాయకులు): అనుకూలుఁడు, దక్షిణుఁడు, ధృష్టుఁడు, శఠుఁడు (4) (చూ, నాయకులు.)

శృంగారభూషణము.అం. (భాణుఁడు(వానెను): చూ, కావ్యనాటకములు.

శృంగారము. సం. వి. అ. న. 1. గందపొడి: చూ, సురుము; 2. లవంగపువ్వు: చూ, శ్రీసంజ్ఞము (లవంగము); 3: చూ, సిందూరము; పుం. అం. 4:చూ,రసములు; న. 5. ఏనుఁగుఅలంకారము: చూ,హస్తి; 6.=చొకాటము, అందము:చూ, సౌందర్యము, 7.=సింగారము, అలంకారము, కైసేఁత:చూ, భావనిక. 2(భూషణము. 2.); 7.సురతము:చూ, సంయోగము; అం. 8:చూ, జన్యతాళము

శృంగారయోని.సం.వి.ఇ.పుం: చూ,మన్మథుఁడు

శృంగారవనము. సం. వి. అ. న. ఉద్యానవ తోఁట: చూ, పూఁదోఁట (వనము. 2

శృంగారి. సం. వి. న్. పుం. 1: చూ, విటుడు 1; 2. ఏనుఁగు: చూ, హస్తి. 3. పోఁ మ్రాను*: చూ, స్రింసి. 1 (పోఁక); వి 4. శృంగారముగలవాఁడు: చూ, సౌంద వంతుఁడు. [భావణించె

శృంగారించె. సం. స. క్రి.=సింగారించె: చు

శృంగి. సం. వి. ఈ. స్త్రీ. 1. రూ-శృంగి అతివస*:చూ, విష; 2. పాఁపమీను, కొ చేఁప: చూ, మత్స్యము 1; 3. శృంగిక కము-శృంగీకనకము, కడియ లోనగు భూషణరూపమైన బంగారు: చూ హొన్ను (లోహము. 1-౫); న్. పు 4. ఏనుఁగు: చూ, హస్తి; 5. కొండ: చూ పర్వతము, 6. మ్రాను: చూ, వృక్షవ 7. వృషభమనెడియోషధి*: ఇంద్రాక్షవ వృషభ; వా. 8.=సింగి. చెంబేది: (తె) గి; 9.=సింగి. ఎఱుకుది: (సం) శృంగి; వి 10. కొమ్ముగలది; అం. 11: చూ, వర్ణ తములు. 1-2.

శృంగిక. సం. వి. ఆ. స్త్రీ: చూ, శృంగి. 1.

శృంగికనకము. సం. వి. అ. న: చూ, శృంగి.

శృంగిణి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆవు: చూ ధేనువు; 2.=సింగాణి-సింగిణి, శృంగధ న్సు: చూ, హేతి. 4 (బాణము. 1-3

శృంగిబేరము. సం. వి. అ.న:చూ, రూ-శృం బేరము. * [శృంగికనక

శృంగీకనకము. సం. వి. అ. న: చూ, రు

శృగాలము. సం. వి. అ. పుం. నక్క: చ రూ-సృగాలము. [లోనగున

శృతము. సం. వి.౩. కాఁచఁబడినది (పాలు మొ

## శే

శేఖరము. సం. వి. అ. పుం. 1. సిగదండ: చూ, భూషణము. 2; 2. బాసికదండ, బాసికము: చూ, వావణిక. 2 (భూషణము. 2-౧౧-(౧౪.)); 3.=సిగరము: చూ, శిఖరము. 1.

శేఖరించే. సం. అ. క్రి. గొప్పపడు. పంచ. నా. 1, ఆ. 308: చూ, సమ్మానించే.

శేఫము. సం. వి. అ. పుం, స్. న. (రూ-శేప ము-శేపస్సు-శేఫము-శేవము.) మగగుఱి: చూ, శిశ్నము. [వావిలి.

శేఫాలిక. సం. వి. ఆ. స్త్రీ. నల్లవావిలి*: చూ,

శేముషి. సం. వి. ఈ. స్త్రీ. బుద్ధి: చూ, వ్యాల్లేఖము. 2. [చూ, శ్వేతపుష్పము.

శేలుద్రుమము. సం. వి. అ. పుం. ఉలిమిడి*:

శేలువు. సం. వి. ఉ. పుం: చూ, శ్లేష్మాతకము*.

శేవధి. సం. వి. ఇ. పుం. రూ-సేవధి, నిధి: చూ, లబ్ధి. 2.

శేవలము. సం. వి. అ. న: చూ, రూ-శైవలము*.

శేవాలము. సం. వి. అ. న.—పై.—

శేష. సం. వి. ఆ. స్త్రీ. 1.=సేసలు. అనుగ్రహించి యిచ్చిన అక్షతలు లోనగునవి: చూ, సేసఁబ్రాలు; 2. అనుగ్రహించి అక్షతలు లోనగువానినిచ్చుట.

శేషము. సం. వి. అ. పుం, న. 1: అవశేషము, అవసాయము, భక్తి. (తె) కడమ, తక్కు, నిలవ-నిలువ-నిల్వ, బాకి-బాకీ, మిగత-మిగితి, మిగులు-మిపులు, లోతక్కువ, సచ్చేము-సాచ్చెము. తద్వి.—౧. (విణ) మిగిలినది అనుటకు.—అవశిష్టము, ఖిలము, చోక్షము, చోచము, పరిశిష్టము, శేషము, సారాంశము. (తె) నికరము, నిగ్గు, మిగిలినది, సాచ్చెము; ౨: యాచితకము. (తె): ఎరవు-ఎరువు, చేబదులు, పరచి, బాకీ. రో-రోయి; 3. ధాన్యాదులఋణమునకు.-ఋణము. (తె): అరువు-ఎరవు-ఎరువు, బాకి; పుం. 2. వధము: చూ, హింస. 1; విణ. 3. మిగిలినది: చూ, శేషము. 1.

శేషశయనుఁడు. సం. వి. అ. పుం. రూ-శేషసయనుఁడు: చూ, విష్ణువు. 1.

శేషసయనుఁడు. సం. వి. అ. పుం.—పై.—

శేషాచలము. సం. వి. అ. పుం. తిరుమల. (ఇట్లు శేషశైలము, శేషాద్రి మొ.): చూ, తిరుపతి.

శేషి. సం. వి. న్. పుం. అంశి. సర్వస్వతంత్రుఁడైన శ్రీమన్నారాయణుఁడు: చూ, విష్ణువు. 1.

శేషించే. సం. అ. క్రి: అవశేషించే. (తె): ఉండు, చిక్కు, నిలుచే-నిల్చు, మిగులు.

శేషిశేషసంబంధము. అం: చూ, సంబంధములు.

శేషుఁడు. సం. వి. అ. పుం. 1. సహస్రఫణములుగల సర్పరాజు: చూ, సర్పము; 2. బలరాముఁడు: చూ, హలాయుధుఁడు. 1.

## శై

శైక్షుఁడు. సం. వి. అ. పుం. క్రొత్తగావేదమునారంభించిన శిష్యుఁడు: చూ, శిష్యుఁడు. 1.

శైఖరికము. సం. వి. అ. పుం: అపామార్గము, అర్ధశయ్య, కటుమంజరిక, కాండీరము-కాండీరి, కిణి, కిణిహి, కీశవల్లి-కీశవల్లి, కీశపర్ణము-కీశపర్ణి-కేశపర్ణి, కుబ్జము, కోశాతకి, ఖరమంజరి, క్షవకము, క్షారమధ్యము, దురభిగ్రహము, ధామార్గవము, ప్రత్యక్పర్ణి-ప్రత్యక్పుష్పి, మయూరకము, వశిరము-వశిరము, శిఖరి. (తె) ఉత్తరేణి-ఉత్తరేను. తద్వి.—అపామార్గము, అష్టారక్తము, కపిప్పలి, క్షుద్రాపామార్గకము-క్షుద్రాపామా-

గ్గము, రక్తభిది. (తె) ఎఱ్ఱఉత్తరేణి*. (ఽం తరోగములుహరించును.)

శైత్యము. సం. వి. అ. న. 1. చేలువ: చూ, హిమము. 1; 2: శిశిరము, శీతము. (తె) ఇగము-ఇవము-ఈము, ఇవక, ఇవతాళిం పు, చేలవ-చేలువ-చేల్వ, చేలి, చేలిమిరి-చే ల్మిరి, చేలువడి, చేల్ల-చేల్లన, జేలుబు-జేలు వు, తనుపు-తన్పు, నజ్జో, వలి, వలిపిరి, సీతి-సీతు-సీతువు.

శైత్యించే. సం. అ. క్రి: శీతలించే. (తె) ఇవ తళించే-ఇవతాళించే, చేల్లనగు, చేల్లవడు, తనుపారు, తనువడు, వలిగొను.

శైథిల్యము. సం. వి. అ. న: చూ, శిథిలము.

శైనేయుఁడు. సం. వి. అ. పుం: సాత్యకి.

శైబికుఁడు. సం. వి. అ. పుం. బోయ: చూ, వ్యాధుఁడు. 1. (బెస్తఅనికొందఱు.)

శైలగోశ్రేణి. సం. వి. ఈ. స్త్రీ. నేలతంగేడు*: చూ, హేమపుష్పకము. 3.

శైలదీర్ఘకోణము. సం. వి. అ. న: అడవ, కోన.

శైలధన్వుఁడు. సం. వి. న్. పుం: చూ, శివుఁడు. (శైలిధన్వుఁడు అనికొందఱు)

శైలపూగము. సం. వి. అ. పుం. కారుపోఁక*: చూ, పోఁక. ౧.

శైలము. సం. వి. అ. న. 1: చూ, రసాంజనము; 2: చూ, తాపువ్వు; పుం. 3: చూ, పర్వతము; అం. 4: చూ, ఆసనములు. [ము.

శైలశిబిరము. సం. వి. అ. పుం. కడలి: చూ, సముద్ర

శైలాలి. సం. వి. న్. పుం: చూ, శైలూషుఁడు.

శైలూషము. సం. వి. అ. పుం. మారేడు*: చూ, శ్రీఫలము.

శైలూషి. సం. వి. ఈ. స్త్రీ. నట్టువురాలు: నర్తకి, లాసకి-లాసిక. (తె) ఆటకత్తియ-ఆటకత్తె: (చూ, స్త్రీ: చూ, ఆటవెలఁది.)

శైలూషుఁడు. సం. వి. అ. పుం: కుశాశ్వకుఁడు, కలాయనుఁడు, కృశాశ్వి, గీష్ణువు-గేష్ణువు, నటుఁడు, నర్తకుఁడు, రంగాజీవుఁడు, లాసకుఁడు. (తె) ఆటకాఁడు, నట్టు-నట్టుగుఁడు-నట్టువుఁడు-నట్టువకాఁడు-నట్టువాఁడు-నట్టువ-నట్టువు. తద్వి.—౧: కుశీలవుఁడు; ౨: (తె) కోణంగి-కోణాంగి, కోణంగివాఁడు; 3:(తె) బిద్దెమువాఁడు; ౪:(విణ) నర్తకుఁడు.

శైలేయము. సం. వి. అ. న. 1. ఇందుప్పు: చూ, సౌవర్చలము (లవణము. 1-౭౦); 2. మురయను గంధద్రవ్యము: చూ, రాజార్హము; 3: అశ్మపుష్పము, కాలానుసార్యము, వలితము, వృద్ధము, శీతశివము. (తె) రాపువ్వు, తాతిపూవు, తాపువ్వు*; పుం. 4. తేఁటి: చూ, షట్పదము; 5: కాలేయము.*: చూ, నదాప; విణ. 6. తాతితోసరియైనది.

శైలేయి. సం. వి. ఈ. స్త్రీ: చూ, పార్వతి.1.

శైవబ్రాహ్మణులు. అం. "వీరు శివపూజావృత్తి గలవారు. కృష్ణయజుశ్శాఖీయులు. ఆదిశైవులు. శైవవిశిష్టాద్వైతమతస్థులు. శ్రీకంఠ శివాచార్య సంప్రదాయులు. బోధాయన సూత్రము. కొందఱు ఆపస్తంబసూత్ర ప్రవర్తకులునుగలరు. వీరిలో అంతర్వేదితెగవారు కంచితెగవారు తిరువాలంగాడుతెగవారు వాలాజీపేటతెగవారని నాలుగుతెగ లుగలవు. వీరాంధ్రదేశమున గోదావరీ తీరమందుత్పత్తియై సామాన్యముగా ఆంధ్రదేశమందును విరివిగా దక్షిణదేశమందును వ్యాపించియుండిరి. శివాచార్యులు గురుకులు దీక్షితులు భట్టరు అనుబిరుదులుగలవారు. ఆత్మార్థ పరార్థ పూజలయందు శివుని ప్రధానముగా సర్చించేమే శివాలయ ప్రాకారాభ్యంతరమందుగల గణపతికుమారసారశాస్త్ర

దిమూర్తులను శివునియొక్క అవినాభావసంబంధముతో నర్చించెదరు. శివాలయమునకు వేరుగానున్న అన్యదేవతల నారాధింపరు. మతకోంపలు అద్వైదికులు ఉత్కళవంగదేశములనుండి వచ్చి నైజాంరాష్ట్రమందును అక్కడక్కడ ఆంధ్రదేశమందును శివార్చనచేయుచుండిరి. వీరికిని శైవబ్రాహ్మణులకును సహభోజనబాంధవ్యములులేవు."(చూ, బ్రాహ్మణులు; చూ, శాక్తేయబ్రాహ్మణులు; చూ, పట్టురబ్రాహ్మణులు; చూ, ముత్తదుబ్రాహ్మణులు.)

శైవము. సం. వి. అ. న. 1. శివుఁడే దేవుఁడను ఒకమతము: చూ, మతములు; విం. 2. శివసంబంధమైనది; అం. 3: చూ, పురాణములు (24000 శ్లో. వాయుదేవుఁడుకర్త. శివప్రతిపాద్యము.); 4: చూ, ఏకవింశతిస్థావకములు.

శైవలము. సం. వి. అ. న: (గా—శివాలము—శేవలము- శైవాలము-శైవలి, అత్యూహము, అరకము, ఆకాశమూలి, కార్త్రి, కావారము, కుంభి-కుంభిక-కుంభికము, కుతృణము, కుష్ఠహారి, ఖమూలిక-ఖమూలి, గాంగేయము, గ్లపిష్ట-ఘృష్టి, జంబాలము, జగ్గరము, జలకేశము, జలనీలి, జలవల్కలము, జలాంచలము, నీలిక, బదర, మంజులము, వారాహి, వారిచత్వరము, వారిపర్ణి, వారిమూలి, వితున్నకము, విష్వక్సేనప్రియ, వ్యవక. (తె): నీటిపాఁచి. తద్వి—౧: (తె) ఆకుపాఁచి; ౨: (తె) తీఁగపాఁచి, నాఁచు; 3: (తె) తుంటికూర, తూఁటి, తూఁటికూర—(తూఁడికూర, తూఁడుకూర); ౪: ఘృష్టి, విష్వక్సేనప్రియ. (తె) నీరాకు, పాఁచి-పాఁచి, పాఁచితీఁగ, పెద్దపాఁచి, బవర; ౫. మాతిపాఁసడుకు.-(తె) పాఁకుడు—పాఁకుడు.*;

("చూ, సహస్రపత్రము."); 2: పద్మకా
ము, పత్రాంగము, పద్మకము, పన్నగము

శైవలి. సం. వి. ఇ. న: చూ, రూ-శైవలము. 1.

శైవలిని. సం. వి. ఈ. స్త్రీ. ఏఱు: చూ, న

శైవవైష్ణవమతసాంప్రదాయములను బోధించి
వారు. అం: చూ, ఉపదేశికులు.

శైవాలము. సం. వి. అ. న. నీటిపాఁచి*: చూ
రూ-శైవలము. 1.*. [భక్తుఁ

శైవుఁడు. సం. వి. అ. పుం. శివభక్తుఁడు: చూ

శైశవము. సం. వి. అ. న. 1. చిన్నతనము
బాల్యము, శిశుత్వము. (తె):—అలరుపా
ము, చిన్నకాలు, చిన్ననాఁడు-చిన్నటనా
డు, చిన్నతనము, చిన్నరికము-చిన్నతికప
పడుచుతనము, పిన్నతికము, పెన్నటనాఁడ
పిన్ననాఁడు; 2. బాల్యదశ: గోద్దాలవ
(చూ, దశలు.) [పాధ్యాయులతనవ

శైష్యోపాధ్యాయిక. సం. వి. అ. స్త్రీ. శిష

## శొ

శొంఠి. వా. వి.రూ—శుంఠి=సొంటి: చూ,సొం
(చూ, శృంగబేరము.) (పిండి శొంఠికం
దేశవాళిశొంఠి ప్రశస్తము).

## శో

శోకము. సం.వి. అ. పుం. 1.=మోపురు. (ప
మరణాదిదుఃఖములచేత తపించుట): ఆక
దనము, అక్రందము, కందనము, కష్టము
మాంతకము, క్రందనము, క్రందితము,
ము, ఖేదము, తమము, (మి) దుఃఖపా
ప్రలాపము, మన్యువు, రాగము, రుదిత
రోదనము, లాపము, విచారము, వియమ
వియామము, విషాదము, వృజినము, వ్య

ము, వ్యళీకము, శుక్కు, సంకటము, సాద
ము. (తె): అడలు, అలంత, ఉమ్మ-ఉమ్మల
ము-ఉమ్మలిక-ఉమ్మలికము, ఏడుపు-ఏడ్పు,
కనికరము, కస్తి, కుందు, కుతి, కుతిలము,
గోడు, చేమ్మ, చోకురు, జోలి, నెట్టు, నె
వ్వగ-నెవ్వయు, పగ, పగపు, పదావళి, పవ
ట, (మి) సంకటపాటు, సుర్కు. తద్విశే
షములు.—౧. దుఃఖమునకు. (దీనియందు
ఇంద్రియములు దుష్టములౌను. దుష్టముగా
ఖేదపెట్టునది):-అంకము, అకము-అఘము.
అతిథి, అత్యయము, అన్వాసనము, అపమర్ద
ము, అభిష్యందము, అమానశ్యము-అమనస్య
ము, ఆర్తి-ఆర్తి, అహోబత, అస్రువు, ఆధి,
ఆబాధ, ఆవాపము, ఆశ్రవము, ఉద్వేగము,
ఊర్మి, కూటము, కృచ్ఛ్రము, కృతి, క్లేశము,
క్వాథము, గహనము, గహ్వరము, తాపము,
దుఃఖము, పరంపర, పీడ, ప్రసూతిజము,
ప్రైషము, బాధ, విచారము, వ్యథ, సంకట
ము, హింస. (అవ్య): ఆ, ఇ, ఈ. (తె.వ):-
అంగడ, అంగలారుపు-అంగలార్పు, అటమ
ట, అటమటింపు, అడజేడి, అడలు, అలందు
రు-అలందురు, అలంత, అలమట, అలుగుల-
అలుగులము, అల్లట, ఆటుపోటు, ఇడుమ,
ఉత్తలపడుట, ఉత్తలపాటు, ఉమ్మలము-
ఉమ్మలింపు-ఉమ్మలిక-ఉమ్మలికము, ఎడ
రు, ఎర, ఏంపు, ఒంజిలి-ఒందిలి, ఒత్తడి,
కక్కసము, కన్నఱ, కలకటి, కసటు-కస్తి,
కారియ-కాతియ, కిసమస, కుందు, కుతికలపా
టు-కుతిలపాటు-కుతిల, కుసి, కొందలము, కోల
డము, గంటి.గొడవ, గోడు, జేడి, తొందర-
తొందఱ, తొక్కట-తొక్కటము-త్రొ
క్కట, త్రొక్కటము, తొక్కటపాటు-
త్రొక్కటపాటు, త్రిక్కు, దావంతము,
దుసుకు, దురపిల్లు, దూఁకరి, దొసుకు, నచ్చు,

నలంక-నలంకువ-నలుకువ, నవంత, నెగుల-
నెవులు, నొగులు-నొవులు, నొలి, నొప్పి-
నొవ్వ-నొవ్వు-నోవి-నోవు, పిరుసీంకు-పిర్వీం
కు, పొక్కు, బాద, బాము, బారి, బెడంద,
వంత, వందురు, వగ, వాపోక, వెత, వెతా
రము, వెచంబాటు-వెన్నాటు, వెసనము,
(మి) సంకటపాటు, సణుగు, సలువు, సేగి,
సుర్కు; ౨. మనోవ్యథకు.— అంబరము,
ఆధి, ఆపద, ఉపరాగము, విపత్తు, వ్యథ,
వ్యసనము, సంగరము. (తె):— అంగద, అం
గలారుపు-అంగలార్పు, ఆద, అరటము-అరా
టము, కుళ్ళగింత, జోలి, తుందుడుకు, నించె
లి-నెంజిలి, పిమ్మట, పొక్కడ, బిమ్మటి,
మనికితపాటు, ముచ్చిరితనము, మెరమెర,
వంత (చూ. విపత్తు); ౩. శరీరపీడకు:—
అశ్మంతము, అభీలము, కష్టము. గహనము,
సంకటము, (మి) సంకటపాటు; ౪. సం
కటమునకు:-అవిధి, సంకటము. (అవ్య):
అయొ, అజ్, ఈ, ఏ. (తె. వ):-అనరు,
ఇంటరము-ఇంట్రము, ఇక్కట్టు, ఇక్కము,
ఇక్కుపాటు, ఇజోకు, ఇమ్ముదప్పు, అఱకడ
ము-ఇఱకటము-ఇఱకాటము-ఇరుకటము-
ఇరుకాటము-ఇఱుకు, ఒడుదొడుగు, ఒఱ
కటము-ఒఱకాటము-ఒఱగడము-ఒఱగడ్డ
ము, ఒఱకము, కక్కసము, చిక్కు, జేడ్డ,
తసకలి, తొక్కట-తొక్కటము-త్రొక్క
ట-త్రొక్కటము, నిక్కచ్చి, పోరామి,
మొట్టుపాటు, సంగడము, (మి) సంకటపా
టు; ౫. విరహవ్యథకు.-సంకటము, (తె)
బెంగ, (మి) సంకటపాటు; ౬. కష్టము
నకు.-అంకము, ఆదీనవము, అభీలము, అళి,
ఉపాసనము, కష్టము, కాహళము, క్రిమము,
సంకటము. (తె. వ):—అందెబందెలు, అగ
బాటు, అల్లట, అవళి, ఇడుమ, ఇడుమాడే,

ఇబ్బంది, ఎవ్వ, కక్కసము, కడగండ్లు, కడిఁది, కాఱియ, కొడిమె-కొడిప-గొడిప, గండు, చిక్కు, చోఁకుమ, చోఁద, డెప్పరము, తొగ, పల్లటము, పాటు, పాము, పీనుఁగుపెంట, బడప; ౭. రాగద్వేషాదిప్రియుక్తమగుదుఃఖమునకు.—ఆదీనవము; ౮. బలాత్కారముగా నరకమునందు ద్రొబ్బటవలని బాధకు:-అజావు; ౯.అత్యధికదుఃఖమునకు.—(తె) వంచేకరపాటులు; ౧౦.బాధించేటకు.—హింస, హింసనము. (తె) హోరామి; ౧౧. ఆపదకు:—(చూ, విపత్తు); ౧౨. (విశే) కష్టముగలది:—కష్టము; ౧౩. (విశే) శోకమునొందినది: అయస్తము, ఆర్తము, క్లిశితము, క్లిష్టము, క్లేశితము, ఖిన్నము, దుఃఖితము. (తె). ఒంజిలి_ఒందిలి, చీకాకు. తద్వి.—శోకింపఁదగినది అనుటకు:— చూ, శోచ్యము; ౧౪. దుఃఖార్థకము.— అహహ_అహహో-అహో_అహో, ఖలు, ఏ, హా. (తె): అకటె-అటొ-అటో-అక్టె-అక్టే; ౧౫. వ్యధార్థకము.—హా; ౧౬. పీడార్థకము.—హా; ౧౭. విచారార్థకము.—ఏ; ౧౮. తాపమునకు.—(చూ, సంతాపము.); ౧౯:శోచనము. (చూ, సుక్కు.(1). (2).) (ఇవి అన్నియు కొద్దిభేదము కలవి); ౨౦. 2. స్థాయీభావము: చూ, రసస్థాయీ భావములు; 3: చూ, షడూర్మ్ములు. (చూ, ఊర్మ్ములు.)

శోకించే. సం. అ. క్రి =శోకించే. (పుత్రమరణాది దుఃఖముచేత తపించే): విచారించే, విషాదించే. (తె).— అడలు, అడలుకొను, అలఁగు, ఉమ్మలికించే-ఉమ్మలించే, కనికరించే, కుందు, చోఁకురుపడు, దురపిల్లు, ప్రేముడించే, మచ్చిరు, వగచే, వనరు, వేసరు-వేసారు. తద్వి.—౧. రోదించేటకు:—ఆక్రందించే, (వి)దుఃఖపడు, రోదించే, శోకించే. (తె) అడలు, అఱచే, అవురుమను, ఏడు-ఏడుచే-ఏడ్చు, కనికరించే, కూపెట్టు, కూయు, గీపెట్టు, గుదగుదలాడు, చికిలు, జాకించే, జాలిఅయిడు, వగచే, వాచేఱచే, వాపోవు; ౨:-(చూ, విలపించే); 3. దుఃఖించేటకు.—దుఃఖించే, శోకించే, (తె): అంగలారుచే-అంగలార్చు, అలఁదురు, ఉమ్మరించే-ఉమ్మరించే-ఉమ్మలికించే, (వి) కష్టపడు, కుందు, కుల్లు-క్రుల్లు, క్రుళ్లగించే, గోడాడు, జోలిగొను, జోలిఁబడు, (వి) దుఃఖపడు, దురపిల్లు, పల్లటిల్లు, పొక్కు, బావురుమను, మనికితపడు, మచ్చిరు, వందురు, వగచే, వెనుఁబడు-వెన్బడు, వేసరు-వేసారు, సలించే, సుక్కఁబడు-సుక్కు ౪: చింతించేటకు:—చూ, సుక్కు. 11; (ఇవి అన్నియు కొద్దిభేదము కలవి)

శోచనము. సం.వి.అ.న.వగచేట:చూ,శోకము.1.

శోచనీయము. సం. విశే. శోకింపఁదగినది: శోచ్యము,శోచితవ్యము:(చూ,శోకము.1-౧౩.)

శోచితవ్యము. సం. విశే.—పై.—

శోచిష్కేశుఁడు. సం. వి. అ. పుం. జ్వలనుఁడు: చూ, వహ్ని. 1.

శోచిస్సు. సం. వి. స్. న. 1. వెలుఁగు: చూ, వెలుతురు. 1; 2. సూర్యకిరణము: చూ, హాయనము. 2.

శోచ్యము. సం. విశే. శోకింపఁదగినది: చూ, శోచనీయము. తద్వి. శోకింపఁబడినది అనుటకు.—:(చూ, శోకము. 1—౧౩.)

శోణకము. సం. వి. అ. పుం: రూ-శోనకము-శోణము-శ్యోనాకము-స్యోనాకము, అరలువు-అరులువు, ఋక్షము, కట్వంగము, కుటంనటము-కుటన్నటము, శేశటము, జంబుకము, డింటిక, ఉండుకము, దీర్ఘవృంతము, నటము, పత్రోర్ణము, మండూకపర్ణము, మహానింబము.వృకము, శుకనాసము.-

(తె): దుండిగము-దుండిలము- దుందిలము- దుండుకము- దుందుకము, పెద్దమ్రాను, పెనుమ్రాను *.

**శోణము.** సం. వి. అ. పుం. 1. ఎఱుపు: చూ, వర్ణము. 6; 2. ఎఱ్ఱనిగుఱ్ఱము: చూ, హయము; 3. నదవిశేషము: చూ, సముద్రము; తద్వి.—ఒకానొకనది: చూ, నది: 4. నిప్పు: చూ, వహ్ని. 1; 5. దుండిగము*: చూ, రూ-శోణకము; 6. కేళటమను బాణము. శోషము-శోషణము (అనికొండఱు): చూ, మన్మధబాణములు; విణ. 7. ఎఱ్ఱనిది: చూ, వర్ణము. 6; అం. 8: చూ, వర్ణములు (అశ్వశాస్త్రములోనివి.) [చూ, భూమి. 1

**శోణమృత్తిక.** సం. వి. ఆ. స్త్రీ. ఎఱ్ఱమన్ను:

**శోణరత్నము** సం. వి. అ న. కెంపు: చూ, స్థాలోచ్ఛయము (రత్నములు ౨)

**శోణితము.** సం. వి. అ. న. 1. నెత్తురు: చూ, రక్తము. 1; అం. 2· చూ, లక్షణాంగములు. ("లత్తుకవలెనున్న ధనియును భోగియునగు. పగడమువలె నునుపుగలిగిన రాజగు. పద్మపత్రి సమమైన బహుకన్యకలు గలిగి సతత దుఃఖియగు. గోమయవర్ణము, శ్యావ, ఉష్ట్ర, మహిషరక్తసమమైన నిర్ధనుఁడగు.); 3 బాణపురమను దేశము: చూ, దేశములు; 4 చూ, ధాతువులు.

**శోణిమ.** సం. వి. న్. పుం. రూ-శోణిమము. ఎఱుపు: చూ, వర్ణము. 6.

**శోణిమము.** సం. వి. అ. పుం. —పై.—

**శోధము.** సం. వి. అ. పుం: చూ, రూ-శోధము.

**శోధకుఁడు.** సం. విణ: కారణికుఁడు, పరీక్షకుఁడు, పరీక్షాళకుఁడు.

**శోధఘ్ని.** సం వి. ఈ. స్త్రీ: కటిల్లకము-కతిల్లకము-కఠిల్లము, జీవలోధని, పునర్నవ, పూరణము, పూరము, వర్షాభువు, శోథఘ్ని.

(తె).—గలజేర-గలజేరు-గలిజెర-గలిజెరు-గలిజేరు*. తద్వి.—౧: దీర్ఘపత్రిము, విటాలిక, వృశ్చికము.(తె) తెల్లగలిజేరు; ౨: కృష్ణ, నీలపునర్నవ. (తె) నల్లగలిజేరు; 3: కఠిల్ల, యోగ్య, వర్షకేతువు. వికషము. (తె) ఎఱ్ఱగలిజేరు; ర: పావనము (తె) పచ్చగుంటగలిజేరు.*

**శోధన.** సం. వి. ఆ. స్త్రీ: చూ, శోధనము.

**శోధనము.** సం. వి. అ. న. 1 =సోదన. (రూ-శోధన.) శుద్ధిచేయుట: దానము, ధావనము, పరిశీలనము, పరిశుద్ధి, పరిశోధనము, పరీక్ష, శీలనము, శుద్ధి, శోధన, సమ్మార్జనము (తె). కడుగు-కడ్గు, గాలింపు. తెలుపు, మడుఁగు-మడుపు- మడ్గు-మాఱుఁగు-మాఱుపు. వడిఁగట్టు, వేరుపరుపు, సుద్ది, సోదన. తద్వి —క్షాళనము, ప్రక్షాళనము.(తె) కడుగుట; 2 పరిష్కరించుట: పరిష్కారము, పరిష్కృతి; 3: చూ, వెదకుడు; 4. మలము: చూ, శమలము. 1.

**శోధని.** సం. వి ఈ. స్త్రీ. చీఁపురుకట్ట: చూ, సమ్మార్జని.

**శోధము** సం. వి. అ. పుం. వాఁపు. చూ, శోఫ.

**శోధరోగి.** సం. విణ: చూ, శోఫరోగి.

**శోధించు.** సం. స. క్రి. 1. (కడుగుటలోనగువానిచే) శుద్ధిచేయు. తద్వి —ప్రక్షాళించుట కు:-(తె) కడుగు - కడ్గు - కడుపు, తొడయు, సుద్దిచేయు, 2. పరిష్కరించు: చూ, సవరించు. 2; 3: చూ, వెదకు; 4 పరిశోధించు, పరిశీలించు: చూ, విమర్శించు. 1; 5: చూ, సోదించు.

**శోధితము.** సం. విణ. శోధింపఁబడినది: అపవస్కరము, నిర్ణిక్తము, నిశ్శోధ్యము, మృష్టము, సంసృష్టము, సమ్మృష్టము (చూ, శోభితము. 2) తద్వి —క్షాళితము, ప్రక్షాళితము. తద్వి.—౧. కానిది:-ఉపచితము, జ్వలితము,

దీప్తము, నిర్దగ్ధము, పరిజ్వలితము; ౨. ప్రకాశించినది:-పరిజ్వలితము; 3. కాల్పఁబడినది: చూ, ప్లుష్టము.

శోధ్యము. సం. విణ. 1. శోధింపఁదగినది; వా. 2. ఆశ్చర్యమైనది:చూ, వింత. 1. [కము*.

శోనకము. సం. వి. అ. పుం: చూ, రూ-శోణ

శోఫ. సం.వి. ఆ. స్త్రీ. (పుం. అనికొందఱు)= సోఫు-సోబె: రూ-శోఫము, కిలాసము, శోఫము- శోథము, శోషము, శ్వయథువు, సిధ్మ-సిధ్మము. (తె) ఉలుపడ-ఉల్పడ, ఊఁద-ఊఁదు, కులుపు, జోబ, బొల్లి, వాఁపు, సిబ్బియము-సిబ్బెము, సోఫు-సోబ-సోబు, సోబియ-సోబె. (రోగము. 1)

శోఫము. సం. వి. అ. పుం. —పై.—

శోఫఘ్ని. సం. వి. ఈ. స్త్రీ:చూ, శోథఘ్ని*.

శోఫరోగి. సం. విణ. (న్. ఈ. న్) సోబెరోగము గలవాఁడు: చూ, వ్యాధితుఁడు.

శోభ. సం. వి. ఆ. స్త్రీ. 1. వస్త్రభూషణాది పరియుక్తమైనకాంతి: చూ, వెలుతురు. 1; 2. కాంతి: చూ, వెలుతురు 1; 3 ఇచ్ఛ: చూ, వాంఛ; 4. మిక్కిలిశోభ: చూ, సుషమ. 1.

శోభకృత్తు. అం: చూ, సంవత్సరములు.

శోభనము. సం. వి. అ. పుం. 1: చూ, యోగములు; వా. 2.=సోబనము. గర్భాధానము, చూ, సంయోగము; 3.=సోబాన. పెండ్లిపాట; విణ. 4. సుందరము: చూ, హృద్యము.

శోభనములు. అం: ముక్కుమెత్తించుట, వీధులయందు నీళ్ళుజల్లించుట, పూవులనిండించుట, గోడలయందుఁ జిత్రములు వ్రాయించుట, మకరతోరణములు గట్టించుట, ఆట, పాట, వాద్యము. (8)

శోభాంజనము. సం. వి. అ పుం:చూ, శిగ్రువు*.

శోభించు. సం. అ. క్రి. రూ-శోభిల్లు. ప్రకాశించు: చూ, హావణిల్లు.

శోభిల్లు. సం. అ. క్రి. —పై.—

శోభితము. సం. విణ. ప్రకాశమొందినది: జ్వలితము, పరిజ్వలితము, భ్రాజితము, విస్ఫారితము. తద్వి.— ౧. మండినది అనుటకు.—జ్వలితము, పరిజ్వలితము; ౨. ప్రకాశించునది అనుటకు.-ఉల్బణము, తరళము, భాసురము, రోచనము, విలసితము, శుభ్రము; (చూ, వెలుతురు. 1); 3. ప్రకటింపఁబడినది అనుటకు.-ఆవిష్కృతము, స్ఫుటితము: (చూ, వ్యంజితము.); ౪. ప్రకాశించుచున్నది అనుటకు.—ద్యోతమానము, భాసమానము; ౫. మిక్కిలిప్రకాశమొందినది అనుటకు.-ఉదర్చి, విరాజమానము, విస్ఫూర్జితము, సుషమ; ౬. గరగరికైనదిఅనుటకు.-వీధ్రము: (చూ, శోధితము); ౭. ప్రకాశముగలదిఅనుటకు.—(తె) పిసాళి.

శోషణము. సం. వి. అ. న. 1. శోషిల్లుట: ఆస్కందనము, శోషము. (తె) ఇంకుట, ఇంకుడు; పుం. 2.ఒకానొకమన్మథబాణము: చూ, శోణము. 6.

శోషము. సం. వి. అ. పుం. 1. శోఫరోగము: చూ, శోఫ; 2. క్షయరోగము: చూ, హాసువు. 4 (రోగము. 1-౧౦); 3: చూ, శోషణము. 1; అం. 4:చూ, శోణము.6; 5: చూ, అస్త్రములు.

శోషించు. సం. అ. క్రి. రూ-శోషిల్లు. 1.చిక్కు: చూ, సొటసొటవోవు; 2. ఎండు: చూ, సొటసొటవోవు.

శోషిల్లు. సం. అ. క్రి.—పై.—

## శౌ

శౌంఠ్యము. సం. వి. అ. న. కుంఠత్వము,మూఢత్వము: (తె) సొడ్డు.

శౌండి. సం. వి. ఈ. స్త్రీ: చూ, పిప్పలి. 1.*. తద్వి.—౧. గజపిప్పలికి.-భవ్య: ౨. నీరుపిప్పలికి:-అనంత, విశల్య: చూ, పిప్పలి. 1-3; 3. పిప్పలివేరునకు.-శిరము, సిరము. (చూ, పిప్పలి. 1.)

శౌండికుఁడు. సం. వి. అ. పుం. 1. కల్లుఅమ్మువాఁడు: చూ, సురాజీవి; 2: చూ, సమర్థుఁడు.

శౌండుఁడు. సం. విశ. సుమాళి, లొట్టిముచ్చు, తాగుఁబోతు, పాయి, కల్లుత్రాగుటలోనగు వానిచే మత్తిల్లినవాఁడు: చూ, సోమరి.

శౌకము సం.వి.అ.న.-చిలుకలగుంపు: చూ, శుకము.

శౌక్తికేయము. సం. వి. అ. న. ముత్యము: చూ, మూలోచ్చయము (రత్నములు. ౧.)

శౌక్లికేయము. సం. వి. అ. పుం. విషభేదము: చూ, సంగరము. 6. [2. శుక్లకర్మము.

శౌక్ల్యము. సం. వి. అ. న. 1. శుక్లభావము;

శౌచము. సం. వి. అ. న. 1. నైర్మల్యము: చూ, సమీచీనము. 2; అం. 2: చూ, సాత్త్వికగుణములు; 3: చూ, యోగయమాంగములు.

శౌచములు. అం: బాహ్యము, అంతరము (2).

శౌద్ధోదని. సం. వి. ఇ. పుం. శాక్యబుద్ధదేవుఁడు: చూ, బుద్ధుఁడు. 1.

శౌనకీయము. అం: చూ, కల్పసూత్రములు.

శౌరసేని. అం: చూ, ప్రాకృతభాషాభేదములు. (చూ, భాషలు)

శౌరి. సం. వి. ఇ. పుం. కృష్ణుఁడు: చూ, విష్ణువు.1.

శౌర్యము. సం. వి. అ. న. 1. శూరత్వము: చండిమ, ఝు, పరాక్రమము, విక్రమము, వీర్యము. (తె): అగ్గలిక-అగ్గలికము, అలుము, ఇలుపడి-ఇల్వడి, ఉక్కు, ఏడ్తెఱ, కడిఁది, కడిమి-కడ్మి, కడుఁదు, కలుకు, గట్టి, గురుసు, గోవారి, చేటుకు, డాక, దండ, తెతి, పూఁపు, పెంపు, పొసుపు, పోటు, బంటుతనము, బింకము-బింకెము, బిగువు, బీరము, మగఁటిమి, మగతనము, మగపాటి-మగపాడి, మూతి, మొక్కలము-మొగ్గలము, వడి, వడిగలతనము, వడితనము, వాఁడి-వాఁడిమి, వాని, విడి, వీఁక-వీఁకు, సోను-సోనము; 2: నేర్పు, ప్రౌఢిమము: చూ, సామర్థ్యము. 1.

శౌర్యవంతుఁడు. సం. విశ. దండి: చూ, సమర్థుఁడు.

శౌల్కికుఁడు. సం. వి. అ. పుం. శుల్కాధ్యక్షుఁడు: చూ, సుంకరి. [చూ, స్వర్ణకారుఁడు.

శౌల్బికుఁడు. సం. వి. అ. పుం. రాగిపనివాఁడు:

శౌష్కలము. సం. వి. అ. పుం. ఎండిన మాంసముయొక్క వెల: చూ, వెల. 1.

శౌష్కలుఁడు. సం. విశ. రూ-శాష్కలుఁడు. ఎండినమాంసము తినువాఁడు: చూ, శాష్కులికుఁడు.

## శ్చ్యో

శ్చ్యోతము. సం. వి. అ. పుం. జలధార, కాలువ (అనికొందఱు): చూ, స్రవము.

## శ్మ

శ్మశాన కుసుమన్యాయము. అం. ఒకానొక న్యాయము.

శ్మశానము. సం.వి. అ.న.—మసనము: అంకశయ్య, అంతశయ్య (అంతశ్శయ్య), కటము, చితి, దిబ్బ, చైత్యము, పితృవనము, ప్రేతవనము, రుద్రభూమి. (తె) ఒలికి, ఒలికికాఁడు, ఒలుకులమిట్ట, కాడు, మసనము, వలికి, వల్లకాడు. తద్వి.—— శ్మశానమతి, చిత-చితి-చిత్య-చిత్యము, చైత్యము. (తె) సాద, సార.

శ్మశానవైరాగ్యము. అం ఒకానొక వైరాగ్యము: చూ, వైరాగ్యములు.

శ్మశ్రువు. సం. వి. ఉ. న. 1:=మీసము. మీస- (సం) వ్యంజనము. (మూతిపై వెండ్రుకలు): చూ, వెండ్రుక; తద్వి.-౧. పెరిగినమీసము గడ్డములకు.-కూర్చము; ౨. గడ్డమును మీసమును.-గడ్డము; 3. గడ్డమునకు.-(తె) గడ్డము, గడ్డువ: చూ, చంబుకము; ౪: (తె) బావురు గడ్డము; ౫: (తె) పిల్లగడ్డము; ౬: (తె) మేకగడ్డము; అం. 2: చూ, లక్షణాంగములు. (మీసలు.-కొనలుగలిగి మృదువులై సూక్ష్మములైనదుఃఖి. కపిలవర్ణమైనశూరుఁడగు. తుమ్మెదలవలె నీలములై దీర్ఘములైనరాజగు. ముందు మీసమువచ్చినపిమ్మట గడ్డము వచ్చిన దీర్ఘాయువగు. వ్యత్యయమైన అల్పాయువగు.)

## శ్యా

శ్యామ. సం. వి. ఆ. స్త్రీ. 1.=చౌన-చేమ. యౌవనమధ్యస్థురాలు: చూ, స్త్రీ. (చూ, యౌవనభేదములు); 2. యమున: చూ, పవిత్రనది (నది. (8).); 3. నల్లపిచ్చుక: చూ, కలవింకి (పిచ్చుక); 4. రేయి: చూ, శర్వరి. 1 (రాత్రి. 1.); 5. నల్లతెగడ*: చూ, సర్వానుభూతి; 6. నీలి*: చూ, శ్రీఫలి. 2; 7. పేంకణము*: చూ, సన్నకదుర్వు; 8. బావంచి*: చూ, సోమరాజి; 9. మామెన*: చూ, శారిబ. [రూ-శ్యామాకము.

శ్యామకము. సం. వి. అ. పుం.=చేమలు: చూ,

శ్యామము. సం. వి. అ. న. 1. ఇందుప్పు: చూ, లవణము. 1; 2. అరోణాసామము, ఉపణము-ఊషణము, కఫవిరోధి, కృష్ణము, కేవలద్రవ్యము, కోలకము, ధార్మపత్తనము, మరీచ్యము, మూషణము, వరిష్టము. (తె) మిరియము - మిరెము - మిర్యము: చూ, వెల్లజము. తద్వి. ౧: వేశ్యాకన్య. (తె) పిల్లిమిరియము; ౨: (తె) చేలువమిరియము, తోఁకమిరియము; 3: శ్వేతమరిచము. (తె) తెల్లమిరియము; ౪. మిర్యాలచెట్టునకు.—ఉపణము-ఊషణము, వల్లిజము: (చూ, వెల్లజము); పుం 3. ఆకుపసుపు: చూ, హరితము. 1 (వర్ణము 6-౭); 4. నలుపు: చూ, వర్ణము. 6; 5. మబ్బు: చూ, మేఘము. 1; 6. కోయిల: చూ, సాఁకుడుపులుఁగు; 7. అజగ, ఆవేగి, బుత్తిగంధ, కోతరపుష్పి, క్షుతవిధ్వంసి, గుంజకము, ఛగల, ఛగలాండి, ఛాగలాంత్రిక, జాంగము, వృద్ధదారకము-వృద్ధదారుకము-వృద్ధదారువు-వృద్ధవారకము. (తె) బొద్ది, బొద్దికూర*; 8. ప్రయాగయందలిమఱ్ఱి*: చూ, స్కంధజము; 9. మామెన*: చూ, శారిబ; విణ. 10. ఆకుపచ్చనిది: చూ, హారితము. 1(వర్ణము.6-౭); 11. నల్లనిది: చూ, వర్ణము. 6.

శ్యామలత. సం. వి. ఆ. స్త్రీ. నల్లతెగడ*: చూ, సర్వానుభూతి.

శ్యామలము. సం. వి. అ. పుం. న. 1 =చేమన. నలుపు: చూ, వర్ణము. 6; 2. అశ్వత్థము, అమలము, కపీతనము, కుంజరాశనము, కుంభజము, కృష్ణావాసము, కేశవాలయము, కేశవావాసము, క్షీరద్రుమము, గజభక్షకము, గజాశనము, గుహ్యపుష్పము, చలదళము, చలపత్రము, చైత్యద్రువు, చైత్యము, చైత్యవృక్షము, చైత్రపాదము, దీర్ఘాయువు, నారాయణము, పవిత్రకము, పిప్పలము, ప్లక్షము, బోధి, బోధిద్రుమము, మంగళ్యము, రోహి, వనస్థ, వహ్నిగర్భకము, వృక్షాదనము, శ్రీవృక్షము, (తె) కండ్లరావి, రాగి-రావి*. తద్వి.—౧. కండ్లరావికి.-అశ్వత్థిక-(అశ్వద్థిక), అశ్వత్థసన్నిభ, కంబూష, నేత్రాశ్వత్థము. (తె

కండ్లరావి; ౨. గంగరావికి.-క్రిముకము, తూదము, తూలము, పూగము, బ్రహ్మచారి, బ్రహ్మణ్యము, బ్రహ్మదారువు, యూపము. (తె) గంగరావి*; వి॥. ౩. నల్లనిది: చూ వర్ణము. ౬. [శిరీషము.

శ్యామవర్ణ. సం. వి. ఆ. స్త్రీ. దిరిసెన*: చూ,

శ్యామలాంబ. సం. వి. ఆ. స్త్రీ.=సోమాలమ్మ శ్యామలాదేవి: చూ, మహాలక్ష్మి. ౩.

శ్యామలాదేవి. సం. వి. ఈ. స్త్రీ. సోమాలమ్మ 1 — పై —; అం. 2: చూ, దిక్పాలభార్యలు

శ్యామసారము. సం వి. అ. పుం: చూ, వెలిచండ్రి.*. [చూ, రాహువు. 1.

శ్యామాంగుఁడు. సం. వి. అ. పుం. బుధుఁడు.

శ్యామాకము. సం వి. అ. పుం.=చామలు. రూ- శ్యామకము: చూ, ధాన్యము. ౨౦.

శ్యామిక. సం. వి. ఆ. స్త్రీ. 1: అంధకారము, అంధము, ఆంధిక, అకల్పకము, కజ్జలము, కాలిక, ఖలుష్కి-, తమము, తమి, తమిస్రము-తామిస్రము, తమసము, తామసి, తిమిరము, ధ్వాంతము, పాణింధమము, మేచకము, వృత్రము. (తె): ఇరులు-ఇర్లు, కప్పు, గుయ్యారము, చీఁకటి, చీఁకు-చీకు, చీకువాలు, మబ్బు, మయిల-మైల. తద్వి.—౧: అంధతమసము(అంధాతమసము), గాఢాంధకారము, తమస్రి, శార్వరము, సంతమసము. (తె): కటికచీఁకటి, గబ్బుచీఁకటి, చిమ్మచీఁకటి, పెంజీఁకటి, పొడిచీఁకటి, మసక-మసకన, మునిచీఁకటి, ముతచీఁకటి-ముతిముతిచీఁకటి; ౨: తగ్గినచీఁకటికి:— అవతమసము. (తె) కప్పిరి, పొడిచీఁకటి, మసమసన; ౩: (తె) కనుచీఁకటి; 2. కందు: చూ, వర్ణము. ౬.

శ్యాలకుఁడు. సం. వి. అ. పుం. 1. భార్యతోడఁ బుట్టినవాఁడు: రూ-శ్యాలుఁడు- స్యాలకుఁడు-స్యాలుఁడు, కుంభిలుఁడు; అం. 2: చూ, గయాపిండ దానార్హులు.

శ్యాలిక. సం. వి. ఆ. స్త్రీ. భార్యతోడఁబుట్టినది: రూ-శ్యాలిక.

శ్యాలుఁడు. సం. వి. అ. పుం: చూ, శ్యాలకుఁడు.

శ్యావము. సం. వి. అ. పుం. 1. కోఁతివన్నె: చూ, వర్ణము. ౬; విశే. 2. కోఁతివన్నెగలది: చూ, వర్ణము. ౬.

## శ్యే

శ్యేతము. సం. వి. అ. పుం. 1. తెలుపు: చూ, హరితము. 1 (వర్ణము. ౬-౫.); విశే. 2. తెల్లనిది: చూ, హరితము. 1 (వర్ణము. ౬-౫.)

శ్యేనము. సం. వి. అ. పుం: కపోతారి, క్రూరము, గ్రాహకము, ఘాతి, పత్రి, మృగేంద్రచటకము, శశాదనము. (తె) డేగ. తద్వి.— ౧: క్షితిజము. (తె) వేసడ-వేపడము-వేస్త్రము; ౨: వారణము. (తె) వయిల-వైల; ౩: (తె) సారణము, సాలువము-సాళువ-సాళ్వము; ౪: (తె) అడుజో-అణుజో, కడుజో-కణుజో: ౫: (తె) ఈలగ్రద్ద; ౬: (తె) ఓరణము; ౭: (తె) కంచె మించె; ౮: (తె) కపసరము-కణసెరము-కనిసెరము; ౯: (తె) కురుజో; ౧౦: (తె) గిడ్డు-గిద్దు; ౧౧: (తె) చేంచేడము- చెంచేడము- చెంచెడము; ౧౨: (తె) చోఁపగద్ద: ౧౩: (తె) జెలకట్టియ-జెలకట్టె, జెలాకంటె-సెలకట్టియ-సెలకట్టె; ౧౪: (తె) జోలి-జోలియ- జోలె; ౧౫: (తె) జోవడము; ౧౬: (తె) తళుకు; ౧౭: (తె) తోఁచిగాఁడు, తోనికాఁడు; ౧౮: (తె) నేలాఁపు: ౧౯: (తె) బయిరి-బైరి; ౨౦: (తె) బాఁజో; ౨౧: (తె) బెళఁ

క-వెలుగు; అం: (తె) లగడు-లగుడు. (చూ, పక్షి); 2. తెలుపు: చూ, వర్ణము.6; అం. 3: చూ, వ్యూహములు; 4: చూ, సంచారివర్ణ గతాలంకారములు.

శ్యేని. అం: చూ, వృత్తము. 1 ("ర-జ-ర-వ గణములు. 7 యతి. 11 ఛందస్సు.")

## శ్యో

శ్యోనాకము. సం. వి. అ. పుం-దుండిగము*: చూ, రూ-శోణకము.

## శ్ర

శ్రంధుఁడు. సం. వి. అ. పుం: చూ, విష్ణువు.1.

శ్రథనము. సం. వి. అ. న. 1. కట్టు: చూ, బంధము. 1; 2. కూరుపు: చూ, సంధానము. 1; 3. విడుపు: చూ, విమోచనము.

శ్రద్ధ. సం. వి. ఆ. స్త్రీ. 1.=జేడ్డు: దీక్ష. (తె) అక్కఱ; 2. ఆసక్తి: చూ, వాలి (వాంఛ); 3.=నడ్డ: చూ, నూటి. 1 (లక్ష్యము. 1.); అం. 4: చూ, శమాదులు.

శ్రద్ధధానుఁడు. సం. విశ. శ్రద్ధగలవాఁడు: ఆస్తికుఁడు, శ్రద్ధదాళుఁడు-శ్రద్ధదాళువు-శ్రద్ధాళుఁడు-శ్రద్ధాళువు, శ్రద్ధావంతుఁడు. (తె) అక్కఱగండఁడు, ఓపికగలవాఁడు, పాటుమానిసి-పాట్లమారి.

శ్రద్ధదాళుఁడు. సం. విశ.—పై.—

శ్రద్ధదాళువు. సం. విశ.—పై.—

శ్రద్ధావంతుఁడు. సం, విశ.—పై.—

శ్రద్ధాళుఁడు. సం. విశ.—పై.—

శ్రద్ధాళువు. సం. విశ. 1.—పై.—; ఈ. స్త్రీ. 2. వేవిళ్లుగల ఆఁడుది: చూ, స్త్రీ. (గర్భిణి.); విశ. 3. శ్రద్ధగలది.

శ్రద్ధావతి. అం: చూ, దిక్పాలపట్టణము.

శ్రమణుఁడు. సం. వి. అ. పుం. 1. ఒకానొక యతి: చూ, సన్యాసి; విశ. 2. నింద్యజీవనముగలవాఁడు. [శ్రమపెట్టు.

శ్రమపడు. మి. అ. క్రి. ఆయాసపడు: చూ,

శ్రమపఱచు. మి. స. క్రి: చూ, శ్రమపెట్టు.

శ్రమపెట్టు. మి.స.క్రి: ఆయాసపెట్టు, ప్రయాసపెట్టు, శ్రమపఱచు. (తె): అలఁగఁజేయు, అలఁచు, అలసటపెట్టు, అల్లటపెట్టు. ఏడాటలాడించు, తాఁకించు. తద్వి.—శ్రమపడు అనుటకు.—(చూ, బాధపడు.): అలయు, అలసటపడు, అలుగులపడు, ఓలాకుపడు, గాసిలు-గాసిల్లు, చీకాకుపడు, నలఁగు, పడు, పాటుపడు, ప్రేముడించు, బడలు, బడలుపడు, లంపటపడు, లోలాయపడు, వేసరు-వేసారు, సరమగొను, సేదగొను, (మి) ఆతురపడు, ఆయాసపడు, ప్రయాసపడు, శ్రమపడు.

శ్రమము. సం. వి. అ. పుం. 1: ఆదీనవము, ఆయాసము, ఆస్రవము, కాశి, క్లమము, తాంతి, ప్రయాసము, వ్యాయామము. (తె): అతలకుతలము-అతలాకుతలము, అలఁత, అలకువ, అలజడి-అల్జడి, అలపు-అలవు, అలయిక, అలసట, (మి) ఆయాసపాటు, ఇజోకు, ఇసుము, ఓలాకు, కాకు, కుసిగుంపులు, గాసి, చిరాకు, చీకాకు, చెకుర్పు-చెమర్పు, జేంజోటము, తపతప, డప్పి-డప్పి-డప్పిక, తంట-తంటా, తహతహ, నలఁక-నలఁకువ-నలఁగుడు, నిక్కచ్చి, నొగులు-నొవులు, నొగులు-నొవ్వులు, నొప్పి, నొవ్వి-నొవ్వు-నోవి-నోవు, పాటు, బడలిక, బవవసము, బాదరబంది, లంపట, లాయిలాసా,

వడ, వేసట, సరమ, సేద, సోమ. తద్వి.— ౧. దుఃఖరూపమైన విచారమునకు.— సెగులు-సెవులు; ౨ మిక్కిలి అలపు: పరిశ్రమము. (తె) అలవు, ఉటారము, హొంత; ౩: చూ, వేదన; 2. అలవాటు: చూ, స్వభావము; 3:=సాము, గడసాదన, గరిడి-గరిడీ. (సం) వ్యాయామము; 4.=చెమట: చూ, స్వేదము; 5.=సరమ. కష్టము: చూ, శోకము; 6.=సొమ్మ. మూర్ఛ: చూ, సొమ్మ; అం. 7: చూ, సంచారీభావములు. ("అమ్మగనింజూచిన యమ్మగువకునొడలెల్ల నాయాసకలితంబై చంద్రుంజూచిన చంద్రకాంతపుబొమ్మవలె స్వేదబిందు సంపూరితంబయ్యె.")

శ్రయణము. సం వి. అ. న: చూ, శ్రాయసు.1

శ్రవణము. సం. వి. అ. న. 1.=చెవి: చూ, శ్రోత్రము; 2: ఆకర్ణనము, శ్రుతి. (తె) వింట-వినికి-విన్కి-వినుకలి-విన్కలి- వినికిడి. తద్వి.—౧. అనుశ్రుతి, ఉపశ్రుతి, చిత్రోక్తి, పుష్పశకటి; ౨: శ్రావణము; 3: కొద్దిగావినుట, సవసవ; అం. పుం, ఆ. స్త్రీ. 3. తూపురిక్క: చూ, రిక్క; 4: చూ, అధమక్షేత్రములు; 5: చూ, భక్తిరసములు.

శ్రవణరంధ్రములు. అం: చూ, రంధ్రములు.

శ్రవణీయము. సం. విశ. వినఁదగినది: శ్రవ్యము-శ్రావ్యము, శ్రోతవ్యము, సంశ్రవణీయము (అనికొందఱు). [శ్రోత్రము.

శ్రవము. సం. వి. అ. పుం, స. న. చెవి: చూ,

శ్రవిష్ఠ. సం. వి. ఆ. స్త్రీ. ధనిష్ఠ: చూ, రిక్క.

శ్రవిష్ఠాజుఁడు. సం. వి. అ. పుం. బుధుఁడు: చూ, రాహువు. 2.

శ్రవ్యము. సం. విశ. 1. వినఁదగినది: చూ, శ్రవణీయము; అం. 2. (ఇది ప్రబంధాదికము): చూ, కావ్యము. 4.

## శ్రా

శ్రాంతి. సం. వి. ఇ. స్త్రీ.=సేద: అపరతి, ఆగతి, ఉపరతి, ఉపరమము- ఉపరామము, పరిశ్రాంతి, విశ్రమము-విశ్రామము. (తె): ఉడుకువ-ఉడుక్కువ, ఊరట-ఊఱట. (చూ, విరామము. 1.)

శ్రాంతుఁడు. సం. వి. అ. పుం. 1. యతి: చూ, సన్యాసి; విశ. 2. శాంతిఁబొందినవాఁడు; 3. అలసినవాఁడు: మిసిమంతుఁడు.

శ్రాణ. సం. వి. ఆ. స్త్రీ. 1. కాఁపుడుగంజి: చూ, సాదము (1); విశ. 2. కాచఁబడినది: ఇద్ధము, ఉత్తప్తము, తప్తము, ప్రతప్తము, శృతము. (తె) ఉదిరి; 3. పక్వమైనది: చూ, సంస్కృతము. 5.

శ్రాద్ధకర్మము. అం: చూ, శవపరిహితములు.

శ్రాద్ధదేవుఁడు. సం.వి. అ.పుం: చూ, యముఁడు.

శ్రాద్ధము. సం.వి. అ. న. 1. కాలపాత్రనియమముల చేతఁజేసెడు శ్రాద్ధబోధిత పితృకర్మము. (అంత్యకర్మాదులు.) తద్విశేషములు.— ౧. మొదటివత్సరమున చేచ్చినవారింగూర్చి ప్రతిమాసమునను జేయు శ్రాద్ధకర్మము: అన్వాహార్యము, మాసికము; ౨. చేచ్చినవారింగూర్చి సంవత్సరాంతమునఁ జేయు శ్రాద్ధకర్మము: సంవత్సరికము-సాంవత్సరికము. (తె) ఏఁడుడి; ౩. చేచ్చినవారింగూర్చి ప్రతివత్సరమునను జేయు శ్రాద్ధకర్మము: ఆబ్దికము, ఆర్యకము, తద్దినము, తిథి, దివసము, ప్రత్యాబ్దికము, వైదికము, సాంవత్సరికము- సంవత్సరీకము. (తె) ఏఁడుడి; ౪: చూ, సపిండీకరణము; ౫: చూ, షాణ్మాసికము; ౬: చూ, షోడశము. 2. (ఇందుల విశేషములు.—ఆగ్నేయము, సాత్యము, సంప్రేషణము, మాసికము)

(చూ, కర్మములు.) (చూ, సాంవత్సరికము); విశే. 2. శ్రద్ధతోఁగూడినది.

శ్రాద్ధములయందు మాంసపరిగ్రహము. అం: చూ, కలియుగవర్జ్యములు.

శ్రామము. సం. వి. అ. పుం: చూ, మాసము. 1.

శ్రాయము. సం. వి. అ. పుం. 1. శ్రయణము. ఆశ్రయించుట: చూ, సన్నిధానము. 2; విశే. 2. శ్రీసంబంధమైనది.

శ్రావటికుఁడు. సం. వి. అ. పుం. గొడుగుపట్టెడువాఁడు: ఛాయాకరుఁడు.

శ్రావణము. సం. వి. అ. న. 1. వినిపించుట: చూ, శ్రవణము. 1; అం. పుం. 2. శ్రావణమాసము: చూ, మాసములు.

శ్రావణి. సం. వి. ఈ. స్త్రీ. 1. బోడతరము*: చూ, హాపుష; 2. శ్రవణానక్షత్రముతోఁ గూడిన శ్రావణపౌర్ణమి.

శ్రావణిక. అం. శ్రావణమాసము: చూ, సంవత్సరము (మాసములు.)

శ్రావ్యము. సం. విశే. 1. వినఁదగినది: చూ, శ్రవణీయము; అం. 2: అనూచ్యము దృశ్యము శ్రావ్యము అని ద్వివిధము. అందు శ్రావ్యమొకటి. ("చూడఁదగినది దృశ్యము; శ్రావ్యము సర్వశ్రావ్యము నియతశ్రావ్యమునయ్యె సర్వశ్రావ్యము (ప్రకాశము) నియతశ్రావ్యము (స్వగతము) కొందఱు దరినున్నవారికి వినఁబడుట యనియు నందురు.")

## శ్రి

శ్రితుఁడు. సం. విశే. 1. ఆశ్రితుఁడు; 2: చూ, సేవితుఁడు.

## శ్రీ

శ్రీ. సం. వి. ఈ. స్త్రీ. 1.=సిరి-సీ-తిరు. శ్రీదేవి: చూ, లక్ష్మి. 1; 2.=సిరి-సీ-తిరు. సంపద: చూ, సంపత్తి. 1; 3.=సిరి. ఐశ్వర్యము: చూ, సంపత్తు. 1; 4: చూ, త్రివర్గము. 1 (ధర్మార్థకామములు); 5. వృద్ధి: చూ, హెచ్చు. 2; 6. శోభ: చూ, వెలుతురు. 1; 7. అలంకరణము: చూ, భూషణము. 2; 8. కీర్తి: చూ, సమాఖ్య. 1; 9. బుద్ధి: చూ, వ్యాల్లేఖము. 2; 10: చూ, సరస్వతి; 11. విషము: చూ, సంగరము. 6; 12. ఉపకరణము: చూ, సాధనము. 2; 13. మారేడు*: చూ, శ్రీపర్ణము; పుం. 14. శ్రీయను రాగము: చూ, స్వరము. 2; స్త్రీ. 15. బౌద్ధదేవి: చూ, భార్య. 1—౭౧.

శ్రీకంఠి. అం: చూ, వేసరషాడవజరిభాషలు.

శ్రీకంఠిక. అం: చూ, భిన్నషడ్జకజభాషలు.

శ్రీకంఠుఁడు. సం. వి. అ. పుం: చూ, శివుఁడు.

శ్రీకరుఁడు. సం. విశే. 1. సంపత్కారుఁడు: చూ, సంపన్నుఁడు; 2. శ్రీరాగము పాడువాఁడు; 3: చూ, విష్ణువు. 1.

శ్రీకారరేఖాప్రోధి. అం: చూ, చిత్రవర్ణములు.

శ్రీకార్యము. సం. వి. అ. న. గుడిపారుపత్తెము (చూ, రపము. 1.) [మ. 2.

శ్రీకాళహస్తీశుఁడు. సం. విశే: చూ, కలింగుఁ

శ్రీకీర్తి. అం: చూ, జన్యతాళములు.

శ్రీకృష్ణాయనమః. అం. (కృష్ణః=కర్షతి=ఆత్మసాత్కరోతి, ఆనన్దత్వేన భక్తానాంమనః పరిణమయతి) భక్తులయొక్క మనస్సును ఆనందమయముగాఁ జేయు వస్తుప్రకోటికి నమస్కారము: చూ, ఓమ్.

శ్రీఖండము. సం. వి. అ. పుం.=సిరిగంధము. శ్రీగంధము: చూ, వాసన. 1.

శ్రీగంధము. సం. వి. అ. పుం.=సిరిగందము. 1: చూ, శ్రీఖండము; అం. 2: చూ, గంధములు.

శ్రీగర్భుఁడు. సం. వి. అ. పుం: చూ, విష్ణువు 1

శ్రీఘట్టము. సం. వి. అ. పుం.=సిరిగట్టు: చూ, శ్రీశైలము. [చూ, స్తన్యము

శ్రీఘనము. సం. వి. అ. న. మీఁగడపెరుఁగు:

శ్రీఘనుఁడు. సం. వి. అ. పుం: చూ, బుద్ధుఁడు.

శ్రీచూర్ణము. సం. వి. అ. న: చూ, తిరుచూర్ణము.

శ్రీతాళము. సం. వి. అ. పుం ఒకరకము తాడి* కుంతాళము-కుంతాళి, గుడపాకి, గూఢపాకి, తృణపుష్పిక, బృహస్కంధము, మహాతాళి, మృదుఫలము, శరాఫల, శిలాఫల, హింతాళి. (తె) కోఁగాడు. తద్వి.— ౧. తాడికి:—అక్షము, కరపత్రిపంతము, కాలము, కుశికము, తరురాజము, తాళ-తాళము-తాళి, పత్రిల, లాంగలము, లేఖ్యపత్రికము, వరాంగన. (తె) తాటి, తాడి-తాడు-తాఁడు; ౨. పెద్దతాడికి.— (మి) రామతాడు; 3: (తె): మునుఁగుబోండ*; ౪. తాటిపండునకు:—చోచము. ౫. ఈఁదాడికి: చూ, హింతాలము.

శ్రీదుఁడు. సం. వి. అ. పుం. (సంపదనిచ్చేవాఁడు.) 1: అర్థపుఁడు, అర్భకుఁడు, అసిధరుఁడు, ఇచ్ఛావసుఁడు, ఏకకుండలుఁడు, ఏకపింగళుఁడు-ఏకపింగుఁడు, ఏలబిలుఁడు-ఐలబిలుఁడు, ఓ. కిన్నరేశుఁడు-కిన్నరేశ్వరుఁడు, కుండలి, కుతనువు, కుబేరుఁడు, కుహువు, కైలాసనాథుఁడు, కైలాసౌకసుఁడు, గుహ్యకేశ్వరుఁడు, చకోత్రిఘుఁడు, జాతిదైత్యుఁడు, త్రిశిరుఁడు, త్ర్యంబకసఖుఁడు, ధనకేలుఁడు, ధనదుఁడు, ధనాధిపుఁడు, నరవాహనుఁడు, నిధినాథుఁడు, నృపతి, పిశాచకి, పుణ్యజనేశ్వరుఁడు, పౌలస్త్యుఁడు, మనురాట్టు, మనుష్యధర్ముఁడు, యక్షరాట్టు, యక్షుఁడు, రత్నగర్భుఁడు, రాజరాజు, వసువు, వైశ్రవణుఁడు, శ్రీమంతుఁడు, శ్రేష్ఠుఁడు, శ్వేతోదరుఁడు, సత్యసంగరుఁడు, సరస్వంతుఁడు. సోముఁడు, హర్యక్షుఁడు. (తె): కాయకంటి (కాయకన్నొటి), గిబ్బరాతుపకుఁడు, గుడ్డికన్నాదుసా, గొల్ల, చోగకాఁడు, జెక్కినీఁడు, జెక్కులతోఁడు, తత్తడినెక్కుదంట, పయిఁడితోఁడు-పైఁడితోఁడు-పసిఁడితోఁడు, బాబాకాతు, మానిసికాతు, ముక్కంటిచెలి, రాజేరాజు-రారాజు-రాతోఁడు, రొక్కపుదొర, రొక్కముతోఁడు, లిక్కిదొర, లిబ్బులకొంటి, వడజెక్కలిక, వాసిఁడు; 2: చూ, సంపన్నుఁడు; అం. 3: చూ, దిగధిపతులు. [సర్పము.

శ్రీధరము. సం. వి. అ. పుం.=సీదరము: చూ,

శ్రీధరాయనమః అం. (శ్రీధరః=శ్రియంధరతి) కీర్తిపహించిన వస్తువుకొఅను నమస్కారము: చూ, ఓమ్.

శ్రీధరుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, విష్ణువు. 1: 2 బుద్ధదేవుఁడు: చూ, సన్యాసి (బుద్ధుఁడు. 1)

శ్రీనందనము. అం: చూ, జన్యతాళములు.

శ్రీనివాసుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, విష్ణువు 1; 2: వెంకటేశ్వరుఁడు. (తె) తిమ్మప్ప, తిమ్మప్పఁడు.

శ్రీపతి. సం. వి. ఇ. పుం 1: చూ, విష్ణువు. 1; 2: చూ, రాజు. 1. [హాజ్జీ.

శ్రీపదము. సం. వి. అ. పుం. బోదకాలు: చూ,

శ్రీపర్ణము. సం. వి. అ. న. 1: అగ్నిమంథము, అరణి, కటుశృంగాలము, కణిక-గణిక, కాంచనపుష్పి, గంధకుసుమ, గంధపత్ర-గంధపత్రిక, గంధఫేని, గంధపుష్పి, గంధశాక

ము, గంధాఢ్య, గణికారిక, గౌరసువర్ణము-గౌరసౌవర్ణము, జయ, పావకము. (తె): కూరనెల్లి, నెల్లి, తక్కడ-తెక్కడ. తద్వి.—౧: అగ్నికము, అరణి, తపనము. (తె): చిఱునెల్లి, పిన్ననెల్లి; ౨: వనాగ్నిమంథము. (తె): అడవినెల్లి.*; 2. తామర*: చూ, సహస్రపత్రము; పుం. 3. మారేడు*: చూ, శ్రీఫలము.

శ్రీపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. 1. గుమ్ముడు*: చూ, సర్వతోభద్ర; 2. టేఁకు*: చూ, సర్వతోభద్ర; 3. పాఁపరబుడమ*: చూ, సర్వతోభద్ర.

శ్రీపర్ణిక. సం. వి. ఆ. స్త్రీ.—పై.—

శ్రీపాంచరాత్రబ్రాహ్మణులు. అం. వీరు ద్రావిడులలో నొక తెగవారు. ఏకాయన యజుశ్శాఖాప్రవర్తకులు. కాత్యాయన సూత్రానుష్ఠాతలు. వైదికులు. భగవచ్ఛాస్త్రోక్తపంచసంస్కార దీక్షాపరులు. ఆత్మార్థపరార్థయజనముల నారాయణునితప్ప యితరదైవముల నారాధింపని ఏకాంతవైష్ణవులు. వీరుదక్షిణదేశమందు విస్తారముగను క్వచిత్క్వచిదాంధ్రదేశమునను క్వచిత్ కన్నడదేశమునను గనుపించుచున్నారు: చూ, ద్రావిడులు.

శ్రీపుత్రము. సం. వి. అ. న. గుఱ్ఱము: చూ, హయము.

శ్రీపుత్రుఁడు. సం. వి. అ. పుం. సిరిచూలి: చూ, మన్మథుఁడు.

శ్రీఫలము. సం. వి. అ. పుం: కంటకము, కర్కటాహ్వము, కర్కటకము, గంధపత్రము, గంధఫలము, గోహరీతకి, గోహితము, బిల్వము, మంగళ్యము, మాలూరము, పత్రపాకి, శాండిల్యము, శ్రీపర్ణము, శ్రీవృక్షము, శైలూషము, (తె): బిలుపము, మారెడు-మారేడు*. తద్వి —౧. గంధగర్భము. (తె) కొండమారేడు*; ౨. మారేడుపండునకు.—బిల్వము. (తె) బిలువము.

శ్రీఫలి. సం. వి. ఈ. స్త్రీ. 1: అనంత, అమలకికము, అమృత, అమృతఫల, అసన, ఆమలకము-ఆమలకి, కయస్థ-కాయస్థ, కర్షఫల, కాష్ఠధాత్రీఫలము, కూపాండక, కోరంగము, క్షుద్రజాతిఫలము, క్షుద్రామలకము, గుల్మ-గుల్మి, జాతి, తిష్యఫల, దివ్య, ధన్య, ధాత్రి, మండ, రంగ, రాధ, వయస్థ, వృష్య, శివ. (తె) ఉసిరిక, నెల్లి*. తద్వి.—౧: పుల్లయుసిరిక; ౨: రాచయుసిరిక*; 3. ఉసిరికకాయకు.— గంధమూలిక; 2: అస్పృశ, కాల, కాలి, కుత్సల, కృష్ణ, కేశి, క్రీతకిక, క్లీతకిక, గంధపుష్ప, గ్రామీణ, చండాలి, డోల, దుర్గ, ద్రోణి, నీలము, నీలి-నీలిని, బహుక-మధుపర్ణి, రంజని-గజని, రేవ, శ్యామ-(తె): అవిరి, నీలి*. తద్వి —౧: అజలోమ, ఆలకము, కేశార్హ. (తె) పెద్దనీలి, పెద్దవిరి; ౨: చండాలిక, విషఘ్న, విషాణిక, వృష. (తె): పిన్ననీలి.* (చూ, రంజని.)

శ్రీభాసి. సం. వి. ఈ. స్త్రీ=తివాసి. చిత్రాసనము: చూ, సాకూకము (రల్లకము.)

శ్రీమంతము. సం. వి. అ. పుం. 1. బొట్టుగు*: చూ, శ్రీమాన్; విణ. 2. సంపదగలది: శ్లీలము; 3. ఒప్పిదముగలది, వలువు: చూ, హృద్యము. 2.

శ్రీమంతుఁడు. సం. వి. త్. పుం. 1: చూ, విష్ణువు. 1; 2: చూ, శ్రీదుఁడు; 3: చూ, సహస్రాక్షుఁడు; విణ. 4.=సిరిమంతుఁడు, లక్ష్మణుఁడు: చూ, సంపన్నుఁడు; 5. ఒప్పిదముగలవాఁడు: చూ, సజ్జనుఁడు. 2.

శ్రీమతి. సం. వి. ఈ. స్త్రీ.=సీమాటి, భాగ్యశాలిని: చూ, సౌభాగ్యవతి.

శ్రీమలిబ్రాహ్మణులు. అం: చూ. ఘూర్జరబ్రాహ్మణులు. ("ఘూర్జర బ్రాహ్మణులలో

నొక తెగ. శుక్లయజుర్వేదులు. విష్ణుమతస్థులు. వీరిలో ననేక తెగలు కలవు. మాఘుఁడను కవి యీ తెగలోని వాఁడు.")

శ్రీమాన్. సం. వి. న్. పుం. 1. తిలకము*, మంజరి, శ్రీమంతము: చూ, నువ్వు (నువ్వులు). తద్వి.—౧. పెద్దనువ్వునకు.—మహాతిలము. (తె) పెద్దనువ్వు; ౨. పొట్టినువ్వునకు—(తె) పొట్టినువ్వు; 3. నూఁబొడికి.—పిష్టకము; ౪. నువ్వుపువ్వునకు.—వజ్రపుష్పము; 2. శ్రీమంతునిబిరుదు; 3. విష్ణుభక్తులయొక్కయు శ్రీవైష్ణవులయొక్కయు బిరుదు.

శ్రీముఖ. అం: చూ, సంవత్సరములు.

శ్రీముఖము. సం. వి. అ. న. (గురువు మున్నగు పెద్దలువ్రాసిపంపెడు) శుభలేఖ.

శ్రీరంగఁడు. సం. వి. అ. పుం.=సిరంగఁడు. శ్రీరంగనాథుఁడు. (తె).—సంబెరుమాళ్లు, రంగఁడు, సిరంగఁడు-సీరంగఁడు.

శ్రీరంగము. సం.వి.అ.పుం.=సిరంగము. ఉభయకావేరీలమధ్యమునసుండు ఒక దివ్యక్షేత్రము. దీనినే వైకుంఠమందురు: రంగము: చూ, క్షేత్రములు.

శ్రీరమణము. అం: చూ, వృత్తము. 1. (ఇదిరుగ్మవతీఛాయను తొలిచరణమున్ను, దోదకవృత్తఛాయను కడమ చరణములున్ను నడచును.)

శ్రీరాగము. అం: చూ, పురుషరాగములు. (స్వరము. 2.)

శ్రీరామావతారము. అం. (శ్రీరాముము): చూ, అవతారములు. (రావణుఁడను రాక్షసరాజు భూలోకమంతయు జయించెను. వానికందఱును భయపడుచుండిరి. శ్రీరాముఁడు తన భార్యయగు సీతతోను, తమ్ముఁడగు లక్ష్మణునితోను, దండకాటవినిఁ దిరుగుచుండెను. అందే పర్ణశాలలో నొంటిగానున్న సీతను రావణుఁడెత్తుకొని పోయెను. రామలక్ష్మణులు సీతకొఱకు వెదుకఁగ సీత రావణుని లంకలో నుండినట్లు తెలిసెను. రామలక్ష్మణులు వానరులసహాయమున సముద్రమును దాఁటి రావణుని, వానికొడుకులు మొదలగువారినిఁ జంపిఁ సీతనుదీసికొని అయోధ్యకు వచ్చిరి. ఇదియె రామావతారము.

శ్రీరాముఁడు. అం. 1.=సీరాముఁడు. ఏకవీరుఁడు, ఐక్ష్వాకుఁడు, కపిప్రభుఁడు, కపిరథుఁడు, కాకుత్స్థుఁడు, కౌశలేయుఁడు, కౌశికప్రియుఁడు, కౌసల్యాజని, క్షీరశీష్ణుఁడు, ఖరధ్వంసి, దశకంఠజిత్తు, దాశరథి, నాథుఁడు, పురందరుఁడు, రఘునాథుఁడు, రఘురాముఁడు, రామచంద్రుఁడు, రామభద్రుఁడు, రాముఁడు, సీతాపతి. (తె) రాగవుఁడు, సీరాముఁడు; అం. 2: చూ, మహారాజులు.

శ్రీలము. సం. వి. అ. పుం: చూ, శూలము. 3.

శ్రీలుఁడు. సం. విశ. 1: చూ, సంపన్నుఁడు; 2: చూ, సజ్జుఁడు. 2.

శ్రీవత్సము. సం. వి. అ. పుం. 1. విష్ణువు రొమ్మునందలి మచ్చ, లాంఛనము: చూ, లక్షణము. 1-౨3; 2. సురంగిభేదము: చూ, రంధ్రము. 1.

శ్రీవత్సలాంఛనుఁడు. సం. వి. అ. పుం: చూ, విష్ణువు. 1. [6-2

శ్రీవత్సగోత్రము. అం: చూ, గోత్రము. 13.

శ్రీవరాహుఁడు. సం.వి.అ. పుం: చూ, విష్ణువు.౨.

శ్రీవరుఁడు సం వి.అ.పుం =సిరివరుఁడు. -వై-

శ్రీవల్లి. సం. వి. ఈ. స్త్రీ. 1: అటికము, ఊర్జకము, ఏకాష్ఠిలము, కంటవల్లి, కాకనామము, కాకశీర్షము, కుసలి, క్రిమపూరకము, పాశుపతము, బకపుష్పము, బకము-బాకము, వల్లిక, వసుకము, వసుపట్టము, వసువు*; 2: చూ, లింగదొండ*.

శ్రీవాసము. సం. వి. అ. పుం. 1: చూ, వృక్షధూపము; 2. తామర*: చూ, సహస్రపత్త్రము.

శ్రీవృక్షకము. సం. వి. అ. పుం. 1. గుఱ్ఱము ఱొమ్మునందుఁగల సుడి: చూ, సుడి; అం. 2: చూ, శుభావర్తములు.

శ్రీవృక్షకి. సం. వి. న్. పుం. శ్రీవృక్షకమను సుడిగల గుఱ్ఱము: చూ, హయము.

శ్రీవృక్షము. సం. వి. అ. పుం. మారేడు*: చూ, శ్రీఫలము; 2. రావి*: చూ, శ్యామలము. 2; అం. 3: చూ, అశ్వోత్పత్తులు.

శ్రీవృత్తము. అం: చూ, వృత్తము. 1. (పాదమునకు ఒక్కొక్క యక్షరము గురువుగాఁగల మొదటి ఛందస్సునందు పుట్టినవృత్తము. ఉదా.—"శ్రీ-గో-పా-లా")

శ్రీవేష్టము. సం.వి. అ.పుం: చూ, శ్రీవాసము.1.

శ్రీవైఖానస బ్రాహ్మణులు అం. (వైఖానస బ్రాహ్మణులు): చూ, ద్రావిడులు (ద్రావిడులలో నొక తెగ. వీరు ఏకాయనయజుశ్శాఖీయులు. వైఖానససూత్రానుష్ఠాతలు. వైదికులు. భట్టాచార్యులు అను బిరుదముకలవారు. గర్భచక్రాంకన పరులు. ఆత్మార్థయజనమును శ్రీశాస్త్రోక్త పరార్థయజనముల నారాయణునితప్ప యితరదైవముల నారాధింపని ఏకాంతవైష్ణవులు. వీరు ద్రావిడ, ఆంధ్ర కన్నడదేశములందున్నారు.)

శ్రీవైష్ణవబ్రాహ్మణులు. అం: చూ, ద్రావిడులు ("యజుర్వేదులు కొందఱును, ఋగ్వేదులు కొందఱును, సామవేదులు కొందఱును, శుక్లయజుర్వేదులొక కొందఱును కలరు. ఆశ్వలాయన ఆపస్తంబ బోధాయన ద్రాహ్యాయన కాత్యాయనసత్యాషాఢాదిసూత్రప్రవర్తకులై శ్రీపాంచరాత్రోక్త పంచసంస్కారపరులై. వైష్ణవేష్ట్యాదులచే శ్రీవైష్ణవులని ప్రసిద్ధిఁజెందినవారు. వీరిలో వడవాలా తెంగలయను సంప్రదాయభేదములచే ద్రావిడ ప్రబంధప్రాధాన్యముగల వారొకకొందఱును వేదమును ప్రబంధములురెండును ప్రధానమను వారుకొందఱునునై పురశిఖాదిభేదములతో వర్తింపుచు అందఱును విశిష్టాద్వైత ప్రవర్తకులై యున్నారు.")

శ్రీశైలము. సం. వి. అ. పుం. 1. ఒక శ్రేష్ఠపర్వతము: శ్రీఘట్టము, సిరిగట్టు: చూ, హిమాలయము (పర్వతము); అం. 2. చూ, లింగములు.

శ్రీసంజ్ఞము. సం వి అ న దేవకుసుమము*: వరాళము: చూ, లవంగము. తద్వి.— లవంగపు పువ్వునకు _శృంగారము

శ్రీసర్వదండిని. అం: చూ, తంత్రములు.

శ్రీహస్తిని. సం. వి. ఈ స్త్రీ. గురుగు, భూరుండి*: చూ, హస్తిని.

## శ్రు

శ్రుతమగు. సం. స. క్రి: చూ, విను. 2.

శ్రుతము. సం. వి. అ. న. 1. వినికి: చూ, శ్రవణము. 2; 2. శాస్త్రము: చూ, శాస్త్రము. 1; విశే. 3. వినఁబడినది.

శ్రుతి. సం. వి. ఇ. స్త్రీ. 1: చూ, వేదము; 2. చెవి: చూ, శ్రోత్రము; 3. వినికి: చూ, శ్రవణము. 2; 4.=సుతి. సంగీతమందలి మేళగింపు: చూ, సుతి. 2; 5.=సుతి. కంఠస్వరాదులకు సహాయమగు తంత్రి లోనగువాని ధ్వని: చూ, సుతి. 3; 6.=సుతి. ఒలిచి సుతిపోయుట చేర్పఱచిన తోలుతిత్తి: ఉపాంగము. (తె) తిత్తి, సుతి (చూ, సంచి); చూ, సుతి. 4; 7.=సుతి. కొలిమితిత్తి (అని కొందఱు): చూ, భస్త్రి; 8.=సుద్ది. వృత్తాం

తము: చూ, సమాచారము. 2; 9: చూ, శబ్దము. 2; అం. 10: చూ, రసవదలంకారములు; 11: చూ, అష్టాదశపదార్థములు.

శ్రుతికారి. సం. వి. ఇ. పుం.=సుతివాఁడు, తిత్తినూఁదువాఁడు: చూ, సుతికాఁడు.

శ్రుతులు. అం. (శ్రుతిస్థానములు.) (చూ, ఉచ్చ్రితము): తీవ్రము, కుముద్వతి, దయావతి, ఛందోవతి మందము, రంజనము, రక్తిక, రౌద్రి, క్రోధను, వజ్రిక, ప్రసారిణి, ప్రీతి, మార్జని, క్షితి, రక్తా, సందీపనము, ఆలాపి, మదంతి, రోహిణి, రమ్యా, ఉగ్రి, క్షోభిణి. (22)

## శ్రే

శ్రేణి. సం. వి. ఇ. పుం, స్త్రీ. 1: ఆళి-ఆళీ-ఆలి-ఆవళి-ఆవలి, ఘట, ఛాయ, ధోరణి, పంక్తి, పాళి, పిచ్చు, వారము, వీచి, వీథి, సరణి. (తె): అంచె (బ). ఓలి, చాలు-చాలుపు-చాల్పు, తరబడి, తరము, తోరణ, దొంతి, దోర, పదుగు, బరి, బవుఁజో-బాఁజో, బంతి, బారు, మొనము-మున్నము, రాజి, రాజిక, రేక, వంతు, వరుస, సంతతి, సారిది, సాలపు, సోరి. తద్వి.—౧. చేకట్లచాలుకు.—(తె) చేకట్లచేలు; ౨. ఉత్పంక్తికి.—ఉత్పంక్తి. (తె) అడుకు, దొంతర-దొంతి, దోర, పేరుపు-పేర్పు, వరుస; 3. క్రిక్కిఱిసిన పంక్తికి.—రాజి. (తె) లేక; ౪. ఇండ్లవరుసకు.—వాటము, వాటిక. (తె) వాడ (చూ, మార్గము. 1.); 2 సమానులైన శిల్పులవరుస: చూ, స్వర్ణకారుఁడు; 3. బొక్కెన: చూ, హరివాణము. (పాత్రము. 6-౨౫.); అం. 4. శ్రేణి, మాల, క్రమము, పరంపర. ౧. ఆరోహశ్రేణి, ఉచ్ఛశ్రేణి; ౨. పరిచ్ఛిన్నశ్రేణి; 3. అవరోహణశ్రేణి; ౪. అపసృతశ్రేణి; ౫. అనంతశ్రేణి. మొ.

శ్రేణిక. సం. వి. ఆ. స్త్రీ. గుడారము: చూ, సదనము. 1. [రాజవిశేషము.

శ్రేణుఁడు. సం. వి అ పుం. మగధదేశీయ

శ్రేయము. సం. వి. స్. న. రూ—శ్రేయస్సు-శమ్. 1: చూ, శుభము 1, 2 ధర్మము: చూ, సుకృతము. 1, 3. చూ, మోక్షము. 1; 4. ముఖ్యము: చూ, శ్రైష్ఠ్యము; విణ. 5 శ్రేష్ఠమైనది: చూ, శ్రైష్ఠ్యము.

శ్రేయసి. సం. వి ఈ. స్త్రీ. 1. కరక*: చూ, హరీతకి, 2 గజపిప్పలి*. చూ, పిప్పలి 1-౨; 3. చిఱుబొద్ది*. చూ, పిడ్ధకర్ణి.

శ్రేయస్సు సం వి.స్.న,విణ: చూ రూ-శ్రేయము.

శ్రేష్ఠిగు. ని. అ. క్రి: (తె) ఉరు-ఉఱు.

శ్రేష్ఠము. సం విణ ముఖ్యము: చూ, శ్రైష్ఠ్యము.

శ్రేష్ఠవాచకములు. అం: మతల్లిక, మచర్చిక, ప్రకాండము, ఉద్ఘము, తల్లజము. (5)

శ్రేష్ఠి. సం. వి. న్. పుం. 1. కులమునందు శ్రేష్ఠుఁడైనశిల్పి: చూ, స్వర్ణకారుఁడు; 2 కులశ్రేష్ఠుఁడైనవాఁడు: చూ, సజ్జనుఁడు; 3.=సెట్టి కోమటిపేరునకు అనుబంధము: చూ, వైశ్యుఁడు.

శ్రేష్ఠుఁడు. సం. వి. అ. పుం. 1. కుబేరుఁడు: చూ, శ్రీదుఁడు; విణ. 2. మేలిమిఁబొందినవాఁడు: అగ్రగణ్యుఁడు, అగ్రజన్ముఁడు, అగ్రతస్సరుఁడు, అగ్రసరుఁడు-అగ్రేసరుఁడు, అగ్రిముఁడు, అగ్రియుఁడు-అగ్రీయుఁడు-అగ్రుఁడు (అగ్ర్యుఁడు). అనవరార్ధ్యుఁడు-అనవరార్ధ్యుఁడు, అనుత్తముఁడు, అనుత్తరుఁడు, ఉత్తముఁడు, ఉదీచ్యుఁడు, ఋషభుఁడు, జ్యాయుఁడు, నాయకుఁడు, పరార్థ్యుఁడు, పారమార్థికుఁడు, పుంగవుఁడు,

పున్నాగము, ప్రధానుఁడు, ప్రబర్హుఁడు, ప్రముఖుఁడు, ప్రవరుఁడు, ప్రవేకుఁడు, ప్రాగ్రహరుఁడు-ప్రాగ్ర్యుఁడు, బృందారకుఁడు, మల్లుఁడు, ముఖ్యుఁడు, యువ, వరిష్ఠుఁడు, వరీయుఁడు, వరుఁడు, వరేణ్యుఁడు, వర్యుఁడు, వీరుఁడు, వృషుఁడు, శార్దూలుఁడు, సత్తముఁడు, సార్థవాహుఁడు, స్థపతి. (తె): అనుఁగు, కన్నాకు, గమికాఁడు, గామిడి, గాప్రమణి, జెట్టి, తలకట్టు, దొడ్డవాఁడు, నాఁడెకాఁడు-నాణెకాఁడు, పెగడ-పెగ్గడ-ప్రెగ్గడ-పెవడ, మాసటి-మాసటీఁడు-మాస్టీఁడు, మేటరి, మేటి, మేలుబంతి, మొదటివాఁడు, వాసుదు. తద్వి.—ఉత్తమోత్తముఁడు, పరాత్పరుఁడు, వరీయుఁడు. ("చూ, వాసుదు. 1.")

## శ్రై

**శ్రైష్ఠ్యము.** సం. వి. అ. న. శ్రేష్ఠత్వము: అకరము, ఉత్కర్షము, ఔత్కృష్ట్యము, కల్యము, కుంజరము, తంత్రము, నాగము, ప్రధానము, లక్ష్మము, లలామము, వీరభద్రము, వ్యాఘ్రము, శమ్, శిరము, శ్రేయము-శ్రేయస్సు, సింహము. (తె) అణిము, ఎక్కువ, ఒసపరి, తరము, తలకట్టు, నేటు, పచ్చేరణ, మంచి, మిహి, మేలుబంతి-మేల్బంతి. తద్వి.—౧ (విణ) శ్రేష్ఠమైనది:-అంగి, అగ్రణి, అగ్రము-అగ్రిమము-అగ్రియము-అగ్రీయము-అగ్ర్యము, అతిశోభనము. అనవద్యము, అనవరార్థ్యము, అనుత్తమము, అనుత్తమము, అనుపమ, అర్ఘ్యము, అవదాతము, ఉత్తమ-ఉత్తమము, ఉత్కృష్టము, ఉదారము, ఏకము, కకుత్తు-కకుదము, కుతూహలము, జ్యేష్ఠము, తిలకము, నాగరికము, నికరము, పరమము-పరము, పరార్థ్యము, ప్రశస్కాలము, ప్రథమము, ప్రబర్హము, ప్రశస్తము, ప్రముఖము, ప్రాగ్రహరము-ప్రాగ్ర్యము, భద్రము, ముఖ్యము, వరము, వరేణ్యము, వర్యము, వీరము, వృషభము, శస్తము, శ్రేయము-శ్రేయస్సు, శ్రేష్ఠము, సంస్కృతము, సత్తమము, సత్తు, సారము. (అవ్య):-ఆ, అభిక్ష్ణము-అభీక్ష్ణము, ఉరు. (తె. వ):-ఎక్కుడు, కన్నాకు, కుంకటి-కూఁకటి, తలమానికము, తల్లి, నయము, నిగరము-నిగారము, పెద-పెద్ద, మిక్కిలి, మిన్న, మిహి, మీసరము, మేటి, మేలు, మేలుతరము, మేలుబంతి-మేల్బంతి, మొగము, రకము, లెస్స, వంచే-వంచేము, సావిరి, సిరాజీ; ౨. మిక్కిలి యురువైనది:-అర్ఘ్యము, పరిష్ఠము.

## శ్రో

**శ్రోణి.** సం. వి. ఇ ఈ. స్త్రీ: అవరోహము, ఆరోహము, కకుద్మతి, కటకము, కటీరకము, కలత్రము-కళత్రము, కాంచీపదము, ఖల్లము, జ, జఘనము, నితంబము, ప్రోథము. తద్వి.—౧. మొలస్థానమునకు. (తె) మొత్త; ౨. పిఱుఁదులయున్న తికి.- కటిప్రోథము, స్ఫిక్కు; ౩. పిఱ్ఱఁదిమీఁదిగుంటను.-కుకుందరము, కూపకము, కూపము. (తె): గుంట-గుంత; ౪. కటిప్రదేశమునకు: కకుద్మతి, శ్రోణిఫలకము. (చూ, మొల. 1.) (ఇవి పలకలవలెనుండు శ్రోణి.)

**శ్రోణిఫలకము.** సం. వి. అ. న: చూ, శ్రోణి.౪.

**శ్రోణుఁడు.** సం. విణ. పిమ్మ్మేకకుంటు: చూ, సూరసూతుఁడు.

శ్రోత. సం. విణ. (ఋ. ఈ. ఋ): (తె) వినువాఁడు.

శ్రోతవ్యము. సం. విణ. వినఁదగినది: శ్రవణీయము, శ్రావ్యము.

శ్రోత్రము. సం. వి. అ. న: కర్ణము, కుహరము, ధ్వనిగ్రహము, శబ్దగ్రహము, శబ్దాధిష్ఠానము, శ్రవణము, శ్రవము, శ్రుతి. (తె): ఉలివు లాగ, చెవి, జోము-జోనుగు, లాఁగరి, వీను. తద్వి.— ౧. బయటిచెవికి.—శష్కులి; ౨. చెవి వెనుకటిభాగమునకు —(తె): పెడ అం. 2: చూ, ఇంద్రియములు.

శ్రోత్రశృంగన్యాయము. అం. ఒక న్యాయము.

శ్రోత్రియబ్రాహ్మణులు. అం: చూ, మైథిలులు (మైథిలులలో నొక తెగ. కృష్ణయజుర్వేదులు సామవేదులు ఋగ్వేదులునై ఆపస్తంబ గోభిల ఆశ్వలాయన శాఖాప్రవర్తకులునై యున్నారు.)

శ్రోత్రియము. సం. విణ. 1. కొద్దిపన్ను (క్వేటి రెంటు) గల యీనాముభూమి; అం 2: చూ, ఇంద్రియములు.

శ్రోత్రియుఁడు. సం. వి. అ. పుం. వేదముఁజదివిన బ్రాహ్మణుఁడు, ఛాందసుఁడు: చూ, స్వస్తిముఖుఁడు. 1.

## శ్రౌ

శ్రౌతము. సం. వి. అ. న. 1. గార్హపత్యాహవనీయ దక్షిణాగ్నులు. (చూ, వహ్ని.): చూ, అగ్నులు; విణ. 2. వేదమునందు విధింపఁబడినది. [గముగల పూర్ణోపమాభేదము.

శ్రౌతి. సం. వి. ఈ. స్త్రీ. ఇవాదిశబ్దప్రయో

శ్రౌషట్. సం. అవ్య. (స్వాహా, శ్రౌషట్, వౌషట్, వషట్, స్వధా అను నీయైదును దేవతలకు హవిస్సు నిచ్చుటయందు వర్తించును. "అగ్నయే స్వాహా, అస్తుశ్రౌషట్, శిఖాయై వౌషట్, వషట్కరోతి, స్వధా పితృభ్యః".)

## శ్ల

శ్లక్ష్ణుఁడు. సం. విణ: చూ, రూ శ్లక్ష్ణుఁడు.

శ్లక్ష్ణత్వక్కు. సం. వి. చ్. స్త్రీ. ఏఱుజోజి:*: చూ, సుభిక్ష. [నూత్రము. 1.

శ్లక్ష్ణము. సం విణ. సన్నపునూలుపోఁగు: చూ,

శ్లక్ష్ణుఁడు. సం. విణ. రూ—శక్ష్ణుఁడు-శ్లక్ష్ణుఁడు. 1. అల్పుఁడు: చూ, హీనుఁడు; 2: ప్రియంవదుఁడు, ప్రియవాది. (తె). ఇచ్చకాలమారి, ఇచ్చకుఁడు, ఇచ్చగొండి.

శ్లథము. సం. విణ: శిథిలమయినది: జగ్గరము-జర్జరితము-జర్జరీకము, శిథిలము. (తె) వదులుబాటు.

## శ్లా

శ్లాఘ. సం. వి. ఆ. స్త్రీ: 1. ప్రశంస, మిక్కిలిస్తుతి: చూ, స్తోత్రము; 2. పరిచర్య: చూ, సేవ; 3. ఇచ్ఛ: చూ, కోరి (వాంఛ.)

శ్లాఘన. సం. వి. ఆ. స్త్రీ: చూ, శ్లాఘ. 1.

శ్లాఘనీయము. సం. విణ: చూ, శ్లాఘ్యము.

శ్లాఘించు. సం. స. క్రి. ప్రశంసించు: చూ, స్తుతించు. [నీయము. (తె) మెచ్చ-

శ్లాఘ్యము. సం. విణ. శ్లాఘింపఁదగినది: శ్లాఘ

## శ్లి

శ్లిష. సం. వి. ఆ. స్త్రీ. కౌఁగిలింత: చూ, సంశ్లేషము.

శ్లిష్టము. సం. విణ. శ్లేషతోఁగూడినది.

## శ్లీ

శ్లీలము. సం. విణ. సంపదగలది: చూ, సంపన్నము. 1.

## శ్లే

శ్లేష. సం. వి. అ. స్త్రీ. 1. కలయిక: చూ, సంయోగము; అం. 2: చూ, రూ-శ్లేషము; 3. రూ-శ్లేషము. కావ్యగుణములలో నొకటి: చూ, గుణములు, కావ్యగుణములు.

శ్లేషము. అం 1(శ్లేష): చూ, అలంకారము. 3("ఒక వాక్యమునకే యర్థాంతర కల్పనము చేయుట. ఇది ప్రకృత అప్రకృత ప్రకృతాప్రకృత భేదముచే త్రివిధము. ఉ. మమ్మ మాధవుఁ డేలుత. ఉ. మాదవ, మాధవ.") ("ప్రకృతాప్రకృతములకు శబ్దమాత్ర సామ్యము కలిగి రెండుపక్షములయందు రెండర్థముల నిచ్చునది శ్లేషాలంకారము. ఉదా.—ఉచ్చతరులచే నొప్పమీఱుచు మంజులతలచే మించు కొమ్మల కాకరంబగు నవ్వరంబారామంబు కడింది నొప్పమీఱు". ఇచట సమానధర్మము లేకున్నను నగరమునకును నారామమునకును నుచ్చతరులచే నొప్పమీఱుచు మించు ఇత్యాది శబ్దములు రెండుపక్షములయందు సమానముగా నుండుటవలన శ్లేషాలంకారము. ఉచ్చతరులచేతన్=మిక్కిలి ధనవంతులైన వారిచే=పురపరము. పొడవగు చెట్లచే=ఆరామపరము. మంజులతలచే=మృదులత్వముచే, మించు=ఒప్పుచున్న, కొమ్మలకు=స్త్రీలకు, అనిపురపరము. మంజులతలచే=మృదువగు తీఁగలచే, మించు=ఒప్పుచున్న. కొమ్మలకు=వృక్షశాఖలకు. అని యారామపరము."); 2: చూ, శ్లేష. 3.

శ్లేష్మణుఁడు. సం. విణ: చూ, శ్లేష్మలుఁడు.

శ్లేష్మనాడి. వా. వి. కఫనాడి: చూ, వాతనాడి.

శ్లేష్మప్రకృతి. అం: చూ, ప్రకృతిత్రయము.

శ్లేష్మము. సం. వి. న్. పుం. అవలాశము, కఫము, కసామయము, కల్కము, ఖటము-ఖేటము-ఖేటకము. (తె): కళ్ల-కళ్లి-కళ్ల, తెమడ. (చూ, రోగము. 1) తద్వి.-చూ, శింఘాణము; అం. 2: చూ, దోషములు.

శ్లేష్మలుఁడు. సం. విణ. శ్లేష్మరోగముగలవాఁడు: శ్లేష్మణుఁడు.

శ్లేష్మాంతకము. సం వి. అ. పుం. 1: చూ, రూ-శ్లేష్మాతకము; 2 ఒకమందు.

శ్లేష్మాతకము. సం. వి. అ. పుం: రూ-శ్లేష్మాంతకము-శ్లేష్మాతము, ఉద్దాలము, కందరటము, కర్బుదారకము, కర్బురటము, కోలకము, గంధపుష్పము, బహువారకము-బాహువారకము, వసంతకుసుమము, లేఖశాటము, శీతము, శేలువు.(తె)—విరిగి-విరిగె-విరివి-విరి-విఱిగి-విఱవి.*. (నక్కెరు-సీమనక్కెరు అనియు వాడుక.)

శ్లేష్మాతము. సం. వి. అ. పుం —పై.—

## శ్లో

శ్లోకము. సం. వి. అ. పుం. 1. సంస్కృతపద్యము. ఛందోబద్ధమైన వృత్తము (పూర్వాఁబదు నది): కారిక, గాథ, ఇ, పద్యము, వృత్తము. (తె): పద్దియము-పద్గె-పద్దెము. (చూ, వృత్తము. 1.); 2. కీర్తి: చూ, సమాఖ్య.

## శ్వ

శ్వగడి. సం. విణ. వేఁటకుక్కల గుంపువాఁడు.

శ్వదంష్ట్రి. సం. వి. అ, స్త్రీ. పల్లేరు*: చూ, స్వాదుకంటకము.

శ్వనము. అం: చూ, తానములు.

శ్వనాడికము. సం. వి. అ. న. అటకమామిడిక: చూ, మామిడి. [చూ, సురియాసపు

శ్వపచుఁడు. సం. వి. అ. పుం. చండాలుఁడు

శ్వపుచ్ఛన్యాయము అం. కుక్కతోఁక యెంత వంచికట్టినను వంకర తీఁదను రీతి.

శ్వభోజనము. అం: చూ, నరకములు.

శ్వభ్రము. సం. వి. అ. న. 1. బెజ్జము: చూ. రంధ్రము. 1; 2. ఏనుఁగుకుబట్టు పల్లము: చూ, వారి. 4. [చూ, శోఫ.

శ్వయథువు. సం. వి. ఉ. పుం. వాఁపురోగము:

శ్వవృత్తి. సం.వి. ఇ స్త్రీ.కొలువు: చూ, సేవ. 1

శ్వశితము అం: చూ, రతిధ్వనులు.

శ్వశురుఁడు. సం. వి. అ. పుం. 1. అలుమగల తండ్రి: గురువు, పూజ్యుఁడు. (తె):— మామ; వా. 2: చూ, పూజ్యుఁడు. 2.

శ్వశురులు. సం. వి. అ. పుం.(బ).అత్తమామలు.

శ్వశుర్యుఁడు. సం. వి అ. పుం. 1. మగనిఅన్న: (తె) బావ, బావగారు; 2. భార్యఅన్న: బావ, బావగారు. [(తె) అత్త.

శ్వశ్రువు. సం. వి. ఊ. స్త్రీ. అలుమగలతల్లి:

శ్వశ్రూభిక్షాన్యాయము. అం. కోడలు లేదనిన దానముపక్షముతెగిలి అత్త స్వతంత్రురాలై తాను లేదనిన రీతి.

శ్వశ్శ్రేయసము. సం. వి.అ.న. 1: చూ,శుభము.1; 2. సుఖము: చూ, సంతోషము; 3. ముక్తి: చూ, స్వర్గము. 2 (మోక్షము. 1.); విశే. 4. శుభకరము: చూ, శుభము. 4.

శ్వసనము. సం. వి. అ. న. 1: చూ, శ్వాసము.1; పుం. 2. గాలి: చూ, వాయువు; 3. మంగ*: అరాళము, కంఠము, కట (ఠ) హాటకము, కరహాటకము, కులకము, గాలవము, గాళము, ఛగలాండి, జగలము, తస్కరము, తుండి, పిండీతకము, బస్తాంద్రి, మదనము, మరువకము, వృషగంధిక, శల్యకము. (తె).— గాడిదగడప, చోరకాసి, కోరకాసిదెబ్బ, మంగ - మ్రంగ. తద్విశేషములు —గా: కృష్ణపిండీతకము, కృష్ణపిండీతకము.(తె) నల్లమ్రంగ. తె: కరహాటము, క్షుద్రము, మహాపిండీతకము, మహాపుత్రజీవి, స్థూలఫలము. (తె): పెద్దమ్రంగ*; 3 జేమురపు:— (చూ. జేము. 1. *.) (ఇందుకొన్ని ప్రతులలో కానవచ్చు కడ గల "శ్వసనము 2" ను "శ్వసనము 3" అని సవరించుకొనవలయును".)

శ్వసథన్యాయము అం. ఒకానొక న్యాయము.

శ్వసితము. సం. వి. అ న. 1: చూ, శ్వాసము.1; 2. బాహ్యరతియందు హస్తతాడనము వలనఁ కలిగిన యొకానొకధ్వని: చూ, స్వరము. 2; అం. 3: చూ, చుంబకక్రియలు.

## శ్వా

శ్వాఫూటము. సం. వి. అ. పుం. బరిసెంక*: చూ, శాఫోట.

శ్వాఫోట. సం. వి. ఆ. స్త్రీ. —పై.—

శ్వానజిహ్వ. సం. వి. ఆ. స్త్రీ. అపుచెముడు*: చూ, సువిరేచని. [ట*: చూ, వాయింట.

శ్వానబర్బర. సం. వి. ఆ. స్త్రీ. కుక్కవాయింట

శ్వానమకరన్యాయము. అం. మొసలి నీటిలోనుండియేనుఁగునైనలాగును. కానిపైకివచ్చిన కుక్కచే భంగపడునను రీతి. [కునకము. 1.

శ్వానము. సం. వి. అ. పుం. కుక్క: చూ,

శ్వానమైథునము. సం. వి. అ. న. 1. కుక్కరతి: చూ, సంయోగము; వా. 2.లంకెపీడని చిక్కు. "ప్రవిశే శ్వసుఖ మాప్నోతి నిర్గమే ప్రాణసంకటమ్."

శ్వాపదము. సం. వి. అ. పుం. 1. వ్యాఘ్రము: చూ, శార్దూలము; 2. హింసించెడి పశువు.

శ్వావత్కృక్షి. అం: చూ, దండవ్యూహములు.

శ్వావత్తు. అం.—పై.— [సూకరము.

శ్వావిధము. సం. వి. ధ్. పుం. ఏదుపంది: చూ,

శ్వాసకాసము. సం. వి. అ. పుం. 1. ఉబ్బసముతోడిదగ్గు: చూ, హనువు. 4 (రోగము. 1—౧౦; దగ్గు. 1.); 2. ఉబ్బసమును పుట్టించెడిదగ్గు: చూ, హనువు. 4 (రోగము. 1—౧౦; దగ్గు. 1.)

శ్వాసబంధము. సం. వి. అ. పుం: యాకము, (తె) ఊపిరికుట్టు, ఒగరుపు—ఒగర్పు

శ్వాసము. సం. వి. అ. పుం. 1: ఆవి, శ్వసనము. (తె) ఊదుపు—ఊద్పు, ఊపిరి, ఊరుపు—ఊర్పు, గుక్క—గ్రుక్క, గ్రుక్కిలి, సరము. తద్వి.—౧. వేఁడియూపిరికి:— ఆశుశుక్షణి, ఉష్ణనిశ్వాసము; ౨: ఆశ్వాసము, ఉచ్ఛ్వాసము, ఉద్గ్రాహము, ఉద్వహనము, ఊర్ధ్వశ్వాసము, ఘుటము, ప్రాణము. (ప్రాణవాయువు). (తె): ఎగఊపిరి, (చూ, వాయువు); ౩: పీనశము—పీనసము, ప్రతిశ్యాయము. (తె): పడిసెము, ముక్కుతెవులు, రొంప; ౪: ఊపిరికుట్టునకు.—(చూ, రోగము. 1: చూ, హనువు. 4); 2. గాలి: చూ, వాయువు; 3. దగ్గు: చూ, హనువు. 4 (రోగము. 1—౧౦); అం. 4: చూ, లక్షణాంగములు. (ఊపిరి పద్మగంధమైన భూపతియగు.)

## శ్వి

శ్విత్రము. సం. వి. అ. న. తెల్లపులుము: చూ, సితము 1.

శ్విత్రి. సం. విశే. (న్. ఈ. న్) శ్విత్రరోగముగలవాఁడు: (చూ, కుష్ఠి).

## శ్వే

శ్వేత. సం. వి. ఆ. స్త్రీ. 1. గవ్వ: చూ, వరాటకము. 1; 2. కట్లతీఁగ*: చూ, శంఖిని; 3. తెల్లకలిగొట్టు*: చూ, స్థాలి. 2.

శ్వేతకంటకారి. సం. వి. ఈ. స్త్రీ. 1. తెల్లవాఁకుడు*: చూ, వాఁకుడు; 2. శ్లాఘ్యాశ్లాఘ్యగుణోత్కర్షసారము.

శ్వేతకరవీరము. సం. వి. అ. పుం. తెల్లగన్నేరు*: చూ, హయమారకము.

శ్వేతకాంభోజిక. సం. వి. ఆ. స్త్రీ. తెల్లగురిజె*: చూ, శ్వేతపాకి.

శ్వేతకుటజము. సం. వి. అ. పుం. పాలకొడిస*: చూ, వత్సకము. ౧. [చూ, సుగంధికము.

శ్వేతకుఠేరకము. సం. వి. అ. పుం. తెల్లగగ్గెర*:

శ్వేతకేతుఁడు. సం. వి. అ. పుం: చూ, బుద్ధుఁడు.

శ్వేతగరుత్తు. సం. వి. త్. పుం. తెలిపిట్ట: చూ, హంస. [చూ, సుషవి.

శ్వేతజీరకము. సం. వి. అ. పుం. తెల్లజీలకఱ్ఱ:

శ్వేతఖురి. అం: చూ, చిత్రవర్ణములు.

శ్వేతతులసి. సం. వి. ఈ. స్త్రీ. తెల్లతొళసి*: చూ, హరిప్రియ.

శ్వేతద్వీపము. సం. వి. అ. పుం. 1. ఇంద్రునియేనుఁగు: చూ, హస్తి; 2: తెల్లదీవి (చూ, లంక. 1.); తద్వి.—౧. జంబూద్వీపమునకు—వర్షము; ౨: సింహళము. (తె) సింగళము. (చూ, ద్వీపములు. లంక. 1.)

శ్వేతపత్రము. సం. వి. అ. పుం. 1: చూ, హంస; 2. తెల్లయిరుగుడు*: చూ, హస్తి.

శ్వేతపాకి. సం. వి. ఈ. స్త్రీ: ధ్వాంక్ష, మధుశ్రవ, శిఖండిని, శ్వేతకాంభోజిక. (తె): తెల్లగురిగింజ—తెల్లగురిజె*. తద్వి.—౧. గురి

వెందకు.—అంగారవల్లి - అంగారవల్లిక. అజ్ఝటాఫల, ఉత్తుండిక, కణీచి-కణీచి-కనీచి, కాంచి, కాంభోజి, కాకచించ-కాకచించి-కాకచించిక, కాకజంఘు, కాకణంతి-కాకణంతిక, కాకతిక్త, కాకతుండి-కాకతుండిక, కాకదక, కాకనచి, కాకనాశిక, కాకపీలి, కాకపీలువు, కాకధంజి, కాకరక్త, కాకస్వాహా, కాకాదిని, కుంచిక, కృష్ణచూడిక, కృష్ణరక్తకము, కృష్ణరక్తిక, కృష్ణల, కృష్ణలకము, కృష్ణశీర్షక, గుంజ, చించి, చూడామణి, తామ్రిక, తిలబీజ, తులాబీజము, మార్కవల్లి, వరాసవ, వాయసి, శార్దేష్ట, శితిక, శిలాపాకి, శీర్షాహ్వ, స్తిల. (తె) గురిగింజె-గురుగింజె-గురిజె-గురివెంద; 2. బండిగురివెందకు.—అంగారవల్లి - అంగారవల్లిక, ఉత్తుండకి, కాంభోజి, కాకతిక్త, కాంతుండిక, గార్గేష్ట, మాధవి, వాసంతిక. (తె)బండిగురిగింజె-బండిగురివెంద- బండిగురుగింజే- బండిగురువెంద; 3. పూలగురివెందకు.—అతిముక్తకము-అతిముక్తము,ఉదుంబరము,కపిశ-కపిశి, కాముకకాంత, కాముకము. పుండ్రకము-పుండ్రము, మాధవి, లత, వసంతదూతి, వరాళ్రియము, వాసంతి. (తె): పూలగురిగింజె-పూలగురివెంద*; ర: అధ్యక్షము, కాలగుంజ, కృష్ణకాంభోజి, కృష్ణపాకి, కృష్ణల, కృష్ణలకము, శితికని. (తె): నల్లగురిగింజె*; ౫: కాకిణి. (తె) ఎఱ్ఱగురిజె*. (ఇవె గురివెందఅని కొందఱు) [చూ, వెంపలి.

శ్వేతపుంఖ. సం. వి. ఆ. స్త్రీ. తెల్లవెంపలి*:

శ్వేతపుష్పము. సం. వి. అ. పుం: అవగణము, అశ్మరీఘ్న, కుమారకము-కుమారము, కృష్ణతాలము, తమాలము, తిక్తశాకము, పీతపుష్పము, మారుతాపహ, వరణము-వరుణము, శేలుదుమము, సేతువు. (తె): ఉమకమాను, ఉలిమిడి-ఉలిమిరి, మాపెలఁగ, మెంగలింగ.*.

శ్వేతబాహువు. అం: చూ, చిత్రవర్ణములు.

శ్వేతబిందుకము. సం. వి. అ. పుం. నిష్పావము అను పైరుధాన్యము (ఇవె అనుములు): చూ, ధాన్యము. [చూ, హింగుళి.

శ్వేతబృహతి. సం. వి. ఈ. స్త్రీ. తెల్లములక*:

శ్వేతమరిచము. సం. వి. అ. న. 1 మునగవిత్తు: చూ, శిగ్రువు; 2. తెల్లమిరియము: చూ, శ్యామము. 2.

శ్వేతము. సం. వి. అ. న. 1. వెండి: చూ, లోహము. 1; 2. తెలుపు: చూ, వర్ణము. 6; 3. ఒకద్వీపము: చూ, లంక. 1; 4. కైలాసపర్వతము: చూ, హిమాలయము (చూ, పర్వతము. ౫.); 5. తెల్లపులుము: చూ శ్వేత్రము; 6. సీసము: చూ, లోహము.1-౬; 7. శంఖము: చూ, సంకు. 1; 8. తెల్లమబ్బు: చూ, స్తనయిత్నువు (మేఘము. 1); 9: చూ, దివభాగములు (వాసరము); 10: చూ, మృగముదము; విశ. 11. తెల్లనిది: చూ, వర్ణము.6; అం. 12: చూ, వర్షపర్వతములు. 1-2;

శ్వేతముఖుఁడు. సం. విశ: చూ, వరంగి.

శ్వేతమృగాండజము. సం. వి. అ. న: చూ, మృగమదము. తద్వి.—౧. కస్తూరికి:—లత.

శ్వేతయూకము. సం. వి. అ. పుం. చీరపేను: చూ, యూకము. [విశ.

శ్వేతవచ. సం. వి. ఆ. స్త్రీ. తెల్లవస*: చూ,

శ్వేతవాహనుఁడు. సం. వి. అ. పుం. 1. అర్జునుఁడు: చూ, శుభదేవుఁడు; 2. చంద్రుఁడు: చూ, హిమాంశువు. [చూ, సర్షపము.

శ్వేతసర్షపము. సం. వి. అ. పుం. తెల్లావలు:

శ్వేతసురస. సం. వి. ఆ. స్త్రీ. తెల్లవావిలి*.

(సం): భూతవేశి. (తె) పుల్లవావిలి: చూ, వావిలి. [గుఱ్ఱము: చూ, హయము.

శ్వేతహయము. సం. వి. అ. పుం. ఇంద్రుని

శ్వేతుఁడు. సం. వి. అ. పుం. 1. శుక్రుఁడు: చూ, రాహువు. 2; 2: చూ, సితుఁడు.

శ్వేతేక్షువు. సం. వి. ఉ. పుం. తెల్లచెఱకు*: చూ, సుకుమారము. 1-౨.

శ్వేతోత్పలము. సం. వి. అ. న. తెల్లగలువ*: చూ, సహస్రపత్రము. [చూ, శ్రీదుఁడు.

శ్వేతోదరుఁడు. సం. వి. అ. పుం. కుబేరుఁడు:

## ష

ష. ఒకయక్షరము. అం. 1: చూ, మూర్ధన్యములు (మూర్ధము=తల) (చూ, ఋ. 17.); 2: చూ, ౠ. 21; 3: చూ, ఊష్మములు.

షండత్వము. సం. వి. అ. న: క్లీబము, నపుంసకత్వము, వర్షము, షండము. (తె) ఊబ, పేడితనము.

షండము. సం. వి. అ. పుం, న. 1. రూ-శండము. తామరపువ్వులోనగువాని సమూహము. (భ్రమరములకు మకరందము నిచ్చేవది): చూ, సహస్రపత్రము; పుం. 2. ఆఁబోతు: చూ, వృషభము. 1; న. 3: చూ, షండత్వము; పుం. 4. పేడి: చూ, హెగ్గడి. 2.

షండుఁడు. సం. వి. అ. పుం.=సన్నగండు. (రూ-శండుఁడు-సండుఁడు): చూ, హెగ్గడి. 2

షటి. సం. వి. ఈ. స్త్రీ. గంట్లకచోరము*: చూ, షడ్గ్రంథ.

షట్కము. సం. వి. అ. న.=చేక్కు: ఋతువు, కర్త్రము, కారకము. (తె): ఆఱు, ఇత్తిగ-ఇరుతిగ-ఇత్రిగ, ఇరుమూఁడు, ఐదునొకటి, చేక్కు: ఆఱంకములుగలవి.- చక్రవర్తులు, దర్శనములు, శరీరాంగములు, శాస్త్రములు, వాద్యములు, ఋతువులు, మతములు, అరిషడ్వర్గములు, కర్మములు, ఈతిబాధలు, గుణములు (సంధీత్యాది), శమాదులు, గుణములు (శక్త్యాది), ఐశ్వర్యములు, అభిజ్ఞలు, విద్యలు, కారకములు, కాండలు (కాండములు), వర్గములు, శకములు, చక్రములు, లక్షణములు, తాళాంగములు (అంగప్రాణములు), తాళమార్గములు (మార్గప్రాణములు), వేదాంగములు, స్త్రీశిక్షకులు, ఆతతాయులు, భావవికారములు, సంఖ్యలు, ఉపాయములు, ఊర్ములు, ప్రాకృతభాషాభేదములు, అకృతసాక్షులు, స్త్రీధనములు, షట్కర్మములు, షట్కాలములు, షల్లింగములు, షట్కాళలు. జాతకభాగమున:- షష్ఠాష్టమవ్యయములు, షడ్వర్గు, షడ్బలము ఇత్యాది.

షట్కర్ముఁడు. సం. వి. న్. పుం. యజనయాజనాధ్యయనాధ్యాపన దానప్రతిగ్రహము లనెడు షట్కర్మములుగల స్మార్తబ్రాహ్మణుఁడు, గృత్సుఁడు: చూ, స్వస్తిముఖుఁడు.

షట్చక్రములు. అం: చూ, చక్రములు. (అజ్ఞాతచక్రము అని మఱియొకటిగలదు.)

షట్తారక. సం. వి. ఆ. స్త్రీ. కృత్తిక: చూ, రిక్క. 1.

షడ్జగ్రామగత మూర్ఛనలు. అం: తారమంద్ర, రజని, ఉత్తరాయత, శుద్ధషడ్జ, మత్సరకృత్తు, అశ్వక్రాంత, అభిరుద్గత (7).

షడ్జగ్రామము. అం: చూ, గ్రామములు.

షడ్జభాష. అం: చూ, భిన్నషడ్జకజభాషలు.

షట్తాళము. అం: చూ, జన్యతాళములు.

షట్పద. అం: చూ, వృత్తము. 1. (ఇంద్రగణములాఱును, ఒక చంద్రగణమును గలిగి మూఁడవ గణాద్యక్షరము ఆఱవగణాద్యక్షరము యతిగలది.)

షట్పదము. సం. వి. అ. పుం: (ఆఱుకాళ్లు గలది.): అళి, అధిపికము, అళిపకము, ఇం

డిండిరము, కలాపునాది, కలాలాపము, కాలాపునాది, కింకిరము, కృష్ణదేహము, గంధమాదనము, గంధవాహము, గాతువు, గుంజకృత్తు, ఘుండము-ఘుండము, చంచరీకము, ద్విరేఫము, పుష్పంధయము, పుష్పకీటకము, పుష్పలిహము, బంభరము, భసలము, భృంగము, భ్రమణము, భ్రమరకము-భ్రమరము, మధుకరము, మధుకేశటము, మధుపము, మధుకము, మధులిహము, మధువ్రతము, మధుసూదనము, మిళిందము, రేణువాసము, రోలంబము-లోలంబము, శిలీముఖము, శైరేయము, సారంగము. (తె. ప):-జుంటముకాళి, జుమలిముకాళి-జుమిలిముకాళి, తుమ్మెద, తేటి, తేనియతిండి-తేనెతిండి, నెరయొంటరి, పగడచావంచేయుడుగులుగల పక్షి, బమపుర్వు, బమి, మురునల్లి, ముద్దుగలకాళ్ల పురువు, మొగరంబము, విరితేనెతాగ్రివుడు, రేతలి. తద్వి.—కంటక, గండోలి-గంధోలి, గృహిణి. (తె):-ఎట్టతుమ్మెద; అ: భృంగరాజము. (తె): గండుతుమ్మెద, మానీగ.

షట్పదాహము. సం. వి. అ పుం: చూ. సంపెఁగ. *.

షట్పల. అం: చూ, ఘృతములు.

షట్పలి. సం. వి. ఇ. స్త్రీ: (తె) ఆఱుపలము-ఆఱ్పలము. [(షట్పుతాపుత్రితాళము).

షట్పితాపుత్రిక. అం: చూ, తాళకళలు.

షట్ప్రజ్ఞుఁడు. సం. వి. అ. పుం: చూ, విటుఁడు.

షట్ప్రత్యయములు. అం: ౧ వృత్తసంఖ్య. ౨ ప్రస్తారము. ౩ నష్టలబ్ధి, ౪ ఉద్దిష్టము, ౫ గురులఘుక్రియ, ౬ అధ్వవిభాగము. (6)

షట్ప్రస్థి. సం. వి. ఇ. స్త్రీ. ఆఱుకుంచములు.

షట్స్వరయుక్తరాగములు. అం (షాడవములు): చూ, రాగములు.

షట్సుతాపుత్రితాళము. అం. (ఇది అఘోరమునఁబుట్టిన షట్పుతాపుత్రితాళము): చూ, ముఖ్యకళాపాత్రిణము. (చూ, తాళకళలు).

షడభిజ్ఞుఁడు. సం. వి. అ పుం: చూ. బుద్ధుఁడు.

షడాననుఁడు. సం. వి. అ. పుం. షణ్ముఖుఁడు: చూ, స్కందుఁడు.

షడూషణము. అం: పంచకోలము (శొంఠి, చవ్యము, మోడి. పిప్పళ్లు. చిత్రమూలము) తో మిరియము చేర్చిన షడూషణము

షడ్గుణములు. అం: (చూ, గుణములు): చూ, సంధి.

షడ్గ్రంథ సం. వి. అ స్త్రీ 1 రూ-షడ్గ్రంథి-షడ్గ్రంథిక, గంధమూలి. వనప్రు. షటి. (తె): గంట్లకచోరము. తద్వి —౧: కచోరి-కచ్చూరము- కచ్చుర- కచ్చూరకము- కచ్చూరము- కర్చూరకము- కర్చూరము, కర్పూరకము-కర్చూరము-కర్చము, కాల్పకము, గంధమూల- గంధమూలము - గంధమూలి-గంధమూలిక, గంధాహ్వము, గంధాళి, చీరము, చీరి, చోరకము, తప్పురి, ద్రావిడకము-ద్రావిడము, పర్ణి, పలాశి, పలాశము-పాలాశము, వేదముఖకము-వేధముఖ్యకము, శటి-శఠి, సామసంభవము.—(తె): బట్టకసింద, కచోరకము- కచోరము, కప్పురపుసెండ*. తద్వి.—౧. అడవికచోరమునకు — గంధమూలము; ౨. నల్లకచోరమునకు —(చూ. రాజాన్గము. 1-౧3. (ఇది చోరమను గ్రంథ్యము అనికొందఱు.); ౩. కొండసెండకు.— క్రోధన, పిశున, చండ, చర్మచోర, గంధమూలము, వంద. (తె): కొండసెండ. *; ౨. వస*: చూ, విస.

షడ్గ్రంథము. సం. వి. అ. పుం. గంట్లకాచుగు.*. చూ, శాదఘ్నము. [చూ, రూ-షడ్గ్రంథ.*:

షడ్గ్రంథి. సం. వి. ఈ. స్త్రీ. రూ-షడ్గ్రంథిక:

షడ్జకైశిక. అం: చూ, జాతులు. (అంశములు.)

షడ్జమధ్యము. అం.—పై.—

షడ్జము. సం. వి. అ. పుం. 1.ఒకస్వరము: చూ, స్వరము. 2.(షడ్జము:-షట్=నాశిక, కంఠ, వక్ష, తాలు, జిహ్వా, దంతములను నీయాఱు స్థానములందు, జము=పుట్టినది): చూ, సప్త స్వరములు (సంగీతసర్వములు.)

షడ్జోదీచ్యవ. అం: చూ, జాతులు (అంశములు)

షడ్ఢకుఁడు. సం వి. అ. పుం =సడ్డకుఁడు. తోడి యల్లుఁడు: చూ, సడ్డకుఁడు.

షడ్బలము. అం: (స్థాన, దిక్, చేష్టా, కాల, దృక్, నైసర్గికబలములు) (6).

షడ్బిందువు. సం. వి. ఉ. పుం. 1.మండ్రిగబ్బ: చూ, వృశ్చికము. 1; 2: చూ, విష్ణువు. 1.

షడ్భాగము. సం వి. అ. పుం. 1. కప్పము: చూ, సిస్తు. 1; 2. మిడుఁగురు: చూ, వహ్ని. 1-౧౮.

షడ్వర్గపురి. అం: చూ, పురులు.

షడ్వింశతి. సం. స. ఇరువదియాఱు.

షడ్వింశబ్రాహ్మణము. అం. ఇందు 6 ప్రపాఠకములు, 68 ఖండములు, 520 గ్రంథములు గలవు. (చూ, సామవేద బ్రాహ్మణము; బ్రాహ్మణము.)

షణ్ముఖి. అం: చూ, ముద్రలు.

షణ్ముఖుఁడు. సం.వి.అ.పుం: చూ,షడాననుఁడు.

షరతు. వా. వి. 1. యేర్పాటు; 2. కాలపరిమితి; 3. ఒడంబడికె; 4. హద్దు.

షరా. వా. వి. (రిమార్కు.) 1. చిట్టచివర వ్రాయువాక్యములు; 2. అనుబంధము.

షరాఖత్తు. వా. వి. పాలికాఁపుతనము.

షరాబు. వా. వి. 1. నాణ్యాదులనుకొని అమ్ము వర్తకుఁడు; 2. కోఠీదారుఁడు; 3. సాహుకారు; 4. చిల్లరమార్చువాఁడు; 5.ధనికుఁడు.

షరాయి. వా. వి. లాగు: చూ,వస్త్రము. 1-౧౦.

షర్టు. వా. వి. లోపలిధరించేచొక్కాయి: చూ, వస్త్రము. 1-౯.

షర్బత్తు. వా. వి. చేలువనిచ్చేతియ్యనిపానకము.

షష్టి. సం. స. 1. అఱువది (60) (రూ.షష్ఠిఅని కొందఱు); ఈ. స్త్రీ. 2: చూ, పార్వతి. (రూ-షష్ఠి అని కొందఱు.)

షష్టిక. సం. వి. ఆ. స్త్రీ.అ. పుం. అఱువదిదినములలో పండెడుధాన్యము: చూ, స్తంబకరి (ధాన్యము.) [ (పొలము.)

షష్టిక్యము. సం. విశ. షష్టికలు పండునేల

షష్ట్యంశ. అం: చూ, షోడశవర్గ ("లగ్నమును 60 సమభాగములు చేయవలెను. అట్లుచేసిన షష్ట్యంశములగును. షష్ట్యంశ కనుఁగొనవలసిన గ్రహమేలగ్నమునందెన్నవ భాగమునందుండెనో తెలుసుకొనవలెను. అట్టిగ్రహమున్న రాసి యోజరాసియైయినయెడల మొదటిదగు ఘోరాంశము మొదలుగను యుగ్మరాసియైయినయెడల నఱువదియవదగు నిందురేఖాంశము మొదలుగను, గ్రహమెన్నవభాగమునందున్నదని గనుఁగొనఁబడెనోయన్నవ భాగము షష్ట్యంశ యనఁబడును): (చూ, షష్ట్యం (ష్ఠ్యం) శములు.

షష్ట్యం(ష్ఠ్యం)శములు. అం. ఇవి60:-ఘోరాంశము, రాక్షసాంశము, దేవభాగాంశము, కుబేరాంశము, రక్షోగణాంశము, కిన్నరాం,భ్రష్టాం,కులఘ్నాం, గరళాం,అగ్నిసంఘాం,మాయాం, ప్రేతపురీశాం, అపాంపత్యం, దేవగణాం, కాలాం, ఆదిత్యాం, అమృతాం, చంద్రాం, మృద్వం, కోమలాం, పద్మాం, లక్ష్మీశాం, వాగీశాం, దిగంబరాం, దేవాం, ఇంద్రాం, కలినాశాం, క్షితీశ్వరాం, కమలాకరాం, మందాత్మజాం, మృత్యుం,కాలాం, దేవాగ్న్యం, ఘోరాం, అమయాం, కంటకాం, సుధాం, అమృతాం, పరిపూర్ణచంద్రాం, విషప్రదష్టాం,కలినాశాం,ముఖ్యాం,

వంశక్షయాం, ఉత్పాతకాం, కాలరూపాం, సౌమ్యాం, మృద్వ్యం, సుశీతలాం, దంష్ట్రాకరాళాం, ఇందుముఖాం, ప్రవీణాం, కాలాగ్న్యం, దండాయుధాం, నిర్మలాం,శుభాం, అశుభాం, అతిశీతలాం, సుధాపయోధ్యం, భ్రమణాం, ఇందు రేఖాంశములు (60) (ఈ అంశములలో అంశనామమునుబట్టి వాటికి సమమైన శుభాశుభ ఫలములను జూచుకొనవలయును.)

షష్ఠము.సం.విణ.ఆఱవది. (షష్టముఅనికొందఱు).

షష్ఠి. సం. వి. ఈ. స్త్రీ. 1. పక్షమునందు ఆఱవతిథి: చూ, హరివాసరము; 2. రూ-షష్ఠి గౌరి: చూ, పార్వతి.

షష్ఠీవిభక్తి. అం. "కీ-కు-యొక్క- లో-లోపల": చూ, విభక్తులు.

షహరు. వా. వి. పట్టణము.

## షా

షాడబము. సం. వి. అ. పుం. మధురాదిరసము.

షాడవము. సం. వి. అ. పుం. ఆఱుస్వరములు గలరాగము: చూ, స్వరము. 2.

షాడ్గుణ్యము. అం. 1. ఐశ్వర్యవీర్యాది భగవంతుని షడ్గుణములు; 2. సంధివిగ్రహాది రాజషడ్గుణములు: చూ, గుణములు. [ననుఁడు.

షాణ్మాతురుఁడు. సం. వి. అ. పుం: చూ, షడా

షాణ్మాసికము. సం. వి. అ. న. ఆఱవనెలయందుఁజేసెడు మాసికము: చూ, శ్రాద్ధము. 1.

షికారీ. వా. వి: చూ, వేఁటకాఁడు.

షికారు. వా. వి. 1: చూ, వేఁట; 2. దేహపరిశ్రమకును, చల్లగాలికినిఁబోవుట: చూ, సంచారము. (షైరందురు).

షిద్గుఁడు. సం. వి. అ. పుం: చూ, విటుఁడు.

## షు

షుమారు. వా. వి.1.సుమారు;2. ఒడతెఱంగము.

షురువు. వా. వి. ఆరంభము.

## షో

షోడశకర్మములు. అం: చూ, కర్మములు.

షోడశదళపద్మబంధము. అం: చూ, శబ్దాలంకారములు.

షోడశమహారాజులు. అం: చూ, మహారాజులు.

షోడశము. సం. వి. న. త్రి. 1. పదునాఱు; వా. 2. మరణించిన వారికి పదునొకండవరోజునఁజేయు శ్రాద్ధము: చూ, శ్రాద్ధము; విణ. 3. పదునాఱవది. (పదునాఱంకములు గలవి:-మహారాజులు, కర్మములు, ఉపచారములు, మహాదానములు, హేయగుణములు, వికారములు, కళాస్థానములు, దానములు, మానసికపూజాకుసుమములు, ఋత్విజులు, చంద్రకళలు ఇత్యాది)

షోడశవర్గు. అం: ౧ క్షేత్రము, ౨ హోర, ౩ ద్రేక్కాణము, ౪ చతుర్థాంశ, ౫ సప్తమాంశ, ౬ నవమాంశ, ౭ దశమాంశ, ౮ ద్వాదశాంశ, ౯ షోడశాంశ, ౧౦ వింశాంశ, ౧౧ శిద్ధాంశ, ౧౨ భాంశ, ౧౩ త్రింశాంశ; ౧౪ ఖవేదాంశ, ౧౫ అక్షవేదాంశ, ౧౬ షష్ట్యంశ. (వీని వివరములా యాపదములకడఁ జూచుకొనవలయును.)

షోడశసంధులు. అం: కపాలసంధి, ఉపహారము, సంతానము, సంగతము, ఉపన్యాసము, ప్రతీకారము, సంయోగము, పురుషాంతరము, అదృష్టతరము, ఆదిష్టము, ఆత్మామిషము, ఉపగ్రహము, పరిక్రియ, ఉచ్ఛిన్నము, ప

రదూషణము, స్కంధోపనీయము. (16)

షోడశాంశ. అం: చూ, షోడశవర్గు. ("లగ్నమును 16 సమభాగములు చేయుటయే షోడశాంశ, షోడశాంశఁగనుఁగొనువలసిన గ్రహమేరాసి యందెన్నవ భాగమునందున్నదోఁ గనుఁగొనవలెను. అట్టి గ్రహమున్న రాశి చరరాసియైనయెడల మేషాదిగను, స్థిర రాశియైన యెడల సింహాదిగను, ద్విస్వభావరాశి యైన యెడల ధనురాదిగను బయినఁజెప్పిన ప్రకారము గ్రహమెన్నవ భాగమందున్నదనిఁ గనుఁగొనఁబడెనో నన్నవరాసి షోడశాంశ. ఆరాశ్యధిపతియేషోడశాంశాధిపతియగును.")

షోడశార్చి. సం. వి. న్. పుం. శుక్రుఁడు: చూ, రాహువు. 2_ఁ.

షోడశి. అం: చూ, తానములు(సహీనతానములు.)

షోరీబ్రాహ్మణులు. అం: చూ, కపూరియె బ్రాహ్మణులు.

## ష్ఠి

ష్ఠివనము. సం. వి. అ. న. రూ-ష్ఠీవనము. ఉమియుట, తూపాడుచేట.

## ష్ఠీ

ష్ఠీవనము. సం. వి. అ. న: చూ, రూ-ష్ఠివనము.

## స

స. ఒకయక్కరము. సం. వి. అ. పుం. 1. గాలి: చూ, వాయువు; అం. 2: చూ, దంత్యములు; 3: చూ, ఊష్మములు.

సం. ఇది సంస్కృతమునందలి సమ్ అను నుపసర్గమునకు హల్లు పరమగుచో మకారమునకు అనుస్వారము వచ్చిన రూపము. ఇది సంస్కృత విశేష్య విశేషణములకు ముందున్నప్పుడు 'చేక్కసి' 'మిక్కిలి' అనియు, క్రియలకు ముందున్నప్పుడు 'చక్కగా' ననియు అర్థముగలదియగు చున్నది. (ఉదా — సంకటము=ఇచేట 'సం' అనునది ధాత్వర్థమును ఇఱుకు అను నర్థమునకు మార్చినది; సంకరము=ఇచేట ధాత్వర్థమును గలిసిపోయినదియను నర్థమునకు మార్చినది; సంకలనము=ఇచేట నిరర్థకమైనది; సంకల్పము=ఇచేట ధాత్వర్థమును మనోవ్యాపారముగా మార్చినది; ఇట్లు సంక్షయము, సంక్షోభము, సంక్షోభించు, సంగుప్తము, సంగూఢము, సంగోపనము, సంఘటన, సంఘటిల్లు, సంఘట్టనము, సంచరించు, సంచలనము, సంచలించు, సంఛన్నము, సంతుష్టి, సంతుష్టుఁడు, సందర్శనము, సందర్శించు, సంపూర్ణము, సంపూర్తి, సంప్రాప్తి, సంప్రాశించు, సంప్రీతి, సంప్రేరణము, సంభ్రాంతము, సంయుక్తము, సంయుతము, సంయోగము, సంరక్షకుఁడు, సంరక్షణము, సంరక్షించు, సంరక్ష్యము, సంరోధము, సంరోధించు, సంవర్ధించు, సంవిభాగము, సంవిభాగించు, సంవేది, సంశుద్ధి, సంశోధనము, సంశోధించు, సంశోధ్యము, సంస్తంభనము, సంస్తంభయిత, సంస్తుతము, సంస్తుతి, సంస్తుత్యము, సంస్థాపనము, సంస్థాపించు, సంస్థాపితము, సంస్మరణము, సంస్మృతి మొ.)

సంకట. వా. వి. పణద్రవ్యము: చూ, సరకు.2.

సంకటగార్దభము. సం. వి. అ. పుం.=కంకర గాడిద: చూ, హయము (రాసభము.)

భుజుఁడు, భృతకుఁడు, భృతిభుజుఁడు, వైత నికుఁడు. (తె) కూలివాఁడు, జీతకాఁడు, పరవృఁడు (కూలివాఁడు=రోజుకూలి తీయు వాఁడు;జీతకాఁడు=నెలజీతముతీయువాఁడు.)

సంబళము. వై. వి.=శంబలి: చూ, రూ—సంబర ము. 1–2–3. (చూ, సంబళిక. 2);

సంబళి. దే. అవ్య: చూ, రూ—సంబరి (1).

సంబళించు. దే. అవ్య: చూ, సంబడించు.

సంబళిక. వై. వి.=శంబల. (దే. అని శ.ర.) 1. దారిబత్తెము: సంబళము—సంబడము;2: బత్తెము: కయిజీతము-కైజీతము,నాతము,బత్తియము—బత్తెము, సంబడము-సంబళము, మోయిను. (సం)పాథేయము, శంబలము-సంబలము, తద్వి.—ం. కూలికి:—కూలి, జీతము, బత్తి,బాడిగ,సంబడము-సంబళము,సంబళిక. (సం) అవక్రియము, కర్మణ్య, జీవితము, నిర్వేశము, పణము, భక్తి, భరణము-భరణ్యము, భర్మము, భృతి, భృత్య. వస్నము, విష్టి, వేతనము; ౨: నిలువుజీతము; 3:(సం) భిక్షు, భిక్షము; 3. వక్కలాకులతిత్తి: చూ, హడపము. 1. [కృతము.

సంబాకృతము. సం. విణ: చూ, రూ-శంబా

సంబాగువు. దే. వి. అరడ: చూ, హోడము.

సంబాధము. సం. వి. అ.పుం. 1. ఇఱుకు: చూ, విడిక్కు; 2. ఆఁడుగుఱి: చూ, భగము. 12.

సంబారము. వై. వి.=సంభారః. (రూ-సంబారు-సంబారువు) ఉప్పు మిర్చి చింతపండు లోనగునవి: చూ, వేళవారము.

సంబారు. వై. వి.= —వై.—

సంబారువు. వై. వి.= —వై.—

సంబావులు. దే. వి. బ: చూ, ధాన్యము.

సంబాళించు. వై. స. క్రి. 1: ఆదుకొను, ఆలకించు—ఆలించు, కొనియాడు, గారవించు, చేకొను, పాటించు, ముద్దాడు. (సం): ఆదరించు, ఆలక్షించు; 2 వెలిజేయు:చూ, సిద్ధి నొందించు. [1-2.

సంబాళిగలు. వై. వి. బ:చూ, రూ-సంబవులు.

సంబుద్ధి సం. వి. ఇ. స్త్రీ: చూ, సంబోధనము.

సంబుద్ధుఁడు. సం వి. అ. పుం: చూ, బుద్ధుఁడు.

సంబెళ. వై. వి. 1 =సంపుట. (దే. అని శ. ర.) వక్కలాకులతిత్తి: చూ, హడపము; 2.=శంబలి. (దే అని. శ. ర.) (రూ-సమ్మెళ-సమ్మెట-సంపెట) చర్మయష్టి: చూ, సమ్మెట.

సంబోధనము. సం. వి. అ. న. 1: అభిమంత్రణము, అహోబత, ఆకారణ- ఆకారణము, ఆక్రందనము. ఆక్రందము, ఆమంత్రణము, ఆవాహనము, ఆహవము, ఆహ్వ, ఆహూతము, ఆహ్వానము, కందనము, క్రందనము, క్రందితము, కేతనము, సంబుద్ధి, హూతి (అవ్య): అంగ, అహో, అ, అజ్, ఏ, ఐ, ఓ, ఔ. (తె. ప): అమతి, అమతింపు, అమిత-అమితి-అమెత, ఓ, కైసన్న, చీరుడు, పిలుపు, పిలుపుడు, పేరుకొనుట—పేర్కొనుట, పేరుకోలు—పేర్కోలు. తద్వి.—ం. దూరమునుండి పిలుచుటకు.—(అవ్య) హు; ౨. పిలువఁబడ్డది:—ఆహూతము, హూతము; అం. 2: చూ, సంబోధనార్థకములు.

సంబోధనార్థకములు. అం:అంగ,పాట్,ప్యాట్, భో-భోః, హే, హై,వై.(తె):—ఓ-ఓయి, ఓరి, ఓసి. తద్వి.—హల.

సంబోధించు. సం. స. క్రి: అభిమంత్రించు, అమంత్రించు, ఆహ్వానించు, నిమంత్రించు, మంత్రించు. (తె): అమతించు,చీలు,పిలుచు, పిల్చు, పేరుకొను-పేర్కొను, మంతిపించు.

సంబ్రిము. వై. వి.=సంభ్రమ; చూ, రూ—సంబరము.

సంభజించు. సం. స. క్రి. 1. కొలుచు: చూ, సేవించు; 2: భజించు, భాగించు.

సంభరించు. సం.స. క్రి. మోచు: చూ, భరించు. 1.

సంభరుక. సం. వి. అ. స్త్రీ. రూ-సంభరువు. పావలు: చూ, సమ్మాళిగలు.

సంభరువు. సం. వి. ఉ. స్త్రీ —పై.—

సంభవము. సం. వి. అ. పుం. 1. పుట్టుక: అ, అవతారము, ఆవిర్భావము, ఉత్పతనము, ఉత్పత్తి, ఉదయము, ఉద్గతి, ఉద్గమము, ఉద్భవము, ఉద్భేదము, ఉపపత్తి, జ, జననము, జని, జనువు, జన్మము, జాతము, జాతి, ధామము, ప్రతిపాదనము, ప్రభవము, భవము, భావము, భూతి, యవని. (అన్య) అజ్. (తె):—ఉప్పతి, కనుబడి, పుట్టు, పుట్టుక-పుట్టుగు-పుట్టువు, పుట్టుబడి, బాము, మేను. తద్వి.—౧. పుట్టించుటకు.— ఆసాదనము, ఉత్పాదనము, ఉపపాదనము. (తె) కలిగించుట, కలిమి-కల్మి, పుట్టించుట; ౨. పూర్వజన్మము, ప్రసవము, ప్రాదుర్భావము, అనూకము, సంసారము; 2. కారణము: చూ, హేతువు. 1; 3. కూడిక: చూ, సంయోగము; 4. ఆధేయమాధారమును మీఱకుండుట; అం. 5: చూ, ప్రత్యక్షాదిప్రమాణములు; 6: చూ, రసవదలంకారములు.

సంభవించు. సం. అ. క్రి. రూ-సంభవిల్లు, అవతరించు_అవతరిల్లు, అవతారమెత్తు, అపాదిల్లు, అవహించు—అవహిల్లు, ఆవిర్భవించు-ఆవిర్భవిల్లు, ఉత్పాదిల్లు, ఉద్భవించు, ఘటిల్లు, జనించు, జన్మించు, ప్రభవించు, ప్రాదుర్భవించు, లభించు, లాభించు, సంసరించు (తె):—అడరు, అడరుకొంచు, ఎత్తు, అత్తుకొను, అపాదిల్లు, అమతిలు_అమతిల్లు, ఆరు, ఉప్పతిల్లు, ఊరు, ఎత్తు, ఎలయు, ఒందు, ఒట్టు, ఒదవు, ఒనరు, ఒలయు, కదురు, కలుగు_కల్గు, కలువు, కూరు, గండరించు, చెందు, తట్టు, తనుకు, తలకొను, తలకొనుకొంచు, తేరు_తేఱు, తేలువాఱు, తొట్టగిలు-తొట్టగిల్లు, తొడరు, తొరలు, తొలకరించు-తొల్కరించు, దొరయు, నివ్వటిలు-నివ్వటిల్లు, పట్టు, పనుగొను, పనుపడు, పన్ను, పన్నుపడు, పయికొను—పైకొను, పాటిలు-పాటిల్లు, పుట్టు, పెట్టు, పొంపిరివోవు, పొటము, పొడతెంచు, పోఱు, బెరయు, మొదివడు, మూఁడు, మెయికొను—మేకొను, మొనయు, మొలతెంచు, రకొ్కను-రెకొ్కను, లాభించు, వటిలు-వటిల్లు, వాత్తు. తద్వి.—౧. ఉన్నట్టుండికలుగు.-(తె) ఉట్టిపడు; ౨. మొలకెత్తుఅనుటకు.—అంకురించు, కందళించు. (తె) ఈరికలెత్తు. కొరగించు, తలయెత్తు, మొలకెత్తు, మొలచు-మొలుచు-మొల్చు; 3. పుట్టించుఅనుటకు.—ప్రసవించు. సృజించు. (తె) ఈను, కను, కలిగించు, కొలుపు, నీల్గాడు, పడచు, పడయు; ౪. సృష్టిచేయు:—చూ, సృజించు. (చూ, సిద్ధించు).

సంభళి. సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ-శంభళి.

సంభారము. సం. వి. అ. పుం. 1. చేకూఁగా భరించుట; 2 చేకూఁగాధరించుట; 3: చూ, సమూహము; 4—సంబారువు. పదార్థసంచయము: చూ, వేళవారము; 5. సర్వపూర్ణత్వము.

సంభావన. సం. వి. అ. స్త్రీ. 1: చూ, సన్మానము; 2. తలపు: చూ, వాకిలి; 3. ప్రసిద్ధి: అపదేశము, ఆవిష్కరణము, ఆవిష్కృతి, ఆవిష్క్రియ, ఆశువు, ఖ్యాతి, టంకారము, నిరూఢి, ప్రకటనము, ప్రఖ్యాతి, ప్రతిఖ్యాతి, ప్రథ, ప్రథితి, ప్రత్యయము, ప్రశస్తి, ప్రసిద్ధి, రూఢి, విఖ్యాతి, వ్యాప్తి. (అన్య) అని. (తె) అల-

-ంముఖము. అం. (సమ్ముఖము): చూ, హస్తపరి చారములు. [హస్తపరిచారములు.

సంముఖాగతము. అం. (సమ్ముఖాగతము): చూ,

సంమృష్టము. సం. విణ. ఽస్త్రాదుల చేతశోధింపఁబడినది. [ము. 4.

సంయతము. సం. విణ కట్టఁబడినది: చూ, ఏత

సంయతుఁడు. సం. వి. అ పుం. శౌర్యాద్యపరాధమున బొండకొయ్య మొదలగు దాని చేతఁ గట్టఁబడినవాఁడు: కీలితుఁడు.

సంయత్తు. సం. వి.త్. పుం,(స్త్రీ): చూ, యుద్ధము

సంయమనము. సం. వి. అ న. 1. బంధనము: చూ, బంధము. 1; 2: చూ, పరిత్రము; అం. 3: చూ, ఉత్తాన కరణబంధములు.

-సంయమని. అం. 1. యమునిపట్టణము: చూ, దేశములు; 2: చూ, దిక్పాలపట్టణములు

సంయమము. సం. వి. అ. పుం. రూ-సంయామము. 1. హింసాదులవలననిరమించేట; యమకము, యామము; 2. పరితాదులకంగమై తోలిదినము చేయఁదగిన యాచారము.

సంయమి. సం. వి. న్. పుం. 1. ముని: చూ, సన్న్యాసి; విణ. 2. సంయమముగలవాఁడు.

సంయామము. సం. వి. అ. పుం: చూ, రూ- సంయమము. [చూ, భక్ష్యము.

సంయావము. సం. వి అ. పుం. సొరుసత్తులు:

సంయుక్తమగు. మి. స. క్రి: చూ, సక్తమగు. 1.

సంయుక్తము. సం. విణ. కూడుకొన్నది: చూ, సహితము.

సంయుగము. సం. వి. అ. పుం: చూ, యుద్ధము.

సంయుతము. అం: చూ, అభినయ హస్తములు.

సంయుతహస్తములు. అం. (రెండుచేతులతోఁ బట్టవలసినవి.): ౧ అంజలి, ౨ కపోత, ౩ కర్కట, ౪ స్వస్తిక, ౫ డోల, ౬ పుష్పపుట, ౭ ఉత్సంగ, ౮ శివలింగ, ౯ కటకావర్ధన, ౧౦ కర్తరీస్వస్తిక, ౧౧ శకట, ౧౨ శంఖ, ౧౩ చక్ర, ౧౪ సంపుట, ౧౫ పాశ, ౧౬ కీలక, ౧౭ మత్స్య, ౧౮ కూర్మ, ౧౯ వరాహ, ౨౦ గరుడ, ౨౧ నాగబంధ, ౨౨ ఖట్వ, ౨౩ భేరుండ, ౨౪ అవహిత్థము (చూ, అసంయుత హస్తములు=ఒక చేతితోఁ బట్టఁదగినవి) (ఈ అసంయుత సంయుతహస్తములలో 'బాంధవ్య హస్తములు ౧౧:- ౧ దేవతాహస్తములు ౧౬, ౨ దశావతారహస్తములు ౧౦, ౩ నవగ్రహహస్తములు ౯, ౪ చతుర్వర్ణహస్తములు ౪, ౫ ప్రసిద్ధరాజహస్తములు ౧౬, ౬ పుణ్యనదీహస్తములు ౧౪, ౭ వృక్షహస్తములు, ౮ శిరోభినయహస్తములు ౨౨, ౯ పక్షిహస్తములు ౨౨, జలజంతుహస్తములు ౧౨.): చూ, వ్యాంజకము 1.

సంయోగమగు. సం.స.క్రి: చూ, సంయుక్తమగు.

సంయోగము. సం. వి. అ. పుం. (స్త్రీపురుషుల కలయిక) అనుషంగము, అన్వయము, అభిభావితము, ఆయతి, ఆసక్తి, ఇష్టి, ఉపపత్తి, ఉపసృష్టకము, ఉపస్థానము, ఉపక్లిప్తి, ఊర్ధ్వగము, కామకళ, కామకేళి, కామపత్ని, మటారము, కుసీగము, క్రీడారత్నము, గ్రామ్యధర్మము, త, త్రిశ్చదరికము, ధర్మితము, నిధువనము, నిషంగము, పరిష్వక్తి, మేళకము, మేళనము, మేళము, మైథునము, యుక్తి, యుతకము, యోగము, రతము, రతి, రహస్సు, లంగము, వసంతమూతము, వ్యవాయము, శయనము, శృంగారము, ..., సంగతము, సంగతి, సంగమము, సంగము, సంధి, సంధ్య, సంపర్కము, సంప్రయోగము, సంభవము, సంభేదము, సంభోగము (భోగము), సంసక్తి, సంసర్గము, సంసృష్టి, సన్నిపాతము, సమాగమము, సమితి, సమ్మేళనము, సాంగత్యము, సాహిత్యము, సురతము, హింసనము. (తె):— మగచెయ్యులు, మగవనులు, మాళ

పోదుములు, అంటు, కలయిక-కలియిక, కలప-కలువ, కవయూట, కూటమి, కూడిక, చేరిక, చేట్టతికము, జీగను, జోటిపని, జోలి, త్రొక్కు- త్రొక్కుడు, దనివు, పెనఁకువ-పెనుఁకువ, పయిసరము-పైసరము, పొందిక, పొత్తు, పొరలిక-పొర్లిక, పొర్లుట, మరుపని, మసకము, మేడము, రంతు-అంతు, లంకియ-లంకె, వలరాచేపని, సంగడము, సంతన, సకేళము-సమేళనము, సయ్యొద్ద- సయ్యొద్ద - సయ్యోద్దె, సోళగింపు

తద్వి.- ౧. పునస్సంధానమునకు:- అబ్రహ్మచర్యకము, ఔపాసనము, కామోత్సవము, గర్భాధానము, నిషేకప్రస్తుతము, నిషేకము, శోభనము. (తె) కలపడము, కలుపుట; ౨: ఉపరతి, పురుషాయితము, విరాయితము. (తె) పయూట-పైయాట, పయికూటమి-పైకూటమి, మగపాడి, మగలాగు, మగపోల్కి-కూటమి - మొగపోల్కి-కూటమి; ౩. పరస్త్రీ సంగమమునకు -కలిమము; ౪. మునుల సంభోగమునకు.-ఖుంజనతరము; ౫. వేశ్యాసంభోగమునకు.- (తె) లంజెతికము; ౬. రత్యుత్ప్రీతికి.— (తె) తిమ్మది(తి)య్యము; ౭. కుక్కలకలియికకు.- శలాదము, శ్వానమైథునము; ౮. గుఱ్ఱముల కూడికకు.—(తె) మావు; ౯. చిలుకలకూడికకు.—అళీకము; ౧౦. నెమిళ్ళకలయికకు.—అపవాదము; ౧౧. పాములరతికి.— (తె) మసకము, మసకలుపాఱుట; ౧౨. కోఁతులసంగమమునకు.-వలీసంగమము; ౧౩. పక్షిరతమునకు.—(తె) త్రొక్కు, త్రొక్కుడు, పొర్లుట, మెట్టు, పెద; ౧౪. తుమ్మెదలమైథునమునకు.—తిక్తవారము. ౧౫. నాయికకు ప్రియ వియోగకాలమందు మన్మథావేశముచేఁగలిగెడు చేష్ట:-తిపనము (చూ, రతిబంధములు). ("చూ, హిండనము"). (ఇందుఁ గొన్ని పదములు చేరికకును, కొన్ని పదములు స్త్రీ పురుషులకలయికకును, కొన్ని పదములు రెండర్థములయందును వర్తించును; అం. ౨: చూ, షోడశసంధులు; ౩: చూ, భోగములు.

సంయోగమేరువు. అం: చూ, ప్రస్తారప్రత్యయ. ప్రాణములు.

సంయోజితము. సం. విణ. మఱియొకదానితోఁ కూర్పఁబడినది: ఉపాహితము.

సంరంభము. సం. వి. అ. పుం: చూ, సంభ్రమము.

సంరంభి. సం. విణ. (న్. ఈ. న్.) సంరంభముగలవాఁడు.

సంరంభించు. సం. అ. క్రి: చూ, సంభ్రమించు.

సంరక్షకుఁడు. సం. విణ: అవిత, అక్రిందనుఁడు, అక్రిందుఁడు, ఉదాస్థితుఁడు, ఊ, గురువు, గోపుఁడు, గోప్త, త్రాత, ధాత, పరిపోషకుఁడు, పాత, పోషకుఁడు, పోష్ట, ప్రతిపాలకుఁడు, భర్త, రక్షకుఁడు, రక్షి. (తె):— చేరువకాఁడు, పెనుపరి, ప్రోపరి, మనుపరి. తద్వి.— అరక్షకుఁడు, ఉదాస్థితుఁడు, ఊ, యామికుఁడు (తె): అరెకుఁడు, కాచేవాఁడు, కావరి, కావలివాఁడు, గోలుకాఁడు, గస్తీలు, తలవరి-తలారి, బంటు. తద్వి.—పరిపోషితుఁడు.

సంరక్షణము. సం. వి. అ. న: అవనము, ఊతి, ఇుకారము, కుబ్రము, క్షణము, గుప్తి, గోపనము, గోపీథము, ఛాయ, ణ, త్రాణము, దానము, పరిత్రాణము, పరిపోషణము, పావము, పాలకము, పాలనము, పూర్తము, పోషణము, ప్రతిపాలనము, భోగము, ముండనము, యంత్రణము, రక్షణము, రక్షము, శరణము-శరణు, సాదము. (అవ్య):—అవ, యత, ఊ, బూ, కీనము. (తె):—అద్దికము, అలన,

ఇల్లడ-ఇల్లడము, ఉక్కణము, ఏడుగడ-ఏడ్గడ, ఏలుబడి-ఏల్బడి, కాపాడుట, కాపు, కాపుగడ, కావలి, కుయి-కుయ్యి-కూయి, కూలు, కొనియాట, కోవరము-కోవురము, గస్తి, గస్తు, తొన, నీడ, పారా, పాలియము-పాళెము, పోసనము, పెనుపు, ప్రోదిది, బలకరము-బళకరము. తద్వి.—౧.శత్రువు శత్రువచ్చుటను తెలిసికొనుటకై యుంచే కావలి:- ఉక్కళము, కోవరము-కోవురము; ౨.భయాదరక్షకమునకు.-ఫ; ౩.భయమునుపోఁగొట్టుటకు.-ఫ; ౪. గోరక్షణమునకు.-(తె) పసిమనువు; ౫. మస్నేత పరిభుత్వమునకు.-కదీశత్వము; ౬. సైన్యరక్షణమునకు.-గుల్మము;౭:శరణము,పాదము, దిక్కు. (తె) చేరగడ.

సంరక్షించు. సం. స. క్రి. చేకొఁగాకాపాడు; అధ్యక్షించు, పరిపాలించు, పాలించు, పరిపోషించు, పోషించు, ప్రతిపాలించు, భరించు, రక్షించు. (తె) అఁగు, ఏదు, ఏలు, ఏలుకొను, ఓము, కాచు, కాపాడు, కొనియాడు, తడవు, పెంచు, పెనుచు, ప్రోచు, ప్రోదిసేయు, బ్రతికించు, మనుచు, మనుపు, సంతరించు, సాఁకు.

సంరక్షింపఁబడు. మి. అ. క్రి: (తె) ప్రోవడు.

సంరబ్ధము. సం. విణ. సంరంభము నొందినది.

సంరావము. సం. వి. అ. పుం. మ్రోఁత: చూ, స్వరము. 2.

సంరూఢము. సం.విణ. పెరిఁగినది.

సంరోధము. సం. వి. అ. న: అంగుళితోరణము, అభ్యంతరము, అర్గళము, అవరోధము, ఆక్షేపణ-ఆక్షేపణము, ఆచ్ఛాదనము, ఆతంకము, ఆసేధము, ఉపరోధము, ఉపసర్గము, ఊహము, క్షే, గడము, నిగ్రహము-నిగ్రాహము, నియంత్రణ, నిరోధనము, నిరోధము, నిషేధము, రోధనము, రోధము, వారణము, విఘాతము, విఘ్నము, విరోధము, విష్కంభము, వ్యాఘాతము, హస్తవారణము. (అవ్య):-అలమ్, అక్, కు. (ఉప) అవ. (తె):— అంకిలి, అటకాపు, అడ్డంకి, అడ్డకట్ట, అడ్డగాలు, అడ్డగింత, అడ్డగింపు, అడ్డపాటు, అడ్డపెట్టు, అడ్డము, అడ్డవాట్లు, అడ్డి- అడ్డు, అడుగు ట్ట- అడ్డుగుట్ట, అఁక, ఆటంకము, అఁపు, ఎడ, ఎడ్డము, ఒడ్డు, గెంటుట, గొడవ, తపశివ. తగులము, తడ, తడకట్టు, త్రోపుడు,నిట్టు, నూకుడు, పుడక, బందు, మున్ను, ముంకము, ముంకు. తద్వి.—చూ,విఘ్నము.

సంరోధించు. సం. స. క్రి: అవరోధించు, ఆక్షేపించు, ఆసేధించు, ఉపరోధించు, నిరోధించు, నివారించు, ప్రతిబంధించు, ప్రతిరోధించు, ప్రతిషేధించు, రోధించు, వారించు. (తె) అంకిలిపెట్టు, అటకాయించు,అడ్డకట్టు, అడ్డగించు, అడ్డపెట్టు, అత్తు, అరికట్టు, అఁకట్టు, అఁకపెట్టు-అఁకవెట్టు, అఁకరొనరించు, అఁగించు,అఁగు, అఁపుచేయు, అను, ఉడిగించు, ఉడుపు, ఒడ్డు, చెఱగొను, డెక్కు, తటాయించు, తడకట్టు, నిలుపు-నిల్పు, మల్లుకట్టు. తద్వి:—౧ (చూ, నిషేధించు.); ౨: (తె) మట్టగించు, మట్టు, మట్టుకొను, మట్టుకోలుకొను- మట్టుకోల్కొను, మట్టుకోలుపట్టు, మట్టుకోలుపఱచు.

సంలక్ష్యక్రమవ్యంగ్యము. అం: శబ్దశక్తిమూలానురణనరూపవ్యంగ్యము. ౨, అర్థశక్తిమూలానురణనరూపవ్యంగ్యము. ౩, ఉభయశక్తిమూలానురణనరూపవ్యంగ్యము. ౧. (ధ్వనిభేదములు ౧౩౭ను సంకరములతోఁ గూడిన ౫౩౦౪ను వీటితోఁగూడిన కావ్యము

కూడ ధ్వనియనిపించుకొనును. ఇదే యుత్తమకావ్యము. ధ్వనిలేని కావ్యము మధ్యమమును గుణీభూతవ్యంగ్యము ననిపించుకొనును. ధ్వని స్ఫుటముగాఁ దోఁచేఁబడనిది యధమకావ్యమును చిత్రము ననిపించుకొనును.)

సంలాపము. సం. వి. అ. పుం. ప్రీతితోడి పరస్పర సంభాషణము: చూ, సంభాషణము.

సంవత్సరము. సం. వి. అ. పుం. అబ్దము, ఆవర్తము, ఉర్వటము, ఋతువృత్తి, క, కాలగ్రంథి, గడి, ఛ, మాసమానము, యుగాంశకము-యుగాంసకము, వత్సము, వత్సరము, వర్షము, శరత్తు-శరద-శారదము, సంవత్తు, సమ, హాయనము. (తె) ఏఁడాది-ఏఁడు, సాలు. తద్వి.— ౧.-చూ, మాసద్వయము (ఋతువులు); ౨.-చూ, మాసములు; ౩.-చూ, సంవత్సరములు.

సంవత్సరములు. ౬౦: ప్రభవ, విభవ, శుక్ల, ప్రమోదూత, ప్రజోత్పత్తి, ఆంగీరస, శ్రీముఖ, భావ, యువ, ధాత, ఈశ్వర, బహుధాన్య, ప్రమాది, విక్రమ, వృష, చిత్రభాను, స్వభాను, తారణ, పార్థివ, వ్యయ, సర్వజిత్తు, సర్వధారి, విరోధి, వికృతి, ఖర, నందన, విజయ, జయ, మన్మథ, దుర్ముఖి, హేవిళంబి, విళంబి, వికారి, శార్వరి, ప్లవ, శుభకృత్తు, శోభకృత్తు, క్రోధి, విశ్వావసు, పరాభవ, ప్లవంగ, కీలక, సౌమ్య, సాధారణ, విరోధికృతు, పరీధావి, ప్రమాదీచ, ఆనంద, రాక్షస, నల, పింగళ, కాళయుక్తి, సిద్ధార్థి, రౌద్రి, దుర్మతి, దుందుభి, రుధిరోద్గారి, రక్తాక్షి, క్రోధన, అక్షయ. (60) ("భగవంతుఁడు నారదునికోరికపై యొకతటాకంబు నిర్మించె. అందుభగవంతుఁడు స్నానమాచరించె. పిదప నారదుఁడుస్నానమాచరింప నాతఁడు నొకయువతియై వెలువడివచ్చి ప్రాగ్జ్ఞానంబు మఱచి యచ్చోటి కాననంబున విహరించుచుండెను. ఇట్లుండ నాయరణ్యనాయకుం డప్పతిం జూచి మోహించి, యామెను వివాహమాడి! యామెతోఁ గొన్నిదినములు గ్రీడింప నాయిరువురకును అఱువదిమందిపుత్రు లుద్భవించిరి. నీమహిమవలనఁ బుట్టిన అఱువదిమందిపుత్రుల గతి దుర్గతిగాకుండ సద్గతిఁ జెందునటుల ననుగ్రహింపుఁడని శ్రీమన్నారాయణుని వేఁడ నవ్విశ్వంభరుండు నో నారదా విచారింపకుము. నీపుత్రులను ప్రభవాదుల నామంబులుగ నొనర్చితిని. గాన లోకంబున నాచంద్రార్కస్థాయిగఁ బ్రతిసంవత్సరంబున నీకొమరులయం దొక్కొక్కని పేరఁ బఱంగుచుఁ బ్రతిష్ఠఁ జెందిన లోకంబున లోకులవలన వాకొనఁబడు నట్లు వరమిచ్చె నారదమహామునినియొప్పటియట్లనుగ్రహించెను. అందువలన సంవత్సరముల కీపేళ్లు కలిగెనని పురాణోక్తమయి యుండెను"); తద్వి.— ౧ అనేకసంవత్సరములకు-(తె) పుండ్లు-పూఁడులు; ౨: (తె) మూఁడేఁడు-మున్నేఁడు; ౩: ప్రసంవత్సరము; ౪: శకము; ౫: (తె) నిరుడు; ౬: (తె) అయిందా; ౭: (తె) హాలుసాలు; ౮: (తె) తిసాలా; ౯. వసంతఋతుప్రభవ.- ఆకారము, కాలము (చూ, మాసద్వయము); ౧౦. శ్రావణమాసమునకు.— శ్రావణికము; ౧౧. సంవత్సరము ఐదువిధములు.— ౧ చాంద్రమానాబ్దము, ౨ నాక్షత్రమానాబ్దము, ౩ సౌరమానాబ్దము, ౪ బార్హస్పత్యమానాబ్దము, ౫ సావనమానాబ్దము. ఇత్యాది.

సంవత్సరీకము. వా. సం. వి. అ. న. చేచ్చిన వారింగూర్చి సంవత్సరాంతమునం జేయు శ్రాద్ధకర్మము: చూ, సాంవత్సరికము.

సంవసనము. సం. వి. అ. న. రూ-సంవసనము: చూ, వసక్రియ. [1-2-3-4

సంవరము. సం. వి. అ. న. చూ, రూ-శంబరము

సంవర్తకము. సం. వి. అ. న. బలరాముని నాఁగలి: చూ, హలము. [చూ, హలాయుధుఁడు.

సంవర్తకుఁడు. సం. వి. అ. పుం. బలరాముఁడు:

సంవర్తనము. అం: చూ, అస్త్రములు.

సంవర్తస్మృతి. అం: చూ, [illegible]స్మృతులు.

సంవర్తము. సం. వి. అ. పుం. 1. కల్పము, కల్పాంతము, క్షయము, ప్రళయము-ప్రళయము, యుగాంతము, విలయము. తద్వి— యుగాంతము, మహాప్రళయము; 2. ఒకానొక మేఘము: చూ, మేఘము. 1; 3: అక్షము, అవహేతము, కరసంవర్తకము, కర్షఫలము. కలి, కలిందము, కలిద్రుమము, కల్కము, కల్కి, తుషము, భూతావాసము, రోమహర్షణము, విభీతకము, హార్యము. (తె). తాండ్రి-తాఁడి-తాఁడె*; అం. 4; చూ, మేఘములు.

సంవర్తిక. సం. వి. ఆ. స్త్రీ. క్రొత్త తామర పూరేకు: రూ-సంవృత్తిక, ణ, నవదళము. (తె) కచ్చు, తామర రేకు, పూరేకు-పూ రేకు, రేక-రేకు-రేకు: (చూ, సహస్రపత్రము.) [సన్యాసి.

సంవర్తుఁడు. సం. వి. అ. పుం. ఒకముని: చూ,

సంవర్థించు. సం. క్రి: వర్థించు. (తె) పెంచు-పెనుచు.

సంవర్థితము. సం. విణ: ఉపబృంహితము.

సంవసథము. సం. వి. అ. పుం. గ్రామము. (తె) ఊరు: చూ, సీమ (1) (దేశములు.)

సంవహము. అం: చూ, వాయువులు.

సంవాదము. సం. వి. అ. పుం. 1: చూ, సమాచారము 2; వా. 2: వాదము. (తె) మల్లగుల్లము, వాదు, వాదులాట. [దము-అంగమర్ద

సంవాహకుఁడు. సం. వి. అ. పుం. అంగమర్దుఁ

సంవాహనము. సం. వి. అ. న. 1 అంగమర్దనము, అంగమర్దనము, మైప్రసము, మర్దనము. (తె) పట్టుట, పిసికివేయుట, పిసుకుట. (చూ, సమ్మర్దనము): 2. చేతులుగా మోసికొని పోవుట.

సంవిత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. తెలివి: చూ, హృల్లేఖము. 2; 2: చూ, సమాచారము. 2.

సంవిత్తు. సం. వి. ద. స్త్రీ. 1: చూ, సంవిత్తి 1, 2. పేరు: చూ, సంకేతము. 1; 3. పందెము: చూ, స్పర్ధ. 4; 4: చూ, సమ్మతి. 1; 5. ఆచారము: చూ, సమయము. 2; 6: చూ. యుద్ధము; 7. సంభాషణము: చూ, కథనము.2

సందల్లుఁడు. సం. వి. అ. పుం: చూ, రూ-సావిదల్లుఁడు.

సంవిభాగించు. సం. స.క్రి: విభాగించు, పాలించు, భజించు-సంభజించు. (తె) పంచు-పనుచు, పాలుగొను-పాల్గొను, పాలుపఱచు, పాలుపెట్టు, పంగడించు, వేఱుపఱచు.

సంవీక్షించు. సం. స.క్రి: సమువ్వీక్షించు: చూ, వీక్షించు.

సంవీక్షణము. సం. విణ: చూ, సమీక్షణము. 2.

సంవీతము. సం. వి. అ. న. 1. హారమువలె వేసికొన్న జందెము: చూ, యజ్ఞసూత్రము: విణ. 2. చుట్టుకొనఁబడినది: చూ, సంవృతము.

సంవృతము. సం. విణ. చుట్టుకొనఁబడినది: అవకుంఠితము, అపావృతము, అవృతము, ఉద్వేష్టితము, నివారితము, పరిగణితము, పరిక్షిప్తము, పరివృతము, పరీతము, మానరము, రుద్ధము, వలయితము, వలితము, విశ్వతోముఖము, వృత్తము, వేష్టితము, వ్యాప్తము, వ్యావృతము-వ్యావృత్తము, సంపూర్ణ

ము, సంధీకము. తద్వి.— ౧. చుట్టుటకు - అత్కము, అభివ్యాప్తి, అవకుంఠనము, ఆక, ఆకము, ఉద్వేష్టనము, పరిచారము, పరిదక్షిణము, పరిసరము-పరిసారము, పరిసర్పణము, ప్రావరణము, వ్యాపకము, వ్యాపనము, వ్యాప్తి, వ్యావర్తనము, హిండనము. (తె):— అవఘళము, చుట్టు, చుట్టుట, చుట్టుదల, నెరపు-నెఱపు, నెరవు-నెఱవు, పంచారము, పటవణి, పరవు, పసరింపు, పసరు, పయిపాటు-పైపాటు, పెనఁకువ-పెనఁకువ, పిసాళము, పొలపము, పొలయిక, ములక, మునుఁగు-మునుఁగుడు. (చూ, వ్యవధానము. 3.); ౨. చుట్టుకొనుటకు - పరివేష్టనము, పరివేశము-పరివేషము, ప్రదక్షిణము, వరణము, వివర్తనము, వృతి, వేల్లనము, వేష్టనము. (తె) పరి, వలచుట్టు, వలను; ౩. చుట్టుకొనిపచ్చుటకు-పరిక్రియ, పరిసర్పము, పరిసర్య, పరివర్తనము-పరివర్తము-పరీవర్తము, పరిసారము-పరీసారము; ౪. చుట్టుకొనియుండుటకు -పరిక్షేపము; ౫. వ్యాపింపఁదగినది అనుటకు.-వ్యాపనీయము, వ్యాప్యము; ౬. ధూళి పొందలగువానిచే కప్పఁబడినది అనుటకు _ గుంఠితము, రూషితము; ౭. అంతట వ్యాపించుటకు-పరిసరణము, శిబిరము, సమ్మార్జనము. (తె) పచేరింపు.

సంవృత్తిక. సం.వి.అ. స్త్రీ: చూ, రూ-సంవర్తిక.

సంవృద్ధి. సం. వి. ఇ. పుం ఎక్కుఁగా పెరుగుట: చూ, ఉపబృంహణము.

సంవేగము. సం. వి. అ. పుం: చూ, సంభ్రమము.

సంవేదము. సం. వి. అ. పుం. 1. సుఖదుఃఖాదులను తెలిసికొనుట: చూ, రూ-వేదన; 2 వాదిప్రతివాదుల పరస్పరప్రాగల్భ్యము.

సంవేశము. సం. వి. అ. పుం. 1. పీఠము: చూ, సింహాసనము. 1; 2. నిద్ర: చూ, స్వప్నము; 3: చూ, సంభ్రమము.

సంవేశిని. సం. వి. ఈ. స్త్రీ: చూ, మొగపాలు 1-2-3 (చూ, సదనము. 1.)

సంవ్యానము. సం. వి. అ. న. 1. ఉత్తరీయము: చూ, వస్త్రము; 2. బట్ట: చూ, వస్త్రము.

సంశప్తకుఁడు. సం. వి. అ. పుం. తిరుగనని ఒట్టుఁబెట్టుకొని యుద్ధము చేయువాఁడు: రూ-సంసప్తకుఁడు.

సంశయము. సం. వి. అ. పుం. 1: అనుమానము, త్రుటి, ద్వాపరము, భ్రమ, యూతకము, లింగము, విచికిత్స, వితర్కము, విశయము, శంక, సందేహము (అవ్య) అపి, ఆ, అహో, కిమ్ను, కిముత. (తె) అరగలి, అరమర-అఱమర-అఱమఱ-అరమరిక-అఱమరిక-అఱమచిక-అరముగము, ఊగియాట, గుమాను, నొడలదొంతి, పానలు, ములికితము, మెరమెర, వెడజాణతనము, సందియము. (అవ్య). ఓఁ; అం. 2: చూ, అర్థలోపములు.

సంశయాపన్నమానసుఁడు. సం. విశే: చూ, సాంశయికుఁడు.

సంశయార్థకములు. అం: "అకో, ఏమో, ఒకో, ఒకొక్కొ, ఓ, కాఁబోలు, నల్లవో." అనునవి.

సంశయాళువు. సం. విశే. (ఉ): చూ, సాంశయికుఁడు.

సంశయించు. సం. అ. క్రి: అనుమానించు, వితర్కించు, శంకించు, సందేహించు. (వి) అనుమానపడు. (తె) అంజాయించు, అరగలిగొను, మెరమెరపడు, సందియపడు.

సంశయిత. సం. విశే. (ఋ. ఈ. ఋ) సంశయించువాఁడు. [చూ, సన్నిధానము 2.

సంశ్రయము. సం. వి. అ. పుం. ఆశ్రయము:

సంశ్రయించు. సం. స. క్రి: చూ, ప్రాపుగొను.

సంశ్రవణీయము. సం. విణ: చూ, శ్రవణీయము.
సంశ్రవము. సం. వి. అ. పుం. అంగీకారము: చూ, సమ్మతి. 1.
సంశ్రితము. సం. విణ. ఆశ్రయింపఁబడినది.
సంశ్రుతము. సం. విణ. అంగీకరింపఁబడినది: చూ, స్వీకృతము. 1. [శ్లేషింపఁబడినది.
సంశ్లిష్టము. సం. విణ కౌఁగిలింపఁబడినది, సం
సంశ్లేషమగు. సం. స. క్రి: చూ, సంయుక్తమగు.
సంశ్లేషము. సం. వి. అ పుం. 1: అంకపాళి- అంకపాళిక, అంగపాలి-అంగపాళి, ఆలింగనము, ఆశ్లేషము, ఉపగూహనము, కోలము, క్రోడీకరణము, క్రోడీకృతి, డిండీరము, పరిరంభము, పరిష్వంగము, లయము, శ్లిష, పాలి (లి). (అవ్య) అజ్. (తె):-కవుఁగిలి కౌఁగిలి-కవుఁగిలింత - కౌఁగిలింత, కవుఁగిలింపు-కౌఁగిలింపు, లంకియ-లంకె. తద్వి.— ౧: కట్యాశ్లిష్టకము, ౨: క్షీరనీరము; ౩: కుస్తిష్కము; ౪:-చూ, ఆలింగనములు; అం. 2. (భిన్నహల్లులసంయోగము): చూ, హస్త క్రియలు. [కౌఁగిలించే
సంశ్లేషించే. సం. స. క్రి: (తె) కవుఁగిలించే-
సంసక్తము. సం. విణ. కదిసినది, పొందఁబడినది: అంచితము, అంజసము, అధిగతము, అనుగతము, అపటాంతరము- అపదాంతరము, అభిగతము, అవగతము, అవాప్తము, అవ్యవహితము, ఆగతము, ఆత్తము, ఆనీతము, ఆపన్నము, ఆపితము, ఆప్తము, ఆసాదితము, ఇతము, ఉదూఢము, ఉపలబ్ధము, ఉపాగతము, ఉపాత్తము, ఉపపన్నము, ఊఢము, కలితము, గృహీతము, నిర్విష్టము, పరిగణితము, పరివృతము, పరిణీతము-ప్రణీతము, ప్రాప్తము, భావితము, భూతము, లబ్ధము, వాహసము, విత్తము, విన్నము, వ్యాప్తము, సక్తము, సనాథము. (వి). అధిగమము, కలన, వ్యాప్తి, సమధిగమము, సమన్వితము. (తె) (వి): అంగుబడి, సెగవు, పొందుట, పొందుపాటు, పాలపము. తద్వి.— ౧. పొందినది.—సమాగతము; ౨. పొందఁదగినది.-చూ, లభ్యము. 1; ౩. పొందింపఁబడినది: చూ, నీతము. 3; ౪. కూడుకొన్నది: చూ, సహితము; ౫. కూడఁబెట్టఁబడినది: పృక్తము, సంచితము.
సంసక్తి. సం. వి. ఇ. స్త్రీ. కదియిక, చేరిక: చూ, సంయోగము.
సంసక్తుఁడు. సం. విణ: చూ, కాశిత.
సంసత్తు. సం. వి. ద్. స్త్రీ. కొలువుకూటము: చూ, సభ. 2. [శప్తకుఁడు.
సంసప్తకుఁడు. సం. వి. అ. పుం: చూ, రూ-సం
సంసరణము. సం. వి. అ. న. 1: చూ, సంసారము; 2. బాట: చూ, సృతి. 1 (మార్గము. 1.); 3. పట్టణమునుండి వెడలుట; 4 గవను, కసవు: చూ, వారిత. 1 (తృణము. 1); 5. ఇఱుకు లేక దండునడచేట; 6. యుద్ధప్రారంభము.
సంసరించే. సం. అ. క్రి. పుట్టు: చూ, సంభవించే.
సంసర్గము. సం. వి. అ. పుం. 1: చూ, సంబంధము. 1; 2. చేరిక, సంసృష్టి: చూ, సంయోగము.
సంసారగురువు. సం. వి. ఉ. పుం: చూ, మన్మథుఁడు.
సంసారము. సం. వి. అ. పుం. 1. (రూ-సంసరము-సంశరము) ఆలుబిడ్డల తోడియునికి (చూ, సంతతి. 1.): ఆజవంజవము, కష్టకారము, కుటుంబము, దుఃఖము, పునర్భవము, ప్రపంచము, భవము, లోకము, సంతానము, సంసరణము, సంసృతి. (తె) ఇల్లడ-ఇల్లడము, కాఁపురము, లంబి-లంబీ-లెంబి, విడిముట్టు; 2. పుట్టుక: చూ, సంభవము. 1.
సంసారి. సం. వి. న్. పుం. సంసారముగల గృహస్థు. (చూ, యజమానుఁడు.)

సంసిద్ధి. సం. వి. ఇ. స్త్రీ. 1: చూ, స్వభావము; 2. చక్కనిసిద్ధి: చూ, సిద్ధి. 1; 3. ముక్తురాలు: చూ, స్త్రీ.

సంసు. వా. వి: చూ, సమయము. 1.

సంసృతి. సం. వి. ఇ. స్త్రీ: చూ, సంసారము. 1.

సంసృష్టము. సం. విణ. 1. సంసర్గమునొందినది, కలిసినది: కదంబకము, కదంబము, కబరము, కరంబము, కరంబితము, కలవము, మిశ్రము, మిశ్రితము, మిళితము; 2. వస్త్రములోనగు వానిచే శోధింపఁబడినది: చూ, శోధితము.

సంసృష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. తిలతండులములు కలిసినవిధమున నైన అర్థాలంకారముయొక్క పరస్పరసంబంధము: సంబంధము; 2. సంసర్గము: చూ, సంయోగము; అం. 3: చూ, రసవదలంకారములు.

సంస్కరించు. సం. స. క్రి. దిద్దు: చూ, సవరించు. 2; 2. వక్కాణముచేయు: (తె) వండు. తద్వి.—కూరాకు నీళ్లిగురపొర్లించి వండుటకు.– (తె) (వి) పొరటు; 3. (శవమును) దహనముచేయు; 4. శుద్ధిచేయు.

సంస్కారము. సం. వి. అ. పుం. 1. గంధమాల్యాదులచేత వస్త్రతాంబూలాదులయొక్క సంస్కారము: అధివాసము. (తె) చక్కఁజేయుట; 2. (శవమును)దహనముచేయుట:_ సంస్క్రియ. తద్వి.-మృతిసంస్కారమునకు.- సాధనము; 3: అనుభూతార్థస్మృతి; 4: చూ, సంకల్పము. 1; 5. పాకము: చూ, సూపకారము; 6: చూ, ప్రతియత్నము: 7: అభిఘారము. (తె) తాలింపు: చూ, సాతాళింపు; అం. 8: చూ, బౌద్ధశాస్త్రస్కంధములు.

సంస్కారములు. 1. (దశవిధ సంస్కారములు): గర్భాధానము, పుంసవనము, సీమంతము, జాతకర్మము, నామకరణము, అన్నప్రాశనము, కర్ణవేధనము, కేశఖండనము, అక్షరస్వీకారణము, ఉపనయనము (10); 2: తాపము, పుండ్రము, నామము, మంత్రము, వైష్ణవేష్టి. (5).

సంస్కృతభవము. పా: చూ, ప్రాకృతము.

సంస్కృతము. సం. వి. అ. న. 1. వేలుప్రబాస, దేవభాష: చూ, భాషలు (చూ, ఉభవిద్యలు) తద్వి.—భోటజభాషకు.–మాంగళి; విణ. 2. చక్కఁగాచేయఁబడినది; 3. చక్కఁజేయఁబడినది; 4. అలంకరింపఁబడినది; 5. వ్యాకరణశిక్షితమైనది; 6. వక్కాణముచేయఁబడినది, తావితోఁబెనచినది: పొనఁటినది–పొరఁటినది, కయిమాలోనగు వానిచేత సాతాళింపఁబడినది; 8: చూ, శ్రేష్ఠము; అం. 9: చూ, వ్యాకరణములు; 10: చూ, భాషలు.

సంస్కృతసమము. పా: చూ, ప్రాకృతము.

సంస్క్రియ. సం. వి. ఆ. స్త్రీ. చక్కఁజేయుట; 2. (శవమును) దహనముచేయుట: చూ, సంస్కారము. 2.

సంస్తంభించు. సం. స. క్రి: చూ, స్తంభించు.

సంస్తరము. సం. వి. అ. పుం. 1. చిగుళ్లులోనగు వానిచేత నేర్పఱుపఁబడినపడక: చూ, సెజ్జ. 2. యజ్ఞము: చూ, హోమము. 3 (యజ్ఞము).

సంస్తవము. సం. విణ. 1: పరిచయము, పరిచితి, ప్రణయము, ప్రతీతి, విభావము. (తె): ఎఱుక, సెలవు–సెళవు, పాఁతతికము. తద్వి– (విణ) పరిచితము; 2. చక్కనిస్తుతి.

సంస్తావము. సం. వి. అ. పుం. 1. యజ్ఞములయందు బ్రాహ్మణులు వేదబుక్కులు చెప్పెడుచోటు: చూ, స్థానము. 1; 2. యజ్ఞములయందు బ్రాహ్మణులు వేదబుక్కులను చెప్పుట.

సంస్త్యయము. సం. వి. అ. పుం. (రూ–సంస్త్యా

యము) 1. ఇల్లు: చూ, సదనము. 1:2: చూ, సన్నివేశము. 1.

సంస్త్యాయము. సం. వి. అ. పుం.—వై.—; 3. విరివి: చూ, పేరాశము; 4: చూ, సమూహము.

సంస్థ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఉనికి: చూ, స్థానము. 1; 2: మర్యాద, ధారణ, స్థితి: చూ, స్థితి. 3; 3. నాశము: అత్యయము, అపచితి, అవసాదము, ఉపహతి, క్షి, క్షయము, క్షితి, ధ్వంసము, నాశము, నిధనము, నిరోధము, నిర్వాణము, నిష్ఠ, పరాభవము, ప్రధ్వంసము, రుజ, లయము, లవము, విగమము, విధ్వంసము, వినాశము. (అవ్య) అతి. (తె):— ఒబ్బిడి, కాడు, చేగణ, చేటు, తలమాటు, తెగుదల, తోమ్మాడు, తుంగుడు, నిప్పచ్చే-నిప్పచ్చే రము, పలాయలు, పాడు, పెంపు, పొలియిక, పోకడ, రుత్తి, వమ్ము, వేరువిత్తు. (చూ, సేగి. 4); 4. చావు: చూ, సావు; 5. పోలిక: చూ, సమానము. 2; అం. 6: చూ, తానములు (నిహీనతానములు.)

సంస్థాత. సం. విణ. (బు. ఈ. బు) చక్కగా నిలుచుండువాడు.

సంస్థానము. సం. వి. అ. న. 1. ఊరిచుట్టునుండు బయలు: చూ, సన్నివేశము. 1; 2. చతుష్పథము: చూ, స్మృతి. 1 (మార్గము. 1-౦౭.); 3. చావు: చూ, సావు; 4: చూ, స్వరూపము.

సంస్థితము. సం. విణ. 1. చచ్చినది: పరేతము, ప్రమీతము, ప్రాప్తపంచత్వము, ప్రేతము, మృతము, వృత్తము, సమాప్తము. (తె) అసువు; 2. చక్కగా ఉండినది: భాసంతము.

సంస్థితి. సం. వి. ఇ. స్త్రీ. 1. చావు: చూ, సావు; 2. చక్కనియునికి: చూ, స్థానము. 1.

సంస్థితుఁడు. సం. విణ. చనిపోయినవాఁడు: చూ, శవము. 2.

సంస్పర్శ. సం. వి. ఆ. స్త్రీ: ఆఘారి-ఆఘారిక, కపికచ్ఛుఫలోపమము, ఖదిరవల్లి, ఖాతకము, గుచ్ఛపత్రిము, చక్రివర్తిని, జంతుకృత్తు-జతుకృత్తు, జతుక, జతూక, జననీ, జని, జనూక, తరక, దారి, దార్వి, ధాయ్య, ధారి, ధార్య, మూచపత్రి, ముష్మరి, రజని. (తె) కోరింద-కోరిండా-కోరెండ, కోరిందపాద*. [చూ, స్పర్శము. 1.

సంస్పర్శము. సం. వి. అ. పుం. చక్కనిస్పర్శము: సంస్పృశించు. సం. సం. క్రి. తాఁకు: చూ, స్పృశించు. [మేఘము. 1.

సంస్ఫాలము. సం. వి. అ. పుం మగగొఱ్ఱె: చూ,

సంస్ఫోటము. సం. వి. అ. పుం: చూ, యుద్ధము.

సంహతము. సం. విణ. 1. చక్కఁగాఁ జేరినది; 2. దృఢసంయోగముగలది: దృఢసంధి; అం. 3: చూ, చిబుకక్రియలు; 4: చూ, ఏకవింశతిస్థానకములు.

సంహతలము. సం. వి. అ. పుం. రూ-సింహతలము. మొక్కుటకు వ్రేళ్లుచాఁచి కూర్చిన చేదోయి: చూ, హస్తము. 1.

సంహతి. సం. వి. ఇ. స్త్రీ: చూ, సమూహము.

సంహననము. సం. వి అ. న. మేను: చూ, శరీరము.

సంహరణము. సం. వి. అ. న. చంపుట: చూ, హింస 1.

సంహరించు. సం. స. క్రి. చంపు: అఘాతించు, ఘాతించు, పొరిక్షించు, వధించు, విఘాతించు, విశసించు, సమాప్తించు, హింసించు. (తె):—కదపు, కసిమసగు, కూలుచు-కూల్చు, కెడపు, గావుపట్టు, చంపు-సంపు, చక్కడుచు, చక్కాడు, చట్టలుచీరు, చేదపు, చేదుము, చేగజగొట్టు, చావఁజాచు, చిలుకుమార్చు, చెండు, తునుము-తున్ము, తునుమాడు-తున్మాడు, తూలించు, తెగఁజాచు, తేలుచు-తేర్చు, తుంచు, తుళ్లు

డంచు, తెగిక్కొను, తెగికోలుకొను, తోగిము, దురుము, దోరచు-గోర్చు, నాను మడచు, నుగ్గాడు, నులుపు, నులుము-నులుమాడు, నులుము చేయు, నులుము, నేలగలుపు, పగదెంచు,పరిమాలుచు-పరిమార్చు, పింసేమన్నిగొను, పీచేమణచు, పెంపెరలాడు, పెంపు, పొగరుసూన్చు, పొడవడచు, పొరిగొను, పొరిసూరుచు- పొరిమార్చు-పొరిమాలుచు-పొరిమాలుచు-పొరిమాల్చు, పొరిపుచ్చు-పొరివుచ్చు, బలిపెట్టు, బలివారు, మగియించు, మట్టుపెట్టు, మడియించు, మడుపు, మదమడచు, మన్నిగొను, మారిమపలు, వడిపెట్టు, వడివేయు, వేటలాడు, వేటాడు, సదమదమొనర్చు, సదమదము సేయు, సరిగొను, సరిపెట్టు.

సంహ_ర్త. సం. విణ: చూ, సంహారకుడు.

సంహారకుడు. సం. విణ: ఆఘాతుడు, కాటికుడు, ఖట్టికుడు, మాంసికుడు, వైతంసికుడు, సంహ_ర్త. (తె):— కటిక-కట్టిక, కటికవాడు-కటికివాడు, కసాయి, వేటకాడు, సూనకాడు, సూనరి.

సంహారము. సం. వి. అ. పుం. 1: చూ, సంహననము; 2. ఒకానొకనరకము: చూ, నరకములు తద్వి:—నరకమునకు.-కుజము,దుర్గతి, నరకము, నారకము, నిరయము, వీచి, సంఘాతము. (తె) బిద్ద- బిద్దె, బిస్త, రౌరవము-రోవరము.

సంహిత. సం. వి. ఆ. స్త్రీ. 1. వర్ణసంయోగము; 2. వేదమునందుకొంతభాగము. "తైత్తిరీయసంహిత": చూ,వేదము; 3: చూ,శాస్త్రము; విణ. 4. సంధింపబడినది.

సంహితలు. అం:వ్యాస,శుక,వసిష్ఠసంహితలు (3)

సంహూతి. సం. వి. ఇ. స్త్రీ. అనేకులుచేరిపిలిచిన పిలుపు: చూ, హూతి.

సంహృతము. సం. విణ. సంపాదింపబడినది.

సంహృతి. సం. వి.ఇ. స్త్రీ:చూ, సంహరణము.

సకర్మకకర్తృప్రయోగము.అం: చూ,ప్రయోగము.

సకలము. సం. విణ. 1: చూ, సర్వము; 2. కలతోగూడినది; తద్వి.—కలతపెట్టబడినది: క్షుబ్ధము, క్షోభితము, అనచ్ఛము, ఉద్వేజితము. (తె) గజిబిజి.

సకలాతు. దే. వి. రూ-సకళాతు. 1. మేలైన కంబళి: చూ, పాశూకము (రల్లకము); వా. 2: చూ, జేరత.

సకలాత్మ. అం: చూ, ఆత్మలు.

సకళాతు. దే.వి. చూ, రూ-సకలాతు. 1-2.

సకి. వై. వి. రూ-సకియ=సఖి. 1. చెలికత్తె: చూ, సఖి. 1; 2. ఆడుది: చూ, స్త్రీ.

సకిన. వై. వి. 1.=శకున. రూ-సగిన. వసు. 6, అ. 74: చూ, సకినంపుబులుగు. 2. కీచుకీచు మనుధ్వని: చూ, స్వరము. 2; 3. బొమ్మ. (బొమ్మకును బొమ్మలలోనిరకములకును): చూ, శారిణి. 3; 4. కీచుబిల్ల: చూ, సురమాలి (లోడు. 2-౩.)

సకినంపుబక్కి. వై. వి.=శకునపక్షి: చూ, సకినంపుబులుగు.

సకినంపుబులుగు. ద్వి. వి: గుబిలి-గుమిలి, గుబ్బలికాడు-గుబ్బిలికాడు, చిలుకగూబ-చిలుంగూబ, డబ్బ, పగటిచీకు, పయిడికంటి-పయిడికంటె-పైడికంటి-పసిడికంటి-పసిడికంటె, బంగారుకంటి, సకినంపుబక్కి, సకిన-సగిన, సకినాలపులుగు. (సం):—కనకాక్షి, గృహమాచిక, జతుని, నిశాచరి, నిశాటనము, పింగళ, శకునము. తద్వి.— ౧. గుడ్లగూబకు.-కొరడు, కోటడు, గుడ్ల, గుబ్బలి, గుడ్లగూబ-గుడ్డిగూబ-గుబ-గూబ, పగలుగానవిపుల్గు," పలుగు

పిట్ట, పవటిగుడ్డిగూబ, పులుఁగు, పులుఁగు పిట్ట, పెద్దపులుఁగు, బుండ్రము, బుఱ్ఱేవు (బుఱ్ఱేక). (సం): ఉలూకము, కాకభీరువు, కాకరుకము - కాకరూకము - కాకలూకము, కాకారి, కాకోదరము, కౌశికము, ఖరచ్ఛదము, ఘు, ఘుర్ఘురకము - ఘుర్ఘురము, ఘుర్ఘురకము, ఘూకము, ఘోరదర్శనము, దివాంధము, దివాభీతము, నక్తంచరము, నక్తకము, పేచకము, హీక్కు; ౨. నల్లగుడ్లగూబకు - కృతమాలకము - కృతమూలకము; 3. గుడ్లగూబగుడ్డునకు - (సం) వీరకము.

సకినము. వై. వి.=శకున. 1: చూ, శకునము. 1; 2. శుభాశుభసూచకవాక్కు: చూ, శబ్దము. 2.

సకినలమంచేము. ద్వ. వి. రూ - సకినెలమంచేము. రవమంచేము: చూ, శయ్య. 1.

సకినాలపులుఁగు. ద్వ. వి: చూ, సకినంపుఁబులుఁగు.

సకినెలమంచేము. ద్వ. వి: చూ, రూ - సకినలమంచేము. [3, ఆ. 117.

సకియ. వై. వి.=సఖీ: చూ, రూ - సకి. వను.

సకిరింత. దే. వి. గుబ్బపుకూఁత, (రూ - సకిలింత - సకిలింపు - సకిలింత): చూ, హేష (స్వరము 2.)

సకిలించే. దే. అ. క్రి: చూ, హేషించే.

సకిలింత. దే. వి: చూ, రూ - సకిరింత.

సకిలింపు. దే. వి. — పై. — అం, భా ద్వి. 197.

సకుఁడు. వై. వి.=సఖు: చూ, స్నేహితుఁడు.

సకృత్ప్రజము. సం. వి. అ. పుం. కాకి: అఘాయువు, అన్యవాహము, అరిష్టము, అస్వపుట్, ఆత్మఘోషము, ఉత్క్రోశము, ఉలూకారి, ఏకదృష్టి, ఏకాక్షము, కంటకము, కటుఖాదకము, కరటము, కాకము, కాణము, కాణుకము, కులింగము, కృష్ణము, కౌశికారాతి, గూఢమైథునము, గృహబలిభుక్కు, ఘూకారి, చిరజీవి, చిరాయువు, దీర్ఘాయువు, ద్రోణము, ధ్వాంక్షము, ధ్వాంక్షము, ర
జంఘము, పరభృత్తు, పికవర్ధనము, పిశున
బలము, బలిపుష్టము, బలిభుక్కు, బలిః
మౌకలి - మాద్గలి, వాయసము, వికము, సు
కము. (తె): — కాకి, గమికాఁడు - గుమి
డు, మెల్లకంటి. తద్వ — ౧. ఆతాపి. (
అళ్లకోస, ముదికాకి; ౨: కురుకము, శకు
ము. (తె) చెమరు - చెమరుఁగాకి - చెమ
కాకి - చెమురుకాకి - చెమర్కాకి; 3: అ
కాకము, వాదోణవాయసము, శైలజక
ము. (తె) కొండకాకి; ౪. పిచులము,
ము, మద్గువు. (తె) నీరుకాకి; ౫: అసుర
ఐంద్రము, కాకాలము - కాకోలము, క
కాకము, కూరరావి, ద్రోణకాకము, చ
ణము, వృద్ధకాకము. (తె) బొంతకాకి, వ
కాకి; ౬: బుభుక్షితకము, కాణము, ధూంత
ము. (తె) తెలికాకి, తెల్లకాకి, పాలకా
౭. కాకులగుంపునకు — కాకము.

సక్తఫల. సం. వి. అ. (స్త్రీ). జేమ్మి*: చూ, శమి.

సక్తమగు. మి. స. క్రి: అధిగమించే, ఆసా
చే, ఏకీభవించే, గ్రహించే - పరిగ్రహించ
నిర్వహిల్లు, ప్రాపించే - ప్రాప్తించే, లం
చే, సంగమించే, సంయుక్తమగు, సాశ
చే. (తె): — అంటు, అందు, అగు - అ
అతుకు - అదుకు, అత్తు - హత్తు, అత్తుకొ
ఊను, ఎనయు, ఎయిదు - ఎద్దు, ఎలయ
ఏలు, ఏలుకొను, ఒంటు, ఒంటుకొను, ఒ
దు, ఒలయు, కదియు, కను, కలయఁబ
కలయు - కలియు, కలవడు, కలుగు - కల్గు
కలువు, కాంచే, కూడు, కూరు, కొఱ
క్రిక్కిఱియు, గెబ్బు, చేను - సను, చొం
చేరు, తారుకొను - తార్కొను, తొడ
దనియు, దనుకు - దనుక్కు, దూఁకొను, దొ

యు, నయించే, పడమే, పడయు,పాటించే, పెనఁగు, పెరయు-బెరయు, పొందించే, పొందు, పొరయు-పొఱయు, ప్రిబ్బు, మెలఁగు, మెలయు, మేకొను, మేళగించే-మేళవించే, సందుకొను. తద్వి.—౧: చూ, సంక్రమించే. 2; ౨. భాగ్యముపొందు.—(తె) కను. [చూ, సంసక్తము.

సక్తము. సం. విశ. ఒకటతగిలినది (మనను):

సక్తువు. సం. వి. ఉ. పుం.=సత్తు. పేలపిండి: చూ, సాదము. (1).

సక్రమము. సం. వి. అ. పుం. క్రమముతప్పకుండుట. (వ్యతిరేకము అక్రమము.)

సక్థి. సం. వి. ఇ. న: చూ, తొడ. తద్వి.—తొడమీఁదివెలుపలిభాగము. (తె)జబ్బ.

సఖి. సం. వి. ఈ. స్త్రీ. 1.=సకియ. (చూ, స్త్రీ.); న్. పుం. 2: చూ, స్నేహితుఁడు; 3: చూ, సహాయుఁడు; అం. 4: చూ, దూతీచతుష్టయము; 5: చూ, నాయికలు.

సఖుఁడు. సం. వి. అ. పుం. 1=సకుఁడు: చూ, స్నేహితుఁడు; 2: చూ, సహాయుఁడు.

సఖ్యము. సం. వి. అ. న. 1: చూ, స్నేహము; 2. సాప్తపదీనము: చూ, సంధి. 2; అం 3: చూ, భక్తిలక్షణములు.

సగంధుఁడు. సం. వి. అ. పుం. 1.=సంగడీఁడు: చూ, స్నేహితుఁడు; 2: అంశకుఁడు, కలాదుఁడు, జ్ఞాతి, దాయాదుఁడు, బంధువు, భాగస్థుఁడు, సగోత్రుఁడు, సనాభి, స్వజనుఁడు. (తె) దాయ, పాలికాఁపు, పాలిచుట్టము, పాలివాఁడు. తద్వి.—౧. ఏడుతరములలోపలి జ్ఞాతికి.—సపిండుఁడు; ౨: భాగస్థుఁడు. (తె) పాలికాఁపు; విశ. 2.గంధముతో కూడినవాఁడు.

సగటు. వై. వి. 1.=శకట. శేవరంగమునందు శకటము, శకటు. ద్యూతశకటము: చూ, శకటము. 2; 2: రూ-సగుటు, సరాసరి.

సగటుసమూరు.వా.అవ్య.సరాసరికంటె హెచ్చే

సగటురమారమి. వా. అవ్య. సరాసరికి కొద్ది హెచ్చేతగ్గ. [దా": చూ,అష్టగణలక్షణము.

సగణము. అం. (2 లఘువులు + 1గురువు) "సర

సగతు. దే. వి. గుజ్జుపుసల్లముమీఁద కెంపులుచిగుళ్లును, పచ్చలు ఆకులును, రవలుపూవ్వులును గానంతరించి యేర్పఱచినబంగారుతీఁగ మోడిపని. (చూ, ఉల్లారు.)

సగము. వై. వి.=సామి. (దీనికి వృత్తియందువాల్లుపరమగుచో వికల్పముగ నంత్యవర్ణ లోపము. "సగపాలు."): రూ-సవము-సాము-సాబాలు-సావాలు, అర్ధ-అర్ధము, అర-అఱ. (సం) అర్ధము, సమాంశము. తద్వి.—కొంతభాగమునకు.—(సం) ఊనము, ఖండము.

సగర్భ్యుఁడు. సం. వి. అ. పుం. ఒకతల్లికడుపునఁబుట్టిన తోఁబుట్టువు:చూ, సహోదరుఁడు.

సగలము. అం. (స + గల) "పరమావాస": చూ, ఉపగణములు.

సగిన. వై. వి.=శకున: చూ,రూ-సకిన.

సగిలించే. దే. అ. క్రి: చూ, రూ-సకిలించే.

సగిలింత. దే. వి: చూ, రూ-సకిలింత.

సగుటు. దే. వి: చూ, రూ-సగటు. 2.

సగుణజపము. అం: చూ, నియమములు.

సగోత్రుఁడు. సం. వి. అ. పుం. జ్ఞాతి: చూ, సగంధుఁడు. 2.

సగోత్రులు. అం: చూ, జ్ఞాతులు.

సగ్గారి. వై. వి.=సృగాల. రూ-సగ్గాలము. నక్క: చూ, సృగాలము.

సగ్గాలము. వై. వి.=—వై.—

సగ్గించే. వా. స. క్రి: అక్కళించే.

సగ్గిసముగ్గిసలు. దే. వి. బ. ఉద్దుగుడుపు: చూ, సంభ్రమము.

సగ్గు. దే. అ. క్రి. 1. అడఁగు. రూ—సగ్గు: చూ, సుగ్రుక్కు. (4); 2. తగ్గు. రూ-సగ్గు: చూ, సుగ్రుక్కు. (9.)

సగ్గుబియ్యము. దే. వి. ఒకానొకకృత్రిమధాన్యము: చూ, సేసఁబాలు.

సగ్గడ. దే. వి. చెంబు: చూ, పాత్రము. 6.

సగ్ధి. సం. వి. ఇ. స్త్రీ. బంతికుడుపు, రూ-సజగ్ధి: చూ, సాపాటు.

సచివుఁడు. సం. వి. అ. పుం. 1. రాజసహాయుఁడు: అమాత్యుఁడు, కుమారుఁడు, కుల్యుఁడు, గృహపతి, తీర్థము, తీర్థుఁడు, దివాను, ధీసచివుఁడు, నియోగి, పాత్రము, ప్రధాని, ప్రధానుఁడు, మంత్రి, మూర్ధాభిషిక్తుఁడు, వ్యావహారికుఁడు, శమథుఁడు. (తె):—నిజోగి-నియోగి-నియ్యోగి, పెగడ-పెగ్గడ-ప్రగ్గడ-ప్రెగడ-ప్రెగ్గడ-ప్రెవడ, మంతిరి, మంతు, వజీరు-వజీరుఁడు-వజ్జీరు-వజ్జీరుఁడు, హాజీబు. తద్వి.—౧. బాణాసురునిమంత్రి.—కుంభాండుఁడు; ౨. బుద్ధిసహాయునకు:—అనుజీవకుఁడు; ౩. విభీషణునిమంత్రి.—అనలుఁడు; ౪. రావణునిమంత్రి.—శుకుఁడు; ౫. ఉపధాకుద్ధుఁడైనమంత్రి.—శుచి; ౬: చూ, సంపత్రి; 2: చూ, స్నేహితుఁడు; 3: చూ, సహాయుఁడు. 1.

సచివులు.అం:చూ,నాయకసఖులు (నాయకులు.)

సచ్చెము. దే.వి. రూ-సాచ్చెము. చిల్లరరొక్కము.పంచ.వేం.1,అ. 763:చూ, శేషము 1.

సచ్చే. సే. అ.క్రి.రూ—చేచ్చే:చూ, సమయు.1.

సచ్ఛూద్రుఁడు. సం. వి. అ. పుం. తగిన మంచియాచారముగలశూద్రుఁడు:చూ,శూద్రుఁడు.

సజగ్ధి. సం. వి. ఇ. స్త్రీ: చూ, సగ్ధి.

సజొవు. వా. విణ. తిన్నని.

సజ్జ. సం. వి. అ. స్త్రీ. 1. కవచము:చూ, వారవారణము; 2. అలంకరణము: చూ, హావణిక. 2 (భూషణము. 2.)

సజ్జక. సం. వి. అ. స్త్రీ.=సజ్జె. పడకిల్లు: చూ, సదనము. 1.

సజ్జన. సం. వి. అ. స్త్రీ. ఏనుఁగును ఎక్కుటకు చేయునపుడు మెడనుగట్టెడితాడు: చూ, హస్తి.

సజ్జనము. సం. వి. అ. న. 1. బెత్తములవారు సందడిలేక తొలఁగించుట; 2 శిబిరరక్షణముకొఱకుఁ జొట్టఁబెట్టిన వెలుగులోపసనది; 3. రేవు. (చూ, రేవు. 1.)

సజ్జనుఁడు. సం. వి. అ. పుం.=సనువు. మంచికులమునందుఁబుట్టినవాఁడు: అభిజాతుఁడు, ఆముష్యాయణుఁడు, అమ్నాతుఁడు, ఆర్యుఁడు, ఇజ్యుఁడు, ఉచితుఁడు, ఉచితజ్ఞుఁడు, ఉత్తమాంగుఁడు, ఉత్తముఁడు, ఉదంతుఁడు, ఉదారుఁడు, కులజుఁడు, కులసంభవుఁడు, కులికుఁడు, కులీనుఁడు, కులుఁడు, కుల్యుఁడు, కాలేయకుఁడు-కాలేయుఁడు, కౌల్యుఁడు, క్షుణ్ణుఁడు, ధనికుఁడు,పాత్రుఁడు,బీజ్యుఁడు, మహాకులుఁడు-యోగ్యుఁడు, విజ్ఞాతుఁడు, వృషాంకుఁడు, వృత్తోపన్నుఁడు, శ్రేష్ఠి, సభ్యుఁడు, సత్కులప్రసూనుఁడు, సద్వంశోద్భవుఁడు, సాధువు, సుజనుఁడు. (తె) మంచి,మంచివాఁడు, తెస్సవాఁడు, సనువు, సాదు. తద్వి.—౧: శ్రేష్ఠుఁడు, హంసుఁడు; ౨: (తె) టంకు; 3: (చూ, కూత్తముఁడు); ౪: సత్తముఁడు, సర్వోత్తముఁడు, సాధీయానుఁడు.

సజ్జిక. సం. వి. అ. స్త్రీ: చూ,సజ్జాకారము.

సజ్జితము. సం. విణ 1. కవచముతొడిగినది; 2.అలంకరింపఁ బడినది: ఉపస్కృతము, పరిష్కృతము, పరిసిద్ధము, సంస్కృతము.

సజ్జుఁడు. సం. విణ. 1. కవచము తొడిగినవాఁడు; 2: అలంకృతుఁడు, ఉదాత్తుఁడు, పరి

ష్కృతుఁడు, పరిసాధితుఁడు, భూషితుఁడు, మండితుఁడు, శ్రీమంతుఁడు, శ్రీలుఁడు. (తె) ఒప్పిదుఁడు, కైసేఁతకాఁడు.

సజ్జె. దే. వి. 1. బుట్ట: బుట్టలరకములు.—౧: జల్లిగంప; ౨: గూడ; 3: గంప. (సం) కండోలకము-కండోలము; ౪: ఎండుపుఁదట్ట, దాఁగర, పల్లిక. బుంగ, సిబ్బి, పల్లిక. (సం) ప్రసేవము, బిలకము, స్యూతము-స్యోతము, స్యూనము-స్యోనము; ౫: పూఁబాళ; ౬. వైష్ణవుల తిరుమణికాటాకులబుట్టకు.-గూడ, తిరువగూడ; ౭: జెంగిడి, తట్ట; వై. వి. 2.=సజ్జికా. అఱ, వాసగృహము: చూ, సదనము. 1; 3. పురిటిల్లు: చూ, సదనము. 1; 4.=సజ్జకా. మేడ: చూ, సదనము. 1; 5.=సజ్జమ్. యత్నము: చూ, సన్నాహము. 2; 6. గంటిచేను*: చూ, సస్యము. 1.

సజ్జకము. దే. విణ. మనోజ్ఞము. వసు. 2, ఆ. 12: చూ, హృద్యము.

సజ్జకట్టు. ద్వ. వి: చూ, సన్నాహము. 2.

సజ్జకాయ. వా. వి: చూ, లింగకాయ.

సజ్జెనకోల. ద్వ. వి. (సజ్జె + కోల) బెత్తము: చూ, వేత్రము.

సజ్జరసము. వై. వి.=సర్జరస: (సం): అరాళము, కనకలోద్భవము, కలకలము, కలలజము, గళము, తాలము, బహురూపము, యక్షధూపము, సర్జరసము, సర్వరసము.

సజ్జలు. వై.వి.బ.=సర్జ. గంటెలు: చూ, ధాన్యము.

సజ్జాకారము. వై. వి.=సర్జక్షార. ఒకచెట్టువఁదీయునుప్పు. (సం): సర్జకాక్షారము, సర్జక్షారము: చూ, లవణము. 1-2. (చూ, సౌవర్చలము.)

సజ్జోరము. వై. వి.=సామజాగారమ్. ఏనుఁగుశాల, ఏకరా: చూ, సదనము. 1.

సజ్జ. కా. వి. 1. జట్టు. కొందఱుజట్టుగూడుట. "అల్లరిసజ్జో".; 2. కొన్నివస్తువుల కూడిక.

సట. సం. వి. ఆ. స్త్రీ. 1.=జడ. రూ-జట. సన్నాసులజడ: చూ, వేనలి; 2. జాలు: చూ, వెండ్రుక. 1; వై. వి (1) కపటము: చూ, వ్యాజము. 1; వా. (2). జాఱుట: (తె) సడలు; (3).=శ్లథ. వదలుట: (తె) సడలు.

సడ. వై. వి. 1.=శ్రద్ధ. రూ-సడ్డ: చూ, వాంఛ; దే. వి. 2.దట్టమగు నాఱువరుస: తసి, సడయి.

సడపు. దే. స. క్రి: (సం) అపహరించు-అపహరించు. (తె):-అంకించు, అంటుకొనిపోవు, అటమటించు, అడగోలుకొను - ఒడగోలుకొను, అఁచికొను, ఎత్తికొను, ఎత్తు, ఎగవేయు, ఒలుచు, కవ్వు, కొను, కొల్లకొట్టు, కొల్లగొను, కొల్లపెట్టు, కొల్లలాడు-కొల్లాడు, గిలుగాడు-గిలుబాడు, గిలుబుకొను, గిలుబుసేయు, గెబ్బు, చూఱకొను, చూఱలాడు-చూఱాడు, దాఁపరించు, దొంగిలించు-దొంగిలు, దొడ్డగొను, దోఁచు, నాఁచు, పఱిగొను, ముచ్చిలించు-మ్రుచ్చిలించు, ముచ్చిలు-మ్రుచ్చిల్లు, లాగుకొను; (అ. క్రి.) ఉలివడు-ఒలివడు, దోపుఁబోవు.

సడయి. దే. వి: చూ, రూ-సడ. 2.

సడలించు. వై. ప్రే: చూ, డీలించు.

సడలు. వై. వి. రూ-సళ్లు. 1. ఊడుట; 2. జాఱుట: చూ, సట (2); 3. వదలుట: చూ, సట. (3); అ. క్రి. 4: రూ-సళ్లు, అగులు-అవులు-ఔలు, ఉరలు, ఊఁచు, ఊడు, ఒలుకు, కాఱు, చిందు, డుల్లు-డొల్లు, పడు, పెకలు, ప్రిదులు, రాలు, విదురు-విదులు, (సం) గళితమగు, స్ఖలించు; 5: రూ-సళ్లు, ఊడు, జరగు-జరుగు-జాఱు, జాఱువాఱు, డిగఁబడు-దిగఁబడు, దుసికిలు-దుసికిల్లు, ప్రిదులు, విడియు, విడిపడు-విడువడు; 6. రూ-సళ్లు, ఈడు, ఉరలు, ఉరలుకొను, ఊడు,

జారు, ప్రిదులు, వదలు-వదులు, విడియు, విడివడు_విముపడు, విడు, విడిపోవు,విరియఁబడు, విరియఁబారు, విరియు, వీడు, వీడుకొను_వీడ్కొను, వ్రీలు, సడలువడు. (వి) చ్యుతమగు. (ఇట్లు సడిలు అనికొందఱు.)

సడలుచు. వై. ప్రే. రూ-సడల్చు,సడలఁజేయు.

సడల్చు. వై. ప్రే. —పై.—

సడలువడు. వై. అ. క్రి. 1: చూ, రూ-సడలు. 6; ప్రే. 2. సడలువఱుచు.

సడవ. దే. వి. త్రోవ: చూ, మార్గము. 1. (సడప అని కొందఱు.)

సడి. దే. వి. 1. ఆఘోషణము: చూ, స్వరము. 2; 2. నింద: చూ, సెగ్గింపు; 3. అగౌరవము: ఎకసకియము-ఎకసకెము-ఎకసక్కెయము-ఎకసక్కెము-ఎకసెకియము-ఎకసెకెము-ఎకసెక్కెయము- ఎకసెక్కెము- ఎక్కసకియము-ఎక్కసకెము- ఎక్కసక్కెయము-ఎక్కసక్కెము- ఎక్కసెకియము-ఎక్కసెకెము_ఎక్కసెక్కెయము-ఎక్కసెక్కెము-ఒచ్చెము, బదనామి, బన్నము, సుడి-నొడి, బాడుదల. (సం) అకీర్తి, అగౌరవము, అపకీర్తి, అపఖ్యాతి, అపప్రథ, అపయశము, అప్రతిష్ఠ, అభియోగము, అభిషంగము, అమర్యాద, అవనుతి, అవమర్యాద, అవమానము, దుర్యశము, భంగము,భంగి. (సెగ్గింపునకు వర్తించునని కొందఱు.); 4.జాడ: చూ, సూచన. 1; 5. సద్దు, చేప్పుడు: చూ, సడి. 1.

సడించు. దే. స. క్రి. దంచు.

సడింపులు. దే. వి. బ. 1. ఎపటిపోఁతలుగా దంచిన బియ్యము: చూ, పేసఁబ్రాలు (బియ్యము); 2. రూ-సడ్డింపులు, సాదింపులు, సడుగులు.

సడికియ. దే. వి. రూ-సడికియ్య-సడికె. క్క-మెడతాడు: చూ, సూత్రము. 1.

సడికియ్య. దే. వి.—పై.—

సడికుడక. దే. వి: చూ, భక్ష్యము.

సడికె. దే. వి: చూ, రూ_సడికియ.

సడిసన్న. వా. వి.నిర్లక్ష్యము: చూ, హేళనవు

సడుగు. దే. వి. (బ. సడుగులు): చూ, శబ్దము.

సడుగులు. దే. వి. 1. —పై.—; 2. కటిప్రశమునందలి కీళ్ళు; 3: చూ, సడింపులు.

సడ్డ. వై. వి. 1.=శ్రద్ధ. అక్క—ఱ. రూ—స చూ, వాంఛ; 2. గణుతి: చూ, సూటి.

సడ్డకుఁడు. వై. వి.=షడ్డకః. జేగిలెఁడు-జేగికాఁడు, తోడియల్లుఁడు. (సం) షడ్డకుఁడ

సడ్డచేయనిది. వా. వి: చూ, చీరికిఁగొననిది.

సడ్డసేయు. వై. స. క్రి: చూ, లెక్కసేయు.

సడ్డింపులు. వా. వి. బ: చూ, రూ-సడింపుల

సణసూత్రము. సం. వి. అ. న: చూ, రూ శణసూత్రము. [2: చూ, సనుకు.

సణుగు. దే. వి. 1. బాధ: చూ, శోకము; వ

సత. వై. స.=సప్త.రూ—సత్తా: చూ,సప్తకము.

సతతపసులలెంకి. ద్వ. వి. దేవగంగ. వేం, ఆ 17: చూ, నది.

సతతము. సం. క్రి. విశే. అ. న.=సతతమ 1. ఎల్లప్పుడు. కళా. 5, ఆ.194: చూ, రూ సంతతము. 2; విశే. 2. ఎడతెగనిది: చూ రూ_సంతతము. 2.

సతతోద్ధితము. అం; చూ, గుణములు. (సత్వము, రజము, తమము ఈమూఁడుగుణముల సాధ్వసస్ఫురితము, సతతోద్ధితమను భేదముల నాలువిధములగును.)

సతవాలుకలదునీడు. ద్వ. వి. సప్తజిహ్వుఁడు. అగ్ని. సాంబ. దే. 12: చూ, వహ్ని. 1.

సతనాల్కలజేజే. ద్వ.వి.—పై.—

సతము. వై. వి.=సతత. నిరంతరము: చూ, శాశ్వతము.
సతహంమాదణి. ద్వ. వి: చూ, సూర్యుడు. అం, పదా. సుర. 21. [హింసింపు. 2.
సతాయించు. వా. స. క్రి. బాధించు: చూ,
సతి. సం. వి. ఈ. స్త్రీ. 1. పతివ్రత: చూ, సాధ్వి. 1; 2: చూ, పార్వతి; అం. 3: చూ, భోగములు (అష్టభోగములు.); 4: చూ, వృత్తము. 1. ("ఒకజగణము, రెండుగురువులు. 5వఛందస్సు")
సతీనకము. సం. వి. అ. పుం. రూ-సతీలకము. లంకసేల: చూ, హరిప్రియ. 2 (భూమి.1.)
సతీర్థ్యుడు. సం. వి. అ. పుం. కూడచదువువాడు: చూ, సహపాఠి.
సతీలకము. సం. వి.అ.పుం: చూ, రూ-సతీనకము.
సతీలము. సం. వి. అ. న: చూ, వెదురు *.
సతృట్టు. సం. విణ. దప్పిగొన్నవాడు: తక్షితుడు, తృషితుడు.
సత్కరించు. సం. స. క్రి: చూ, సన్మానించు.
సత్కారము. సం. వి. అ.పుం: చూ, సన్మానము.
సత్కులప్రసూనుడు. సం.విణ: చూ, సజ్జనుడు.
సత్కులప్రసూత. అం: చూ, మదనములు.
సత్కృతి. సం. వి. ఇ. స్త్రీ: చూ, సత్కారము.
సత్కృతుడు. సం. విణ. సత్కరింపబడినవాడు: చూ, సన్మానితుడు.
సత్క్రియ. సం. వి. ఆ. స్త్రీ: చూ, సన్మానము.
సత్త. సం. వి. ఆ. స్త్రీ. 1. ఉనికి: చూ, స్థానము. 1; 2. మంచితనము: చూ, సత్వము. 1; వై. వి. (1)=శక్య. రూ-సత్తువ. బలము: చూ, శక్తి.1;(2)=సప్త.చూ, సప్తకము.
సత్తకము. అం: చూ, నాటికలు. (అంకములెన్నియైనసరే. భాషపాకృతము.)
సత్తమము. సం. విణ: చూ, శ్రేష్ఠము.

సత్తముడు. సం. విణ. 1. అందఱికంటె మంచివాడు; సర్వోత్తముడు: చూ, సజ్జనుడు; 2. అందఱికంటె పూజ్యుడు; 3: చూ, శ్రేష్ఠుడు.
సత్తరము. వై. వి.=సత్రప. అన్నదానగృహము (ధర్మశాలలనికొందఱు); చూ, సదనము.1.
సత్తరువు. వై. వి.=—వై.—
సత్తా. వై. స.=సప్త. ఏడు: చూ, రూ-సత.
సత్తి. వై. వి. 1=శక్తి. రూ-సత్తువ: చూ, శక్తి. 1; 2.=శక్తి. అమ్మక: చూ, పార్వతి; 3 =శక్తి. చిల్లకోల: చూ, సర్వల (బాణము. 1.); 4.=శక్తి. కాళి: చూ, పార్వతి; 5. పతిష్ఠనికొడుకు: చూ, సూనుడు. 1; 6.=శక్తి. పిశాచము: చూ, సోకుడు. 1.
సత్తికాలువు. ద్వ. వి. శక్తిధరుడు, కుమారస్వామి: చూ, స్కందుడు.
సత్తిదొరవేనలి. ద్వ. వి. ఆకాశము: చూ, సురవర్త్మము. [పదా .సుర. 14.
సత్తిసెచ్చెలి. ద్వ. వి: చూ, లక్ష్మి. 1. అం.
సత్తిరా.వై.వి: చూ, శివుడు. అం, పదా. సుర.10.
సత్తిరావగము. ద్వ. వి: చూ, మన్మథుడు అం, పదా. సుర. 20.
సత్తు. సం. వి. త్. న. 1. నక్షత్రము: చూ, రిక్క; తద్వి.— ౧. అర్థ్రిక.-అభ్రకము; ౨. పుసర్వసునకు.—వసుధ; ౩. ఆకాశమధ్యమందున్న చుక్క.—శిరోనక్షత్రము; విణ. 2. ఉన్నది; 3. తెలివరి: చూ, విద్వాంసుడు; 4. పూజింపదగినది: గంగ, సిరి, పూజ్యము, మహితము. (అన్య) కన్న. (తె) గంగి. సాగ; 5: చూ, శ్రేష్ఠము; 6. నిజము: చూ, సత్యము; 7. సాధువు, మంచిచూ, సామర్థ్యము. 2; అం. 8: చూ, భక్ష్యములు; దే. వి. (1) సీసము: చూ, లోహ

ము. 1; వై. వి. (2)=సత్త్వమ్. బలము: చూ, శక్తి. 1;(3)=సత్యమ్. నిజము: చూ, సత్యము. 1; (4)=సక్తు. పేలపిండి: చూ, సాదము (1).

సత్తువ. వై. వి=సత్వ. రూ-సత్తువ. బలము: చూ, శక్తి. 1. [సస్యము. 1.

సత్తెనంగ. దే. వి. ఒకానొకసస్యము: చూ,

సత్పథము. సం. వి. అ. పుం 1. మంచితోవ: చూ, మార్గము. 1; 2. వత్సతమ్రార్గము: చూ, స్మృతి. 1 (మార్గము. 1)

సత్ప్రతిపక్షము. అం: చూ, పంచోత్తరవాదము.

సత్ప్రవర్తనము. సం. వి. అ. న. మంచినడత: చూ, సమయము. 2.

సత్యంకారము. సం. వి. అ. పుం.=సంచేకరువు క్రయవిక్రయముల గట్టిమాట: అచ్ఛంకారము, ప్రధానము, సత్యాకృతి, సత్యాపనము- (తె): అచ్చేకారము-అచ్చోకారము-అచ్చోరము, సంచేకరము-సంచేకారము-సంచేకరువు, బజానా-బయానా, అడ్వాన్సు.

సత్యకీర్తి. అం: చూ, శస్త్రములు.

సత్యనిత్యత. అం: చూ, సుజ్ఞానదాయకములు.

సత్యము. సం. వి. అ. న. 1.=సత్తు. (సత్పురుషుల యందుఁబుట్టినది.): ఉదాస్థితము, ఔచిత్యము, ఋ, తథ్యము, యథార్థము, వాస్తవము, సమీచీనము, సమ్యక్కు. (అవ్య) యథాతథమ్, యథార్థమ్. (తె) ఉన్నరూపు, ఒప్పు, కలతెఱఁగు, కలరూపు, నికము-నిక్కము-నిక్కువము, నిజము, నిబద్ధి-నిబ్బది-నిబ్బద్ది, నిలవరము-నిలువరము-నిల్వరము, నేటు, సత్తు. తద్వి.—౧. న్యాయమునకు.- ఆసైకనము, అక్షేపము, అర్థము, ఉత్సర్గము, కల్పము, తథ్యము, దేవనము, దేశరూపము, నయము, నిగరము, నీతి, న్యాయము, ప్రమాణము, యుక్తి, వ్యవహారము, సమంజసము. (తె) తేకటి, తగవు-తగువు, తల, తీరు-తీరువు-తీర్పు, నాయము-నేఁ ము, నెతి, పాటి, పాడి, మరియాద, సో క: ౨. నిశ్చయమునకు.-అంతము, అనుభా ము, అరము, అవధారణము, అవసాయము ఇతిహాసము, కారము, కూటము, క్లృప్తి, ని తము, నియతి, నిగమనము, నియమ నిర్ణయము, నిర్ధారణము, నిర్మాణము, నిశ యము, నిష్కర్ష, నికాశము, పరిచ్ఛిత్తి పరిగ్రహము, యంత్రణము, యతి, రూఢి వినియోగము, వ్యవసితము, శాసనము, సమ ధి, సర్గము, సారము, సూత్రము. (అవ్య అ, అపి, ఆమ్, ఔమ్, ఖలు, చ, త, తథా తు, ని, ను, యత్, వా. (తె) అచ్చుపాటు ఏరుపాటు-ఏర్పాటు, కట్టుపట్టు, కరా గణి, చిక్కపట్టు, దిట్టము, నిచ్చయము నిశ్చలము, నిరుకు, పా-పో-పొమ్ము, బ మేర, రూఢి, విట్టము. (అవ్య) ఔఁ; 3 నా యముతోఁగూడినది:-అర్థ్యము; ౪. యోగ మందువర్తించుటకు-కచ్చిత్; ౫. నిశ్చయ ర్థకమందు వర్తించేను అనుటకు.-(తె) కా న్నె, సుమి-సుమ్మీ, సూ; 2. ఒట్టు: చూ శపథము; 3. (సత్యము) కృతయుగము: చూ యుగము. 1; పుం. 4. సత్యలోకము: చూ లోకములు; విశే. 5. నిజమయినది: ఆత్తప బుతము, తథ్యము, భూతము, యథార్థము రుటము, సత్తు, సత్యము, సత్యవతి, సమీ నము, సమ్యక్కు. (తె) నికము-నిక్కువ తద్వి.—నిశ్చయింపఁ బడినది అనుటకు. చూ, స్థితము. 3; పా. 6. దీనికి ఉపమా ము:-హరిశ్చంద్రుఁడు; అం. 7: చూ, సాత్త్వి కగుణములు; 8: చూ, యోగయమాంగముల

సత్యలక్ష్మీప్రయోగము. అం: చూ, తంత్రముల

సత్యలోకము. అం: చూ, ఊర్ధ్వలోకములు.

సత్యవంతుఁడు. సం. విణ. న్యాయస్థుఁడు: తటస్థుఁడు, సత్యవచనుఁడు.

సత్యవతి. సం. వి. ఈ. స్త్రీ. 1. వ్యాసునితల్లి (శంతనునిభార్య): చూ, మాత. 1; 2. శంతనునిభార్య: చూ, భార్య; 3. నారదునిభార్య: చూ, భార్య; 4. సోమెదకూర: చూ, సోమెద; విణ. 5. సత్యముగలది: చూ, సత్యము. 5. [చూ, శ్రీదుఁడు.

సత్యసంగరుఁడు. సం. వి. అ. పుం. కుబేరుఁడు:

సత్యాకృతి. సం. వి. ఇ. స్త్రీ.= సంచేకరువు: చూ, సత్యంకారము. [సన్యాసి.

సత్యాగ్ని. సం. వి. ఇ. పుం. అగస్త్యుఁడు: చూ,

సత్యానృతము. సం. వి.అ. న. వాణిజ్యము: చూ, సార్థవాహము (వర్తకము. 1.)

సత్యాపనము. సం. వి.అ.న: చూ, సత్యంకారము.

సత్యాలబ్రాహ్మణులు. అం: చూ, నేపాళదేశపు బ్రాహ్మణులు.

సత్యాషాఢము. అం: చూ, కల్పసూత్రము.

సత్యాస్త్రము. అం: చూ, అస్త్రములు.

సత్రికాయ. వా. వి. 1 వదలివేయఁబడిన అదనపుకాయ; 2. లెక్కలోఁచేరనికాయ; 3 తోడుగానుండెడివాఁడు.

సత్రము. సం. వి. అ. న. 1.=సత్తరువు. అన్నప్రదానగృహము, ధర్మశాల (అనికొందఱు): చూ, సదనము. 1; 2. సత్రియాగము: చూ, యజ్ఞము; 3. ఎడతెగనియీవి: చూ, స్పర్శము. 2; 4. అడవి: చూ, విపినము; 5. కపటము: చూ, వ్యాజము. 1; విణ. 6. మంచివారిని కాపాడునది.

సత్రియాగము. సం. వి. అ. పుం. (సత్రము) 13 మొదలు 100 దినములవఱకు జరుగునొక యజ్ఞము: చూ, హోమము. 3 (యజ్ఞము.)

సత్రి. సం. వి. న్. పుం. ఎడతెగక దానముచేయువాఁడు: చూ, స్థూలలక్షుఁడు (వదాన్యుఁడు.)

సత్త్వము. సం. వి. అ. న. 1.=సొత్తు. సత్త (సం) భూతి; 2 =సత్త. సత్తువ. దేహబలము. చూ, శక్తి. 1; అం. 3. సత్త్వగుణము: చూ, గుణములు; న. 4: చూ, స్వభావము; 5. మనస్సు: చూ, హృదయము. 1; 6. ప్రయత్నము: చూ, సన్నాహము. 2; 7. ఉనుకు చూ, ప్రాణము; 8. పృథివ్యాదిద్రవ్యము: 9. పిశాచాది: చూ, సోఁకుడు. 1; పుం. వ. 10: జంతువు, జగన్ను (త్ను) వు, జన్మి, జన్యువు, జీవము, ప్రాణి, శరీరి. (తె):— మయితాలుపు-మెయితాలుపు-మేతాలుపు-మేనుతాలుపు-మైతాలుపు.

సత్వరము. సం. క్రి. విణ. అ. న. 1. త్వరితము: చూ, స్యదము; విణ. 2. వడికలది: చూ, స్యదము.

సత్వాలు. అం: చూ, ద్వాదశసత్వాలు.

సత్వవంతము. అం: చూ, శస్త్రములు.

సత్వవచనుఁడు. సం. విణ: చూ, సత్యవంతుఁడు.

సత్సంగమము. అం: చూ, సుజ్ఞానదాయకములు.

సద. వై. వి.=ఛద. ఆకుమీఁదినూఁగు: చూ, సితాగ్రము.

సదంశము. అం: చూ, అసంయుతహస్తములు.

సదనము. సం. వి. అ. న. 1. రూ-సదస్సు. (దీనియందుందురు.): ఆగారము, అయనము, అవస్త్యము, అవసథము-ఆవసథము, అధి, ఆయతనము, ఆలయము, ఆశ్రయము, ఆవాసము, ఉటజము, ఉదవసితము, ఓకము-ఓకస్సు, కన్యాటము, కాంతము, కానసము, కిర్మి, కుటము-కూటము, కులము, కేతనము, కోశము, క్షణము, క్షయము, క్షితి, క్షేత్రము, గృహము, గేహము, ఛద్మము, ధామము, ధిష్ణ్యము, నికాయము-నికాయ్యము-నీకాయ్యము, నికేతనము-నీకేతనము, నిర్వృతము, నిలయము, నివసతి, నివసనము-నివాసనము-నివాసము, నివేశము, నిశాంతము,

న్నది పూర్ణోపమయనంబడును. వీనిలో నొకటిగాని రెండుగాని మూఁడుగాని లోపించినది లుప్తోపమ. నాలుగును లోపించినచో నలంకారమేయుండదు. ఇట్టి లుప్తోపమలలో లోపించినవి తోఁచుచుండును. ఉదా.— ౧. వానిమోము చంద్రసుందరమై యున్నది ఇచటఁజంద్రుఁడుపమానము, మోముపమేయము, సుందరత్వము సాధారణధర్మము. ఉపమావాచకము లేదు. కావుననిది వాచకలుప్త; ౨. పద్మముఖుఁడు. ఇచటనుపమానమగుపద్మము. ఉపమేయమగు ముఖమును గలవు. ఉపమావాచకము, సాధారణధర్మమును లోపించినవి. కావునధర్మవాచకలుప్త; 3. అతఁడు చంద్రునివలె నుండెను. అతఁడుపమేయము, చంద్రుఁడుపమానము, వలె యుపమావాచకమును జెప్పఁబడినవి. సాధారణ ధర్మమగు నాహ్లాదకరత్వము జెప్పఁబడలేదు. కావున ధర్మలుప్త. ఇట్లు తక్కినవి యూహ్యంబులు.) [చూ, సామాన్యము.

సాధారణము. వా. సం. విణ. సాధారణమైనది:

సాధారణి. అం: చూ, సౌవీరజభాషలు.

సాధారణ్యము. సం. వి. అ. న. సాధారణత్వము.

సాధించే. సం. స. క్రి: చూ, సిద్ధినొందించే.

సాధితుఁడు. సం. విణ. 1. దండుగపుచ్చుకొనఁబడినవాఁడు; 2. సాధింపఁబడినవాఁడు.

సాధిష్ఠము. సం. విణ. 1. మిక్కిలిపదిలము: చూ, స్థైర్యము. 1; 2. మిక్కిలిమంచిది: చూ, సామర్థ్యము. 2. [చక్రములు.

సాధిష్ఠానము. అం. 1: చూ, భక్తులు; 3: చూ,

సాధీయసుఁడు. సం. విణ. (స్. ఈ. స్) 1. మిక్కిలిదిటవుగలవాఁడు; 2. మిక్కిలిమంచివాఁడు: చూ, సజ్జనుఁడు.

సాధువాదము. అం: చూ, సామపంచకము.

సాధువు. సం. వి. ఉ. పుం. 1: చూ, బుద్ధుఁడు; 2: చూ, సన్న్యాసి; విణ. 3 =సాదు. మంచివాఁడు: చూ, సజ్జనుఁడు; 4. చక్కనివాఁడు: చూ, సౌందర్యవంతుఁడు; 5. వడ్డికిచ్చి బ్రదుకువాఁడు: వార్ధుషికుఁడు, కుసీదుఁడు, వృద్ధ్యాజీవి-వృద్ధ్యాజీవుఁడు; 7. మంచి, సత్తు: చూ, సామర్థ్యము. 2; 8. చక్కనిది: చూ, హృద్యము. [సుపటిమ.

సాధుశక్తి. సం. వి. ఇ. స్త్రీ =సాదుసత్తి సుజ

సాధ్యము. సం. వి. అ. పుం. 1: చూ, యోగములు; విణ. 2. సాధింపఁదగినది: వృషాంకము, సాధనీయము: (వి): చూ, శక్యము.

సాధ్యములు. అం 1: చూ, సిద్ధములు. (శాస్త్రముచేగలిగినవి సాధ్యములు. ఉదా.— రాముఁడు, కలఁకులు, గోఁగు, వచ్చెఁగార్యము, వేఁపచెట్టు; సాధ్యఖండములు. ఉదా:— రాముండు, కలంకులు, వచ్చెంగార్యము, వాండ్రు), సాధ్యపూర్ణములు. సిద్ధములు సాధ్యములు అని బిందువులు రెండేసివిధములు: చూ, బిందువులు; 2. సాధ్యములఘువు.

సాధ్యుఁడు. సం. వి. అ. పుం. 1. గణదేవతావిశేషము. (వీరు పన్నిద్దఱు.—మనువు, హనుమంతుఁడు, విష్ణువు, ధర్ముఁడు, నారాయణుఁడు మొదలగువారు); విణ. 2. సాధింపఁదగినవాఁడు.

సాధ్వసము. సం. వి. అ. న. భయము: అధైర్యము, ఆక్షేపము, ఆతంకము, ఉద్వేగము, ఉద్వేజనము, ఙ, చకితము, చలనము—చాలనము, డ, ఢ, ఞ, త్రాసము, దరము, భయము, భీ, భీతి, శంక, సంభ్రమము, హుం. (అవ్య). అతి, బూ. (తె) అంజిక, అడలు, అడుకు, అదరు—ఆదురు, అదరుగడ, అరవాయి, అలుకు-ఆలుకు—అల్క, అదుర్దా,

ఉత్తలపడుట, ఉత్తలపాటు, ఉత్తలము, ఉదిల, ఉదుగు, ఉలుకు, ఎడరు, ఎద, ఓజే, ఓట, ఓటమి, కన్నోటు, కొంకు, గగ్గోలు, గిలి, గుబులు, గోరము, జంకు_జంకెన, జేదుపు, జలదరింపు, జళుకు, జోలి, జోవడము, డాపు-దాపు, డింబము, తలంకు, తలంకు, తలరు, తల్లడింపు, తల్లడము, తేఁకువ, దళుకు, దిగులు, వంగు, పర్వా, పుయిలోట, పిఱికికండ, పేదర్కి_పేదటిమి, బీతు, బెంబేలు, బెగడు-బెగ్గడు, బెగ్గలము-బెగ్గలికము, బెగ్గిలుట, బెట్టిదము, బెదరు, వెరఁగు_వెఱ-వెఱఁగు-వెఱపు, హడలు. తద్వి.___౧.భయంకరత్వమునకు.-(తె) బెడిదము; ౨. భయంకరమునకు.___ (తె) బెడిదము, వాలు: చూ, ఘోరవము. ౨; ౩. మిక్కిలివెఱపునకు.-అత్యాహితము, మహద్భయము-మహాభయము. (తె) నివ్వెర-నివ్వెఱ-నివ్వెఱఁగు-నివ్వెఱపాటు; విశే. ౪. వెఱపునొందినది.-ఉద్విగ్నము, త్రస్తము, దీర్ణము, భీతము. (తె) బీద; ౫.క్రూరమైనది:-వక్రిము, వ్యాళము.

సాధ్వసస్ఫురితము. అం: చూ, సతతోద్ధితము.

సాధ్వి. సం. వి. ఈ. స్త్రీ. 1. పతివ్రత: చూ, స్త్రీ; అం. 2: చూ, వృత్తము. 1. ("భ-న-జ-న-స-న-న-భ-గురువులు. 8-15-22 యతులు. 25వ ఛందస్సు.")

సాన. వై. వి.=శాణ. 1. మణులు మెఱుఁగులు పోరా చెడుతాయి! ఒరగల్లు_ఒఱగల్లు, కరసాన, టీకము. (సం) శానము-శాణము-శాణి, కషము-కసము, కషీక, కషోపలము, నికషము. :(చూ, రత్నములు); 2. కత్తులు లోనగునవి నూరెడుతాయి: (సం) శాణము_శాణి-శానము. (చూ, రత్నములు.); 3. గంధము తీసెడుతాయి: (సం) నికషము, శాణము-శాణి-శానము (చూ, రత్నములు.)

సానకత్తి. వై. వి. (సాదు + కత్తి) సాదనచేయుకత్తి: చూ, రిష్టి. 2. [మంతము.

సానమంతము. సం. వి. న్. పుం: చూ, రూ-సాను

సానము. వా. వి: చూ, నారాచి.

సానలవాఁడు. వా. వి. మణులను బాగుచేయువాఁడు: పూసలవాఁడు. (సం) అసిధావకుఁడు, కషుఁడు, మణికారుఁడు, శస్త్రమార్జకుఁడు-శస్త్రమార్జుఁడు, శాణికుఁడు.

సాని. వై. వి.=స్వామిని. రూ-చౌన-చాని. 1. భోగముది: చూ, వేశ్య. "ఆ. అయ్యారె సాని యొకతె వాని సందుకొనియె." (భల్లాణచరిత్రము. 3, ఆ.); 2. రాహుత్తుఁడు: చూ, సాది. 1; 3. కన్నెతికమైన వేశ్య: చూ, వేశ్య; 4. (గౌరవార్థమునందు) అధిపురాలు, ప్రభుభార్య. భార. ఆది. 7, ఆ. 222: చూ, స్వామిని; 5. (ఉత్తరపదమగుచో) భార్య- "మేదరసాని, దొరసాని": చూ, భార్య; 6. (నామబిరుదముగా వచ్చుచో) అమ్మ లేక అంబ లేక దేవి. "ముద్దుసానికి......లక్కసానికిన్" (భాగవతము 1, స్కం. 24.); శాసనపద్యము:___ "నూరమసానికిన్ బృహస్పతినిభుం డుద్భవించె బుధబంధునిదానుఁడుగంటడిమ్మహిన్." శాస. గుంటూరుమండలము. నాదెండ్ల-మూలస్థానేశ్వరాలయమునందలి యొకజాతిపైనఁ జెక్కఁబడియున్నది.; 7. వృత్తిగలస్త్రీ. "మంత్రిసాని, నాతిసాని, నాగవసాని."; 8. దేశవిశేషము. "కురాసాని రౌమము."; 9. దేవదాసి. "సానిపెండ్లి యొప్పుడు" భీమేశ్వరపురాణము. 1, ఆ. 113; "భీమేశుండు సాని వాడ కరుగున్" భీమేశ్వరపురాణము. 1, ఆ. 112; 10. గృహనామము. "పెమ్మసాని, అల్లసాని." (చూ, పెద్దబాలశిక్ష. అనుబంధములో.)

సానిక. దే. వి. మట్టికంచేము, మల్ల, పాద, పడ్డెము: చూ, పాత్రము. 6. [చూ, సంప్రతి.

సానికరణము. మి.వి. కరణముల క్రిందికరణము:

సానిప. వా. వి. వాకలితుడిచి కళ్లాపు వేయుట. రూ–సానిపి – సానుపు – సాన్పి – సాన్పు (నిజాం రాష్ట్రమున వాడుక.)

సానిపి. వా. వి. —పై.—

సానివాఁడు. వా. వి. వ్యభిచరించిన స్త్రీలవలన జీవించే కులములోనివాఁడు, భోగమువాఁడు (అని కొందఱు)

సానుపు. వా. వి: చూ, రూ–సానిప.

సానుమంతము. సం. వి. న్. పుం.కొండ: చూ, పర్వతము.

సానువు. సం. వి. ఉ. పుం, న. 1. కొండనెత్తము: చూ, హిమాలయము (పర్వతము); 2. కొన: చూ, నుద. 1; 3: చూ, విపినము; 4. త్రోవ: చూ, మార్గము. 1.

సాన్నాయ్యము. సం. వి. అ. న. రూ–సన్నాయ్యము, హవిస్సు, దధిపయోరూపమైన హవిస్సు (అనికొందఱు): చూ, హవిస్సు. 1.

సాన్నిధ్యము. సం. వి. అ. న. సామీప్యము: చూ, సమీపము.

సాన్పి. వా. వి: చూ, రూ–సానిప.

సాపడు. దే. స క్రి: రూ–పసాదపడు, అను, ఆరగించు, ఆరోగణమొనర్చు, కుడుచు–కుడుచు, క్రోలు, తిను, దూకొను, దొరలు, నంజు, నములు–నములు, పడు, బాపుకొను, బోనేయు, మెక్కు, మెసఁగు–మెసవు. (సం) అభ్యవహరించు, అనుభవించు, ఆస్వదించు–ఆస్వాదించు, అహరించు–ఆహరించు, ప్రాశించు, భక్షించు, భుజించు, భోగించు. తద్వి.—౧: చూ, మ్రింగు; ౨. మ్రింగక ఊరకనములు.—కొదువు; 3: ఎంగిలితిను:–గఱుకు–గదుకు.

సాపత్న్యము. సం. వి. అ. న. సపత్నీత్వము.

సాపాటు. దే. వి: ఆరగింత–ఆరగింపు, ఆరోగణము–ఆరోగిణము. ఎర–ఎఱ, కుడి, కుడుపు, గాతి, తింట, తిండి, బాతు, బుత్తి–బూతి, బోనము, మెసవుట. (సం) అభ్యవహారము, అశనము, అష్టి, ఆరోహణము, ఆశీరము, ఆహారము, ఆహ్నికము, ఖాదనము, గర, గరణము, గిలనము–గిళనము, గిళి, గీర్ణి, ఘసి, జంధము, జగ్ధి, జేమనము, దేహయాత్ర, నిఘసము, న్యాదము, ప్రత్యవసాయము, ప్రాశనము, భక్షణము, భుక్తి, భోగము, భోజనము, లేపము, లేహము, వీతి. తద్వి.—౧: కడి, ముద్ద. (సం) కబళము–కవళము, కవళము, గండోలము–గడోలము, గుడేరకము, గుడేరము, గ్రాసము; ౨. వ్రతాదులచే నియమముతోఁ జేయు భోజనము:– పిక్క–ప్రొద్దు; 3: చూ, గదుసు; ౪. ఉపవాసముండి మఱునాఁడు చేయుభోజనము: (సం) పారణ–పారణము; ౫: (సం) సగ్ధి, సజగ్ధి (తె) పొత్తు, పొత్తుగుడుపు; ౬. వివాహచతుర్థదినబంధుజనసజగ్ధి: చూ, సాదము (1); ౭: చూ, శేషము; ౮: విందు; ౯. రాజభోజనము:–(సం) వేల; ౧౦: చూ, మ్రింగుడు.

సాపాటురాముఁడు. వా. వి. తిండిపోతు.

సాపించు. వై. స. క్రి –శాప ఇట్టు: చూ, శపించు.

సాపు. వా. వి. (రూ–సాఫు.) 1. నిర్మలము: చూ, సమీచీనము. 2; విణ. 2. నునుపుగలది: చూ, స్నిగ్ధము. 2; 3. వంకరలేనిది: (సం) సరళము; 4. తుడిచి చేక్కఁజేసినది: చికిలి, 5. చిత్తుచేసి అందముగావ్రాసినది: చూ, వ్రాఁత.

సాపుచేయువాఁడు వా. వి: చూ, చికిలివాఁడు.

సాప్తపదీనము. సం. వి. అ. న. 1. సఖ్యము, చెలిమి: చూ, స్నేహము. 1; వా. 2: సంధి,

సఖ్యము. (తె) ఎడ, తీరు-తీఱు, తెఱఁగు, పొందు, ముడి.

సాఫల్యము. సం. వి. అ.న. సఫలత, సఫలత్వము.

సాఫు. వా. వి: చూ, రూ-సాపు. (అప్ర.)

సాబాలు. వా. వి. రూ-సావాలు: చూ, సగము.

సామంజస్యము. సం. వి. అ.న. సమంజసత్వము.

సామంతరాగోల. దే. వి. ఒకానొక ఆయుధము: చూ, బాణము. 1-౧౫-(౧).

సామంతుఁడు. సం. వి. అ. పుం. ఒక దేశమునెల్లను చేరికనున్న రాజు: చూ, రాజు. 1.

సామకృతి. అం: చూ, గౌడకృతి.

సామగ్రి. సం. వి. ఈ. స్త్రీ. 1. సమగ్రత; 2. రూ-సామగ్ర్యము. (తె) బండసలము, సామాను. (చూ, సరకు.2; చూ, సాధనము.2.)

సామజము. సం. వి. అ. పుం. 1. ఏనుఁగు: చూ, హస్తి; విణ. 2. సామవేదమువలనఁ బుట్టినది.

సామజాగారము. సం. వి. అ. న.=సజ్జోరము. ఏనుఁగుసాల: చూ, సదనము. 1.

సామపంచకము. అం: పరస్పరోపకార దర్శనము, గుణకీర్తనము, అన్యోన్య బంధుపరివచనము, ఆయతసంప్రదర్శనము, సాధువాదము(5).

సామము. సం. వి. న్. న. (సామవేదము) (పాపమును నశింపఁజేయునది) సామ్ని, స్వరవర్తనము: చూ, వేదము. (చూ, వాఙ్మయము); 2. మంచిమాట: చూ, శబ్దము. 2; అం 3. అనుకూల పరివర్తనరూపమైన యొక యుపాయము, సౌజన్యము: చూ, సామపంచకము (చూ, సాంత్వము); 4: చూ, ఉపాయములు. (నాయకుఁడు నాయికయొక్క కోపమును పోఁగొట్టునపుడు ఉపయోగించెడి ఉపాయము.)

సామములు. అం: చూ, సామపంచకము.

సామరస్యము. సం. వి. అ. న. సమరసత్వము.

సామరి. ద్వ. వి. (సాము + అరి) సాము నేర్చిన వాఁడు.

సామర్థ్యము. సం. వి. అ. న. 1. నేర్పు: ఆరభటి, ఇభనిమీలిక, ఉద్ఘాటితజ్ఞ, ఉద్భ్రమము, ఉద్వేగము, కియదేహిక, చమత్కారము, చాతురి, చాతుర్యము, దమురువు, పరాక్రమము, పుంభావము, ప్రజ్ఞ, ప్రతిపత్తి, ప్రావీణ్యము, ప్రౌఢి-ప్రౌఢిమ-ప్రౌఢిమము, భంగి, లాటము, విజ్ఞానము, వైదగ్ధి-వైదగ్ధ్యము, శౌర్యము, హేవాకము, (తె) ఒప్పు, కందువ-కందువము, కలితనము, చేదురు, చౌలిక, చౌలుబడి, చెతురు, నలువు, నేమి, నేరుపు-నేర్పు, పగ్గియ-పగ్గె, పటిమ, పస, పసిక, పోహణ, బండవలము-బండారాలము, మెఱవడి, లావు, వలను, విన్ననువు, విన్నాణము. తద్వి.— ౧: కౌశలము-కౌశల్యము, చతురిమ; ౨: మిక్కిలి చాతుర్యమునకు.- (తె) జోదుకజోదుకంబు; 2: అగ్గత-అగ్గత-అగ్గతి, గరిమ-గరిమము, ఉపపత్తి, నిర్మాణము, మహత్తు, మాహాత్మ్యము, యోగ్యత, సత్తు, సమానము, సాధువు.(అవ్య) కీనము, (తె) ఉరవు-ఉఱవు, ఒఱపు, గొప్పతనము, దొడ్డతనము, దొనరు, మంచి. తద్వి.— (విణ). మిక్కిలిమంచిది.-సాధిష్ఠము. (తె) సాదు.

సామవిధానబ్రాహ్మణము. అం. మూఁడు ప్రపాఠకముల చిన్నగ్రంథము: చూ, సామవేదబ్రాహ్మణము.

సామవేదబ్రాహ్మణము. అం. ఇది 8 విధములు.- ప్రౌఢము, షడ్వింశము, సామవిధి, ఆర్షేయము, దేవతాధ్యాయము, ఉపనిషత్తు, సంహితోపనిషత్తు, వంశము: చూ, బ్రాహ్మణములు.

సామవేదము. అం. సామ్ని: చూ, సామము1-2-3.
సామసంభవము. సం. వి. అ. పుం: చూ, పద్మ్రింధ*.
సామసంహిత. అం. ఇది పూర్వార్చిక ఉత్త రార్చిక అని రెండు ప్రధానభాగములు. (పూర్వార్చిక 5 అధ్యాయములు 59 ఖండములు. అనఁగా మొదటి 4 అధ్యాయములో ఒక్కొకటి పండ్రెండేసి ఖండములు. 5 అధ్యాయములు. 11 ఖండములు; ఉత్తరార్చిక 21 అధ్యాయములు. 120 ఖండములు. ఇందధ్యాయముల ఖండముల లెక్క నియతముగా లేదు: పూర్వార్చిక - ప్రకృతితంత్రములు.- ఆగ్నేయము-బహుసామి-ఏకసామి- బృహతి-త్రిష్టుపు-అనుష్టుపు- ఇంద్రపుచ్ఛము-పవమానము-అరుణము- శుక్రియము-మహానామ్ని అనునవి. ఇవియే ప్రకృతిసామములు; ఉత్తరార్చిక.-ఊహతంత్రములు, రహస్య తంత్రములు, దశరాత్రము, సంవత్సరము, ఏకాహము, అహీనము, సత్రము, ప్రాయశ్చిత్తము, క్షుద్రముఅనునవి. ఇవియే విషయ భేదమునుబట్టి యూహ సామములు రహస్య సామములని ద్వివిధముఇత్యాది.)[దువాఁడు.
సామాజికుఁడు. సం. వి. అ. పుం. సభయందుం
సామాను. వా. వి: చూ, సామగ్రి. 2.
సామాన్య. అం. 1. సర్వసాధారణనాయిక: చూ, నాయికలు, చూ, స్వీయ; 2. సామాన్యవేశ్య.
సామాన్యనిరుక్తి. అం: చూ, పంచోత్తరవాదము
సామాన్యము. సం. వి. అ. న. 1. పోలిక, సాధారణ: చూ, సామ్యము. 1; విణ. 2: సాధారణము. (తె) ప్రాయికము;అం. 3:చూ, అలంకారము. 3. ("సామ్యముకంటె విశేషము లేకుండుట. ఉదా.—తమ్మికొలంకులఁ ధూఁకొన్న చెలులమోములు తెలియఁబడవు.")
సామాన్యవాక్యము. అం. (సమాపకక్రియలతోఁ గూడినది): చూ, వాక్యములు.
సామాన్యుఁడు. సం. విణ: (తె) కొంచెకాఁడు, చిల్లరకాఁడు, సందడికాఁడు.
సామి. వై. వి.=స్వామి. 1. కుమారస్వామి: చూ, స్కందుఁడు; 2. భర్త: ఇంటాతఁడు-ఇంటియాతఁడు, ఒడయఁడు-ఒడయుఁడు, చెలువుఁడు, పెనిమిటి-పెన్మిటి, మగఁడు-మొగఁడు-మొగుఁడు, పువ్వు, ఱేఁడు.(సం)కాంతుఁడు, గోప్తుఁడు, జామాత, ధవుఁడు, పతి, పరిణేత, ప్రాణనాథుఁడు, ప్రాణేశుఁడు, ప్రియుఁడు, ప్రేయసుఁడు, భర్త, వస్త, వరయితా, వరుఁడు, వల్లభుఁడు. తద్వి — ౧. ఉపపతి కి మాఱుమగఁడు: చూ, విటుఁడు; ౨ మాఱుమనువుమగఁడు.—(సం) అగ్రెదిధిషువు, దిధిషువు; 3. బిడ్డలుగన్నమాఱుమనువు దాని మొదటి బ్రాహ్మణభర్త: అగ్రెదిధిషువు: ర: చూ, మారిషుడు. 1; 3.=స్వామి ప్రభువు: చూ, స్వామి. 1; 4: చూ, రాజ్యాంగములు (స్వామి.)
సామిత. వై. వి =సమతా. రూ-సామెత. 1. పురాణోక్తి; 2. దృష్టోక్తి; 3. లోకోక్తి: చూ, - శబ్దము. 2.
సామితల్లి ద్వ. వి: చూ, పార్వతి. ఆం. భా. ప్ర.41.
సామిప్యము. సం. వి. అ. న. రూ-సామీప్యము: చూ, సాన్నిధ్యము. [హిమాలయము (పర్వతము.)
సామిమల. వై. వి. కుమారస్వామికొండ: చూ,
సామిసామేనుచేకొన్నచాన. ద్వ. వి: చూ, సామితల్లి.
సామీప్యము. సం. వి. అ. న. 1: చూ, సాన్నిధ్యము, అం. 2: చూ, ముక్తిచతుష్టయము.
సామీరి. సం. వి. ఇ. పుం. 1. ఆంజనేయుఁడు: చూ, వానరము; 2. భీముఁడు: చూ, వృకోదరుఁడు.

సాము. వై. వి. 1 = సమాంశము: చూ, సగము; 2.=శ్రిము. పరిశ్రిమము, వ్యాయామము: చూ, శ్రిమము. 3 [చూ, రిక్క.

సాముకంటిచుక్క. ద్వ.వి. పూర్వఫల్గుని, పుబ్బ:

సాముద్రిము. సం. వి. అ. న. 1. భాగ్యసూచకరేఖాలక్షణము; విశ. 2. సముద్రమునఁబుట్టినది (ఉప్పు): చూ, లవణము. 1.

సాముద్రికము. సం. విశ. భాగ్యసూచకరేఖాలక్షణమును తెలుపునది (శాస్త్రము) (చూ. లక్షణాంగములు. చూ, స్త్రీలక్షణాంగములు.) చూ, లక్షణము. 1; 2 సముద్రిసంబంధమైనది.

సాముద్రికశాస్త్రము. అం: చూ, శాస్త్రములు.

సామెత. వై. వి.=సమతా: చూ, రూ-సామిత.

సామేనుగతీతదాల్పు. ద్వ. వి: చూ, శివుఁడు.

సామ్న. అం. సామవేదము: చూ, వేదము.

సామ్యము. సం. వి. అ. న. సమత్వము, పోలిక: చూ, సమానము. 2. తద్వి.—(అవ్య) ఇవార్థకము.—తోపాటు, పోలె, వలె, బలె. (సం) ఇవ.

సామ్రాజ్యము. సం. వి. అ.న. సమ్రాట్టుతనము

సామ్రాణి. వై. వి. ఉత్తమాశ్వము. రూ—సాంబ్రాణి. జై. 7, ఆ. 146: చూ, హయము.

సామ్లపుష్పఫల. సం. వి. ఆ. స్త్రీ: అవిగ్నము—అవిగ్నము, కరమర్దకము-కరమర్దము-కరామర్దము-కరమర్ది, కరవంది_కరవింద, కరాంబుకము, కరాంబుజము, కరామ్లకము, కృష్ణపాకఫలము, కృష్ణపాకము, కృష్ణము, క్షీరఫల, క్షీరబల, పాకకృష్ణము, వరాళకము, సుషేణము. (తె) ఓఁక-ఓకలివె, కరివె, కలివి-కలివె, పుల్లకలివె*. తద్వి.— కృష్ణఫలము. (తె) కలివెపండు.

సాయంకాలము. సం. వి. అ. పుం. 1. మునిమాపు: చూ, సందెజాము. తద్వి.—ః: సాయంసంధ్య. (తె) మలుసంజె—మలుసంజ; అం. 2: చూ, కాలములు.

సాయంకాలసంధ్య. సం. వి. ఆ. స్త్రీ: చూ, సంధ్యావందనము. [—వై.—

సాయంకాలసంధ్యావందనము. సం. వి. అ. పుం.

సాయంతనము. సం. విశ. సాయంకాలసంబంధమైనది.

సాయంశ్రిము. అం: చూ, కాలములు.

సాయంసంధ్య. సం. వి. ఆ. స్త్రీ. మలుసంజె: చూ, సాయంకాలము.

సాయకము. సం. వి. అ. పుం. 1. అమ్ము: చూ, బాణము. 1; 2. కత్తి: చూ, రిష్టి. 2.

సాయము. సం. వి. అ. పుం. 1. సాయంకాలము: చూ, సందెజాము; 2. అమ్ము: చూ, బాణము. 1; వై. వి. (1)=సహాయమ్. తోడు: చూ, వెంబడి. [చూ, సుంకము. 1.

సాయరు. వా.వి.బండ్లులోనగువానిమీఁదిపన్ను:

సాయించు. వా. అ. క్రి. హితవగు.

సాయిబు. వా. వి: చూ, రూ-సాహెబు.

సాయిల. దే. వి: చూ, రూ-సావలి.

సాయిలాపాయిలా. వా. అవ్య. తేలికగా.

సాయుజ్యము. సం. వి. అ. న. 1. సహయోగము, దేవభూయము; అం. 2: చూ, ముక్తిచతుష్టయము. [జోము.

సాయోత్సవము. సం. వి. అ. పుం: చూ, వేగు

సారంగము. సం. వి. అ. పుం. రూ—శారంగము. 1 ఇఱ్ఱి: చూ, హరిణము; 2. ఏనుఁగు: చూ, హస్తి: 3. తుమ్మెద: చూ, షట్పదము. తద్వి.—మానిఁగ: చూ, షట్పదము; 4. వానకోయిల: చూ, స్తోకము. 2; విశ. 5. చిత్రవర్ణముగలది: చూ, హరితము. 1 (వర్ణము. 6-ర-(ం); అం. 6: చూ, స్త్రీరాగములు.

సారంగవర్ణి. అం: చూ, చిత్రివర్ణములు.

సారంగి. దే. వి. 1. వాద్యము: చూ, వీణ; అం. 2: చూ, తతవాద్యములు.

**సారఘము.** సం. వి. అ. న. 1. నేయివంటి వర్ణముగల తేనె: పౌత్తికము. తద్వ — ౧. తేనెకు.—అర్ఘ్యము, కీలాలము, కుసుమాసవము, క్షౌద్రము, ఛాత్రము, పుష్పరసోద్భూతము, మధువు, మాక్షికము, మాధవి. (తె) కురుజు, కురుజుతేనె, జున్ను, తేనియ–తేనె; (కురుజుతేనె. ఇది తద్విశేషమని కొందఱు); ౨. భ్రమరములుఁ గూర్చిన తెల్లని తేనెకు.— భ్రామరము; 3. తైలవర్ణముగల తేనెకు.– తారమాక్షికము; ౪. పుట్టలో పుట్టిన పసుపువచ్చని తేనెకు.— ఔద్దాలము, ఔద్దాలకము–ఔద్దాలికము, ఛాత్రికము. (తె) తొఱ్ఱతేనె, తొలతేనె, పుట్టతేనె; ౫: (తె) కొండతేనె; ౬. చెఱకుతేనెకు —ఐక్షురము, ఖరము; ౭. పూఁదేనెకు:–చూ, సుమనోరజము; ౮. పెరుఁగులో కలిపిన తేనెకు.– మధుపర్కము; ౯. తేనెతెరకు.—చూ, మధుపటలము; 2. పూఁదేనె: చూ, సారఘము. 1–౭; అం. ౩: చూ, మధువులు. (మధువు. 5.)

**సారటు.** వా. వి. గుఱ్ఱపుబండి: చూ, శకటము. 1.

**సారణ.** సం. వి. అ. స్త్రీ: రూ–సారణి–ప్రసారణి, కటంభర–కటుంబరము, చారుపర్ణి, చారుపుష్పి, ప్రతానిక, భద్రజల, భద్రపర్ణి, భద్రశ్రీ, రాజబల, సుప్రసార, సుప్రసారణి. (తె)గొంతెమగొరు,లంజెసవరము *

**సారణము.** సం. వి. అ. పుం. 1. అతిసారరోగము: చూ, రోగము. 1; దే. వి. (1) ఒకరకము డేగ: చూ, శ్యేనము.

**సారణుఁడు.** సం. వి. అ. పుం. ఒకరక్కసుఁడు: చూ, రాక్షసుఁడు. 1. తద్వ.—చూ, సోఁకులఱేఁడు.

**సారణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. కాలువ: చూ, ప్రదిని (నది); 2: చూ, సారణ*; 3—సారె. షడ్జస్వరముఁబలికెడితంతి: తంత్రి. (తె) తంతి, సారె. తద్వ.–అనుసారణి (చూ, వీణ; చూ, స్వరము. 2; చూ, సూత్రము. 1–౩౧.)

**సారథి.** సం. వి. ఇ. పుం: క్షత్త, చోదకుఁడు, దక్షిణస్థుఁడు, నియంత, యంత, ప్రాజిత, వోఢ, సవ్యేష్టుఁడు–(సవ్యేష్ఠ్రుఁడు–సవ్యేష్ఠ–సవ్యేష్ఠుఁడు), సాది, సూతుఁడు. (తె) తేరుపూన్పరి. తద్వ.—౧ శ్రీకృష్ణుని సారథికి.. దారుకుఁడు; ౨ ఇంద్రుని సారథికి.– మాకరి, మాతలి, వరుణాత్మజుఁడు, సుజనుఁడు; ౩ పల్లము వేయని గుఱ్ఱముమీఁద నెక్కువాఁడు: (తె) బరిగిరౌతు.

**సారము.** సం. వి. అ. న. 1. నీరు: చూ, సలిలము; 2. ధనము: చూ, హిరణ్యము. 3; 3 న్యాయ్యము: చూ, సమీచీనము. 4 (యోగ్యము. 2.); పుం. 4. బలిమి: చూ, శక్తి. 1; 5. మజ్జ. (తె) చేగ–చేవ; 6. ఎముకలయందలి నేయి, మజ్జ, సారము. (తె) మూలగ: చూ, స్నేహము. 2; 7.—చౌరు–చేరు–చేఱు. కాఁచిన చింతపండురసము: చూ, సూపము (యూపము); 8: చూ, వెలిచేండ్ర*; విణ. 9: చూ, శ్రేష్ఠ్యము; అం. 10: చూ, అలంకారము. 3 ("ఉత్తరోత్తరోత్కర్షము. ఉదా.— తేనె యొతీపి. అంతకన్నసుధ. అంతకన్న కవివాక్యము.") [శుపకము.

**సారమేయము.** సం. వి. అ. పుం. కుక్క: చూ,

**సారవము.** సం. విణ. సరయూనది సంబంధమయినది. [వాకంట."

**సారవా.** వా. వి: చూ, రూ–సారువా. "సార

**సారసనము.** సం. వి. అ. న. 1. మూఁడుపేటలుగల ఆఁడుదాని మొలనూలు: చూ, భూషణము. 2 (పావణిక. 2); 2. రూ–సారసనము. కవచము దొడిగినవాని నడికట్టు: చూ, వస్త్రము.

సారసము. సం. వి. అ. న. 1. తామర: చూ, సహస్రపత్రము; పుం. 2: కలాంకురము, కురంకరము–కురంకురము, కుశేశయము, కోపచంచువు, గోనర్దము, పుష్కరము–పుష్కరాహ్వము, లక్ష్మణము, శతపత్రము. (తె) ఉయ్యాలచేలుఁబులుఁగు, ఉయ్యాలపులుఁగు (ఉయ్యెలచేలుపిట్ట, ఉయ్యెలపురుగు), పెగ్గురు–బెగ్గురు–బెగ్గురము, వలికి. తద్వి.—ఆఁడుబెగ్గురుకు.—గోనంది.

సారస్యము. సం. వి. అ. న. సరసత్వము.

సారస్వతము. సం. విణ. సరస్వతీసంబంధమయినది.

సారస్వతులు. అం: చూ, బ్రాహ్మణులు (౧. వీరిలో మొదటి తెగకు.—చూ, కపూరిరియె బ్రాహ్మణులు. 729 పొరట; ౨. వీరిలో రెండవ తెగకు —చూ, ఆచార్యే అను బ్రాహ్మణులు. 654 పొరట; 3. వీరిలో మూఁడవ తెగకు.— చూ, అమగోత్రబ్రాహ్మణులు. 656 పొరట.) [సారాయి.

సారా. వై. వి.=సుర. కాఁచినకల్లు: చూ, రూ.

సారాంశము. వా. విణ. 1. నికరమైనది: ఖిలము. (తె) నికరము, నిగ్గు, ససి; 2. ప్రధానాంశము. ["సారాయిసోఁకు."

సారాయి. వై. వి.=సుర: చూ, సుర. 2.

సారాయితిత్తి. వై. వి: తత్తెర.

సారాలంకారము. అం: చూ, సారము. 10.

సారి. దే. వి. 1.తడవ: చూ, పెండియు; వై. వి. 2. యుద్ధయాత్ర: చూ, సంచారము.

సారించు. పం. స. క్రి. 1: తెఱచు; 2: చూ, చోఁపు. 3; 3. వినరు: చూ, సలించు; 4. సరినొత్తు: చూ, సరిదీయు.

సారిక. అం: చూ, దూతీచతుష్టయము.

సారిణి. సం. వి.ఈ.స్త్రీ. కపిలశింశుప.* : చూ, శింశుప.

సారియ. వై. వి.=శారికా. గోరవంక: చూ, శారిక. [కము. 1–౬.

సారు. దే. వి. నాట్యగతిభేదము: చూ, నాట

సారువ. దే. వి. 1. ఎక్కుటకును బరువెక్కించుటకును పొడుగుగా కట్టినవెదురు వేయించెడి యినుకలోనగువానిదబ్బ. పను. 2, ఆ. 57; ఉ, హరి. 4, ఆ. 229: మేరు–మేరువు; 2.అడ్డకట్టు: చూ, సేతువు 1; 3: చూ, పరంజా; వా 4 శిఖరమునందుండెడి మణి: మేరు–మేగువు; 5 హారమధ్యమందు వ్రేలెడుమణి: మేరు–మేరువు

సారువా. దే. వి: రూ–సారవా, మొదటిపంట, తొలుకారు, ముక్కారు, ముక్కారుపంట. తద్వి:-చూ, రెండవపంట.

సారూప్యము. సం. వి. అ. న. 1. సమానరూపత్వము; అం. 2: చూ, ముక్తిచతుష్టయము.

సారె. దే. వి. 1. (బ) వీణెమెట్లు: చూ, సారణి. 3; 2. కూఁతున త్తవారింటికిఁబంపునపుడు పెట్టెడు సామగ్రిలోనగునవి; 3: కుమ్మరసారె; వై. వి. 4 =శారి. పాచిక: చూ, వ్యవహారము. 4; 5.=శారి. సొగటాలకాయ: చూ, వ్యవహారము. 4; 6.=శారిక. రూ–సారియ. గోరువంక. వై. 3, అ 103: చూ, శారిక. 1; 7. తడవ: చూ, పెండియు; ద్రి. 8. చీటికిమాటికి. పా. 3, ఆ. 37: చూ, శశ్వత్తు; 9. అప్పటి. ఆం, భా. త్ర. 69: చూ, పెండియు; అం. 10: చూ, సారు.

సారెకు. దే. ద్రి. మాటిమాటికి. పా. 1, ఆ. 51; పా. 1, ఆ. 73: చూ, శశ్వత్తు.

సారెసత్తు. దే. వి. జంతిక, సంయానము: చూ భక్ష్యము. [డితమందు)

సారెసారెకు. దే. ద్రి: చూ, సారెకు. (ఆమ్రే

సార్దూలము. అం: చూ, భావదూషితములు.

సార్వీర్మాలి. అం: చూ, శస్త్రములు.

షార్జంటు. వా. వి. భటులమీఁదియుద్యోగి.
షార్ద్రము. సం. విణ. తడిసినది. చూ, స్తిమితము.
షార్థకము. సం. విణ. 1: సఫలము, అమోఘము; 2: చూ, సిద్ధము. 3.
షార్థము. సం. వి. అ. పుం. 1. జంతుసమూహము: చూ, సమూహము; 2 = సాతు. వర్తకజనసమూహము: చూ, సమూహము; 3.= సాతు. తెరువరులగుంపు: చూ, సమూహము; విణ. 4. అర్థముతోఁగూడినది.
షార్థవాహము. సం. వి. అ. పుం సత్యానృతము: చూ, వర్తకము.
షార్థవాహుఁడు. సం. వి అ పుం. 1. వర్తకుఁడు: ఆపణికుఁడు, ఉదంతుఁడు, ఊ, క్రియవిక్రియికుఁడు, నిగముఁడు, నైగముఁడు, పణ్యాజీవుఁడు, వణిక్కు-వణిజుఁడు-వాణిజుఁడు, వర్తకుఁడు, విసీతుఁడు, విపణి, విష్టి, వైదేహకుఁడు, వ్యవహారి, వ్యాపారి, స్వాధ్యాయి. (తె.) గవరగౌర, పచారి, బెహారి-బేహరి- బేహారి, బేరి, సాహు, సాహుకారి_సాహుకారు, సెట్టి, సౌదాగరు; విణ. 2. ముఖ్యుఁడు: చూ, శ్రేష్ఠుఁడు. 2.
షార్లా. దే. విణ: చూ, నల్లయి.
షార్వభౌమము. సం. వి. అ. పుం. ఉత్తరపు దిక్కునందుండెడి యేనుఁగు: చూ, హస్తి
షార్వభౌముఁడు. సం. వి. అ. పుం. 1. చక్రవర్తి, సమస్తభూమిని నేలురాజు, రాజేరాజో: చూ, రాజో. 1; అం. 2: చూ, దిగ్గజములు.
షాల. వై. వి.=శాల: చూ, శాల. 1-2.
షాలంకలు. వా. వి. బ: చూ, ధాన్యము.
షాలంకృతకన్యాదానము. అం. (కన్యాదానము) వరునకు కన్యనిచ్చి చేయుు వివాహము: చూ, దానములు. 2. (వరశుల్కము లేనిది.)
సాలంకృతలక్ష్మీప్రతిమ అం. ఒకానొకదానము: చూ, దానములు. 2.
సాలంకృతసప్తాచలము. అం.—పై.—
సాలంకృతహేమవృషభము. అం.—పై.—
సాలగ్రామతీర్థ పరిగ్రహము. అం: చూ, సుజ్ఞానదాయకములు. [ములు.
సాలగ్రామపూజ. అం: చూ, సుజ్ఞానదాయక
సాలగ్రామము. సం. వి. అ పుం. విష్ణుమూర్తిచిహ్నిత శిలావిశేషము: చూ, రత్నములు. ౫ర.
సాలపద్మము. అం: చూ, అసంయుతహస్తములు.
సాలపర్ణి. సం. వి. ఈ. స్త్రీ: రూ-శాలపర్ణి అంశుమతి, అతిగుహ, కండబహుళ, కామత, కాలపర్ణి, కుముద, గుహ, త్రిగుణ, త్రిపర్ణిక, ధృవ (ధ్రువ), పీతని, విదారి, విదారిగంధ, సౌమ్య, స్థిర. (తె) ముయ్యాకుపొన్న, మువ్వంచోకు*.
సాలభంజిక. సం. వి. అ. స్త్రీ. వస్త్రపింతకాష్ఠాదులచేత చేయఁబడినబొమ్మ: రూ-శాలభంజిక, కురంటి, దారుగర్భ, దారుపుత్రిక: చూ, హరిణి. 3.
సాలము. సం. వి. అ. పుం. 1: చూ, వృక్షము; 2: చూ, ప్రాకారము; 3. మద్ది*: ఇంద్రికకుభ, కుశికము, కృష్ణవల్కలము, గంధవృక్షకము, చండకూకము, జఘనచ్ఛదనము, దధి, ధనంజయము, సస్యసంవరము. (తె) మద్ది. తద్వి.—ఁ. ఏఱుమద్దికి.-అంకపాళి, అర్జునము, ఇందుకకుభ, ఇంద్రద్రుమము-ఇంద్రద్రుపు, కకుభము, కరవీరకము, కలలజోద్భవము, కాంతేయము, కులాలము, కృష్ణసారథి, గాండీవి, ధన్వి, నదీసర్జము (నదీసర్జకము), ఫాల్గునము, వీరతరువు, వీరవృక్షము. (తె) ఏఱుమద్ది; ౨. నల్లమద్దికి.-అజకర్ణము, అశ్వకర్ణకము-అశ్వకర్ణము, ఈతిశమనము,

కార్ప్యమ్-కార్ష్యము, కాశికము, రథద్రుమము, సర్జము, సస్యసంవరము. (తె) ఇనుమద్ది, ఏపె, వల్లమద్ది*.

సాలామిశ్రి. దే. వి. ఒకరకము మందువస్తువు.

సాలావృకము. సం. వి. అ. పుం. రూ-శాలావృకము. 1. కుక్క: చూ, శునకము; 2. కోఁతి: చూ, వానరము; 3. తోఁడేలు: చూ, వృకము; 4 నక్క: చూ, సృగాలము.

సాలియ. వై. వి.=శాలిక-జాలిక: రూ-సాలె: చూ, సాలెవాఁడు.

సాలీఁడు ద్వ. వి. (సాలె + ఈఁడు) 1-వై-పంచ. నా. 1, ఆ. 166 (వైకృతమని పురుషోత్తమ కవీయము); 2: చూ, సాలెపురుగు. చంద్రా.3, ఆ. [త్సరపుది.

సాలీయాన. వా. విణ. రూ-సాల్యానా. సంవ

సాలు. వై. వి.=శాలువు (రూ-సాలువ-సాలువు) (దేశ్యమని శ.ర) 1. సూక్ష్మవస్త్రము: చూ, వస్త్రము; 2. రాంకవము, సాలువు: చూ, వస్త్రము; 3.జోమూరు. అం, భా. ద్వి. 152: చూ, వస్త్రము; వా. 4. ఏఁడాది, ఏఁడు. "పాలుసాలు" : చూ, సంవత్సరము. 1.

సాలువ. వై. వి.=రూ-సాలువు: చూ, రూ-సాలు. 1-2-3. [చూ, శ్యేనము

సాలువము. వా.వి. (రూ-సాళువము-సాళ్వము):

సాలువు. వై. వి.=:చూ, రూ-సాలువ. (సూక్ష్మ వస్త్రమునకు.-శకాం. 4, ఆ. 119.)

సాలె. వై. వి. 1. సాలెవానికులము; 2: చూ, సాలెవాఁడు, అం. 3: చూ, శిల్పులు.

సాలెగూఁడు. వా. వి: సాలెపట్టు, పాదట్టు, బూసి. (సం) ఆశాబంధము, జాలపటము, జాలికపటము.

సాలెపట్టు. వై. వి.=జాలపట. —వై—

సాలెపురుగు. వై. వి. బొడ్డునందలి నూలువిడిచి నేఁత నేసెడి యొకపురుగు: ఈఁగపులి, చెలగము, చెలఁది, చెలఁదిబల్లి, జాలికాఁడు, తాండ్రిపురుగు, నేఁతపురుగు, పాదాండ్రి, పాజా్ట్రపురుగు-పావోట్టుపురుగు సన్నపిల్లి, సాలీఁడు, సాలెపురుగు, సేవబల్లి, సోనబల్లి. (సం)అష్టాపదము, ఊర్ణనాభము, ఊర్ణనాభి, ఊర్ణాయువు, ఊర్ణినహి, కింతనువు, కీశోరము, క్రిమి, జాలకృత్తు, తంతునాభము, తంతువాయము, దిగ్బంధము, దూషిక, మర్కటకము-మర్కటము, లత, లూత, లూషిక, శలకము.

సాలెవాఁడు. ద్వ. వి. రూ-సాలీఁడు, సాలియ-సాలె-నేఁతకాఁడు, నేఁతరి, మగ్గరి. (సం) శాలికుఁడు, కువిందుఁడు, కృవి, జాలికుఁడు, తంతువాయుఁడు. తద్వి.—౧: జాండ్రి, జేండ్రి, జేండ్రివాఁడు, దేండ్రివాఁడు, దేవాంగి; ౨: తొగట, తొగటవాఁడు; ౩: పటుసాలె-పట్టుసాలె- పట్టుసాలియ-పట్టుసాలె, పట్టుసాలెవాఁడు, పట్నూలవాఁడు; ౪: కయికోలవాఁడు-కైకోలవాఁడు-కైకలవాఁడు; ౫: కరిణబత్తుఁడు-కరిణీబత్తుఁడు-కరిణెబత్తుఁడు, కరిణవాఁడు- కరిణెవాఁడు, (బ) కరిణలు-కరిణెలు.

సాలెవానిపనిముట్లు. వా. వి: చూ, మగ్గము.

సాలోక్యము. సం. వి. అ. న.1. సమానలోకత్వము; అం. 2: చూ, ముక్తిచతుష్టయము.

సాలోమ. సం. వి. ఆ. స్త్రీ. పిన్నమల్లంగి*: చూ, హస్తికంద.

సాల్వడు. ద్వ. అ. క్రి. (సాలు + పడు) 1. నిస్సారమగు. భార. ఆది. 2, ఆ. 83: చూ, తెట్టగిలఁబడు; 2. సాఁగు. భార, అర. 3, ఆ. 384: చూ, వ్రాలు. 3; పే్రి. 3. పాల్పడు. విక్రి. ౯, ఆ. 80.

సాల్వము. అం. రూ-శాల్వము: చూ, దేశములు. 33.
సావ. వై. వి.=శరావ. మూఁకుడు: చూ, హరివాణము (పాత్రము. 6-౪౬.)
సావనమానాబ్దము. అం. ముప్పది సూర్యోదయములుగల కాలము. ఇట్టి పండ్రెండు మాసములుగలది సావనమానాబ్దము. ఇదియు సర్వత్రవాడఁబడుచున్నది. ఇది 360 దినములుగలది: చూ, సంవత్సరములు. [రాజాఙ్గము.
సావనము. సం. వి. అ న. సిహ్లకము: చూ,
సావమర్శము. అం: చూ, విమర్శనము.
సావలి. దే. వి: రూ-సాయిల-సావలీఁడు, జోలి, డుబుడక్కవాఁడు, బుడుబుడుక్కవాఁడు- బుడుబుడుక్కలవాఁడు.
సావలీఁడు. దే. వి.-వై.-(స్వార్థమున ఈఁడు)
సావాలు. వై. వి.=సమాంశము. రూ-సాబాలు: చూ, సగము. [వెంబడి.
సావాసము. వై. వి.=సహవాస. పొత్తు: చూ,
సావాసి. వై. వి.=సహవాసి. (సావాసము + ఇ) సావిడల్లుఁడు. ఉ, హరి. 3, ఆ. 134: చూ, హెగ్గడి. 2.
సావి. దే. వి. 1. కాలము. కాశీ. 7, ఆ. 40: చూ, సమయము. 1; అవ్య. 2: చూ, రూ-సవి. నై. 4, ఆ. 104; అం. 3: చూ, దృష్టిభేదములు.
సావిక. సం. వి. ఆ. స్త్రీ: చూ, మంత్రసాని.
సావిత్రము. సం. వి. అ. పుం. దినముయొక్క ఐదవభాగము: చూ, వాసరము(దినభాగములు).
సావిత్రి. సం. వి. ఈ. స్త్రీ. 1. పలుకుఁజెలి: చూ, సరస్వతి; 2. గట్రాచూలి: చూ, పార్వతి; 3. సత్యవంతునిభార్య: చూ, భార్య; అం. 4: చూ, దానములు; 5: చూ, వృత్తము. 1. ("రెండుమగణములు. 6వ ఛందస్సు")
సావిత్రుఁడు. సం. వి. అ. పుం. 1 ఒకవసువు; 2. ముక్కంటి; చూ, శివుఁడు.

సావీరి. అం: చూ, సౌవీరజభాషలు.
సావు. దే. వి: రూ-చావు, ఈల్గుట, కడ, గిట్టింపు, గీటడంగుట, చెక్కడఁగుట, తుది, తెగుట, త్రుంగుట, త్రెళ్ళుట, పెద్దనిదుర-పెద్దనిద్దుర-పెన్నిదుర, పొలియిక, మడియుట, మిత్తి, పీడుకోలు-పీడ్కోలు, సమయుట. (సం) అంకశయ్య, అంతము, అంతశ (శ్వ)య్య, అచింతము, అత్యయము, అభావము, అభ్యాగమము, అశ్నంతము-అశ్వంతము-అస్వంతము, కాలధర్మము, కాలము, చైత్రము, త్రుటనము, దిష్టాంతము, దృష్టాంతము, దేహయాత్ర, నాశము, నిధనము, నిమీలనము, నిర్యాణము, నిస్సరణము, నిహతి, పంచత్వము, పరిసరము, పరిమీలనము, పరిశయము, ప్రాయము, మరణము, మారకము, మృతము, మృతి, మృత్యువు, శూలము, సంస్థ, సంస్థానము, సంస్థితి, సమాప్తి, హనువు, హరి, హింస. తద్వి.—౧ అనాయాసమరణమునకు:-అపమృత్యువు, వేల. (తె) కాకిచావు; చూ, అనాయాసమరణజాతకుఁడు. 639పుట; ౨: అనుమరణము; 3: ఉపమూషితము; ౪: కామృతి, దుర్మరణము.
సాశూకము. సం. వి. అ. న. కంబళి: చూ, రల్లకము తద్వి.—౧ మేలైనకంబళికి:- (తె) సకలాతు-సకళాతు; ౨ ఏనుఁగుమీఁదఁబఱచెడి రొత్తి కంబళికి.-వర్ణచిత్రము (వర్ణచిత్రాది). (తె) లేవ; 3. తివాసీకి: స్త్రీ భాసి. (చూ, రల్లకము)
సానువులు. దే. వి, బ. ఆవాలు: చూ, సర్షపము.
సాస్నా. సం. వి. ఆ. స్త్రీ: చూ, గంగడోలు.
సాష్టాంగనమస్కారము. సం. వి. అ. పుం. ఒకానొకనతి: చూ, హాణిగలు.
సాహసకృత్యము. సం. వి. అ.న. చోరవైనపని: చూ, వ్యళీకము. 2.
సాహసము. సం. వి. అ. న. 1: అభినివేశము,

ఆవేశనము-ఆవేశము, ర, నివేశము, ప్రతిపత్తి, ప్రవృత్తి, ప్రవేశము, ప్రేంఖణము, సమావేశము. (తె) కపంక, చేతాకు, చొరవ, తెంపి-తెంపు, తెగువ. తద్వి.—కర్కశము; అం. 2. దండము. దండోపాయము: చూ, ఉపాయములు; 3: చూ, వ్యవహార పదములు. [చూ, కావ్యనాటకములు.

సాహసాంకము. అం. (పరిమళుఁడు వ్రాసెను):

సాహసించు. సం. అ. క్రి: (తె) తెగఁబడు, తెగఁబాఱు, తెగించు, తెగు-త్రెగు-త్రెయ్యు.

సాహసికుఁడు. సం. విశ: ఉద్దండుఁడు, పటువు, విదగ్ధుఁడు. (తె) ఉటంకి-ఉటంకు, చేఱుకరి, చొరవకాఁడు, చొఱవరి, తెంపరి, తెగుదారి. తద్వి.—ప్రదిష్టుఁడు. (దిట్టఁడుశబ్దముకడనున్న పర్యాయపదములు కొన్ని యిచ్చోటను వర్తించునవికొందఱు.) (చూ, హంవీరుఁడు. 2) [హము: చూ, అధర్వణము.

సాహస్రము. సం. వి. అ. న. సహస్రములసమూ

సాహస్రుఁడు. సం. వి. అ. పుం. రూ-సాహస్రి. సహస్రబలమునకధికారి.

సాహాయ్యము. సం. వి. అ. న. సహాయత్వము. తోడ్పాటు: చూ, వెంబడి.

సాహిణము. దే. వి. గుఱ్ఱపుసాల. స్వా. 1, ఆ. 40: చూ, సదనము. 1.

సాహిణి. దే. వి. (సాహిణము + ఇ): గుఱ్ఱపువాఁడు. స్వా. 4, ఆ. 28: గుఱాలగోవ, గులవ, గులాము-గుల్లాము, మందడీఁడు. (సం) అశ్వపాలకుఁడు, కుమారుఁడు, మందురకుఁడు, వల్లభపాలకుఁడు. (చూ, సాది. 1.)

సాహితి. సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ - సాహిత్యము. [కములు.

సాహిత్యకావ్యములు. అం: చూ, కావ్యనాట

సాహిత్యదర్పణము. అం. (విశ్వనాథుఁడు వ్రాసెను): చూ, కావ్యనాటకములు.

సాహిత్యము. సం. వి. అ. న. 1: అ, అర్థజ్ఞానము, సాహితి. (తె) కూడిక; 2. కూడిక: చూ, సంయోగము; 3: చూ, సుగుణములు.

సాహిత్యరత్నాకరము. అం. (వారణాశి బ్రహ్మభట్టువ్రాసెను): చూ, కావ్యనాటకములు.

సాహు వా. వి. సాహుకారి-సాహుకారు, సెట్టి, వర్తకుఁడు. పాండు. 3, ఆ. 18: చూ, సార్థవాహుఁడు. 1.

సాహుకారి. వా. వి:—పై.—

సాహుకారు. వా. వి.—పై —

సాహేబు. వా. వి. (రూ- సాయిబు-సాబు.). ప్రభువు: చూ, స్వామి. 1.

సాహేబు. వా. వి.—పై.—

సాహో. వా. అవ్య. కటికవారుచేసెడు హెచ్చరిక. అని. 4, ఆ. 4. [నపైనరాగమేళనము.

సాళగము. సం. వి. అ. న. తిలతండులన్యాయము

సాళగించు. వా. అ. క్రి. మిళితమగు: చూ, సక్తమగు. (సం. అనికొందఱు.)

సాళగింపు. వా వి. మేళనము: చూ, సంయోగము. (సం. అనియు.)

సాళువము. దే. వి: చూ, రూ-సాళ్వము. 1.

సాళ్వఁడు. దే. వి. సాళ్వమను డేగవలె పాఱివేఁటాడుటచే కుక్కకియ్యఁబడిన పేరు: చూ, సివఁగి. 2.

సాళ్వము. దే. వి. 1. ఒకరకముడేగ: చూ, శ్యేనము; అం. 2: చూ, దేశములు.

## సి

సింగఁడు. వై. వి.=సింహః. 1: నరసింహము, నృసింహుఁడు, నృహరి. (తె) నరసింగఁడు, నరసింగము, మానిసిసింగము; 2 =సింహ. ఎఱుకువాఁడు: చూ, వ్యాధుఁడు. 1; 3 =సింహ: చూ, సింహము—

సింగనాదము. వా. వి. కంటినల్లగుడ్డు: చూ, లోచనము. తద్వి.—కన్నుసను.- (సం):-వి.

సింగన్నదాటులు. వా. వి: చూ, బాలక్రీడ

సింగపుంబీటి. వై. వి.=సింహపీఠ: చూ, సింహాసనము.

సింగపుదండ. అం: చూ, దండలు,

సింగపుగొంగ.వా.వి: చూ, సెరబము.సాంబ.తి.4.

సింగపురాసి. వై.వి.=సింహరాశి: చూ, రాసులు.

సింగము. వై. వి.=సింహమ్. భార. విరా. 2,ఆ. 330: చూ, సింహము; 2. పనో త్తరఘటిత శ్రేష్ఠవాచకము. "రాచేసింగము"; అం. 3: చూ, దండలు. [ఆం, పదా. సుర.౧౧.

సింగముసెక్కుదంట. ద్వ. వి: చూ, పార్వతి.

సింగరవళి. వై. వి=సింహారావమ్, ఆం, పదా. నర. 114: చూ, స్వరము. 2.

సింగళము. వై. వి.=సింహళ. సింహళద్వీపము: చూ, శ్వేతద్వీపము. 2 (లంక. 1.)

సింగాణి. వై. వి.=శార్ఙమ్-శృంగిణి. (రూ-సింగిణి-సింగిణీ) 1. శృంగధనువు: చూ, విన్నాణములు; 2. ధనువు: చూ, బాణము. 1-32; 3. ఒకరకము కుక్కపేరు. సా. 1, ఆ 92: చూ, సివంగి. 2.

సింగారపుందోంట. ద్వ.వి. ఉద్యానవనము: చూ, వశానుతోంట (వనము. 2.)

సింగారము, వై. వి.=శృంగార. 1. అలంకారము, కైసేత: చూ, మాపణిక. 2 (భూషణము. 2.); 2. అందము: చూ, సౌందర్యము; 3. మంజులము.ఆంధ్ర.సం.మా. 52: చూ, హృద్యము.

సింగారి. వై. వి.=శృంగారి. శృంగారవతియగు ఆఁడుది: చూ, స్త్రీ.

సింగారించు. వై. స. క్రి.=శృంగార: అలవరించు-అల్వరించు, కయిసేయు-కైసేయు, పుస్తరించు, దిద్దు, పారాణించు, సవరించు, హవణించు. (సం) అలంకరించు, శృంగారించు.

("చూ, హవణించు.")

సింగి. వై. వి.=శృంగి. 1. చెంచుది. (సం) శృంగి; 2.=సింహ. ఎఱుకుది. (సం) శృంగి. (చెంచు:-చూ, వ్యాధుఁడు. 1)

సింగిణి. వై. వి.=శార్ఙమ్: చూ, రూ-సింగాణి.

సింగిణీ. వై. వి.=శృంగిణి. —వై.— రాజ. 2, ఆ. 134.

సింగితమునుకుకల. వా. వి. ఒకవల: చూ, వల. 1.

సింగినాదము. వై. వి. 1.=శృంగనాద. కొమ్ము వాద్యము. పొడ దుప్పికొమ్ముతోఁ జేయఁబడిన రొగులనుషిర వాద్యవిశేషము (అనికొందఱు) కళా. 2, ఆ. 48: చూ, స్వరము. 2, వా. వి. 2. పేళనాదులయం దుపయోగించెడిద. "సింగినాదము జీలకఱ్ఱ".

సింగిలీకకము. దే.వి.(వా.సింగిలీకము) పెద్దనల్లకోఁతి: చూ, హనుమంతుఁడు (వానరము.) (సం. అనికొందఱు.)

సింగులు వా. వి. బ. బొందిలీలనియు, బాలాజీలనియు వాడఁబడెడి యొకజాతివారు.

సింగోట. దే. వి. ఒడ్డగ, దివిదారికొమ్ము, రెండుత్తికొమ్ములను ఇరుప్రక్కల మొనలుగా జేర్చబిగియేర్పఱచినమల్లసాధనము: చూ, రూ-చింగోటి: చూ, బాణము. 1-౧౫-(౧).

సింఘాణము. సం. వి. అ. న=చీమిడి: చూ, రూ-శింఘాణము. 2. [యొ బ్రాహ్మణులు.

సింఘేపాలె్రబ్రాహ్మణులు. అం: చూ, కపూాలి

సిందుకము. సం. వి. అ. పుం: చూ, వావిలి *.

సిందురము. వై. వి. 1.=సిందూరమ్. చెందిరము, నాగసంభవము. నీలా. 2, ఆ. 22: చూ, వహ్నిశిఖము. 1; 2.=సిందువార: చూ, నుపవా (వావిలి). * వసు. 3, ఆ. 149; 3. ఖరచ్ఛదము *: చూ, శాకోటము.

సిందువారకము. సం. వి. అ. పుం. సిందురము: చూ, సిందురము. 2.

సిందువారము. సం. వి. అ. పుం. —వై.—

చూ, వావిలి. *. (దీనికి దోహదక్రియముఖానిలము.) [చూ, శాఖోట.

సిందూరపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. బరివెంక *:

సిందూరము. సం. వి. అ. న. 1. (రూ-సింధురము_సింధూరము)=చేందురము-చెందిరము-సిందురము: చూ, వహ్నిశిఖము. 1; పుం. 2: చూ, సిందువారము *; వై. వి. (1)= సిందూరమ్. చెందిరము: చూ, వహ్నిశిఖము. 1. [ఏనుఁగు: చూ, హస్తి.

సింధుకము. సం. వి. అ. పుం. (రూ-సింధురము)

సింధురము. సం. వి. అ. పుం.—పై.—

సింధుదేశస్త్రీ. సం.వి.ఈ.స్త్రీ: చూ, దేశస్త్రీలు. చూ, స్త్రీ. [డు: చూ, హిమాంశువు

సింధునందనుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁ

సింధువారకము. అం: చూ, అనువర్ణములు.

సింధువు. సం. వి. ఉ. స్త్రీ. 1. సింధునది: చూ, నది; పుం. 2: చూ, సముద్రము; 3. ఏనుఁగు: చూ, హస్తి; 4 పడమర గాఁబాఱెడి యేఱు: చూ, నది; అం. 5. సింధుదేశము: చూ, దేశములు. ౫౫.

సింధువృషుఁడు. సం. వి. అ. పుం: చూ, విష్ణువు. 1.

సింధుశయనుఁడు. సం. వి. అ. పుం.—పై.—

సింధుస్త్రీ. సం. వి. ఈ. స్త్రీ. సింధుదేశపు ఆఁడుది: చూ, స్త్రీ.

సింధూరి. సం. వి. ఈ. స్త్రీ: వీరపుష్పి *.

సింబ. సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ-శింబ.

సింబి. సం. వి. ఈ. స్త్రీ.—పై.—

సింహకేళి. సం. వి. ఇ. పుం. పూర్వమైన విశేషము: చూ, బుద్ధుఁడు. [నాదము. 1.

సింహగర్జనము. సం. వి. అ. పుం: చూ, సింహ

సింహఘంటాన్యాయము. అం. సింహము మెడనున్న గంట యెవ్వరువిప్ప లేరనురీతి [తలము.

సింహతలము. సం. వి. అ. పుం: చూ, రూ-సంహ

సింహద్వారము. సం. వి. అ. న. తలవాకిలి, మహాద్వారము: చూ, సదనము. 1.

సింహనందనము. అం: చూ, జన్యతాళములు.

సింహనాదము. సం. వి. అ. పుం. 1. సింహగర్జనము. ఏనుఁగులు మొదలయినవి భయపడుటకై వీరులు చేసెడు ధ్వని: చూ, స్వరము 2; అం. 2: చూ, జన్యతాళములు.

సింహపర్ణ. సం. వి. ఆ. స్త్రీ. అడ్డసరము *: చూ, సింహాస్యము.

సింహపీఠము. సం వి. అ.న: చూ, సింహాసనము.

సింహపుచ్ఛి. సం. వి. ఈ. స్త్రీ. 1. నక్కతోఁకపొన్న *: చూ, సృగాలవిన్న; 2. క్రోష్టుపుచ్ఛిక. *: చూ, సురపొన్న.

సింహము. సం. వి. అ. పుం =సింగము-సింగఁడు: అగౌకసము, అతుల్యవిక్రమము, కంఠీరవము, కరభీరము, కరిదారకము, కరిమాచలము, కలంకషము, కేశరి-కేసరి-కేశిత్షువు, ఖేచరము, గజమాచలము, గజమోటనము, గజరిపువు, గజారి, గుహాశయము, గోవర్ధనము, జటిలము, ధవళమృగము, నగౌకసము, పంచముఖము, పంచాసనము, పంచాస్యము, పారీంద్రము, మృగరాజు, మృగరిపువు, మృగస్వామి, మృగేంద్రము-మృగేంద్రుఁడు, రోహితము, హరి, హరితము, హర్యక్షము. (తె. ప):—ఏనికతిండి, ఏనుఁగుఁగొంగ, గుబ్బలిపట్టిగుత్తము, జేడలమెకము, తెల్లనోటిమెకము, తెలమొగము మెకము, తెలవామెకము, తెలి మెకము, తెల్లడాలు మెకము, నెరసరి-నెఱసరి, పచ్చకన్నుల మెకము, బాకినోటిమెకము-బాకినోరు మెకము, బొబ్బమెకము, మెకములసామి, మెకములఱేఁడు, రెంటత్రొగుడుదిండి, వెడఁదనోటి మెకము, వెడఁదమోము మెకము, సింగఁడు-సింగము. తద్వి.—౧. తృణసింహమునకు.—కుటారువు; ౨. మృగవిశే

పమునకు.—రాజీవము; 3:-చూ, మృగము.1; 2. సింహరాశి: చూ, రాసులు; 3. (ఉత్తర పదమైనచో) శ్రేష్ఠము: చూ, శ్రేష్ఠము; అం. 4: చూ, ఆసనములు.

సింహముఖము. అం: చూ, అసంయుతహస్తములు.

సింహముఖి. సం. వి. ఈ. (స్త్రీ): చూ, సింహాస్యము*.

సింహరథ. సం. వి. ఆ. (స్త్రీ): చూ, పార్వతి

సింహరేఖ. అం: చూ, వృత్తము. 1. ("ర-జ-గగములు. 8 వ ఛందస్సు.").

సింహలీలము. అం: చూ, జన్యతాళములు.

సింహవిక్రమము. అం: చూ, ఉద్ధితకరణబంధములు.

సింహవిక్రము. అం: చూ, జన్యతాళములు.

సింహవిక్రీడితము. అం. 1.—పై—; 2: చూ, కరణములు. [చూ, హాయము

సింహవిక్రాంతము. సం. వి. అ. పుం. గుఱ్ఱము.

సింహసంహననుఁడు. సం. విశ సర్వాంగసుందరుఁడు: చూ, సౌందర్యవంతుఁడు.

సింహళము. అం.=సింగళము. 1. రావణునిపట్టణము, లంక: చూ, దేశములు. ౫౩; 2: చూ, శ్వేతద్వీపము. 2.

సింహాకర్షితము. అం: చూ, కరణములు.

సింహాణము. సం. వి. అ. వ: చూ, రూ-సింఘాణము. 1-2-3.

సింహారావము. సం. వి. అ. న.=సింగరవళి. సింహగర్జనము: చూ, స్వరము. 2.

సింహావలోకనన్యాయము. అం. సింహము కొంతదూరముపోయి తిరిగిచూచునట్టిరీతి.

సింహావలోకనము. అం. 1: చూ, శబ్దాలంకారములు; 2: చూ, యమకము. ౩-౪.

సింహాసనము. సం. వి. అ. న. సింహముఖ మేర్పఱచిన స్వర్ణమయమైన యున్నతపీఠము: సింహపీఠము. (తె) సింగపుఁబీఁట. తద్వి.—౧: చూ, సింహాసనములు; ౨: చూ, ఆసనములు; ౩. పీఁటకు.—ఆసంది-ఆసంధి, ఆసనము, ఆస్తరణము, ఆస్తరము, ఉపాసనము, ఔశీరము, కూర్చ, ఖట్టిక, పట్టము, పీఠము. (తె) గద్దియ-గద్దె, పీఁట; ౪: (తె) ముక్కాలిపీఁట-ముక్కాలిపీఁట (ముక్కాలిపీఁట-ముక్కాలిపీఁట.); ౫. భోజన పాత్రయుంచుబల్లకు.—(తె) ఎడ్డెన; ౬. కత్తెరకాళ్లమనుపుబల్లకు.—(తె) కట్టుబల్ల; ౭: (తె) పలక, బల్ల, మేజా; ౮: కనకాసనము; ౯: (తె) కురిచీ-కుర్చీ; ౧౦: (తె) తుఱుసుపీఁట; ౧౧. ఎద్దు వెన్నుపై వేయుపీఁట:—(తె) తారపీఁట-తారాపీఁట; ౧౨: ధర్మాసనము; ౧౩. కాళ్లుంచుకొనెడుపీఁటకు.—పాదపము. (తె) మోగా; ౧౪. ఉత్కృష్టపీఠమునకు.—పీఠిక; ౧౫: (తె) పెండ్లిపీఁట; ౧౬: ఓడ్యాణము; ౧౭: సభాపీఠము. (తె) రచ్చబండ, రచ్చబల్ల.

సింహాసనములు. అం: రాజ్య, భాష్య, మంత్రి సింహాసనములు (3).

సింహాసనాంశ. అం. అయిదువర్గంబులు స్వవర్గంబువచ్చెనేని సింహాసనాంశయగు.

సింహాస్యము, సం. వి. అ. పుం: అటరుషము-అటరూషము, కంఠీరవి, భిషఙ్మాత, భిషజామాత, వాజిగంధక, వాజిదంతకము, వాశకము-వాసకము-వాశము-వాసము, వాసిక, వృషము, వృషవాన, వైద్యమాత, సింహపర్ణ, సింహముఖి, సింహావర్ణ, సింహి, సింహిక, సితకర్ణి. (కన్నడమున.— అడ్డసరదగిడ). (తె) అడ్డసరము. తద్వి.—అంబష్ఠము. (తె) బరుసడ్డసరము *.

సింహి. సం. వి. ఈ. (స్త్రీ). 1.—పై.—*; 2.ములక*: చూ, హింగుళి; 3.రాహుపుతల్లి: చూ, పవిత్రి. 1.

సింహిక. సం. వి. ఆ. (స్త్రీ): చూ, సింహాస్యము.*

సింహాండము. సం. వి. అ. పుం.=చెముడు*: చూ, స్నుహి; 2. బొమ్మజెముడు * (ఇది బ్రహ్మజెముడు. దీనికి ఇంగ్లీషు వారీనడుమ రొకమందు నుపయోగించి సమూలముగా నశింపఁజేయు చున్నారు.) (దీనిమట్టలపై ముండ్లు తీసివైచి కుమ్ములోనుడికించి అగుంజోను రాచిన కీళ్లనొప్పులు హరించును. పండ్లలోనిగుంజో పక్షులకాహారము): చూ, స్నుహి.

సిక. వై. వి.=శిఖా. రూ—సిగ. నెమిలిజొట్టు: కూఁకట, చెంచే, నెమ్మిజొట్టు. (సం) చూడ, మయూరము, శిఖ; తద్వి. —౧. పిల్లజొట్టుకు.—కుంకటి–కూఁకటి, చిప్పకుంకటి–చిప్పకూఁకటి, చెంచే, జొంజోరు, జొంజోరుసిక, జొట్టు, పిల్లజొట్టు, రూ-సిగ. (సం) అ. అవచూడము, కవరకి, కవరము, కాకపక్షము, కేశపాశి, చూడ, చూలిక, జూటము, పాశము, మాళి, వంది, శిఖండకము. (చూ, వెండ్రుక); ౨. సిక ముడికి.—ముచ్చేట, ముచ్చేటముడి, రూ—సిగ; 3. వెండ్రుకలముడికి.—చూ, వేనలి. 3 (చూ, ముడి 3); ౪. రాజులముడికి.—కొండియ–కొండె; ౫. జొట్టు ముడికి.—రూ-సిగ, కొడి. జెడముడి. (సం) జూటము, శిఖ; ౬. జొట్టుకు.—రూ—సిగ. (సం) అ, శిఖ; ౭. కొప్పునకు.—వేనలి. ౧; ౮. కీలుముడికి.—చూ, వేనలి. ౪; ౯. జెడకు.—చూ, వేనలి. ౫; ౧౦:-కేశము లోనగువానికి:—చూ, వెండ్రుక. 1; ౧౧:-చూ, ముడి. 2; ౧౨. కొండెసిగకు.— సేసకొప్పు; ౧3. శివునిజెడముడికి.—(సం) జూటము; ౧౪: (తె) జోపపము, గిరజో-గిలజో.

సికత. సం. వి. ఆ. స్త్రీ. 1. ఇసుకనేల.(రూ-సికతావతము–సైకము - సైకతిలము): చూ, భూమి. 1–౯౬; 2. శర్కర, శర్కరిలము, మొరపనేల: చూ, హరిప్రియ. 2 (భూమి. 1-౯౭); 3. ఒకరోగము: చూ, రోగము. 1_౧; 4: వాలుక. (తె) ఇసక-ఇసుక, ఇసుము, ఇసులు, ఉసుక, కఱకుదుమ్ము.

సికతిలము. సం. విశే. ఇసుకగలది(నేల): చూ, రూ-సికత. 1.

సికస్తు. వా. విశే. శిధిలమయినది.

సికా. వై. వి.= శిఖర. ముద్ర: అచ్చు, శేప్ప, ముద్దరముద్దు, మొహరు. (సం)ముద్ర.తద్వి.—ఉంగరముమీఁది సంజ్ఞాక్షరములకు.—అచ్చు, శేప్ప, ముద్దు, మొహరు. (సం) ముద్ర.

సికాయుంగరము.ద్వ.వి. మొహరుగలఉంగరము: చూ, భూషణము. 2-౧౨-(౨). [స్వారి-

సికారు. వా. వి. రూ—షికారు: చూ, రూ—

సిక్తము. సం. విశే. తడిసినది: చూ, స్తిమితము 2.

సిక్థకము. స. వి అ. న. రూ-సిక్థము, మదనము, మధూచ్ఛిష్టము. (తె) మయినము-మైనము.

సిక్థము. సం. వి. అ. న. 1.—పై —; పుం. 2. మెతుకు: చూ, పాదము(1) [వస్త్రము.

సిక్థవస్త్రము. సం. వి. అ. న. మైనపుగుడ్డ: చూ,

సిక్యము. సం. వి. అ. న. ఏనుఁగుయొక్క స్తనాగ్రనందలిమదము: చూ, హామిక (చూ, హస్తి.)

సిగ. వై. వి.=శిఖా. 1: చూ, సికాయచెట్టు; 2 నెమ్మిజొట్టు: చూ, సిక. 1; 3. పిల్లజొట్టు: చూ, సిక; (జొట్టునకు సంబంధించిన వానికన్నిటికి: "(చూ,) సిక. 1; చూ, వెండ్రుక. 1; చూ, వేనలి.")

సిగదండ. వా. వి. శేఖరము, వతంసము: చూ, భూషణము. 2-౧౧-(౧)

సిగబంతి. ద్వ. వి.—పై.—

సిగపట్లు. జా. ఒకరిజొట్టునొకరుపట్టుకొని పోరాడుట. "పలుకులు వాదు రేపి సిగపట్లకు డగ్గఱచేసి." (కువలయాశ్వచరిత్ర.)

సిగపువ్వులుజొట్టుట. జా. స్వేచ్ఛగానుండుట.

"అభయం బనునది సిగపూవులు జొత్తె."
(ధర్మజరాజనూయము.)

సిగము. వై. వి.=శివ. (దేశ్యమని శ. ర) దేవతావేశము: చూ, రూ-సివము.

సిగర. వై. వి.=శిఖరిణి. రూ-సిగరి, చేల్లపులు సు. పాండు. 4, అ. 184: చూ, స్తన్యము (మజ్జిగ. ఒ.)

సిగరము. వై. వి.=శిఖరమ్. (రూ-సిగము.) పర్వతశిఖరము: చూ, శిఖరము. 1.

సిగరి. వై. వి. 1: చూ, భస్మము. తద్వి.—౧.భస్మమునకు.—(సం) రసాల; ౨.ఔపాసనాగ్నిమసికి.—మేదావి; 3. కట్టెనిప్పుమీఁది నిగుఱునకు.—రొయి- రొయ్యి - రోఁత బూడిద; ౪. రత్నకు.—వేలిమిబొట్టు.

సిగరెట్టు. వా. వి. ఒకరకము పొగచుట్ట:తద్వి.-౧. పొగచుట్ట; ౨. బీడి. (ఇందులరకములు పోలకలవు.)

సిగు. దే. వి: చూ, రూ-సిగ్గు.

సిగ్గరి. దే. విణ. (సిగ్గు + అరి) 1.లజ్జగలవాఁడు: పుచ్ఛేడీక, సిబ్బితికాఁడు. (సం) అపత్రిష్ణువు, త్రపిష్ఠుఁడు, లజ్జాశీలువు, విలక్షుఁడు, హ్రీమంతుఁడు; 2. సిగ్గుగలది (ఆఁడుది): పుచ్ఛేడీక, సిగ్గరికత్తియ-సిగ్గరికత్తె, సిబ్బితికత్తె: చూ, స్త్రీ.

సిగ్గరికత్తియ. ద్వ. వి.—వై.—వసు.4.అ. 23.

సిగ్గరికత్తె. ద్వ. వి.—వై.—

సిగ్గఱు. దే. అ. క్రి. (సిగ్గు + అఱు) సిగ్గుచెడు.

సిగ్గిఁడి. దే విణ. (సిగ్గు + ఇఁడి) 1. లజ్జచెడినవాఁడు; 2. లజ్జచెడినది. తద్వి.—తృణము, నిర్లజ్జము.

సిగ్గు. దే. వి: రూ-సిగు, ఈల, కసరు- కసురు, నాన, పుచ్ఛేటిక - పుచ్ఛేడిక – పుచ్ఛేడీక, పుచ్ఛేడీకతనము, పుయిలోట, బిడియము-బిడెము, బొసుకు, లజ్జ,సిబ్బితి-సిబ్బెత-(సం) చోదనము, డ, త్రప, మందాక్షము, లజ్జ, వ్రీడ, వ్యళీకము, హ్రిణీయ, హ్రీ-తద్వి.—౧: (సం) అపత్రప; ౨: చూ, సంకోచము. 2; 3: చూ, సిగ్గుపాటు.

సిగ్గుఁజెందు. ద్వ. అ. క్రి: చూ, సిగ్గుపడు.

సిగ్గుపడు. ద్వ. అ క్రి: సిగ్గుఁజెందు, సిగ్గువోవు, లజ్జించు.

సిగ్గుపాటు. ద్వ. వి. సిగ్గుపడుట: చూ, సిగ్గు.

సిగ్గువిడుమేట. అం. 1: చూ, దశావస్థలు;2: చూ, మన్మథావస్థలు. [2, అ. 90.

సిగ్గువోవు. దే. అ. క్రి: చూ, సిగ్గుపడు. లక్ష్మీ.

సిచయము. సం. వి. అ. పుం. 1: చూ, వస్త్రము; 2. చింపి: చూ, వస్త్రము.

సిడము. దే. వి. 1. (రుక్మి. 3, అ. 65; ఉ, హరి. 4, అ. 212): జెండా, టక్కియము-టక్కెము-టెక్కియము- టెక్కెము-టెక్కము, డాల్-డాలు, పడగ. (సం) కందళి-కదళి, కేతనము, కేతువు, చిహ్నము, చీనము, జయంతి, ధ్వజము, పతాక,లలామము, వైజయంతి, కూలము. తద్వి.—ఇందుని టెక్కెమునకు.—ఝర్ఝరము-జర్ఝరము;2.ధ్వజస్తంభము. 1. నిర్వ. 6, అ. 91: చూ, స్తంభము. 1.

సిడి, దే.వి.1.అంకుశము: చూ, హేతి.4 (బాణము 1-౩౧.); 2. ఏతపుమ్రాను; 3. సిడులపోతరనాటిన స్తంభముమీఁది యడ్డమ్రాను. పాండు. 3, అ. 77. (ఇదిగంపసిడి, గాలపుసిడి అని ద్వివిధము): (బ) చూ, సిల్లు.

సిడిముడి. వా. వి: చూ, రోషము.

సిడులు. దే. వి. బ. తోఁత్రము: చూ,రూ-సిల్పు-

సిత. సం. వి. ఆ. స్త్రీ. 1. చక్కెర: చూ, శర్కర; 2. తెల్లగఱిక*: చూ, తృణము.1.

సితపాటల. సం. వి. ఆ. స్త్రీ. తెల్లకలిగొట్టు*: చూ, స్థాలి. 2.

సితచ్ఛత్త్రి. సం. వి. ఆ. స్త్రీ: చూ, సదాప*.

సితవర్ణి. సం.వి. ఈ. స్త్రీ: చూ, సింహాస్యము*.

సితము. సం. వి. అ. న. 1. తెల్లపులుము: పుండరీకము, శ్విత్రము. (తె) పాండరము–పాండురము. తద్వి.—౧. కాళ్ళు చేతులు పగిలిన కుష్ఠువునకు.—పాదస్ఫోటము, విపాటిక, విపాదిక, పీటిక, సిహుల్లిక; (తె) పలుగుడు; ౨. మండలాకార కుష్ఠమునకు.—(తె) తామర–దామర-దామెర, పడతామర–(పాడతామర)పోడదామర; 3. ఎఱ్ఱపులుమునకు.—శ్విత్రము, శ్వేతము. (తె) ఎఱ్ఱపులుము; ౪. కుష్ఠభేదములు.—కాకణము; కాపాలము; కాశ్మీరజము; కోఠము; పిచువు; వాతికము (ఇవి అష్టాదశ కుష్ఠులలోఁ జేరును); ౫ కుష్ఠమునకు.—అరుణము, అవలక్షణము, ఉదుంబరము-ఔదుంబరము, కపాలము, కుశికము, కుష్ఠము, గదాఖ్యము, గదాహ్వయము, మండలము, రామము, శ్విత్రము. (తె) ఊలుపు-ఊలుము, కుష్టు, తెస్సు, పులుము, పెద్దరోగము. ఇత్యాది; పుం. 2. తెలుపు: చూ, వర్ణము. 6; విణ. 3 తెల్లనిది: చూ, వర్ణము 6; 4. కట్టఁబడినది: అవష్టబ్ధము, ఆవద్ధము, ఉద్గాహితము, ఉద్గ్రథితము, ఉద్గ్రాహితము, కీలితము, నద్ధము, నిబద్ధము, నియమితము, పరిణద్ధము, బద్ధము, మూతము, మూర్ణము, యంత్రితము, సందానితము, సందితము, సంయుతము; 5. ముగిసినది: అవసితము, సమాప్తము. తద్వి..–చూ, సమాప్తి. 1.

సితవాలుకము. సం. వి. అ. పుం. గురుగు *: చూ, హాస్తిని.

సితవీర్య, సం.వి.ఆ. స్త్రీ. జీలుగు*: చూ, స్వర్ణపుష్పి.

సితశివము. సం. వి. అ. న. ఇందుప్పు. రూ–శీతశివము: చూ, సౌవర్చలము(లవణము.1_౨౦.)

సితాగురువు. సం. వి. ఉ. న. కృధనకము: చూ, రాజార్హము.

సితాగ్రము. సం. వి. అ. న. చెట్టుముల్లు: రూ–శితాగ్రము, కంటకము, ణ, తరునఖము, దళసూచి, ద్రునఖము, ద్రుమరము, పత్రసూచి, రాంకిలము. (తె) ములు-ముల్లు, వసి. తద్వి.—౧. ముండ్లసమూహమునకు — కాంటకము. (తె) ముండ్లగుంపు; ౨: (తె) ముండ్లడొంక; 3. ముండ్లపొబ్బునకు.—(చూ, వెలుగు): కంటకాదిభారము. (తె) ఈడిక, ఊఁచే, ఎఱ్ఱము, కంప-క్రింప, తొడుగఱ–తొడుగఱ్ఱ, తొడుగు-తొడ్గు-తొడువు, ముండ్లముండ, ముండ్లకంచె, ముండ్లదుబ్బు, సుడుము (చూ, ప్రాచీనము. 1 ); ౪. వరిముల్లునకు.—కింశారువు శూకము. (తె) వరిముల్లు; ౫. నీవారాది శూకమునకు.—కంటకము. (తె) ములు–ముల్లు, వసి; ౬. తేలుముల్లునకు.— చుంబకము. (తె) ములు–ముల్లు, వసి; ౭. తేనుముల్లునకు.— చుంబకము. (తె) ములు–ముల్లు, మొల్ల. ౮. ఏదుపందిముల్లునకు.—శలము, శలలము, శలవి. (తె) సెల, సోన; ౯. మునికోలచివరముల్లునకు.—(తె) సెల; ౧౦: (తె) నూఁగు, నూఁగుడు, సద, సోన; ౧౧: సూదిమొన.

సితాభము. సం. వి. అ. పుం. రూ–సితాభ్రము. కర్పూరము: చూ, సిరము. (1).

సితాభ్రము. సం. వి. అ. పుం —పై.—

సితాయ. వా. వి. రూ–చితాయ: చూ, వీణ.

సితార్జకము. సం. వి. అ. పుం. తెల్లతొళసి *: చూ, హరిప్రియ. ౩–౧.

సితావరము. సం. వి. అ. పుం. ఒకరకపుకూర, కుకూరము: చూ, శాకము. 1.

సితాసితవర్ణి. అం: చూ, అనువర్ణములు.

సితుఁడు. సం. వి. అ. పుం. 1. శుక్రుఁడు: చూ, రాహువు. 2; విణ. 2. తెల్లనివాఁడు: చూ, శ్వేతుఁడు. 2. [చూ, సేవ్యము.

సితోసీరము. సం. వి. అ. పుం. వట్టివేరు *:

సిద్దకిన్నెర. వై. వి.=సిద్ధకిన్నర. తంత్రీవాద్యము: చూ, వీణ.

సిద్దాయము. వై. వి.=సిద్ధాయము. 1. వెచ్చపు సొమ్మునందుకూడఁబెట్టినధనము: చూ, హిరణ్యము. 3; 2. కప్పము: చూ, సిస్తు. 1.

సిద్ది. వా. వి. మంచిబలముగల సీగ్రోజాతివాఁడు: రూ-సిద్దీ. "సిద్దికి బుచ్చివేషము."

సిద్దియ. వా. వి. బుంగవలె తోలుతోకుట్టినది: రూ-సిద్దె. తద్వి.— ౧. పెద్దసిద్దెకు -(సం) కుతుకు; ౨. సగకుతో నున్న చేతిసిద్దెకు.— బొణిగ; ౩. సిద్దెలజోడుకు.-(సం)సాగరము.

సిద్దీ. వా. వి: చూ, రూ-సిద్ది.

సిద్దె. వా. వి: చూ, రూ-సిద్దియ.

సిద్ధకిన్నర. సం. వి. ఆ. స్త్రీ.=సిద్దకిన్నెర: చూ, సిద్దకిన్నెర. [చూ, శుక్తము. 1.

సిద్ధజలము. సం. వి. అ. పుం. బియ్యపుకడుగు:

సిద్ధపఱచు. మి. అ. క్రి. ఆయిత్తముచేయు: చూ, సమకట్టు. 3.

సిద్ధభైరవతంత్రము. అం: చూ, తంత్రములు.

సిద్ధమగు. మి. అ. క్రి. సన్నాహమగు. (సం) సంఘీభవించు. (తె) అమరు, ఆయితపడు-ఆయిత్తపడు, చేరు, జేకొనుపడు, దాఁటుకట్టు, నడుముకట్టుకొను, పొదిగొను, మూంపుగొను, రచ్చెగొను, సంతనకట్టు.

సిద్ధము. సం. వి. అ. పుం. 1: చూ, యోగములు; విణ. 2. ఆయిత్తమైనది: ఆలాయము, ప్రస్తుతము. (తె) అలవడుట, అలవాటు, ఆయితము-ఆయిత్తము, తయారు; 3. ఈడేఱినది: తటస్థము, నిర్వృత్తము, నిష్పన్నము, నిష్పాదితము, సార్థకము. (తె) బాగు. తద్వి:-౧. నిష్పాద్యము: ౨: ప్రభావసిద్ధము; 4. ఎడతెగనిది: చూ, సతతము. 2; 5.వండఁబడినది; అం. 6: చూ, ఆసనములు.

సిద్ధములు. అం: చూ, సాధ్యములు. (మాటలతోఁబుట్టిన సున్నలు సిద్ధములు. ఉదా.— కల్గి, మేఁక, కాఁసె, తేఁటి, తోఁట సిద్ధఖండములు. అందము, ఇందు, కొండ, చెంచు, గొంతి మొదలగునవి సిద్ధపూర్ణములు): చూ, బిందువులు.

సిద్ధసింధు. సం.వి.ఉ.స్త్రీ. దేవగంగ: చూ, నది.

సిద్ధాంతభాగము. పా.(దీనివలన గ్రహగమనము, గ్రహభేదములు, గ్రహణములు, గ్రహయోగములు మొదలగునవి కనిపెట్టఁబడును. పంచాంగము దీనివలనఁజేయఁబడును: చూ, ముహూర్తభాగము చూ, జాతకము.)

సిద్ధాంతము. సం. వి. అ. పుం 1. స్థిరమైనపక్షము: ఉత్తరపక్షము, కృతాంతము, రాద్ధాంతము, సమయము, సమర్థనము, సమాధి; 2. నవవిధజ్యోతిషగ్రంథములు: చూ, తంత్రము. 6.

సిద్ధాంతలక్షణము. అం: చూ, పూర్వవాదములు.

సిద్ధాంతి. సం. వి. న్. పుం 1. నవవిధజ్యోతిషగ్రంథములను తెలిసినవాఁడు: చూ, సాంవత్సరుఁడు; 2. తత్వశాస్త్రమును తెలిసినవాఁడు.

సిద్ధాంతీకరించు. సం.స. క్రి. సిద్ధాంతముచేయు.

సిద్ధాయము. సం. వి. అ. పుం.=సిద్దాయము. కప్పము: చూ, సిస్తు. 1. [సర్షపము.

సిద్ధార్థము. సం. వి. అ. పుం. తెల్లావలు: చూ,

సిద్ధార్థి. అం: చూ, సంవత్సరములు.

సిద్ధార్థుఁడు. సం. వి. అ. పుం. శాక్యబుద్ధదేవుఁడు: చూ, సన్యాసి. ౧౮ (బుద్ధుఁడు).

సిద్ధాశ్రమము. అం: చూ, క్షేత్రములు.

సిద్ధాసనము. అం: చూ, ఆసనములు.

సిద్ధి. సం. వి. ఇ. స్త్రీ. 1: అపవర్గము, ఉత్సవము, నిష్పత్తి, నిష్పాదనము, పరిసాధనము. (తె) ఈడేఱుట, నెఱవేఱుట. తద్వి.—౧ సంసిద్ధి: చూ, స్వభావము; ౨: చూ, సిద్ధము; 2. బుద్ధియను గంధద్రవ్యము: చూ, రాజార్హము; అం. 3: చూ, రోగములు; 4: చూ, అంగపంచకము.

సిద్ధించు. సం. అ. క్రి: తటస్థించు, నిష్పాదించు, ఫలించు, లాభించు. (తె):— అమరు, అలవడు, ఇగవొందు, ఈడేఱు, ఉరుపడు, ఎక్కు, ఏరుపడు-ఏర్పడు, ఒడఁగూడు, ఒనగూడు, కడముట్టు, కొనసాగు, చెల్లు, చేకుఱు- చేకూరు—చేకూఱు, చేకూడు, చేతవులు, చేపడు, చేరు, జేతపడు, తలకూడు, తలపడు, తీరు-తీఱు, దాపరించు, దాపురముగు, దొరకు, దొరకొను, నివ్వటిలు—నివ్వటిల్లు, నెరయు- నెఱయు, నెఱవేఱు, నెఱిపడు, పట్టు, పన్ను, పొంకపడు, పొందికపడు, పొసఁగు, ప్రాఁబడు, బెరయు, మూరిఁబోవు, సను, సమకుఱు, సమకూఱు, సమకూడు, సమకొను (చూ, సంభవించు.)

సిద్ధిత్రయము. అం: ప్రభావసిద్ధి, మంత్రసిద్ధి, ఉత్సాహసిద్ధి. (3).

సిద్ధినొందించు. మి. స. క్రి: (తె) ఈడేఱుచు, నెఱవేఱుచు - పూరగించు, సంబాళించు. (సం) పూరణించు, సమర్థించు, సాధించు.

సిద్ధియాలబ్రాహ్మణులు. అం: చూ, నేపాళదేశపుబ్రాహ్మణులు.

సిద్ధుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, సిద్ధులు. 2; 2. వ్యాసాది. తద్వి.—సిద్ధభేదములు:- శాలిహోత్రుఁడు.

సిద్ధులు. అం. 1. (అణిమాదిసిద్ధులు. ఐశ్వర్యములనఁగలుగు భేదములు):-౧ అణిమ=సూక్ష్మముగఁజేయునది; ౨ మహిమ=(మహిమము) గొప్పగఁజేయునది; 3 గరిమ=(గరిమము) గురువుగనొనర్చునది; ౪ లఘిమ=(లఘిమము) చుల్కఁగఁజేయునది; ౫ ప్రాప్తి= ఇష్టసిద్ధిఁజేయునది; ౬ ప్రాకామ్యము=(పరీప్సి) నిర్విఘ్నముగ మనోరథ సంచారముఁగాంచుట; ౭ ఈశిత్వము=సర్వాతిశాయిత్వ గల్గుట; ౮ వశిత్వము=ఇంద్రియములు వశముగుట(ఇట్టి యష్టైశ్వర్యసిద్ధులొంది దత్తాత్రేయ కార్తవీర్యులు ప్రసిద్ధినొందిరి); 2: —౧ అదృశ్యము=చూచువేండ్రఁగాన రాకుండుట; ౨. పరకాయప్రవేశము=ఒక శరీరమునుండి వేఱొక నిర్జీవశరీరమున జీవునిఁబ్రవేశింపఁజేయుట; 3. ఆకాశగమనము=ఆకసమునఁదిరుగుట; మఱియు. ౪:-మజ్జనము, అనులేపనము, మాల్యము, వస్త్రము, ఆభరణము (5); 8:- (విశ్వావసుప్రభృతులు): చూ, దేవతాభేదము.

సిధ్మము. సం. వి. న్. న. రూ-సిధ్మ. 1.=సిబ్బియము-సిబ్బెము: చూ, శోఫ. తద్వి.—ముఖసిధ్మమునకు - (తె) మంగు-మంగుడు-మాఁగు.

సిధ్మల. సం. వి. ఆ. స్త్రీ. 1. ఉప్పుఁజేఁప: చూ, మత్స్యము. 1; విశ. 2: చూ, సిధ్మము. 2.

సిధ్మలుఁడు. సం. విశ. సిబ్బెముగలవాఁడు: కిలాసి.

సిధ్యము. సం. వి. అ. న. (రూ—సిద్ధము.) పుష్యమి: చూ, రిక్క. [చూ, వనము. 2.

సిధ్రకారణము. సం. వి. అ. న. దేవోద్యానము:

సిధ్రికి. సం. వి. ఈ. స్త్రీ. లింగపట్టు*: చూ, పట్టు 1-౪. తద్వి.—౧ కొమ్ముపట్టు[illegible].— యపీయసి; ౨ పట్టు[illegible].—వారము. *

సినీవాలి. సం. వి. ఈ. స్త్రీ. 1. చంద్రకళ కానవచ్చెడియమావాస్య: చూ, సూర్యేందు సంగమము; 2: చూ, పార్వతి.

సిపాయి. వా. వి. మానిసి, కాలిబంటు, భటుఁడు: చూ, హాంపీరుడు. 2. [గ్యతావచనము.

సిపారసు. వా. వి. 1. యోగ్యతాపత్రిక; 2. యో

సిప్రుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు: చూ, హిమాంశువు.

సిబ్బంది. వా. వి. సైన్యము: చూ, సేన. 1.

సిబ్బి. దే. వి. 1. ఇత్తడిమట్టిలోనగువాని మూఁకుడు: చూ, పాత్రము. 6; 2: చూ, పల్లిక; 3. తక్కెడసిబ్బి: చూ, స్యోనము.

సిబ్బితి. దే. వి. రూ–సిబ్బెత: చూ, సిగ్గు.

సిబ్బితిక త్రై. ద్వ. విణ. సిగ్గుగలఅఁడుది: చూ, స్త్రీ.

సిబ్బితికాఁడు. దే. విణ: చూ, హ్రీమంతుఁడు. కళా, 4, ఆ. 66. [గంప: చూ, సజ్జె.

సిబ్బిపల్లిక. వా. వి. మూతివెడల్పుగల చిన్న

సిబ్బిమనిమెకము. వా. వి: చూ, హస్తి.

సిబ్బియము. వై. వి.=సిధ్మ. రూ–సిబ్బెము: చూ, శోఫ.

సిబ్బెము. వై. వి.=— వై.—

సిభాండి. సం. వి. ఆ. స్త్రీ: (ని) అగ్నిమేడి. (తె) అగ్గిమేడి*.

సిర. సం. వి. ఆ. స్త్రీ. 1: రూ–శిర, తంత్రి, త్రిపుటము, ధమని, నాడి. (తె) నరము, నారి. తద్విశేషములు—౧ (ఇవి శీర్షికావదములుగ చేర్పలేదు):- మజ్జాతంతువులు (జ్ఞానతంతువులు, నాడులు):-గతివర్ధకమజ్జాతంతువు, శోధక, నియామక, గతివాహక, రసవిమోచక, జ్ఞానవాహకమజ్జాతంతువులు. ఇత్యాది; ౨: (తె) పాలచేర్లు; ౩. (తె) బీరనరము–బీఱనరము; ౪. పెడతలనరమునకు.—మన్య. (తె) మన్న-మన్ని; ౫. సన్నపునరమునకు.— స్నస, వస్నస, వహోరువు, స్నాయువు; 2. ఈనె, శిర: చూ, శాకము. 1–౧౦.

సిరంగఁడు. వై. వి.=శ్రీరంగ: చూ, శ్రీరంగఁడు.

సిరంగము. వై. వి.=శ్రీరంగ: చూ, శ్రీరంగము.

సిరకా. వా. వి. పులిమెట్టు: చూ, శుక్తము. 1.

సిరదము. వా. వి: చూ, చీనము.

సిరము. సం. వి. అ. పుం. 1 పిప్పలికట్టె: చూ, శౌండి (పిప్పలి. 1.); విణ. 2. చేల్లనిది విక్ర. 4, ఆ. 162: చూ, హిమము. 3; వై. వి. (1)=శిరస్సు. తల. వసు. 3, ఆ. 149 చూ, శిరము. 1; (2) కపురము–కప్పురము–కప్రము, గంబుర–గంబురా–గంబురము – గంబురా–గంబూర–గంబూరము, చేలియిసుక, నెల. (సం) ఇందునామము, ఇందువు, ఓషధీశము, కపిశృంగము, కల్పకము, కర్పూరము, కారమిహిక, కుముదబాంధవము, గ్లౌ, ఘనరసము, ఘనసారము, చంద్రభస్మము, చంద్రసంజ్ఞము, చంద్రాహ్వము, నిశాపతి, భూతికము–భూతీకము, రసకర్పూరము, రేణుసారము, విధువు, వేధకము, సితాభము–సితాభ్రము, సోమము, హిమవాలుక, హిమాహ్వయము. తద్వి.—౧: నెలపత్తి, పచ్చకప్పురము; ౨: పొరతికప్పురము. [ము. 1.

సిరసు. వై. వి.=శిరస్సు. రూ–సిరము: చూ, శిర

సిరస్తాదారు. వా. వి. 1. తలయందు పూచీని పెట్టుకొని మోయువాఁడు; 2. లెక్కలు పరీక్షించెడి యధికారి; 3. పూచీదారు.

సిరా. వా. వి. కలముతో కాగితములోనగువాని వ్రాయు ద్రవపదార్థము: తద్వి:— ఊదాసిరా. (పలురంగుల సిరాలుకలవు.)

సిరాజి. దే. వి. 1. కలధౌతవస్త్రము. ఆం, భా. ద్వి. 155: చూ, వస్త్రము; 2. పరివాళము:

చూ, రత్నములు; 3. ఒకానొక దేశము. రూ-సిరాజీ: చూ, సీమ (1) (దేశములు); విణ. 4. శ్రేష్ఠమైనది: చూ, శ్రైష్ఠ్యము.

సిరాజీ. దే. వి. 1: చూ, రూ-సిరాజి. 3; విణ. 2: చూ, రూ-సిరాజి. 4; 3. సంపూర్ణమగు నాణెముకలది.

సిరాణము. గ్రా. వి. ఆయుధవిశేషము. ఉ, హరి. 4, ఆ. 212: చూ, బాణము. 1.

సిరి. వై. వి. 1.=శ్రీ: చూ, లక్ష్మి; 2.=శ్రీ: చూ, సంపత్తి. 1; 3. శోభ: చూ, వెలుతురు. 1; వా. 4. వీధిబడియందు ముందువచ్చినవానికి చెప్పెడు గుఱుతు. (రెండవవాని గుఱుతుచేక్క, మూడవవాని గుఱుతు దెబ్బ. మొ.)

సిరికమ్మి. వా. వి: చూ, లచ్చికమ్మి.

సిరిగందము. వై. వి. 1.=శ్రీగంధ. చందనము. కళా. 6, ఆ. 252: చూ, వాసన. 1; 2.శ్రీ చందన వృక్షము*. వసు. 3, ఆ. 149: చూ, సుగంధము.

సిరిగట్టు. వై. వి.=శ్రీఘట్టు: చూ, శ్రీశైలము.

సిరిచూలి. ద్వ. వి. శ్రీపుత్రుడు: చూ, మన్మథుడు.

సిరిపిల్ల. ద్వ. వి. —వై.— వేం. అం. 8.

సిరిమంతుడు. వై. విణ.=శ్రీమాన్. శ్రీమంతుడు, భాగ్యవంతుడు:చూ,సంపన్నుడు.

సిరిరామోకాలొడ్డనేల. లో. సంపదవచ్చేనపుడడ్డినను రాకమానదు. "ఉదా.— సిరిరామోకాలొడ్డనేల ? మనపాలింటి పుణ్యస్వరూపంబు సన్నిహితంబయి వట్టితని పాప్రిపు దొరకినది." (నీతిచంద్రిక-విగ్రహము.)

సిరివరుడు. వై. వి.=శ్రీవర: చూ, విష్ణువు. 1.

సిరిసింగణావత్తి. ద్వ. వి. రూ-సిరిసింగణావత్తి: చూ, బాలక్రీడ. (ఇందులఆటలలోని తొమ్మిక్కుడుబిళ్ల ఆటనుగురించినకథ:--: ఇందుగలగళ్లు ౯:—౧. వేద వేదాంగ వేదాంత పురాణేతిహాస చౌషష్టి కళాదులైన సకల విధ మహోన్నతోత్తమ విద్యలుసుతొలి; ౨. తద్విద్యా సంపూర్ణ పరిశ్రమ ఫలభూత వినయ సౌశీల్యాది గుణగణము మలి; ౩. సద్గుణ విశేష సంజనితేష్టా, పూర్త, శాంతి, పౌష్టిక నామస్వపర సర్వమంగళ ప్రధాన సత్కర్మానుష్ఠానము మంగళము; ౪. తదనుష్ఠాన జనిత మహామాహాత్మ్యకారణ, సకల ప్రాణిహృదయోద్గత, సుఖానంద హేతుసత్పాత్రత గుప్పచ్చి; ౫. తత్పావనపాత్రత్వాయాచిత, సంప్రాప్త ధన ధాన్యకారణ భార్యాపుత్ర గృహారామ కేదార రాజాశ్రయాది రూపక ప్రమాదహేతు సంసారము కిరుకు; ౬. తత్సంసార యాతనానుభవ సంభవా శాశ్వతతుచ్ఛ సుఖత్యాగనామక వైరాగ్యము చిన్నన్న; ౭. తద్విరక్తిజాత పరబ్రహ్మజ్ఞానము పెద్దన్న; ౮. తత్సుజ్ఞాన కృత భక్తి ధ్యానమిళితద్వైత భావస్ఫుట నిశ్చల సమాధికొండ; ౯. తపమునస్క సమాధిసంప్రాప్త నిస్సీమపరదేశము సాయుజ్యనామకమైన కోరాభాయి. జీవుడు తుచ్ఛనవద్వారములలో సంచరించి మొదటి ప్రకృతిలో నెట్లునటించెనో అట్లే పంచాశ్రమరూపములగు నీ యుత్తమ నవద్వారముల సంచరించి ప్రకృతిమహాదూర ప్రణవస్వరూపుడు గానగలనని భావధ్వని. రాకపోకలలో సర్వదా మనస్సు (బిళ్ల) సంధులలో చిక్కకొనకూడదు. కల్పాంత పునస్సృష్టి వేళలో ధన సంసారమగు కిరుకు, జన్మపరంపరా హేతుకర్మకాండమైన మంగళము. వీనిరెంటి వా

దు, తునుము-తున్ము, తెగఁగొట్టు, తెగవేయు, త్రివు-త్రివ్వు, త్రివ్వటించు, దుమ్మురేఁచు, నఱకు-నఱుకు, నుగ్గాడు, పరిమారుచు-పరిమార్చు, పాలాఁచు, ప్రిచు, మురికొను, మొత్తు, రేయు, వందలలాడు, విర్గ-విఱుగు, వేయు-వ్రేయు, వ్రక్కలించు. (సం) ఖండించు, ఛేదించు, దళించు. (చూ, వ్రక్కలాఱు.) తద్వి.—మిక్కిలిఖండించుటకు.—(సం) విదళించు. [శాఖ: చూ, శాఖ. 1.

సెలగొమ్ము. దే. వి. (సెలగ + కొమ్ము) ఉప

సెలగోల. ద్వ. వి. గొల్లవాఁడు పసులమేపెడు (దోలెడు) కోల. హరి. పూ. 5, ఆ, 255: చూ, సిల్లు

సెలపంది. ద్వ. వి. ఏదుపంది, ముండ్లపంది: చూ, సూకరము.

సెలపు. దే. వి: చూ, రూ-సెలవు. అం, భా. ద్వి. 192.

సెలపుండు. ద్వ. వి. నారికులుపు: చూ, వ్రణము.

సెలయు. దే. అ. క్రి. 1: చూ, విజృంభించు. పాండు. 1, ఆ. 203; స. క్రి. 2: ఏయు, కులుకు, చిదుము, చిమ్ము, చెలయు, తీయు, వయిచు-వైచు, విసరు, వేయు. (సం) ప్రయోగించు. (చూ, వైచు. 1.)

సెలయూట. ద్వ. వి. (సెల + ఊట): కొండయూట. (సం) ఉత్సము, ప్రస్రవణము. తద్వి.—ఊట, జెల, బుగ్గ, మొగ్గ.

సెలయేఱు. ద్వ. వి. పర్వతమునుండి పాఱెడు నది. పా. 2, ఆ. 87; స్వా. 4, ఆ. 37: చూ, నది (గ).

సెలవడు. వై. అ. క్రి. సెలవేయు: రూ-సెలవాఱు.

సెలవాఱు. ద్వ. అ. క్రి.—వై.—స్వా. 3, ఆ. 40.

సెలవి. వై. వి.=సృక్వి-స్రిక్వి, ఓష్ఠాంత్య భాగము. పెదవిమూల. స్వా. 2, ఆ. 7: చూ, వాతెఱ.

సెలవిచ్చు. దే. స. క్రి. (సెలవు + ఇచ్చు) ఆజ్ఞాపించు. వై. 8, ఆ. 4: అంపు-అంపించు, అంపు, అనుచు (అనుప్పు), అనుపు, ఆనతిచ్చు, ఆనతియిచ్చు, కట్టుపాటుచేయు, సెవి-చు, పంచు, పంతగించు, పంపించు-పంపు, పంపువెట్టు, పనిగొను, పనిపంచు, పనుప-పరమాయించు, పుచ్చు, పుత్తెంచు, పుట్టి-చు, పురమాయించు, పురికొలుపు, మందలి-చు, మొదలవెట్టు, వలయు, సాగవేయు (సం) ఆజ్ఞాపించు, ఆదేశించు, కథించు, నియమించు, విధించు, శాసించు.

సెలవిల్లు. దే. వి. సెలనుబద్దలవిల్లు: రూ-సెలనువిల్లు

సెలవు. దే. వి. 1. ఆజ్ఞ: అప్పణ-అప్పన, ఆఁక, ఆన, ఆనతి, ఉత్తరువు, కట్టడ, తోడు, దురా-దురాయి, పంపు, ప-పనుపు-పన్పు, పర్వానా, బరాతము, ము-ల, రజా, హద్దు. (ఇం) ఆర్డరు, వారంటు (హిం) హుకుం. (సం) ఆమ్, అనుజ్ఞ, అ-జ్ఞానము, అనుశాసనము, అపవాదము-అవాదము, అభ్యనుజ్ఞ, ఆజ్ఞ, ఆజ్ఞప్తి, ఆజ్ఞాపనము, ఆదేశము, ఊహ, నిదేశము, నియో-ము, నియోగము, నిరోజనము, నిర్దేశము, విధానము, విధాయకము, విస్రంభము, శాసనము, శాస్త్రము, శిష్టి, సందేశము, స-యము, సమ్మతి, హవము, (అవ్య) ఆజ్ఞ-ఖలు, చ; 2. ఉపయోగము. భారి. విరా 1, ఆ. 239: చూ, సెలవు. 1; 3: చూ, ఆవిడుపు. 2; స. క్రి. 4: చూ, రూ-సెల-హరి. 2, ఆ. 161. [4, ఆ. 52

సెలసు. దే. వి. ఒకరకముచెట్టు. పంచ. వే

సెలసువిల్లు. దే. వి: చూ, రూ-సెలవిల్లు.

సెలుకాలుది. వా. వి. ఒకరకముపుంజు. తద్వి కోడికి.—(సం) విష్కిరము, శిఖండి: చూ పుంజు.

సెల్లా. వై. వి.=చేల. అంచుకమ్ములులేని తెల్లబట్ట: చూ, వస్త్రము. [ఆది. 7, ఆ. 20

సెల్లుఁడు. వై. వి.=శల్య. శల్యుఁడు. భా

సెవ, వై. వి.=శిఖ: చూ, రూ-సెగ.

## సే

సేకము. సం. వి. అ. పుం. 1. చల్లుట: చూ, సంప్రోక్షణము. 1; 2. తడుపుట: చూ, స్తేమము; వై. వి.=శిఖ. (1) తాపము: చూ, సంతాపము; (2) ఉష్ణము. పంచ. వేం. 1, ఆ. 688: చూ, వేఁడిమి.

సేకరము. వై. వి.=స్వీకార. సంగ్రహము: చూ, స్వీకారము. 2.

సేకరించు. దే. అ. క్రి. 1. అపాయమునుండి తేలు. స్వా. 4, ఆ. 115: తెప్పరిలు-తెప్పిరిల్లు-తెప్పిఱు-తెప్పిర్లు-తేఱు, సంబడించు-సంబళించు; వై. స. క్రి. 2.=సంగ్రహ. కూడఁబెట్టు. సంగ్రహించు: చూ, సంధించు 3.

సేగి. దే. వి. 1. అశుభము: చూ, హాని. 2; 2. దుఃఖము: చూ, శోకము; 3. ఆపద. రామా. 3, ఆ. 144: చూ, విపత్తు; 4. నష్టి. హరి. పూ. 5, ఆ. 233: తుట్టు, దండుగ-దండువ-దండుగు-దండువు, పాలి, పోకు, బొత్త, లుగసాను-లుగ్గాను, వడుసుడి, వారడి. (సం) దండము, నష్టి. తద్వి.—౧. రెట్టింపు దండుగకు:-(సం) ద్విపాద్యము; ౨. నాశము నొందినది:— అంతరితము, ఉపహతము, నష్టము, శుచి; ౩. నాశము చేయఁబడినది.-ధ్వంసితము; ౪. (వి) నాశమునకు:-చూ, వంస్థ. 3.

సేచకము. సం. వి. అ. పుం. 1. మబ్బు: చూ, మేఘము. 1; 2. చల్లునది. తద్వి.-౧. చల్లఁదగినది:—పరికీర్ణము; ౨. చల్లఁబడినది:-అవకీర్ణము; 3. తడుపునది. తద్వి.—తడిసినది:—చూ, స్తిమితము.

సేచనము. సం. వి. అ. న. 1. చల్లుట: చూ, సంప్రోక్షణము. 1; 2. తడుపుట: చూ, క్షేమము; 3. ఓడలోఁజొచ్చిన నీళ్లు వెలికిఁ బాఱఁజిమ్మెడు బొక్కెన: చూ, పాత్రము. 6.

సేదుకత్తి. దే. వి. సాలెవానిసాధనము: చూ, సరి. 2 (మగ్గము.)

సేతుబంధనము. అం: చూ, అష్టవర్గము.

సేతువు. సం. వి. ఉ. పుం. 1. నీటికట్ట: ఆళి-ఆళి, బధ్యము, దుర్గసంచరము, వరణము-వారధి, సంక్రమము. (తె) అడ్డకట్ట, అన-అనకట్ట-ఆనకట్ట, కట్ట, కట్టుఁగొమ్మ, పొర్లు కట్ట, సారున. తద్వి.—౧. మడికి వేసిన గట్టు.—(తె) ఎక్కలము, కరగ, కురిమిడి, కురిమిడిగట్టు, గట్టు, గనిమ-గనిమె, వడవ, వరుజో; ౨. కత్తవతో వేసినగట్టు.—కత్తవ-కత్తువ, కట్ట, గట్టు (ఇది కాలువ చెఱువులోనగువానిగట్టు); 3. నీళ్లుపాఱుటకుఁ గట్టిన ఆనకట్ట:-ఖేయము; ౪: చూ, లాకు; ౫. వంతెనకు.—పిండిలము, వరణము, వారధి. (తె) అట్టెడ, వంతెన; 2. ఉలిమిరి*: చూ, శ్వేతపుష్పము. [శ్రమము.

సేద. వై. వి.=స్వేద. శ్రాంతి, బడలిక: చూ,

సేదగొను. ద్వ. అ. క్రి. బడలు. అచ్చ. అ, కాం. 40: చూ, వేసరు. 2.

సేదదేరు. వా. అ. క్రి. బడలిక తీర్చుకొను: కదురు, కోలుకొను-కోల్కొను, తెప్పవడు, తేఱు, తేఱుకొను, నిమ్మళించు, రకొను-రెకొను.

సేద్యకాఁడు. ద్వ. వి. పైరుపెట్టువాఁడు: ఆరకాఁడు, కమతకాఁడు- కమతీఁడు-కమ్మతీఁడు, పంటకాఁపు, రయితు-రైతు. (సం) కర్షకుఁడు-కార్షకుఁడు- కార్షికుఁడు-కార్షుఁడు, కీనాశుఁడు, కుటుంబి, కృషకుఁడు-కృషికుఁడు, కృషాణుఁడు, కృషిబలుఁడు-కృషీవలుఁడు, క్రిష్ట, క్షేత్రాజీవుఁడు, వ్యవసాయి, సైరికుఁడు, హలాయుధుఁడు, హాలి, హాలికుఁడు-హాలికుఁడు.

తద్వి.— విత్తెడువానికి.—వత్త. (తె) విత్తెడువాఁడు.

సేద్యము. వై. వి. పైరుపెట్టుట: కమఠము-కమ్మతము, కరిసనము—కరిసెనము—కరిసెము- కర్సనము-కరిసె, కిసుక, తెగుబడి, దుక్కి, పంట, సాగు, సాగుబడి. (సం) అన్నృతము, కర్షణము, కృషి, కృష్టి, క్లేశము, ప్రమృతము, మహోధనము, వ్యవసాయము. తద్వి — ౧. తేలికదుక్కికి.— ఒరచోలుదుక్కి— ఒఱచోలుదుక్కి; ౨. నీరాసరావంటకు.—పల్లపుఁబంట; ౩. యజ్ఞార్థమైన దుక్కికి.—(సం) కర్షువు; ౪: రొంపిదుక్కి, కుదవ; ౫: వెలిదుక్కి; ౬: పంట, మహసూలు-మహసూలు; ౭. దున్ని సిద్ధము చేసిన పొలము: (తె) సేద్యము.

సేన. సం. వి. అ. స్త్రీ. 1: అనీకము, అనీకిని, ఉత్థానము, కటకము, చక్రము, చమువు-చమూవు, తంత్రము, దండము, దళము, ధట్టి, ధాటి, ధ్వజిని, పటలము, పతాకిని, పరివారము-పరీవారము, పృతన, బలము, వరూథిని, వాహిని, సాధనము, సైన్యము, స్కంధావారము. (తె) ఎట్టపోగు, కూటువ, చేవలము, చేరువ, రాజా, తత్తబడ, తంటము (తుట్టిము-తుట్టె-తుట్టియ-తుట్టె, తుడుము), తోయము, దండము, దండు, దడము, దళా, దళము, దాఁటు, దాడి, దుమారు, పటాలము, పరి, పాళియము—పాళెము, పొట్లము, పవుఁజో—ప్పౌఁజో, బలువిడి—బల్విడి, మూఁక, మొన, రాణువ, లష్కరు, వాఁగు, వీడు, వెల్లువ, సంగడము, సవరణ-సవరణము, సిబ్బంది. తద్వి.—౧. సేనావిశేషములు—అక్షౌహిణి; అనీకిని; గణము; గుల్మము; చమువు; పత్తి; పృతన; వాహిని; సేనాముఖము. (చూ, సేనాలక్షణము) (వీని వివరములాయా పదములకడఁ జూడనగు); ౨. సేనాముఖమునకు.— ఇర, చమూముఖము, తలతంత్రము, నాసీరము, శిరము, సేనాగ్రము, సేనాముఖము. (తె) పడవలము, మునుము-మున్ను, మొన; ౩. దండులోని అల్లరిజనమునకు.—(తె) పెండారిమూఁక; ౪. పిఱికిబలమునకు.—(తె) కూటువమూఁక; ౫. యుద్ధసన్నద్ధసేనకు — ప్రచక్రము.(తె) కూరుమొన; ౬. చతురంగబలసేనకు.— (తె) పరి, పరిగము (చూ, చతురంగములు, చతురంగము.); ౭. సేనవెనుక దండునకు.—కూలము, సన్నయము—పయున్నయము; ౮. మాఱుదటనుండి రక్షించెడు సేనకు.—పార్ష్ణిగ్రము; ౯. కలఁతపాటిన సేనకు.—పింజలము; ౧౦. సేనాగ్రమునకు:—శిరము, సేనాగ్రము;౧౧. సేన వెనుకటివిక్కునకు:—ప్రతిపరము;౧౨. సేన యొడ్డుటకు — చూ, వ్యూహము; వా. విశే. (1) బహుకాలపరిమాణము. "వాఁడొంపచ్చి సేనసేపైనది"; (2) ఎక్కువ, చాల. "వాఁడు సేనఅన్నము తిన్నాఁడు" "వాఁడు సేనమంచివాఁడు." (సేనా=చాలా.)

సేనము. దే. వి. రూ—చీనము-చీనాము. చిన్నయులి. బంగారునఱుకెడియులి (అనికొండఱు): చూ, సుత్తియ (వ్యుత్పాదనము. 1.)

సేనాంగములు. అం: రథ, గజ, తురగ, పదాతి చతుష్టయము: చూ, అంగము. 9 (చూ, నాలుగంకములు.)

సేనాగ్రము.సం.వి.అ.న.శిరము: చూ,సేన.1-౧౦.

సేనాని. సం. వి. ఇ, ఈ. పుం. 1. కుమారస్వామి: చూ, స్కందుఁడు; ౨. సేనాధిపతి, మహాసేనుఁడు: చూ, సైనికుఁడు.

సేనాముఖము. సం. వి. అ న. 1. పదమూలము: చూ,సేన..1.౧-౨; మూఁడురథములు, మూఁడేనుఁగులు, తొమ్మిదిగుఱ్ఱములు, పదునేనుగురుకాల్బలముగల సైన్యము: చూ, సేనాలక్షణము

సేనాలక్షణము. అం. పత్తి మొదలక్షౌహిణిపర్యంతమైన సేనకుఁగలరథగజాశ్వపదాతి సంఖ్యా వివరము.

శ్లో. అక్షౌహిణ్యా మిత్యధికై । స్సప్తత్యా చాష్టభిశ్శతైః । సంయుక్తాని సహస్రాణి । రథానా మేకవింశతిః । ఏవమేవగజానాంతు । సంఖ్యాసంకీర్తితంబుధైః । పంచషష్టిసహస్రాణి । షట్శతానిదశైవతు । సంఖ్యాతా స్తురగా స్తజ్ఞై । ర్వినారథ్యై స్తురంగమైః । నృణాంశత సహస్రంతు । సహస్రాణినవైవతు । శతానిత్రీణిచాన్యాని । పంచాశత్తుపదాతయః॥" ఇత్యక్షౌహిణీలక్షణముచ్యతే॥

| | సేనపేరు | గజములు | రథములు | అశ్వములు | కాలిబంట్లు |
|---|---|---|---|---|---|
| 1 | పత్తి | ౧ | ౧ | ౩ | ౫ |
| 2 | సేనాముఖము | ౩ | ౩ | ౯ | ౧౫ |
| 3 | గుల్మము | ౯ | ౯ | ౨౭ | ౪౫ |
| 4 | గణము | ౨౭ | ౨౭ | ౮౧ | ౧౩౫ |
| 5 | వాహిని | ౮౧ | ౮౧ | ౨౪౩ | ౪౦౫ |
| 6 | పృతన | ౨౪౩ | ౨౪౩ | ౭౨౯ | ౧౨౧౫ |
| 7 | చమువు | ౭౨౯ | ౭౨౯ | ౨౧౮౭ | ౩౬౪౫ |
| 8 | అనీకిని | ౨౧౮౩ | ౨౧౮౭ | ౬౫౬౧ | ౧౦౯౩౫ |
| 9 | అక్షౌహిణి | ౨౧౮౭౦ | ౨౧౮౭౦ | ౬౫౬౧౦ | ౧౦౯౩౫౦ |

సేపు. వా. వి. కాలము: చూ, సమయము. 1. (అంత, ఇంత, ఎంత, కొంత, ఇంకొక, చాల, గంట మున్నగుపదములు సేపుతోఁజేరి కాలనిర్ణయమును సూచించుచున్నవి.)

సేబాసు. దే. అవ్య. ప్రశంసనార్థకము. "క. సేబాసు బళానిసున్." కృష్ణా. 3, ఆ: చూ-సెబాసు-సబాసు-శాబాసు, అజ్జ, అజ్జర- అజ్జరే- అజ్జారె-అజ్జారే, (మి) అజ్ఝా-అజ్ఝార-అజ్ఝారే; అద్దిటి-అద్దిటియ్య, అద్దిఱ, అర-అరే-అరె, అహాసు-హాసాసు, ఏ-ఏ, ఓహో-ఓహోహో, ఓహోర-ఓహోరే, ఔ, చెంగుబళి, చేఁగు-చేఁగుర-చేఁగురే, పుర-పురే, బలా-బలారా-బలార-బలారే, బలే, బళా-బళార-బళారే, బళి-బళిర-బళిరయ్య-బళిరా-బళిర-బళిరే-బళీ-బళీర-బళీరే-బాపు-బాపుర-బాపురే, మజ-మజా-మజ్జ-మజ్జర-మజ్జరే-మజ్జా-మజ్జారె-మజ్జారే, (మి) మజ్ఝా; మమ్మ-మమ్మర-మమ్మరే.

డు; ౫. వంచేనుకాఁచియుండు సేవకుఁడు (తె) వడిగాపు; ౬. పెంపుడుబంటు.— పరజాతుఁడు-పరాచితుఁడు, పరిస్కందుఁడు, పరైధికుఁడు; ౭. పూజచేయువానికి:— చూ, పూజారి. 1; ౮. విష్ణుపూజచేయువానికి:—చూ, పూజారి. 2; ౯. శివార్చకునకు:—చూ, పూజారి. 3; ౧౦. పోలీసు బంటోతునకు.—దండపాశికుఁడు. (తె) పోలీసు; ౧౧: చూ, విధేయుఁడు; ౧౨. చిల్లరపనులు చేయు బంటునకు:—(తె) మేటి; విశే. 2. కొలుచువాఁడు.

సేవకురాలు. మి. వి. దాసి, సోట: చూ, పరిచారిక. (చూ, స్త్రీ) (చూ, బానిస.)

సేవధి. సం. వి. ఇ. పుం. రూ—శేవధి: చూ, నిధి. 2.

సేవనము. సం. వి. అ. న: 1. కొలువు: చూ, సేవ. 1; 2. (సీవనము అనికొందఱు.) బట్ట కుట్టుట: చూ, స్యూతి.

సేవస్యావృత్తి. అం: చూ, అనుభావర్తములు.

సేవి. సం. వి. న్. పుం. కొలువుడుకాఁడు: చూ, సేవకుఁడు.

సేవించు. సం. స. క్రి: ఉపచరించు, ఉపాసించు, పరిచరించు, భజించు, సంభజించు, సంభవించు. (తె) ఓలగించు, కొలుచు.

సేవిక. సం వి. ఆ. స్త్రీ.=సేవియ. హై. 6, అ. 20: చూ, భృత్యము.

సేవితము. సం. విశే. సేవింపఁబడినది (కొలువఁబడినది): జుష్టము, వనిత, నిషేవితము. తద్వి.—సేవించునది:- భజమానము.

సేవితుఁడు. సం. విశే. సేవింపఁబడినవాఁడు: ఉపచరితుఁడు, ఉపాసితుఁడు, వరివసితుఁడు-వరివస్యితుఁడు—వరివస్యితుఁడు, శ్రితుఁడు

సేవియ. వై. వి. రూ—సేవి=సేవికా. వై. 8, ఆ. 204: చూ, సేవిక.

సేవె. వై. వి.=:చూ, సేవియ, ఉ. 3, ఆ. 83.

సేవ్యము. సం. వి. అ. న.=చవ్య. 1. వట్టివేరు*: అభయము, అమృణాళకము - అమృణాళము., అవదాహము, ఇష్టకాపథము, ఉశీరము-ఔశీరము, కంభువు, నలదము, మృణాలము, లఘులయము, లయము, లాజము, లామజ్జకము, సీతోసీరము. (తె) వటివేరు-వట్టివేరు, అవురుగంటివేరు. తద్వి.—౧. తెల్లవట్టివేరునకు.-జలాశయము, లామజ్జకము. (అని కొందఱు): (తె) తెల్లవట్టివేరు; ౨. నీరువట్టివేరునకు: అమృణాళకము—అమృణాళము, అవదాహము, ఇష్టకాపథము, జలాశయము, లఘులయము, లయము, లామజ్జకము, శీఘ్రము, సేవ్యము (దీనిని తెల్లవట్టివేరు అని కొందఱు.); 2. చవ్యకము*: చూ, కరికణావల్లి; విశే. 3. సేవింపఁదగినది: జిష్యము, భజిష్యము; దే. వి. (1) దున్ని సిద్ధము చేసిన పొలము: సేద్యము.

సేవ్యుఁడు. సం. విశే. ఉపాసింపఁదగినవాఁడు: ఉపాస్యుఁడు. తద్వి.—పరిచర్య చేయువాఁడు:- పరిచార్యుఁడు.

సేస. వై. వి.బ.1. అక్షతలు. వసు. 6, ఆ. 28. చూ, సేసఁబ్రాలు; 2. అక్షతలను ధాన్యము: చూ, స్తంబకరి(ధాన్యము); వై. వి 3 కేశవీధి, పాపట. (సం) కేశపద్ధతి, సీమంతము.

సేసఁబ్రాలు. ద్వ. వి. తలఁబ్రాలు. (చూ, బియ్యము) తద్వి—౧. పసుఁపునోటవేసెడు బియ్యము:- వాయి బియ్యము; ౨. అనుగ్రహించియిచ్చిన అక్షతలులోనగునవి:—(సం) శేష; 3. ఎవటిపోఁతలుగాదంచిన బియ్యము:—సడింపులు; ౪. పొట్టుపిడిపిడని బియ్యము: - మెతికలు-మెఱుకులు; ౫: లక్క-పాడి, లక్క-బియ్యము; ౬: సగ్గుబియ్యము.

సేసకొప్పు. న్వ. వి. కొండెసిగ: చూ, సిక.

సేసలు. వై. వి. బ.=శేష: చూ, సేస. 1-2.

సేళము. దే. వి. కారంభి, పేరింకణము*: చూ, పక్షికద్రువు.

## సై

సై. వై.ఉప.రూ-సయి.=సహ. సహార్థకము. "సైదోడు" వెం. (చూ, సైతము)

సైంధవము. సం. వి. అ. పుం, న. 1. ఇందుప్పు: చూ, లవణము. 1; పుం. 2. గుఱ్ఱము: చూ, హయము; విణ. 3. సింధువునఁ బుట్టినది; అం. 4: చూ, టక్కజ భాషలు.

సైంధవలడ్డు. జా. అడ్డము. (పానకములోని పుడకవంటిది.)

సైంధవలవణము. సం. వి. అ. పుం. 1: చూ, సైంధవము. 1; అం. 2: చూ, క్షారములు.

సైంధవవరాటి. అం: చూ, వరాట్యుపాంగములు (అంగము. 9.)

సైంధవి. అం. 1: చూ, పంచమజభాషలు; 2: చూ, మాళవ కైశికజభాషలు; 3: చూ, భిన్నషడ్జకజభాషలు. [రాహువు. 1.

సైంహికేయుఁడు. అం: రాహుగ్రహము: చూ,

సైఁచు. వై.అ.క్రి,స.క్రి.=సహన.రూ-సయిఁచు. 1. ఓర్చుకొను: చూ, సహించు; 2. రుచించు; చూ, సంధించు. 2; స. క్రి. 3.=సహన. ఓర్పు: చూ, శాంతించు.

సైఁదము. దే. వి. గోదుమపిండి: రూ-సయిఁదము. [చూ, సహనము. 1.

సైఁపు. వై. వి. ఓర్పు. శాంతము, రూ-సయిఁపు:

సైఁపుడు. వై. వి. -సై.-(రూ-సయిఁపుడు.)

సైకతము. సం. వి. అ. న. 1. ఇసుకదిబ్బ: చూ, భూమి. 1; 2. ఇసుకనేల: చూ, భూమి. 1. [(తె) ఇసుకదారి.

సైకతశాకము. సం. వి. అ. వ. ఒకానొకకూర:

సైకము. దే. వి. 1. రూ-సయికము.విజ. 2, ఆ. 48: చూ, స్వల్పము; విణ. 2. సూక్ష్మమైనది: (సం) అగురువు, కనిష్ఠము. (తె) చిన్నది; తద్వి:-౧.సన్నమైనది :- పలుచే; ౨. (విణ.) పలుచేసైనది:-పలచే-పలుచే,బద్ధ.

సైకిలు. వా. వి. రూ-సయికిలు, బయిసికిలు- బైసికిలు (చూ, బండి.)(ట్రయిసికిలు=మూఁడుచక్రములబండి)

సైగ. వై. వి.=సంజ్ఞ. 1: రూ-సయిగ, బాస, మంతనము. (సం) సంకేతము, సంజ్ఞ (కంటితోను చేతితోను, తలతోను, ఒకవిధమైన స్వరముతోను చూపెడి తెలుపులు సైగలనఁబడును.) తద్వి.-౧. చేసన్న, సన్న. (సం) సన్య-సన్య; ౨. కనుసైగకు-కన్నన్న, జాడ; 2: చూ, రహస్యము.తద్వి. ౧.-రహస్యమునకు.(సం) వృత్తాంతము, సమయము; రహస్యార్థమందు :-(వి) అస్పష్టత, అవ్యక్తము, ఉపహ్వరము; (విణ) అస్పష్టము, అస్ఫుటము; (అవ్య) ఉపాంశు. (చూ, రహస్యము.)

సైడ్డు. వా. వి. రూ-సయిడ్డు: చూ, సూరెలు.1.

సైతము. వై. అవ్య.=సహిత. రూ-సయితము. (క్రి) ఒకట-ఒక్కట-ఒకొట-ఒక్కొట, కూడ, తో-తోడ-తోడుత-తోడుతో, తోడుతోడ-తోడ్తో-తోడ్తోడ, వెంగమున. (సం) సు,సహ-సహా, సహితము, సాంప్రతము. [డునది: చూ, నది.

సైతవాహిని. సం. వి.ఈ.స్త్రీ. బాహుద యను

సైతాను. వా. వి. రూ-సయితాను. 1. పిశాచములకుఅధిపతి; 2. వెంటనంటి వదలని వాఁడు. [సహోదరుఁడు. 1.

సైదోడు. ద్వ. వి. రూ-సయిదోడు: చూ,

సైద్ధాంతికుఁడు. సం. విణ. సిద్ధాంతము తెలిసిన వాఁడు: చూ, సాంవత్సరుఁడు.

సైనికుఁడు. సం. వి. అ. న. 1: ఖడ్గికుఁడు.

దండనాయకుఁడు, దళపతి, ధన్వి, వాహినీపతి, సేనాధిపతి. (తె) గమికాఁడు, చేరువకాఁడు, దణాయఁడు, దణి-దణియ-దణె, దళవరి-దళవాయి-దళ్వాయి, దొర, పడవాలు - పడాలు, మొనకాఁడు, మోటుకాఁడు, సోల్జరు. తద్వి.-౧. గొప్పసేనగలవాఁడు.- మహాసేనుఁడు; ౨. విష్ణు సేనాధిపతికి.-విష్వక్సేనుఁడు; 3. చిన్నసేనకు అధిపతికి - (తె) జెంగిలి, జెంగిలిగమికాఁడు; విణ. 2. సేనతోఁ జేరినవాఁడు.

సైను. వా. వి. రూ-సయిను: చూ, వస్త్రము.

సైన్సు.వా.విణ-రసాయనశాస్త్రసంబంధమైనది.

సైన్యము. సం.వి.అ. న రూ-సైనికము. 1. సేనతోఁగూడియుండుబలము (అనికొండఱు): చూ, సేన. 1; పుం. 2. కృష్ణుని తేరి గుఱ్ఱములలో నొకటి: చూ, హయము. అం. 3: చూ, రథ్యములు; విణ. 4. సేనతోఁగూడినది.

సైమంతికము. సం. వి. అ. న. కుంకుమపువ్వు: చూ, వహ్నిశిఖము. 1.

సైరంధ్రి. సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, గట్టివాలు; 2. అంతఃపురకావలికత్తె: చూ, స్త్రీ; 3. సంకరజాతిఆఁడుది: చూ, స్త్రీ.

సైరణ. వై. వి.=సహన. రూ-సయిరణ: చూ, సహనము. 1. [నిర్వ. 3, ఆ, 78.

సైరించు. వై. అ. క్రి: చూ, రూ-సయిరించు.

సైరికము. సం. వి. అ. పుం. 1. దుక్కిటెద్దు: చూ, (చూ, హాలికము. వృషభము. 1-౩౯); విణ. 2. సీరసంబంధమైనది (సీరము=నాఁగలి). [చూ, సేద్యకాఁడు.

సైరికుఁడు. సం. వి. అ. పుం. హాలికుఁడు:

సైరిభము. సం. వి. అ. పుం. దున్నపోతు: తటాద్దము, లాలికము, శీరస్కంధము. తద్వి: ౧. గవలమునకు.-సైరిభము (అనికొందఱు), కాసరము. (తె) కారుపోతు-కాఱుపోతు-కాఱెనుఁబోతు, కాఱుదున్న: (చూ, మహిషము.1-౨); ౨. అడవిదున్నకు.-వనమహిషము. (తె) అడవిదున్న: (చూ, మహిషము); 2. నాకము: చూ, స్వర్గము.

సైరేయకము. సం. వి. అ. పుం. తెల్లగోరంట*: చూ, సహ. 2; 2. ములుగోరంట*: చూ, సహ. 2.

సైలరు. వా. వి. ఓడమీఁదపనిచేయువాఁడు.

## సొ

సొంటి. వై. వి.=శుంఠి. ఎండినఅల్లము, పక్వముచేసి రొండించిన అల్లము: (సం) ఊషణము-ఊషణము, కటభంగము-కటుభంగము-కటుభద్రము, కటూత్కటకము-కటూత్కము, కఫారి, జనార్దనము, నాగరము, మహౌషధము-మహౌషధి, విశ్వభేషజము, విశ్వము, శుంఠి, శొంఠి. తద్వి.-చూ, శృంగబేరము.

సొంటిపిక్క. వా. వి. పిక్క తొడలోనగు చోట్లను వ్రేళ్లతో నొక్కి కదుముగట్టునటుల చేయుట: తొడపాశ(సె)ము.

సొంటు. వై. వి.=శుంఠ. తప్పు: అయిపు-ఐపు, అవగడము, అగడము, ఎగ్గు, ఒప్పమి, కల్ల, కీడు, గొడవ, జోలము, డొగరు, తప్పితము-తప్పిదము, తప్పు, తీఁపురము, దబ్బఱ, దుండగము, దుండతీకము, దుడుకు, దోసము, నెవము-నెవము-నేవము, నెరను, నేరమి-నేరము, వంక, సొడ్డు. (సం):—అంకము, ఆతకర్ణము, అత్యయము, అనయము, అపరాధము, అవకటము, అగము, ఏనము-ఏనస్సు, కిల్బిషము, ఛిద్రము, జఘనము, దంభము, దోషము, మంతువు. తద్వి.—౧. పరిమాణముచేసి తప్పుచెప్పిన నేరము.—(సం) అపరి

పూణము; ౨. పెద్దలయెడలచేసినతప్పు:— (సం) అపచారము. [సొతంతరము.

సొంతము. వై. విణ.=స్వతంత్రి: చూ, రూ—

సొంపిలు. దే. అ. క్రి. రూ-సొంపిల్లు. అందగించు, సొంపగు: చూ, రమ్యమగు.

సొంపిల్లు. దే. అ. క్రి.—పై.—

సొంపు. దే. వి. 1. ప్రసన్నత: చూ, సమీచీనము. 2; 2. కాంతి. ఆం, భా. ప్రి. 80: చూ, కెలుతురు. 1; 3. ఆనందము: చూ, సంతోషము. గామా. 4, ఆ. 8; 4. సుఖము: చూ, సంతోషము. రాజా. 5, ఆ. 132; 5: చూ, సౌందర్యము; 6: చూ, సమృద్ధి. మార్క. 8, ఆ. 207. [చూ, సొగటు.

సొక్కు. వై. వి.=ముఖ. ఇంచుక విపరీతస్మృతి:

సొగటము. ద్వ. వి. బ. పగడాలసాలు: చూ, ద్యూతవ్యాపారము. 4-3-౬. [—పై—

సొగటాలు. ద్వ. వి. బ. (సొగపు + ఆటలు)

సొగటు. దే. వి. (అని. 3, ఆ. 122): సొక్కు—చొక్కు, వాడు. (సం) క్లమథము, క్లమము, గ్లాని. (ఇవి స్మృతియందును వర్తించును.) [ఆ. 149: చూ, విస్మృతి.

సొగపు. వై. వి.=ముఖ. పారవశ్యము. వై. 3,

సొగయిక. వై. వి.=ముఖ.—పై.—

సొగయు. వై. అ. క్రి.=ముఖ. రూ-సొగియు. 1. చొక్కు. పరవశత్వమునొందు. భార. ఉద్యో. 4, ఆ. 329: చూ, విస్మృతినొందు; 2. మూర్ఛిల్లు. మార్క. 6, ఆ. 203: చూ, సొమ్మసిల్లు.

సొగసు. వై. వి. 1. యౌవనాదుల వలనఁగలుగు గర్వచేష్ట: ఆం, భా. ప్రి. 139: చూ, విలాసము. 2; 2: చూ, సౌందర్యము; 3: చూ, సొగపు.

సొగసుఁగాంచు. వా. అ. క్రి: ఇంపొందు.

సొగసుకత్తె. వై. వి. 1. విటకత్తె: చూ, స్వైరిణి; విణ. 2. అందగత్తె, అందకత్తియ, రూపరి, రూపసి: చూ, స్త్రీ.

సొగసుకాఁడు. ద్వ. వి. 1. విటకాఁడు: చూ, విటుఁడు; విణ. 2. అందగాఁడు: చూ, సౌందర్యవంతుఁడు. [లక్ష్మి, 1. ఆ.

సొగియించు. వై. అ. క్రి: చూ, మఱపించు.

సొగియు. వై. అ. క్రి.=ముఖ. 1. ఇంపగు: సమ్మోదించు; 2. గ్లానపడు, వాడు. ఆం, భా. శృం. 107: చూ, మ్రిక్కు. 14.

సొచ్చెము. వై. వి. పెంపు: చూ, హెచ్చు. 1; 2.=స్వచ్ఛ—చోక్ష. నిర్మలము, గరగర: చూ, సమీచీనము. 2; 3.=చోష. మిగులు: చూ, శేషము. 1; విణ. 4. మిగిలినది: చూ, శేషము. 1. [స్వమా: చూ, సొదము. (1).

సొజ్జె. దే. వి. పెద్యము పేఁచినవండిన యొ

సొజ్జెబూరె. ద్వ. వి: చూ, భక్ష్యము. శకు. 7, ఆ. 81. [హో. 2 (వింత).

సొజ్జెము. వై. వి.=చోద్య. సోద్యము: చూ,

సొటసొట. దే. వి: చకచకలు, చలచలన—చల్పలిక.

సొటసొటలాడు. వా. అ. క్రి: చూ, సొటసొటవోవు.

సొటసొటవోవు. దే. అ. క్రి. ఎండు: రూ—సొటసొటలువోవు, అడుగంటు, ఆఱు, ఇంకు, ఇగురు-ఇవురు, ఇఱుకు-ఇముకు-ఈఁకు, ఈచు, ఉజ్జగిలు (ఉజ్జగిల్లు), ఎండు, కాటువోవు, క్రిల్లపడు, చొండు, డిందు, డొంకు, డొందు, తడితీయు, దయ్యు, నవయు, నీరింకు, బిక్కటిలు-బక్కటిల్లు, మిడుకు, ముక్కు, వక్కు, వట్టు, వడియు. (సం) శోషించు-శోషిల్లు, హారించు, తద్యః— ౧. చిక్కు అనుటకు.—ఉడుగు, ఊఁచపడు, ఊచఁబోవు, ఊసరిల్లు, ఒసుడుక అగు, క్రియ్యు, కుర్రియ్యఁబాఱు, కుర్రియ్యు, చిక్కు, డయ్యు, తీయు, త్రిడువడు, నకనకఁబడు, నకనకలాడు, నకనకలుగుడుచు—నకనకల్గుడుచు, నవయు, పీకువాఱు, బక్కటిలు-బక్కటిల్లు, వక్కు, వట్టు, వడియు, సన్నవాఱు

సొటసొటవోవు- సొటసొటలువోవు. (సం) కృశించు; ౨. కొంచెపడు అనుటకు.—ఇటియు, కొంచెపడు, మందగించు, వలియు, సన్నగిలు-సన్నగిల్లు, సన్నవాఱు. (సం) కృశించు, మందీభవించు. (ఎండు-చిక్కు-కొంచెపడు వీటి పర్యాయములు గూడ దీనికిఁ జెందవచ్చునని కొందఱు). [3, ఆ. 62.

సొటసొటలువోవు. దే. అ. క్రి.—వై.—విజ.

సొట్ట. దే. వి: రూ-చొట్ట. కుంటి-కుంటు.

సొట్టపడు. దే. అ. క్రి: కుంటుపడు.

సొడ్డు. దే. వి. 1. న్యూనత. హ. 2, ఆ. 108: అచ్చిక-అచ్చికము, అరవాయి, అఱ-అఱగొఱ, ఒచ్చెము, ఒట్టు, కడమ, కీడుపాటు-కీడ్పాటు, కీఱ, కుందళము, కుందు, కొంచియము-కొంచెము, కొద-కొదవ, కొదుక, కొఱ, కొఱఁత, కొఱఁతపాటు, గఱగొఱ, గుఱికొండి, చేవుక-చౌక, డిందు, డిగు-డిగ్గు-డిగుడు-డిగ్గుడు-దిగుడు-దిగ్గుడు-దిగువాయి, తక్కు, తక్కువ, తక్కువపాటు, తగ్గు, తగ్గుదల, నిముకళా, నులుసు, పొచ్చెము, పెరికి, మట్టము, మట్టు, ములుచే-ముల్చు, మొఱక, లులి, లొచ్చు, లొజ్జ, లొసుకు, లోఁకువ(లొక్కు), లోటు, విన్నన, వెలితి-వెల్తి. (సం):—అపకర్షము, అపచయము, అపచితి, అపహారము, ఇతరము, క్షయము, క్షితి, లుక్కు, లులి, లోపము, హైన్యము. (విణ) నీచము, న్యూనము. (అవ్య) ఊన. తద్వి: తొఱ్ఱిరివ్వ, పీసర-పీసరము, వెలితి-వెత్తి; వా. 2. ముందుగ తినువాఁడు పందెగానితో వలుకుమాట. "నీమీఁద నేను సొడ్డు వేసితిని"; వై. వి. 3.=శౌంఠ్య: శుంఠత్వము, మూఢత్వము: చూ, శౌంఠ్యము; 4.=శౌఁత్య. తస్య: చూ, సొంటు.

సొతంతరము. వై. వి.=స్వతంత్ర. 1: చూ, స్వతంత్రము; 2. లక్ష్యములేమి, నిర్లక్ష్యము

సొత్తు. వై. వి.=స్వత్వము. 1. హక్కు: చూ, స్వతంత్రము; 2.=సత్వమ్. సొమ్ము: చూ, హిరణ్యము. 3.

సొద. వై. వి.=చితా. పీనుఁగును గాల్చుటకుఁ బేర్చిన కట్టెలలోనగువాని ప్రోగు: చూ, శ్మశానము.

సొన. దే. వి. 1. గుడ్డులోని జెన: రూ-జిన-జెన; 2. బెండలోనగువానిమీఁది నూఁగు. హ్యా. 6, ఆ. 27: చూ, సితాగ్రము; 3. ఊట కాలువ: చూ, ప్రదిని (నది. (౧౧).); విణ. 4.=స్రవణ. స్రవించేనది.

సొనచిక్కుడు. దే. వి. ఉలవకాయలవలెకాసెడి ఒకానొక చిక్కుడు. (చూ, చిక్కుడుకుటుంబము )

సొనాయి. వా. వి: చూ, రూ-సొన్నాయి.

సొన్న. వై. వి.=స్వర్ణమ్. (రూ-సొన్నా-సొన్నము. హొన్ను.) 1. బంగారము: చూ, లోహము. 1; 2. అర్ధదీనారము, మాడ. విజ. 2, ఆ. 8: చూ, సువర్ణము. 2.

సొన్నము. వై. వి.=—పై.— (బంగారుకు-విజ. 2, ఆ. 88; మాడకు.-జై. 8, ఆ.194.)

సొన్నా. వై వి.=—పై.—(వృత్తియందు మువర్ణలోపమును అంత్యవర్ణమునకు దీర్ఘంబునగు. ("సొన్నాటంకము.")

సొన్నాపట్టెరుమాలు. వా. వి. ఒక రకము రుమాలు: చూ, రుమాలు. [చూ, వీణ.౫౧.

సొన్నాయి. వా. వి: రూ-సనాయి-సొనాయి:

సొన్నారి. వై. వి. (సొన్నము+అరి)=స్వర్ణకార. అగసాలెవాఁడు: చూ, స్వర్ణకారుఁడు (ద్వా. అని. శ. ర). (వైకృత దీపికలో వై. అని శ. ర.).

సొపాదాబ్రాహ్మణులు. అం: చూ, మహారాష్ట్రులు. (సామవేదులు, ద్రాహ్యాయణసూత్రీయులు, తాటిచెట్ల పైరునబెట్టెదరు. ఇతర బ్రాహ్మణులు వీరితో సహపంక్తి

భోజనాదులను చేయకగాని శీఘ్రమూత్రము తాగ్రుసురు.) [2: చూ, హృద్యము.

సాబగు. వై. వి. 1.=శుభగ: చూ, సౌందర్యము;

సాబగుఁడు. వై. వి. 1: చూ, విటుఁడు; 2.=శుభగ. భార. ఆర. 3, ఆ. 160: చూ, సౌందర్యవంతుఁడు.

సాబను. దే. వి: బడబనోలు.

సామక. వై. వి.=శ్రమ: చూ, సొమ్మ.

సొమ్మ. వై. వి.=శ్రమ-మూర్ఛ: (చూ, రోగము. 1-౨౨.) అగసావు, ఒల్లము- కల-కళ, కళబుట్టుట, చొక్కు, బవిళి-బాళి, బ్రిమరి, మెయిమఱపు-మేయురు (ఱు)పు, సుమాళము, సామక, సారగు-సారుగు, సాలగు-సాలవు, సొలిమిడి. (సం): కశ్మలము, నిర్వేశము, ప్రతిఘము, ప్రళయము, మూర్ఛ, మోహనము, మోహము. తద్వి.—౧. కాకితీపు, కాకిసొమ్మ; ౨. మిక్కిలి మూర్ఛనొందుటకు.—(సం) సమ్మూర్ఛనము. (చూ, విస్మృతి.) [అచ్చ. యు, కాం. 180.

సొమ్మగొను. ద్వ. అ. క్రి: చూ, సొమ్మసిల్లు.

సొమ్మల్ఁబోవు. ద్వ. అ. క్రి.—వై.—అం, భా. ద్వి. 109. [ర, ఆ. 153.

సొమ్మవోవు. ద్వ. అ. క్రి.—వై.—పారి. పూ.

సొమ్మలవోవు. ద్వ. అ. క్రి.—వై.—ఉ, హరి. 4, ఆ. 242.

సొమ్మసిలు. వై. అ. క్రి: రూ—సొమ్మసిల్లు, ఎడఁజెందు, ఒల్లఁబోవు, కళఁబుట్టు, కొఱవోవు, చొలయు, తాళితాఁకు, బాహిరపోవు, బిమ్మటివోవు, మైమఱచు, సొగయు, సొమ్మగొను, సొమ్మలవోవు-సొమ్మవోవు, సారుగు, సొలయు, సుర్కు. (సం) మూర్ఛిల్లు.

సొమ్మసిలినవాఁడు. ద్వ. వి: అంగవికలుఁడు, అపస్మారి, మూర్ఛాలుఁడు, మూర్ఛితుఁడు, మూర్ఛుఁడు.

సొమ్ము. వై. వి. 1: చూ, భూషణము. 1; 2.=స్వమ్. ధనము: చూ, హిరణ్యము. 3; 3. గోధనము. అచ్చ. బాల, కాం. 88: చూ, హిరణ్యము. 3; 4. అధీనవస్తువు. హరి. ఉ. 6, ఆ. 125: చూ, స్వతంత్రము.

సొమ్ముదాఁచుట. అం: చూ, వివాదములు.

సొమ్మువినియోగించుట. అం: చూ, సప్తవ్యసనములు. [సాద. అం, భా. ద్వి. 225.

సార. దే. వి 1: చూ, రూ-సాఱు*; 2: చూ,

సారంగ. వై. వి.=సురంగా. (రూ-సారంగము): వానము, సారి, సారియ: చూ, రంధ్రము. 1.

సారంగము. వై. వి.=—వై.—

సారకాయ. వా. వి. (పై పెంకు కండకాయ.): అనపకాయ (అనబకాయ), తిపిరి, పదరు: చూ, సాఱ. [చి గొప్పగా చెప్పుట.

సారకాయకోఁతలు. వా. వి. అబద్ధములు కల్పిం

సారగు. దే. వి. 1. మూర్ఛ: చూ, సొమ్మ; అ. క్రి. 2. లీనమగు. లక్ష్మీ. 2, ఆ. 75.

సారదోఁకి. దే. వి. దురాచారుఁడు: చూ, వ్యాధుఁడు. 2.

సారపు. దే. విశే. బక్కటల్లినది. ఉ, రా. 5, ఆ. 100: ఊపరము, ఎముకలవట్టి, గిటగిటన, బకేడా, బక్క, బడుగు-బడువు, వక్కు. (సం) కృశము, శాతము.

సారము. వై. వి =స్వర. 1. కంఠధ్వని: చూ, స్వరము. 2; 2. షడ్జాది: చూ, స్వరము. 2

సారి. వై. వి.=సురంగా: చూ, సారంగ (చూ, రంధ్రము. 1.)

సారిది. దే. వి. 1. వరుస: చూ, శ్రేణి. 1; 2 రీతి: చూ, విధము. 1; 3: చూ, అనుక్రమణిక

సారియ. వై. వి.=సురంగా: చూ, సారంగ (చూ, రంధ్రము. 1.)

సారుగాకు. వా. వి. ఎండాకు, చొక్కాకు చొరుగు-చొరువు-సొగుసు. (సం) శుష్కపత్రము. (చూ, పర్ణము. 1-౧.) తద్వి.— ఆకునకు.—(సం) బర్హము: చూ, పర్ణము. 1

తము, పాళింపు, మాసరము, వ్యాయతము. తద్వి.--మిక్కిలి పొడవైనది. (సం) సముచ్ఛ్రితము. [అని కొందఱు)

సోజెరు. వా. వి: చూ, సైనికుఁడు. (సోల్జరు

సోటిక. వా. వి. న్యాయము: చూ, సత్యము. 1.

సోడా. వా. వి. ఒకరకము ఉప్పు: చూ, సౌవర్చలము (లవణము—1.) [సోడావాటరు.

సోడానీరు. వా. వి. ఒకరకము త్రాగెడినీరు.

సోడావాటరు. వా. వి. —పై.—[కాణము.

సోడాషాపు. వా. వి. సోడానీరు అమ్మెడు దు

సోడు. దే. వి: రూ—చోడు, ఉచ్చి, అవుదల—జౌదల, నడినెత్తి, నడుగుంట, నుచ్చెవ, మాడపట్టు. (సం) బ్రహ్మరంధ్రము: (చూ, శిరము. 1.)

సోడుముట్టు. దే. స. క్రి. అంతట వ్యాపించు. అం, భా. తృ. 133: చూ, వ్యాపించు.

సోఢ. సం. విశే. 1. ఓపువాఁడు: చూ, సమర్థుఁడు; 2. ఓర్పరి: చూ, సహనుఁడు.

సోఢము. సం. విశే. 1. ఓర్వఁబడినది. (అపరాధములోనగునది): చూ, సహనము. 2.

సోణము. దే. వి. నాసామూలము.

సోత్ప్రాసము. సం. వి. అ. న. 1: ఎత్తిపొడుపు, దెప్పు-దెప్పుడు; 2. పరిహాసమాటలోఁగూడినమాట: ఆచ్ఛురితకము, సోల్లుంఠనము: చూ, హాస్యము. 1.

సోద. దే. వి: కంకరి, కళాసగందపడి, బెందడి, కేసొద, తెవ్వము. (సం) లేపము. (చూ, సమాలంభము. 1.)

సోదకులు. అం: చూ, జ్ఞాతులు.

సోదన. వై. వి.—శోధనా. 1. గాలింపు: చూ, శోధనము; 2. శకునార్థము రామాయణము మొదలైన గ్రంథములయందు దారమువేసి శోధించుట. [చూ, సహోదరి.

సోదరి. సం. వి. ఈ. స్త్రీ. తోడఁబుట్టినది:

సోదరుఁడు. సం. వి. అ. పుం. 1. తోడఁబుట్టినవాఁడు: చూ, సహోదరుఁడు; అం. 2: చూ, స్త్రీగతకులు.

సోదర్యుఁడు. సం. వి. అ. పుం.—పై.—

సోదా. వా. వి. వెదుకుట (సెర్చి). శోధన.

సోదించు. వై. స. క్రి. శోధనచేయు: ఉండఁజూచు, ఒరయు, జల్లించు. (సం) పరీక్షించు, పరిశీలించు, శోధించు. (చూ, విమర్శించు. 1.)

సోదికత్తియ. వై. వి: రూ—సోదెకత్తియ—సోదెకత్తె, ఎఱికెత-ఎఱుకత, ఎఱుకసాని, కొరవంజి, జోగిణి, పట్రిది, వేలుపుసాని—వేల్పులసాని(వేల్పుసాని). (సం) ఈక్షణిక, దైవజ్ఞ, యోగిని, విప్రశ్నిక: (చూ, స్త్రీ.)

సోదియ. వై. వి.—చోద్యమ్. రాగల మేలు కీడులనుగూర్చి చేయు ప్రశ్న: రూ—సోద, ఎఱుక, గద్దియ-గద్దె, తల, రంగము, సవాలు. (సం). స్మృతి.

సోదు. వై. వి.—పై.—ప్రభా. 5, ఆ. 120.

సోదెకత్తె. వై. వి: చూ, రూ—సోదెకత్తియ.

సోదెము. వై. వి.—చోద్య. రూ—సోద్దెము. 1. ఆశ్చర్యము, చిత్రము: చూ, వింత. 1; విశే. 2. ఆశ్చర్యకరమైనది, చిత్రమైనది: చూ, వింత. 1.

సోద్దెము. వై. వి, విశే.—పై.—

సోధ్రికము. సం. వి. అ. పుం: (తె) బిళ్ల. *

సోన దే. వి. 1. వర్షము, వృష్టి: చూ, వాన. 1; తద్వి.—అల్పధారావర్షమునకు.—సూచిసుకు: చూ, వాన. 1; 2. అల్పవర్షము: చూ, వాన. 1.

సోనంగి. దే. వి. రూ—దోనంగి. శునకజాతి: చూ, శునకము. 1. [తిర్య. 8.

సోనబల్లి. వా. వి: చూ, సాలెపురుగు. సాంబ.

సోన్మత్తుఁడు. సం. విశే. మత్తెక్కి మేనెఱుఁగనివాఁడు: రూ—సోన్మాదుఁడు.

సోన్మాదుఁడు. సం. విశే.—పై.—

సోపనము. వై. వి.—సోపానమ్: చూ, సోపానము.

సోపప్లవుఁడు. సం. వి. అ. పుం. రాహువుచేత పట్టఁబడిన వాఁడు (చంద్రుఁడు లేక సూర్యుఁడు.)(చూ, గ్రహణము.)

సోపానము. సం. వి. అ. న.=సోపనము. రూ-సోపాసనము, ఆరోహణము, పట్టభంగము. (తె) చీడి, తంతియు-తంతె, తావ, తావరము, తుతె, పడికట్టు, పావంచే, పావటి, మెటిక-మెటికె-మెట్టిక-మెట్టు, మేలుకట్టు, సరకట్టు, సోపనము. (ఇవి అన్నియు వీణ మెట్టునందును వర్తించేను.)

సోపు. వై. వి.=సోఫ. పాడ, వాపు, రూ-సోబు, సోబియు-సోబె: చూ, శోఫ.

సోపుదారికేక. వా. వి. జాగ్రత్త కొఱకు వేయు కేక.

సోపుదారివాఁడు. వా. వి. జాగ్రత్త కొఱకు కావలియుండు వాఁడు.

సోబ. వై. వి.=శోఫ: చూ, శోఫ.

సోబతు. వా. వి. తోడుగానుండుట: చూ, సహవాసము. 1. (స్తోబతు అనియు)

సోబనము. వై. వి.=శోభన. మంగళము: చూ, శుభము. 1.

సోబాన. వై. వి.=శోభన. శోభనకాలపు పెండ్లిపాట.

సోబియ. వై. వి.=శోఫ. రూ-సోబె: చూ, శోఫ.

సోబు. వై. వి.=— పై.—

సోబె. వై. వి.=— పై.—

సోబెవాఁడు. వా. వి: చూ, సిధ్మలుఁడు.

సోమ. వై. వి.=శ్రమ. 1: చూ, శ్రమము. 1; 2.=స్తోమ. పరాక్రమము: చూ, శౌర్యము.

సోమకర్కటి. సం. వి. ఈ. స్త్రీ: (తె) కరచ్చే, కరబూజా-కర్బూజా. (తెలపనిచ్చెదు ఒకానొక దోస.)

సోమగర్భుఁడు. సం. వి. అ. పుం: చూ, విష్ణువు. 1.

సోమజుఁడు. సం. వి. అ. పుం. బుధుఁడు: చూ, రాహువు. 2.

సోమధార. సం. వి. అ. స్త్రీ. ఆకాశగంగ: చూ, పాద్రిదిని. 2. (నది). [గ్రంథములు.

సోమనాథీయము. అం: చూ, భరతశాస్త్ర

సోమపానము. సం. వి. అ. న. పుల్లతీఁగెరసము పిండుట: అభిషవము, నిషేవణము, సవనము, సుత్యా.

సోమపీతి. సం. వి. న్. పుం. (రూ-సోమపీథి-సోమపీవి.) యజ్ఞమునందు సోమపానము చేయువాఁడు: చూ, సోమయాజి.

సోమపీథి. సం. వి. న్. పుం.— పై.—

సోమపీవి. సం. వి. న్. పుం.— పై —

సోమపుఁడు. సం. వి. అ. పుం.— పై.—

సోమము. సం. వి. అ. పుం. 1. తిప్పతీఁగ*: చూ, సోమవల్లి; 2. జలము: చూ, సలిలము; 3. కర్పూరము: చూ, సిరము; 4. దినము యొక్క పదునొకండవ భాగము: చూ, వాసరము (దినభాగములు); అం. 5: చూ, తానములు (రి-హీనతానములు); 6: చూ, తానములు (గహీనతానములు); వై. వి. (1)=స్తోమ: చూ, సోమ. 2.

సోమయజ్ఞములు. అం: (చూ, యజ్ఞము, చూ, మహాయజ్ఞములు) అగ్నిష్టోమము, అత్యగ్నిష్టోమము, అతిరాత్రము, అప్తోర్యామము, వాజపేయము (5).

సోమయాజి. సం. వి. న్. పుం. 1.=సోమాసి. యజ్ఞము చేసినవాఁడు: ధర్ముఁడు, యజ్వ, సోమపీతి-సోమపీథి-సోమపీవి. (తె) సోమాసి; 2: చూ, సురాజీవి; అం. 3: చూ, మూర్తులు.

సోమరాజము. సం. వి. అ. పుం: చూ, సోమరాజి*.

సోమరాజి. సం. వి. ఈ. స్త్రీ. కారుగచ్చే*: అవల్గుజము, కాంతిద, కాలమేషి, కుష్ఠనాశిని, కృష్ణ, కృష్ణఫల, కృష్ణఫలి, క్రిమిఘ్ని, చంద్రరేఖ, చేలువు, పూతిఫలి (పూతీఫలి), వాకూచి-వాకోచి- వాగుజి- వ్యాకోచి, శ్యామ, సువల్లి, రూ-సోమరాజము-సోమ

రాజిక, సోమవల్లిక. (తె) కలుఁగచ్చె, కారుగచ్చె, క్రాలుఁగచ్చె-క్రోలుఁగచ్చె, బావంజి. తద్వి.— ౧. గచ్చకు:— కాలపత్రి, "కళింగద్రుకర, యక్షాక్షి*, వసంతదూతి (తె) గచ్చె-గెచ్చె-గ్రచ్చె; ౨ గచ్చకాయకు.—(తె) బత్తిక.

సోమరాజిక. సం. వి. ఆ. స్త్రీ.—వై.*—

సోమరి. ద్వ. విశే. (సోము + అరి): అలుచె, చెండి, చెండిపోతు, డిమ్మరి-దిమ్మరి-దిమ్మరీఁడు, తొండు, తొండొరు, దుండుబలి, నచ్చుకాఁడు, నలితిండికాఁడు, బద్దుగుఁడు, బద్యుఁడు, మత్తుఁడు, మదట, మదల, మస్తువాఁడు, మాలగఁబోతు-మాలుగఁబోతు, మెదుక, సుమాళి. (సం) అనుష్ణుఁడు, అలసము, అలసుఁడు, ఆలస్యుఁడు, కుంఠుఁడు. కుఠుఁడు, ఖపురుఁడు, జాల్మి, తుందపరిమృజుఁడు, ధీహారుఁడు, మందుఁడు, శీతకుఁడు, శౌండుఁడు, స్వైరుఁడు. తద్వి.— కల్లుత్రాగుటలోనగువానిచే మత్తిల్లినవాఁడు.— ఉత్కటుఁడు, ఉన్మనుఁడు, ప్రమత్తుఁడు, మత్తుఁడు, మృదువు. (తె) తాగుఁబోతు-త్రాగుఁబోతు, పాయి, లొట్టిముచ్చు.

సోమరితనము. ద్వ. విశే: చూ, విలంబము. 1.

సోమలత. సం. వి. ఆ. స్త్రీ.=సోమిద*: అస్పృళ, ఇందులేఖ, గుల్మవల్లి, గోధావని. (తె) పుల్లతీఁగ.

సోమవల్కము. సం. వి. అ. పుం.=సోని. 1: చూ, వెలిచెండ్రు*; 2. తేఁకు*: చూ, మాంజిక. [చెండ్రు.*.

సోమవల్కలము. సం. వి. అ. పుం: చూ, వెలి

సోమవల్లరి. సం. వి. ఈ. స్త్రీ. 1.=సోమిద. బ్రాహ్మి *: చూ, సోమిదకూర; 2. పొన్నగంటి*: చూ, శీతసారము.

సోమవల్లి. సం. వి. ఈ. స్త్రీ.=సోమిద. తిప్పతీఁగ*: అనంత, అమర, అమృత, అమృతలత, ఇందులేఖ, కందసుదూచి, కాంజిక, కాంచజాత-కుండలి. కుల్య, క్షుదరిజీర. గుడచి-గుడుచి-గుడూచి, గులూచి-గుళూచి, చంద్రిక, చక్రలక్షణ, ఛిన్న, ఛిన్నరుహా, జీవంతి-జీవంతిక, తంత్రి-తంత్రిక, దేవనిర్మిత, నిర్జర, మధుక, మధుపర్ణి, వత్సాదని, వయస్థ, విశల్య, వృషాకపాయి. (తె) తిప్పతీఁగ-తిప్పతీఁగె, సోమిద.

సోమవల్లిక. సం. వి. ఆ. స్త్రీ: కారుగచ్చె: చూ, సోమరాజి.

సోమవారము. సం. వి. అ. పుం. ఇందువారము: చూ, వారములు. [చూ, విష్ణువు. 1.

సోమసింధువు. సం. వి. ఉ. పుం. వెన్నుఁడు:

సోమసూత్రము. సం వి. అ. న. 1. పానవట్టమునుండి నీళ్లుపోవుదారి; 2. సోమసూత్రమువంటి ముఖభాగముగలిగిన ఒకానొకలోహపాత్రము: చూ, హరివాణము(పాత్రము.6.)

సోమాలమ్మ. వై. వి.=శ్యామలాంబ: చూ, మహాలక్ష్మి. 3. తద్వి:- శివశక్తి.

సోమాసి. వై. వి.=సోమయాజి: చూ, సోమయాజి.

సోమాసిపెట్టుఁగొట్టు. ద్వ. వి. ఇంద్రుఁడు: చూ, సహస్రాక్షుఁడు.

సోమాస్త్రము. అం: చూ, అస్త్రములు.

సోమించు. వై. అ. క్రి. 1: చూ, వ్యాపించు; 2: చూ, విజృంభించు; 3. పరాక్రమించు; 4=సమ. రూ—సామించు. ఉద్దించు: చూ, సరిపోలు. [కూర.

సోమిందు. వై. వి. బ్రాహ్మి*: చూ, సోమిద

సోమిద. వై. వి. తిప్పతీఁగ*: చూ, సోమవల్లి.

సోమిదమ. వై. వి. సోమయాజిభార్య: రూ—సోమిదమ్మ-సోమిసాని— సోమెసాని, ఒజ్జెసాని. (ఆంధ్ర. పదా. పర. 11.)

సోమిదము. దే. వి. బ్రిమ్మి*: చూ, సోమిద.

సోమిదమ్మ. వై. వి: చూ, రూ-సోమిదమ.

సోమిసాని. వై. వి. (సోమిద + సాని)-వై.-

సోము. వై. వి. 1.=సుఖము. సంతోషము: చూ,

హ్లాదనము; విణ. 2. ఆసక్తము: చూ, వాంఛ.

సోముడు. సం. వి. అ. పుం. 1. చంద్రుడు: చూ, హిమాంశువు; 2: చూ, శివుడు; 3: చూ, శ్రీరాముడు; 4: చూ, వాయువు; 5. పితృదేవత; 6: చూ, వానరము; అం. 7: చూ, వసువులు; 8: చూ, రుద్రులు.

సోమెన. వై. వి. సోమెదకూర*: చొక్కనా. బ్రిమ్మి, రూ—సోమింద, సోమినము, సోమిద (సం):—అన్నప, అపరాజిత, అపసపర్ణి, కపోతబంక, కపోతవేగ, జయ, జయంతిక, బ్రాహ్మి, మత్స్యాక్షి, వయస్థ, వాతకము, వాతకి, శణపర్ణి, శీతల—శీతలము, సత్యవతి, సోమవల్లరి.

సోమెదకూర. వా. వి.—పై.—

సోమెపాని. వై. వి: చూ, రూ—సోమిసాని.

సోమేశ్వరుడు. అం: చూ, శాస్త్రప్రవర్తకులు.

సోమోద్భవ. సం. వి. అ. స్త్రీ. నర్మదానది: చూ, నది.

సోయగము. దే. వి. 1. అందము: చూ, సౌందర్యము; 2. కాంతి: చూ, వెలుతురు. 1.

సోరంగి. దే. వి. ఒకానొక చేప: చూ, మత్స్యము. 1. తద్వి.—౧. మొట్టచేపకు.—మొట్ట; ౨. తంకునాగమునకు.—(సం) వరుణపాశము; 3. ఆడుఎట్టకు—(సం) శిలి; 4: (సం) సంకోచము. (చూ, మత్స్యము. 1.)

సోరణ. దే. వి: సోరణగండి— సోరణగండె— సోర్ణగండి, రూ—సోరణము. చిన్నకిటికీ (అనికొందఱు): చూ, వాతాయనము. 1.

సోరణగండి. దే. వి.—పై.—ఉ, రా. 6, ఆ.

సోరణగండె. దే. వి.—పై.—

సోరణము. దే. వి.—పై.—(య. 1, ఆ. 97.)

సోరి. వా. వి. రూ—సోరిది: చూ, శ్రేణి. 1.

సోరు. దే. వి. సురువు: చూ, లవణము. 1.

సోర్ణగండి. దే. వి: చూ, రూ—సోరణగండి, భార. ఉద్యో. 3, అ.

సోల. దే. వి పదునాలుగుసబ్బులయెత్తు వస్తువు వట్టెడు ఒకానొకమానము, ఇరువది తులముల యెత్తు వస్తువుపట్టెడు ఒకానొకమానము, ¼ శేరు: (సం) నికుంచకము.

సోలపద్మకము. అం. (సోలపల్లవము, అళిపద్మకము): చూ, అసంయుక్త హస్తములు.

సోలపల్లవము. అం.—పై.—

సోలము. దే. వి. 1. మత్తు. విగ్ర. 8, ఆ. 80 చూ, మోమిక; 2. చొక్కు. ఆక్కి. 2, అ విక్రి. 1, అ: చూ, విస్మృతి.

సోలింత. దే. వి. వివశత్వముకొందివాట్లుట.

సోలు. దే. అ. క్రి. వివశత్వముకొందివాట్లు చెనయు, మ్రింగు, మ్రొగ్గు, ఊగు, (మ లుదెంచే, వాడివాట్లు. [సము. 2

సోల్లుంఠనము. సం. వి. అ. న: చూ, సోత్ప్రా

సోల్లుక. అం: చూ, ఆనద్ధవాద్యములు.

సోళ్లాందొప్పి. దే. వి. ఒకరకముజోనము: రూ. సోళ్లాందొప్పి—సోళ్లానొప్పి: చూ, వక్షోహారము. 4.

సోళ్లానొప్పి. దే. వి.—పై.—(అనికొందఱు.

సోళ్లాదొప్పి. దే. వి.—పై.—

సోళు. దే. వి: చూ, శూన్యము. అం, భా. తృ. 15

## సౌ

సౌందర్యము. సం. వి. అ. న. 1 అందము. వేకనదనము. (చూ, హృద్యము): ఉజ్జ్వలము కర్కము, కలింగము, కాంతము, కోమలచారిమము, పల్లవము, రూపము, లక్ష్మీపత్రువు, పర్వము, వర్ణము, వర్ణి, వర్ష్మము, శృంగారము, సౌరభ్యము. (తె) అంగము అంగు, అందగింపు, అందము, అచ్చు, అమము, అమరిక, ఆహ్లాదనము, అవ్వను—జొన హావును—హాను, అసకము, ఇంపు—ఇంపు ఇమ్ము, ఉమటు. ఎమ్మె, ఒసపము, ఒత

ఒప్పిదము, ఒప్పు, ఒయారము-ఒయ్యార
ము-ఓయారము, ఒఱపు, కయిపు-కైపు,
కలికి, కుదిరిక-కుదురు, కొమరు, కోపు,
కోమలికము, గరగరిక, చెందు, చెక్కు,
చెక్కఁదనము, చెక్కన, చెన్ను, చెలువము-
చెలువు, చొక్కము, జిగ్గు, జోను-జోనుపు,
జోక, తేప, తీరు, తెలుఁగు, తోరము, త్రె
వ్వన, దుస్తు, నసుపు, నయ-నయము, నలు
పు, నవరు, నెయ్యమి-నెయ్యము, నెఱి, పసందు,
పసను, పాటి, పాటింపు, పూవు, పొంకము,
పొవరు, పొలుపు, ప్రోఁడి-ప్రోడి, ప్రోఁడిమి-
ప్రోడిమి, ప్రిన్నఁదనము, బాగు, బెళఁగు,
ముద్దు, మురువు-మురివ్వు, మేలు, రకము,
రమణ-రవణ, రహి, రాణ, రువాణము,
రూపు, వన్నియ-వన్నె, వలను, వాసి, విం
గడము, సంపె, సవరన, సవురు-సౌరు, ససి,
సింగారము, సిస్తు, సొంపు, సొగసు, సొబ
గు, సోయగము, హంగు, హవణ, హవణిం
పు. తద్వి.—౧. కామరూపము; ౨. (విణ)
ప్రియమైనది:— (చూ, ముద్దు 5);
3. (విణ) అందమైనది:—(చూ, హృద్యము);
2 సౌందర్యమునకు ఉపమానములు.—నల
కూబరుఁడు, జయంతుఁడు, వసంతుఁడు, చం
ద్రుఁడు, నలుఁడు; అం. 3: చూ, శిరః
క్రియలు; 4: చూ, మదములు.

సౌందర్యవంతుఁడు. సం. విణ: అనుపముఁడు,
ఆకారవంతుఁడు, కంతుఁడు, కమనుఁడు,
కాంతుఁడు-కామనుఁడు, బృందారకుఁడు,
మనోజ్ఞుఁడు, రమణుఁడు, రూపవంతుఁడు
లక్ష్మీవంతుఁడు, శృంగారి, సాధువు, సుంద
రుఁడు, సుభగుఁడు. (తె. వ) అందగాఁడు,
అప్పనుకాఁడు— ఓపనుకాఁడు-హొవునుకాఁ
డు-హొనుకాఁడు, ఇంపైనవాఁడు, ఎమ్మె
కాఁడు, ఒయారికాఁడు-ఒయ్యారికాఁడు,
ఒంపరి, ఒపరి, గుమ్మఁడు, గలిబికాఁడు, గొన
బుకాఁడు, గోటుకాఁడు, చిగిలికాఁడు, చి
న్నెలాఁడు, చూడగలవాఁడు, చోపరి,
చెన్నుఁడు, చెలువుఁడు, చేందురుఁడు, జిగి
లికాఁడు, నీటుకాఁడు, ప్రిన్ననివాఁడు,
బాగరి, మానైనవాఁడు, ముద్దులాఁడు, రూ
పరి, రూపసి, లాడువాఁడు, వగకాఁడు,
వగలాఁడు, వన్నెకాఁడు, వన్నెలాఁడు,
సూటికాఁడు, సొగసుకాఁడు, సొబగుఁడు.
తద్వి.—౧. అభిరూపుఁడు, ప్రాప్తరూపుఁ
డు, సురూపుఁడు; ౨. సర్వాంగ సుందరు
నకు.—సింహసంహననుఁడు.

సౌందర్యవతి. సం. వి. ఈ. స్త్రీ: అంగన, కో
మల, చక్షుష్య, రూపరి—రూపసి, విలాసిని.
(తె). అంచ(ఁగ)కత్తియు-అంద(ఁగ)కత్తె, ఎమ్మె
లాఁడి, ఒయారి-ఒయ్యారి-ఓయారి, ఒయారి
కత్తె-ఒయ్యారికత్తె, ఒఱపులాఁడి, కలికి-కల్కి,
కొమరాలు, చిన్నెలాఁడి, బయారి, బిటా
రి-మిటారి, రూపరి, రూపసి, వగకత్తె,
వగలాఁడి, వన్నెకత్తియు-వన్నెకత్తె, వన్నె
లాఁడి, సొగసుకత్తె. (చూ, స్త్రీ.)

సౌందర్యోత్పాదనము. అం: చూ, భేదత్రయము.

సౌకర్యము. సం. వి. అ. న. 1: (రూ-సుకర
ము) మిక్కిలిచేలుకన, సుసాధ్యము:
చూ, సులభము. తద్వి.—౧. సులువునకు.—
సౌకర్యము: చూ, సులభము; 2. సుకరభావము.

సౌకుమార్యము. సం. వి. అ. న. 1. సుకుమార
త్వము: చూ, సుకుమారము. 2; అం. 3: చూ,
గుణములు; 3: చూ, గుణములు; 4: చూ,
కావ్యగుణములు.

సౌక్ష్మ్యము. అం: చూ, గుణములు.

సౌఖశాయనికుఁడు. సం. వి. అ. పుం. 1. రాజు
లను నిద్రమేలుకొలుపువాఁడు; విణ. 2.
సుఖనిద్రయా యని ప్రశ్న చేయువాఁడు.

సౌఖ్యము. సం. వి. అ. న. 1. సుఖము, సహ్య

ము: చూ, హ్లాదనము; 2. ఆనందము, సంతోషము: చూ, హ్లాదనము.

సౌగంధికము. సం. వి. అ. న. 1. చెంగలువ*: చూ, సహస్రపత్రము; 2. కామంచి: చూ, తృణము. 1; పుం. 3. పద్మరాగము, మాణిక్యము. (ఇది ఆంధ్రమునందుఁ బుట్టినది. అశోకపుచిగురు డాలుగలది. మధ్యమజాతిరత్నము.): చూ, రత్నములు; 4 గంధకము-గంధికము, గంధము. (తె) గంధకము. [పుల వర్తకుఁడు.

సౌగంధికుఁడు. సం. వి. అ. పుం. సుగంధవస్తు

సౌగంధ్యము. సం. వి. అ. న: చూ, వాసన. 1. తద్వి—ం: (చూ, రాజార్హము. 1.); ౨. కంకుష్ఠము వెడు గ్రంధ్యము.—వరవర్ణి; ౩. గోరోజనమునకు.—వరవర్ణిని, వైదేహి; ౪. బుద్ధికి.—వసువు; ౫ జవాదికి.—సాంకవము (రాజార్హము. 2—౧౪; ౪3—(౧).); ౬: చూ, హింగుళము.

సౌచికము. సం వి. అ. పుం. కూర్చిక, తున్నవాయము. (తె) అతుకు-అదుకు.

సౌచికుఁడు. సం. వి. అ. పుం. కుట్టుపని చేయువాఁడు: కూర్చకుఁడు-కూర్పకుఁడు, తున్నవాయుఁడు, వస్త్రభేదకుఁడు. (తె) కుట్రపువాఁడు, దరిజీ-దర్జి, దర్జివాఁడు, చిప్పిచిప్పవాఁడు.

సౌజన్యము. సం. వి. అ. న సుజనత్వము (మంచితనము చేయుటకు.—చూ, సామము. 3.)

సౌత్రామణి. అం: చూ, తానములు (నిహీన తానములు.)

సౌత్రామణేష్టి. అం: చూ, హవిర్యజ్ఞములు.

సౌదాగరు. వా. వి. 1. గుఱ్ఱముల బేరగాఁడు; 2. వర్తకుఁడు: చూ, సార్థవాహుఁడు.

సౌదామని. సం. వి. ఈ. స్త్రీ. చూ-సౌదామిని-సౌదామ్ని: 1. ఒకఅప్సరస్త్రీ: చూ, స్త్రీ; 2. మెఱుపు: చూ, విద్యుత్తు; 3. ఒకానొకమెఱుపు: చూ, విద్యుత్తు.

సౌదామిని. సం వి. ఈ. స్త్రీ: చూ, సౌదామని.

సౌదామ్ని. సం. వి. ఈ. స్త్రీ.—వై.—

సౌదాయికము. సం. వి. అ. న. తల్లిదండ్రులచేత నేనియు అన్నదమ్ములచేత నేనియు నియ్యఁబడు స్త్రీధనము: చూ, హిరణ్యము.

సౌదాసుఁడు. సం. వి. అ. పుం. కల్మాషపాదుఁడు: చూ, రాజు. 1.

సౌధము. సం. వి. అ. పుం, న. నగరు, రాజగృహము, మేడ: చూ, సదనము. 1.

సౌధసోపానన్యాయము. అం. చీడీలన్నియు నెక్కకుండ నొక్కసారి మేడ యెక్కుట కష్టమనురీతి. [కలి: చూ, కోకలి.

సౌనందము. సం. వి. అ. పుం. బలరాముని రోఁ

సౌనంది. సం వి. న్. పుం. బలరాముఁడు: చూ, హలాయుధుఁడు.

సౌనికుఁడు. సం. వి. అ. పుం. మృగపక్ష్యాదులను జంపి విక్రయించి జీవించువాఁడు.

సౌపానము. సం. వి. అ. న: చూ, సూ-సోపానము. (వాడుక)

సౌప్తికము. సం. వి. అ. న. 1. నిద్రించుచోటలో నగు సమయములందు శత్రువుల పైఁబడి చంపుట: అవస్కంధము. (తె) మూచ్చిలిపోటు: చూ, హింస. 1; అం. 2: చూ, పర్వములు.

సౌభాగినేయి. సం. వి. ఈ. స్త్రీ. భాగ్యవతి కూఁతురు: చూ, సూన. 1—౮౪.

సౌభాగినేయుఁడు. సం. వి. అ. పుం. భాగ్యవతికొడుకు: చూ, సూనుఁడు. 1—౫౭.

సౌభాగ్యకృత్తు. అం: చూ, తానములు (సర్వ తానములు.)

సౌభాగ్యము. సం. వి. అ. న. 1. సుభగత్వము, పతాక: చూ, శుభము. 1—౫; 2: చూ, వెలిగారము, అం. 3: చూ, యోగములు.

సౌభాగ్యవతి. సం. వి. ఈ. స్త్రీ. భాగ్యశాలిని, శ్రీమతి, పేరంటి: చూ, స్త్రీ.

సౌభికుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రజాలికుఁడు: చూ, వ్యాళిగ్రాహి. [బుట్టుఁదనము.
సౌభ్రాత్రము. సం. వి. అ. న. మంచితోఁ
సౌమనస్యము. సం. వి. అ. న. 1. సుమనోభావము; 2. శ్రాద్ధమునందు పిండదానానంతరము బ్రాహ్మణ హస్తమునందిచ్చెడు పుష్పదానమంత్రము; అం. 3: చూ, అస్త్రములు.
సౌమిత్రి. సం. వి. ఇ. పుం. లక్ష్మణుఁడు, రామానుజుఁడు. (తె) లక్కుమనుఁడు-లక్కుమన్నుఁడు-లక్కుమయుఁడు, లచ్చనుఁడు-లచ్చుమఁడు, హూన్నచోయగలాఁడు.
సౌమ్య. సం. వి. ఆ. స్త్రీ. 1. ముయ్యాకుపొన్న*: చూ, సాలపర్ణి; అం. 2: చూ, సంవత్సరములు. [హ్మణము.
సౌమ్యకాండము. అం: చూ, తైత్తిరీయబ్రా
సౌమ్యత. సం. వి. ఆ. వ. (తె) తిన్నన, మయివడి-మెయివడి-మైవడి.
సౌమ్యము. సం. విణ. (తె) తిన్న, సవరణ-సవరణము.
సౌమ్యాంశము. అం. 1: చూ, షష్ట్యంశములు; అం. 2. కర్మములు; 3: చూ, ఉత్తానకరణబంధములు; 4: చూ, ఖండములు.
సౌమ్యుఁడు. సం. వి. అ. పుం. 1. బుధగ్రహము, రౌహిణేయుఁడు, బుధుఁడు: చూ, రాహువు, 2; విణ. 2. తిన్ననివాఁడు; 3. ఒప్పినవాఁడు; 4. సోముఁడు దేవతగాఁ గలవాఁడు.
సౌరభము. సం. వి. అ. న. 1. ఆమోదము: చూ, వాసన. 1; 2. కుంకుమపువ్వు: చూ, వహ్నిశిఖము. 1; 3. బోళము: గంధరసము, గాంధారము, గోపము, గోలము-గోళము, గోపము, జాతీరసము-జాతీరసము, పిండము, ప్రాణము, బోలము, రసగంధము, రసము, రసాలము, శశము. (తె) బాలెంత బోలు-బాలెంతబోలు- బాలెంతబోళము, బోళము; పుం. 4. ఎద్దు: చూ, వృషభము. 1; అం. 5: చూ, తానములు (సర్వతానములు.)
సౌరభేయము. సం. వి. అ. పుం. బలీవర్దము, ఎద్దు: చూ, వృషభము. 1.
సౌరభేయి. సం. వి. ఈ. స్త్రీ. ఆవు: చూ, ధేనువు. తద్వి.—౧. ఆవునకు.—పయస్విని, పావని, మాత, వసువు (ధేనువు); ౨. కామధేనువునకు.—సుగవి, సుగవి; ౩. సులభముగాఁ బిదుకఁదగిన యావునకు.—సువ్రత; ౪. సాధువైన గోమహిష్యాదికము.—(తె) సాదు; ౫. ఆవునకుఁ బుట్టినదూడకు.—రౌహిణేయము. (తె) లేగ; ౬. ఏఁటేఁట ఈనెడియావునకు.—సమాంసమీన; ౭. అకాలమునఁ బిదుక నిచ్చెడి యావునకు:—సంధిని; ౮. వంకరకొమ్ములఆవునకు.—వక్రశృంగి; ౯. ఆవుదూడల గుంపునకు.—వాత్సకము; ౧౦. ఆవులమందకు.—పష్ణుకదము, వ్రజము. (తె) మంద; ౧౧. చూలుపడిన వెనుక ఆఁబోతుపై కొనుటచే యీచుకపోయిన యావునకు:—వేహత్తు; ౧౨. పాగచూలుగల ఆవునకు.—(తె) మైలావు (ధేనువు. ౨౮); ౧౩ తొలుచూలావునకు.—పలిక్ని, ప్రష్ఠౌహి-ప్రష్ఠౌహి. (తె) నిరుడిమానియావు, పడ్డ, పెయ్యపు; ౧౪. సమృద్ధిగ పాలిచ్చే యావునకు.—నైచికి (తె) పాడియావు, పాలావు, మజ్జిరి; ౧౫. పెక్కుఈఁతలీనిన యావునకు.—పరేష్టుక, బహుసూత; ౧౬. గోమహిషజాతికి.—పసులము, పాదబంధనము; ౧౭. పెద్దపొదుగుగలయావునకు:—పీనోధ్ని, పీవరస్తని; ౧౮. ఆవులమందమందున్నచోటునకు.—(తె) పెంట-పెంటె; ౧౯. (ఈనఁబోవు సమయమున) పొదుగుచేసిన యావునకు.—ప్రస్తుతి; ౨౦. పసులదొడ్డికి.—(తె) పెఁటకట్టు: చూ, (సదనము. 1); ౨౧. పాలువిడిచిన యావుదూడ

వు.—(తె) పెయ్య. పెయ; ౨౨. చిన్నచిన్న మచ్చలుగల యావునకు.—(తె) పొడలావు; ౨౩. తెల్లమచ్చలయావునకు.-(తె)బట్టా(ట్టా)వు; ౨౪. కపిలగోవునకు — బభ్రువు; ౨౫. తఱపిదూడకు- బష్కయము; ౨౬. ఆవు పాడుగునకు — బాణము; ౨౭. తఱపియావునకు.—(తె) బుఱ్ఱి; ౨౮. దూడచేచ్చి పాలిచ్చెడు ధేన్వాదికములకు.—(తె) మల వ; ౨౯. ఆవుయొక్క శిరఃప్రదేశమునకు.- నైచికము.

సౌరభ్యము. సం. వి. అ. న. 1. చూ, వాసన.1. తద్వి — చందనమునకు-శీతలము; 2. ఒప్పిదము: చూ, సౌందర్యము; 3. గుణగౌరవము: చూ, సన్మానము.

సౌరమానాబ్దము. అం. సూర్యుఁడొక రాశియందు సంచరించుకాలము సౌరమాసము. ఇట్టి ౧౨. మాసములుగలది సౌరమానము. ఈ సౌరమానము శేషాచలమునకు (పెదతిరుపతి) దక్షిణ భాగమందు వాడఁబడుచున్నది. ఇది ౩౬౫ దినముల ౬ గంటలు గలది): చూ, మానములు

సౌరము. అం. 1. ఒకానొక మతము: చూ, మతములు; 2: చూ, ఉపపురాణములు; 3: చూ, అస్త్రములు.

సౌరసేని. అం: చూ, వ్యాకరణములు.

సౌరాష్ట్రమహామంత్రము. అం. సూర్యోపాసన మంత్రము: చూ, మంత్రము.

సౌరాష్ట్రపంచమి. అం: చూ, టక్కజభాషలు.

సౌరాష్ట్రము. సం. వి. అ. న. 1. కంచు: చూ, పసిడి (లోహము. 1. 3); పుం. 2. సౌరాష్ట్రదేశము: చూ, దేశములు; 3. సౌరాష్ట్రమనెడి రాగము: చూ, స్వరము. 2, అం. 4: చూ, భూర్జన్యపాంగములు.

సౌరాష్ట్రి. సం. వి. ఈ. స్త్రీ. కరవీరకఅను పద్యము: చూ, సస్యము. 1

సౌరాష్ట్రికము. సం. వి. అ. పుం. 1. విషభేదము: చూ, సంగరము 6; విశే. 2. సౌరాష్ట్ర దేశసంబంధమైనది.

సౌరి. సం. వి. ఇ. పుం 1. రూ-సౌరుఁడు,శని: చూ, రాహువు. 2; 3.యముఁడు: చూ,హరి.5.

సౌరికుఁడు. సం. వి. అ. పుం. కల్లరి, కల్లమ్మువాఁడు: చూ, సుధాజీవి.

సౌరు. దే. వి. రూ సవురు. 1: చూ, వికము. 1; 2: చూ, సౌందర్యము. నీలా. 3, అ; 3: చూ, హృద్యము.

సౌవర్చలము. సం. వి. అ న సౌవర్చలవణము: చూ, లవణము. 1-4. తద్వి —౧. (తె) సోడా; 2. ఉప్పునకు — వాసిజము: 3. వంటయుప్పునకు —విడంగము; 4. ఇందుప్పునకు.—శీతశివము, శైలేయము, సితశివము.

సౌవర్చలవణము. సం. వి. అ. న.—పై.—

సౌవర్ణకరణి. సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, వృత్తము; 2: చూ, కరణులు.

సౌవిదల్లుఁడు. సం. వి అ. పుం. అంతఃపుర కావలివాఁడు: రూ-సౌవిదల్లుఁడు, అండీరుఁడు, అంతఃపురపాలకుఁడు, అధ్యక్షుఁడు-అధ్యక్షుఁడు, ఇజ్యుఁడు, ఉదుంబరుఁడు, కంచుకి, కక్ష్యావేక్షకుఁడు, కర్షధర్ముఁడు, క్లీబుఁడు- క్లీవుఁడు, గృక్షి, గోపతి, తుబరుఁడు-తూబరుఁడు, తృతీయప్రకృతి-తృతీయాప్రకృతి, ధర్షవరుఁడు, ధర్షుఁడు, నపుంసకుఁడు, షండుఁడు—పండుఁడు-శండుఁడు-సండుఁడు, మాహిష్యుఁడు, వర్షధరుఁడు, వర్షధర్షుఁడు, వర్షవరుఁడు, సౌవిదుఁడు, స్థపతి, స్థాపత్యుఁడు, పేడకుఁడు_పేడుఁడు. (తె :— అంగబోల-అంగబోలుఁడు, అన్నగశి_అన్నగలి-అన్నగుస, ఆడంగి, ఊబ, ఊబవాఁడు, ఎగ్గడి-ఎగ్గడీఁడు_హెగ్గడి- హెగ్గడికాఁడు- హెగ్గడీవాఁడు—

హెగ్గడీఁడు, కొజ్జ-కొజ్జా, దూబ, పంద, సన్నగండు, సానాసి. తద్వి.—౧. నపుంసకత్వమునకు.—అక్షతము, క్లీబము, నపుంసకము, షండము. (తె) కొజ్జ-కొజ్జా, పేడి; ౨. ప్రాయమున గడ్డము మీసము రానివానికి.— తుబరుఁడు - తూబరుఁడు, మత్కుణుఁడు; 3. అంతఃపుర కావలికత్తెకు:—ఎగ్గడికత్తె-హెగ్గడికత్తె, హెగ్గడి, వక్కారాలు. (చూ, స్త్రీ.)

సౌవిదుఁడు. సం. వి. అ. పుం.—పై.—

సౌవీరజభావలు. అం: సౌవీరి, వేగమధ్యము, సాధారణి, గాంధారి. (చూ, ఉపవిద్యలు 419 పుట.)

సౌవీరదేశస్త్రీ. సం. వి. ఈ. స్త్రీ. దేశస్త్రీలలో నొకతె: చూ, స్త్రీ.

సౌవీరభస్మము. అం: చూ, భస్మములు.

సౌవీరము. సం. వి. అ. న. 1. పులియఁబెట్టిన కడుగునీళ్లు: చూ, శుక్తము. 1; 2: అంజనము, అంజని, ఆఖుపాషాణము, ఇలిపాషాణము, ఏకవీరము, కపోతకము-కాపోతసారము, కాపోతము, కాపోతాంజనము, కృష్ణము, ఘుటి, ఘుటిని, దుగ్ధపాషాణము, నీలాంజనము, యామునము, యామునేయము, సౌవీరసారము, స్రోతోంజనము. (వి) ఉల్లిపాషాణము. (తె) కాటుకరాయి. తద్వి.—౧. గంధపాషాణమునకు.—గంధకము, గంధపాషాణము, గంధమాదనము, గంధమోదనము, గంధాశ్మము, గంధికము,(వి) గంధమాదనము; ౨. కర్పూరమణి; 3. రేఁగుపండు: చూ, రేఁగు. 1. (చూ, ఫలములు.); పుం. 4. సౌవీరదేశము: చూ, దేశములు. ౫౬.

సౌవీరసారము. సం. వి. అ. న. కపోతాంజనము: చూ, సౌవీరము. 2.

సౌవీరి. అం. 1: చూ, షూ-సౌవీరి; 2: చూ, మధ్యమగ్రామగత మూర్ఛనలు.

సౌశీల్యము. సం. వి. అ. న. సుశీలత్వము.

సౌష్ఠవము. సం. వి. అ. న. 1. సుష్ఠుభావము; 2. నాట్యాంగవిశేషము: చూ, నాటకము. 1-౧.

సౌహార్దము. సం. వి. అ. న. సుహృద్భావము, మైత్రి: చూ, స్నేహము. 1.

సౌహార్ద్యము. సం. వి. అ. న.—పై.—

సౌహిత్యము. సం. వి. అ. న: అవనము, ఆశితంభవము, ఆతర్పణము, ఆప్యాయనము-ఆప్యాయము, ఆలింపన, ఆశితంభవ, ఉతంతిక, కశలము, తర్పణము, తృప్తి, పర్యాప్తము-పర్యాప్తి, ప్రీణనము. (తె) ఆదట, ఆపోశ, ఆపోవుట, చాలు, తనివి-తనవు, తనుపు-తన్పు. (అవనము, తర్పణము, ప్రీణనము అనునవి (విణలు.) (చాలు=పర్యాప్తి: చూ, హృల్లేఖము. 2;) (అనిశొందలు). తద్వి.— మిక్కిలి తృప్తికి.—సంతృప్తి.

సౌహృదము. సం. వి. అ. న. మైత్రి: చూ, స్నేహము. 1.

సౌహృదయము. సం. వి. అ. న:—పై.—

సౌహృద్యము. సం. వి. అ. న.—పై —

## స్క

స్కందపురాణము. అం: చూ, యా-స్కాంద పురాణము.

స్కందము. అం. —పై.—

స్కందుఁడు. సం. వి. అ. పుం.=కందుఁడు-సందుఁడు: అగ్నిభువు, ఉమాసుతుఁడు, ఈమోద్భవుఁడు, ఔ, కార్తికేయుఁడు, కుక్కుటధ్వజుఁడు, కుమారకుఁడు-కుమారుఁడు, కృశానుధ్వజుఁడు, కృత్తికాసుతుఁడు, క్రౌంచదారణుఁడు, క్రౌంచారాతి, క్రౌంచారి, గంగాజుఁడు, గంగాసుతుఁడు, గా

స్థూలోచ్చయము. సం వి.అ. పుం.1. పెద్దఱాయి: చూ, రత్నములు (౪౯.) తద్విశేషములు.— ౧. రత్నమునకు.—ఏనువు; ౨. (తె) రుబ్బుగుంట, రుబ్బుఱోలు; 3: (తె) రుబ్బుగుండు, రుబ్బుపొత్రము; ౪: ఉదూఖలము, ఉలూఖలము, కండని. (తె) ఱోలు-ఱోలు ; ౫. కెంపునకు.—లోహితకము, శోణరత్నము; ౬. వజ్రమునకు.—లోహజిత్తు; ౭. చెకుముకిఱాయికి:—శిఖిముఖి; ౮. తలమానికమునకు.—శిరోరత్నము; ౯. ముత్యమునకు.—శౌక్తికేయము; ౧౦. సూర్యకాంతము; ౧౧. పగడమునకు.—వల్లికము; ౧౨. పటికమునకు.—(తె) లెంట; ౧౩: (తె) వంటరాయి; ౧౪. కెంపుదోసమునకు.—లశునము; తద్వి. రత్నదోషమునకు.— విచ్ఛాయము. (తె) విచ్ఛాయ; ౧౫. శిలావిశేషమునకు.—శిఖరము; ౧౬. ఇటికకు.—సుధ; ౧౭: (తె) వాటురాటు. (చూ, రత్నములు); 2. బొటిమ: అవగండము, కచ్ఛపి, యువగండము, వదనఖర్జువు, వరండకము, వరండము. (తె) బొటిమ-పొంటిమ-పొంటిమె. (చూ, పొంటిమ. 1); 3. పెనుఁగునడితరపునడ: చూ, వాస్తి; 4. అసాకల్యము.

## స్థే

స్థేకము. సం. వి. అ పుం: ఛేకము, దీపకము. (తె) జిలగంటె, దీపము-దీము, వేఁటపిట్ట.

స్థేమము. సం. వి. స్. న. శరీరబలము: చూ, శక్తి. 1.

స్థేయుఁడు. సం. వి. అ. పుం. 1: కులవృద్ధుఁడు, గురువు, చక్రి, పురోధ, పురోధసుఁడు, పురోహితుఁడు-పౌరోహితుఁడు, బ్రహ్మ. (తె) ఒజ్జ. తద్వి.—అధర్వణుఁడు, యాజకుఁడు, యాజ్ఞికుఁడు. (తె) ఒజ్జ; 2. తీర్పరి: చూ, స్వామి. 3; విశే. 3. మిక్కిలిస్థిరుఁడు

## స్థై

స్థైర్యము. సం. వి. అ. న. 1. స్థిరత్వము: ఆత్మ, ఊర్జితము, దార్ఢ్యము, దృఢము, ధృతి, ధైర్యము. (తె. వి):—ఇట్టలము, ఉక్కు, ఉదిరి, ఉదుట, ఉఱ్ఱది, ఒఱపు, కటికి, గట్టి, గడుసు, చిక్కన, జెట్టెస. తరపు, తాలిమి-తాల్మి, తేఁకువ, దిటము-దిటవు, దిమ్మరు, దీమసము-దీవసము, నేటు, పట్టు, పదిలము, బరవసము-బరువసము, బిగి, బిగితము, బిగువు, బిట్టు, బిఱ్ఱ, బెట్టిదము, మున్నలక, మొఱపడి, మొక్కలము-మొగ్గలము, రుటము, సదాటు. (చూ, స్థిరము). తద్వి.— మిక్కిలి పదిలమునకు.—సాధిష్ఠము, పుం. 2. జోవత్రి: చూ, సుమనస్సు. 2-౨; విశే. 3. నిలుకడ: చూ, స్థితి. 3.

## స్థౌ

స్థౌణేయము. సం. వి. అ. పుం. 1. గండివనము*: చూ, రాజార్హము. 1-౩౯; 2. మాచిపత్రి*: కాకపుష్పము, కుక్కురము, పుష్పము, బర్హపుష్పము-బర్హిపుష్పము, బర్హము. (తె) మాచి, మాచిపత్తిరి-మాచిపత్రి.

స్థౌరము. సం. వి. అ. న. గుఱ్ఱముమీఁదిపనిమోపెడి బరువు: చూ, హయము.

స్థౌరి. సం. వి. స్. పుం. యా-స్థూరి. బరువుమోసెడి గుఱ్ఱము: చూ, హయము.

స్థౌల్యము. సం. వి. అ. న. 1. బలము: చూ, శక్తి. 1; 2. స్థూలభావము: చూ, శక్తి. 1.

తద్వి .— ౧. బలముగలది:—పూర్ణము; ౨.మిక్కిలిబలముగలది:—ప్రబలము, బలవంతము, బలిష్ఠము. బలీయము, (తె) తోగము బలితము, బల్లిదము-(చూ, శక్తి. 1.)

స్థ్నూరి. సం. వి. స్త్రీ. పుం: చూ, రూ—స్థూరి.

# స్న

స్నపనము. సం. వి. అ. న. మునుక: చూ, స్నానము.

స్నపితము. సం. విణ. స్నానముచేసినది.

స్నవము. సం. వి. అ. పుం. రూ—స్రవము—స్రావము, కాఱుట: చూ, స్రవము.

స్నస. సం. వి.అ.స్త్రీ. సన్నపునరము: చూ, సిర.

# స్నా

స్నాతకము. సం. వి. అ. న.వివాహోత్పూర్వము బ్రహ్మచారి చేసికొను ఒకవ్రతము.

స్నాతకుఁడు. సం. వి. అ. పుం. 1. స్నానవ్రతశీలుఁడు: ఆప్లుతుఁడు (చూ, వ్రతి. 2);౨. ౩: వ్రతభేదము: (చూ, వ్రతి. ౩); ౩: చూ, గతిభేదములు.

స్నాతకులు. అం: మీరుతొమ్మండ్రు.—౧.సంతానార్థియై పెండ్లిచేసికొనఁదలఁచి తదర్థమయి ధనముపభిలషించువాఁడు;౨. తనకున్న ద్రవ్యమంతయు యజ్ఞమునందు బ్రాహ్మణులకొసంగి దరిద్రుఁడయి ధనమునుకోరువాఁడు, ౩. యజ్ఞార్థమయి ధనము నపేక్షించువాఁడు; ౪. గురుదక్షిణార్థమయి ధనము కోరువాఁడు;౫-౬. పితృమాతృసంరక్షణార్థము ధనము నపేక్షించువాఁడు; ౭. బాటసారి; ౮. రోగి; ౯. వేదవ్రతనార్థము వలయుసౌకర్యముల నభిలషించువాఁడు )

స్నాతుఁడు. సం. విణ. స్నానముచేసినవాఁడు: ఆప్లుతుఁడు. (తె) మునిఁగినవాఁడు, మునుఁగువాఁడు.

స్నానమాడు. మి. అ. క్రి: తీర్థమాడు. (సం) అవగాహించు, విగాహించు. (తె) ఆడు, ఓలలాడు-ఓలాడు, క్రుంకు, తేలు, తోఁగు, నీరాడు, నీరుపోసికొను, నీళ్లాడు, బోరుకాడు-బోర్కాడు, బ్రుంగు, మునుఁగు-మున్గు, తేలు-వ్రేలు. (వ్రే. ఓలలాడు) తద్వి.—(తె) వసుపాడు.

స్నానము. సం. వి. అ. న. 1.—తానము. మునుక: అభిషవము, అభిషేకము, అవగాహనము, అవగాహము, అప్లవము(అప్లావము), ఉపస్పర్శనము-ఉపస్పర్శము, గాహనము- గాహము, నిమజ్జనము, విగాహనము, విగాహము, సవనము, సుక్య, స్నపనము. (తె) క్రుంకు, జలకము, తలమునుక—తలమున్క, తానము, తీర్థమాట, నీరాట-నీరాటము, బుడక-బుడుక, మజ్జనము, మునక-మునుక. తద్విశేషములు. ౧: (మి) తిరుమజ్జనము; ౨:కంఠస్నానము; ౩: అవగాధము, పాత్రస్నానము. (తె) వేడువతానము; ౪: అపస్నానము, మృతస్నానము; ౫: (తె) ముట్టునీళ్లు; ౬: (తె) మాఱునీళ్లు; ౭: మంగళస్నానము; ౮: అంగసంస్కారము, అంగసంస్కృతి, అంగసంస్క్రియ, అభిషిక్తము, అభ్యంగనము, అభ్యంజనము, పరికర్మము, మ్లంతగనము. (తె) తలగడుగు, తలంటు—తలయంటు; ౯. మునిఁగినది:—గాహితము, విగాహితము, విగాఢము, మగ్నము. (తె) బుంగుడు; 2. స్నానీయము, సలుఁగుపిండి: (చూ, పాదము. 1-౮౭); ౩. ౩: చూ, ఉపచారములు, ౪: చూ, భోగములు. (అష్టభోగములు.) [జ్ఞానదాయకములు.

స్నానసంధ్యాజపహోమములు. అం: చూ, నూ

స్నానసమయము. అం. (ఫలము, ధైర్యము): చూ, గ్రహసమయములు.

స్నానీయము. సం. వి. అ. న: చూ, స్నానము. 2.

స్నాయువు. సం. వి. ఉ. పుం, స్త్రీ: చూ, స్నస. (చూ, కండరములు)

## స్ని

స్నిగ్ధపల్లవము. సం. వి. అ. పుం. నీరునేరేడు*; చూ, సురభిపత్రి. 3.

స్నిగ్ధము. సం. విణ. 1. స్నేహముగలది; (తె) నిద్దము; 2.=నిద్దము. నునుపుగలది, సాపు: చిక్కణము, మసృణము. (తె) నయము, నిద్దము–నిద్దా, నునుపరి, నునుపు, నున్న; 3. చిక్కనగలది: మసృణము (తె) చిక్కన, జిగట, జిగురు, జిడ్డు, జిగిలి, నయము, నిద్దము, నునుపు, నున్న, నున్ననిది, మిసిమి, మిహి. (చూ, స్నిగ్ధము. 2.); అం. 4: చూ, దృష్టులు; 5: చూ, ఆగమములు.

స్నిగ్ధవృంత. సం. వి. ఆ. స్త్రీ. కమ్మరాకుతీగె*: చూ, సురలి.

స్నిగ్ధవృక్షము. సం. వి. అ. పుం. నల్లమామిడి*: చూ, మామిడి. ౨.

స్నిగ్ధుడు. సం. వి. అ. పుం: చూ, స్నేహితుడు.

## స్ను

స్నుక్కు. సం. వి. చ. స్త్రీ. జెముడు*: చూ, స్నుహి.

స్నుతము. సం. విణ. కారినది, రేణము: చూ, స్రవము. [చూ, పర్వతము.

స్నువు. సం. వి. ఉ. పుం: కొండచాత్తము:

స్నుష. సం. వి. అ. స్త్రీ: వధువు, వధూటి. (తె) కోడలు, పెండ్లికూతురు. తద్వి.— మేనకోడలుకు.— స్వస్రీయ.

స్నుషాత్యము. సం. విణ: చూ, కోటరము. (1)

స్నుహా. సం. వి. ఆ: స్త్రీ: చూ, రూ- స్నుహి.*.

స్నుహి. సం. వి. ఈ. స్త్రీ: రూ–స్నుహా, కృష్ణసారకము, గండీరము, గుల, మహావృక్షము, వజ్రతుండము, సమంతదుగ్ధ, సింహుండము, స్నుక్కు, సుధ. (తె) చెముడు–జెముడు, (జెముడు). తద్వి.—౧. యామళకంటకము, వజ్రము. (తె) కోలజెముడు; ౨: దళస్నుహి, పత్రస్నుక్కు, వ్యాసజిహ్వ, సువిరేచని. (తె) ఆకుజెముడు; ౩: (తె) బొంతజెముడు; ౪: వజ్రకంటక, సింహుండము. (తె) బొమ్మజెముడు; ౫: అలంబుసము, త్రికంటకము, వజ్రిక. (తె) ములుజెముడు*.

## స్నే

స్నేహము. సం. వి. అ. పుం. 1.=నెమ్మి–నేయమి–నేస్తము: అజర్యము, అనురక్తి, అనురాగము, అవహానము, అభిగమనము, అభిగమము, అభిమానము, అనుకూల్యము, అనుగుణ్యము, ఆప్తి, ఆబంధము, ఆయత్తి, ఇష్టము, ఉపగ్రహము, ఉపధానము, ఉపలబ్ధి, ఏకకంఠత్వము, ఏకీభావము, ఐకకంఠ్యము, ఐకమత్యము, ఐక్యము, కామగుణము, గృధ్నుత, గ్రహణము, ఛ, పరిచయము, ప్రణయము, ప్రతియత్నము, ప్రియత, ప్రియము, ప్రీతి, ప్రేమ–ప్రేమము, మమకారము, ముదిత, మైత్రి, మైత్ర్యము, రక్తి, రతి, రసము, రాగము, విస్తరము, విస్రంభము, సంగతము, సఖ్యము, సహవాసము, సౌహార్దము–సౌహార్ద్యము, సౌహృదము–సౌహృదయము–సౌహృద్యము, స్నైగ్ధ్యము, హార్దము, హితము,

(విశే.) అనుకూలము, అనుగలము, ప్రతీకము, పరిసవ్యము. (తె. వి):—అంటు, అనుఁగుఁదనము, అరితి, అర్మిలి, అల్లిబిల్లిక, అల్లిబిల్లి, అపము, ఆదట, ఆపటము, ఇచ్ఛ్చకము, ఇతము, ఇతవు-హితవు, ఇమిడిక, ఇమ్ము, ఇరవు-ఇరువు, ఎనయిక, ఎమ్మిక, ఎలమి, ఎలసము, ఒంటు, ఒండొరులమిక, ఒందిక-ఒద్దిక, ఒవరిక, ఒనరు, ఒమ్మిక, ఒరిమ-ఒరిమి-ఒరిమిక, ఒలిమె, కాయువు-కాయ్వు, కూరిమి-కూర్మి, కెలవు, గాదిలి, గారము-గారవము, గారవింపు, గారాబము-గారాము-గారాబు, చేనవు-చేనువు, చేట్టతికము, చెలికారము, చెలిమి-చెల్మి, తమకము, తరితీపు, తియ్యము-తీయము, నంటు, ననుపు, నయగారము, నెనరు, నెమ్మి-నెమ్మిక, నెయ్యమి-నెయ్యము-నేయము, నేస్తము, పల్లాయనము, పెరము-పెరిమ-పేరిమి-పేరిమె-పేర్మి, పొంకము, పొంతము, పొందిక, పొందు, పొత్తు, పొనరు, పొసఁగుడు, పోరామి, ప్రావ, ప్రేముడి, బాఁతి-బ్రాఁతి, బాళి, మందెమేలము, మక్కువ, మచ్చిక-మచ్చికె-మచ్చిగ, మతికము, మనుకువ, మయివడి-మెయివడి-మైవడి, మాలిమి, ముద్దు, మెచ్చు, మెప్పు, మేలు, రమణ-రవణ-రాణ, రహి, లలి, లియ్యము, లోల్లాపొత్తు, వంటు, వలఁతి, వలను, వల్ల, వీలు, సంగడము-సంగడి, సంగాతము, సమేలము-సమేళము, సరబడి, సరాగము. (ఇందు వి. విశే. పదములు కలిసియున్నవి.). తద్వి.—౧. తీరని ప్రేమకు.—(తె) మరులు; ౨. హితమైనది:—సమర్థము, హితము. (తె) చెలిమి; ౩: చూ. వాత్సల్యము; ౪. నూనెనెయ్యిలోనగునది: (తె) వేమురు, మెఱుఁగు. తద్విశేషములు.—౧. నూనె.—తైలము. (తె) అంటునూనియ-అంటునూనె, నూనియ-నూనె, మంచినూనె; ౨ నెయ్యికిని నెయ్యికి సంబంధించినవానికిని:—చూ. హవిస్సు. 1; ౩: తిల్యము. (తె) నూనియ-నూనె, నువ్వులనూనె; ౪: (తె) చేలిదిమూట, చిట్టాముదము; ౫: కర్పూరతైలము, కర్పూరస్నేహము. (తె) కప్పురపునూనె; ౬: (తె) గజ్జినూనె; ౭: (తె) వేఁపనూనె; ౮: కరపర్ణము, రక్తైరండము. (తె) పేరాముదము; ౯: క్షారతైలము. ౧౦: (తె) కొఱ్ఱివ్వ; ౧౧: (తె) చేందినీ అత్తరు; ౧౨: అవబోధము, పరిబోధనము. (తె) అత్తరు-అత్తరువు, తావినూనె; ౧౩. సంపెఁగనూనెకు.—(తె) పూనూనె; ౧౪. సంపెఁగ మొదలగువానిఁజేర్చి చేసిన తైలము.—(తె) కమ్మనూనియ-కమ్మనూనె, తేఁ వేమురు; ౧౫. వెన్న కాఁచినమడ్డికి.—కల్కము, కుక్కకము, ఖిలము, గళికము, బంధురము. (తె) గసి, మడ్డి, పుచ్చ్చు; ౧౬: (తె) గోఁకుడు, గోదారి; ౧౭: సర్జరసమునూనె.—కరాళము; ౧౮: (తె) మెఱుఁగుడునూనె-మెఱుఁగునూను, వార్నీషు; ౧౯: (తె) వంటచేమురు; ౨౦: ఈవంజి, కిరసనాయిలు-కిరసనాయిలు, మట్టినూనె (చూ. కిరసనాయిలునీళ్లు.); ౨౧: ఏరండతైలము. (తె) ఆముదము-ఆముదము-దివ్వచేమురు; ౨౨: అస్థిస్నేహము, మజ్జ, సారము. (తె) ఊట, ఎమ్ముకట్ట, చెక్కయము-చెక్కము, నెనడు, మూలగ; ౨౩. తైలములు:-శరపుంఖారి, లక్ష్మీనారాయణ, లాక్షారి, ధన్వంతరి, పంచార్కం, పాశ్చాత్య, నింబ, విషముష్టి, కేతకి, స్నేహార్కం, నారాంతక, ప్రాతిక, భూశాగ, భృంగామలక, కర్పూర, మట్టి, మైనము ఇత్యాది.

స్నేహాశము. సం. వి. అ. పుం. దీపము: కజ్జలధ్వజము, గృహమణి, జటాజ్వాలము, దశాకర్షి, దశేంధనము, దీపకము, దీపము, దీపిక,

దీపాతిలకము, ప్రదీపము. (తె) జిగటాలు, జ్యోతి, తిర్లిక, తిర్వాళిక, దివ్వెము, దివియ-దివె-దివ్వియ-దివ్వె-దివ్వ-దీవియ — దీవె. వంజో. తద్విశేషములు:—౧: ఆకాశదీపము; ౨: కరదీపిక, తమోనుత్తు (తె) అగ్గిఁబోడి; 3: ఇంగిలాయ, ఇలాయి-ఇలాయి; కరదివియ-కరదివ్వియ-కరదివ్వె; ౪: కాగడ-కాగడా; ౫: కాలుదివియ, నడదివియ; ౬: కోలదివియ—కోలదివ్వె; ౭: చేదివియ, చేవెలుఁగు; ౮: జిగతీజ్యోతులు, మోబత్తులు; ౯. జోంజేము-జోంజోము; ౧౦: తూఁటకట్టు; ౧౧: దివటి-దివటీ-దివిటి-దివిటీ-దివియ-దివె—దివ్య-దివ్వటి- దివ్వటీ- దివ్విటి-దివ్విటీ-దివ్వెటి-దీటి-దీవటి-దీవిటి; ౧౨: నిచ్చెన దివ్వెవంజో-నిచ్చెనవంజో; ౧౩: వంజాయి-వంజో-వముజో; ౧౪: వగలొత్తులు; ౧౫: వెనువంజే; ౧౬: మషాలు; ౧౭: మహజ్యోతులు. మఱియు (లాంపు, లైటు, లాంతరు, విద్యుద్దీపములు మున్నగునవి కలవు.) (చూ, విద్యుత్తు)

స్నేహార్క—తైలము. అం: చూ, తైలములు.

స్నేహించు. సం. అ. క్రి: పరిచయించు. (తె) నమ్ముపడు, నెయ్యమాడు, పొత్తుసేయు, మచ్చికపడు, మరగు.

స్నేహితుఁడు. సం. వి. అ. పుం.—నెయ్యుఁడు, నేస్తు: ఆక్రందుఁడు, అప్తుఁడు, ఇష్టుఁడు, పక్షము, ప్రత్యయితుఁడు, ప్రియుఁడు, ప్రేయసుఁడు, బంధువు, మిత్రుఁడు, వయస్యుఁడు, సఖి, సఖుఁడు, సగంధుఁడు, సచివుఁడు, సవయస్కుఁడు, సహచరుఁడు—సహృదుఁడు, సహాయుఁడు, స్నిగ్ధుఁడు, (తె. వ):—అంటు-వంటు, అంటుకాఁడు-వంటుకాఁడు, అనుఁగు, ఊద్దికాఁడు—ఊద్దీఁడు, కలవాఁడు, చేనవరి, చేట్టు-చేట్టము, చెలి, చెలికాఁడు, చెలిమరి, చెలివుఁడు, నచ్చినవాఁడు, నమ్మకకాఁడు—నమ్మకాఁడు, నమ్మినవాఁడు, నమ్మువాఁడు, నెచ్చెలి, నెయ్యరి, నెయ్యుఁడు—నేయుఁడు, నేస్తకాఁడు, నేస్తి—నేస్తు: పల్లాయనంటువాఁడు—వల్లాయనము వాఁడు, పక్కము, పొందు, పొందుకాఁడు, పొత్తుకాఁడు, బోటిగాఁడు, మిత్త, పంగడికాఁడు-సంగడీఁడు—సంగాడి, సంగాతకాఁడు-సంగాతి, సకుఁడు. తద్వి.—౧. కొత్తస్నేహితుఁడు:—వయస్యుఁడు; ౨. అంతరంగిక స్నేహితుఁడు.— అంతరంగుఁడు, ఆప్తుఁడు; 3. హితవుచెప్పు వాఁడు:—క్షముఁడు, హితవుఁడు-హితుఁడు. (తె) ఇతవరి-హితవరి, ఇతవుఁడు; విశే. 2. చెలిమిగలవాఁడు.

స్నేహితురాలు. సం. వి. సఖి: చూ, స్త్రీ.

## స్నై

స్నైగ్ధ్యము. సం. వి. అ. న. స్నిగ్ధభావము: చూ, స్నేహము. 1.

## స్ప

స్పందము. సం. వి. అ. పుం. ఇంచుక కంపము: చూ, చలనము.

స్పరికము. సం. వి. అ. పుం: చూ, స్పర్శము.

స్పర్థ. సం. వి. ఆ. స్త్రీ. 1. పోటీ: కక్ష, ఘర్షి, ప్రతిస్పర్థ, సంఘర్షము. (అవ్య) హూమ్. (తె) పంతము, పద్దు, పోటి, పోరితము, మచ్చేరికము; 2. పోలిక: చూ, సమానము. 2. 3. క్రిమసమున్నతి; 4.—పంతము: అభినివేశము, కక్ష, కటము, క్రియాకారము, వివాదము,

ప్రతిజ్ఞ, ప్రతినివేశము, భాషణము, భావ, సంగరము, సంధ, సంధ్య, సంవిత్తు, సమయము, వాతము. (తె) పంతము-పంతు, పట్టు, పట్టుదం, పట్టుదల, పద్దు, పూనిక-పూనికి-పూన్కి, ప్రతిన, బాస, బిరుదు, రవరవ, వంతు, వాశి. తద్వి:—బయిసుక-బైసుక.

స్పర్ధించు. సం. అ. క్రి: ప్రతిస్పర్ధించు. (తె) పోటీచేయు.

స్పర్ధాళువు. సం. విశే. (పు). స్పర్ధగలవాఁడు.

స్పర్శనము. సం. వి. అ. న. 1. తాఁకుడు: చూ, రూ-స్పర్శము; 2. ఈవి: చూ, రూ-స్పర్శము. 3. పుం. 8. గాలి: చూ, వాయువు.

స్పర్శనాడులు. అం: చూ, నాడులు.

స్పర్శము. సం. వి. అ. పుం. 1. రూ-స్పర్శనము-స్పరిశము, ఆలంభము, ఉపస్పర్శనము, ఉపస్పర్శము, ఘట్టనము, స్పృక్తి, స్పృష్టి, సంస్పర్శము, స్పృక్కు, స్పృష్టి. (తె) అంటు చెనకు, తాఁకు-తాఁకుడు, తొట్టు, ముట్టు, సోఁకు-సోఁకుడు; విశే. 2. తాఁకునది; వి. 3. ఈవి: అంహతి, అతిసర్జనము, అపవర్జనము, అపవర్గము, అపసర్జనము, ఇజ్య, ఇష్టి, ఉత్సర్గము, ఉత్సర్జనము, చ్యుతి, త్యాగము, దత్తము, దానము, దాయము, ధార, న, నిర్యాతనము, నిర్వపణము-నిర్వాపణము, నిసర్గము, పుణ్యము, ప్రతిపాదనము, ప్రాదేశనము, వర్జనము, వితరణము, వితీర్ణి, విగళము-విరాళము, విలంభము, విశ్రాణనము, విసర్గము, విసర్జనము, విహాపితము, సాతి, స్పర్శనము. (అవ్య) అవ. అజ్. (తె) ఈగి-ఈవి, ఒసఁగు, చోగము, తెగువ, తేగము, దార, పుడికిరింత-పుణికిరింత-పుడుకరింత, పుడిగ-పుడుకు-పుడుగ-పుణుకు, పున్నెము, పెట్టు-పెట్టుడు, విడుపు-విడుపు. తద్వి:— ౧. ధనదానమునకు.— (తె) కొంపాడి; ౨: పారితోషికము. (తె) పసదనము; ౩: చేకొనియీవికి.—సంప్రదానము; ౪. ఎడతెగనియీవికి.— ప్రదానము; సత్రము; ౫. ఋణదానమునకు—సాధనము; ౬. ఫలమునుగోరిచేయు దానమునకు.—కామ్యదానము, ప్రవారణము; 4. తపింపఁజేయువ్యాధి: చూ, రోగము. 1-౫; ఇ. 5: చూ, కవర్గము; అం. 6: చూ, ఇంద్రియవిషయములు; 7: చూ, ప్రకృతులు.

స్పర్శములు. అం. (క-చ-ట-త-ప వర్గముల యైదు భేదములు): చూ, కవర్గము.

స్పర్శవేధి. సం. వి. న్. పుం.=పరసవేది-పరుసవేది: చూ, పరుసవేది.

స్పశము. సం. వి. అ. పుం. పోరు: చూ, యుద్ధము.

స్పశుఁడు. సం. వి. అ. పుం. 1. వేగులవాఁడు: చూ, సందేశహారుఁడు; 2. పులితోఁడను వీనుఁగుతోఁడను పోట్లాడెడువాఁడు: స్పృశుఁడు.

స్పష్టకాలింగనము. అం: చూ, ఆలింగనములు.

స్పష్టత. సం. వి. అ. న: చూ, అచ్ఛత.

స్పష్టము. సం. విశే.=చేట్టము. వెల్లడియైనది: అత్తము, అవగతము, అవసితము, అవస్థితము, ఉపలబ్ధము, ఉల్బణము, కలితము, క్లిప్తి, గతము, గోచరము, జ్ఞాతము, పరిగణితము, పరిస్ఫుటము, పరిచరము, ప్రతిపన్నము, ప్రతీతము, ప్రత్యక్షము, ప్రవ్యక్తము, బాహ్యము, బుధితము, బుద్ధము, మనితము, మితము, విత్తము, విదితము, విన్నము, విశదము, వీక్షితము, వ్యక్తము, సాక్షాత్కారము, స్ఫుటము. (వి) కలన. (ఇవి పరస్పరసంబంధముగలపదములు). (తె) ఇమ్ముగ, చిట్ట, తెల్ల, తెల్లమి-తెల్లము, తేట, పత్తెచ్చెము, బాహాటము-బాహాటము, బాహిరము-బాహ్యము, వెలి, వెల్లడి, వెల్లాటకము, (వి) ఎఱుఁగుట. (చూ, సంభావన. 8). తద్విశేషములు.— ౧. మిక్కిలిస్పష్టము:- (తె) తేటతెల్లి; ౨. కనఁబడినది, చూడఁబడినది:—ఆలోకి

తము, గోచరము, దృష్టము, నిరీక్షితము, ప్రదర్శితము, ప్రేక్షితము, వీక్షితము; ౩. చూడఁబడినది:- ఆదర్శితము, దర్శితము; ౪. విశదముగా చూడఁబడినది:—పరిదర్శితము; ౫. చూడఁదగినది:—దర్శనీయము, దృశ్యము, ప్రేక్షణీయము, వీక్షణీయము; ౬. చక్షురాదీంద్రియ గోచరమైనది:—అధ్యక్షము, అభివ్యక్తము, ఉపాత్తము, ఉచితము, ఐంద్రియకము, వ్యక్తము, సూచితము; ౭. జాడగా తెలుపఁబడినది: సూచితము; ౮. తెలియఁదగినది:—జ్ఞాతవ్యము, జ్ఞేయము, వేద్యము.

వ్యక్తీకరించు. సం. స. క్రి. తెలియఁజెప్పు: ప్రతిపాదించు.

## స్పృ

స్పృక్కా. సం. వి. ఆ. స్త్రీ.=వక్కా—పిక్కా రూ—స్పృక్కా*: లఘువు, వధువు: చూ, రాజార్హము. 1-౩౭.

స్పృక్కు. సం. వి. న్. స్త్రీ. తాఁకుడు: చూ, స్పర్శము. 1.

స్పృశము. సం. విణ. స్పృశింపఁదగినది.

స్పృశి. సం. వి. ఈ. స్త్రీ. వాఁకుడు*: కంటకశ్రేణి, కంటకారి-కంటకారిక, కంటతనువు, కత్య, కచ్ఛుర, కురువు, కులి, క్రాంత, క్రోడచర్మి, క్షుద్ర, క్షుద్రకంటకి, గోజాకరికము—గోజాగరికము, దుస్పర్శ, నిదిగ్ధిక, ప్రచోదని, బహుప్రతిక, బృహతి, రాష్ట్రిక, వంగము, వ్యాఘ్రము, వ్యాఘ్రి. (తె) వాఁకుడు-వ్రాఁకుడు. తద్వి.—౧. తెల్లవాఁకుడుకు —కటువార్తాకి, కపటేశ్వరి, క్షుద్రదూతి, క్షుద్రఫల, క్షుద్రవార్తాకి, క్షుద్రహింగులిక, క్షేత్రిజ, క్షేత్రదూతి, గర్దభి, దుఃస్పర. (తె) తెల్లవాఁకుడు; ౨. నేలమూలకను:—రామమూలక: చూ, హింగులి. ౩.

స్పృశించు. సం. స. క్రి: సంస్పృశించు. (తె) అంటు, అదుకు—అదుకు, అప్పళించు, చెనకు, చెనయు, తగులు—తవులు—తాలు, తలకడు, తాఁకు, తొట్టు, దసుకు-దస్కు, ముట్టు. తద్వి.— ౧. శత్రుభుజముదాఁకు.— (తె) ముట్టు; ౨. మర్మముదాఁకు.-(తె) ముట్టు.

స్పృశుఁడు. సం. వి. అ. పుం. 1. వేగులవాఁడు. రూ-స్పర్శుఁడు-స్పశుఁడు: చూ, సందేశహరుఁడు; 2: చూ, స్పశుఁడు. 2.

స్పృష్టకాండుఁడు. సం. వి. అ. పుం: చూ, శస్త్రజీవుఁడు.

స్పృష్టకము. అం: చూ, అజాతస్మరాలింగనములు.

స్పృష్టము. సం. విణ. స్పృశింపఁబడినది: ఉపస్పృష్టము.

స్పృష్టి. సం. వి. ఇ. స్త్రీ. (రూ—వృష్టి) తాఁకుడు: చూ, స్పర్శము.

స్పృహ. సం. వి. ఆ. స్త్రీ. ఇచ్ఛ: చూ, వాంఛ.

స్పృహణీయము. సం. విణ. కోరఁదగినది: స్పృహ్యము.

స్పృహ్యము. సం. వి.అ.పుం. 1. మాదీఫలము*: చూ, సుపూరము; విణ. 2. కోరఁదగినది: స్పృహణీయము.

## స్ప్రి

స్ప్రిష్టి. సం వి. ఇ. పుం. రూ-స్ప్రష్ట. తపింపఁజేయురోగము, ఉపతప్త: చూ, రోగము. 1-౫.

## స్ఫ

స్ఫట. సం. వి.ఆ. స్త్రీ.=పటము—పడిగె. రూ—స్ఫటము, స్ఫోట, దర్వి, ఫణి. (తె) పటము, పడగ-పడిగ—పడిగె: చూ, సర్పము.

స్ఫటము. సం. వి. అ పుం —పై.—
స్ఫటి సం. వి. న్. పుం. పాము: చూ, సర్పము.
స్ఫటికము. సం. వి. అ. పుం. పటిక. రూ— స్ఫాటికము. పటిక పుటాయి: చూ, స్ఫూలొచ్ఛేదనము (రత్నములు. 12—(8).

## స్ఫా

స్ఫాటికము. సం. వి. అ. పుం. పటికము (పూస), పలుగు (టాయి). మెఱయునది.
స్ఫాతి. సం. వి. ఇ. స్త్రీ. వృద్ధి: చూ, హెచ్చు 2.
స్ఫారము. సం. వి. అ. పుం. 1. చలనము, వీచి, వేపనము: చూ, లోలము. 1. తద్వి.—౧. కదలించేటకు.— విధువనము— విధూవనము— విధునము—విధువనము— విధూన్యము—విధూతి— విధూయము—విధన్యము—విధావ్యము. (చూ, లోలము. 1); ౨. చలించినది:—(చూ, చలితము) వేపితము; 3. మిక్కిలి చలించినది: ఘూర్ణము. వ్యాలోలము; 2. బంగారు లోనగువాని చీలిక: చూ, శకలము. 4; విశ. 5. అధికమైనది: చూ, పారళము.

## స్ఫి

స్ఫిక్కు. సం. వి. చ్. జ్. స్త్రీ. రూ— స్ఫిచము—స్ఫిజము. 1. పిఱ్ఱుదులరుమ్మటి: చూ, శ్రోణి; అం. 2: చూ, స్త్రీలక్షణాంగములు.
స్ఫిగావర్తి. అం: చూ, అనుభావవర్తములు.
స్ఫితము. సం. విశ. రూ— స్ఫిరము. స్ఫీతము, అధికమైనది: చూ, స్ఫారము. 3.
స్ఫిరము. సం. విశ.—పై.—

## స్ఫీ

స్ఫీతము. సం. విశ: చూ, రూ— స్ఫితము.

## స్ఫు

స్ఫుటత. అం: చూ, నఖక్షతములు. తద్విశేషములు —౧. కుచనఖక్షతములు:—(తె) సెలమురియడుగు; ౨. కంఠనఖక్షతములు:—(తె) మెంగలిరేకు; 3. నఖక్షతములు:—శారిక; ౪. వక్రగండనఖక్షతములు: (తె) సందురంకలు; ౫. నఖక్షతవిశేషమునకు.— వ్యాఘ్రనఖము [స్ఫోటము. 1.
స్ఫుటనము. సం. వి. అ. న. భేదించుట: చూ,
స్ఫుటము. సం. విశ. 1. స్పష్టమయినది: చూ, స్పష్టము; 2 వికసించినది: చూ, సంఫుల్లము.
స్ఫుటి. సం వి. ఈ. స్త్రీ. పగిలిన గోసకాయ: చూ, హరివాలుకము.
స్ఫుటితము. అం: చూ, చుంబనములు. ('స్ఫురితము' అని కొందఱు)
స్ఫురణము. సం. వి. అ. న. 1. రూ—స్ఫరణము, స్ఫూర్తి. అదురుట; 2. ఉపస్థితి, స్ఫూర్తి. (తె) తోఁచుట, వస.
స్ఫురించు. సం. అ. క్రి. 1 అదురు, చలించు: చూ, సలించు; 2. అవపాటు, తోఁచు, పొలుపోవు.
స్ఫురితము. సం. విశ. 1. అదిరినది; 2. తోఁచినది; అం. 3: చూ, చుబుకక్రియలు; 4: చూ, గమకములు; 5: చూ, చుంబనములు; 6: చూ, భ్రూమండలములు; 7: చూ, రతిబంధములు.
స్ఫులింగము. సం. వి. అ. పుం. అగ్నికణము: చూ, వహ్ని. 1.
స్ఫులింగలక్ష్మి. అం: చూ, తంత్రములు.

## స్ఫూ

స్ఫూర్జకము. సం. వి. అ. పుం. వల్లురుమ్మిక*: అంజనము, అతిముక్తకము, అతిముక్తము,

కాకతిందుకము, కాకపీలుకము, కాకస్ఫూర్జము, కాకాండము, కాకేందువు, కులకము, ప్లవము. (తె) కాకితుమ్మికి, చిట్టితుమికి, నల్లతుమికి, పిన్నతుమికి; తద్వి.—౧. కోఁతితుమికికి.— పారావతము; ౨. నీరుతుమికి.— కాకపక్షము, దీర్ఘపత్రికము. (తె) నీరుతుమికి; ౩. పెద్దతుమ్మికి.— కాంజికురుంబ — కురుంబిక, కాండిన్నము, క్షుపపత్రి, గాలవము, చిత్రాక్షుపము, తీక్ష్ణగంధము, మహాద్రోణము. (తె) ఏనుఁగు తుమ్మి, పెద్దతుమ్మి; (ఇది దేవతుమ్మి అని కొందఱు.); ౪. తుమ్మికి.— అధిచ్ఛత్రిము, ఇందువు, కాలస్కంధము, కురంటక, కురండకము, కుంభయోని, కుటజము, కుతుంబకము, కుపీలువు, కేందువు, తిందుకము, తుంబి, ద్రోణము, రావణము, శితసారకము, ము (తె) తుమిక–తుమికి–తుమ్మి–తుమ్మిక–తుమ్మికి*.

స్ఫూర్జధువు. సం. వి. ఉ. పుం. వజ్రధ్వని: చూ, స్వరము. 3.

స్ఫూర్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. అదురుట: చూ, స్ఫురణము. 1; 2. తోఁచుట: చూ, స్ఫురణము. 2.

## స్ఫే

స్ఫేష్ఠము. సం. విణ. మిక్కిలిఅధికమైనది: చూ, స్ఫారకము.

## స్ఫో

స్ఫోటకము. సం. వి. అ. పుం.=పాటకము–పోటకము–పోడకము, బొబ్బరోగము, మసూచి–మసూచిక–మసూరిక–మసూరిక, మహామ్మారి–మారి. (తె) పాటకము–పోటకము–పోడకము. తద్వి.—౧. (తె) ఆట్లమ్మ, పొంగు, పొంగుటమ్మ; ౨: చూ, విషూచిక.

స్ఫోటము. సం. వి. అ. పుం. 1. భేదించుట: అవదారణము, ఖననము, దళనము, దారణము, పరిస్ఫోటనము, పాటనము, ప్రదరము, ప్రభేదనము, భిద, భేదనము, భేదము, వర్ధనము, విదరము, విదారణము, విచ్ఛేదనము, స్ఫుటనము. (తె) చీల్చుట, పజ్జిలు–పజ్జెలు, విఱుగు–విర్గు, వెంపర, వ్రక్కలింత, వ్రయ్యుట; తద్వి:—౧: (తె) గీఱుకు, పగులు, పేఁటు, బీఁర, బీఁట, బీఁటిక, వంగుడు, వగులుడి. ౨:-(చూ, హతి); 3:-(చూ, శకలము 4.); 2: అంబుస్ఫోటము, కబుద్బుదము, గండము, బుద్బుదము, స్థాపకము. (తె) నీరుకాయ, నీరుబుగడ, నీరుబుగ్గ, నీరుబుడ్డ, బుక్క–బుగ్గ, బుడ్డ. తద్వి.—పర్వతాదులపై కుబుకు నీటిబుగ్గ.—(తె) బుక్క.

స్ఫోటశోఫ. సం వి. అ. స్త్రీ. జీడి*: అగ్ని, అగ్నిముఖము, అగ్నిముఖి, అరుష్కరము, అరుష్కరము, అగ్నోపహితము, కృమిఘ్నము, క్షయకరము, తపనము, దహనము, భల్లాతకి, రక్షోఘ్నము. (తె) జీడి. నల్లజీడి (అని కొందఱు). తద్వి.—౧. ఎలుకజీడికి — ఉపచిత్రి, ఉసరి, బుషిత్రివ, కపికచ్ఛువు, కలభము, క్రిమికంటకము, చిత్రి, చుంచువు, చుంచురము, ద్రవంతి, న్యగ్రోధి, పత్రశ్రేణి, ప్రత్యక్శ్రేణి, మూసలి, మూషకపర్ణి–మూషకపర్ణి, రండ, రుండి, రుష, వంతి, వృష, శంబరి–సంబరి, శ్రావణి, సుతశ్రేణి. (తె) ఎలుకచెవి, ఎలుకచెవిపల్లిక, ఎలుకజీడి, ఎలుకజీడిపల్లిక, ఎలుకమొక్క; ౨: వృషాంకము. (తె) నల్లజీడి.

**స్ఫోటించు.** సం. స. క్రి. పగులు: :ఆస్ఫోటించు, ఛేదించు, నిర్భేదించు, భేదిల్లు, (మి) ఖండితమగు. (తె):— అగలించు, అగలు-అగులు, అవియు, అవిసిపోవు, ఇండివాయు, ఇడియు, ఊడు, ఎడలు, కుంటుపడు, చిటులు-చిట్లు, చిఱుఁగు-చిరుఁగు, చీలు, తునియు, తునుఁగు, తూఁటకట్టు, తెగు-తెగు, తెగిపోవు, పగులఁబాఱు, పగులు-పవులు-పాఱు, పగుల్లువాఱు, పఱియువాఱు, పాఱుపడు, పికులు-పిగులు, పిక్కటిలు-పిక్కటిల్లు, పీరు-పీలు, పెకలు, పెరుగు, బీఁటగిలు-బీఁటగిల్లు, బీఁటలువాఱు, బీఁటలువోవు, విచ్చు, విరివాయు-విరియఁబాఱు, విరియు-విఱియు, విసరు, వ్రీలు :(చూ, సెలగు); (చూ, వ్రక్కవాఱు);(చూ, వేఱుపడు.). తద్విశేషములు:—౧. పెల్లగించు:— అభ్యుద్ధరించు, ఉత్పాటించు, ఉత్పాదించు, ఉద్ధరించు, పరిస్ఫోటించు, భేదించు, విదారించు. (మి.) ఉన్మూలితమగు, విదారితమగు. (తె):-అగలు,చిందఱసేయు-చిందఱలుసేయు, చిట్టుముట్టాడు; ౨: (తె)—పీఁకు, పుచ్చు, పెకలు, పెరుకు-పెరుక్కు, పెఱుకు, పెల్లగిలు-పెల్లగిల్లు, పెండగిల్లు, మెఱుకు, పెండ్రించు, ౩. పశువులు గోళ్లతో కెల్లగించు:— ఉన్మూలించు.(తె) కెలకు,కెల్లగించు, కొక్కరించు, గీఱు, గుద్దలించు, తోఁడు, నుఱుము, ౪.వస్త్రాదికమును భేదించు:— (తె) ఉత్తరించు, కత్తిరించు-కత్రించు, చించు, చింపు, చిదుము, చీలుచు-చీల్చు, త్రించు; ౫.నొవ్వనాటు:-స్ఫోటించు (తె) ఊఁటు, తమ్ము, దూటు, పొడుచు, మీటు, మెఱుము.

# స్మ

**స్మ.** సం. అవ్య.—చూమి-సుమ్మీ—సుమ-సుమా, చూడుమి.

**స్మయము.** సం. వి. అ. పుం. 1. గర్వము: చూ, హంకారము; 2. ఆశ్చర్యము: చూ, వింత. 1.

**స్మరకూపము.** సం. వి. అ. పుం, న. ఆఁడుగుఱి: చూ, భగము. 12. [లు.

**స్మరచక్రము.** అం: చూ, ఉత్తానకరణబంధము

**స్మరణము.** సం. వి. అ. న. 1. తలఁపు: చూ, స్మృతి. 1; 2. జ్ఞప్తి, తెలివి: చూ, హ్రస్వ్లక్ష్మము. 2; అం. 3: చూ, భక్తిలక్షణములు.

**స్మరవ్యాకరణము.** అం: చూ, వ్యాకరణములు.

**స్మరహరుఁడు.** సం. వి. అ. పుం: చూ, శివుఁడు.

**స్మరాంకుశము.** సం. వి. అ. పుం. పెంచిదిద్దిన గోరు. (చూ, నఖము. 1.)

**స్మరాంగారము.** సం. వి. అ, పుం, న. ఆఁడుగుఱి: చూ,భగము. 12. తద్వి.—౧. ఉపస్థలోని లింగనాడికి.—(తె) లింగనాడి; ౨. పెంగ్గవాఁలిన యుపస్థకు -దళితకోశము.

**స్మరించు.** సం. స. క్రి. స్మరణముచేయు: (తె) తలఁచు-తల్చు.

**స్మరుఁడు.** సం. వి. అ. పుం.—మరుఁడు: చూ, మన్మథుఁడు.

**స్మర్త.** సం. విశే. (ఋ. ఈ. ఋ.) స్మరించువాఁడు: తలఁచువాఁడు.

# స్మా

**స్మారికుఁడు.** సం. విశే. 1. తలఁపుసాక్షి: చూ, సాక్షి; అం. 2: చూ, కృతసాక్షులు; 3: చూ, సాక్షులు.

**స్మార్తము.** సం. వి. అ. న. 1. స్మృత్యుక్తకర్మము; విశే. 2. స్మృతిసంబంధమైనది.

## స్మి

స్మితము. సం. వి. అ.న,అం. 1. అధరమునందు మాత్రము ప్రకాశించెడు చిఱునవ్వు (ఇది యుత్తమము): చూ, హాస్యములు; సం. విణ. 2: చూ, సంఫుల్లము.

స్మితి. సం. వి. ఇ. (స్త్రీ).—హై.—

## స్మృ

స్మృతము. సం. విణ. తలఁపఁబడినది: అభిప్రేతము, ఇతము.

స్మృతి. సం. వి. ఇ. (స్త్రీ). తలఁపు: అభిప్రాయము, అంతర్గ్యము, ఆకూతము-ఆకూతి, అధ్యానము, ఆశయము, ఆళి, ఇంగము, ఉద్దేశము, ఉద్బోధము, గహనము, కూతము, ఛందము, చింత, జ్ఞప్తి, తాత్పర్యము, ధ్యానము, భావము, మతము, మతి, విషయము, స్మరణము, గోచరము(అని కొందఱు). (అవ్య).—అని, అవ, అ, అమ్, ఏ, ఓ, కిల, తు. (తె) ఎడాటము, గుఱి, తలఁపు, దేనము, వెంట, తద్వి.— 1. వ్యాపాదనము-వ్యాపాదము: ౨: అహోపురుషిక-అహోపౌరుషిక-అహోపురుషిక-అహోపౌరుషిక; 2: చూ, ధర్మశాస్త్రము (చూ, స్మృతులు); 3. బుద్ధి: చూ, ప్రజ్ఞేశము. 2; 4. ఎఱుక: చూ, సోఁ; అం. 5: చూ, అలంకారము. 3 (స్మృతిమత్తు అని కొందఱు) ("ఒక వస్తువును జూచి నప్పుడు ప్రియమైన పూర్వవస్తువట్టిదేయని జ్ఞాపకము వచ్చుట. ఉదా.—పద్మమును జూడఁగానే కాంత మొగము జ్ఞాపకముపట్టినట్టయినది"); 6: చూ, సంచారీ భావములు. ("అల్లవాఁడు గోదావరీ పరిసరంబున మన మిరువురు మొకకేళీకొదమతో జేరిపిన యాటలు నా హృదయంబున నాటుకొని యుండెనని రామునికెఱిఁగింపుము.")

స్మృతికర్తలు. అం: కశ్యపుఁడు-అత్రి-భరద్వాజుఁడు-విశ్వామిత్రుఁడు-గౌతముఁడు-జమదగ్ని-వసిష్ఠుఁడు అను ఏడుగురు ఋషులును, అంగిరసుఁడు-ఉశనసుఁడు-ప్రజాపతి-విష్ణువు-యముఁడు-బృహస్పతి-సంవర్తుఁడు-దేవలుఁడు-నారదుఁడు-ముద్గలుఁడు-పరాశరుఁడు-మనువున నుపంచెండ్రుఁడు గురును ఋగ్వేదసూత్రవిద్వత్తులు- యాజ్ఞవల్క్యుఁడు శుక్లయజుస్సుతో సంబంధము గలవాఁడు. హారీతుఁడు-శంఖుఁడు-లిఖితుఁడు-వ్యాసుఁడు-పులస్త్యుఁడు-శాతాతపుఁడు-దక్షుఁడు మొదలగువారు పురాణేతిహాసములకు సంబంధులు. ఆపస్తంబుఁడు-అశ్వలాయనుఁడు-బోధాయనుఁడు-గోభిలుఁడు- సత్యాయనుఁడు ననువారు సూత్రకర్తలలోనివారు. ఇంకను గొందఱుస్మృతికర్తలుకలరు. వీరందఱిచేఁ జేరను స్మృతులున్నవి. (చూ, మూలస్మృతులు, స్మృతులు. (చూ, ఋత్విజుఁడు.)

స్మృతులు. అం: చూ, మూలస్మృతులు. (వీనినే వేఱొక విధమున.—మను, అత్రి, విష్ణు, హారీత, యాజ్ఞవల్క్య, ఉశన, అంగిరస, యమ, ఆపస్తంబ, సంవర్త, కాత్యాయన, బృహస్పతి, పరాశర, వ్యాస, శంఖ లిఖిత, దక్ష, గౌతమ, శాతాతప స్మృతులు. (18.)

## స్మే

స్మేరము. సం. విణ. 1. కొంచెమునవ్వినది; 2. వికసించినది: చూ, సంఫుల్లము.

## స్యం

స్యందనము. సం. వి. అ. న. 1. కాఱుట: చూ, స్రవము; 2. నీరు: చూ, సలిలము; పుం-

3. తినాసము*: అతిముక్తకము, అతిముక్తము, కాముకము, కుబ్జకము, చిత్రకృత్తు, తినిశము, నేమి, రథద్రుమము, వంజులము, శకటము, సర్వసాధకము. (తె) తినాసము, నెమ్మి; పుం, న. 4. శతాంగము యుద్ధరథము (అనికొందఱు): చూ, శకటము. 1.

స్యందనారోహుఁడు. సం. విణ. రథమునెక్కువాఁడు; రథమునెక్కి యుద్ధముచేయువాఁడు (అనికొందఱు): రథి, రథి, రథికుఁడు, రథిరుఁడు. (తె) జెగిలెకాఁడు, తేరుకాఁడు

స్యందము. సం.వి.అ.పుం.కాఱుట: చూ, స్రవము.

స్యంది. సం. విణ. (న్. ఈ. న్) స్రవించునది: చూ, స్రవము.

స్యందిని. సం. వి. ఈ. స్త్రీ: సృణిక-సృణీక. (తె) చొంగ, జొల్లు, లాలతన్య్వ-౧ చూ, బ్రహ్మబిందువు; ౨. పాముయొక్క-జొల్లు:- పిచ్ఛ.

స్యదము. సం. వి. అ పుం. వేగిరము:అంజస్సు, ఓకము, కాకోదరము, కుంతలము, గమకారిత్వము, జవనము, జవము, జా, తరము-తరస్సు, ప్రసరము, రంహస్సు, రథసము, వేగము, సహము. (విణ):-అరము, అవిలంబనము, అవిలంబితము, ఆశువు, ఉచ్చండము, క్షిప్రము,చపలము,చాపలము, జవనము-జవము,తీవ్రము, తూర్ణము,త్వరితము,మ్రితము, యవాని,రంహస్సు,లఘువు,వాజము,శీఘ్రము, సత్వరము,సహము (క్రి.విణ.):—అరము,అవిలంబనము-అవిలంబితము, ఆశువు, క్షిప్రము, చపలము- చాపలము, జీవనము, జవము, తూర్ణము, త్వరితము, ద్రుతము, లఘువు, శీఘ్రము, సత్వరము.(తె) చెచ్చెర- చెరచెర, తుఱుతు, దడదడ, దఃరున, చరిగె, వే, వేళము, వడియిళము - వైళము - వైడము. (అవ్య) అంజస, అచిరాత్, అహ్నాయము, అంతఃపనము, ఝుటితి-ఝుడితి, ద్రాక్, మంక్షు, సపది, సాప్రక్కు. (అవ్య)(తె):— జెడిలి,బిట్టు, బిట్టుబిన్ల.(అవ్య.క్రి.విణ)(తె): తురితము, తురితు. నింకిత్, పొసపొస. (వి) (తె):—అంకపొంకములు- అంకపొంకాలు- అంకాపొంకములు-అంకాపొంకాలు, అక్షచిపాటు, అప్పళము, ఉద్దవడి-ఉద్దవిడి, గొరగొర, చేఱుకు, జేరుగురు-జేరువురు- జేగూఖ-జేగ్గు, జేఱజేఱ, తరమిడి, తరవు, తిపుట, తివురు, తీవరము, తుఱుతు-తుఱ్ఱు, తొర, దడదడ, దుగము, నెప్పరము, నెప్పళము, పఱవు, బిపబిప, రవరవ, రింగు, రివ్వు, వడి, వెస, వేఁడి, వేగ-వేగము, వేగిరము, వేరము, వేలము, సరగు. (తె) (అవ్య):—ఎకాయెకి; (ధ్వ):—క్రించేర, క్రిక్కున, క్రిచ్చేఱ, క్రిన్ను-క్రిన్నున, గుప్పున-గుబ్బ (బ్బు)న-గొబ్బున, గ్రక్కున-గ్రక్కున, గ్రిద్దన, గ్రమ్మన - గ్రమ్మున, చట్టన, చేఱ్ఱ్యన, చివ్వున, చెచ్చెర, చెరచెర, జేరీవ, జేరీలున, జేఱున, జిఱ్ఱున, జివ్వున, డిగ్గన, తటాన- తటాలున, తటుకున - తటుక్కున- తడుకున,తురీవ, తెప్పదెరలఁగ, తెవ్వున, దబ్బున, దారున, దిగ్గన-దిగ్గున, దురదుర, దెబ్బున,బిరబిర-బిఱబిఱ,బిరాన- బిఱాన, బీఱీన-బీఱీలున, బోరన, రివ్వున- రివ్వున, వెస, వేగ; తద్వి.—౧. వాయువేగమునకు.—అపరాజయు, వాయుధాటి. ౨ మిక్కిలివడికి.—(విణ) క్షేపిష్ఠము, క్షేపీయము, రయము. (తె) ఈ రవడి- ఈరువడి-ఈఱువడి, నెవ్వడి, హుటాహుటి; విణ. 3. వేగముగలది: తూర్ణము, త్వరితము, ద్రుతము. (తె) ఉగ్గడువు, తులా చే, తొర, నులివు-నుల్వు, హుటాహుటి౪ ర. మిక్కిలి శీఘ్రముగ.-(తె) సరసర- ౫. విజయముకు తేనివడికి:- (తె) దడదడ

౬. వేగముగాఁబోవుటకు:—జూతి,౭: చూ, సంభ్రమము.

స్యన్నము. సం. విణ. కాఱినది, స్రుతము: చూ, స్రవము.

# స్యా

స్యాలకుఁడు. సం. వి. అ. పుం: చూ, రూ—శ్యాలకుఁడు.

స్యాలిక. సం. వి. ఆ. స్త్రీ: చూ, రూ-శ్యాలిక.

స్యాలుఁడు. సం. వి. అ. పుం: చూ, సా—శ్యాలకుఁడు.

# స్యూ

స్యూతము. సం. వి. అ. పుం. 1. రూ—స్యూనము—స్యోతము. పల్లిక, దాఁగర: చూ, సజ్జి. 1, విణ. 2. కుట్టఁబడినది: ఉతము—ఊతము, ఘటితము.

స్యూతి. సం. వి. ఇ. స్త్రీ: రూ—సూతి, ఊతి, వానము. (తె) కుట్టు, కుట్టుడు, చిమ్మ, పొడుచేట, పొడుపు. తద్వి.—౧. మడుపు కుట్టునకు.—(తె) చీనీకుట్టు; ౨: (తె) తిబ్బి, డిబ్బి (అనికొందఱు); 3. బట్టకుట్టుటకు.—సీవనము, సేవనము. (తె) సీవనము; 2: చూ, సంతతి. 1.

స్యూనము. సం. వి. అ. పుం: చూ, స్యూతము. 1.

# స్యో

స్యోతము. సం. వి. అ. పుం: చూ, స్యూతము. 1.

స్యోనము. సం. వి. అ. పుం—పై.—

స్యోనాకము. సం. వి. అ. పుం. రూ—శ్యోనాకము*: చూ, శోణకము.

# స్ర

స్రంసనము. సం. వి. అ. న. క్రింద పడుట.

స్రంసి. సం. వి. న్. న. పోఁక*: శ్వం గాది. (చూ, పోఁక.). ౧. తోఁటపోఁకకు.—లఘుకము, ౨. లతాపూగము.—రాజవము. (తె) నూదిగొంటు; 3. నిడుపుతోడి మొగల పోఁకకు.—రామపూగము; ౪. పోఁక చెక్కకు.—పూగఖండము, వల్కము. (తె) లీరిము—పీరిము, వక్క; ౫: పరాగ్రము.(చూ, పోఁక *); పుం. 2. గోనుగు*: చూ, స్వాదుమజ్జాఫలము (వరగోఁగు); విణ. 3. క్రిందపడునది.

స్రగ్గు. దే. అ. క్రి: చూ, రూ-సగ్గు.

స్రగ్ధర. అం: చూ, వృత్తము. 1. ("మ—ర—భ—న—య—య—యగణములు. 8—15 యతులు. 21 ఛందస్సు.") [గలవాఁడు.

స్రగ్వి. సం. విణ. (న్. ఈ. న్) పూదండ

స్రగ్విణి. అం: చూ, వృత్తము. 1. ("నాలుగు రగణములు. 7 యతి. 12 ఛందస్సు.")

స్రజము. సం. వి. జ్. స్త్రీ. పూలదండ. హారము: చూ, హావణిక. 2. (చూ, భూషణము. 2—32).

స్రవ. సం. వి. అ. స్త్రీ. చేఁగ* రూ—స్రువ, కటంభర, కర్మకరి, కలమము, కిశోరము, కుచండిక, గోకర్ణి, గోవల్లి, గౌరశాకము, ఘనరసము, ధనశ్రేణి, పాటల, బహువల్కము. మధురస, మధుశ్రేణి, మధూలిక, మూర్వ, మోరట, వసంతదూతి, సుధ. (తె) చేఁగ, చేగ, దేవి. తద్వి.—చారకము, చారము, వనగుప్తము, వనప్రియము. (తె) చేఁఱు, జీడిమామిడి, పెంకుమామిడి.

స్రవంతి. సం. వి. ఈ. స్త్రీ. 1. తరంగిణి, ఏఱు: చూ, నది; 2: అసంక్రియ, రుదంతి*.

స్రవణము. సం. వి. అ. న.—స్రా. న. కారుట: చూ. స్రవము.

స్రవద్గర్భ. సం. వి. ఆ. స్త్రీ. 1. అవతోకః చూ. ధేనువు; అం. 2: చూ. వంధ్యలు.

స్రవము. సం. వి. అ. పుం. కారుట: రూ-స్రావము-స్రవణము, పరిస్రావము-ప్రస్రావము, విస్రవము, శ్చ్యోతము, స్నవము, స్యందనము, స్యందము, స్రుతి. (తె) కారుట. తద్వి.—1. కారినది.—రీణము, స్నుతము, స్యన్నము, స్రుతము; 2. స్రవించునది.—స్యంది; 3. కారునది: స్రావకము; 4. మిక్కిలి కారుటకు.—అభిష్యందనము.

స్రవించు. సం. అ. క్రి. రూ-స్రవియించు. (తె) ఊట్లు, ఊరలు, ఊడు, ఒలుకు, ఓడిగిల్లు, కరఁగు, కరఁగుపడు, కయివ్రాలు-కైవ్రాలు, కారు, గీలు, చినుకు, జల్లించు, జారు, జొబ్బిలు-జొబ్బిల్లు, తొంగలించు, తొట్టు, తొరఁగు-తొరుఁగు, దిగువారు, వడియు, వారు. తద్వి.—1. స్రవియించు, ద్రవించు. (తె):—ఊరు, నీరూరు; 2. పాలుద్రవించు, స్రవియించు, ద్రికించు. (తె) చేఁపు.

స్రవియించు. సం. అ. క్రి.—పై.—

స్రష్ట. సం. వి. ఋ. పుం. సలువ: చూ. బ్రహ్మ. 1.

స్రస్తము. సం. విణ. జారినది: గళితము, చ్యుతము, ధ్వస్తము, భ్రష్టము, స్కన్నము, స్ఖలితము. తద్వి.—విగళితము.

## స్రా

స్రాక్కు. సం. అవ్య.—సరగ. శీఘ్రము: చూ. స్యదము.

స్రావకము. సం. విణ. కారునది: చూ. స్రవము.

స్రావణము. దే. వి. అగసాలెవాని కొలముట్టు రూ—సవాణము: చూ. సుత్తియ.

స్రావము. సం. వి. అ. పుం. 1. కారుట: చూ. రూ—స్రవము; 2.—రోగ. నూకలగంజి: చూ. పాదము. (1)-43.

స్రావి. దే. వి: చూ. సూ—సరవి. 2.

## స్రు

స్రుక్కఁబడు. ద్వి. అ. క్రి. దుఃఖించు: చూ. శోకించు. (స్వార్థమునకడు).

స్రుక్కు. సం. వి. క. స్త్రీ. 1. మిక్కిలివంటి యజ్ఞోపకరణము, జుహువు: చూ. పాత్రము.6; దే.వి. (1) దుఃఖము: చూ. శోకము; (2) ఏడుపు: చూ. శోకము; (3) చికముక, చిక్కు, మాసిక, వరఁకు, వేళాకోళము; అ. క్రి. (4) ఉపశమించు - ఉపశమిల్లు, క్షయించు, క్షీణించు, విశ్రమించు, శమించు, (తె):—అక్కళించు, అడఁగారు-అణఁగారు, అడఁగు-అణఁగు, అత్తమిల్లు, అఁగు, అఱు, ఇందు, ఇముడు, ఇఱికికొను, ఉడిఁగిల్లు, ఊఱడు, ఓరుచు-ఓర్చు, కుందు, కుదియు, క్రుంగఁబడు-క్రుంగిలు-క్రుంగు, గోడివడు, చెల్లారు, డయ్యు (దయ్యు), డిందు, డిందుపడు, డొంకు, తగ్గు, తమాయించు, తారు, తీలగు, తీలుపడు, తూలు, తేఱు, పొలివోవు, మట్టుపడు, మడఁగు-మడ్గు, మణఁగు-మణుఁగు, మలఁగు, మునుగు, ముగ్గు, ముప్పటిలు-ముప్పటిల్లు, మ్రగ్గు, లోఁగు-లోవు, వారు, సగ్గించు, సగ్గు-స్రగ్గు, సమయు. తద్వి.—1: చూ. వంగు; 2: (తె) ఇలుకు; (5) దుఃఖించు: చూ. శోకించు; (6): (మి) అధైర్యపడు, భయపడు, (సం) ఉద్వేగిల్లు, శంకించు, భీతిల్లు. (తె) అంజు, అడలు, అదరు- అదలు, అరవాయిగొను, అలుకు-అల్కు, అళుకు-అళ్కు, ఉలుకు,

ఎడపడు, ఓడు, కొంకు, కోఁచేవాఁటు, గుబ్బుమను, గ్రక్కుతిల్లు, జంకు, జడియు, తలఁకు, దగ్గఱిలు-దగ్గఱు-దగ్గిర్లు, పంచొడించు-పంచోళించు, పిచ్చిలించు, పిఱువడు, పుల్లగిలు-పుల్లగిల్లు, పొక్కు, బీతుకొను, బెంబేలుపడు, బెగడు, బెగడుపడు, బెగ్గడిలు-బెగ్గడిల్లు-బెగ్గడు, బెగ్గలించు-బెగ్గిలు-బెగ్గిల్లు, బెదరు, బెదరుపడు, వెఱచెఱచు, వెఱచు, వెలివిరియు-వెల్లివిరియు. తద్వి.—మిక్కిలి భయపడు.—నివ్వెఱపడు; (7): చూ, వెనుదీయు. 1. నిర్వ. 5, ఆ. 122: ముకుళించు, ముకుళీభవించు, (8): సంపుటించు. (తె) కొరగించు, ముడుఁగు, ముడుఁచు, ముడుఁగఁబాఱు, ముడుచు (9)తగ్గు, తగ్గించు. (భో. 1, ఆ 101.):ఉపశమించు-ఉపశమిల్లు, లోపించు, హరించు. (మి) అనర్థకముగు. (తె) అడఁగు, అణఁగు, అఱు, అఱుగు-అఱుగుపడు, ఊరఁబోవు, ఎత్తువోవు, ఓరుచు, ఓర్చు, కడఁబడు, కడమపడు, కీడుపడు-కీడ్పడు, కుంటుపడు, కుందు, కుదియు, కులుచేపడు, కొంచెపడు, డిగు-డిగ్గు, డిగ్గుపడు, డుఁకు, తక్కువపడు, తగ్గు, తఱుఁగు-తఱువు, తీఱు, తొరుగుపడు, పొలుపడు-పొల్పడు, పొలువడు-పొల్లువడు-పొల్లువడు, పొల్లవోవు, ప్రిదులు, మందటిలు-(మందటిల్లు), మాను, ముడుఁగు; వట్రిపడు, వ్రాలు, సగ్గు-స్రగ్గు; (10): మాడుతపడు; (11) (మి):—అనుతాపపడు, పశ్చాత్తాపపడు. (తె):—అలమటపడు, అలమటించు, అలమరించు-అలమరు, తలపోయు, తలరు, నొచ్చుకొను, బెగ్గిలు-బెగ్గిల్లు, వగచు. (సం) చింతించు-చింతిల్లు: చూ, శోకించు; (12). మూర్ఛిల్లు: చూ, సొమ్మసిల్లు; (13): చూ, సంకోచించు; (14): మ్లానమగు. (తె) వడలు, వాడఁబాఱు, వాడు, సుడుఁగు, సొగియు, సొమసు; (15) చుట్టుకొను: చూ, వేష్టించు.

స్రుక్కులు. దే. వి.బ. కముపుమీఁదిముడతలు: చూ, వళి. 1.

స్రుచావృక్షము. సం.వి.అ.పుం. మాలువెలఁగ: రూ—స్రువావృక్షము: చూ, వెలఁగ. 3.

స్రుతము. సం. విశే. రూ—స్నుతము. కాఱినది: చూ, స్రవము,

స్రుతి. సం. వి. ఇ. (స్త్రీ). కాఱుట: చూ, స్రవము.

స్రువ. సం. వి. ఇ. (స్త్రీ). 1. అందుగు*: చూ, సల్లకి; 2. చేఁగ*: చూ, రూ—స్రువ.

స్రువము. సం. వి. అ. పుం. స్రుగ్భేదము, జూహువు: చూ, పాత్రము. 6.

స్రువావృక్షము. సం. వి. అ. పుం: చూ, స్రుచావృక్షము*. (ఇది మాలువెలఁగ, పుల్లవెలఁగ అనురెంటికిని జెందును.)

## స్రో

స్రోతఘ్ని. సం. వి. ఈ. (స్త్రీ): చూ, సజ్జోకారము.

స్రోతస్విని. సం. వి. ఈ. (స్త్రీ). నిమ్నగ, ఏఱు: చూ, నది.

స్రోతస్సు. సం. వి. స్. న. 1.జలప్రవాహము: చూ, వెల్లువ; 2: చూ, స్రోతస్విని; 3. నీరువచ్చెడితూము: చూ, వాహసము. 4.ఇంద్రియము;5.తొండముచివర: చూ, హస్తి.

స్రోతోంజనము. సం. వి. అ. న. నీలాంజనము: చూ, సౌవీరము.

స్రోతోనిమ్నన్యాయము. అం. నీరువల్లమెఱుఁగును. నిజము దేవుఁడెఱుఁగును అనురీతి.

స్రోతోవహము. అం: చూ, యతిప్రాణము.

## స్లే

స్లేంటింగు. వా. వి. ఏటవాలు.

స్లేటు. వా. వి. రాతిపలక.

## స్వ

స్వకము. సం. విణ: స్వకీయము, స్వము: చూ, స్వతంత్రము.

స్వకీయము. సం. విణ.—పై.—

స్వక్షేత్రము. అం: చూ, గ్రహముల దశాపరిమాణములు. [చూ, హిమాంశువు.

స్వచమసుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు:

స్వచ్ఛందము. సం. విణ: చూ, స్వతంత్రము.

స్వచ్ఛందుఁడు సం. విణ: అపావృతుఁడు, అప్రావృతుఁడు, ఉద్దాముఁడు, ధీరుఁడు, నిరవగ్రహుఁడు, భుజిష్యుఁడు, స్వతంత్రుఁడు, స్వైరి-స్వైరుఁడు. (తె) అడ్డపాటులేనివాఁడు, అడ్డములేనివాఁడు, ఇచ్ఛనుండువాఁడు

స్వచ్ఛము. సం. వి. అ. పుం. 1. తెలుపు: చూ, వర్ణము. 6; విణ. 2. తెల్లనిది: చూ, వర్ణము. 6; 3.—చొక్కము—సొచ్ఛము. స్వచ్ఛమైనది: చూ, హృద్యము. 2: (చూ, సమీచీనము. 2)

స్వజనుఁడు. సం. వి. అ. పుం. జ్ఞాతి, సగోత్రుఁడు: చూ, సగంధుఁడు. 2

స్వతంత్రత. సం. వి. అ. న. ఛత్రభంగము: చూ, స్వతంత్రము.

స్వతంత్రము. సం. విణ. 1.—సొంతము: అప్రావృతము, ఆత్మీయము, నైజము, వ్యక్తానము, స్వకము, స్వకీయము, స్వచ్ఛందము, స్వము, స్వత్వము, స్వరుచి, స్వాతంత్ర్యము, స్వాయత్తము. (అన్య) అంతరము. (తె) అనాయత్తము, సొంతము. తద్వి.—స్వతంత్రభావమునకు.—ఛత్రభంగము, స్వతంత్రత. (తె) ఇష్టువు, విచ్చలవిడి, సయాతము, సొత్తు, సొమ్ము, సొంతంతము; అం. 2: చూ, ద్వైదీభావద్వయము. [తానుగాపెర్వడు.:

స్వతంత్రించు. సం. అ. క్రి. ఒకరియనుమతిలేక

స్వతంత్రుఁడు. సం. విణ: చూ, స్వచ్ఛందుఁడు.

స్వత్వము. సం. వి. అ. న.—సొత్తు 1; చూ, స్వతంత్రము; 2. సొమ్ము: చూ, హిరణ్యము. 3.

స్వదీనచుంబనన్యాయము. ఆ. తనదీనముని ముద్దుపెట్టుకొనఁగా మీసములు తెగఁగాలినవని అనెడురీతి.

స్వదూనపోషిని. సం. వి. ఈ. స్త్రీ. బుద్ధుని భార్య, అనంత (చూ, భార్య. 1.౮౧.)

స్వధర్మ. సం. వి. ఆ. స్త్రీ. రూ—సుధర్మ: చూ, సభ. 2-౫.

స్వధర్మపరత. అం: చూ, సుజ్ఞానదాయకములు.

స్వధర్మము. సం. వి. అ. పుం: చూ, స్వభావము.

స్వధితి. సం. వి. ఇ. పుం. గండ్రగొడ్డలి, పరశువు: చూ, ముద్గరము 1—3.

స్వనము. సం. వి. అ. పుం. రూ—స్వానము. మ్రోఁత: చూ, స్వరము. 2

స్వనితము. సం. వి. అ. న. 1. ఉఱుము: చూ, స్తనితము; విణ. 2. మ్రోసినది: రణితము.

స్వపతుమువారు. అం: (వీరు ఏడుగురు:—చూ, అభిధయము.)

స్వపనము. సం. వి. అ. పుం: చూ, రూ—స్వప్నము.

స్వప్నకుఁడు. సం. విణ. నిద్రించినవాఁడు: చూ, శయితుఁడు.

స్వప్నక్కు. సం. విణ. (జ్)—పై.—

స్వప్నభాషణము. సం. వి. అ. న. నిద్రయందు లిబలుపరింత: చూ, శబ్దము. 3—౫౮.

స్వప్నము. సం. వి. అ. పుం. (రూ—స్వపనము—స్వాపనము—స్వాపము) 1. కల: ఆదర్శనము, దర్శనము. (తె) కల, కలవరము, కలవరింత—

కలవరింపు—కలువరించు-కలువరింపు, కలవలము. తద్వి.—౧ దుస్స్వప్నమునకు.—తు; ౨. కన్నుకలకు.—(తె) నిక్కులు; 3 కునికిపాటునకు.—అవస్యందనము, కౌసీద్యము, ఖమీలనము, తంద్రి-తంద్రి-తంద్రిక, ప్రమీల. (తె) కునికిపాటు, తంపర, తూగు, మఱచిపాటు; ౪. త్రివిధావస్థలలో నొకటి:- చూ, అవస్థలు: ౫: చూ, సుషుప్తి; ౬. ఒకరకము నిద్రకు.—కించితము; ౭. నిద్రయందలి వధకు.-సుప్తి; ౮. స్వప్నభాషణమునకు.—పలవరము: చూ, శబ్దము. 2, 2. నిద్ర: (స్వపనము- స్వాపనము- స్వాపము.) సంవేశము, సుప్తి, నిద్ర.(తె)కురుకు (కురుకు)- కూరుకు-కూర్కు, కూరుకుపాటు-కూర్కుపాటు, గురుక, తండగ, తూగు, నిదుర- నిద్దుర. తద్విశేషములకు.- చూ, స్వప్నము. 1; 3. చూపు: చూ, వీక్షణము; అం. 4: చూ, అవస్థలు.

స్వభాను. అం: చూ, సంవత్సరములు.

స్వభావక్రియ. అం: చూ, క్రియాంగములు (అంగము. 9.)

స్వభావము. సం. వి. అ. పుం.=స్వభావము: అంతము, అనూకము, అధ్యసనము, అభ్యాసము, అయనము, ఆమ్నాయము, ఉచ్చట, ఉపచారము, ఉపపత్తి, కాయము, గుణము, జీవము, తత్త్వము, ధర్మము, నిజము, నిసర్గము, నైజము, పరిశ్రయము, ప్రకృతి, భావము, రూపము, వర్ణము, శీలము, శ్రియము, సంసిద్ధి, సత్త్వము, సర్గము, సహజము, సాధనము, సిద్ధి, సృష్టి, స్వధర్మము, స్వరూపము. (అవ్య)అజ్. (తె):—అభ్యసనము, అలవడుట, అలవాటు, గొనబు, నిజము, పాడి, మామూలు, వాడుక, వాడుదల, సహజము, సాజము, సాదన. తద్వి.—౧. శరాభ్యాసమునకు.—సాధనము. (తె) సాదన; ౨. రూపునకు: చూ, స్వరూపము; 3. స్త్రీ స్వభావమునకు —స్త్రైణము; ౪. స్వభావముచేతఁగలిగినది:—స్వాభావికము. (తె) నైజము.

స్వభావసాత్త్వము. అం: చూ, ప్రేమపంచకము

స్వభావోక్తి. అం: చూ, అలంకారము 3. ("జాత్యుచితవేషభాషల వర్ణించుట. ఉదా.— లేళ్లు చెవులు నిక్కించి కోళ్లుదాఁటుచు జంచకత్తులఁజూచెడు.")

స్వభువు. సం. వి. ఊ. పుం. 1 వెన్నుఁడు: చూ, విష్ణువు. 1; 2. ముక్కంటి: చూ, శివుఁడు; 3 నలువ: చూ, బ్రహ్మ. 1.

స్వము. సం. వి. అ. పుం, న. 1 =సొమ్ము. ధనము: చూ, హిరణ్యము. 8, 2: తాను; విణ. 3. తనది, స్వకీయము, స్వీయము: చూ, స్వతంత్రము.

స్వయమ్. అం: చూ, దూతీచతుష్టయము.

స్వయంకృషి. అం: చూ, అష్టకష్టములు.

స్వయంగ్రాహము. అం: చూ, దానపంచకము.

స్వయంగుప్తుఁడు. సం. వి. అ. పుం: చూ, పుత్రులు. 1—౧౨.

స్వయంపాకము. సం. వి. అ. న. 1. ఒకపూఁట బత్తెము; 2. వ్రతాదులయందు బ్రాహ్మణుల కొసంగు వంటపదార్థము; 3. నియమస్థులగు బ్రాహ్మణులకొసంగు వంటపదార్థము.

స్వయంభువు. సం. వి. ఊ. పుం. (రూ—స్వభువు-స్వయంభూ.) 1: చూ, బ్రహ్మ. 1; 2: చూ, విష్ణువు; 3: చూ, శివుఁడు; 4: చూ, మన్మథుఁడు; 5. ఒకానొక బుద్ధశిష్యుఁడు: చూ, బుద్ధుఁడు.

స్వయంవర. సం. వి. ఆ. స్త్రీ. పతింవర, వర్యా: చూ, స్త్రీ.

స్వయంవరము. సం. వి. అం. పుం. తనంతట మగని వరించుట.

స్వరజతులు. అం. (సర్వజతులు): చూ, స్వరము. 2.

స్వరనేత్రాంగవికారము. అం: చూ, భస్త్రలు.
స్వరవర్తనము.అం.సామవేదము: చూ, సామము.
స్వరము. సం. వి. అ. పుం.=స్వరము.(ఉచ్చరింపఁబడునది). 1. అకారాది హకారాంతము దనుక యేఁబదిరెండక్షరములును స్వరములగు సంబంధులు అనఁబడును; 2. స్వరము వెలువడఁగానె ధ్వని (శబ్దము) పుట్టును. ధ్వని=స్వరము (అని కొందఱు). (రెంటికిని అవినాభావసంబంధము.): అభిలాపము, ఆరభటము-ఆర్భటము-(ఆర్భాటము), ఆరభటి-ఆర్భటి, ఆరవము-ఆరావము, కాహళము, కుణిందము, కుహారితము, క్రుష్టము, క్ష్వేడము, గరుత్తు, ఘు, ఘోష, జ, ఝు, ట, ఢక్క, ణ, ధ్వని, ధ్వానము, న, నదము-నాదము, నినదము-నినాదము, నిర్ఘోషము, నిర్హ్రాదము-నిహ్రాదము, నిస్వనము-నిస్వానము, పదము, పరిఘోషము, పాటకము, మృదంగము, రణనము, రణము, రణితము, రవము, రసితము, రాసము, వాద్యము, విరావము, విశ్వకద్రువు, శబ్దము, సంరావము, స్వనము-స్వానము. (తె. వి):—అలికిడి-అలుకుడు-అల్కుడు, (అళుకుడు), ఆర్భాటము, ఉరవలి, ఉలి, ఉలివు-ఉలివుడు-ఉలుకుడు, ఓలి, క్రిందు, గందరగోళము-గండ్రగోళము, గలిబిలి, గోలగోల, చేప్పుడు (చేష్ట), చిమ్మటబుఱ్ఱు, జాదు, చ్రియి, మెడిదము, మెంరపము, మొఱయిక, మ్రోఁగుడు, మ్రోఁత, రంతు, రవడి-రవలి-రవళి-రవాళి-అవళి, రొద, రొదాళము, రంకె-అంకియ-అంకె, వాఁగుడు, సద్దు, సడి, సలి, హాజ్జము-హాయిదము-హాద్దము, హాపు, హాయింపు. తద్విశేషములు.—౧. వేదస్వరములు:—ఉదాత్త-అనుదాత్త-స్వరితములు; ౨. గాయక దోషములులేని పాటకాండ్రు-అఱువిధములున్నాను.—(౧)ఘనము, (౨) గాగాలాపము, (౩) మధ్యమకాలము, (౪) తండాగ్రయెత్తు, (౫) పల్లవి, (౬) పద కీర్తన; వర్ణములు, స్వరజతులు, రాగమాలికలు; ౩. షడ్జాది.—స-రి-గ-మ-ప-ధ-ని (గ్రామము): చూ, సప్తస్వరములు; (౧) షడ్జము=షట్. నాశిక, కంఠ, వక్షు, తాలు, జిహ్వా, దంతములను నీయాఱుస్థానములందు, జము=పుట్టినది; (స) (తె) నెమలిస్వరము; (౨) ఋషభము=ఋషించినది. ఎద్దుస్వరము తో సామ్యముఁబొందునది. (రి); (౩) గాంధారము=గాంధార దేశములో రంజకమై పుట్టినది. (గ); (౪) మధ్యమము. క్రౌంచస్వరము. క్రిందిమూఁడు శ్రుతులకు మీఁదిమూఁడు శ్రుతులకు నడిమిది. (మ);(౫) పంచమము=నాభి సముద్గతుఁడై హృత్కంఠమూర్ధ్నములందుఁ దిరిగెడు వాయువు పంచమ స్వరస్థానప్రాప్తిచేత పంచముఁడనిపించు కొనెను; దానియందుఁ బుట్టిన స్వరము పంచమము (ప); (౬) ధైవతము.=ధీమంతుల సంబంధి గనుక ధైవతము. (తె) గుఱ్ఱపుస్వరము(ధ); (౭) నిషాదము.=మనస్సు దీనియందు నిషాదించెను. (కూర్చుండును). (ని); (మిగిలిన నీస్వరలక్షణములెల్ల మిగత విశేషాంశములయందుఁ జూడందగు); ౪: చూ,వీణ; ౫. వీణాదివాదనమునకు.—క్రోణము, క్వణనము-క్వణము-క్వాణము-నిక్వణము-నిక్వాణము; ౬. వీణాతంత్రులవలనఁబుట్టెడి స్వరక్రియాభేదము:—ఉష్ణి, కుబ్జిక, కూర్మిక; ౭. సరిగమాది వర్ణ సందర్భము:—అలంకారము; ౮. షడ్జ స్వరములను బలుకు రెండవది.:(రెండవ సారణి) అనుసారణి; ౯. సంగీతములోనిమూర్ఛ భేదము:—కాకలీయుత-కాకల్యంతరయుక్త; ౧౦. ధ్రువాదిభేదబద్ధ సంగీతమునకు.-గీతము; ౧౧. స్వరజాతులకు-షడ్జకైశిక, షడ్జోదీచ్యవ, షడ్జమధ్యమ, గాంధారోదీచ్యత, రక్తగాంధారి, కైశికి, మధ్యమోదీచ్యవ, కర్మా

రవి, గాంధారపంచమి, అంధ్రి, నందయంతి; ౧౨. సప్తస్వరముల కాలపరిమాణము:— అమ్ (చూ, వర్ణము); ౧౩. సంగీతశ్రుతి జాతివిశేషము:— ఆయతి; ౧౪. సంగీతగమక భేదమునకు.— ఉత్ఫుల్లము; ౧౫. సామగానమునకు.— ఉద్గీథము; ౧౬. సంగీతవాద్యముల ధ్వనులకు.— తక, ధిమి, కిట, ఝణము; ౧౭. సంగీతమునకు.— కీర్తన, గమ్, గ, గంధర్వము—గాంధర్వము, గాథ, గానము, గీతము, గీతి, గేయము, చారము, రాగము, వర్ణాటము, సంగీతము. (తె) పాట; తద్వి.— అల్లోనేరెడు-అల్లోనేరేడు—అల్లోనేరెడు-అల్లోనేరేడు; ౧౮. నోటితో పాడెడు సంగీతమునకు.— అనిబద్ధవంతము; ౧౯. సంగీత సప్తస్వరసమూహమునకు.— కవాటము. (తె) పాటరవళి; ౨౦. రాగాదియుక్తముగ స్వరస్థానములయందు మెట్లు కుదుర్చుట.— మేళము; ౨౧. నృత్తగీతవాద్యముల విలంబ ద్రుత మధ్యమానములు.— ఓఘము, ఘనము, తత్వము; ౨౨. నృత్తగీతవాద్యములయందు చూపు కాలము:— లయప్రాణము, విలంబితము; ౨౩. క్షణమాత్రస్థాయికి:— క్షణికము; ౨౪. ఎడమచేతి తంతిమీటునకు.— తలము; ౨౫. వీణాదిస్వరమునకు.— ప్రక్వణము—ప్రక్వాణము. (తె) పలుకు-పల్కు; ౨౬. వెనుకటిచరణములయందలి యుద్ధము ననుసరించి సంగీతము మొదట చెప్పెడు వాద్యము.— పల్లవము; ౨౭. స్వరస్థాయి: (తె) తాయము—తాయి; ౨౮. వీణాదిచతుర్విధవాద్యధ్వని.— వాదనము. (తె) వాదు; ౨౯. నృత్తగీతవాద్యములు సమముగానుండుటకు.— లయ; ౩౦. తానశబ్దపూర్వకముగు రాగాలాపమునకు:— తానము. (తె) తందనము. (చూ, తానములు); ౩౧. వాద్యచతుష్టయము.— తతము, అనద్ధము, సుషిరము, ఘనము (అతోద్యము=ఘనము); ౩౨. అయిదు స్వరములతోఁ గూడిన రాగము:— ఔడవము—ఔడవము; ౩౩. గంధర్వగానమునకు.— ఋజిగానము, గాంధర్వము; ౩౪. అనుదాత్తస్వరవిశేషమునకు.— నిహతము, ప్రచయము (చూ స్వరము ౨-౧); ౩౫. గానసాట్యయోగ్యశబ్దసంతతికి.— (తె) జతి; ౩౬. స్వరవిన్యాసభేదము.— గమకము; ౩౭. వీణ కంఠము వీనియందలి ధ్వనివిశేషము.— అనేకపస్వరము. (తె) వీనుఁగుసొరము; ౩౮: చూ, స్త్రీరాగములు; ౩౯: పురుషరాగములు:— భైరవి, మాళవి, బంగాళ, హిందోళ, రాగమంజరి, శ్రీరాగము, గౌరి, భూపాళ. (8); ౪౦. స్వరస్థానము తప్పఁజెప్పినస్వరము:— అపస్వరము; ౪౧. పల్లవివెంబడి చరణమునకు.— అనుపల్లవము, అనుపల్లవి; ౪౨. తాళమానలఘు చతుష్టయకాలము.— నిశ్శబ్దము; ౪౩. పదునాలుగు అక్షరములుగలతాళవిశేషము.— ధ్రువము; ౪౪. కొన్నిరకములతాళములు:— (చూ, రాగములు; చూ, తానములు; చూ, తాళము. 2.) ఆనందభైరవి, అరభటి, ఆరభి, ఋషభము, కకుభము, ఘురటి, కల్యాణి, కాంభోజి, దర్బారు, ధవళము, నాట, పంచాలి-పాంచాలి. (తె) పంచే-పంజేళము, మలహరి, మోహన, వషట్కర్త, వసంతము, శంకరాభరణము, శ్రీరాగము (శ్రీ), సౌరాష్ట్రము, హిందోళము; (తె). జోవడి-జోవళి; ఇత్యాది. తద్విశేషములు.— హిందుస్థానీ రాగ తాళవివరములు:— (ఇవి శీర్షికా పదములుగ చేర్పలేదు.) పురుషరాగములు ౬. వీట్లలో నొక్కొక్కదానికి ఆఱుగురు భార్యలచొప్పున ౩౬. స్త్రీరాగములు పుట్టినవి. ఇందువలన "ఛేరాగ్ ఛత్తీస్

రాగ్ని" అనిచెప్పెదరు. కడమరాగములు వీటిబిడ్డలు: పురుషరాగముల పేళ్లు. ౧ మేఘ్, ౨ సిరి, ౩ దీపక్, ౪ హిందోల్, ౫ మాల్ కౌన్, ౬ భైరో. తక్కిన ౩౬ రాగ్నులు వీటి భార్యలు. తక్కినవన్ని యుబిడ్డలు.

— *సప్తస్వరముల పేరులు *—

| షరజ్ | రిగవ్ | గధార్ | మద్దం | పంచం | ధైవత్ | నిఖాద్ |
|---|---|---|---|---|---|---|
| స | రి | గ | మ | ప | ధ | ని |
| రి | గ | మ | ప | ధ | ని | ధ |
| గ | మ | ప | ధ | ని | ధ | ప |
| మ | ప | ధ | ని | ధ | ప | మ |
| ప | ధ | ని | ధ | ప | మ | గ |
| ధ | ని | ధ | ప | మ | గ | రి |
| ని | ద | ప | మ | గ | రి | స |

ఈ స్వరములకు ఎక్కువ తక్కువలనుబట్టి వికృతమేర్పడును. ఇత్యాది.—రాగకాలములు, రాగములు.—ఉదయము మొదటి జాముని పాడవలసిన రాగములు:—

బిలావల్, అలయాబిలావత్. అలయ్యా, గౌడబిడావల్, సుద్ బిలావల్, నట్ బిలావల్, సువాబిలావల్, సుగరై బిలావల్, సువా, సుగరై, కోకబ్ బిలావల్, నట్ నారాయన్, సురట్ బిలావల్, బిరారా.

రెండవజాముని:—

బరారాతోడి, తోడి, హుసాతోడి, దేస్ తోడి, సింధుతోడి, సావరి, అసావరి, బరహన్స్, బరహన్స్ సారంగ్.

మూడవజాముని:—

సారంగ్, సురట్ సారంగ్, జల్ సారంగ్, బస్ సీసారంగ్, మద్ మావద్, గౌడ్ సారంగ్, బిందాబన్ సారంగ్, నట్ సారంగ్.

నాలుగవజాముని:—

నట్, పరకీనట్, మళలానట్, ఛయ్యానట్, మేఘునట్, భీంపలాస్, ధనాశలీ, పూర్వీ, పూర్వా, పూర్వీ, మారో, గౌడ్, గౌరి, గౌరా.

అయిదవజాముని:—

సిరి, జయత్ సిరి, మాలీ, మాల్ సిరి, గౌడ్ సిరి, సిరిపంత్, భాకా, మోహనకల్యాన్, కల్యాన్, శ్యామ్కల్యాన్, అమీర్ కల్యాన్ అమీర్ నట్. యమన్ కల్యాన్, యమన్, యమినా. దీపక్, దీపక్ కల్యాన్, కామోద్, జామూద్, కామోద్, కల్యాన్, జామోద్ కల్యాన్; కోకబ్ కల్యాన్, భూపాలీ, భూపాలీ కల్యాన్, భూప్ కల్యాన్, జంఝోటి, మేఘ జంఝోటి.

ఆఱవజాముని:—

శంకర్, కాలంగడా, బహారానంద్, కాఫీ, ములాతాసికాఫీ, బేహాగ్, శంకరబేహాగ్, దూద్ బచన్ బేహాగ్, జజావంతి, ఖంమాజ్, శుద్ ఖంమాజ్, నాయకీ, నాయకా, పీలో, పట్ మంజరీ, కానడా, జోగికానడా, బూందీకానడా, జద్దీకానడా, మియ్యాకానడా, బాకేసిరికానడా, బాగేశ్వరి, దర్బార్, రాష్ట్రా, షహానా, అధానా, కేధార్.

ఏడవజాముని:—పరజ్, సోహని, లలిత్, బసంత్, మాధో, బంగాలీ, మంగల్, హిండోల్, మాల్ కౌన్, కంధార్, గంధార్.

ఎనిమిదవజాముని:—

దేశగాంధార్, దేశగిరి, గోజరి, రాంకలీ,

టన్ కల్లీ, పూల్ కల్లీ, గైరో, పీతరింభైరో, సేబాస్, భూపాల్, బోహార్, వేహావ్, దేవగిరి. తిరుగ నుడయాదిగా నీరాగములను పైఁజెప్పిన ప్రకారము పాడవలయును. ఇత్యాది వివరములకు సంగీతశాస్త్రమే ఆధారము; ౪౫. వ్యంగ్యపరిధానముగుశబ్దము:— ధ్వని; ౪౬. ధ్వనుల భేదములు:—(౧): విష్ణు కీర్తనము, శకీర్తనము; (౨) వివాహప్రియుక్తమంగళవాద్య ధ్వని.— ప్రియవాదిక; (౩) జయజయయను ధ్వనికి —డ, ఢ, జయభేరి. (తె) జేజేకి; (౪) హేల. (తె) ఏల, ఏలపాట; జంపాలు, జోలపాట, జోల, జోవ; సువ్వలాల-సువ్వాల; (౫) రథము పోవునప్పటి మ్రోఁత:—(తె) తిడిమ్మి; (౬) ఊతి; (౭) ఝుంఝు; (౮): (తె) నపీరు; (౯): హుంకారము, హుంకృతి; (౧౦) గోవుల ధ్వనికి:-(తె) ఊల; (౧౧) తస్కరసంకేతధ్వనికి.—(తె) ఈల, ఊల-ఊళ; (౧౨): కంఠధ్వని, కంఠము, కఠము, కుహరము, రవము, రావము, శారీరము. (తె) అఱపు-అఱుపు-అఱుపు, ఎలుఁగు-ఎల్గు-ఎలువు, కూఁత, గొంతు-గొంతుక, రవము, సొరము; (౧౩) ఆర్తకంఠధ్వని, ఉత్క్రోశము, ఉద్ఘోషము, క్రందనము. (తె. వ.) అఱపు-అఱుపు-అరుపు-అఱుపు-అర్పు, ఏడుపు-ఏడ్పు-ఏలుపు, కుయి-కుయ్యి-కూయి, కూఁక, కూఁత, మొఱ-మొఱ్ఱ-మొఱపు, మొఱుఁగు-మొఱుపు, వంత, వాపోక; (౧౪): ప్రణాదము. (తె) అరుపు-అఱుపు-అర్పు-అఱ్ఱాపు, బొబ్బ, బొబ్బరింత, బొబ్బాటము, బొబ్బెట్టు; (౧౫) అవ్యక్త మధురధ్వనికి.—అరజము, కంఠళము, కలకంఠము, కల-కళ, కలము, కలధౌతము, కలధ్వని, కాకలి, కాహళము, గుంజ, గుండకము, హాసము; (౧౬): వివరీతధ్వని:—

(తె) ఆలగోడు-ఆలగోడు, పెడబొబ్బ, మొత్తుకోళ్లు; (౧౭) పెద్దకూఁతకు.—ఉన్నాదము. (తె) అరపు-అఱపు-అఱుపు-అఱుపు, కేక, ఉంకె; (౧౮): అవ్యక్తనిస్వనము, మర్మరము. (తె) మొఱమొఱ; (౧౯): సల్లాపము. (తె) గుసగుస; (౨౦) మరణసమయపుకేక.—(తె) కడకేక; (౨౧): గద్గదస్వరము, గద్గదిక (గాద్గద్యము). (తె) ఈరెలుఁగు, కీఁచు, కుఱుచే, గగ్గు, గున్యకుత్తిక, డగ్గుత్తిక, తీఁగరొలుఁగు-(తీఁగెరొలుఁగు); (౨౨): ఆలప్తి-ఆలాప్తి, ఆలాప్తి, ఆలాపనము-ఆలాపము. (తె) ఆలతి-ఆలత్తి, ఆళరి, ఓడము; (౨౩): గుంపువపుట్టిన పెద్ద మ్రోఁతకు.—ఆరజము, కలకలము-కళకళము, కోలాహలము, సంరావము. (తె) అంబలము-అలబలము, ఎలగోలు, కొలకొల, గొలకు-గొలగొల-గొల్లు, రచ్చ, రొద, రొదాళము, ఉంతు, ఉంపు, హాళావళి; (౨౪) వినికిరాని కేక.—(తె) పొలికేక; (౨౫) పొలిమేరకేక:—(తె) పొలికేక; (౨౬) అనురాగపుకేక:—ప్రణాదము; (౨౭) ధ్వనియుక్తరోదనము:—క్రందనము, క్రందితము, క్రుష్టము; (౨౮): తలలోనుండి రాఁబడిన మ్రోఁతకు:—తారము; (౨౯) యుద్ధమందలి భటులమ్రోఁత:—ఆడంబరము, క్రందనము. (తె) పెడబొబ్బ; (౩౦) సైన్యముచే దఱిసినప్పటి శబ్దము:—ఆకులము, ఘుంజము; (౩౧) యుద్ధారంభ వాద్యధ్వని:—అర్ధతారము, పటహము; (౩౨) గోవులగీతము:—గీతి; (౩౩): అశరీరవాక్కు, అశరీరవాణి, అశరీరి, ఆకాశవాణి; (౩౪) గుసగుసధ్వని.—గుంజనము, గుంజితము; (౩౫) ఇంచుకంత చేప్పుడు:—(తె) చీటుచిటుకు; (౩౬) గద్గదకంఠసాధుధ్వని:—(తె) గ్రొటు; (౩౭) విద్రియందలి ధ్వని:—(తె) గుఱక-గుఱాక—

గుబు-గుబ్బు; (౩౮) ఓర్వలేనితనమున ఆడి పోసుకొనుటకు.—అఘోషణము. (తె) ఊ ళ్పత, గుపాఱు, గోరవ, రంతు, రట్టడి, రట్టు, రద్ది, రద్దు, రవ-రవ్వ, సడి; (౩౯); (తె) కర్రిందు, గజిబిజి, గలిబిలి, గసిబిసి, దొందడి, దొమ్మి, రాటము, రాటు, అొ మ్చే, సందడి; (౪౦): (తె) కొండవలుకు; (౪౧) వింటినారి మ్రోతకు.—ఆస్ఫాకర ణము, కింజ, గుణధ్వని, టంకారము, ధను ష్టంకారము, విష్ఫారము-విస్ఫారము, శింజ; (౪౨):(తె)లాలి,లాలిపాట;(౪౩);ఎక్కుల గాలిచేప్పుడు:—(తె)రింగు-తింగు, ఉవ్వు; (౪౪) నడిమివ్రేలిని పెద్ద వ్రేలితోఁగూర్చి ధ్వనింపఁజేయుట:—(తె) చిటిక-చిటికె, చిటికరింత, నెటిక-నెట్టిక, వ్రేల్లుండి; (45) క్ష్విడి, త్పటము, త్పటి. (తె) చిటిక-చిటికె, చిటికరింత, నెటిక-నెట్టిక, వ్రేల్లుండి; (46) కళావిహీనముగ చేప్పుడు:— (తె) డిబ్బు; (47) బాజోలధ్వనికి.—(తె) బాజోలు; (48): (తె) సంతగోల; (49) పీడాధ్వనికి.—కుంథనము. (తె) మూలుగు-మూలుగు-మూల్గు; (50) అచేతనవస్తువులొ కదానితోనొకటి తాఁకుటచే కలుగుధ్వని:— (తె) చేప్పుడు-చేడ్పు; (51) వానచేప్పుడు:—ఘర్ఘరము. (తె) ఓలు; (52) గర్భము మ్రోఁత:—ఘర్ఘరము; (53) వాద్యముల చేప్పుడు:—ఝుంకృతము, తూర్యము; (54) జలవిహ్వృత సమయధ్వని:—(తె) ఓల; (55): కిలకిల, హర్షస్వనము; (56) తనధ్వనికి.—ఆత్మఘోషము; (57): వీరహుంకారము, (తె) ఊలుము; (58): గాలివిసరుట వలన గలిగినధ్వనికి.-ఝూత్కృతము; (59): జలుహస్త్యాదుల ఎక్కుఁడేచేప్పుడు:— ఛ, (తె): రివ్వు-తివ్వు; (60)నిప్పులమంటఁమ్రోఁతకు.—చటితము. (తె)రవరవ; (61)(విణ) మ్రోసినది:—రణితము; (62) కీళ్లు విఱుగుటచేఁ గలుగు ధ్వనికి.—(తె) పెటికె; (63) ఆకులు లోనగువాని మ్రోఁతకు:— మర్మరము. (తె) మొఱమొఱ; (64) చెడుగుడు ఆటకూఁతకు:—(తె) బిల్లి (అల్లిబిల్లి చెంగలనాత్); (65) అలంకరణములధ్వనికి.—ఆఘూర్ణితము, జీన, భూషణధ్వని, శింజితము; (తె) నగలచేప్పుడు; (66) అందెల చేప్పుడుకు.—ఝుంకృతము, శింజ; (67) గొలుసులధ్వనికి:—ఖణ్ఖృతము; (68) అయుధధ్వనికి.—ఖణ్ఖృతము; (69): (తె) గొనబుపాట, సంచెపాట; (70) భూగర్జనము:—గాతువు; (71) శబ్దమాత్రమునకు.—కాహళము; (72) పాముకొక్కికి.—కాహళము; (73) చెడ్డపీనధ్వనికి:—కార్తస్వరము;(74) బిడ్డలు నిద్ర లేచేనప్పటి మూలుగు:—(తె) కిదుకు; (75) బిడ్డలమూలుగు:—(తె) కిదుకు; (76) ఘంటఁచేప్పుడుకు.—ఠ; (77) ఘంటా అనురాగమునకు—ఘంటు; (78) మద్దెల లోనగువాని మ్రోఁతకు—ఆతంకము, అనకము, గుండిలము, గుందలము. (తె) అరపు-అఱపు-అఱుపు-అఱుపు; (79) మురజధ్వనికి:—మార్జన; (80) కొమ్ముపాద్యమునకు:—(తె) సింగినాదము; (81) చర్మాచ్ఛాదితమర్దలాది వాద్యమునకు.-అవనద్ధము; (చూ, వీణె ౧౦); (82) సుషిరవాద్యమునకు.—ఆహికము, సుషిరము. (తె) తారః (83) మృదంగరవము:—(తె) దిందిం-దిమిదిమి-దిముకు; (84) డిండిమధ్వనికి.— డిండి; (85) పిల్లనఁగ్రోవిలోనగువాని ధ్వనికి.— జమ్, జంజని, త; (86) తప్పెట ధ్వనికి.—టింటి; (87) ఢక్కాధ్వనికి.— టట్టరి; (88) లంపావాద్యమునకు.—టట్టరి; (89) మృగపక్ష్యాదులధ్వనికి.—రుతము, రుతి, వాశితము-వాసితము; (90) కంచుమ్రోఁ

తకు.—(తె) కంగు; (91) మృదంగాదివాద్యమునకు.—వాద్యము. (తె) వాజ్జెము–వాద్దెము, వాపు, వాయింపు, వాయిదము (చూ, స్వరము. 2-౭౮); (92) ఢంబనాదమునకు.—ఢణవము, పాృంగణము; (93) అతిదారుణధ్వనికి.—కర్రిందు, గోల, రంపి, రంపు–అంపు–అంతు–అంతె, రగ్గి; (94) మాఱుమోృఁతకు.—ప్రతిధ్వానము, ప్రతిశ్రుతి. (తె) మఱుమోృఁత–మాఱుమోృఁత; (95): (తె) పెళపెళ; (96) ప్లుతస్వరమునకు —ప్లవము, ప్లుతము; (97) ధ్వన్యనుకరణములకు: చూ, హూహూ; (98): మంద్రము; (99) అవ్యక్తవాక్యము:—కాహళము; (100): చూ, తానములు; (101) శింఢిమధ్వని:—గురుమర్దలము; (102) తుపాకి పిరంగిలోనగువాని ధ్వనికి.—(తె) ఆగాదు; (103) కుండమీఁది వాద్యమునకు.—కమఠము; కరతాళధ్వనులకు:—(104) కరతాళము, కరతాళి, కర్దిరి, కలంకవ, కులక్కము, తాలమర్దలము; (105) శంఖధ్వనికి.—కాంబవకము, ఖఙ్, డ, శంప–సంప; (106) ఝర్ఝరమను ధ్వనికి.—ఝ; (107): చూ, జన్యతాళములు; (108) పెద్దఘుల్లీరవమునకు:—కర్ఝుల్లీరవము; (109) కటంబధ్వనికి —కటంబము; (110): (తె) గొబ్బిళ్లు; (111) దుఃఖభయాదులచేతఁగలుగు ధ్వని వికారమునకు.—కాకువు; (112) స్వరములలోని భేదములు—కల్లత్వము, ఘర్ఘరి; (113); పక్షిధ్వనికి.—కూజితము. (తె) పలుకు–పల్కు; (114): గంభీరము; (115): సింహగర్జనము, సింహనాదము, క్ష్వేడ, క్ష్వేడితము, క్ష్వేళ, క్ష్వేళితము, గర్జ, చుకాృరము. (తె) బొబ్బ, సింగరవళి–సింగావళి; (116) ఏనుఁగు ధ్వనికి.—కరి[illegible]ము, గర్జ, గర్జము–గర్జితము, [illegible] ఘీంకృతము–ఘీంకృతి, [illegible]; (117) ఏనుఁగు పెద్దకూఁతకు.—కాఫీటాృరవము; (118) వ్యాఘ్రధ్వనికి.—గర్జ. (తె) కోటరింపు, బొబ్బరింత; (119) నక్కకూఁతకు.—(తె) ఊళ–ఊళ; (120) కుక్కకూఁతకు.—బుక్కనము, భషణము. (తె) బొంయి–బొయ్యి, మొఱఁగు–మొఱుఁగు–మొఱుఁగుడు–మొఱువు; (121): (తె) పేఁకసారము; (122) పందికూఁతకు:—ఘుర్ఘురము. (తె) గుటగుట, గురగర; (123): వీణ, కంచము వీని యందుఁబుట్టిన ధ్వనికి.—అనేకపస్వరము. (తె) ఆఁబోతుసారము, ఏనుఁగుసారము; (124): ఆవులు లోనగువాని ధ్వనికి.—అంభ, చిత్కృతము. (తె) అంబా–అంబే–ఉంబ; (125) కోతిధ్వనికి.—(తె) ఉఱ్ఱు; (126): ఉత్పలము, కాకధ్వని. (తె) కాకికూఁత, కావు; (127) నెమలికూఁతకు—కకూజితము, కేక. (తె) కిప, కీక, కేకిస, కేస; (128) హంసధ్వనికి.—క్రేంకృతము; (129) కొంగధ్వనికి.—క్రేంకృతము; (130) కోకిలధ్వనికి.—కుహరితము – కూహరితము, కుహువు – కుహూవు, కోకిలము, మణితము–మాణితము; (131) గుడ్లగూబధ్వనికి.—(తె) గూండ్రు; (132) తుమ్మెద ధ్వని:—ఝార్త్రికి, గుంజనము, గుంజితము, ఝంకారము–ఝంకృతి; (133) ఈలపురుగు ధ్వనికి.—ఝిల్లి – ఝిల్లిక. (తె) ఈల, చిమ్మటబుఱ్ఱు, జిఱ్ఱు; (134) రతికాలమందలి గళరవము:—కుహరితము, కూజితము, మణితము–మాణితము, రతికూజితము. (అవ్య) ఆనో. (తె) కూకీపలుకు, గిలకుపలుకు, పావురపుఁబల్కు – పావురాఁయిల్కు, పెల్లుఁగుక్కరవపలుకు, లోఁగుక్కుఁ, పెలిగుక్కు. తద్వి.—౧. ఘూ(ఘూ)త్కృతి; శ్వసితము. (చూ, రతిధ్వనులు); (135) పరుకంఠరవమునకు.—అరపు–అఱపు–అఱుపు—

ము, రామణీయము, రుచిరము, రుచ్యము, రూప్యము, లసువు, వలితము, వల్గువు, వామము, విమలతమ్, శాలి, శృంగారము, శోభనము, శ్రీమంతము, సాధువు, సుందరము, సురభి సుషమ, స్వాదువు, హారి. (అవ్య) ఆరాత్, శమ్. (తె. వి):—అనుఁగు, అలరు, ఆరజేము, ఇంపితము, ఇమ్ము, ఒడికము, ఒనరు, ఒప్పిదము, ఒఱపు, కలికి-కల్కి, కొమరు, గబకము, గరగరిక, గొనబు-గొనము, గోవ, చిని-చిన్ని, చిన్నరి-చిన్నారి, చిన్నరిపొన్నరి-చిన్నారిపొన్నారి, చెంపు, చేఁదు, చొక-చోకా, చొక్క-చోక్క, చొకాటము-చొక్కటము-చొక్కాటము, చొకారము-చొక్కారము, చొక్కపరము, చొక్కము, జోక, తిన్న-తిన్నన, తీరు-తీఱు, తోరము, నయము, నలువు, నిబ్బరము, పన్ను, పసను, పొంపు, పొన్నరి-పొన్నారి, పోలు, ప్రన్న, బాగు, బెడఁగు, బెళఁగు, మాను, ముద్దు, మురువు-మురివు, రకము, రమణ, లెస్స, వింగడము, విన్నాణము, సవర-సవరన, సవురు-సౌరు, సని, సింగారము, హరువు, హావణింపు. తద్విశేషములు:—౧. మిక్కిలి మనోజ్ఞమునది:—బృందిష్టము. (తె) అల్లారుముద్దు; ౨. చక్కనిది: (తె) చేక్క, జేవర, తిన్న. (వి) ఆర్జవము, ప్రగుణము. (తె) చేక్కన, చెక్కటి, చోయు, జేవరన, తిన్నన; ౩. మనోజ్ఞతకు.—మంజిమ-మంజిమము, మనోజ్ఞత. (తె) గొనబు, తిన్నన, ప్రసన్న, బంగారుమేఁడ, మాను, ముద్దు, హరువు. (సం) (అవ్య.) స; ౪. సరియైనది:—అజిహ్మము-ఆజిహ్మము, ఋజువు, ప్రగుణము; ౫. మెత్తైనది:—చూ, సుకృతము. ౩; ౬: చోక్షతరము. (తె) చొక్కపరము: చూ, సమీచీనము. 2 (చూ, స్వచ్ఛము. 8.); 8. మనస్సునకు ప్రీతికైనది (వస్తువు): చూ, హృద్యము. 3; ౪. మనస్సునందుఁ బుట్టినది (కోరిక): చూ, వాంఛ; 5. వశీకరణ వేదమంత్రము: చూ, మంత్రము. 1; తద్వి.—౧: వ్యాహృతి; ౨: గాయత్రి, సంజ్ఞ.

హృద్యశారీరశాలిత్వము. అం: చూ, సుగుణములు.

హృల్లేఖము. సం. వి. అ. పుం. 1. ఎడఁబాటు: అయోగము-ఆయోగము, ఆయుక్తకము, విచ్ఛిత్తి, విచ్ఛేదనము, విధురము, విప్రయోగము, విప్రలంభము, వియోగము, విరహము, విరోధము, విశ్లేషము. (అవ్య): అప. (తె): ఎడఁబాటు, ఎడయిక, విరాళి; 2. బుద్ధి: అంకము, అనుభవము, అపలబ్ధి, అభిజ్ఞానము, అభిమానము, అవగతి, ఆకలనము, ఆత్మ, ఆత్మజ్ఞానము, ఆయోగము, ఇంగము, ఇతము, ఇతిహాసము, ఉపజ్ఞ, ఉపలంభము, ఉపలబ్ధ, ఉపలబ్ధి, ఋ, క, కలాపము, కావ్య, కానువు, ఖంబు, గతి, గృధువు, గృహీతి, గ్రహణము, చత్వరి, చార్వి. చితి-చిత్-చిత్తు, చేతన, చైతన్యము, జ్ఞప్తి, జ్ఞానము, ధ, ణ, దర్శనము, దృక్కు, దృష్టి, ద్రవ్యము, ద్రవ్యాంగము, ధిషణ, ధీ, న, నిర్వేదము, నివేదనము, నిష్క్రమము, పండ, పరికరము, ప్రజ్ఞ, ప్రజ్ఞానము, ప్రతిపత్తి-ప్రతిపత్తు, ప్రణిధ, ప్రత్యయము, ప్రధానము, ప్రాజ్ఞ, ప్రేక్ష, బుద్ధి, బోధము, భగము, మంతువు, మతి, మనము-మనస్సు, మనీష, మాయ, మేధ, రహి, వికసనము-వికాసము, విజ్ఞానము, విద్య, విద్రవము, వివేకము, వేదన, శరము, శేముషి, సంఖ్య, సంగతి, సంజ్ఞ, సంపత్తు, సంవిత్తి-సంవిత్తు, సమయము, సూత్మము, స్మరణము, స్మృతి, హేవాకము. (అవ్య) అధ్యాత్మము—అధ్యాత్మికము, ఇతి. (తె. వ.):—అరువు, ఎఱుక-ఎఱుకువ, కఱద, గరగరిక, గురికొచ్చె, తెలుకువ-తెలుకువ, తెలివి-తెలివిడి, తేకువ, తేట,

నెజి, వర్గ, బుద్ధి, మది, రహి. తద్వ్య.— ౧. సామాన్యజ్ఞానమునకు:— బుద్ధి (తె) బుద్ది; ౨. నిష్ఫలమైన తరువాత నుండెడి తెలివికి. ఖేదము; ౩. బుద్ధికుశలతకు— (తె) చొరవ; శాస్త్రజ్ఞానమునకు:— వ్యుత్పత్తి. (అన్య) ఆజ్; ౫. శ్రవణేంద్రియముతోఁగూడు కొను బుద్ధికి.— ఆశ్రియము, ౬. ఇచ్ఛలేని బుద్ధికి:— క్షేపము, వికల్పము; ౭. చాలు ననెడి బుద్ధికి:— పర్యాప్తి. (తె) చాలు; ౮. దేహాత్మాది భేదజ్ఞానమునకు:(తె) తెలివి; ౯. మిక్కిలి తెలివికి:— పరిబోధము; ౧౦. యథార్థజ్ఞానమునకు:— ప్రమ, ప్రమితి; ౧౧. స్వాధీనముకానిబుద్ధికి:— (తె) చిమ్మటి; ౧౨. జ్ఞానవిశేషమునకు:— కేవలము; ౧౩. తెలివిగలది:— అర్థ్యము; ౧౪. సప్తవిధబుద్ధులకు:— చూ, సప్తవిధబుద్ధులు; ౩.అపూర్వార్థమును తెల్పిక్షించుట: అధ్యాహారము, ఊహము, తర్కము, యోచన. (తె) ఉజ్జి.

హృషితుఁడు. సం. వి. అ. పుం: చూ, హృష్టుఁడు,

హృషీకము. సం. వి. అ.న.(దీనిచేత సంతోషింతురు.): అక్షిగతము,? గోచరము, ఇంద్రియము, విషయి: చూ, ఇంద్రియార్థము, చూ, విషయము. ౩). తద్వ్య.— నేత్రాదికేంద్రియములు:— ఇందు జ్ఞానేంద్రియములు 5, కర్మేంద్రియములు 5=10. జ్ఞానేంద్రియములు:— త్వక్కు, చక్షువు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము; కర్మేంద్రియములు.— వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థలు, మనస్సుతోఁ గూడ ఏకాదశేంద్రియములు.మఱిన్ని ఆకర్షణము, ఇంద్రియము, కరణము, ఖమ్-ఖంబు, గుణము లెం.)

హృషీకేశాయనమః. అం. (హృషీకేశః=హృషీకాణాం=ఇంద్రియాణాం, ఈశః=నియామకః) ఇంద్రియములను నియమించే పరమాత్మకొఱకు నమస్కారము: చూ, ఓమ్.

హృషీకేశుఁడు. సం. వి. అ. పుం. చూ, విష్ణువు.I.

హృష్యమాణుఁడు. సం. విణ. సంతోషించుచున్న మనస్సుగలవాఁడు: చూ, హృష్టుఁడు.

హృష్టము. అం: చూ, దృష్టులు.

హృష్టి. సం. వి. ఇ. స్త్రీ: చూ హ్లాదనము.

హృష్టుఁడు. సం. విణ. సంతోషించినవాఁడు. రూ—హృషితుఁడు, ఆనందుఁడు, ఉత్కుఁడు, ఉల్లాఘుఁడు, ఊర్జస్వలుఁడు, ఊర్జస్వి, తుష్టుఁడు, తృప్తుఁడు, నందనుఁడు, ప్రమనుఁడు, ప్రముదితుఁడు, ప్రహ్లన్నుఁడు, ప్రీతుఁడు, ముదితుఁడు, వికుర్వాణుఁడు, హృష్యమాణుఁడు, హృష్టమానసుఁడు. (తె) గెలివికాఁడు. తద్వ్య.— ౧. సంతోషముగలవాఁడు:— హ్లాషి; ౨ సంతోషించువాఁడు:— హ్లాదణుఁడు; 3. సంతోషింపఁజేయువాఁడు: హర్షకుఁడు.

హృష్యక. అం: చూ, మధ్యమగ్రామ గత మూర్ఛనలు.

హృష్టాంశము. అం: చూ, షష్ట్యంశములు.

# హె

హెగ్గడి. వై. వి.—హేడక. 1. అంతఃపురకావలికత్తె: చూ, సౌవిదల్లుఁడు; 2.—అంతఃపురకావలివాఁడు: చూ, సౌవిదల్లుఁడు.

హెగ్గడికత్తె. వై. వి. అంతఃపుర కావలికత్తె. కళా. 2, అ. 69, రూ—ఎగ్గడికత్తె—హెగ్గడి: చూ, సౌవిదల్లుఁడు. [చూ, సౌవిదల్లుఁడు.

హెగ్గడికాఁడు. ద్వ. వి.అంతఃపుర కావలివాఁడు:

హెగ్గడివాఁడు. ద్వ. వి.—వై.—

హెగ్గడీఁడు. ద్వ. వి.—హేడక. (హెగ్గడి + ఈఁడు)—వై.—

హెచ్చరించు. దే. స. క్రి. 1: రూ-ఎచ్చరించు-ఎచ్చెరించు-ఎచ్చరికించు-హెచ్చరికించు, పలుకరించు-పల్కరించు, మందలించు, మూదలించు, సొసాయించు; అ. క్రి. 2. వృద్ధిఁ బొందు. ఆం, భా. తృ. 89: చూ, వర్ధిల్లు.

హెచ్చరిక. దే. వి. 1: రూ-ఎచ్చరిక-ఎచ్చరము-ఎచ్చరింత-ఎచ్చరింపు-హెచ్చరింపు, ఎడపదిలము, ఏద, ఏవ, పదిలము, పొణిమి, బరాబరి-బరాబరిక, హణిక-హవణిక. (సం. వ):—అవధానము, అవేక్ష, నిపతము-నిపాతము, పాతము, ప్రతిజాగరము, భద్రము. తద్వి.—పలుకరింత-పల్కరింత, పలుకరింపు; 2. రూ-ఎచ్చరిక, ఆమోకి: చూ, సూచన. 1; 3. ఉత్సాహము: చూ, సన్నాహము. 2; వా. 4: ప్రేరేపణ-ప్రేరేపణము, ఎక్కుట, డీకు-దీకు. (సం) ప్రేరణము.

హెచ్చరికపడు. దే అ. క్రి: రూ-ఎచ్చరికపడు. (సం) అవధరించు.

హెచ్చరికరించు. దే. స. క్రి. రూ-ఎచ్చరించు. చూ, రూ-హెచ్చరించు.

హెచ్చవేఁత. దే. వి: గుణకారము, అహతము, గుణము, గుణితము, క్షుణ్ణము, రితము, నిదిగ్ధము, నిహతము, పాలితము, పిండితము, పూరణము, పూరితము, వర్ధితము, వృద్ధి. తద్వి:—ఘుణము. (చూ, గణితశాస్త్రము.)

హెచ్చవేఁతగుఱుతు. వా. వి. ఇంటు. గుణకారపు గుఱుతు ×.

హెచ్చించు. దే. స. క్రి. ఎక్కుడించు.

హెచ్చిరిలు. దే. అ. క్రి. హెచ్చిరిల్లు-హెచ్చిలు-హెచ్చిల్లు-ఎచ్చిరిలు: చూ, వర్ధిల్లు.

హెచ్చిరిల్లు. దే. అ. క్రి.—పై.—

హెచ్చిలు. దే. అ. క్రి.—పై.—

హెచ్చిల్లు. దే. అ. క్రి.—పై.—

హెచ్చు. దే. వి. రూ-ఎచ్చు. 1. అధికము, ఉద్రేకము లు: చూ, హేరాళము. తద్విశేషములకు.—చూ, హేరాళము; 2. ఆధిక్యము, అగ్గలము: చూ, హేరాళము. తద్విశేషములకు:—చూ, హేరాళము; విణ. 3. అధికమైనది: చూ, హేరాళము; అ. క్రి. 4: (మి) అధికమగు. (తె) ఎచ్చు, కడచు, దళకొను-దళముకొను, దళగించు, దొట్టువాఱు, బలపడు, బలియు, మ్ముమ్మరించు. (సం) ప్రకోపించు

హెచ్చుగలవాఁడు. దే. విణ. అతిశయవంతుఁడు: (సం) అతిమాత్రుఁడు.

హెచ్చుతగ్గులు. వా. విణ. రూ-ఎచ్చుతగ్గులు: చూ, విషమము. 2.

హెచ్చురాయసతనము. వా. వి. పెంకితనము.

హెచ్చైనవాఁడు. వా. విణ. మేలుచేయి: చూ, సమర్థుఁడు.

హెడ్. హెడ్డు వా. విణ. 1. అధికారి; 2. యజమాని. "హెడ్ మేస్త్రరు, పోలీసు హెడ్డు" మొ.( రూ-హేడ్డు.)

## హే

హే. సం. అవ్య: చూ, సంబోధనార్థకములు.

హేజీబు. దే. వి. మంత్రి: చూ, మంత్రి. 1.

హేడక్కుఁడు. సం. విణ.=హెగ్గడీఁడు: చూ, పావిదల్లుఁడు.

హేడుఁడు. సం. వి. అ. పుం. 1.—పై.—; విణ. 2. ఎడ్డె: చూ, మూర్ఖుఁడు.

హేడ్డు. వా. విణ. రూ-హెడ్-హేడ్డు.

హేతి. సం. వి. ఇ. స్త్రీ. 1. అగ్నిశిఖ, నిప్పుమంట: చూ, వహ్ని. 1; 2. మంట: చూ, వహ్ని. 1; 3. సూర్యకిరణము: చూ, హాయనము. 2; 4. ఆయుధము: చూ, బాణము.1. తద్విశేషములు:— (గ) బాణమునకు సంబంధించినవి: గ. కూరబాణమునకు.—(తె) లకోరి-లకోరీ; ౨. వత్సదంతము; 3. ఇం

ప్రధనుస్సునకు.—వాల్మీకము; ౪. విష్ణుచక్ర
మునకు.—లోకపావనము, సుదర్శనము; ౫. వాఁ
డిగలబాణమునకు.— (తె) వాలికతూఁపు;
౬. ఏనుఁగుమబోడిచెడి బరిగోలకు.—వేణు
కము, వైణుకము. (చూ, సృణి); ౭. అలుఁ
గులేనియీఁటెకు.—(తె)బరికట్టె,బరిగమ్మి;
౮. బాణమునకు.—భల్లము, శల్యకాష్ఠము,
శిలీముఖము,శిఖండి; ౯.వజ్రాయుధమునకు-
(తె) మగమానికపురాలు, మగసాతివాలు;
౧౦.యుద్ధసాధనమునకు.—(తె)మున్ను;౧౧. శి
వునిశూలమునకు:—మహితము, లోహితము;
౧౨. విల్లుకు:—కార్ముకము; ౧౩. విష్ణువుయొక్క
విల్లుకు.—శార్ఙ్గము; ౧౪. ఈఁటెవంటి ఆయు
ధమునకు.—(తె)సబడి–సబిడి–సబిడీ–సబరి–
సబళము–సబళి; ౧౫. చిల్లకోలకు.—శర్వల,
శక్తి, విశిఖము. (తె) సత్తి; ౧౬. తోత్రము
నకు:(తె) సాటి; ౧౭. అంకుశమునకు.—సూ
నము. (తె) సిడి. (చూ, సృణి.); ౧౮. (తె)
పెడఁగవాతియమ్ము; ౧౯:శృంగిణి; (౨)రిష్టికి
సంబంధించినవి:— ౧. కల్లుగీఁచేవానికత్తికి:—
(తె) సెలగత్తి; ౨. తుపాకి కొనను చెక్కి
యుండెడి బాఁకువంటి కత్తికి: (తె)సన్ని–
సన్నీ; ౩. కత్తికి:—వాలము; ౪. కొంకికత్తి
కి.—వక్రము, ౫. శివునికత్తికి:—వజ్రహా
సము; ౬. పెద్దకత్తికి:—వరాకము, వరాశి–
వలాసి; (చూ, రిష్టి. 2; చూ, బాణము. 1.)

హేతువు. సం. వి. ఉ. పుం. 1. కారణము
అ, అప్, అపదేశము, అర్థము, ఉపపత్తి,
ఉపాదానము, కారణము, కార్యము, గుంభ
ము, త, తంత్రము, తర్కము, తలము, నిబం
ధనము, నిమిత్తము, ప్రత్యయము, ప్రయో
జనము, బీజము, యోని, సంభ
వము. (అవ్య) అను, ఇతి, కిమ్, కిల, ఖలు,
చ, తత్, తు, యత. (తె. వి):—అక్కట,
కతము, కోపు, చోటి, పాదము–పెసము, పే
గము, కట్టు, గీసను, వయినము–వైపము, సబబు,
హేత్వర్థకమునకు—అటుగాన, కనక–కనుక,
కాఁగ, కావ, కాఁబట్టి, కావున; అని; ఎం
దువలన. తద్విశేషములు:—౧. ముఖ్యకారణ
మునకు.—ఉపాదానము; ౨. పుట్టుటకుకార
ణము:—ప్రభవము; అం. 2. హేత్వలం
కారము. కార్యకారణములకు హేతువుఁ జె
ప్పుట. ఉదా.—"చంద్రుఁడి కేమదవతీమాన
విచ్ఛేదనార్థముపయించెమం చె": చూ, అ
లంకారము 3; అలంకారములు మాయిమ
అలంకారము ౩ వ యర్థమందుఁజూపఁబడెను.
వానివివరము లాయాపదముల క్రిందికలందుఁ
జూడనగు. ఇంకను లెక్కకుమించినన్ని య
లంకారములుగలవు. గ్రంథవిస్తరభీతిచే
కొన్నిమాత్రమేఁజూపఁబడెను:—(చూ, శ
బ్దాలంకారములు.) (చూ, అలంకారము 3.):
అంగాంగీభావసంకరము, అక్రమాతిశయోక్తి,
అత్యంతాతిశయోక్తి, అధేయపర్యాయము–
ఆధేయపర్యాయము, అధికతాద్రూప్యరూప
కము, అధికాభేదరూపకము, అనుక్తవిషయ
స్వరూపోత్ప్రేక్ష, అనుభయతాద్రూప్యరూ
పకము, అనుభయాభేదరూపకము, అనుప
లబ్ధి, అన్యత్వవ్యారోక్తము, అన్యత్వవ్యా
రోక్తి, అన్యద్వేషము, అన్యాతుల్యయోగిత,
అన్యావినోక్తి, అన్యాసంగతి, అపరాతుల్యయో
గిత, అపరాసంగతి, అపరివిషమము, అపహ్నుతి,
అప్రస్తుతతుల్యయోగిత, అప్రకృతానేకవిష
యశ్లేషము, అప్రస్తుత ప్రసంగము, అయో
గసంబంధాతిశయోక్తి, అర్థాంతరము, అర్థా
పత్తి, అశ్లాఘ్యగుణోత్కర్ష సారము, అపద
ర్థనిదర్శనము, అసి, అసిద్ధవిషయహేతూ
త్ప్రేక్ష, అసిద్ధవిషయఫలోత్ప్రేక్ష, ఆక్షే
పణ, ఆధారప్రమాణశబ్దము, ఆత్మతుష్టి

పరిమాణశబ్దము, ఆరోహి, ఉక్తవిషయస్వరూపోత్ప్రేక్ష, ఉన్నేయప్రశ్నోత్తరము, ఉపమ, ఉపమానలుప్త, ఊర్జస్వి, ఏకవాచకానుప్రవేశసంకరము, కారకదీపకము, కారణనిబంధనాప్రస్తుత ప్రశంస, కారణమాల, కార్యనిబంధనాప్రస్తుత ప్రశంస, కావ్యార్థాపత్తి, కైతవాపహ్నుతి, క్రమము, క్రియ, గుంఫము—గుంభము, గూఢోక్తి, చపలాతిశయోక్తి, చిత్రోత్తరము, ఛేకాపహ్నుతి, జాతి, నిష్కృతి, ప్రసిద్ధి, భావోక్తి, విగాలనము, విచిత్రము, శ్వేతకంటకాది ఇత్యాది. తద్వి.—౧. వాక్యాలంకారము:—ఖులు; ౨. కావ్యాలంకారము:—అర్థావృత్తి దీపకము; ౩. సంగీతాలంకారము:—అవరోహి. ఇత్యాది యొక్క సహాసర్యముఁ గానఁబడు చున్నవి.

హేతుశూన్యము. అం. (హేతురహితము). ఉదా.-"సతిగనుఁగొని భృంగపఙ్క్తిచేసు ఉంచెననన్": చూ, అర్థదోషములు.

హేతుసూచకములు. అం: అందున, అందుకు, ఇందున, ఇందుకు, ఎందున, ఎందుకు, కనుక, కాఁబట్టి, కావున-కాన, అందులకు మొదలగునవి.

హేతుస్కంధము. అం: చూ, ఔషధస్కంధము.

హేత్వాభాసలు. అం: సవ్యభిచారము, విరుద్ధము, సత్ప్రతిపక్షము, అసిద్ధము, బాధితము. (5)

హేమంతము. అం. 1.మార్గశీర్ష పుష్యమాసములు: చూ, ఋతువులు. (చూ, మాసద్వయము.)

హేమకారుఁడు. సం. వి. అ. పుం: చూ, స్వర్ణకారుఁడు.

హేమకూటము. సం. వి. అ. పుం. 1. తన నామముచేతనే ప్రసిద్ధికెక్కిన పర్వతము (బంగారుశిఖరములుగలది): చూ, పర్వతము; అం. 2: చూ, వర్షపర్వతములు; 3: చూ, కులపర్వతములు. [తద్వి.—పెత్తమేడి*.

హేమదుగ్ధకము. సం. వి. అ. పుం: చూ, మేడి*.

హేమపుష్పకము. సం. వి. అ. పుం. 1: చూ, సంపెఁగ*; 2: శారిబము-సారిబము, కాలశము: చూ, లొద్దుగు*; 3. తంగేడు*: ఋషభశ్రేణి, గోరేఖకము, గోశ్రేణి, చారటి, చారుపుష్ప. (తె) తంగెడు-తంగేడు. తద్వి.—౧. అకుల్యము. (తె) నేలతంగెడు-నేలతంగేడు; ౨. శైలగోశ్రేణి. (తె) కొండతంగేడు*.

హేమపుష్పము. సం. వి. అ. పుం.*: అశోకము, ఉడుపుష్పము, కంకేళి-కంకోళి, కమనము-కామనము, కర్ణపూరము, కాంతాంఘ్రిదోహదము, కాంతాచరణదోహదము, కామకము, కేలికము, చిత్రకము, తామ్రపల్లవము, నటము, పీతశాఖము, మాలి, రక్తకము, వంజులము, సుగంధము. (తె. వ) అసోగము, కంగేలి. తద్వి.—౧. రక్తాశోకమునకు — రమము; ౨.అశోకపుష్పమునకు:-పిండిపుష్పము.* [పెల్లు: చూ, వాసంతి 2-3.

హేమపుష్పిక. సం. వి. ఆ. స్త్రీ. పచ్చపూ

హేమము. సం. వి. అ. న. 1. బంగారు: చూ, లోహము; 2. ఉమ్మెత్త*: చూ, మాలాపుష్పము; 3. హేమము అను గుఱ్ఱము: చూ, హయము. [వర్ణము. 6.

హేమరాగిణి. సం. వి. ఈ. స్త్రీ. పసుపు: చూ,

హేమశంఖుఁడు. సం. వి. అ. పుం: చూ, విష్ణువు. 1.

హేమసాగర. సం వి. ఆ. స్త్రీ: పత్రబీజము, బీజపత్రము, బీజమాతృక. (తె) గాయపాకు, రణపాలాకు*. [చూ, పర్వతము.

హేమాద్రి. సం. వి. ఇ. పుం. బంగరుకొండ:

హేమాహేమీలు. దే. విశే: చూ, రూ-హేమాహే-

హేమాహేమలు. దే. విశే. 1: అతఘుఁడు, అఘకుఁడు, అధికృతుఁడు, ఉదాత్తుఁడు, ఉదారుఁడు, కైవల్యుఁడు, ఘనుఁడు. (తె) రూ—

పము, సంతతి. (తె) ఇమ్ము, ఏరాళము, ఒడ్డు, గరుము, చాల-చాలా, తనరుపు-తనర్పు, తలచే-తలుచే నెరవు-నెఱవు, పరపు-పఱపు, పలు, పెక్కు, ప్రాడి, బారాడి, బాళి, బోలెడు, వలము, విగళి, విరివి-విరివిడి-విఱివి, వెడఁద-వెణఁద, వే, సీరాము సేన; 2. అనేకసంవత్సరములకు:-(తె) పూఁపులు-పూండ్లు; 2. హెచ్చినది:—అతిరిక్తము; 2. (వి): అధికము, అధిగమము, ఉద్దామము, ప్రకోపము, ప్రాప్తి, లాభము, విస్తారము, ప్రతతి. (అవ్య) ఉరు, ఉప, అధ-అగ్రో, అధి, ఉప, ఉరు, కిముత. (తె. వ):—(చూ, సుర. 3.): అంకపొంకములు-అంకపొంకాలు-అంకాపొంకములు-అంకాపొంకాలు, అగ్గలము, అడి, అపఘోషము, ఆగుబ్బు, ఆవళి, ఇట్టలము, ఉక్కసము, ఉగ్గడువు, ఉరవు-ఉఱవు, ఎక్కుడు, ఎక్కువ, ఎగుదల, ఎచ్చు-హెచ్చు, ఎదుగు-ఎదుగుడు, ఏరాళము (విణ అని కొందఱు), ఒడ్డు, ఒదుగు, కంచి, కటిక, కడిఁది, కోర, కోలు, గంగ, గజి, గవప, గనము, గమకము, గలువ, గాటము, గుర్వు, గొప్ప, జిగము, జిమ్ము, తారు, డంబు, తలచే-తలుచే, తొడతొక్కిడి, తోరము, దండి, దళము, దొడ్డ, దొడ్డు, నాగ, నిట్టలము, నిబ్బరము, నెరపు-నెరవు-నెఱపు-నెఱవు, పంచే, పలు, పుటపుటన, పెచ్చు, పెడ, పెద-పెద్ద, పెలుచే-పెలుచేవ-పెల్చు-పెల్చన, పెల్లిదము, పెల్లు, పేరు, పోటు, బడ, బలవము, బలు, బలువు, బాఁతి, బ్రాఁతి, బారాడి, బిట్టు, బెడఁగు-బెళఁగు, బెడిదము. బేడిపము, మలచేము, మిక్కుటము-మిక్కుటము, మిక్కిలి, మిగత-మిగిలి, మిమ్మటము, మీటు, ముమ్మరము, మెండు, మేలు, మొల్లము, మోపు, రవణము, లొడ్డు, లాఁతు, లొడ్డు, వలుద, వెక్కసము, వెగ్గలము, సలగ-సలుగ-సలువ, మర, సాచ్చము, హురుమత్తు-హుమ్మత్తు-హుమ్మత్తు, హెచ్చు; (ఇందుఁగొన్ని "హేరాళము" మొదటగల 'విణ. అధికము' అను దానికిని వర్తించునని కొందఱు.)

హేరిక. అం: చూ, టక్కజభాషలు.

హేల. సం. వి. ఆ. స్త్రీ. 1. భ్రూనేత్రాది వికారములచేత వేఁకగా తెలియఁదగిన మనోవికారము: ఉత్కలిక; 2. హేలావతి: చూ, నది; 3. తిరస్కారము: చూ, హేళనము; 4.—ఏల. ఏలపాట: చూ, స్వరము. 2; అం. 5: చూ, శృంగారచేష్టలు.

హేలనము. సం.వి.అ.న: చూ, రూ-హేళనము.

హేలావుకుఁడు సం. వి. అ. పుం. గుఱ్ఱములను విక్రయించువాఁడు: అశ్వవిక్రయికుఁడు, ఘోడావుక్కుఁడు.

హేలి. సం. వి. ఇ. పుం: చూ, సూర్యుఁడు.

హేవాకము. సం. వి. అ. పుం. 1. నేర్పు: చూ, సామర్థ్యము. 1; 2 తెలివి: చూ, ప్రాజ్ఞత్వము. 2.

హేవాకవర్ధని. అం: చూ, మాళవకైశికిజభాషలు.

హేవిళంబి. అం: చూ, సంవత్సరములు.

హేష. సం. వి. ఆ. స్త్రీ. గుఱ్ఱముయొక్క సకిలింత: రూ-హ్రేష, హేషితము. (తె. వ): — సకిలింత-సకిలింత-సగిలింత-సకిలింపు (చూ, స్వరము 2; చూ, హాహాహూ).

హేషించు. సం. అ.క్రి గుఱ్ఱముసకిలించు: (తె) కరాళించు, సకిలించు-సగిలించు.

హేషితము. సం. వి. అ. న: చూ, హేష.

హేష్టి. సం. వి. ఇ. పుం. గుఱ్ఱము: చూ, హయము.

హేళనము. సం. వి. అ. న. తిరస్కరించుట (పరాభవము): రూ-హేలనము, అత్యాకారము, అనాదరము, అపిభవము, అభిభవము, అభియోగము, అభిషంగము, అవగణన, అవగ్రహణము, అవజ్ఞ, అవధీరణము, అవమతి, అవమానన, అవమానము, అవహేలనము-అవ

హేళనము, అనుత్కర్షణము — అనుగ్రహణము — అనూత్కర్షణము — అనూగ్రహణము, ఆత్తగంధనము, ఆత్తగర్వము, అవస్కందనము, క్షేపము, గంజనము, ఛీ, తిరస్కారము, తిరస్క్రియ, ధిక్క్రియ, ధర్షణము, ధిక్కారము, నికారము, నిరాకరణము, నిరాకారము, నిరాకృతి, నిరసనము — నిరాసనము — నిరాసము, నిర్లక్ష్యము, నిహ్నవము, న్యక్కారము, పరాభవము, పరాభూతి, పరిభవము పరీభవము — పరీభావము, పాంసనము, ప్రత్యాఖ్యానము, ప్రత్యాదేశము, భంగము, యాపనము, గిస్స(?), వహేళనము, విప్రకారము, హేల. (తె).— అలుసు — అలసు, అలాకు, అపుగడి — ఔరడి, ఉలక — ఉలకన, ఈసడింపు, ఎగ్గు, ఎల్లితము — ఎల్లిదము — ఏలిదము, ఒల్లఁబోక, కాకు, చేరడము, గీటు, చొర, తోరిపు, తోరిదోరిపు, బొచ్చె, వావను, సడిసన్న. (అవ్య):— అయితె, హా—హో. (చూ, సెగ్గింపు.). తద్విశేషములు;— ౧. తిరస్కరింపఁబడినది:— అవగణితము, అవగుణము, అవజ్ఞాతము, అధీరితము, అభిభూతము, అలక్ష్యము, అవమతము, అవమానితము, అవరీణము, తిరస్కృతము, ధర్షిత, ధిక్కృతము, నిరస్తము, నిరాసకము, పరిభూతము, హేళితము. (చూ, సెగ్గింపు); ౨. తిరస్కరింపఁబడునది:— అవధీరితము, తిరస్కృతము; ౩: (తె) లేవడి — లేవుడి; ౪: (తె) ఎటకారము (ఎటకారము): ౫: (తె) వేళాకోళము — వేళంకోళము — వేళాకోళము.

హేళనముచేయు. క్రి. అ. క్రి: అవమానపెట్టు, అవమానముచేయు. (సం) అవమానించు, తిరస్కరించు, పరిభవించు — పరాభవించు, భంగించు, లంకించు. (తె):— ఇడియఁగొట్టు, ఉలికించు, ఎగ్గించు, ఓటుపడు, ఓటుపోవు, ఓటువుచ్చు, కొక్కరించు, గేలి, గేలుసేయు — గేల్పడు — గేలుపోవు, చెండు, తరపు, తోము, పడు, పట్టు, పొడనడచు, పోఁగొట్టు, పోకడపెట్టు, పోకారుచు — పోకార్చు, పోనాడు, వెక్కసపడు, వెక్కిరించు. (చూ, సెగ్గించు). తద్వి.— పరిహాసమాడు:— పరిహాసించు. (తె) నేగురడుచు, చేదురపడుచు, తప్పునఁగాడు, తప్పునసేయు, తిరస్కరించు, పిసాళించు, రాకొట్టు.

హేలి. సం. వి. ఇ. పుం. 1: చూ, సూర్యుఁడు; 2. ఆలింగనము: చూ, సంశ్లేషము.

హేళితము. సం. విణ. = ఎల్లితము — ఏలిదము: చూ: హేళనము.

# హై

హై. సం. అవ్య: చూ, సంబోధనార్థకములు.

హైన్యము. సం. వి. అ. న. హీనత్వము. హీనత: చూ, వెలితి. 2.

హైమనము. సం. వి. అ. పుం. 1. మార్గశీర్షమాసము: చూ, మాసము. 1; విణ. 2. మంచుచేత కలిగినది: హైమము; 3. బంగారుచేత కలిగినది: హైమము.

హైమము. సం. వి. అ. న. 1. వేకువను మంచువలనఁగలిగిన జలము: చూ, సలిలము; విణ. 2. మంచుచేత కలిగినది: హైమనము; 3. బంగారుచేత కలిగినది: హైమనము.

హైమవతి. సం. వి. ఈ. స్త్రీ. 1. పార్వతి: భగవతి, భవ్య, భైరవి, మాతంగి, విజయ, విశాలాక్షి, శారద, సావిత్రి: చూ, పార్వతి; 2. ఆకాశగంగ: చూ, నది; 3. కరక*: చూ, హారీతకి; 4 తెల్లవస*: చూ, వస; 5. రెడ్డివారి నానఁబాలు*: చూ, స్వర్ణక్షీరి.

హైయంగవీనము. సం. వి. అ. న. 1. తొలినాఁడు చిలికియెత్తిన అపువెన్న: చూ, మంథజము: చూ, వెన్న; 2. తొలినాఁడు చిలికి

యొత్తిన ఆవువెన్న కాఁచిననెయ్యి: చూ, హవిస్సు; 3. వెన్న: (చూ, నవ్వము): చూ, వెన్న. తద్వి.—అప్పుడు తఱచితీసిన వెన్నకు.— కలంబుటము, మంథజము.

హైరణ్యకము. అం: చూ, వర్ణ ములు.

హైరాను. వా. వి. విశేషపరిశ్రమ.

హైసరబాజ్జే. వా. వి. సంతోషముతోఁగూడిన వాక్యము. [సత్యము.

హైసరే. దే. అవ్య. యథార్థవచనము: చూ,

హైహాయనము. అం: చూ, దేశములు.

హైహయుఁడు. సం. వి. అ. పుం: అర్జునుఁడు, కార్తవీర్యార్జునుఁడు, కార్తవీర్యుఁడు, బాహుసహస్రభృత్తు. (తె) వేయిచేతులు గలాఁడు.

## హొ

హొంత. దే. వి. మిక్కిలిఅలవు. ఆది. 2 ఆ. 31: అలవు, తుటారము. (సం) పరిశ్రమము. (చూ, శ్రమము. 1–౨.)

హొంతకాఁడు. దే. వి. రూ—హొంతకారి. జగజెట్టి, జెట్టివాఁడు. (స్వా. 3, ఆ. 59.)

హొంతకారి. దే. వి.—పై.—

హొంబట్టు. దే. వి. బంగారుపట్టు: చూ, లోహము. 1.

హొన్నిత్తడి. ద్వ. వి. ఒకరకము ఇత్తడి: చూ, లోహము. 1.

హొన్ను. దే. వి. పొన్ను, బంగారు: చూ, లోహము. 1. (ఇది అన్యదేశ్యము. వృత్తియందంత్య వర్ణలోపము.) తద్వి:—౧. కంచే: (సం) సౌరాష్ట్రము; ౨. కడియములోనను భూషణ రూపమైన బంగారు:— (సం) శృంగి, శృంగికనకము—శృంగీకనకము; 3. తగరము:—విసమ్రము: (చూ, లోహము. 1, 2.)

హొన్నుచేయగలాఁడు. ద్వ. వి. శ్రీరాముని తమ్ముఁడు, లక్ష్మణుఁడు: చూ, లక్ష్మణుఁడు. 1.

హొమ్ము. దే. విశ. రూ—ఒమ్ము. 1. వలము: చూ, స్థూలము. 2; 2. బలిమి: చూ, శక్తి. 1.

హొయలు. దే. వి: చూ, హొరంగు.

హొయలుబండి. దే. వి. గాడీ: చూ, శకటము. 1.

హొరంగు. దే. వి. రూ—హొరఁగు. ఒయ్యారము: చూ, విలాసము. 2.

హొరఁగు. దే. వి.—పై.—

హొరలి. దే. వి: చూ, హారవళి. అం, భా. ద్వి. 154.

## హో

హో. దే. వి. 1. పిలుచుట యందగుధ్వన్యనుకరణము: చూ, హాహూ; దే. అవ్య. 2.—ఆహో. ఆశ్చర్యమునందు వచ్చును: సొజ్జెము: చూ, వింత. 1.

హోడము. సం. వి. అ. పుం.—ఓడ: అబ్ధి, ఆరోహ్యము, కర్పరము, తరండము, తరట్టు, తరణము, తరణి, తరము, తరి, తరీష, తర్ణి, తర్తరీకము, తారటి, ప్రవహణము, యానపాత్రము, రోకము, వర్షాభువు, వహనము, వహిత్రము. (తె. వ):—ఓడ, కప్పలి, కలము, జోకు, జోగు, నావ, వాడ. తద్విశేషములు:—౧. రహదారిపడవకు:—అలవు-ఆలూవు, తరిక—తరికము, పోతము, ప్లవము, విమానము. (తె) కలము, జోగు, పడవ, బోటు; ౨. వేఁటుదాఁకెడు పుట్టిలోనగునవి. (ఇవి స్వల్పభేదములంబొంది యుండును):—అంబువాహిని, అజిరము, కాష్ఠాంబువాహిని, కోలము, ఘటిక, తర్షము, ద్రోణి. (తెలుఁగున వాడఁబడునవి):—అరిగోలు-హరిగోలు, అరిణ—అరిణు, ఉడుపము, కట్టు

మూ్రిను, చోను, చేపడవ, తెటిక–తేటిక–తేపిక–తెప్ప, గోని-దోనియా–దోనె, బల్లకట్టు, బుఱ్ఱకోనె, మున్వదోనె, సంగడి. మొదలగునవి; 3. నౌకావిశేషములు:–అగ్నిపుత్రకము, తరాన్థువు- తరాలువు. మొదలగునవి; 4. త్వరగాఁబోవునడవకు:—లాంచి; 5. యంత్రమునుబట్టి త్వరగాఁబోవు ఓడకు:–స్టీమరు; 6. చేక్కానికి:– చూ, పీలి. 2; 7. సంగడి తెడ్డుకు.—తరిచోదని.

హోత. సం. వి. ఋ. పుం. రూ–హోతృ, ఋగ్వేదము తెలిసిన ఋత్విక్కు, హోమముచేయువాఁడు: చూ, ఋత్విజుఁడు. 1; తద్వి:– హవిష్కర్త.

హోతృ. సం. వి. న్. పుం.—పై.—

హోదా. వా. వి. 1. ఉద్యోగము: చూ, సన్నాహము. 2; 2. పెత్తనము: చూ, రథము. 1.

హోమము. సం. వి. అ. పుం. 1. వైశ్వదేవము: హవనము. (తె) వేలిమి; 2. నేతిహోమము: ఆజ్యాహుతి. తద్వి:—అగ్నిహోత్రము, ఔపాసనము; 3. జన్నము, క్రతువు: చూ, యజ్ఞము. తద్విశేషములు:—1. యజ్ఞమునకు:–శామిత్రము, సంస్తరము, సవనము, స్తోమము; 2. అశ్వమేధయాగమునకు.—(తె) వారువపుజన్నము; 3: వాజపేయము; 4: సత్రయాగము, సత్రము; 4. దేవయజ్ఞము (ఇందుకు సంబంధించినవి:—వేదపాఠము, బ్రహ్మయజ్ఞము, హోమము, దేవయజ్ఞము). తద్వి:– చూ, యజ్ఞములు; 5: చూ, వర్ణములు(అశ్వశాస్త్రములోనివి.)

హోమ్యము. సం. వి. అ. న. 1. నెయ్యి: చూ, హవిస్సు; విశే. 2. హోమముచేయఁదగినది: హవనీయము.

హోర. సం. వి. ఆ. స్త్రీ. 1. ఘటిక: అహోరాత్రము; దివసము. (తె) రేఁబగలు–రేపగలు: చూ, వాసరము; 2. రాశ్యర్థము; 3. లగ్నభేదము: చూ, లగ్నము. 1; 4. హోరాశాస్త్రము: చూ, శాస్త్రములు; 5. రేఖాభేదము; అం. 6: చూ, వర్గములు. 7: చూ, షోడశవర్గు. ("లగ్నమును రెండు సమభాగములుఁ జేసినయెడల హోర యను సంకేతముగుచున్నది. బేసిరాసులయిన మేష-మి-సిం-తు-ధ-కుంభములలోఁ బ్రథమ భాగమునకు రవిహోరయనియు, ద్వితీయ భాగమునకుఁ జంద్రహోరయనియుఁ జెప్పు. సరిరాసులయిన వృష-కర్క-కన్యా-వృశ్చి-మక-మీనములలోఁ బ్రథమభాగమునకుఁ జంద్రహోరయనియు, ద్వితీయభాగమునకు రవిహోరయనియుఁ జెప్పు.")

హోరాట. దే. వి. ఆటోపము: చూ, సంభ్రమము.

హోరాలగ్నము. అం. అహఃపరిమాణమును రాత్రిపరిమాణమును వేఱువేఱుగ 12 చే భాగింపవలెను. అట్లు భాగింపగావచ్చిన విభక్తములు హోరాపరిమాణములగును. జాతకుని జన్మలగ్నము పగటియందైన సూర్యోదయాది జననకాలమువఱకు నైన గడియలను, రాత్రియందైన సూర్యాస్తమయాది జననకాలమువఱకునైన గడియలను హోరాపరిమాణముచే భాగింపవలెను. అట్లు భాగింపగావచ్చిన విభక్తము నొకచోట నుంచుకొనుము. శేషము మిగిలినయెడల నట్టిశేషమును నొకటిగా భావించుకొని పై విభక్తముతోఁ గలుపుము. అట్లు కలుపఁగావచ్చిన మొత్తమును, జన్మలగ్నము బేసిరాసియైనయెడల జన్మలగ్నము మొదలు క్రమముగను, జన్మలగ్నము సరిరాసియైనయెడల జన్మలగ్నము మొదలు తలక్రిందుగను లెక్కపెట్టవలెను. అట్లు లెక్కపెట్టగ నేరాశియగునో యదియె హోరాలగ్నమగును.

హోరాహోరి. దే. క్రి. విశే. 1. అవిరామముగా.

స్వా. 3, అ. 94; అష్ట. 2. అవిచ్ఛిన్నార్థకము. అం, భా. త్రి. 72.

హోరు. వా. వి. గాలిలోనగు వానియందలి ధ్వన్యనుకరణము. "హోరుగాలి": చూ, హూహూ.

హోలబ్రాహ్మణులు. అం. (హోళబ్రాహ్మణులు): చూ, ఉత్కళబ్రాహ్మణులు. ("శుక్లయజుర్వేదులు. వాజసనేయశాఖ. వీరిని మహోహానులనియుఁ జెప్పెదరు. వీరు చాలామంది స్వయముగ భూమినిదున్ని పైరుపెట్టెదరు. హలికావృత్తి ప్రధానముగాఁగల వారగుటచే వీరికి హోళులను పేరు సార్థకముగాఁ గలిగినది. గంజాము, విశాఖపట్టణము జిల్లాలలో నయితము వీరినిఁ జూడవచ్చును: చూ, బ్రాహ్మణులు. [కి. అంతయు (హోల్.)

హోలు. వా. వి. 1. కాళీ; విశే. 2. కాళీగలది;

హోళి. దే. వి. 1. కామునిపండుగ కడపటి నాఁడు తగులబెట్టుటకై పోగుచేసెడి గడ్డి కంప; 2. ఫాల్గున బ ౧ నాఁడువచ్చేపండుగ అనఁగా రంగునీళ్లను (వసంతము) పరస్పరము చల్లుకొనెడిపండుగ. (అన్యదేశ్యము.)

హోళిగ. వా. వి: చూ, భక్ష్యము. తద్వి:— జంతికలు:—యంత్రపాశితము.

హోళిపండుగ. వ్యు. వి. కామునిపండుగ.

## హౌ

హౌదా. వా. వి. రూ—హవుదా. ఏనుఁగుమీఁది అంబారి: చూ, హస్తి.

హౌను. దే. వి: చూ, రూ—హవును.

హౌనుకాఁడు. దే. విశే: చూ, రూ—హవునుకాఁడు.

హౌనుతోఁట. దే. వి: శృంగారవనము, విహారము, ఉపవనము. (తె) సింగారపుఁదోఁట: చూ, వనము. 2.

## హ్య

హ్యః. సం. అవ్య. నిన్నటికి పేరు: (వి) అథరేద్యవు. (తె) నిన్న.

## హ్ర

హ్రదగ్రాహము. సం. వి. అ. పుం. పీడుకపెనుసలిపిల్ల: చూ, మత్స్యము. 1.

హ్రసమానము. అం: చూ, సంచారివర్ణగతాలంకారములు.

హ్రదము. సం. వి. అ. పుం. 1. ఏటినడుమలోఁతుగలచోటు, మడుఁగు, పెంచే: చూ, సరస్సు. 1; 2. లోఁతుగల నిడుపాటి పల్లము: చూ, సరస్సు.

హ్రదిని. సం. వి. ఈ. స్త్రీ: చూ, రూ- హ్రాదిని. 1, 2.

హ్రసిష్ఠము. సం. విశే. మిక్కిలి హ్రస్వమైనది: చూ, హ్రస్వము.

హ్రస్వ. సం. వి. ఆ. స్త్రీ. 1. కాఱుపెసర*: చూ, పెసర; 2: చూ, హ్రస్వగవేధుక *.

హ్రస్వగవేధుక. సం. వి. ఆ. స్త్రీ. బీఱ*. కాంగేరుకి-గాంగేరుకి, కృతచ్ఛిద్రి, కృతవేధన, కోశాతకి, జిబిలిక, ఝుష, నాగబల, విశ్వబల, విశ్వల, హ్రస్వ. (తె. ప):— బీకర, బీర—బీఱ, బీఱతీఁగె. తద్విశేషములు:— ౧. (తె) ఊరబీఱ; ౨: ఘృతకోశాతకి. (తె) నేతిబీఱ; 3: ఝషాకాల, నిరంకుశ, నిశాంకుశ, హ్రస్వగవేధుక. (తె) జిజిలిక, జిజిలికాబీఱ, జిబిలిక, జిలిబిలిక (హ్రస్వగవేధుక, నాగబల యిందుఁజేరువనికొందఱు.); ౪: మహాకోశాతకి, రాజకోశాతకి, కర్కోటకి. (తె) ఏనుఁగుబీఱ, పెద్దబీఱ; ౫. చేఁతిబీఱకు:—అచ్ఛిద్రి, కటుకోశాతకి, కృతచ్ఛేదన, కోశఫల, క్ష్వేడము, క్ష్వేళ, గజ

ప్రోదని, ఘోషకము—ఘోషకాకృతి, ఘోషము, జాంగలము, జాలిని, ధామార్గవము, (తె) అడవిబీర, ఆవడ, ఊరబీర, కార్బీర, చేఁతిబీర, నెత్తిబీర; ౬: (తె) మట్టుబీర; ౭: (తె) గుత్తిబీర; ౮. తచ్చేనిపువ్వులుగల ఆవడకు.—ముష్టజాలి *.

హ్రస్వపుష్పము. సం. వి. అ. న. పిన్నయిప్ప*: చూ, వానప్రస్థము. 2.

హ్రస్వము. సం. విణ. కుఱుచయైనది: వామనము—వామము. (తె) కుఱుచ, గిడస, గూను, నన్న, పొట్టి, పొఱడు, మట్టసము, మట్టము, మొంటెమ—మొంటిమె, వట్రము.

హ్రస్వములు. అం. (కుఱుచలు): "అ, ఇ, ఉ, ఋ, ఌ."

హ్రస్వశాఖాశిఫ. సం. వి. ఆ. స్త్రీ: చూ. రూ—హ్రస్వశాఖాశిఫము.

హ్రస్వశాఖాశిఫము. సం. వి. అ. పుం. పొట్టికొమ్మలూడలుగల చెట్టు: రూ—హ్రస్వశాఖాశిఫ, కందరోద్భవ, కందర్పజీవము, కందిరి, కరపర్ణము, కామవృద్ధినామము, కాలాంజని, కృష్ణాంజని, కృష్ణాభ, క్షుద్రపాషాణభేద, క్షుప—క్షుపము, ఛిండ, లజ్జాలువు, శిఫ. (తె) గున్న. తద్వి.—క్షుపవిశేషమునకు.—ధత్తూరము—ధుస్తూరము—ధుత్తూరము.

హ్రస్వాంగము. సం. వి. అ. పుం. జీవకమను గంధద్రవ్యము: చూ, రాజార్హము; న. ౨. కాకికలంద: చూ, సహాసపత్రిము.

హ్రస్వోఁడు. సం. విణ: చూ, వామనుఁడు.

## హ్రా

హ్రాదిని. సం. వి. ఈ. స్త్రీ. 1. రూ—హ్లాదిని—హ్రాదిని. (హ్రాదము పొందునట్టిది.) వజ్రాయుధము: చూ, [illegible]. 1; 2. రూ—హ్రాదిని. (అవ్యక్తశబ్దముగలది) ఏఱు: చూ, నది. తద్వి.—౧. నదికి.—వహంతి, శిప్ర—శిఫ, సరస్వతి, సీత; ౨: శబరి—సబరి; ౩: సోమోద్భవ; ౪: వర్తరూకము; ౫: వాహిని; ౬: వైతరణి; ౭: వైఘు; ౮: విరంగరము; ౯: విరజ; ౧౦. సువర్ణము: నీనదికి.—(తె) మొగలేఱు; ౧౧: శ్యామ; ౧౨. కాలువకు:—వేణి; ౧౩. ఊటకాలువకు:—(తె) సోన. (చూ, స్వర్గది; చూ, నది) ఇత్యాది; 3. (అవ్యక్తశబ్దముగలిగినది) మెఱుపు: చూ, విద్యుత్తు; 4. అందుగు. (అవ్యక్తశబ్దముగలది): చూ, సల్లకి.

## హ్రి

హ్రిణీయ. సం. వి. ఆ. స్త్రీ. 1: చూ, సిగ్గు; 2. అసహ్యత: చూ, గోత. 2.

## హ్రీ

హ్రీ. సం. వి. ఈ. స్త్రీ. సిగ్గుపడుట, లజ్జ: చూ, సిగ్గు.

హ్రీణము. సం. విణ. సిగ్గుకొందినది: లగ్నము, లజ్జితము, హ్రీతము.

హ్రీణుఁడు. సం. విణ: చూ, హ్రీతుఁడు.

హ్రీతము. సం. విణ: చూ, హ్రీణము.

హ్రీతుఁడు. సం. విణ: చూ, హ్రీమంతుఁడు.

హ్రీబేరము. సం. వి. అ. న. కురువేరు*: అంబునము, అనురము, ఉదీచ్యము, కంజలము, కేశము—కేశాంబునామము, కేశాహ్వయము, కేశి, జలము, జ్యేష్ఠము, బర్హి, బాలము—బాలకము, వర్ణిష్ఠము, వారి, వారిబేరము. (తె) కురువేరు—కురువేరు.

హ్రీమంతుఁడు. సం. వి. త్. పుం. లజ్జయే స్వభావముగాఁ గలవాఁడు: అపత్రపిష్ణువు, లజ్జాళువు. (తె) పుద్వేడీక, సిగ్గరి, పిబ్బితికాఁడు. తద్వి.—సిగ్గుపడినవాఁడు:— హ్రీణుఁడు, హ్రీతుఁడు, లజ్జితుఁడు.

హ్రీమంతురాలు. మి. వి. లజ్జయే స్వభావముగాఁగలది: చూ, స్త్రీ.

## హ్రు

హ్రుణీయ. సం. వి. అ. స్త్రీ. ఋతీయ: చూ, రోఁత. 2.

## హ్రే

హ్రేష. సం. వి. అ. స్త్రీ. సకిలింత, గుఱ్ఱము సకిలించుట (అవ్యక్తముగా మ్రోయుట.). చూ, రూ—హేష.

## హ్లా

హ్లాదనము. సం. వి. అ. న. సంతోషించుట, సంతోషము: అనుమోదము, అభిలాషము, అభినందనము, అహోబత, ఆకర్షము, ఆకల్యకము, ఆనందనము, ఆనందథువు, ఆనందము, ఆనందువు, ఆప్యాయనము, ఆప్యాయము, ఆమిషము, ఆమోదము, ఆరాధనము, ఆహ్లాదము, ఉత్కము, ఉచ్ఛ్వాసము, ఉత్సాహము, ఉత్సేకము, ఉద్ధర్షము, ఉద్భవము, ఉల్లసనము-ఉల్లాసము, క, కంబుకమ్, కల్లోలము, కియదేతిక, కుతుకము, కుతూహలము, కౌతుకము, ఖమ్, చిత్తపరిసన్నత, జన్య, తుష్టి, ధృతి, నిర్వాణము, నిర్వృతి-నిర్వృత్తి, పరితుష్టి, పరితోషము, పీనము, ప్రతీతి, ప్రమదము, ప్రమోదము, ప్రహ్లాదము, ప్రియము, ప్రీతి, ప్రేమ-ప్రేమము, భోగము, మదము, ముదము, రభసము, వీచి, శర్మము, శాతము, సాతము, సంతోషము, సమ్మదము, సుఖము, సౌఖ్యము, హర్షణము, హర్షము, హృష్టి. (అవ్య): అంగ, అంతి, అహహా-అహహో-అ, కమ్, కీనము, శమ్. (తె.శ):—అరసము-అరిసము- అరిసెము-అరుసము-అర్సము-హరుసము, అలరు, ఇంపు-ఇంబు-ఇమ్ము, ఉబ్బసము, ఉబ్బు, ఉనులు, ఎలమి, ఎలరుపు-ఎలర్పు, కెలసము, కొండాటము, గెలివి-గెలివిడి-గెల్వడి, చేక్కిలిగింత, తనరుపు-తనర్పు-తనుపు, తోసము, నెమ్మి, పండుగ-పండుగు-పండువ-పండువు, పదిలము, పొంగు, పోడిమి-పోణిమి, బరవసము-బరువసము, బులుపు, భోగము, రహి, వసతి, వేట్క-వేడ్క-వేడుక, సంతసము-సంతొసము-సంతోసము, సంబరము-సంబ్రము, సరదా, సుకము-సుగము, సుకులు, సుఖాళము, సొంపు, సోము, హాయి, హాళి. తద్విశేషములు:—౧. అధికోత్సాహమునకు.—కృతకర్మము, మహోత్సాహము. (తె) వీడ్డోలు; ౨. సుఖమునకు:—వీచి, శివము, శ్వశ్శ్రేయసము, సవ్యము, సుఖము, సౌఖ్యము; ౩. సంతోషముకలది:—శర్మము; ౪. సంతోషించేమేన్నది:—మోదమానము, ౫. సంతోషము నొందినది:—ఉల్లాఘము, నిర్వృతము, ప్రీతము, ముదితము; ౬. సంతోషింపనది:—నందకము; ౭. పాటలోనగునుఖమునకు.—కౌతుకము; ౮. ఆరోగ్యము

నము.—అనామయము, ఆరోగ్యము, కల్యత్వము, వార్తము; గా. మిక్కిలి సంతోషము. నము.—సమ్మదము; ౧౦. మంచిసుఖము. నము.—సంభోగము.

హ్లాదించు. సం. అ. క్రి: చూ, సంతోషించు.

హ్లాదుఁడు. సం. వి.అ. పుం. 1. రూ—ప్రహ్లాదుఁడు: చూ, పరమభాగవతోత్తముఁడు; 2. సంతోషముకలవాఁడు.

---

గద్య:—

శ్రీః

ఇది, శ్రీ గోదావరీ సముద్భూత తుల్యానదీతీర భీమమండల మండనాయమానాఖండమండితా
వాస భాసుర శ్రీకరకపుర నివాసానన్యసామాన్య "లక్ష్మీనారాయణీయ" నామకాచ్ఛిక
భాషాచార్యాది గ్రంథరచనా ధురంధర శ్రీలక్ష్మీనారాయణ దేవమహోదయపుత్ర,
శ్రీ మత్కౌశికసగోత్రాపస్తంబ సూత్రాన్విత సకలతంత్ర స్వతంత్ర కొట్ర
వంశభాసుర విబుధ జనాత్యంతహ్లాదయమాన సుబ్బమాంబా జగన్నాథార్య దత్త
పుత్ర సేతుశీతాచలఖ్యాత సంస్కృతాంధ్ర సంగీతాదిపాండిత్య సముజ్జ్వల
కీర్తి మత్స్వరస కవిరాజ శిష్ట కృష్ణమూర్తిబోధిత దేశిక ప్రశిష్య
శ్రీపరమేశ్వర వరప్రసాదలబ్ధ సారస్వత సుధాసారజనిత
యశోలతాంకూర "ఆంధ్ర వాచస్పతీ"త్యాది బిరు
దాంకిత శ్యామల కామశాస్త్రి ప్రణీతంబగు
"ఆంధ్ర వాచస్పత్యము" అను
ఆంధ్ర ప్రతిపదార్థపర్యాయపద
నిఘంటువు సర్వంబు—
సంపూర్ణంబు.
ఓం తత్సత్.
శ్రీ. శ్రీ. శ్రీ.

---

# ఆశీస్సు.

బ్రహ్మశ్రీ కొట్ర శ్యామల కామశాస్త్రిగారు సామాన్య సంసారిగానుండియు విద్యావంతులకును ధనికులకును ప్రభువులకును సాధ్యముకాని నిఘంటు యజ్ఞమును తామొక్కరే చేకొని సాగించి లోకమునకు మహోపకారం బొనరించిరి. కావున వీరిని పరమేశ్వరుండు ఆయురారోగ్య భోగభాగ్యాదు లొసంగి రక్షించుఁగాక! పిమ్మట వ్రాసిన దేవ చిట్టచివర నీయాశీస్సు నందించు భాగ్యముఁగూడ లభించుటచే నేనెంతయు ధన్యుఁడను. కావున ఆంధ్రులెల్లరును శాస్త్రిగారికి కృతజ్ఞులై తమ యాశీస్సుల నందఁజేయుదురుఁగాక!!

ఓం తత్సత్. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీముఖ సంవత్సరము, కాకినాడ.

ఇట్లు,
సర్వశాస్త్రనిధి కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి.

శ్రీ లక్ష్మీ ముద్రాక్షరశాల, కాకినాడ.—1940.